అనువాద వాఙ్మయము - 40
ఆయుర్వేదము



ఇందుకృత శశిలేఖా వ్యాఖ్యా సహిత

# అష్టాంగసంగ్రహము

## సూత్రస్థానము

(1 నుంచి 11 అధ్యాయములు)


సంస్కృతమూలము
వాగ్భటుడు

అనువాదము
శ్రీ పాణ్యం పార్థసారధిశర్మ,
లెక్చరర్, ప్రభుత్వాయుర్వేద కళాశాల, హైదరాబాదు

పరిష్కర్త
వైద్య ఇటికాల సంజీవరావు,
G. C. I. M. (Madras), D. A. I. M. (Banaras)
ప్రిన్సిపాల్, ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల, హైదరాబాదు,









తెలుగు అకాడమి
హైదరాబాదు
1979

ashTaanga sangrahamu (Ashtanga Sangraha); Sanskrit Original: Vaagbhata; Telugu translation : Sri Panyam Pardhasaradhi Sarma; Scrutinizer: Vaidya I. Sanjeeva Rao; First Edition 1979; pp. xiv+528.



*First Edition, 1979*
*Copies: 1,000*

Published by TELUGU AKADEMI, Hyderabad-500029, (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of production of Books and Literature in Regional languages at the University level of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.



Price : Rs. 16-25
Library Edition : Rs. 18-75
(Hard bound)

Printed in India
& Company, 103. S. P. Road, Secunderabad-500003.
Andhra Pradesh.

# ప్రస్తావన

కళాశాలస్థాయి వివిధ తరగతులకు పాఠ్య పఠనీయ గ్రంథాలతోపాటు తెలుగు అకాడమి వివిధ శాస్త్రాలకు సంబంధించిన ప్రామాణికమైన అనువాదాలు, శాస్త్ర నిఘంటువులు, మోనోగ్రాఫ్‌లు, మాండలికభాషా పరిశీలనకు సంబంధించిన వివరణ గ్రంథాలు, ఇంకా ఆయా శాస్త్ర విస్తృతాధ్యయనానికి సంబంధించిన ప్రామాణికమైన రచనావళి, జనరంజక గ్రంథావళి మొదలైనవి ప్రచురించడానికి తలపెట్టి ఆ యా పరంపరలలో కొన్నిటిని ఇదివరకే ప్రకటించింది.

తెలుగు భాషా సాహిత్యాలకు సంబంధించి ఛందః పదకోశం, వ్యాకరణ పదకోశం, సాహిత్యపదకోశాలు ఇదివరకే వెలువడ్డాయి. ప్రామాణిక అనువాద గ్రంథాలలో వాక్యపదీయం మొదటి సంపుటం వెలువడింది రెండో సంపుటం త్వరలోనే వెలువడుతున్నది.

ఈ అనువాద గ్రంథపరంపరలో ఇప్పుడు వెలువరిస్తున్న ఆయుర్వేద గ్రంథమైన అష్టాంగ సంగ్రహం (సూత్రస్థానం) చాలా విశిష్టమైనది. శ్రీ పాణ్యం పార్థసారథి శర్మ, శ్రీ జి. రంగాచార్యులు, శ్రీ వి. రంగాచార్యులు, శ్రీ ఎమ్. శరభయ్యశర్మగారలు ఈ మహోద్గ్రంథాన్ని ఇందు కృత శశిలేఖా వ్యాఖ్యా సమేతంగా అనువదించగా వైద్య శ్రీ ఐ. సంజీవరావుగారు పరిష్కర్తృత్వ బాధ్యతను వహించారు. ఈ విశిష్టమైన ఆయుర్వేద గ్రంథం వైద్య విద్యార్థి లోకానికి, భారతీయ వైద్య విజ్ఞానాన్ని గూర్చి తెలుసుకోగోరు జిజ్ఞాసువులకు ఎంతగానో ఉపకరించగలదు.

వేదాంగాలలో ఆయుర్వేదానికి కూడా మన పూర్వులు సముచితమైన స్థానాన్ని కల్పించి ఈ శాస్త్రానికి ఐహిక జీవనంలో గల విశిష్టమైన ప్రతిపత్తిని లోకానికి వెల్లడించారు. వాగ్భటాచార్య కృతమైన ఈ అష్టాంగ సంగ్రహానికి ఆయుర్వేద గ్రంథాలలో చాలా గొప్ప స్థానం వున్నది. అష్టాంగసంగ్రహంలోని సూత్ర స్థానంలో మొత్తం నలభయి అధ్యాయాలున్నవి. ఈ నలభయి అధ్యాయాలను నలుగురు అనువాదకులు సరళ సుందరమైన శైలిలో అనువదించారు. ఈ గ్రంథాన్ని త్వరితగతిని వెలువరించే ఉద్దేశ్యంతో ఆయా అనువాదకులు అనువదించిన భాగాలను విడివిడిగా నాలుగుభాగాలుగా ప్రచురించటం జరుగుతున్నది ఇప్పుడీ గ్రంథం మొదటి భాగం. దీనిని శ్రీ పాణ్యం పార్థసారథిశర్మగారు మూల గ్రంథం నుంచి అనువదించారు. అష్టాంగసంగ్రహం అనువాదం మొదటి

అధ్యాయం నుంచి పదకొండో అధ్యాయం వరకు ఈ భాగంలో ఇందుకృత వ్యాఖ్యా సహితంగా చేర్చటం జరిగింది. తక్కిన భాగాలుగా కూడా వెలువడినవి.

ఈ గ్రంథం ఆయుర్వేద విద్యార్థులకు చాల ఉపయోగకారి. ఈ ముద్రణలకు ఏవైనా లోపాలుంటే సహృదయతతో వాటిని మా దృష్టికి తీసుకొని వస్తే మలి ముద్రణంలో వాటిని సవరించగలమని మనవి.

# పీఠిక

కరకిసలయసంగీ యస్య పీయూష కుంభః
పర మమరవధూనాం భూయసే మంగళాయ,
సఖలు నిఖిల దుగ్ధాంభోధి రత్నేషు రత్నం
హరతు దురిత రాశీ రాశు ధన్వంతరి ర్వః

శ్రీమదఖిల ప్రపంచము యొక్క సృష్టి స్థితి సంహారములకు కారణభూతుడైన పరమేశ్వరునిచే సృజియింపబడిన యెల్ల జీవరాసులలో జీవుడు మానవజన్మ మెత్తుట పురాకృతసుకృత విశేషము. అట్టి మానవ జన్మమునకు ధర్మార్థ కామమోక్షముల సాధనయే ధ్యేయము. తత్సముపార్జనమునకై శరీరమును కడు జాగరూకతతోడ కాపాడుకొనుట విధాయకము. అట్టి శరీర రక్షణోపాయంబులను, రోగనివృత్తి సాధనంబులను దెలియ జేయుటకై పరోపకారపారీణులగు ప్రాచీనఋషులు "ఆయుర్వేదము"ను మనకు ప్రసాదించి యున్నారు.

ఆయుర్వేద శాస్త్ర సాహిత్యమున ప్రామాణికములగు గ్రంథములనేకములున్నను, ప్రధానముగా చరక, సుశ్రుత, వాగ్భట కృత సంహితలు "బృహత్రయీ" పేరున ప్రామాణిక గ్రంథములుగా మన్నన వడసినవి. ఇందు చరక, సుశ్రుత సంహితలు ఆకర గ్రంథములు. సనాతనధర్మమునకు వేదములు ఎట్లో, అట్లు ఆయుర్వేద శాస్త్రమునకు ఇవి స్వతః ప్రామాణికములు. వాగ్భట (వృద్ధ, లఘు) కృత అష్టాఙ్గ సంగ్రహ, అష్టాఙ్గహృదయ సంహితలు ప్రకరణ గ్రంథములు. — పరతః ప్రామాణికములు. ఆకరగ్రంథములు స్వతః ప్రామాణికములైనప్పటికీ, అందు విషయమనేక స్థలములయందు వికీర్ణముగా నుండి, శైలి జటిలముగా నుండుటచే విషయము సులభగ్రాహ్యము కాదు. అదియుగాక చరకము కాయచికిత్సా ప్రధానముగాను సుశ్రుతముశల్య తన్త్రప్రధానముగాను రచింపబడుటచే, అష్టాఙ్గములన్నిటికిని సమాన ప్రతిపత్తిగల గ్రంథరచన కాలేదనే భావము కలుగును. వాగ్భటుడు తన అష్టాఙ్గ సంగ్రహ గ్రంథ నిర్మాణమునకై గల కారణము నివ్విధముగా చెప్పుకొనెను.

తేషామేకైక మప్యాపి సమస్త వ్యాధి సాధనే।
ప్రతితన్త్రాభియోగే తు పురుషాయుష సంక్షయః॥
భవత్యధ్యాయ నేనైవ యస్మాత్ ప్రోక్తః పునః పునః।
తన్త్రకారైః స ఏవార్థః క్వచిత్ క్వచిద్విశేషతః
తేఽర్థ ప్రత్యాయనపరా వచనే యచ్చనాదృతాః॥
సర్వ తన్త్రాణ్యతః ప్రాయః సంహృత్యాష్టాఙ్గ సంగ్రహః।
అస్థాన విస్తరాక్షేప పునరుక్తాది వర్జితః॥

హేతు లింగౌషధ స్కన్ధ త్రయమాత్ర నిబన్ధనః।
వినిగూఢార్థ తత్త్వానాం ప్రదేశానాం ప్రకాశకః॥
స్వాన్య తంత్ర విరోధానాం భూయిష్ఠం వినివర్తకః।
యుగానురూప సందర్భో విభాగేన కరిష్యతే॥

—సంగ్రహ. సూ. స్థా. అ. (1)

యుగానురూప సందర్భంగా, నిత్యోపయోగార్థంగా, సుబోధకరంగా నుండునట్లు అష్టాంగాయుర్వేదమును సంగృహీతము కావించితినని వాగ్భటుడు చెప్పకొనెను.

ఆ యుగమెట్టిది? ఆ కాలపు పరిస్థితులేవి? మొదలగు విషయములను కొద్దిగా పరిశీలించిన, ఈ గ్రంథరచనకు గల పృష్ఠభూమి మనకర్థము కాగలదు. క్రీ. పూ. 600 శతాబ్దాన్తము వరకు అగ్నివేశ, సుశ్రుత, భేల, కాశ్యప సంహితలు తమతమ యథాశైలిలో ప్రచారమున నుండెడివి. వైదికధర్మము బహుళప్రచారములో నుండెను. తదుపరి బుద్ధభగవానుని జననము (క్రీ. పూ. 624) మొదలు క్రీస్తు శకారంభము దనుక ఆయుర్వేదమున చెప్పకోదగ్గ రచనలేవీ కావించబడలేదు. బౌద్ధ ధర్మప్రచార ప్రభావమున వైదిక ధర్మము, సాహిత్యము అడుగంటిన కాలము. రమారమి నాలుగు శతాబ్దులలో తతిమ్మా వైదిక వాఙ్మయము ఖిలమందినట్లే ఆయుర్వేద వాఙ్మయముకూడ చాల భాగము ఖిలము చెందినది.

కుషానరాజు కనిష్కుని కాలమున (క్రీస్తు శ. 78-102) ఆతని ఆదరమున ఆయన ఆస్థానవైద్యుడు చరకుడు అగ్నివేశ తన్త్రమును ప్రతి సంస్కరించి చరకసంహిత పేరున ఆర్ష ఆయుర్వేద సాహిత్యమును పునరుద్ధరించెను. అదే విధముగా దక్షిణాపథమున యజ్ఞశ్రీశాతకర్ణి ఆదరమున బౌద్ధాచార్య నాగార్జునుడు సుశ్రుతసంహితను ప్రతిసంస్కరించెను. అశ్వఘోషుడు తన బుద్ధచరితలో ఆత్రేయుని ప్రశంసించెను. ఇదంతా చూడగా వైదికపరమగు శాస్త్రముల మీద క్రమేపీ శ్రద్ధ కలుగుట మొదలయినదని యనుకోనవచ్చును. ఈ కాలములో క్రమేపీ వైదిక వాఙ్మయ ఉద్ధరణతో పాటు బౌద్ధవాఙ్మయము కూడ ప్రాకృతము విడనాడి సంస్కృతము నాధారము చేసుకొనడము ప్రారంభమయి ఉభయ ధర్మముల మధ్య, ఉభయ సాహిత్యముల మధ్య పరస్పర సహనము మొదలయినది. క్రీ. శ. 2వ శతాబ్ది నుండి బౌద్ధ ధర్మీయులు కూడ ప్రాకృతము విడనాడి సంస్కృతమును వాడజొచ్చిరి. ఆచార్య నాగార్జునుడు, ఆర్యదేవుడు తమతమ గ్రంథములను సంస్కృతముననే రచించిరి. ఆచార్య నాగార్జునుని సుహృల్లేఖ అటు బౌద్ధధర్మములయందును ఇటు బౌద్ధేతర ధర్మీయుల యందుకూడా ప్రచారముచెంది మన్ననపడసినది. ఆకాలమున సంస్కృతభాషయందు రచింపబడిన దివ్యావదానముకూడా చాలా ప్రసిద్ధిచెందినది. ఇందు ఔషధములను ప్రయోగ ప్రక్రియలద్వారా పరీక్షించుట, నక్షత్రాయుర్వేదము, శస్త్ర ప్రక్రియద్వారా రోగనిదానము మొదలగు విషయములు ప్రవేశపెట్టబడినవి. కాలానుగుణముగా క్రమేపీ సంస్కృత సాహిత్యమున నూతనప్రయోగములు, శాస్త్రపునర్నిర్మాణము, వైదికకర్మకాండస్థానే పురాణములు, ధర్మసూత్రములు, గృహ్యసూత్రముల ప్రభావము, మొదలగు మార్పులుప్రారంభమయి గుప్తకాలమునాటికి (క్రీ.శ. 5వ శతాబ్ది) సకలశాస్త్ర

ములు,కళలు,సాహిత్యముల ఉద్ధరణోద్యమము పరాకాష్ఠ చెందినది. పాటలీపుత్రమున ఆర్య భటుడు(క్రీ.శ. 476) వరాహమిహిరుల (క్రీ.శ.505-587)వల్ల జ్యోతిశ్శాస్త్రమువృద్ధిచెందినది. ఈ శాస్త్ర ప్రభావ మితర శాస్త్రములమీద ప్రసరించినది.గుప్తకాలము స్వర్ణయుగము ధనధాన్య భోగభాగ్యములకు కొదువలేదు. అటు ఒక వైపు ధర్మచింతన, ముముక్షువులు కావలెననెడితృష్ణ, మత, పురాణ, ధర్మసూత్రముల ప్రచార మెంత మెండుగానుండెనో ఇటు కళాపిపాస, సాహిత్యతృష్ణ, భోగలాలసత్వమంతే పరాకాష్టనొందినది. అనగా ఈ కాలమున త్యాగ, భోగచింతకులు సరిసమాన ప్రతిపత్తిలోనేయుండిరి. భోగముతోపాటు రోగములుకూడా వెనువెంటనే యుండునుకదా!

ఇటువంటి యుగసంధి యన తగిన కాలమున వాగ్భటాచార్యులు ఆర్షవైద్య వాఙ్మయమును, కాలానుగుణ్యముగా నుద్ధరించుట కుద్యుక్తుడగుట సమంజసమే. ప్రాచీన ఆర్ష ఆకరగ్రన్థములు, ఇంతకుముందు చెప్పినట్లు ఉపయుక్తముగా నుండనందున, అష్టాఙ్గాయుర్వేదమును తన సంగ్రహమున ప్రకరణవిధానమున పొందుపరచెను. వాగ్భటుడు బౌద్ధధర్మీయుడయ్యెను, తనకు ఆనువంశికముగా లభ్యమయిన వైదికధర్మబద్ధమగు ఆయుర్వేదమును సంగ్రహమున పొందుపరచెను. యుగానురూప సందర్భమనుటకు దృష్టాంతములెన్నోయున్నను, సకలధర్మముల మధ్య సమన్వయాత్మకముగా ఈయన గ్రంథమును రచించెననుటకొక దృష్టాంతమిట్లు కాననగును. అష్టాఙ్గ సంగ్రహ సూత్రస్థానమున వమన విరేచనవిధి యధ్యాయమంద. వమన విధియందిట్లు సూత్ర నిర్దేశము కావింపబడెను.

"......నక్షత్ర తిథికరణ ముహూర్తోదయే
ప్రశస్తే యథావ్యాధి దోషదూష్యాది విహితామౌషధ
మాత్రాం మధుసైన్ధవయుక్తాం సుఖోష్ణాం
బ్రాహ్మణ ప్రయుక్తాభిరాశీర్భి రభిమంత్రితామ్॥
పునశ్చ
బ్రహ్మ దక్షాశ్విరుద్రేన్ద్రభూచన్ద్రార్కానిలానలాః।
ఋషయః సౌషధిగ్రామా భూతసంఘాశ్చ పాంతువః॥
రసాయన మివర్షీ ణా మమరాణామి వామృతమ్।
సుధీవోత్తమ నాగానాం భేషజ్య మిదమస్తు తే॥
నమో భగవతే భేషజ్యగురవే వైడూర్యప్రభరాజాయ
తథాగతాయార్హ్వతే సమ్యక్ సంబుద్ధాయ ॥
తద్యథా—
ఓం భైషజ్యే భైషజ్యే మహాభైషజ్యే భైషజ్యసముద్గతేస్వాహా,
ఇత్యేవమభిమన్త్ర్య ఉదఙ్ముఖంవా ప్రాఙ్ముఖమాతురం పాయయేత్।

అ. సం. సూ. అ. 27

అష్టాఙ్గ సంగ్రహమున విషయవస్తువు ఆరు స్థానములయందు ఒకవంద యాభయ్యి అధ్యాయములుగా రూపొందించబడినది.

| | | |
|---|---|---|
| (1) | సూత్రస్థానము | 40 అధ్యాయములు |
| (2) | శారీరస్థానము | 12 అధ్యాయములు. |
| (3) | నిదానస్థానము | 16 అధ్యాయములు. |
| (4) | చికిత్సాస్థానము | 24 అధ్యాయములు. |
| (5) | కల్పస్థానము | 8 అధ్యాయములు. |
| (6) | ఉత్తరస్థానము | 50 అధ్యాయములు. |
| | మొత్తము | 150 అధ్యాయములు. |

అష్టాఙ్గసంగ్రహ సూత్ర స్థానమునందు విషయము ఈక్రింది విధముగా వింగడింపబడినది.

1–2 అధ్యాయములు ఆయుష్కామీయము, శిష్యోపనయనీయము

3 నుండి 11 అధ్యాయములు స్వస్థవృత్తము.

12 నుండి 18 అధ్యాయములు ద్రవ్యగుణము.

19 నుండి 20 అధ్యాయములు దోషధాతుమలవిజ్ఞానము.

21 నుండి 22 అధ్యాయములు రోగ విజ్ఞానము.

23 నుండి 40 అధ్యాయములు పఞ్చకర్మాది చికిత్సావిశేషాలు.

స్వస్థవృత్తమున దినచర్యా ఋతుచర్యా విషయమున చాలా సుస్పష్టమగు సూత్రములు మనకు ప్రసాదింపబడినవి. ఇవి బౌద్ధ, ఆర్ష సాంప్రదాయముల సమ్మేళనము వలన నిష్పన్నమయినవని నాయభిప్రాయము. అన్నరక్షావిధి యధ్యాయమునందలి విషయములను రచించుటలో తనకు పూర్వవర్తి అగు కౌటిల్యుని అర్థశాస్త్రము నాధారము చేసుకొనెననవచ్చును. విషాన్న పరీక్ష విషకన్యలగురించి కౌటిల్యుని అర్థశాస్త్రమున సవిస్తరముగా వివరింపబడియున్నవి. వాగ్భటునిచే పేర్కొనబడిన సర్వార్థసిద్ధాంజనము బాణభట్టుచే (క్రి. శ. 7వ శతాబ్ది) హర్షచరితము, కాదంబరియందు లేఖితము కావింపబడినవి. దోషదూష్య సమ్మూర్ఛన విషయములో ప్రత్యేకధాతువులందు ప్రత్యేక దోషము లాశ్రయము చెందుటను వాగ్భటుడు ప్రతిపాదించెను. అస్థిధాతువునందు వాతము, రక్తమునందు పిత్తములు స్థానసంశ్రయమును సూచించెను.

ఈయన స్వయముగా అనుభవజ్ఞుడగు వైద్యుడుకూడా. గుగ్గులు రసాయన ద్రవ్యమగుటయేకాక అధికసేవన వలన క్లైబ్యాది దోషములు కలుగునని ప్రప్రథమముగా యీయన చెప్పెను. ఇదేవిధముగా రక్తపిత్తమున–వాసా, ఛర్దికి–లాజప్రయోగము,

తిమిరమున-త్రిఫలా, ప్రమేహమున హారిద్రా, పాణ్డురోగమున-అయోరజము, గుల్మమున-లశునము, కాసమున-కణ్టకారీ మొదలగు ఔషధముల ఉపయోగాన్నీయన తెలిపెను.

ఔషధవర్గీకరణాన్ని ఈయన విస్తారపూర్వకముగా నిర్దేశించెను. ఇదేవిధంగా రోగ వర్గీకరణముకూడ విస్తారము, సుస్పష్టము కావించెను. రోగ పరీక్షావిధానమున ఆప్తోపదేశము, ప్రత్యక్షము, ప్రశ్న, అనుమానము అని నాలుగు సాధనములను చూపెను.

అష్టాఙ్గ సంగ్రహముమీద వ్యాఖ్యానకర్త ఇందు. ఈయన వ్యాఖ్యానము శశిలేఖా వ్యాఖ్య. ఈయనకన్నా ముందు సంగ్రహముమీద అనేకులు అనేక వ్యాఖ్యానములు రచించియుండిరని, కాని అవి దురవగాహకరము, దుర్వ్యాఖ్య భూయిష్ఠముగా నుండుటచే తాను సుస్పష్టమయిన వ్యాఖ్యను రచించినట్లు చెప్పుకొనెను.

> దుర్వ్యాఖ్యా విషసుప్తస్య వాహటస్యాస్మదుక్తయః
> సన్తు సంవిత్తి దాయిన్యః సదాగమ పరిష్కృతాః
>
> —అ. సం. సూ 1/1

ఈయన క్రీ.శ. 11వ శతాబ్దివాడని డా. పి.కె. గోడేగారి యభిప్రాయము.

## గ్రంథకర్త వాగ్భటుడు.

సంస్కృతసాహిత్యమున అనేక వాగ్భటుల పేర్లు మనకు లభ్యమగుచున్నవి.

| | | |
|---|---|---|
| (1) | వాగ్భటుడు | వృద్ధ వాగ్భటుని పితామహుడు. |
| (2) | వాగ్భటుడు (వృద్ధ) | అష్టాఙ్గ సంగ్రహ రచయిత. |
| (3) | వాగ్భటుడు (మధ్య) | నిశ్చలకరుని రత్నప్రభా వ్యాఖ్యానమందలి ఉద్ధృతముల ద్వారా తెలియబడినవాడు. |
| (4) | వాగ్భటుడు (లఘు) | వృద్ధవాగ్భటుని మనుమడు. అష్టాఙ్గహృదయకర్త వమనకల్పము, వాగ్భటీయముల రచయిత. |
| (5) | రసవాగ్భటుడు | రసరత్న సముచ్చయకర్త. |
| (6) | వాగ్భటుడు | చికిత్సాకలిక కర్తయగు తీసటునితండ్రి. |
| (7) | వాగ్భటుడు | వాగ్భటనిఘణ్టుకర్త. |
| (8) | వాగ్భటుడు | మాలవేన్ద్రుని మంత్రి, జీవేశ్వరుని తండ్రి, కవికల్పలతాకారుడు. |
| (9) | వాగ్భటుడు | నేమికుమారపుత్రుడు, జినధర్మీయుడు, ఛన్దోఽనుశాసన కావ్యానుశాసనాది గ్రంథకర్త. |
| (10) | వాగ్భటుడు | నేమినిర్వాణ కావ్యకర్త. |

(11) వాగ్భటుడు — సోమపుత్రుడు, జినధర్మప్రియుడు, జయసింహుని అమాత్యుడు, వాగ్భటాలంకారము, శృంగారతిలకాది గ్రంథకర్త.

(12) వాగ్భటుడు — లఘుజాతకకర్త.

(13) వాగ్భటుడు — ప్రాకృత పిఙ్గలసూత్రకర్త.

ఆయుర్వేదక్షేత్రమున మనకు నలుగురు వాగ్భటులు లభ్యమగుచున్నారు.

(1) వృద్ధవాగ్భటుడు — అష్టాఙ్గ సంగ్రహకర్త.

(2) మధ్యవాగ్భటుడు — నిశ్చలకరుని రత్నప్రభావ్యాఖ్యయందలి ఉద్ధృతములద్వారా తెలియబడినవాడు.

(3) లఘు వాగ్భటుడు — అష్టాఙ్గ హృదయకర్త.

(4) రసవాగ్భటుడు — రసరత్నసముచ్చయకర్త.

అష్టాఙ్గ సంగ్రహకర్త పేరు, అష్టాఙ్గ హృదయకర్త పేరు రెండును వాగ్భటులే. వృద్ధ వాగ్భటుని తండ్రి పేరు సింహగుప్తుడు. లఘు వాగ్భటుని తండ్రి పేరుకూడా సింహగుప్తుడే. ఆకాలమున తాత పేరు మనుమనికి పెట్టుకొను సాంప్రదాయముండెనుకాబోలు మన ఆంధ్రదేశమునకూడా యిట్టి సాంప్రదాయమచ్చటచ్చట కలదు.

వాగ్భటుని వంశావళి




వాగ్భటుడు ఆయుర్వేదశాస్త్రమును తన తండ్రివద్దనభ్యసించెను. ధర్మోపదేశమును బౌద్ధగురువగు అవలోకితేశ్వరుని వద్ద పొందెను. వృద్ధవాగ్భటుని కాలము బాహ్యాభ్యన్తర ప్రమాణములాధారముగా క్రీ.శ. 400 నుండి 600A.D మధ్యగా ఆచార్య శ్రీప్రియవ్రతశర్మగారు నిర్ణయించిరి.

ఉత్తరాపథమున చరక, సుశ్రుత సంహితలు బహుళ ప్రచారమునన్నట్లే, దక్షిణమునతరచా అష్టాఙ్గసంగ్రహ, అష్టాఙ్గ హృదయములు అధికమగు మన్నన పొందినవి.

అష్టాంగ హృదయమును తెలుగు టీకతో శ్రీ వావిళ్లవారు ప్రచురించియుండిరి. కాని అష్టాంగసంగ్రహము తెలుగు టీకతో ఇంతవరకు ప్రచురింపబడలేదు. ఇటువంటి ఉత్తమ సాహిత్యము తెలుగు చదువరులకు, వైద్యులకు లభ్యము కాకుండుట ఒక పెద్ద లోపముగా నుండినది. ఇటీవల భారతీయ చికిత్సా కేంద్రీయ పరిషత్తువారు అఖిలభారతస్థాయిలో ఆయుర్వేద పట్టభద్రుల డిగ్రీకోర్సునకై పాఠ్యప్రణాళికను రూపొందించినారు. అందు ప్రథమసంవత్సరపు పాఠ్యభాగమున అష్టాంగసంగ్రహము పాఠ్యపుస్తకముగా నిర్దేశింప బడినది.

ఈ రెండు కారణములను పురస్కరించుకొని తెలుగున శశిలేఖాఖ్య వ్యాఖ్యానసహితమగు అష్టాంగసంగ్రహముమీద టీక ప్రచురించవలసిన ఆవశ్యకతను, నేను, ఆంధ్రప్రదేశ్ భారతీయ చికిత్సా విభాగ నిర్దేశకులు, శ్రీ బి.ఎల్. నరసింహులుగారి దృష్టికి తెచ్చితిని. వారు సహృదయముతో యీసూచనను గ్రహించుటయేగాక, చాల శ్రద్ధవహించి ఈ గ్రంథమును శశిలేఖ వ్యాఖ్యతోసహా అనువాదముచేసి ముద్రించుటకై తెలుగు అకాడమి వారితో సంప్రదించిరి. తెలుగు అకాడమీవారు ఈగ్రంథమును తెలుగున ప్రచురించుటకు చాలా ఉత్సాహముచూపిరి. అప్పటి తెలుగుఅకాడమీ డైరెక్టరుగారు శ్రీ పి.ఎస్.ఆర్. అప్పారావుగారు, తదనంతరము ఇప్పటి డైరెక్టర్ శ్రీ ఎన్. వెంకటస్వామిగారు ఈ కార్యము నిర్విఘ్నముగా జరుగుటకై ఎంతయో దోహదమొనర్చిరి. ఈ ప్రయత్నము మొదలయినప్పటినుండి గ్రంథప్రచురణవరకెప్పటికప్పుడు, గౌరవనీయులు, భారతీయ చికిత్సా విధానామాత్యులు శ్రీ టి. హయగ్రీవాచారిగారు అనువాదకులకు, ప్రోద్బల మిచ్చుటయేకాక, ఈ విషయమై చాలా కుతూహలము, ఉత్సాహము కనబరిచిరి.

ఈ గ్రంథము కేవలమనువాదమేకాక తెలుగు లిపిలో మూలశ్లోకము, దండాన్వయ క్రమమున ప్రతిపదార్థము, తాత్పర్యము, శశిలేఖ వ్యాఖ్యానమందలి సారాంశము, విశేషవ్యాఖ్య, ఇతరగ్రంథములతో సమన్వయము, విశిష్టపదములకు నిర్వచనములు, విశేషార్థములతో రూపొందించబడినది. ఇందుమూలమున విద్యార్థులకు, వైద్యులకు విషయము సులభగ్రాహ్యముగానుండును. తెలుగు అనువాదకర్తలు, వ్యాఖ్యానరచయితలు నలుగురూ ఆయుర్వేదశాస్త్రమునను, సంస్కృతమునను నిష్ణాతులు, ప్రాధ్యాపకత్వమున అనేక సంవత్సరముల అనుభవము గడించినవారు.

నలుగురిచే వ్యాఖ్యానము రచింపచేయుటవలన గ్రంథమున కొద్దిగా శైలి వైవిధ్యము కనుపించు నవకాశముకలదు, ఇది సహజము. కాని సాధ్యమయినంతవరకిది సరిదిద్దబడినది. వారివారి ప్రత్యేక రచనాశైలి, భాషాశైలి అందములోపించి, వారివారి అభిప్రాయప్రకటన యందలి స్వేచ్ఛకు భంగము వాటిల్లగలదనెడిశంకచే అధికమగు సవరణ చేయలేదు. ఇటువంటి ఉత్తమ ప్రాచీనసాహిత్యమును, శాస్త్రగ్రంథమును భాషాంతరీకరణము గావించుటయందు కల సాధకబాధకములు విజ్ఞులైన విద్వద్వైద్యులకు విదితమే. కావున వైద్యశేఖరులు ఈ అనువాద గ్రంథమందలి గుణములను గ్రహించి దోషములున్న

సహృదయముతో తెలిపిన ఉత్తరోత్తర ముద్రణలయందా లోపములను సరిదిద్దుకొన యవకాశముండును. ఈ ప్రచురణమును ఆంధ్రదేశ వైద్యశేఖరులు సాదరాభిమానములతో స్వీకరించగలరని ఆశించుచున్నాను.

సిద్ధార్థి సంవత్సరము-వైశాఖ శుద్ధపూర్ణిమ
(శక సం. 1901. క్రీ.శ. 1979)
హైదరాబాదు.

వైద్య ఇటికాల సంజీవరావు
ప్రధానాచార్యుడు
ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల

# విషయ సూచిక

# అష్టాంగసంగ్రహ వ్యాఖ్యానము

## ప్రథమాధ్యాయము

### అవతరణిక

అష్టాంగ సంగ్రహమను గ్రంథమును చేయబూనిన గ్రంథకర్తయగు వాగ్భటాచార్యుడు ఈ గ్రంథము అడ్డంకులు లేకుండ నిర్విఘ్నముగ పూర్తి యగుటకు శిష్యులకిది ఉపదేశార్హమగుటకు శిష్టాచారము ననుసరించి 'రాగాది రోగాః' అను తన ఇష్టదేవతానమస్కారాత్మకమగు మంగళాచరణమును చేయుచున్నాడు.

మంగళము

మూలము : రాగాదిరోగాః సహజాస్సమూలాః
యేనాఽఽశుసర్వే జగతోఽప్యపాస్తాః
తమేక వైద్యం శిరసానమామి
వైద్యాగమజ్ఞాం శ్చ పితామహాదీన్.

**ప్రతిపదార్థము :** సహజాః=సహజములైన; రాగాదిరోగాః=కామ క్రోధాదిరోగములు; సర్వే=అన్నియు; సమూలాః=సమూలములుగా; ఆశు= త్వరగా; యేన=ఎవనిచేత; జగతోఽపి=జగత్తునుండి; అపాస్తాః=తొలగింప బడినవో; తం=అట్టి; ఏకవైద్యమ్=ఏకైక వైద్యుణ్ణి (ఒకే వైద్యుణ్ణి); చ=మరియు; వైద్యాగమజ్ఞాన్=వైద్యశాస్త్రనిష్ణాతులగు; పితామహా దీన్=బ్రహ్మాదులనుగూడ; శిరసా=శిరస్సుతో; ననామి=నమస్కరించు చున్నాను.

**భావార్థము :** మానసిక శారీరక సంబంధములైన నిదానాదులతోకూడి యున్న నిజాగంతుకరూపమైన కామక్రోధలోభ మోహమద మాత్సర్య యుక్త మైన సమస్తరోగములను సత్వరముగ, సమూలముగ తొలగించు ఆదివైద్యునికి సమస్త వైద్యశాస్త్ర పారంగతులు, ప్రవర్తకులునైన బ్రహ్మాదులకు గూడ నమ స్కరించుచున్నాను.

**శశిలేఖ :** రాగాదులన్నప్పుడు ఆదిశబ్దముచేత ద్వేషాదులు గ్రహింప బడును. సహజములనగా పుట్టుకనుండి పురుషునితో కూడి యుండునవి. సమూలమనగా రాగాదులకు కారణమగు అజ్ఞానముతోకూడిన అని అర్థము.

ఏక వైద్యుడనుటలో ఇట్టి గుణములు కల వైద్యేతరుడు లేనందున అని భావము.

ఇతర వైద్యులు సహజత్వాది అసాధ్య లక్షణములుగల రోగములను నిర్మూలించుటకు అసమర్థులు.

**విశేషవ్యాఖ్య:** ప్రతి గ్రంథకారుడును గ్రంథారంభమున సర్వవిఘ్నములను పారద్రోలుటకు గ్రంథరచన నిర్విఘ్నముగ కొనసాగుటకు మంగళాచరణమును చేయుట పరిపాటి. "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతానిచ శాస్త్రాణి ప్రథం తే వీర పురుషకాణ్యా యుష్మ త్పురుషకాణిచ భవంతి" అను వచన ప్రకారము మంగళము ఆదిమధ్యాంతములయందు చేయుట ముఖ్యము. ఈ గ్రంథకారుడు ఆదియందు మంగళాచరణమును చేసెను.

**విశిష్టపద నిర్వచనము :** రాగః=శుద్ధస్యచేతసః రజ స్తమోభ్యాం రంజనం రాగః. రుంజతీతిరోగాః-శరీరమును మనస్సును బాధించునవిరోగములు. సహజాతాః - సహజాః జన్మనః ప్రభృతిశరీరిణా సంగతాః అని అర్థము.

**విశేషవ్యాఖ్య:** రాగ యని ప్రారంభించుటచేత,రాగాదులు మనస్సును ఆశ్రయించి ఉండుటచేత మనస్సును తపింపజేయునేగాని శరీరమును తపింపజేయవు. ఈ రాగాదులు రోగములని ఎట్లు చెప్పవచ్చుననెడి సందేహము కలుగును. ఆధారమగు తప్తమైన కటహాదులచేత ఆధేయమైన ఘృతాదుల కెట్లు తాపము కలుగునో అట్లే శరీరము, మనస్సు ఆధారాధేయములుగా నుండుటవలన ఏ ఒకదానికి తాపము కలిగినను మరియొకదానికి తాపము కలుగును. కావుననే శరీరమును, మనస్సును బాధించునట్టి రాగాదులు రోగములని చెప్పబడినవి.

మరియు ఈ తంత్రమునకు విషయప్రయోజన సంబంధాదు లిట్లున్నవి. ఈ తంత్రమునకు 'ధాతు సామ్యక్రియ' ముఖ్యప్రయోజనము. త్రిస్కంధము (హేతుస్కంధము, లింగస్కంధము, ఔషధస్కంధము) విషయము.

ఆయురారోగ్యమును కల్గించుటకు, చదువుట, అర్థమును తెలుసుకొనుట, అనుష్ఠించుట వీటికి సాధనమగుటవలన ఉపాయ ఉపేయ రూప సంబంధము.

హితాహార విహారాదులచేత ఆయుర్వృద్ధిని కోరువారు అధికారులు కాగలరు.

**మూ॥ అథాత ఆయుష్కామీయం నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః**
**ఇతిహస్మాఽఽహురాత్రేయాదయో మహర్షయః**

**ప్రతి పదార్థము :** అథ=మంగళవాచకము; అతః=మంగళాచరణము తరువాత; ఆయుష్కామీయం=ఆయుష్కామీయమను; నామ=పేరుగల; అధ్యాయం=అధ్యాయమును; వ్యాఖ్యాస్యామః=వివరింపగలము. ఇతిహః= ఈ విధముగా; ఆత్రేయాదయః=ఆత్రేయుడు మున్నగు; మహర్షయః= మహర్షులు; ఆహుః స్మ=పలికిరి.

**భావార్థము :** మంగళాచరణము తరువాత ఆయుష్కామీయమను నధ్యాయమును వివరించుచున్నాను.

**శశివ్యాఖ్యా :** ఆయుష్కామీయమనగా ఆయుష్కాములకు హితమైనది. (ఆయుష్కామేభ్యః హితః), లేదా ఈ అధ్యాయమునందు ఆయుష్కామ శబ్దము కలదు కావున దీనికి ఆయుష్కామీయమను పేరు, ఇతిహ అను రెండు పదములు గతమును సూచించునవి. ఆత్రేయాదయః అనునపుడు ఆది శబ్దముచే భరద్వాజాదుల గ్రహింప వలయును. మహర్షయః అనుపదములో విశిష్టజ్ఞాన సంపన్నులైనందున వారికి మహచ్ఛబ్దముచే పూజ్యత్వము చెప్పబడినది.

**వి.వ్యాఖ్యా :** అథశబ్దము మంగళవాచకము.

"ఓంకారశ్చాథ శబ్దశ్చద్వావేతౌ బ్రహ్మణః పురా
కంఠం భిత్వావినర్యాతౌ తేనేమౌ మంగళౌ స్మృతౌ"

అను వచనమును బట్టి అథశబ్దము మంగళకరమైనది. అతఃఅనుశబ్దము మంగళమైన తరువాత అను నర్థమును తెలుపును. ఆయుః 'ఏతీత్యాయుః' అను వ్యుత్పత్తిని బట్టి

**"శరీరేంద్రియ సత్వాత్మసంయోగోధారి జీవితం
నిత్యగశ్చాను బంధశ్చ పర్యాయైరాయురుచ్యతే"**

అను శాస్త్ర ప్రకారవచనానుసారము గమన స్వభావముగ ఆయువు కోరునట్టి ఆయుష్కాములైన మహర్షులచే మొదట తెలిసికొనబడినందున ఆయుష్కామీయ మనబడుచున్నది. పద అర్థ ప్రయోజన ఆక్షేప పరిహారాదులచే కూడు కొన్న ఈ అధ్యాయమును విపులీకరించెదము అనుచున్నారు. (ఆయుః అను పదము, ఏతీత్యాయుః అనుపదార్థము చేతను, ధర్మార్థ సుఖసాధనం అను ప్రయోజనము తోడను, జీవహింస మొదలగు ఆక్షేపాదుల తోడను, యజ్ఞయాగాది ఉదాహరణలతో కూడిన పరిహారములతోడను కూడుకొన్నదీ యధ్యాయము)

**అధ్యాయమనగా :** పదసముదాయము, వాక్యము, కొన్ని వాక్యముల సంపుటీ ప్రకరణము, ప్రకరణ సముదాయము అధ్యాయమగును.

"అధికృత్యేయ మధ్యాయ నామ సంజ్ఞాప్రతిష్ఠితా"

అనువచనముచేత అర్థగతి ననుసరించి యధ్యాయమని చెప్పబడినది.

**మూ॥** ఆయుఃకామయమానేన ధర్మార్థసుఖసాధనమ్
ఆయుర్వేదోపదేశేషు విధేయః పరమాదరః

**ప్రతిపదార్థము :** ధర్మార్థసుఖసాధనం = ధర్మార్థసుఖములకు సాధనభూతమైన; ఆయుః=ఆయుస్సును (దీర్ఘాయువును); కామయమానేన= కోరుచున్నవానిచేత; ఆయుర్వేదోపదేశేషు=ఆయుర్వేదముయొక్క ఉపదేశముల

యందు; పరమాదరః = ఉత్కృష్టమైన ఆదరము; విధేయః = చూపదగినది.

**భావము** : ధర్మార్థకామ మోక్షములను చతుర్విధపురుషార్థములకు సాధనమైన దీర్ఘాయువును కోరువాడు ఆయుర్వేదోపదేశములను అత్యాదరముతో అనుసరించవలెను.

**విశేషవ్యాఖ్య**: ధర్మము ననుష్ఠించుటకు, అర్థమునార్జించుటకు, కామోపభోగముల ననుభవించుటకు మోక్షప్రాప్తికి సాధన భూతములైన యజ్ఞయాగాది క్రతువుల నాచరించుటకు ఆరోగ్యము సర్వప్రాణులకు ఆవశ్యకమై యున్నది. ఆరోగ్యమును యావజ్జీవితము (జీవితపర్యంతము) రక్షించుకొనుటకు మార్గము ఆయుర్వేదమునందు ఉపదేశింపబడినది. మరియు ప్రతిపురుషుడు ఆరోగ్యమును రక్షించుకొనుటకు, రోగరహితుడుగా నుండుటకు ఆయుర్వేదోపదేశములందు శ్రద్ధాసక్తులు గలవాడై యుండవలెను. మరియు ప్రకృతి విజ్ఞానము, రసాయన విజ్ఞానము, దూతారిష్టవిజ్ఞానము మొదలగు జ్ఞానముల వలన ఉపపత్తులతో కూడ ఆయుర్వేదము నందలి సమస్త విషయములను తెలిసికొనుటకు ప్రయత్నించువాడు చికిత్సావిషయములలో ఎప్పుడును పొరపాటు పడడు.

తక్కిన తర్కవ్యాకరణాది శాస్త్రములందు పాండిత్యము సంపాదించి ఆయుర్వేద శాస్త్రము యొక్క అధీతిబోధాచరణ ప్రచారములకు ప్రయత్నించవలెను. ఈ ఆయుర్వేద శాస్త్రము సర్వతంత్రసారసర్వస్వ సంగ్రహమై యొప్పారుచున్నది. సమస్త శాస్త్రములయందలి అభిప్రాయములు ఈ ఆయుర్వేద శాస్త్రమునందు సముద్రము నందలి అనర్ఘరత్నములవలె నిగూఢములై ఉన్నవి.

ఈ గ్రంథకారుడు పై శ్లోకమువలన సంబంధాది చతుష్టయమును గూడ తెలియజేయుచున్నాడు. సంబంధము, ప్రయోజనము, అభిధానము, అభిధేయము వీటినే సంబంధ చతుష్టయమందురు. ఇచట ఆయుర్వేదోపదేశము ఉపాయము, దానిద్వారా ఆయుస్సును పొందుట ఉపేయము, ఆయువు ద్వారా చతుర్వర్గములను (ధర్మార్థకామ మోక్షములను) సాధించుట ప్రయోజనము. ఆయుర్వేద మభిధేయము. ఈ తంత్రము (అష్టాంగ సంగ్రహము) అభిధానముగానున్నది.

మూ॥ ఆయుర్వేదామృతం సార్వం బ్రహ్మాబుధ్వాసనాతనమ్
దదౌదక్షాయ సోఽశ్విభ్యాం తౌ శతక్రతవే తతః.
ధర్మార్థకామమోక్షాణాం విఘ్నకారిభిరామయైః
నరేషు పీడ్యమానేషు పురస్కృత్య పునర్వసుమ్.
ధన్వంతరి భరద్వాజ నిమి కాశ్యప కశ్యపాః
మహర్షయో మహాత్మానస్తథాలంబాయనాదయః.
శతక్రతు ముపాజగ్ము శ్శరణ్యమమరేశ్వరమ్

తాన్దృష్ట్వైవ సహస్రాక్షో నిజగాదయథాగమమ్.
ఆయుషః పాలనం వేద ముపవేద మథర్వణః
కాయబాల గ్రహోర్ధ్వాంగ శల్యదంష్ట్రా జరావృషైః
గతమష్టాంగతాం పుణ్యం బుబుధేయం పితామహః
గృహీత్వా తే తమామ్నాయం ప్రకాశ్య చ పరస్పరమ్.
ఆయయుర్మానుషం లోకం ముదితాః పరమర్షయః
స్థిత్యర్థమాయుర్వేదస్య తేఽథ తన్త్రాణి చక్రిరే.
కృత్వాఽగ్ని వేశహారీత భేళ మాండవ్య సుశ్రుతాన్
కరా శాదీంశ్చ తచ్ఛిష్యాన్ గ్రాహ యామాసురాదృతాః
స్వం స్వం తన్త్రం తతస్తేఽపి చక్రుస్తాని కృతానిచ
గురూన్ సంశ్రావయామాసుస్సర్షి సంఘా న్సుమేధసః.
తైః ప్రశస్తాని తాన్యేషాం ప్రతిష్ఠాంభువిలేభిరే
తేషామేకైక మప్యాపి సమస్త వ్యాధి సాధనే

**ప్రతిపదార్థము :** సనాతనం = అనాదియైన (ఆద్యంతములు లేని); సార్వం=అందరికి హితకరమైనట్టి; ఆయుర్వేదామృతం=అమృతోపమాన మైన ఆయుర్వేదమును; బుద్ధ్వా= తెలిసికొని; దక్షాయ=దక్షప్రజాపతికొరకు; బ్రహ్మా=బ్రహ్మ; దదౌ=ఇచ్చెను. సః=ఆదక్షుడు; అశ్విభ్యాం=అశ్వినీదేవతల కొరకు; దదౌ=ఇచ్చెను; తౌ=ఆ అశ్వినీదేవతలు; శతక్రతవే; దేవేంద్రుని కొరకు; దదతుః=ఇచ్చిరి; తతః = తరువాత; ధర్మార్థకామ మోక్షాణాం = ధర్మార్థకామ మోక్షములకు; విఘ్నకారిభిః = అడ్డంకులపుచేయుచున్న; ఆమయైః = రోగములచేత; నరేషు = ప్రజలు; పీడ్యమానేషు సత్సు = బాధింపబడుచుండగా; పునర్వసుం = పునర్వసువును; పురస్కృత్య=ముందిడు కొని; మహర్షయః=భాగ్యవంతులును; మహాత్మనః = విజ్ఞానవంతులునగు; ధన్వంతరి భరద్వాజ నిమి కాశ్యప కశ్యపాః = ధన్వంతరి, భరద్వాజ, నిమి, కాశ్యప, కశ్యపులు; తథా=మరియు; లంబాయనుడు మొదలగువారు; అమరేశ్వరం=అమరాధిపుడైన; శరణ్యం = శరణు పొందదగినవాడైన; శత క్రతుం = దేవేంద్రుని; ఉపాజగ్ముః = సమీపించిరి; తాన్=అట్లు సమీపించిన మహర్షులను; దృష్ట్వాఏవ=చూడగనే; సహస్రాక్షః=దేవేంద్రుడు; ఆయుషః= ఆయుష్యమునొక్క; పాలనం=రక్షించునదియు; అథర్వణః=అథర్వణవేదము యొక్క; ఉపవేదం=ఉపవేదమును; కాయ బాలగ్రహోర్ధ్వాంగ శల్యదంష్ట్రా జరావృషైః=కాయవాజీకరణములను వానిచేత; అష్టాంగతాం=అష్టాంగత్వ మును(8అంగములను కలిగియుండుటను);గతం=పొందినదియు; పుణ్యం=పవిత్ర మైనదియు;యం=దేనిని;పితామహః=బ్రహ్మ;బుబుధే= తెలిసికొనెనో; వేదం= అట్టి ఆయుర్వేదమును;యథాగమం=శాస్త్రము నతిక్రమించక; నిజగాద=పలి కెను (ఉపదేశించెను); తే=ఆ ఋషులందరు; తం=అట్టి; ఆమ్నాయం=వేద

మును; పరస్పరం = ఒకరికొకరు; ప్రకాశ్య=ప్రకాశింపచేసికొని; ముదితాః= సంతోషించినవారై; మానుషంలోకం=భూలోకమునకు; ఆయయుః=వచ్చిరి; తేపరమర్షయః=ఆమహర్షులు; ఆయుర్వేదస్య=ఆయుర్వేదముయొక్క; స్థిత్యర్థమ్=ఉనికికొరకు; అథ=తరువాత; తంత్రాణి=గ్రంథములను; చక్రిరే= రచించిరి; కృత్వా=రచించి; ఆదృతాః=ఆదరింపబడినవారై; అగ్నివేశ హారీత భేల మాండవ్య సుశ్రుతాన్=అగ్నివేశుడాదిగాగల సుశ్రుతులను;చ= మరియు; తచ్ఛిష్యాన్=వారి శిష్యులగు; కరాళాదీన్=కరాళుడు మొదలగు వారిని; గ్రాహయామాసుః=గ్రహింపచేసిరి (వారికి ఉపదేశించిరి); తేఽపి= వారును (అగ్నివేశ కరాళాదులును); తతః=పిమ్మట; స్వం స్వం=తమతమ; తన్త్రం=శాస్త్రమును; చక్రుః=రచించిరి; కించ=మరియు; కృతాని= రచించిన; తానిచ = అట్టి తంత్రములను; సుమేధసః = మేధావులగు; సర్షి సంఘాన్=ఋషులతోకూడిన; గురూన్=గురువులను(కు); సంశ్రావయామాసుః=వినిపించిరి; తైః = అట్టి గురువులచేత; ప్రశస్తాని = ప్రశంసింపబడిన; ఏషాం = ఈ అగ్నివేశాదులయొక్క; తాని=ఆ తంత్రములు; భువి=భూలోకములో; ప్రతిష్ఠా=కీర్తిని; లేభిరే=పొందినవి; తేషాం=వాటిలో; ఏకైకం= ఒక్కొక్కటి; సమస్తవ్యాధిసాధనే=అన్ని రోగములను సాధించుటయందు; అవ్యాపి=సంపూర్ణము కాదు.

**భావార్థము** : సమస్తప్రాణులకు హితకరమైనట్టి అష్టాంగవిలసితమైన, అజరామరమైన, త్రికాలాబాధితమైన ఆయుర్వేదమును బ్రహ్మ స్మరించి దక్ష ప్రజాపతి కుపదేశించెను. అతడు అశ్వినీదేవతలకు, వారు ఇంద్రునికి ఉపదేశించిరి. తరువాత ప్రజలందరు పలువిధములైన శారీరక మానసిక వ్యాధులచేత పీడింపబడుచు పురుషార్థములగు ధర్మ-అర్థ-కామ-మోక్షములను సాధించలేకపోవుటను చూచి ధన్వంతరి మొదలగు మహర్షులు పునర్వసువును ముందిడుకొని తమకు శరణ్యుడైన దేవేంద్రుని సన్నిధి చేరిరి.

వారు తన సన్నిధి చేరగనే ఇంద్రుడు ఆయుర్వేదమును యథాశాస్త్రముగా ఉపదేశించెను. పరమర్షులచే గ్రహింపబడిన ఆ ఆయుర్వేదము అథర్వణ వేదమునకు ఉపవేదమై ఆయుస్సును రక్షించునదిగా అష్టాంగములతో కూడినదై యుండెను.

మహర్షులు అట్టి ఆయుర్వేదమును ఏకసంథాగ్రాహకులై గ్రహించి పరస్పరమవగతముచేసికొని సంతోషముతో భూలోకమునకు వచ్చిరి. తరువాత ఆయుర్వేదము చిరస్థాయిగా నుండుటకు ఒక్కొక్కరు ఒక్కొక్క గ్రంథమును రచించిరి. ఆరంభించిన గ్రంథములను అగ్నివేశాదులకు బోధించిరి. వారును విడివిడిగా ప్రత్యేక తంత్రములను రచించిరి. వాటిని ఋషులతోపాటు తమ తమ గురువులకు వినిపించగా మేధావులగు వారిచే ఆ గ్రంథములు ప్రశంసింపబడి లోకమున ప్రతిష్ఠను వ్యాప్తిని పొందెను. పై గ్రంథములన్నియు

ఏ ఒక్కటికూడ సమస్తవ్యాధి నిర్మూలనమున సమగ్రములుకాకున్నవి.

**శశిలేఖ:** ఆయుర్వేద గురుపరంపర విపులీకరించబడినది. అమృతముతో సర్వరోగములు క్షయించునటుల ఆయుర్వేదముచేతను సమస్తరోగ నిర్మూలనమునకు ఉపాయములు చెప్పబడినందున ఆయుర్వేదమునకు అమృతముతో సామ్యము చెప్పబడినది.

సార్వం అను పదమునకు సర్వులకు (అందరికి) హితమైనది అని అర్థము. సనాతనమనగా వినాశనము లేనిది.

**మహర్ధయః**=మహితబుద్ధిః యేషాం తే **మహర్ధయః**. భాగ్యవంతులు అనగా తపస్సంపదగలవారు అను నర్థ మిచట ద్యోతకమగుచున్నది. యథాగమమనగా శాస్త్రము నతిక్రమించక యని అర్థము. బ్రహ్మాదులెట్లు ఆయుర్వేద శాస్త్రమును తెలిసికొనెనో వారి జ్ఞానమును అట్టిదే అని తెలుపుటకు 'బుబుధేయం పితామహః' అని మరల రెండవతూరి చెప్పబడినది. ధన్వంతర్యాదులు నేనీవిధముగా తెలిసికొన్నానని ఒకరితో నొకరు చెప్పికొనిరి. ప్రతి వ్యాధిని నిర్మూలించుటకు కావలసిన చికిత్సాపరికల్పనలు సంహితాగ్రంథములలో ఏ ఒక్క గ్రంథమునందైనను సమగ్రముగ లభించనందున సమస్త తంత్రముల యందలి విషయసంపుటిగా ఈ గ్రంథము వ్రాయబడినట్లు గ్రంథకారుని అభిమతముగా తోచుచున్నది.

**మూ॥** **ప్రతి తంత్రాభియోగే తు పురుషాయుష సంక్షయః**
**భవత్యధ్యయనేనైవ యస్మాత్ప్రోక్తః పునఃపునః**
**తంత్రకారైస్సఏవార్థః క్వచిత్ కశ్చిద్విశేషతః**
**తేఽర్థప్రత్యాయనపరా వచనే యచ్చనాదృతాః.**

***ప్రతిపదార్థము*** : ప్రతి తంత్రాభియోగేతు = ప్రతితంత్రముయొక్క విషయమునందైతే,అధ్యయనేనైవ=అధ్యయనముచేతనే; పురుష=పురుషుల యొక్క; ఆయుష = జీవితముయొక్క; సంక్షయః = నాశనము; భవతి=అగుచున్నది.యస్మాత్=ఎందుకనగా;తంత్రకారైః=తంత్రకారులచేత; క్వచిత్= ఒక్కొక్క తంత్రమునందు; కశ్చిత్=ఒక్కొక విషయము; విశేషతః=విశేష రూపమున; సఏవాఽర్థః=ఆ యర్థమే; పునఃపునః=మరలమరల; ప్రోక్తః= చెప్పబడినది. తే=ఆ తంత్రకారులు; యచ్చ=ఎందువల్లనైతే; అర్థప్రత్యయపరాః=అర్థమును తెలుపుటయందే ఆసక్తిగలవారో అందువలన; వచనే= మాటయందు; నాదృతాః=ఆదరము లేనివారు.

**తాత్పర్యము:** సమస్తతంత్రములయందలి విషయములను సమగ్రముగా అధ్యయనము చేయుటకు మానవాళి జీవితము చాలదు. ప్రాచీన తంత్రకారులు ప్రతి తంత్రమునందును చర్విత చర్వణముగా చెప్పిన అర్థమునే చెప్పుచు తంత్ర రచనము సాగించిరి. మరియు ఒక్కొక్కచోట విశేషార్థములను గూఢ తమ

తంత్రములయందు జొప్పించిరి. ఈ తంత్రకారులు తాము చెప్పదలచిన అర్థమును నిర్దుష్టముగా వివరించుటయందే ఆసక్తిగలవారు కాని పునరుక్తి మొదలైన దోషములేనిపదములయందు ఆదరమును చూపువారు కారు.

*శశిలేఖ:* 'తే = నాదృతాః' తంత్రకారులు వివక్షితార్థమును బాగుగ అర్థము నవగతము చేయించుటయందు నిష్ఠకలవారు. అందుకై మాటలను అధికముగ ఉపయోగించెడివారు. అర్థగౌరవమును కాపాడుటకొరకే బహుభాషిత్వము కలవారని భావము.

**మూ॥** సర్వతంత్రాణ్యతః ప్రాయః సంహృత్యాష్టాంగ సంగ్రహః
**అస్థాన విస్తరాక్షేప పునరుక్తాది వర్జితః॥**
**హేతు లింగౌషధ స్కంధత్రయ మాత్ర నిబంధనః**
**వినిగూఢార్థ తత్త్వానాం ప్రదేశానాం ప్రకాశకః॥**
**స్వాన్యతంత్ర విరోధానాం భూయిష్ఠం వినివర్తకః**
**యుగానురూప సందర్భో విభాగేన కరిష్యతే॥**

***ప్రతిపదార్థము*:** అతః = ఇందువలన; ప్రాయః = తరచుగా; సర్వతంత్రాణి=సమస్త తంత్రములను; సంహృత్య=సంగ్రహించి; అస్థాన=అసందర్భము; విస్తర=అతివిస్తారము ; ఆక్షేప=సంగ్రహము; పునరుక్త=పునరుక్తి; ఆదివర్జితః= మొదలగునవిలేకుండునట్లుగను; హేతు..నిబంధనః= హేతుస్కంధ= హేతుస్కంధము;లింగస్కంధ=లింగస్కంధము;ఔషధస్కంధ=ఔషధస్కంధము; అను; త్రయమాత్ర=ఈ మూడు స్కంధములు మాత్రమే; నిబంధనః=కూర్చ; బడినట్టిన్ని; వినిగూఢార్థ తత్త్వానాం=గంభీరములైన అర్థముల తత్త్వములుగల; ప్రదేశానాం=సందర్భములకు; ప్రకాశకః=ప్రకాశకమైనదియు; స్వాన్య తంత్ర విరోధానాం=తమయొక్క ఇతరులయొక్క తంత్రములయొక్క విరోధములను భూయిష్ఠం=మిక్కిలి;వినివర్తకః=నివారించునదియు; యుగానురూపసందర్భః= ఈ యుగమునకు తగిన విషయములుగ; అష్టాంగ సంగ్రహః=అష్టాంగ సంగ్రహము; విభాగేన=సరియైన ప్రకరణ విభాగముచేత; కరిష్యతే=చేయబడుచున్నది.

***తాత్పర్యము*:** సమస్త తంత్రములను పరిశోధించి లింగత్రయ విభాగము, గంభీరార్థ సందర్భశుద్ధి, పునరుక్తాది వర్జనము, గూఢార్థప్రకాశము, గ్రంథవిరోధపరిహారము కలిగి ఈ యుగమునకు తగినట్లుగా అష్టాంగవిభాగముతో అష్టాంగ సంగ్రహము చేయబడగలదు.

*శశిలేఖ :* 'అస్థాన' మనగా ఒకచోట చెప్పతగిన దానిని వేరేచోట చెప్పుట. 'విస్తరము' అవసరము లేనిచోట విపులీకరణము. ఋతువర్ణనము నందు, దోషోపక్రమణమునందు, స్వస్థాతురులకు హితమైనందున విపులీకరణ యుక్తము. అట్లే గర్భావక్రాంతి అంగప్రత్యంగ విభాగమున్నచోట్ల సంక్షేపము

తగినదే. ఒకతూరి గుర్తు చేయబడిన విషయమును మరల చెప్పుట పునరుక్తి. (సకృత్ జ్ఞాపితస్య వస్తునః పునర్వచనం పునరుక్తిః) రోగకారణములగు విధ్యాహార విహారాదుల చెప్పునది హేతుస్కంధము. వ్యాధి పూర్వరూపములను చెప్పునది లింగస్కంధము. రోగచికిత్సకై చెప్పబడు చూర్ణ లేహిక్వాథపథ్యాదులు ఔషధస్కంధము.ఇచట సంప్రాప్తి, ఉపశయము మున్నగువాటికి హేతు లింగాది స్కంధములయందు అంతర్భావము చెప్పుకొనవలెను. ఆవశ్యకము లయిన విషయములు మాత్రమే చెప్పబడునని 'మాత్ర' శబ్దమున కర్థము. 'వినిగూఢార్థ తత్త్వానాం ప్రదేశానాం ప్రకాశకః'. అన్య తంత్రములయందు మిక్కిలి నిగూఢములైన అర్థతత్త్వము లేవికలవో వాటియొక్క ప్రకాశక మీ అష్టాంగ సంగ్రహము. ఎట్టులనగా షష్టకధ్యాయములయొక్క గుణములను పేర్కొనుచు చరకముని 'స్నిగ్ధోగురుశ్చ' అని వ్రాసిరి. కాని వాగ్భటుడు, సుశ్రుతుడు, కృష్ణాత్రేయుడు, ఖరనాదుడు, పరాశరుడును గుష్ణశ్చకు ముందు 'అ'కారప్రయోగమును చేసిరి. లఘుగుణము షష్టికధాన్యమునకు పైనుదాహరించిన గ్రంథకారులందరు ఏకగ్రీవముగ నంగీకరించిరి. ఒకే గ్రంథమునందు పరస్పర విరోధము మరియు ఇతర గ్రంథములతోటి విరోధము ఇందు తొలగించబడినది. చరకము నందొకచోట స్నేహముయొక్క ప్రవిచారణ 24 విధముల చెప్పి అందే మరియొకచోట 64 విధములని చెప్పబడినది. ఈ పరస్పర విరోధము వస్తుతః లేదు. భక్ష్యాది రూపముగ నుపయుక్తమగు స్నేహమే రసభేదదృష్టితో 64 విధములుగా చెప్పబడినది. దీనినే వాగ్భటుడు 'యుక్త్యాఽవచారయేత్ స్నేహమ్' అని స్వతంత్ర విరోధపరిహార పూర్వకముగ చెప్పినాడు. ఇక పరతంత్ర విరోధమునకు ఉదాహరణము - చరకుడు హిమాలయోత్పన్నములగు నదీజలములకు పథ్యత్వము చెప్పినాడు. కృష్ణాత్రేయ సుశ్రుతుడు గలగండాది రోగకారకములని పేర్కొనినాడు.ఈవిరోధమును వాగ్భటుడు శిలాతాడితములై రాపిడిపొందిన జలములు పథ్యములనియు, నిలకడగల జలములు రోగకారకము లనియు వివరించి పరిహరించినాడు. విభాగమనగా అర్థప్రకరణ శోభితము. యుగానురూపమనగా ఈ కలియుగమునందు చెప్పుటకు తెలిసికొనుటకు (గ్రహించుటకు) ధారణ చేయుటకు అనువైనదని తాత్పర్యము.

**మూ॥** నిత్యోపయోగి నిర్బోధం సర్వాంగ **వ్యాపి భావతః**
సంగృహీతం విశేషణయత్ర కాయ చికిత్సితమ్.

***ప్రతిపదార్థము*** : యత్ర = ఏ గ్రంథమునందు; నిత్యోపయోగి = అను దినము **ఉపయోగపడునదియు**; దుర్బోధం = బోధించుటకు కష్టమైనదియు; భావతః = స్వభావముగా (తత్త్వముగా);కాయ చికిత్సితమ్ = కాయ చికిత్సాంగము; విశేషేణ = విశేషరూపమున; సంగృహీతం = సంగ్రహింపబడినది.

**తాత్పర్యము** : మరియు ఈ అష్టాంగ సంగ్రహమునందు అష్టాంగ

వ్యాపకమై నిత్యుపయోగియై బోధించుటకు క్లిష్టమైనట్టిదియునగు కాయచికిత్సా భాగము విశేషరూపముగా వర్ణింపబడినది.

**శశిలేఖ :** 'సర్వాంగవ్యాపి' అన్నప్పుడు సర్వశబ్దముచే కాయాంగమును విడిచి మిగిలిన ఏడు అంగములును గ్రహింపబడును. బాల చికిత్సయందు క్షీరజనిత రోగములను చెప్పినపుడు 'యథా స్వలింగాన్' అనియు ఊర్ధ్వాంగ రోగ చికిత్సయందు 'సర్వయోగ నిదానోక్తైః' అను ఈ మున్నగు ఇతరాంగ భాగములయందును కాయ చికిత్స వ్యాపించి యుండును. ద్రవ్య, రస, మాత్రా శీతయ, అన్నస్వరూప, స్నేహాద్యుపయోగ విజ్ఞానములు రోగచికిత్సయు కాయ చికిత్సాంతర్భూతములే యగును.

**వి.వ్యా :** సమస్త ప్రాణులకు నిత్యము అవసరమైనది కాయ చికిత్స యొక్కటియే. శల్య, శాలాక్య, బాల తంత్రములు మొదలగునవి ఆయుర్వేద శాస్త్రమునందు ఎనిమిది అంగములుగా విభజించి వర్ణించబడినవి. కాని ఈ శల్య శాలాక్యాది అంగముల వర్ణనము కాయచికిత్సకొరకే చేయబడినది. అందువలన ఈ అష్టాంగ సంగ్రహము అను గ్రంథమున కాయ చికిత్సను గురించి విశేషముగ విపులీకరణ గలదు.

**మూ॥** నమాత్రామాత్రమప్యత్ర కించిదాగమ వర్జితమ్
తేఽర్థాస్సగ్రంథ బంధశ్చ సంక్షేపాయక్రమోఽన్యథా.

**ప్రతిపదార్థము :** అత్ర = ఈ గ్రంథమునందు; మాత్రామాత్రమపి = అక్షరమాత్రమైనను; కించిత్ = ఇంచుకయు; ఆగమ వర్జితం న = శాస్త్రము విడిచి లేదు; తేఽర్థాః = అవియే అర్థములు; సః గ్రంథ బంధశ్చ = అదియే ఈ గ్రంథముయొక్క కూర్పును (కలదు); సంక్షేపాయ = సంక్షేపముగా చెప్పుట కొరకు (కుంచించుటకొరకు);అన్యథా = వేరొక; క్రమః = పద్ధతి; (ఆశ్రయింప బడినది)

**తాత్పర్యము :** శాస్త్రములయందలి అర్థములే వేరొక పద్ధతిగా సంక్షేపముగా చెప్పుటకొరకు ఈ గ్రంథమునందుకూర్చబడినవి. అంతేగాని ఈ గ్రంథము నందక్షరమాత్రమైనను శాస్త్రవిరుద్ధముగ కూర్చలేదు.

**శశిలేఖ :** మాత్రా అనగా అక్షర లేశము.

**వి.వ్యా :** ఈ గ్రంథమున ప్రాచీన ఆయుర్వేదాచార్యులు ఆయుర్వేద శాస్త్ర మూలసిద్ధాంతములను లవలేశమైనను వదలక వాటికి మూలచ్ఛేదములను గలిగించు అర్థములను కల్పించక శాస్త్రము నతిక్రమించక వ్రాసిరి. ఆయుర్వేద శాస్త్రమునందలి సమస్త విషయములను హేతువాద దృష్టాంత పూర్వకముగ వర్ణించుటయే ఈ గ్రంథమునకు విషయమై యున్నది. విషయములను ఉల్లేఖించునప్పుడు కొద్ది వాక్యములతో విశేషార్థములు ద్యోతకమగునట్లు

ఈ గ్రంథ రచన సాగినట్లు మన కవగతమగుచున్నది.

మూ॥ వాయుఃపిత్తం కఫశ్చేతి త్రయోదోషాః సమాసతః
ప్రత్యేకం తే త్రిధా వృద్ధిక్షయ సామ్యవిభేదతః
ఉత్కృష్ట మధ్యాల్పతయా త్రిధా వృద్ధిక్షయావపి
వికృతా వికృతా దేహం ఘ్నంతి తే వర్తయంతిచ

*ప్రతిపదార్థము*: వాయుః = వాతము; పిత్తం = పిత్తము; చ = మరియు; కఫః = కఫము; ఇతి = అని; సమాసతః = సంక్షేపముగా (క్లుప్తముగా); త్రయః = మూడు; దోషాః = దోషములు; భవంతి = ఉన్నవి. తే = ఆదోషములు మూడు; ప్రత్యేకం = వేరువేరుగా (ఒక్కొక్కటి); వృద్ధిక్షయసామ్య విభేదతః = ప్రకోప సామ్యహ్రాస భేదములవలన; త్రిధా = మూడుగా; భవంతి = ఉన్నవి; వృద్ధిక్షయావపి = వృద్ధిక్షయములుకూడ; ఉత్కృష్టమధ్యాల్పతయా = ఉత్కృష్టము, మధ్యము, అల్పము అని; త్రిధా = మూడుగా విభక్తాః = విభజించబడినవి; తే = ఆమూడు దోషములు; వికృతాస్సంతః = వికారమును చెందినవై; దేహం = శరీరమును; ఘ్నంతి = నాశనము చేయుచున్నవి. చ = మరియు; అవికృతాస్సంతః = వికారమును చెందక; దేహం = శరీరమును; వర్తయంతి = చక్కగా నడుపుచున్నవి.

*భావము*: వాతము, పిత్తము, శ్లేష్మము అను మూడు దోషములు శాస్త్రమునందు చెప్పబడినవి. ఈ దోషము లొక్కొక్కటి వృద్ధిక్షయ సామ్యములను చెంది మూడు విధములుగా నున్నవి. వృద్ధిక్షయములయందు ఉత్కృష్టము, మధ్యము, అల్పము అని విభాగము చేయబడుచున్నవి. ఈ మూడు దోషములు సమానస్థితిలో నున్నప్పుడు శరీరమును చక్కగా నడుపును. (ఆరోగ్యమును కాపాడును.) విధ్యాహారాదులచేత వికృతిని పొందినపుడు శరీరమును నశింపజేయును.

*శశిలేఖ*: ఈ తంత్రము ఆయుస్సును రక్షించుచున్నది. ఆయుస్సు అనగా జీవితము. ఈ జీవితము శరీరముతో ముడివడియున్నది. శరీరము దోషధాతువుల సముదాయముగానున్నది. దోషములనుండియే ధాతువుల ప్రవృత్తి ఏర్పడుచున్నందున ఈ శాస్త్రమునందు దోషములే ప్రధానములు. అందువలన వాతము మొదట పేర్కొనబడినది. మూడు దోషములు అని చెప్పుటవలన నాలుగవదోషము లేదని చెప్పినట్లయినది. 'సమాసతః' అనగా సంక్షేపముగా అని యర్థము. సంసర్గాది భేదములుకావు. వాతాదులు వేరువేరుగా మూడువిధములు. మూడువిధములెట్లనగా వృద్ధిక్షయ సామ్యభేదములవలన వాయువు వృద్ధము, వాయువు క్షీణము, వాయువు సమము. ఇట్లే పిత్తకఫములను గూడ గ్రహింపవలెను. ఆ వాతాది దోషములయొక్క నైసర్గిక స్వరూపమును దృష్టియందుంచుకొని వృద్ధిహ్రాసములను తెలిసికొనవలెను. వృద్ధిక్షయముల యందుకూడ ఉత్కృష్ట

వాయువు, మధ్యవాయువు, అల్పవాయువు అని తెలిసికొనవలయును. వాతాదుల స్వరూపమాత్రములుగానున్నప్పుడు శరీరమును పోషించుచున్నవి. వికృతి చెంది శరీరమును నశింపజేయుచున్నవి.

**వి.వ్యా :** ప్రకృతమునందు వాతపిత్త శ్లేష్మములను ధాతు సంజ్ఞల చేతనే చెప్పుట తగియున్నప్పటికిని అవి రసరక్తాదులను జెరచి వికారమును కలిగించుటలో సమర్థమైనవని తెలియపరచు నిమిత్తము దోషములని చెప్పబడినవి. 'వాయుఃపిత్తం కఫశ్చోక్తశ్శరీరే దోషసంగ్రహః' అను వాక్యముచేత చరకుడు వాతాదులను దోషములనియే నుడివినాడు. 'వాయుఃపిత్తం కఫశ్చేతి' అని వేరు వేరుగా విభజించి చెప్పుటవలన ఒక్కొక్క దానికి ప్రాధాన్యము చెప్పబడినది. కొద్ది మంది ఆచార్యులు రక్తమునకు స్థాన లక్షణకార్యవికార చికిత్సాదులను బట్టి దోషత్వమును చెప్పుచున్నారు. ఎట్లనగా రక్తమునకు స్థానము యకృత్ప్లీహములు. తామరపువ్వు బంగారు మొదలగు వానితో సమానవర్ణము గలిగి యుండుటయే లక్షణయే. శరీరము యొక్క ఉత్పత్తి స్థితులు క్రౌర్యము విసర్ప ప్లీహాదులు వికారములు. సిరావ్యధాది క్రియలు చికిత్సలు. పై కారణములచేత రక్తము కూడ నాలుగవ దోషముగా పరిగణింపబడుచున్నది అని కొందరాచార్యుల వాదము. అది యుక్తముకాదు. 'దూషయంతీతిదోషాః' అను వ్యుత్పత్తినిబట్టి వాతాది దోషములు రసరక్తాది ధాతువులను జెరచుట వలనను, రక్తాదులచేత వాతాదులు నొకప్పుడు దూష్యము కాకుండుట వలనను ప్రకృతి లక్షణ నిరూపణములో రక్తప్రకృతికి లక్షణము చెప్పబడినందునను జ్వరప్రకరణములో ఏ తంత్రమునందునను రక్త జ్వరము చెప్పబడియుండనందు వలనను రక్తము వాతాది దోషములలో నంతర్గతమైనది కాదు. మరియు విసర్పాదులు రక్త దోషము వలన నేర్పడునని చెప్పబడియుండినను ఘృతదుగ్ధ న్యాయముచే రక్తాంతర్గతమైన వాతాదులచేతనే జనించునని తెలియవలయును. 'దోషాః' అను బహువచన ప్రయోగముచేతనే దోషములు మూడు అని తెలియుచున్నను వాతపిత్త శ్లేష్మలకంటె వేరు దోషము మరియొకటిలేదని తెలియజేయుటకు 'త్రయం' అను పదము ప్రయోగింపబడినది. ఈ వాతాది దోషములు మూడు సంసర్గ సన్నిపాత వృద్ధి క్షయ భేదములచే అనేక విధములుగా పరిణమించుచున్నవని సూచించుటకై 'సమాసతః' అను పదము కూడ ప్రయోగింపబడినది. కావున వాతాదులు మూడే దోషములనియు రక్తము దోషము కాదనియు నిరూపింపబడినది.

మూ॥ తేవ్యాపినోఽపి హృన్నాభ్యోరధో మధ్యోర్ధ్వ సంశ్రయాః ॥

**ప్రతిపదార్థము :** తే = ఆవాతపిత్త శ్లేష్మములు; వ్యాపినోఽపి = సమస్త శరీరమునందు సంచరించుచున్నప్పటికిని; హృన్నాభ్యోః = హృదయము నాభికంటె; అధః = క్రిందుగాను; మధ్య = మధ్యభాగమునందును;

ఊర్ధ్వ = పై భాగమునందు; సంశ్రయాః = ఆశ్రయించియున్నవి (పొందియున్నవి).

**తాత్పర్యము :** సర్వశరీరమునందు వ్యాపించి యున్నప్పటికిని వాతాదులైన మూడు దోషములకు నియమితమైన స్థానములు గలవు. ఎట్లనగా నాభిక్రింద వాయుస్థానము, హృదయము మరియు నాభియొక్క మధ్యభాగము పిత్తస్థానము, హృదయమునకు పైభాగము కఫమునకు స్థానము.

**శశిలేఖ :** పై తాత్పర్యము నందలి విషయము సర్వతంత్రకారులు అంగీకరించిరి.

**మూ॥ వయోఽహోరాత్రి భుక్తానాం తేఽంత మధ్యాదిగాః క్రమాత్‌॥**

**ప్రతిపదార్థము:** తే=ఆ వాతపిత్తశ్లేష్మములు; వయః = బాల్యాది వయస్సు; అహః=పగలు; రాత్రి=రాత్రి; భుక్తానాం=భోజనము వీటికి; క్రమాత్‌=వరుసగా; అంత-మధ్య-ఆదిగాః=చివర, మధ్య, మొదటనుండునవి; స్యుః=అగును.

**తాత్పర్యము :** సర్వకాలములందు వ్యాపకములయినప్పటికిని ఈ వాతపిత్తశ్లేష్మములు క్రమముగా బాల్యవయస్సులో కఫము, మధ్య వయసులో పిత్తము, అంతిమ వయసులో వాతము అట్లే ప్రాతఃకాలమున కఫము, మధ్యాహ్నమున పిత్తము, సాయంకాలమున వాతము, రాత్రి ప్రారంభమున కఫము, మధ్యరాత్రిలో పిత్తము, రాత్రి చివరిలో వాతము, భోజనము యొక్క ఆది మధ్యాంతములందు క్రమముగా కఫపిత్తవాతములు ప్రకోపమును బొందును.

**శశిలేఖ :** ఈ దోషములు సర్వశరీర వ్యాపకములైనప్పటికిని సమస్త కాలములందు వ్యాపించియున్నప్పటికిని వీటికి ప్రకోపములుకలవని తెలియజేయుటకు 'వయో ఽ హోరాత్రి భుక్తానాం' అను సూత్రమును ఇచట ప్రవేశపెట్టిరి. పై తాత్పర్యమునందలి విషయములే ఈ వ్యాఖ్యానము నందును ఉట్టంకించిరి.

**వి. వ్యా :** వాతాదిదోషములు సర్వకాలములయందు శరీరమున సంచరించుచుండును. అయినను పురుషాయుస్సు, దినము, రాత్రి, భోజనము వీని యొక్క అంత్యమధ్య ఆదిభాగములయందు వాతపిత్తశ్లేష్మములు వరుసగా విశేషించి వృద్ధిచెందును. ఇచట ఈ విశేషమును గ్రహించవలెను. భోజనము యొక్క అంత్యభాగమునందు (అనగా జఠరాగ్ని సంయోగమువలన రసాదులకు గలుగు జీర్ణప్రాయమైన యవస్థయందు) వాతమును, మధ్యభాగము నందు (అనగా విదాహావస్థయందు) పిత్తమును, ఆది భాగమునందు (అనగా భుజించిన ఆహారము మాధుర్యమును జెందు కాలమునందు) కఫమును వృద్ధిజెందును. జాఠరాగ్ని సంయోగము వలన నాహారమునకు సూక్ష్మమైన యనేకావస్థలు కలుగు

చుండును. ఐనను "ఆదౌ షడ్రస మప్యన్నం మధురీభూతమీరయేత్, ఫేన భూతం కఫం యాతం విదాహో దమ్లతాంతతః

పిత్తమామాశయా త్కుర్యాచ్చ్యవమానంచ్యుతం పునః
అగ్నినాశోషితం పక్వం పిండితం కటుమారుతమ్"

అను వచన ప్రకారము ఆహారమునకు గలుగు పూర్వోక్త అంత మధ్య ఆద్యావస్థలే మిక్కుటముగా నుపయోగించుటవలన నిచట నామూడు అవస్థలే చెప్పబడినవి.

మూ॥ తైర్భవేద్విషమస్తీక్ష్ణో మందశ్చాగ్నిస్సమైస్సమః॥

**ప్రతిపదార్థము :** తైః = వాతాదులచేత; పురుషస్య = పురుషునికి; అగ్నిః = జఠరాగ్ని; విషయః = విషయముగా; తీక్ష్ణః = తీక్ష్ణము; మందః = మందము; సమైః = మూడింటి యొక్క సామ్యావస్థచేత; సమః = సమముగా; భవేత్ = అగును.

**తాత్పర్యము :** జఠరాగ్ని నాలుగు విధములు. ఈ వాతాదిదోషముల యొక్క కారణముల వలననే మనుష్యులకు క్రమముగా విషమాగ్ని, తీక్ష్ణాగ్ని మరియు మందాగ్నిగా అగుచున్నది. అదే పై మూడు దోషముల యొక్క సామ్యావస్థయందు అగ్నికూడా సమముగా నుండును.

**శశిలేఖ :** ఏ ఒక్కదోషము తక్కువగానప్పటికిని శరీర నిర్మాణము చేయజాలదు. అందువలన అన్ని దోషములు సామ్యావస్థ యందుండుట ఆవశ్యకము. ఈ మూడుదోషములలో ఏ ఒక్కదోషము ఎక్కువగానున్నప్పటికిని అగ్నియొక్క విషమాద్యవస్థ లేర్పడును. ఎట్లనగా వాతోత్కర్షముచేత అగ్ని విషయముగాను, పిత్తోత్కర్షముచేత తీక్ష్ణముగాను, కఫోత్కర్షముచే మందముగాను, సమముగా నున్నప్పుడు సమముగను ఉండును. మరియు వాతమునకు యోగవాతహిత్వముండుట వలన వాతపిత్తములు ఉత్కృష్టములై నపుడు తీక్ష్ణత్వము, వాతకఫముల ఉత్కర్షవలన మందత్వము మరియు పిత్తా కఫములు ఆహార విశేషము వలన ఒకప్పుడు తీక్ష్ణత్వమును ఒకప్పుడు మాంద్యమును ద్విదోషజ సంసర్గము వలన కలుగును.

మూ॥ కోష్ఠః క్రూరో మృదుర్మధ్యో మధ్యస్స్యాత్తైస్సమైరపి॥

**ప్రతిపదార్థము :** తైః = ఆవాతాదులచేత; కోష్ఠః = కోష్ఠము; క్రూరః = క్రూరము; మృదుః = మృదువు; మధ్య = మధ్యమము (అగును); తైస్సమైరపి = వాతాదుల యొక్క సమత్వముతోకూడ; మధ్యం = మధ్యమము; స్యాత్ = అగును

**తాత్పర్యము :** పూర్వక్రమానుసారము ఈవాతాది దోషములద్వారా మనుష్యుని యొక్క కోష్ఠము క్రూరమృదు మధ్యములుగా అగుచున్నది. దోష

త్రయ సమావస్థయందు మధ్యముగా నుండును.

**శశిలేఖ :** ప్రకృతి ననుసరించి మనుష్యునియొక్క కోష్ఠము వాత ప్రాబల్యము వలన క్రూర కోష్ఠముగను, పిత్త ప్రాబల్యము వలన మృదుకోష్ఠము గను, కఫ ప్రాబల్యము వలన మధ్యమకోష్ఠముగను ఉండును. మూడు దోషముల యొక్క సమస్థితి యందును మధ్యమముగనే యుండును.

**మూ॥** శుక్రార్తవస్థైర్జన్మాదౌ విషేణేవ విషక్రమేః
**తైశ్చతిస్రః ప్రకృతయో హీన మధ్యోత్తమాఃపృథక్॥**

**ప్రతిపదార్థము :** జన్మాదౌ=గర్భదానకాలమందు; శుక్రార్తవస్థైః=శుక్ర శోణితముల యందు స్వప్రమాణాధికముగ సంబంధించి యుండునవియైన; తైః=ఆవాతపిత్త శ్లేష్మములచేత; విశేణ=విషముచే; విషక్రియేరిన=విష్క్రిమి జనించినట్లు; పృథక్=వేరుగా; హీనమధ్యోత్తమాః=హీనము మధ్యము ఉత్తమ మనెడి; తిస్రః=మూడు విధములైన; ప్రకృతయః=ప్రకృతులు; జాయన్తే= ఏర్పడుచున్నవి (కలుగుచున్నవి).

**తాత్పర్యము :** గర్భదాన కాలమందు దూషణ స్వభావము గలవియు, శుక్రశోణితములయందు స్వప్రమాణాధికముగ సంబంధించియుండునవియునైన వాతాది దోషములచేత హీనము, మధ్యము, ఉత్తమము అను మూడుప్రకృతులు "ప్రాణహారమైన విషముచే విష్క్రిములు పుట్టు విధమున" జనించును.

**శశిలేఖ :** విషయోనులకు ఇతరులను చంపు స్వభావము నైసర్గికమైన ప్పటికి అవి విషముతోనే ప్రకృతి స్వరూపమును సంపాదించుచున్నవి. ఇట్లే దూషణ స్వభావము కలవైనప్పటికిని దోషములచేత ప్రకృతుల ప్రాధాన్యతకల ప్రకృతులకు ఎట్టి హానిని కలిగించవు. "పృథక్" అని శ్లోకమునందు నిర్దేశించి చెప్పుట వలన సంవర్గ సన్నిపాతాదులు కూడ చెప్పినట్లయినది. అందువలన ఏడు ప్రకృతులు వివక్షితములు. వాయు వాధిక్యతచేత హీన ప్రకృతి, పిత్తాధిక్యతచేత మధ్యమ ప్రకృతి, కఫాధిక్యముతో ఉత్తమ ప్రకృతి ఏర్పడుచున్నది. న్యూనాధిక్యము లేక సమస్థితి నుండు వాతాది దోషములచేత నాల్గవదియైన సమ ప్రకృతి ఏర్పడుచున్నది. ఈ నాలుగుప్రకృతులలో సమ ప్రకృతి చాల శ్రేష్ఠమైనది. ద్విదోష సంసర్గము వలన మూడు ప్రకృతులు జనించును. మొత్తము ఏడు ప్రకృతులని గ్రహించవలెను.

**వి. వ్యా. :** ప్రకృతియనగా శరీర స్వరూపము. శుక్రమనగా పితృ సంబంధమైన మూడు లేక నాలుగు బిందువులుగల రేతస్సు. శోణితమనగా ఋతుకాలము నందు స్రవించెడి మాతృసంబంధమైన రెండు లేక మూడు బిందువుల స్వరూపముగల శోణితము.

**మూ॥** సమధాతుస్సమస్తాసు శ్రేష్ఠా నింద్యా ద్విదోషజాః॥

**ప్రతిపదార్థము :** సమస్తాసు=అన్ని ప్రకృతులలో, సమధాతుః=

మూడు దోషముల సామ్యావస్థవలన జనించు సమప్రకృతి; శ్రేష్ఠా=ఉత్తమ మైనది. ద్విదోషజాః=రెండు దోషములవలన ఏర్పడు ప్రకృతులు; నింద్యాః= గర్హ్యములు (శ్రేష్ఠములు కావు.)

తాత్పర్యము :— సమప్రకృతి ఉత్తమమైనది. రెండేసి దోషముల వలన జనించు ప్రకృతులు శ్రేష్ఠములు కావు.

**శశిలేఖ** : ఇచట ధాతు శబ్దము దోషపర్యాయముగ ప్రయోగింప బడి నది. 'ధారణాద్ధాతవః' అని ధాతు శబ్దమునకు 'ధరించుట వలన' అను నర్థము చేయబడినది.

**మూ॥ తత్ర రూక్షో లఘుశ్శీతః ఖరస్సూక్ష్మశ్చలో౽నిలః ॥**
**పిత్తం సస్నేహ తీక్ష్ణోష్ణం లఘువిస్రం సరం ద్రవమ్ ।**
**స్నిగ్ధశ్శీతో గురుర్మందః శ్లక్ష్ణో మృత్స్నః స్థిరః కఫః ॥**

**ప్రతిపదార్థము** : తత్ర=ఆమూడు దోషములలో; అనిలః = వాయువు రూక్ష=రూక్షత్వము; లఘుః=లఘుత్వము; శీతః=శీతము; ఖరః=కాఠిన్యము; సూక్ష్మః=సూక్ష్మము; చలః=ఎల్లప్పుడు చలించు స్వభావము; (ఈ ఆరుగుణ ములును వాతము కలిగియుండును); పిత్తం=పిత్తము; సస్నేహ తీక్ష్ణోష్ణం= ఒకింత స్నిగ్ధము, శీఘ్రకారిత్వము, ఉష్ణముతో కూడియుండునదియు; లఘు= లఘువుగ (తేలికగ); విస్రం=దుర్గంధముగ; సరం=ఊర్ధ్వాధో భాగముల యందు వ్యాపించునట్టి స్వభావము గలదిగ; శ్లక్ష్ణః=మృదువుగ; మృత్స్నః=పిచ్ఛిల ముగ; స్థిరః=ఒకేచోట ఉండు స్వభావము గలది (కఫము ఈ ఏడు గుణములను కలిగి యుండును.)

**తాత్పర్యము** : వాతము పై జెప్పబడిన రూక్షాది ఆరుగుణములను, పిత్తము స్నేహాది ఏడు గుణములను, కఫము స్నిగ్ధాది ఏడు గుణములను కలిగి యుండును.

**శశిలేఖ** : దోషములైన వాతాదుల యొక్క ప్రకృత్యాదులకు కారణ త్వము చెప్పబడినది. వాటి స్వరూపము తెలుపబడకుండుటచే దానిని తెలిసి కొనుటకై పై త్రిదోషముల గుణములు చెప్పబడినవి. ఈ విధముగ వాతాది దోషముల యొక్క స్వరూపము తెలిసిన యెడల వాతాదులు కారణముగాగల రోగ సమూహమునకు ఆయాదోష విశేష గుణములు సర్వత్ర చెప్పక పోయి నప్పటికిని ఒక్కొక్క దోషము యొక్క వృద్ధిహ్రాసములు వాటియొక్క సమాన అసమానత్వములు మరియు వాటి కారణత్వము ఈ సూత్రమున తెలిసికొన వచ్చును.

**మూ॥ సంసర్గ సన్నిపాతశ్చ తద్విత్రిక్షయ కోపతః।**
**తా షోఢా దశధా చోక్తా వృత్కర్షాది వికల్పనాత్ ॥**

*ప్రతిపదార్థము:* సంసర్గః = రెండు దోషముల కలయిక; చ = మరియు; సన్నిపాతః = మూడుదోషములకు కూడలి; తద్విత్రిక్షయ కోపతః = దోషముల యొక్క రెండు లేక మూడింటి యొక్కసంసర్గము, షోఢా = ఆరుగా; దశధా = పదివిధములుగా; ఉత్కర్షాది వికల్పనాత్ = ఉత్కర్షము మొదలగు భేదముల వలన; ఉక్తా = చెప్పబడినవి.

**తాత్పర్యము :** రెండుదోషములు మూడుదోషములయొక్క కలయిక వలన సంసర్గ సన్నిపాతములను వ్యవహారము కలిగి యున్నవి. రెండు లేక మూడింటియొక్క క్షయ ప్రకోపముల వలన ఆరు లేక పదివిధముల భేదములను చెందుచున్నవి. మరియు ఆదోషముల యొక్క ఉత్కర్ష మధ్య హ్రాసములను గూడ ఇచట గుర్తించ వలయును.

*శశిలేఖ :* క్షీణించిన లేదా ప్రకోపించిన రెండు దోషముల కలయికను సంసర్గము అనియు మూడు దోషముల కలయికను సన్నిపాతమనియు చెప్పుచున్నారు.

**మూ॥ రసాసృఙ్మాంస మేధోఽస్థి మజ్జా శుక్రాణి ధాతవః**
**సప్తదూష్యాః, మలామూత్ర శకృత్స్వేదాద యోఽపిచ ॥**

*ప్రతిపదార్థము:* రసాసృఙ్మాంసమేధోఽస్థిమజ్జాశుక్రాణి = రసమురక్తము మాంసము మేధస్సు అస్థిమజ్జ శుక్రములు; ధాతవః = ధాతువులు; సప్త = ఈ ఏడు ; దూష్యాః = దూష్యములు; చ = మరియు; మూత్ర శకృత్స్వేదా దయోఽపి = మూత్రము, మలము, స్వేదము మొదలగునవి; మలాః = మలము లుగ; అస్మిన్ శరీరే = ఈ శరీరములో; వర్తన్తే = ఉన్నవి.

**తాత్పర్యము :** రసము, రక్తము, మాంసము, మేధస్సు, అస్థి, మజ్జ, శుక్రము ఈ ఏడును దూష్యములనియు, మలమూత్ర స్వేదాదులు మలముల నియు పేర్కొనినారు. ఈ రసరక్తాదులు ఏడు శరీరమునకు పోషకములు కావున ధాతు సంజ్ఞను (శరీరధారణాద్ధాతవః) ఆ రసరక్తాదులు వాతాది మూడు దోష ములచేత దూషింపబడుట చేత (చెడగొట్టబడుట చేత) (దూషయంతీతి దోషాః) దూషణములుగాను వ్యవహరింప బడు చున్నవి. ఆది శబ్దము వలన సమస్త శరరీము నందలి మలములు గ్రాహ్యాములు.

**మూ॥ రసాదిస్థేషు దోషేషు వ్యాధయః సంభవన్తి యే**
**తజ్జా నిత్యుపచారేణ తానాహుర్ఘృత దాహవత్ ॥**

*ప్రతిపదార్థము:* రసాదిస్థేషు = రసాదిధాతువులయందు; దోషేషు = దోషము లుండగా; యే = ఎట్టి; వ్యాధయః = వ్యాధులు (రోగములు); సంభవన్తి = కలుగు చున్నవో వానిని; తజ్జాన్ = ఆధాతువులందు పుట్టునవి; ఇతి = అని; ఉపచారేణ = గౌణముగా; తాన్ = వాటిని; ఘృతదాహవత్ = నెయ్యి కాలు చున్న

దనునట్లుగా; ఆహుః = చెప్పుదురు.

**తాత్పర్యము** : దోషములే సమస్త వ్యాధులకు కారణములుగానున్నవి. ధాతువులకు మలములకు రోగకారణత్వము చెప్పుట గౌణము. (ఎట్లనగా నెయ్యి కాలుచున్నది యన్నట్లు ఘృతమునకు కాల్చు శక్తి ఎప్పుడును ఉండదు. కాని ఘృతమునందలి అగ్నికి కాల్చు స్వభావము కలదు. ఘృతము నందలి అగ్ని వలన కాలినప్పటికి లోకములో ఘృతమే కాలుటకు కారణము అనుట స్వభావము. ఇట్లే పై వ్యాఖ్య చేయబడినది. ఇ ధి గౌణము)

**మూ॥** ప్రీణనం జీవనం లేపః స్నేహో ధారణపూరణే
గర్భోత్పాదశ్చ కర్మాణి ధాతూనాం క్రమశో విదుః॥

**ప్రతిపదార్థము** : ప్రీణనం = మనసునకు సంతోషము; జీవనం = ప్రాణములకు జీవితము; లేపః = మాంసమునకు లేపము; స్నేహః = శరీరమునకుస్నిగ్ధత్వము (నునుపుదనము); ధారణ = శరీరధారణము (శరీరమును ధరించుట); పూరణమ్ = అస్థులను పూరించుట; గర్భోత్పాదః = గర్భమును కలిగించుట; క్రమశః = క్రమముగా; ధాతూనాం = రసాదిధాతువులయొక్క; కర్మాణి = కర్మలను (చేయు కృత్యములను) విదుః = చెప్పిరి.

**తాత్పర్యము** : రసాది సప్తధాతువులలో క్రమముగా రసము మనస్సునకు సంతోషమును, రక్తము ప్రాణులకు జీవితమును, మాంసము లేపనమును, మేధస్సు స్నిగ్ధత్వమును (శరీరమునకు నునుపుదనమును) అస్థులు శరీరధారణమును, మజ్జ అస్థిపూరణము (అస్థులయొక్క మధ్యభాగమును పూరించుట) శుక్రము గర్భోత్పాదనమును గలిగించును అని భావము.

**శశిలేఖ** : రసాది సప్తధాతువులు శరీరమును ధరించుచున్నవి, (పోషించుచున్నవి) అస్థులు లేనియెడల మాంసమునకు ఆలంబనము ఉండదు. అందువలన శరీరధారణమున అస్థులు ప్రధానపాత్ర వహించుచున్నవనుటకు ధారణత్వము చెప్పబడినది.

**మూ॥** శరీరం ధారయన్త్యేతే ధాత్వాహారాశ్చ సర్వదా॥

**ప్రతిపదార్థము** : ఏతే = ఈ ధాతువులును; సర్వదా = ఎల్లప్పుడు; శరీరం = షడ్ధాత్వాత్మకమగు శరీరమును; ధారయన్తి = ధరించుచున్నవి (పోషించు చున్నవి); చ = మరియు; ధాత్వాహారాశ్చ = ధాతువులకు ఆహారములుగా కూడ అగును.

**తాత్పర్యము** : ఈ ధాతువులు జీవితపర్యంతము శరీరమును ధరించును. ఈ ధాతువులే ధాతువులకు ఆహారములుగా కూడ అగును.

**శశిలేఖ** : అనంతరోక్తములైన ధాతువులు శరీరమును ధరించును. జంతు

వులకు ఆహారము ఎట్లు వృద్ధికారణమో అట్లే పూర్వధాతువు ఉత్తర ధాతువునకు ఆహారమై వృద్ధికి కారణమగును.

మూ॥ వృద్ధిస్సమానై స్సర్వేషాం విపరీతై ర్విపర్యయః॥

**ప్రతిపదార్థము :** సర్వేషాం=అన్ని దోషములకు; సమానైః=సమాన గుణములచేత; వృద్ధిః=వృద్ధి; విపరీతైః=విరుద్ధగుణములచేత; విపర్యయః=వ్యతిరేకము అగును.

**తాత్పర్యము :** వాతాదిదోషములకు సమాన గుణములచేత వృద్ధియు, విరుద్ధగుణసేవనచేత వ్యతిరేకము ఏర్పడును.

**శశిలేఖ :** ఏ పదార్థము దానికి సమానమైన అంశముచేత ఆ పదార్థముతో సమానాంశముగల పదార్థమునకు వృద్ధికారణమగును. ఎట్లనగా వాయువునకు ద్రవ్యస్వభావముచేత మరియొక వాయువు సమానమగును. ఆ వాయువునకే లాఘవ రౌక్ష్యగుణములు, సరణాదిరూపమైనక్రియగల మిరియములు సమానములు. ఒక వస్తువునకు మరియొక వస్తువు ఒకదానితో సాదృశ్యము, మరియొకదానితో వైపరీత్యము ఒకేమారు సంభవింపవచ్చును. ఇట్లు చెప్పినందువలన వృద్ధి హాని లక్షణము యొక్క ప్రవృత్తికి ఎట్టి విపరీతమును ఏర్పడదు. ఏమైనప్పటికిని ఒక వస్తువునకు మరియొక వస్తువుయొక్క అంశముచేత సాదృశ్యము, అదే అంశముచేత వైపరీత్యము కూడ ఏర్పడును. అనగా వృద్ధి హాని లక్షణములు రెండింటికిని ఒకేమారు కారణత్వము చెప్పబడినది. ఎందుకనగా ఒక ద్రవ్యమునందు విరుద్ధకారణములైన రెండు కూడ ఉండుటవలన ఇచట స్వభావమునుగూడ ప్రధానముగా చెప్పుచు ద్రవరూపమైన కల్లుతో ద్రవరూప సామాన్యమైన స్తన్యముయొక్క వృద్ధి చెప్పబడుచున్నది.

**వి.వ్యా. :-** శరీరము నాశ్రయించియుండు దోషధాతు మలములకు సమానమైన ద్రవ్యములచేత వృద్ధియును, విరుద్ధమైన వానిచేత క్షయమును కలుగును. మరియు ఆ వృద్ధిక్షయములు రెండును ద్రవ్యము, గుణము, కర్మ వీని భేదముచేత మూడు విధములుగా అగును. మాంసముచేత పృథివీభూత సంబంధమైన మాంసము వృద్ధిచెందును. పాలలోపుట్టిన నెయ్యిచేత ఉదక స్వరూపముగల శుక్రము వృద్ధిచెందును. మిరియములు, జీడిగింజలు మొదలగు ద్రవ్యములచేత బుద్ధి, అగ్నిదీపనము మొదలగునవి వృద్ధిచెందును. ఇట్లు ద్రవ్యముచే వృద్ధిని గ్రహించవలెను. పృథివీ సంబంధమైన ఖర్జూరము, అరటి మొదలగు ద్రవ్యములయొక్క గురుత్వశైత్యాది గుణములచేత ఉదక స్వరూపమైన కఫము వృద్ధిచెందును. ఇట్లు సమానమైన గుణములచేత వృద్ధిని గ్రహించవలెను. పరుగెత్తుట, దుముకుట మొదలగు చలన స్వరూపముగల శారీరక క్రియలచేత వాతము వృద్ధిచెందును. మనస్సంతాపకరమైన కోపము, అసూయ మొదలగు మానసిక క్రియలచేత పిత్తము వృద్ధిచెందును. నిద్ర, సుఖము, శయ

నము మొదలగు క్రియలు స్థిరముగా ఉండుటచేత కఫము వృద్ధిచెందును.

అడవి గోధుమల అన్నముచేత మాంసము క్షయించును. క్షారములచేత కఫము క్షీణించును. నిద్ర, ఆలస్యము మొదలగు స్థిరస్వభావముగల క్రియలచేత వాతము క్షయించును. ఉష్ణ, తీక్ష్ణగుణములుగల ఆరనాళముచేత కఫముక్షయించును. ఈ ప్రకారము ద్రవ్యగుణ క్రియాదులచేత దోషధాతు మలాదుల యొక్క వృద్ధి క్షయములను తెలిసికొనవలయును.

మూ॥ రసాః స్వాదమ్ల లవణ తిక్తోషణకషాయకాః ।
షడ్ద్రవ్యమాశ్రితాస్తే చ యథాపూర్వం బలావహాః ॥

**ప్రతిపదార్థము** : స్వాదమ్ల లవణ తిక్తోషణకషాయకాః - మధుర = తీపి, ఆమ్ల = పులుపు, లవణ = ఉప్పు, తిక్త = చేదు, ఊషణ = కారము, కషాయ = వగరులయిన; రసాః = రసములు; షట్ = ఆరు, ద్రవ్యం = పాంచభౌతిక ద్రవ్యమును; ఆశ్రితాః = ఆశ్రయించియున్నవి; తేచ = ఆ మధురాదిరసములుకూడ; యథాపూర్వం = పూర్వము నతిక్రమించకుండ; బలావహాః = శక్తినిచేకూర్చునవి.

**తాత్పర్యము** : తీపి, పులుపు, ఉప్పు, చేదు, కారము, వగరు అను ఆరు రసములు ద్రవ్యమును ఆశ్రయించి యుండును. వీనికి అవినాభావ సంబంధము. ఈ ఆరు రసములు స్వభావమునుబట్టి వెనుకటినుండి ఒకదానికన్న వొకటి శక్తిని ప్రసాదించునదిగా ఉన్నది. ఉదాహరణమునకు కషాయరసమునకంటె ఊషణ రసము శక్తివర్ధకము. ఇట్లే తక్కినవి గ్రహింపవలెను.

**శశిలేఖ** : రసనేంద్రియము చేత గ్రహించుట వలన రసాః అని చెప్పబడినది. పంచభూతాత్మకము, నిర్విశేషము అయి మూర్తి గలిగిన ద్రవ్యమును ఆశ్రయించి యున్నవి. ఇచట ద్రవ్యమును ఆశ్రయించిన రసాదులు ఏరసము ఏ రసమునకంటె పూర్వమో ఆ రస స్వభావ విశేషమువలన బలమును చేకూర్చునవి.

మూ॥ తత్రాద్యా మారుతం ఘ్నంతి త్రయ స్తిక్తాదయః కఫం ।
కషాయ తిక్తమధురాః పిత్తమన్యేతు కుర్వతే॥

**ప్రతిపదార్థము** : తత్ర = ఆరసములయందు; ఆద్యాః = మొదటివైన; త్రయః = మధుర, ఆమ్ల, లవణ రసములు మూడు; మారుతం = వాతమును; ఘ్నంతి = నశింప జేయుచున్నవి; తిక్తాదయః = తిక్త, ఊషణ, కషాయరసములు; త్రయః = మూడు, కఫం = కఫమును, ఘ్నంతి = నశింపచేయును; కషాయ తిక్తమధురాః = కషాయతిక్తమధుర రసములు; త్రయః = మూడు, పిత్తం = పిత్తమును, ఘ్నంతి = నశింపచేయును, అన్యేతు = ఈ చెప్పబడిన వానికన్న ఇతరములైన రసములు, (దోషాన్ = వాతాది దోషములను); కుర్వతే = చేయుచున్నవి.

**తాత్పర్యము** : మధురాది రసములు మూడు, తిక్తాదిరసములుమూడు క్రమముగా వాతనాశకములు, వర్ధకములుగా నున్నవి. తిక్తాదిరసములు మూడు మధురాది రసములు మూడు క్రమముగా కఫనాశకములు, వర్ధకములుగా నున్నవి. కషాయతిక్తమధుర రసములు, ఆమ్ల లవణ ఊషణ రసములు క్రమముగా పిత్తమునకు నాశనములుగా, వృద్ధికరములుగా ఉన్నవి.

**శశిలేఖ** : ఇచట విశేషముగా ఇట్లు చెప్పబడుచున్నది. మధుర రసము వాత పిత్తములను నశింపచేయును. శ్లేష్మములను వృద్ధిపరచును. ఆమ్లరసము వాతమును నశింపజేసి కఫ పిత్తములను జనింపజేయును. లవణరసము వాయువును నశింపజేసి కఫ పిత్తములను జనింపజేయును. తిక్తరసము కఫపిత్తములను నశింపజేసి వాతమును కలిగించును. కటు రసము కఫము నశింపజేసి వాత పిత్తములను కలిగించును. కషాయరసము కఫపిత్తములను నశింపజేసి వాతమును కలిగించుచున్నది.

**మూ॥** శమనం కోపనం స్వస్థహితం ద్రవ్యమితి త్రిధా॥

**ప్రతిపదార్థము**; శమనం = శమనము; కోపనం = ప్రకోపము చేయునది; స్వస్థహితం = ఆరోగ్యవంతులకు పథ్యమైనది; ఇతి = అని; ద్రవ్యం = ద్రవ్యము; త్రిధా = మూడువిధములు.

**తాత్పర్యము**: శమనము, కోపనము, స్వస్థహితము అని ద్రవ్యము మూడు విధములుగా నుండును.

**శశిలేఖ**: పై చెప్పిన మధురాది షడ్రసములకు ఆశ్రయమైన ద్రవ్యము రసాదులను ఆక్షేపించక ప్రభావము వలననే **శమనాదులను** కలిగించును. విశిష్ట రసాదులచే కూడుకొన్న **గుడూచీ** (తిప్పతీగ) మొదలగు ద్రవ్యములు ప్రకోపించిన వాతాది దోషములను శమింపచేయును. యవకము (కాకు మినుములు) పటలము (ధాన్యవిశేషము), మినుములు, లేత మున్నంగి, సంయోగ విరుద్ధము లగు క్షీర మత్స్యాదులు కోపన ద్రవ్యములన బరగును. ఋతుచర్య, మాత్రాశితీయాధ్యాయము అందు ప్రతిదినము సేవించుటకు యోగ్యమైన యవలు, గోధుమలు, ఎఱ్ఱరాజనాలు, దివ్యోదకము, క్షీరము, బలకరము, రసాయన వాజీకరణోప యోగములగు ద్రవ్యములు స్వస్థహితద్రవ్యము లన బరంగును.

వి.వ్యా: స్నేహము, గురుత్వాది గుణములు, విపరీత గుణములుగల వాతమును శమింపజేయును. ఘృతము, మాధుర్యము మొదలగునవి విపరీత గుణములుగల పిత్తమును శమింపజేయును. తేనె. రూక్ష, తీక్ష్ణ, కషాయ గుణములు గలవి యగుటవలన విపరీతగుణములుగల కఫమును శమింపజేయును.

**మూ॥** ఉష్ణశీత గుణోత్కర్షా త్తత్ర వీర్యం ద్విధాస్మృతమ్॥

ప్రతిపదార్థము: తత్ర = ఆద్రవ్యమునందు; ఉష్ణశీతగుణోత్కర్షాత్ = ఉష్ణ

గుణాధిక్యత శీతగుణాధిక్యతల వలన, వీర్యం = వీర్యము; ద్విధా = రెండువిధము లుగా, స్మృతమ్ = చెప్పబడినది.

**తాత్పర్యము:** ఆ ద్రవ్యము నందలి వీర్యము ఉష్ణగుణాధిక్యము వలన ఉష్ణవీర్యమనియు శీతగుణాధిక్యమువలన శీతవీర్యమనియు రెండు విధములుగా చెప్పబడినది.

**శశిలేఖ:** ద్రవ్యమునందు ఉష్ణగుణాధిక్యత వలన ఉష్ణవీర్యము శీతగుణాధిక్యత వలన శీతవీర్యము అని రెండు విధములు. ఎట్లైనను ద్రవ్యమంతయు పాంచ భౌతికము. అట్లైనప్పటికిని సూర్యచంద్రుల వలన సమస్యయైన భావము లకు కొంచెము ఉష్ణగుణము ఎక్కువగా నున్నందువలన దానితోనే కార్యము జరుగుచున్నందున ఉష్ణవీర్యముగా చెప్పబడు చున్నవి. దానికి విపరీతమైనది శీత వీర్యము. వీర్యమనగా శక్తి మరియు కార్యకారణ హేతువు.

శ్లో॥ త్రిధావిపాకో ద్రవ్యస్యస్వాద్వమ్ల కటుకాత్మకః॥

**ప్రతిపదార్థము:** ద్రవ్యస్య = ద్రవ్యముయొక్క; విపాకః = విపాకము; స్వాద్వమ్ల కటుకాత్మకః = మధుర, ఆమ్ల, కటుకములుగా; త్రిధా = మూడువిధములు.

**తాత్పర్యము:** ద్రవ్యము మూడువిధములైన విపాకములను చెందును. ఎట్లనగా మధురవిపాకము, అమ్లవిపాకము, కటువిపాకము అని.

**శశిలేఖ:** సమస్త ద్రవ్యములకు జఠరాగ్ని సంబంధమువలన విపాకను (స్వస్వరూపముమారుట) మూడువిధములు. మధుర లవణరసములు మధుర విపాకముగాను, కటుతిక్త కషాయరసములు కటువిపాకముగాను పరిణతి చెందును.

**మూ॥ గురుమంద హిమస్నిగ్ధ శ్లక్ష్ణసాంద్రమృదుస్థిరాః**
**గుణాస్ససూక్ష్మ విశదావింశతిస్సవిపర్యయాః॥**

**ప్రతిపదార్థము:** గురుమంద హిమస్నిగ్ధ శ్లక్ష్ణసాంద్రమృదుస్థిరాః = గురుత్వ మాంద్య, హిమ, స్నిగ్ధ, శ్లక్ష్ణ, సాంద్ర, మృదుత్వ, స్థిరములు; ససూక్ష్మవిశదాః = సూక్ష్మవిశదములతో కూడిన; గుణాః = గుణములు; సవిపర్యయాః = విపరీతగుణములతో కూడ; వింశతిః = ఇరువది గుణములుగా; భవంతి = అగు చున్నవి.

**తాత్పర్యము:** గుర్వాది గుణములు ఇరువది. ఈ ఇరువది గుణములు ద్రవ్యము నాశ్రయించి యుండును. ప్రతి ద్రవ్యమునకు విపరీతగుణముల తోడ నిరువది గుణములు కలిగి యుండును.

**శశిలేఖ:** ద్రవ్యము నాశ్రయించి యుండు గుర్వాదులు విపరీతగుణము లతో జేరి ఇరువదిగ నగును. అది ఎట్లనగా గురుత్వమునకు లఘుత్వము విపరీతగుణము, మాంద్యమునకు తీక్ష్ణము విపరీతము, హిమమునకు ఉష్ణము విప

రీతము, స్నిగ్ధమునకు రూక్షము విపరీతము, శ్లక్ష్ణమునకు ఖరము విపరీతము, సాంద్రమునకు ద్రవము విపరీతము, మృదువునకు కాఠిన్యము విపరీతము, స్థిరమునకు సరము విపరీతము, సూక్ష్మమునకు స్థూలము విపరీతము, విశదమునకు పిచ్ఛిలము విపరీతము, అని గుర్వాదులకు విపరీత గుణములను తెలియవలెను.

**మూ॥** ఇంద్రియార్థావ్యవాయీ చ వికాషీ చాపరేగుణాః॥

**ప్రతిపదార్థము:** అపిచ=మరియు; ఇంద్రియార్థాః=ఇంద్రియార్థములైన శబ్దస్పర్శ రూపరసగంధములు, వ్యవాయీ=వ్యవాయి; చ=మరియు; వికాషీ = వికాసి; అపరే=పై చెప్పిన వాటికంటె ఇతరములైన: గుణాః = గుణములు.

**తాత్పర్యము:** పై జెప్పిన ఇరువదిగుణములుకాక ఇంద్రియార్థములైన శబ్దస్పర్శరూపరసగంధములు: వ్యవాయి, వికాషి ఇవియును గుణములుగా చెప్పవలెను. వ్యవాయి, వికాషి ముందు శ్లోకములలో వివరింపబడును.

**శశిలేఖ :** పై చెప్పినవాటికంటె ఇతరములైన గుణములుగా శబ్దాదులనుగా చేర్చి చెప్పవలయును.

**మూ॥** వ్యవాయీదేహమఖిలం వ్యాప్యపాకాయకల్పతే।
వికాషీ వికసన్ ధాతూన్ సంధిబంధాన్ విముంచతి।
సరతీక్ష్ణ ప్రకర్షౌతుకైశ్చిత్తౌ పరికీర్తితౌ॥

**ప్రతిపదార్థము :** అఖిలం=సమస్తమైన; దేహం=శరీరమును; వ్యాప్య=వ్యాపించి;పాకాయ కల్పతే=పాకమును చేయుచున్నదో;సః=అది;వ్యవాయీ=వ్యవాయి; ధాతూన్=ధాతువులను;వికషన్=వికసించుచూ; సంబంధాన్=సంబంధములను; విముంచతి=నాశనము చేయుచున్నదో; సః=అది; వికాషీ=వికాషి; కైశ్చిత్=కొందరాచార్యులు; తౌ=అవ్యవాయీవికాషలను; సరతీక్ష్ణప్రకర్షౌ=సరప్రకర్ష తీక్ష్ణప్రకర్షకములుగా; పరికీర్తితౌ=కల్పించిరి.

**తాత్పర్యము :** ఏద్రవ్యము సర్వశరీరమును వ్యాపించి పాకమును చేయుచున్నదో ఆద్రవ్యము వ్యవాయిద్రవ్యమనియు, సమస్తధాతువులను హింసించుచు సంధి బంధములను నాశనము చేయుచున్నదో అది వికాషి ద్రవ్యమనియు వ్యవహరింపబడుచున్నది. కొందరాచార్యులు వ్యవాయి సరగుణ మెక్కువ కలదనియు, వికాషి తీక్ష్ణగుణమెక్కువగలదనియు కూడ చెప్పుచున్నారు.

**మూ॥** కాలార్థకర్మణాం యోగోహీనమిథ్యాతిమాత్రకః
సమ్యగ్యోగశ్చ విజ్ఞేయో రోగారోగ్యైక కారణమ్॥

**ప్రతిపదార్థము :** కాలార్థకర్మణాం=కాల అర్థకర్మలయొక్క; హీన మిథ్యాతి మాత్రకః యోగః = హీనయోగము,మిథ్యాయోగము, అతిమాత్ర

యోగము; సమ్యగ్యోగశ్చ=మరియు సమ్యగ్యోగము; రోగారోగ్యైక కారణమ్=రోగఆరోగ్యకారణముగా; విజ్ఞేయః=తెలియవలెను.

**తాత్పర్యము :** కాలార్థకర్మలయొక్క హీనయోగ,మిథ్యాయోగ, అతియోగములు సమ్యగ్యోగము రోగ ఆరోగ్యకారణముగా తెలియవలెను.

**శశిలేఖ :** దోషముల యొక్క వృద్ధిహ్రాసములు రోగమునకు కారణముగా చెప్పబడినవి. కాల అర్థకర్మలయొక్క అతియోగాదుల వలన ఏర్పడిన దోషముల యొక్క వృద్ధిహ్రాసములు రోగాదులు జనించుటకు కారణముగా చెప్పబడినది. కాలము శీత ఉష్ణ వర్ష భేదములచేత మూడువిధములు. కాలము యొక్క స్వరూపమునకు హాని కలుగుట హీనయోగము. స్వరూపము యొక్క అతిశయము అతియోగము. స్వరూపవైపరీత్యము మిథ్యాయోగము. "అర్థాః" అనగా ఇంద్రియార్థములైన శబ్దాదులు అని అర్థము. ఆ శబ్దాదులకు ఇంద్రియములతో అల్ప సంయోగము, సంయోగాభావము, హీనయోగము, అత్యంత సంయోగము అతియోగము. ఇష్టములేని ద్రవ్యములతో సంబంధము మిథ్యాయోగము. కాయవాఙ్మనస్సుల యొక్క క్రియ (చేష్ట) కర్మయని చెప్పబడును. కర్మయొక్క హీన ప్రవృత్తి హీనయోగము,అతిప్రవృత్తి అతియోగము. వేగోధరణాదులు మిథ్యాయోగము. అన్నింటియొక్క సమానమైన ప్రవృత్తి సమయోగముఅని తెలిసికొన వలయును.హీనయోగ అతియోగమిథ్యాయోగములు మూడు రోగకారణములు. కాలార్థకర్మలయొక్క సమ్యగ్యోగము ఆరోగ్యకారణముగాను చెప్పబడినది.

**మూ॥ సత్త్వం రజస్తమశ్చేతి త్రయః ప్రోక్తామహాగుణాః॥**

**ప్రతిపదార్థము :** (తంత్రే = ఈ తంత్రమునందు; వ్యవహారార్థమ్ = వ్యవహారముకొరకు) సత్త్వంరజస్తమశ్చేతి = సత్వరజస్తమస్సులని; మహాగుణాః =మహాగుణములు; త్రయః=మూడుగా: ప్రోక్తాః=చెప్పబడినవి.

**తాత్పర్యము :** సత్వరజస్తమోగుణములు మూడు మహాగుణములుగా ఈ తంత్రమునందు చెప్పబడినవి.

**మూ॥ నిజాగంతు విభాగేన రోగాశ్చ ద్వివిధామతాః॥**

**ప్రతిపదార్థము :** నిజాగంతు విభాగేన = నిజఆగంతుభేదముచేత రోగాః=రోగములు, ద్వివిధాః=రెండువిధములుగా; మతాః=చెప్పబడినవి.

**తాత్పర్యము :** పై చెప్పబడిన రోగారోగ్యములలో రోగము నిజము, ఆగంతుకమని రెండువిధములు.

**శశిలేఖ:**ఆహార విహారములచేత దోషము ప్రకోపించుచున్నదో ఆదోషము వలన కలుగు బాధ నిజరోగమనియు, అభిఘాతాదులవలన సంభవించు దోషకోపము ఆగంతుకరోగమనియు చెప్పబడినది.

**మూ॥** రోగస్తు దోషవైషమ్యం దోషసామ్యమరోగతా॥

**ప్రతిపదార్థము:** దోషవైషమ్యం = దోషములయొక్క వైషమ్యము; రోగః=రోగము; దోషసామ్యం = దోషములయొక్క సామ్యము;అరోగతా = ఆరోగ్యము.

**తాత్పర్యము :** వాతాది దోషములలో నొకటికైనను, రెంటికైనను, మూటికైనను స్వప్రమాణమునకంటె వృద్ధియైనను క్షయమైనను గలిగినయెడల రోగము సంభవించును. వాతాదిదోషములు హెచ్చుతగ్గులులేక సమముగా సంచరించుచుండిన ఆరోగ్యము సంభవించుచుండును.

శశిలేఖ : విషమత్వమనగా స్వస్థానము నుండికదలుటయని అర్థము.

**మూ॥** తేషాంకాయ **మనోభేదాదధిష్ఠానమపి ద్విధా॥**

**ప్రతిపదార్థము :** తేషాం = ఆ రోగములకు; కాయమనోభేదాత్ = కాయ = శరీరము; మనః = మనస్సు అను; భేదాత్ = భేదమువలన; అధిష్ఠానమపి = స్థానము కూడ, ద్విధా = రెండు విధములు.

**తాత్పర్యము :** నిజాగంతుకరోగములకు శరీరము మనస్సు అనునవి రెండు ఆశ్రయములుగా నుండును.

***శశిలేఖ :*** జ్వరము రక్తపిత్తము మొదలగువాటికిశరీరము, రాగద్వేషాదులకు మనస్సు అధిష్ఠానము.

**మూ.** రజస్తమశ్చమనసోద్వౌచ దోషా **వుదాహృతౌ,**

**ప్రతిపదార్థము :** రజః=రజోగుణము, తమఃచ=తమోగుణమును; ద్వౌ=రెండు; మనసః = మనస్సుయొక్క; దోషౌ = దోషములుగా; ఉదాహృతౌ=చెప్పబడినవి.

**తాత్పర్యము:** రజోగుణము తమోగుణము అను రెండు గుణములు మనస్సునకు సంబంధించిన దోషములుగా శాస్త్రమునందు చెప్పబడినవి.

***శశిలేఖ :*** రోగములకు వాతాదులు కారణములు అని చెప్పబడినవి. అవి శారీరకరోగములకేగాని మానసికరోగములకు కారణములు కాకుండుట వలన మానసదోషములను చెప్పదలచి ఈ సూత్రమునందు రజస్తమస్సులను దోషములుగా చెప్పబడినవి.

**మూ॥** దర్శన స్పర్శన ప్రశ్నైః పరీక్షేతచ **రోగిణమ్॥**

ప్రతిపదార్థము : దర్శన=చూచుట; స్పర్శన=తాకుట; ప్రశ్నైఃచ= ప్రశ్నించుట చేతను; రోగిణమ్=రోగగ్రస్తుని; పరీక్షేత; =పరీక్షించవలెను.

**తాత్పర్యము:** చూచుట, తాకుట, ప్రశ్నించుట **ఈ మూడు** విధము

లైన పద్ధతుల ద్వారా వ్యాధిపీడితుని పరీక్షింపవలెను.

**శశిలేఖ;** దృష్టితో (కంటితో) వర్ణము మొదలగువాటిని, స్పర్శనముతో శరీరసంతాపము, విద్రధి మొదలగు వాటియందలి కఠినత్వాదులను ప్రశ్నముతో శూల అరోచకము మొదలగువాటిని తెలుసుకొనదగినది.

**మూ॥** జాంగలం వాతభూయిష్ఠమానూపంతుకఫోల్బణమ్।
సాధారణం సమలం త్రిధా భూదేశమాదిశేత్॥

**ప్రతిపదార్థము :** భూదేశం = దేశభేదము చేత భూమిని; వాతభూయిష్ఠం = స్వల్పోదకం కలిగి వృక్షపర్వతాదులతో గూడియుండునది; జాంగలం = జాంగలమనియు; కఫోల్బణమ్ = అధికమైన జలవృక్షములతో గూడి గాలిఎండ లేకుండెడిది; ఆనూపం = ఆనూపమనియు; సమమలం = జాంగల ఆనూపదేశ లక్షణములతోగూడియుండునది; సాధారణం = సాధారణదేశమనియు; త్రిధా = మూడు విధములుగా; ఆదిశేత్ = తెలిసికొనవలెను.

**తాత్పర్యము:** భూప్రదేశము జాంగల్యము, ఆనూపము, సాధారణము అని మూడు విధములు. వాతాధిక్యము గలది జాంగలమనియు, కఫాధిక్యము గలది ఆనూపమనియు, వాతాది దోషములు సమముగా నుండునది సాధారణ దేశమనియు తెలిసికొనవలెను.

**శశిలేఖ :** స్వల్పోదకము గలిగి వృక్షపర్వతాదులతో కూడియుండునది జాంగల దేశము. ఇది వాతాధిక్యము గలది యగుటచేత ఆదేశము నందు పుట్టిన మృగ పురుష పక్షి ఓషధులు మొదలగునవి వాతాధిక్యము గలవై యుండును. అధికమైన జలవృక్షములతో గూడి కఫాధిక్యము గలవి ఆనూప దేశమనబడును. ఈదేశమునందు జనించిన ఓషధులు మొదలగునవి కఫాదిక్యము గలవియై స్నిగ్ధములుగా నుండును. వాతాది దోషములు సమముగా నుండి జాంగల ఆనూపదేశ లక్షణములతో కూడి యుండు ప్రదేశము సాధారణ దేశమనబడును.

**మూ॥** క్షణాదిర్వ్యాధ్యవస్థాచ కాలో భైషజ్యయోగకృత్

**ప్రతిపదార్థము:** కాలః = కాలము; క్షణాదిః = క్షణాది స్వరూపముగను, వ్యాధ్యవస్థాచ = వ్యాధ్యవస్థా స్వరూపముగను, భైషజ్యయోగకృత్ = భేషజమునకు రోగికి సంబంధము చేయుచున్నది.

**తాత్పర్యము :** క్షణాది స్వరూపముగను, వ్యాధ్యవస్థాస్వరూపముగను కాలము రెండు విధములు. ఈ రెండు విధములైన కాలములు రోగికి ఔషధమునకు సంబంధమును కలిగించును.

**శశిలేఖ :** కాలము క్షణాది, వ్యాధ్యవస్థాయని రెండువిధములు. క్షణాది కాలము ప్రసిద్ధము. వ్యాధ్యవస్థాకాలము వ్యాధియొక్క పురాణత్వము నూతనత్వము విశిష్ట లక్షణములను తెలియజేయును. రెండు కాలములు రోగికి ఔషధమునకు సంబంధమును కలిగించును. క్షణాది అను ఆది శబ్దమువలన లవ, త్రుటి, ముహూర్త, యామ, అహోరాత్ర, పక్ష, మాస, ఋతు ఆయన, సతవత్సరములను గ్రహించవలెను. "పూర్వాహ్ణేవమనం దేయం,

మధ్యాహ్నేతు విరేచనమ్, మధ్యాహ్నే కించి దావృత్తే వస్తిం దద్యాది విచ క్షణః" అనగా పూర్వాహ్ణము నందు వమనమును, మధ్యాహ్నమునందు విరేచనమును, మధ్యాహ్నము కొంతమానిని పిదప వస్తి కర్మను చేయించవలెననెడికాలము క్షణాదికాలమనబడును ,"లంఘనం స్వేదనం కాలోయ వాగూస్తిక్తకోరసః, మలానాం పాచనానిస్యుః యథావస్థం క్రమేణవాజ్వరేసేయాః కషాయాశ్చ సర్పిః క్షీరం విరేచనం, త్ర్యహంవాషడహం వింద్యాద్వీక్ష్య దోష బలాబలమ్. మృదుర్జ్వరోలఘుర్దేహాశ్చలితాశ్చమలాయదా, అచిరజ్వరితస్యాపి భేషజం యోజయేత్తదా" అనగా యుక్తకాలమునందు లంఘనము, స్వేదకర్మ యవాగూపానము చేదైన కషాయాదులను త్రాగుట ఇవి యథా క్రమముగా నాయారోగావస్థకు తగిన విధముగ వాతాది మలములను పచనము చేయును. దోష బలాబలములను బట్టి మూడు లేక ఆరు దినములు గడచిన జ్వరములో పానము చేయతగిన కషాయ క్షీర విరోచనముల నివ్వవలయును. జ్వరము మృదువుగను శరీరము తేలికగను మలములు స్థానమునుండి చలించి నవిగ నుండు నపుడు నవజ్వరితునికి కూడ ఔషధము నియ్యవలయును. ఈవిధముగా రోగముల యొక్క సామ-నిరామ - మృదు - మధ్య - తీక్ష్ణాద్యవస్థలకు సరియగు ఔషధమునీయవలెననెడి కాలము వాధ్యవస్థా కాలమనబడును.

**మూ॥** శోధనం శమనంచేతి సమాసాదౌషధంద్విధా॥

**ప్రతిపదార్థము** ; శోధనం = శోధనమనియు; శమనంచేతి = శమనమనియు;సమాసాత్ = సంగ్రహముగా;ఔషధం = ఔషధముద్విధా = రెండువిధములు

**తాత్పర్యము :** ఔషధము సంగ్రహముగా శోధనము, శమనము అని రెండు విధములు.

**శశిలేఖ :** కాలము రోగికిని ఔషధమునకును సంబంధమును కల్పించునని చెప్పబడినది. ఇందువలన ఆవిషయమును సంపూర్ణముగా ఆకళించుకొనుటకు సూత్రము 'శోధనమ్' అని ప్రారంభింపబడినది. ద్రవ్యముగాని ఇతర అభిచారిక క్రియలలో ఉపయోగించు వస్తుజాలముగాని ప్రకోపించిన దోషములను నశింపజేయుటకు ఉపయోగించుచున్నారు. అదియే ఔషధముగా చెప్పబడుచున్నది. సంగ్రహ ముగా శోధనము, శమనమని ఔషధము రెండు విధములు. శోధనమనగా ఏది ప్రకోపించిన దోషములను వెలుపలికి నెట్టి రోగోపశమనమును చేయుచున్నదో అది. శమనమనగా ఏది స్వస్థానమందున్న దోషములనే సమాన స్థాయిలోనుంచునో అది.

**వి.వ్యా. :** ఔషధములు అనేక భేదములు కలవియైనను అవన్నియు శోధన శమనమను ఈ రెండు విధములగు ఔషధములలో అంతర్భవించుటచేత ఔషధము రెండువిధములని చెప్పబడినది. వాతాదిదోషములు మిథ్యాహార విహారాదులచేత ప్రకోపించినపుడు వాటిని వెలిపరచి రోగమును శమింపజేయు ఔషధము శోధనౌషధమని చెప్పుదురు. ప్రకోపించిన వాతాది దోషములను స్వస్థానమునందే శమింపజేసి ఆ దోషములకు సమత్వమును కలుగజేసెడి ఔషధమును శమనౌషధమందురు.

మూ॥ శరీరజానాం దోషాణాం క్రమేణ పరమౌషధమ్।
వస్తిర్విరేకోవమనం తథాతైలం ఘృతంమధు॥
ధీధైర్యాత్మాది విజ్ఞానంతునో దోషౌషధం పరమ్॥

**ప్రతిపదార్థము :** వస్తిః = వస్తి; విరేకః = విరేచనము; వమనమ్ = వమనము; తథా = మరియును; తైలం = తైలము (నూనె); ఘృతం = నెయ్యి; మధు = తేనె; క్రమేణ = క్రమముగా; శరీరజానాం = శరీరము నందుద్భవించిన, దోషాణాం = దోషములకు; పరమౌషధం = ఉత్కృష్టమైన ఔషధము; ధీధైర్యాత్మాదివిజ్ఞానం...; ధీ = బుద్ధి: ధైర్య = దృఢచిత్తము; ఆత్మాది = యోగాభ్యాసాదులచే పరమాత్మస్వరూపమును తెలిసికొనుట మొదలగు; విజ్ఞానం = విజ్ఞానము, మనోదోషౌషధంపరమ్ = మనోదోషములగు రజస్తమోగుణములకు ఉత్కృష్టమైన ఔషధము.

**శశిలేఖ :** స్నేహక్వాథాది రూపమైన వస్తి గుదమార్గమున చేయదగినది. ఈ వస్తి వాతమునకుఉత్కృష్టమైన ఔషధము. నోటితో త్రాగబడి, ఆశయములందున్న మరియు అమాద్యవస్థలలో నున్న పిత్తమును గుదము ద్వారా వెలిపరచునది విరేకము. నోటితో త్రాగబడి నోటిద్వారా శ్లేష్మములను వెలిపరచునది వమనమనబడును. ఈ విధముగా శోధనము చేయుటచే ఇవి దోషములకు ముఖ్యౌషధము లగును. ఇదే విధముగా వాతాది దోషములకు శమన విధానము చెప్పబడెను. తైలము వాతమునకు, ఘృతము పిత్తమునకు తేనే శ్లేష్మమునకు ముఖ్య శామకద్రవ్యములు. బుద్ధి ధైర్యము మొదలగునవి మనో దోషములగు రాగమునకు విఘ్నకరులగు రజస్తమోగుణములను నివారించుటలో ప్రధాన ఔషధము లగును. కాల పరిస్థితి ననుసరించి అన్నియును అన్నివేళలందు ఉపయోగపడును.

మూ॥ తంత్రస్యాఽస్యపరంచాతో వక్ష్యతేఽధ్యాయ సంగ్రహః।

**ప్రతిపదార్థము :** అతః = అందువలన; అస్య = ఈ; తంత్రస్య = అష్టాంగ సంగ్రహమను గ్రంథమునకు; పరం = ఉత్కృష్టమైన; అధ్యాయసంగ్రహఃచ = అధ్యాయము యొక్క సంక్షేపము; వక్ష్యతే = చెప్పబడుచున్నది.

**తాత్పర్యము:** అష్టాంగ సంగ్రహమను నీ గ్రంథము సులభముగా సుపస్థితిలో నుండుట కొరకు అధ్యాయములు సంక్షేపముగా చెప్పబడుచున్నవి.

**శశిలేఖ :** అష్టాంగ సంగ్రహమను పేరు గల నీ తంత్రము సుఖముగా ఉపస్థితి యందుండుటకై అధ్యాయములను సంగ్రహముగా చెప్పుచున్నాడు.

మూ. ఆయుష్కామీయ శిష్యార్థదినర్తువ్యాధ్య సంభవాః।
ద్రవాన్నజ్ఞాన సంరక్షా విరుద్ధాన్నాన్నపానికాః।
మాత్రాశితౌషధజ్ఞాన శ్రేష్ఠ శుభ్యాది సంగ్రహాః।
మహాకషాయ వివిధ ద్రవ్యాది రసభేదకాః।

దోషాదిజ్ఞాన తద్భేద తచ్చికిత్సా రోగ భేషజమ్।
ద్వ్యౌషధ స్నేహన స్వేద శుద్ధ్యాస్థాపన నావనమ్।
ధూమ గండూష దృక్సేక తృప్తి యన్త్రజలౌకసః॥
సిరావిధిశ్శల్య విధి శ్శస్త్రక్షారాగ్ని కర్మకాః।
చత్వారింశదిమే ఽ ధ్యాయాస్సూత్రమ్॥

**తాత్పర్యము** : సూత్రస్థానము నందు ఆయుష్కామీయము, శిష్యోపనయ నీయము, దినచర్య, ఋతుచర్య, రోగానుత్పాదనీయము, ద్రవద్రవ్య విజ్ఞానీ యము, అన్నపానవిధి, మాత్రాశితీయము, ద్వివిధౌషధజ్ఞానీయము; అగ్ర్య సంగ్రహము, శోధనాది గణ సంగ్రహము, మహాకషాయ సంగ్రహము, వివిధ ద్రవ్యసంగ్రహము, ద్రవ్యాది విజ్ఞానీయము, రసభేదీయము, దోషాది జ్ఞానీయము, దోషభేదీయము, దోషోపక్రమణీయము, రోగభేదీయము, భేషజావచరణీయము ద్వివిధోపక్రమణీయము, స్నేహవిధి, స్వేదవిధి, వమన విరేచనవిధి, వస్తివిధి, నస్యవిధి, ధూమపానవిధి, గండూషాదివిధి,ఆశ్చ్యోతనాంజనవిధి, తర్పణపుటపాక విధి, శస్త్రకర్మవిధి, క్షారపాకవిధి, అగ్నికర్మవిధి, అని నలుబది అధ్యాయములు కలిగి యుండును.

వి.వ్యా. "సూచ్యతే అనేన సకలస్తంత్రార్థః" అను వ్యుత్పత్తి నాధార ముగా చేసికొని ఈ తంత్రము నందలి సకలార్థములను సూచించినందున ఇది సూత్రస్థానమని పేరుపొందెను.

మూ॥ శారీరముచ్యతే॥
పుత్రార్థ గర్భావక్రాంతి చర్యావ్యాపచ్ఛరీరజాః
సిరామర్మ ప్రకృతాఖ్యావికృతాంగే హితామయాః॥
సదూతా ద్వాదశాధ్యాయాః॥

**తాత్పర్యము** : శరీరస్థానమునందు పుత్రకామీయము, గర్భావక్రాంతి, గర్భోపచరణీయము, గర్భవ్యాపదము, అంగవిభాగము, సిరావిభాగము, మర్మ విభాగము, ప్రకృతిభేదీయము; వికృతి జ్ఞానీయము, వికృతేహా విజ్ఞానీయము, వికృతవ్యాధి విజ్ఞానీయము, దూతాది విజ్ఞానీయము అను పండ్రెండు అధ్యాయ ములు కలిగి యుండును.

మూ॥ నిదానం సార్వరోగికమ్।
జ్వరాసృక్ శ్వాస యక్ష్మాది మదాద్యర్శోతిసారిణామ్॥
మూత్రాఘాత ప్రమేహాణాం విద్రధ్యాద్యుదరస్యచ।
పాండు కుష్ఠ నిలార్తానాం వాతాస్రస్యచషోడశ॥

**తాత్పర్యము** : నిదానస్థానమునందు : సర్వరోగ నిదానము, జ్వర నిదానము, రక్తపిత్త నిదానము, శ్వాసహిధ్మానిదానము, యక్ష్మాది నిదానము, మదాత్యయనిదానము, అర్శోనిదానము, అతిసార నిదానము, ఉదర

నిదానము; పాండురోగ నిదానము, కుష్ఠనిదానము, వాతవ్యాధి నిదానము, వాతశోణిత నిదానము అని పదునారు అధ్యాయములు ఉండును.

మూ॥ చికిత్సాన్వర యోదస్రకాసయోః శ్వాస యత్నయోః।
వమౌమదాత్యయేఽర్శసువిశిద్వౌ ద్వేచ మూత్రితే॥
విద్రధౌ గుల్మజఠర పాండు శోఫవిసర్పిషు।
కుష్ఠశ్విత్రానిలవ్యాధివాతాస్రేషు చికిత్సితమ్॥
చతుర్వింశతి రధ్యాయాః-

**తాత్పర్యము** : చికిత్సాస్థానమునందు: జ్వరచికిత్స, జీర్ణజ్వర చికిత్స, రక్తపిత్త చికిత్స, కాసచికిత్స, క్షతక్షయకాసచికిత్స, శ్వాసచికిత్స, అతిసార చికిత్స, గ్రహణీదోషచికిత్స, మూత్రాఘాత చికిత్స, ప్రమేహ చికిత్స, శోఫచికిత్స, విసర్పచికిత్స, కుష్ఠచికిత్స, శ్విత్రచికిత్స, వాతవ్యాధిచికిత్స, వాతశోణిత చికిత్స అని ఇరువదినాలుగు అధ్యాయములు గలవు.

మూ॥ కల్పసిద్ధిరతః పరమ్।
కల్పోవమేర్విరేకస్య తత్సిద్ధిర్వస్తికల్పనా ॥
కల్పశ్చసిద్ధవస్తీనాం సిద్ధిర్వస్త్యమం వాసయోః।
ద్రవ్యకల్పోఽష్టమః॥

**తాత్పర్యము** : కల్పస్థానమునందు — వమనకల్పము, విరేచన కల్పము, వమనవిరేచన వ్యాపత్సిద్ధికల్పము, వస్తికల్పము, సిద్ధవస్తికల్పము, వస్తివ్యాపత్సిద్ధికల్పము, అనువాసన వ్యాపత్సిద్ధికల్పము, ద్రవ్యకల్పము అని ఎనిమిది అధ్యాయములు కల్పస్థానమునందు చెప్పబడినవి.

మూ॥ స్థానమత ఉత్తరమ్.
బాలోపచరణే వ్యాధిగ్రహజ్ఞాన నిషేధనే।
స్నానే పృథగ్రహే భూతే ద్వావున్మాదే స్మృతిక్షయే॥
వర్త్మ సంధిగతాద్వౌదౌ దృక్తమో లింగనాశిషు।
సర్వాస్వక్ష్యంద దృక్కాపకే కర్ణనాసాముఖేషుచ।
మూర్ధ్నివ్రణే తథా ద్వౌద్వౌ సద్యోభంగే భగందరే॥
గ్రంథ్యాదౌక్షుద్రరోగేషు గుహ్యరోగే పృథగ్ద్వయమ్।
విషే ద్వౌభుజగే కీటే ద్వౌచ లూతాసుమూషికే॥
విషేవిషోపయోగేచ తథాఽధ్యాయో రసాయనే।
వాజీకరణ ముద్దిశ్యపంచాశోఽష్టాంగపూరణః॥

**తాత్పర్యము** : ఉత్తరస్థానమునందు — బాలోపచరణీయము, బాలామయప్రతిషేధము, బాలగ్రహవిజ్ఞానీయము, బాలగ్రహప్రతిషేధము, స్నానవిధి, ప్రత్యేక గ్రహప్రతిషేధము, భూతగ్రహవిజ్ఞానీయము, భూతగ్రహప్రతిషేధము, ఉన్మాదప్రతిషేధము, అపస్మారప్రతిషేధము, వర్త్మరోగ

విజ్ఞానము, వర్త్మరోగప్రతిషేధము, సంధిసితాసిత రోగవిజ్ఞానీయము, సంధి సితాసిత రోగప్రతిషేధము, దృష్టిరోగ విజ్ఞానీయము, తిమిరప్రతిషేధము, అంగ నాశప్రతిషేధము, సర్వాక్షిరోగ విజ్ఞానీయము, అభిష్యంద ప్రతిషేధము, దృష్టి పాకప్రతిషేధము, కర్ణరోగ విజ్ఞానీయము, కర్ణరోగప్రతిషేధము, నానారోగ విజ్ఞానీయము, నానారోగప్రతిషేధము, ముఖరోగ విజ్ఞానీయము, ముఖరోగ ప్రతిషేధము, శిరోరోగ విజ్ఞానీయము, శిరోరోగ ప్రతిషేధము, వ్రణవిభక్తి విజ్ఞానీయము, వ్రణవిభక్తిప్రతిషేధము, సద్యోవ్రణప్రతిషేధము, భంగప్రతి షేధము, భంగంధర ప్రతిషేధము, క్షుద్రరోగ విజ్ఞానీయము, క్షుద్రరోగప్రతి షేధము, గుహ్యరోగ విజ్ఞానీయము, గుహ్యరోగప్రతిషేధము, విషప్రతి షేధము, సర్పాది దంష్ట్రా విజ్ఞానీయము, సర్పాది దంష్ట్రాప్రతిషేధము, కీటకప్రతిషేధము, లూతాదివిజ్ఞానము, లూతాదిప్రతిషేధము, ప్రత్యేక లూతాది ప్రతిషేధము, మూషికాలర్కప్రతిషేధము, విషోపద్రవప్రతిషేధము, విషోప యోగీయము; రసాయనాధ్యాయము, వాజీకరణాధ్యాయము అని యాభై అధ్యాయములు చెప్పబడినవి.

మూ. **పంచాశదధ్యాయశతం షడ్భిః స్థానైస్సమీరితమ్।**

**తాత్పర్యము :** నూటయాభై అధ్యాయములు ఆరుస్థానములు ఈ అష్టాంగసంగ్రహమునందు విపులీకరింపబడినవి.

ప్రథమాధ్యాయము ముగిసినది

# అష్టాంగసంగ్రహ వ్యాఖ్యానము

## ద్వితీయాధ్యాయము

మూ॥ అథాఽత శ్శిష్యోపనయనీయ మధ్యాయం వ్యాఖ్యాస్యామః
ఇతి హ స్మాహు రాత్రేయాదయో మహర్షయః॥

**ప్రతిపదార్థము :** అథః = అటుతరువాత; అతః = అందువలన; శిష్యోపనయనీయం = శిష్యునియొక్క దీక్షను గురించిన; అధ్యాయమ్ = అధ్యాయమును: వ్యాఖ్యాస్యామః = వ్యాఖ్యానించెదము: ఇతిహ = ఇదేవిధముగా; ఆత్రేయాదయః = ఆత్రేయుడు మొదలగు; మహర్షయః = మహర్షులు: అహుస్మ = పలికిరి;

**తాత్పర్యము :** ప్రథమాధ్యాయము నందు ఈ అష్టాంగసంగ్రహ తంత్రమునకు కావలసిన విషయములను సూత్రప్రాయముగ చెప్పి తరువాత శిష్య తంత్రమును ఈ అధ్యాయము నందు ఆత్రేయాది మహర్షులు ఎట్లు పలికిరో అట్లు న్యూనాధికము లేకుండు నట్లుగ వ్యాఖ్యానించెదమని ప్రతిజ్ఞా పూర్వకముగా ఈ గ్రంథకారుడీ అధ్యాయమును ప్రారంభించుచున్నాడు.

**శశిలేఖ :** ఉపనయనం = దీక్షా, తదధికృత్యకృతోధ్యాయ = శిష్యోపనయనీయః, తం = శిష్యోపనయనీయమ్. శిష్యునియొక్క దీక్షను గురించి చెప్పునదియని అర్థము.

**వి. వ్యా :** వైదిక ధర్మప్రతిష్ఠాపకులగు బ్రాహ్మణులకు మొదటనే ఉపనయనము జరిగియుండును. 'గర్భాష్టమే బ్రాహ్మణముపనయీత' అనికదా వైదిక ధర్మము ఘోషించుచున్నది. అయినను ఆయుర్వేదపఠనము నారంభించు సమయమున మరల దీక్షా స్వీకారము విధింపబడుచున్నది. ఋగ్యజుస్సామాది విధుల నాచరించు సాంప్రదాయ వైదిక బ్రాహ్మణులకు అథర్వణ వేదపఠనము విధివిహితముగ కానరాదు. అథర్వణ వేదమున కంగభూతములైన ఆయుర్వేద ధనుర్వేదాది విద్యల నారంభించు సమయమున దీక్షను స్వీకరించవలసిన అవసరము కలదు. కావున ఇచట శిష్యునికి ఆయుర్వేద పఠనకాలమున దీక్ష విధింపబడు చున్నది.

మూ॥ గురుభక్తోఽభియుక్తోఽతియుక్తోధీస్మృతిపాటవైః।
ఋజ్వాస్య నాసానయన స్తను స్నిగ్ధ నఖచ్ఛవిః॥
బ్రహ్మచారీ జితద్వన్ద్వో ధీరస్సుచరితః స్థిరః।

**షణ్మాసానుషితశ్శక్లో లజ్జా శౌచ కులాన్వితః॥**
**శిష్యోఽధ్యాప్యోగతో యావదన్తం తంత్రార్థ కర్మణామ్॥**

ప్రతిపదార్థము : గురుభక్తః=ఆచార్యుని యందు భక్తిగలవాడు; అభియుక్తః=శాస్త్రాధ్యయనము నందు ప్రయత్నశీలుడును; ధీస్మృతిపాటవైః; ధీ=గ్రహణశక్తి, స్మృతి=స్మరణశక్తి, పాటవైః = ఇంద్రియముల యొక్క పటుత్వముచే; అతియుక్తః=కూడుకొని యున్నవాడు; ఋజ్వాస్యనాసానయనః=స్పష్టమైన ముఖము, ముక్కు, నేత్రములు కలవాడు; తనుస్నిగ్ధనఖచ్ఛవిః=తనుస్నిగ్ధ=స్నేహముతో కూడిన శరీరము; నఖచ్ఛవిః=కాంతివంతమైన గోళ్ళు కలవాడు; బ్రహ్మచారీ=వేదాధ్యయన తత్పరుడు (అస్ఖలిత వీర్యము కలవాడు); జితద్వంద్వః=రజస్తమోగుణములను జయించినవాడు; ధీరః=భయరహితుడు; సుచరితః=సచ్చరితుడు; స్థిరః=అచంచల స్వభావము కలవాడు; షణ్మాసాత్=ఆరుమాసములనుండి, (ఉపాధ్యాయునిని), ఉషితః=సేవించినవాడు; శక్లః=ప్రియభాషి; లజ్జా శౌచకులాన్వితః; లజ్జా=అభిమానవంతుడును; శౌచకులాన్వితః=సత్కుల సంజాతుడునువగు; శిష్యః=శిష్యుడు, యావత్=ఎంతవరకైతే; తంత్రార్థకర్మణాం=శాస్త్రము యొక్క అర్థము కర్మాభ్యాసముల యొక్క; అంతమ్=చివరను: గతః=పొందునో; (తావత్=అంతవరకు); అధ్యాప్యః=అధ్యయనము చేయించ తగినవాడు.

శశిలేఖ ; దీనితో శిష్యుని యొక్క మంచి చెడు స్వభావములను ఉపాధ్యాయుడు తెలిసికొనుచున్నాడు. పై నుదాహరించిన అర్ధసముదాయమంతయు ఈ వ్యాఖ్యానమునే గలదు.

**తాత్పర్యము :** ప్రతిపదార్థము నందలి విశేష లక్షణ లక్షితుడైన శిష్యుడు శాస్త్రము యొక్క అర్థము కర్మపథాభ్యాసము పూర్తియగువరకు ఆచార్యుల వద్ద అధ్యయనము చేయవలయును. అట్లే ఆచార్యులు కూడ శిష్యునితో అధ్యయనము చేయించవలెను. పై నుదాహరించిన శిష్యుడే అధ్యయనార్హుడని భావము.

మూ ॥ **నాఽకాల విద్యుత్స్తనితే భూకంపే రాహుదర్శనే॥**
**పంచదశ్యామ చంద్రాయాం పరోక్షేవా గురోః పఠేత్।**
**నా విచ్ఛిన్న పదం నాతిమందం నాత్యుచ్చ నీచకైః॥**

ప్రతిపదార్థము : అకాల విద్యుత్స్తనితే; అకాల=కాలముగాని కాలము నందలి; విద్యుత్=మెరుపు; స్తనితే=మేఘగర్జనమునందు; భూకంపే=భూకంపమునందు; రాహుదర్శనే = గ్రహణకాలమునందు; అచంద్రాయాం=చంద్రుడు లేనట్టి; పంచదశ్యామ్=అమావాస్యయందు; గురోః=ఆచార్యుల యొక్క; పరోక్షే=అనుపస్థితియందును; నపఠేత్=చదువకూడదు; అవిచ్ఛిన్నపదం=పదములను కలిపి (సంధిని విడగొట్టక) నపఠేత్=చదువకూడదు; అతి

మందమ్=చాలా మెల్లగాను; నపఠేత్=చదువకూడదు; అత్యుచ్చ నీచకైః= మిక్కిలి బిగ్గరగాను మిక్కిలి తక్కువ స్థాయిలోనుండు స్వరములచేత; నపఠేత్=చదువకూడదు.

**తాత్పర్యము:** అకాలమున మెఱుపులు మెరుయునపుడు, మేఘము గర్జించునపుడు, భూమికంపించునపుడు, సూర్యగ్రహణ కాలమున, చంద్రుడు లేని అమావాస్యయందు, గురుపరోక్షమున ఆయుర్వేదాధ్యయనము చేయరాదు. మరియు అధ్యయనము పదచ్ఛేదము చేయకయు, మిక్కిలి మెల్లగాను మిక్కిలి ఉచ్చస్వరములతోను పఠనము చేయరాదు.

**శశిలేఖ :** అకాల విద్యుత్ అనగా వర్షాకాలము నందలిదిగాక శీతోష్ణ కాలములో కనబడునది. అట్టిదే మేఘశబ్దము. అమావాశ్యకు కుహూ అని పేరు. గురువుయొక్క అనుపస్థితిలో చదివినచో త్రుటు లేర్పడును. పదచ్ఛేద పూర్వకముగా చదవని యెడల సంధిజ్ఞాన మేర్పడదు.

మూ॥ **హీనాన్యవేష ఆచార్యం పర్యుపాసీత రాజవత్।**
**శయీతసుప్త ఏవాస్మిన్నుత్తిష్ఠే తాస్యపూర్వతః॥**
నబ్రూయ త్కేవలం నామనాఽసాధ్వపి వినాటయేత్।

ప్రతిపదార్థము: హీనాన్యవేషః=గురువునకంటే తక్కువ స్థాయిలోనుండు వేషము కలవాడై; రాజవత్=రాజువలె; ఆచార్యమ్=ఆచార్యుణ్ణి; పర్యుపాసీత్=ఉపాసించవలెను (సేవించవలెను); అస్మిన్ సుప్తేఏవ=ఆచార్యుడు నిదురించిన వాడగుచుండగా; శయీత=పరుండవలెను: అస్యపూర్వతఃఏవ= ఆచార్యులు మేల్కొనుటకు ముందే; ఉత్తిష్ఠేత=లేవవలెను; కేవలం నామ= పూజావాచక పదరహితమైన పేరును మాత్రము; నబ్రూయాత్=చెప్పకూడదు; అసాధ్వపి=మంచివాడుకానప్పటికిని; నవినాటయేత్=పరిహాసముచేయకూడదు.

తాత్పర్యము : గురువున కంటే తక్కువస్థాయిలో నుండు వేషమును ధరించి రాజువలె గురువును సేవించవలెను. గురువు నిదురించిన తరువాత నిదురించి ఆచార్యుడు మేల్కొనుటకు ముందే నిద్ర నుండి లేవవలెను. పూజావాచక పద రహితముగా ఆచార్యుల నామము నుచ్చరించరాదు. ఆచార్యుడు మంచివాడు కానప్పటికి పరిహాసము చేయకూడదు.

శశిలేఖ : అర్థపూర్వక వ్యాఖ్యానము కలదు.

వివ్యా : గురుకులవాసము చేసి విద్యనభ్యసించు విద్యార్థి సమస్తకష్టములనోర్చువాడుగా నుండవలయును. సేవాతత్పరుడుగా నుండవలయును. వేషభాషలలో కూడ గురువునకంటె తక్కువస్థాయిలో నుండవలెను. రాజును సేవ

కుడు సేవించురీతి సర్వవిధముల గురుపూజా తత్పరుడుగా నుండవలయునని భావము.

మూ॥ అభేద్యోఽనుద్ధత స్తబ్ధః సూనృతః ప్రియదర్శనః॥
బహుశ్రుతః కాలవేదీజ్ఞాతగ్రన్థోఽర్థ శాస్త్రవిత్।
అనాథాన్రోగిణో యశ్చపుత్రవత్ సముపాచరేత్॥
గురుణా సమనుజ్ఞాతః సభిషక్ శబ్దమశ్నుతే।

ప్రతిపదార్థము : అభేద్యః=తనరహస్యమును శత్రువులకు తెలియనివ్వనివాడు. (భేదింపబడనివాడు, అసాధ్యుడు); అనుద్ధతః=గర్వము లేనివాడు, (ఉద్ధతుడు కానివాడు); స్తబ్ధః = శాంతస్వభావము కలవాడు; సూనృతః = సత్యమును పలుకువాడు; ప్రియదర్శనః=మంచిముఖము కలవాడు, మంచి రూపము గలవాడు; బహుశ్రుతః=సమస్తశాస్త్రముల నధ్యయనము చేసినవాడు; కాలవేదీ = సమయమును వ్యాధ్యవస్థలను గుర్తించినవాడు; జ్ఞాత గ్రంథః=శాస్త్రాధ్యయనము చేసినవాడు; అర్థశాస్త్రవిత్=కర్మపథాభ్యాసమును శాస్త్రమును చక్కగా తెలిసినవాడును నగు; యః = ఎవడు; అనాథాన్ = దిక్కులేని; రోగిణః=రోగులను; పుత్రవత్=కొడుకుమాదిరి; సముపాచరేత్= చికిత్సచేయునో; గురుణా = గురువుతో, సమనుజ్ఞాతః = చికిత్సచేయుటకు ఆజ్ఞను పొందునో; సః = అట్టివాడు; భిషక్శబ్దమ్ = వైద్యశబ్దమును; అశ్నుతే=పొందుచున్నాడు.

తాత్పర్యము : గర్వములేనివాడు, శాంతస్వభావము కలవాడు, బహుగ్రంథముల నవలోకనము చేసినవాడు, కర్మపథాభ్యాసము మరియు శాస్త్రమును చక్కగా తెలిసినవాడు దిక్కులేనిరోగులను కొడుకువలె చికిత్సచేయునో అట్టివాడు చికిత్స ప్రారంభించుటకు ఆచార్యుల అనుమతిని పొందినవాడును 'భిషక్' అను శబ్దమును పొందును.

శశిలేఖ : వ్యాఖ్యానమునందు మూలమునందలి పదములకర్థము స్పష్టీకరించబడినది.

మూ॥ యస్తు కేవల శాస్త్రజ్ఞః కర్మస్వపరినిష్ఠితః॥
సముహ్యాత్యాతురం ప్రాప్యప్రాప్యభీరు రివాహవమ్।

ప్రతిపదార్థము : యస్తు = ఎవడైతే; కేవల శాస్త్రజ్ఞః = కేవలము శాస్త్రమును తెలుసుకొనుచున్నాడో; కర్మసు =చికిత్సలయందు; అపరినిష్ఠితః= పరిపూర్ణ జ్ఞానముకలవాడో; సః = అట్టివాడు; ఆతురం = రోగిని; ప్రాప్య= పొంది; ముహ్యతి=మోహమును చెందుచున్నాడు; యథా=ఎట్లనగా; భీరుః= పిరికివాడు; ఆహవం = యుద్ధమును (పోరాటమును); ప్రాప్య=పొంది; ముహ్యతి = మోహమును చెందుచున్నాడు.

తాత్పర్యము : కేవల శాస్త్రజ్ఞానము కలవాడు చికిత్సావిషయములలో పరినిష్ఠితుడు కానియెడల రోగిని సమీపించి రోగమును నిర్ణయించలేక మోహితుడగుచున్నాడు. ఎట్లనగా పిరికివాడు పోరాటమును పొంది మోహమును చెందునట్లు.

శశిలేఖ : రోగముతో బాధపడువాడు రోగశాంతిని అపేక్షించునేకాని శాస్త్రమునందలి అర్థము పదార్థవివేచనము వాక్యార్థమునవేక్షించడు. ఎందుకనగా శాస్త్రార్థము పదార్థవివేచనము వాక్యార్థములు రోగమును శాంతింపజేయవు గదా! అందువలన వైద్యుడు శాస్త్రజ్ఞానము కలిగి కర్మ పథాఖ్యానమునందు పరినిష్ఠితుడై యుండవలయునని భావము.

మూ॥ యఃపునః కురుతే కర్మధార్ష్ట్యాచ్ఛాస్త్రవివర్జితః॥
ససత్సుగర్హామాప్నోతివధంచర్ఛతి రాజతః॥

ప్రతిపదార్థము : యఃపునః = ఎవడైతే; శాస్త్రవివర్జితః = శాస్త్రార్థజ్ఞానములేనివాడై ; ధార్ష్ట్యాత్ = ధృష్టత్వమువలన, గడుసరితనమువలన; కర్మ = చికిత్సను; కురుతే = చేయుచున్నాడో; సః = వాడు; సత్సు = సజ్జనుల మధ్యలో గర్హాం = నిందను; ప్రాప్నోతి = పొందుచున్నాడు; అతః = అందువలన; రాజతశ్చ = రాజుద్వారా; వధం చర్ఛతి = చంపింపబడుచున్నాడు.

తాత్పర్యము : శాస్త్రవిజ్ఞాన మిసుమంతయు లేక గడుసరితనము వలన ఎవడు చికిత్సచేయుచున్నాడో వాడు పెద్దల మధ్యలో నిందలను పొంది రాజు చేత చంపింపబడుచున్నాడు.

శశిలేఖ : గడుసరితనము వలన అట్టివైద్యుడు రాజ్యమునందు కంటకుడుగా నునావడు. అందువలన రాజుచేత చంపింపదగి యున్నాడని భావము.

మూ॥ హేతౌ లింగే ప్రశమనే రోగాణా మపునర్భవే॥
జ్ఞానం చతుర్విధం యస్య సరాజార్హో భిషక్తమః।

ప్రతిపదార్థము : హేతౌ = నిదానమునందు; లింగే = లక్షణమునందు; ప్రశమనే = రోగములయొక్క చికిత్సావిషయములలో; రోగాణాం = రోగముల యొక్క; అపునర్భవే = మరలజనించకుండునట్లు చికిత్సించుటలో; యస్య = ఎవరికి; చతుర్విధమ్ = నాలుగువిధములైన; జ్ఞానం = జ్ఞానముకలదో; సః = అట్టివాడు; భిషక్రమః = వైద్యశ్రేష్ఠుడు; రాజార్హః = రాజులచేత పూజనీయుడు.

తాత్పర్యము : రోగిని పంచలక్షణ నిదాన పూర్వకముగా పరీక్షించి రోగ నిర్ణయము చేయుట; రోగమునకు తగిన చికిత్సలు సలుపుట, మరల రోగములు తలయెత్తకుండునట్లు పథ్యాదిక్రమమును నిర్ణయించుట అను

విజ్ఞానము కలవాడు వైద్యశ్రేష్ఠుడుగా రాజులచేత పూజనీయుడుగా పరిగణింప బడుచున్నాడు.

*శశిలేఖ* : వైద్యదోషములను పైసూత్రములోవివరించి వైద్యగుణముల నిచట చెప్పుచున్నాడు. జ్ఞాన చతుష్టయోపేతుడు రాజార్హుడు వైద్యశ్రేష్ఠుడుగా పరిగణింపబడుటవలన చికిత్సకునికి పైనుదాహరించిన హేత్వాదినాలుగు గుణములు ముఖ్యముగా నుండవలెను.

**మూ॥ శస్త్రం శాస్త్రాణి సలిలం గుణదోష ప్రవృత్తయే॥**
**పాత్రాపేక్షీణ్యతః ప్రజ్ఞాం బాహుశ్రుత్యేన బృంహయేత్॥**

*ప్రతిపదార్థము* : బాహుశ్రుత్యేన = విశేషశాస్త్ర పరిజ్ఞానముతో; ప్రజ్ఞాం=జ్ఞానమును; బృంహయేత్=వృద్ధిపరచుకొనవలెను. (పూరించుకొనవలెను); అతః=ఏకారణము వలననగా;గుణదోషప్రవృత్తయే=గుణదోషమునను చేయుటకొరకు; శస్త్రం=శస్త్రము; సలిలం=నీరు; శాస్త్రాణి = శాస్త్రములు; పాత్రాపేక్షణి=పాత్రను అపేక్షించునవిగా; భవంతి=అగుచున్నవి.

**తాత్పర్యము** : యుద్ధ కౌశలముగల శూరుని వద్దగల శస్త్రము విజయమును చేకూర్చును. సద్గుణోపేతుడై శాస్త్రపరిపాటిని గుర్తించిన వాని వద్దనున్న శాస్త్రము రాణించును. సరియైన శుభ్రమైన పాత్రలో నున్న నీరు సద్గుణములను కలిగించును. అందువలన విశేషశాస్త్రపరిజ్ఞానముతో జ్ఞానమును వృద్ధిపరచుకొనవలెను.

*శశిలేఖ* : బృంహయేత్ అనగా పూరయేత్ అనిఅర్థము. పూరయేత్ అనగా పూరించుకొనవలెనని అర్థము. శస్త్రము శౌర్యముగల వాని యందున్న కార్యసిద్ధిని కలిగించును. పిరికివాని వద్దగల శస్త్రము హాని కలిగించును.

**మూ॥ ప్రదీపభూతం శాస్త్రంహి దర్శనం విపులా మతిః।**
**తాభ్యాం భిషక్సు యుక్తాభ్యాం చికిత్సన్నా పరాధ్యతి॥**

*ప్రతిపదార్థము* : ప్రదీపభూతం=మిక్కిలి ప్రకాశించుచున్న; దర్శనం= దృష్టి; ఏవం=ఇట్లు; శాస్త్రంగా=శాస్త్రమైతే; విపులా=విస్తారమైన; మతిః= బుద్ధి; సుయుక్తాభ్యాం=బాగుగాకూడుకొన్న; తాభ్యాం=ఈరెండింటితో; భిషక్=వైద్యుడు; చికిత్సన్ = చికిత్సించుచున్నవాడై; నాఽపరాధ్యతి= తొట్రుపాటుపడడు.

**తాత్పర్యము** :శాస్త్రము దీపమువలె విస్తారమైన బుద్ధి దృష్టివలె ఈరెండింటికి ఇచట సామ్యము ప్రతిపాదింపబడుచున్నది. ఏట్లనగా దీపపుకాంతి యందు దృష్టి దరిదాపులలో నున్న సమస్తపదార్థములను చక్కగా గ్రహించుచున్నది. ఇట్లే సద్వైద్యుడైనవాడు శాస్త్రప్రకాశము ద్వారా తనసచ్ఛాస్త్రోప

దేశము వలనను నిర్మలమైన బుద్ధిద్వారాను చికిత్సలను చేయుచు ఎప్పుడును తప్పుచేసినవాడు కాడు.

**శశిలేఖ :** పై సూత్రమునందు ప్రజ్ఞాబృంహయేత్ జ్ఞానమునుపూరించవలెనని చెప్పినందు వలన ఇచట పై సూత్రమున కనుబంధముగా ప్రదీపభూతం అని ప్రారంభించుచున్నాడు. ఇచట శాస్త్రమునకు ప్రదీపమునకు సాదృశ్యమును విస్తారమైన బుద్ధి దృష్టితో సమానముగను వ్యాఖ్యానించ బడినది. దీపకాంతితో కూడుకొన్న దృష్టి భావ పదార్థ గ్రహణమునందు సమర్థమగు చున్నది. ఇట్లే విశేష శాస్త్రజ్ఞానముచేత పూరింపబడిన విస్తారమైన బుద్ధి చికిత్స చేయుటకు యోగ్యమైన దగుచున్నది. ఇట్లు విస్తారమైన బుద్ధితో కూడిన చికిత్సకుడు చికిత్స చేయునపుడు తప్పును చేయడు.

**మూ॥ ఆహూత ఏవ యోయాతి సువేషః సునిమిత్తతః॥**
**గత్వాఽతురార్థా దన్యత్ర ననిధత్తేమనః క్వచిత్।**
**వ్యాధీన్ పరీక్షతే సమ్యఙ్నిదానాదివిశేషతః॥**
**ప్రేషణీయాంచ తద్వార్తాం నప్రకాశయతే బహిః।**
**సహసానచ తస్యాపి క్రియాకాల మహాపయన్॥**
**జానాతి చోప చరితుం సవైద్యస్సిద్ధిమశ్నుతే।**

*ప్రతిపదార్థము :* యః=ఏవైద్యుడైతే; ఆహూత ఏవ=పిలువబడిన వెంటనే; సువేషః=మంచివస్త్రభూషణములు ధరించినవాడై; సునిమిత్తతః=మంచి శకునములు గలవాడై; యాతి=వెళ్ళుచున్నాడో; గత్వాచ=వెళ్ళియు; ఆతురార్థాత్=రోగిని పరీక్షించు నిదానాదులనుండి; మనః=మనస్సును; క్వచిత్=ఒకప్పుడు కూడ; అన్యత్ర=అన్యవిషయములందు; ననిధత్తే=మరల్చడో; నిదానాది విశేషతః=వ్యాధిని పరీక్షించు నిదానాదిపంచక విశేషముల వలన; సమ్యక్=బాగుగా; వ్యాధీన్=రోగములను; పరీక్షతే=పరీక్షించు చున్నాడో; ప్రేషణీయాం=దాచదగిన (గుప్తపరచ దగిన); తద్వార్తాం=రోగి యొక్క వృత్తాంతమును; బహిః ప్రజాబాహాళ్యమును; నప్రకాశయతే=వెలిపరచకుండునో; తస్యాపి=రోగికి కూడ; సహసా=తొందరపడి; నచప్రకాశయతే=వెలిపరచకుండునో; క్రియాకాలం=చికిత్సాకాలమును; నఅహాపయన్=విస్మరించక; ఉపచరితుం చ=చికిత్సించుటకును; జానాతి=తెలిసికొనుచున్నాడో; సః=అట్టివాడు; వైద్యః=వైద్యుడు; సిద్ధిం=చికిత్సాసిద్ధిని; అశ్నుతే=పొందుచున్నాడు.

**తాత్పర్యము :** చికిత్సానిమిత్తము ఆహ్వానితుడైన వైద్యుడు తగిన వస్త్రభూషణములచేత అలంకరింపబడినవాడై, శుభశకునములను ముందుంచుకొని రోగిని సమీపించవలయును. రోగిని సమీపించి మనస్సును అన్యవిషయములందు జొప్పింపక ఏకాగ్రతచే నిదానాది పంచలక్షణములతో పరీక్షించవలయును. తదుపరి తాను గ్రహించి గోపనీయమైన రోగి విశేషములను

ఇతరులకు తెలియనివ్వకయు అవసరమనితోచినయెడల రోగికి కూడ హఠాత్తుగా తెలియపరచకూడదు. సంచయాది షట్ క్రియాకాలములను చక్కగా గుర్తెరిగిన వాడై చికిత్సించినవైద్యుడు చికిత్సా సాఫల్యమును పొందును.

*శశిలేఖ :* 'సువేషః' అనగా దూతాది విజ్ఞానీయమను ప్రకరణమున చెప్ప బడిన కుచేలధారణము మొదలగువాటిని విసర్జించినవాడని అర్థము. 'గోప నీయాం' అనగా లజ్జాదిగోపనీయమగురోగియొక్క విషయములను అని అర్థము. 'సహసానచ తస్యాపి' అనగా రోగికి కూడ హఠాత్తుగా ఇట్టి బాధ నీకు కలదని వెలిపరచరాదు. అట్లు వెలిపరచినయెడల (వ్యాధి స్వరూపమును రోగికి చెప్పినయెడల) ఒక్కొక్కప్పుడు వైద్యునకు చికిత్సాభంగము వాటిల్లునని భావము. 'సిద్ధిం' అనగా రోగశాంతియను ఫలమును అని అర్థము.

**మూ॥ నాదదీతామిషం స్త్రీభ్యస్తదధ్యక్షే పరాఙ్ముఖే॥**
**తాభిశ్చ రహసిస్థానం పరిహాసం చ వర్జయేత్।**

*ప్రతిపదార్థము :* స్త్రీభ్యః = పరస్త్రీలనుండి; ఆమిషం = కానుకను; **నాదదీత** = స్వీకరించరాదు; తదధ్యక్షే = వారియొక్క అధ్యక్షతయందు; పరాఙ్ముఖే=పరోక్షమునందు; తాభిశ్చ=స్త్రీలతోకూడ; రహసిస్థానం=ఏంత కాలమునందుండుటను; చ=మరియు; పరిహాసం=పరిహాసమును; వర్జయేత్ = విడువవలయును.

*తాత్పర్యము :* స్త్రీలయొక్క రక్షణయందును, పరోక్షమునందైనను, పరస్త్రీలనుండి కానుకగా స్వీకరించరాదు. ఆ స్త్రీలతో ఏకాంతముగనుండుట పరిహాసముచేయుట విడువవలయును.

*శశిలేఖ :* 'ఆమిషం' భోగ్యవస్తువని ఒక కోశమునందును, కానుక అని మరియొక కోశమునందును కలదు. 'తదధ్యక్షే' ఆమిషదాతృయోషి ద్రక్షాధికృతే అని కలదు. స్త్రీలచే రక్షింపబడు అని అర్థము.

**మూ॥ ఆర్తంచన్నృపసద్వైద్యైర్విద్విష్టం తద్వేషిణంద్విషమ్॥**
**చండం శోకాతురంభీరుం కృతఘ్నంవైద్యమానినమ్।**
**హీనోపకరణం వ్యగ్రమవిధేయంగతాయుషమ్॥**

*ప్రతిపదార్థము :* నృపసద్వైద్యైః=రాజులచేత మంచివైద్యులచేత; ద్విష్టం=ద్వేషింపబడిన వానిని; తద్వేషిణం=రాజులను సద్వైద్యులను ద్వేషించు చున్నవానిని: ద్విషం=శత్రువును; చండం=మిక్కిలి కోపముగలవానిని; శోకాతురం=దుఃఖించు స్వభావము గలవానిని; భీరుం=పిరికివానిని; కృతఘ్నం= పరోపకారమును మరచువానిని; వైద్యమానినం=వైద్యుడుగా తలచువానిని; హీనోపకరణం=చికిత్సాసామగ్రి లేనివానిని; వ్యగ్రం=అనేక కార్యములయందు దాసక్తి కలవానిని; అవిధేయం=విధేయుడు కానివానిని; గతాయుషం=అరిష్ట

లక్షణములను బట్టి అల్పాయువు గలిగినట్టి; ఆర్తం=రోగికి: నచికిత్సేత్=చికిత్స చేయరాదు.

**తాత్పర్యము:** రాజవైద్యద్వేషము గలవాడు, రాజువైద్యులు వీరిద్దరిచే ద్వేషింపబడువాడు, చికిత్సా సామగ్రి లేనివాడు, అల్పాయువుగలవాడు. మిక్కిలి కోపవంతుడు, పరోపకారమును మరచువాడు, భయపడు స్వభావము కలవాడు, అరిష్టలక్షణములను బట్టి అల్పాయువు గలవాడుగా తెలిసినవాడు, సాహసపరుడు, వైద్యునివలె నటించి ఔషధసేవనము నుపేక్షించువాడు, అనేక కార్యముల యందాసక్తిగలవాడునగు రోగికికలిగిన రోగము స్వల్పమైనదైనను వానిని మంచివైద్యుడు చికిత్స చేయక విడువవలెను.

*శశిలేఖ* : వ్యగ్రం=కార్యబాహుళ్యమ్ (మిక్కిలి కార్యములయందాసక్తి గలవాడని అర్థము) గతాయుషం=అరిష్టజ్ఞానేన, అరిష్టజ్ఞానముతో స్వల్పాయుర్దాయము గలవాడని గ్రహింపవలెను.

మూ॥ **జిజీవిషుర్వ్యాధితోఽపి పూర్వోక్త గుణవర్జితాన్।**
**క్రియావిక్రయిణోవైద్యాన్ మృత్యోరగ్రేసరాహితే॥**

ప్రతిపదార్థము : వ్యాధితోఽపి=రోగికూడ; జిజీవిషుః=జీవించుటకు కోరికకల వాడగుచు; పూర్వోక్తగుణవర్జితాన్=వెనుక చెప్పబడిన వైద్యక గుణములను విడిచిపెట్టినట్టి; క్రియావిక్రయిణః=చికిత్స నమ్మునట్టి; వైద్యాన్=వైద్యులను; త్యజేత్=వదలిపెట్టవలెను, తథాహి=అయుక్తమేకదా; తే=అట్టి వైద్యులు; మృత్యోః=మృత్యువునకు; అగ్రేసరాః=ముందున్నట్టివారు.

తాత్పర్యము : విధివిహితకాలము వరకు జీవించు కోరికగలరోగి సద్వైద్య లక్షణములులేని, చికిత్సనమ్ముకొనునట్టి వైద్యుల వద్ద చికిత్స చేయించుకొనరాదు. ఎందుకనగా మృత్యువునకు ముందుండు పదాతులుగా వారు పరిగణింపబడుచున్నారు.

*శశిలేఖ* : పై లక్షణములతోకూడిన రోగిని మాత్రము వైద్యుడు త్యజించవలయునని భావముకాదు. వైద్యలక్షణములుసంపూర్ణముగ లేనివైద్యుని వద్దకూడ రోగి చికిత్స చేయించుకొనరాదు. ఎందుకనగా శాస్త్రమర్యాదలు చికిత్సా పద్ధతులు సరిగా తెలియక వైద్యుడు చికిత్సించుట వలన రోగి స్వయముగ మృత్యువు నాహ్వానించినట్లగును.

మూ॥ **భిషగ్ద్రవ్యాణ్యుపస్థాతారోగీపాద చతుష్టయమ్।**
**చికిత్సితస్య నిర్దిష్టం ప్రత్యేకం తచ్చతుర్గుణమ్॥**

ప్రతిపదార్థము : చికిత్సితస్య=చికిత్సాకార్యమునకు; భిషక్=వైద్యుడు; ద్రవ్యాణి=ద్రవ్యములు; ఉపస్థాతా=పరిచారకుడు; రోగీ=వ్యాధిగ్రస్తుడు; పాదచతుష్టయమ్=నాలుగుపాదములుగా; నిర్దిష్టం=నిర్దేశింపబడినది; తత్=ఆ

పాదచతుష్టయము; ప్రత్యేకం=ఒక్కొక్కటి, చతుర్గుణమ్=నాలుగుగుణము లను కలిగి యుండును.

తాత్పర్యము: వ్యాధులను శాంతింపజేయు చికిత్సా కార్యమునకు వైద్యుడు ద్రవ్యములు. పరిచారకుడు వ్యాధిగ్రస్తుడు అను నాలుగు పాదములు నిర్దేశింపబడినవి. ఆ పాద చతుష్టయము కూడ వేరువేరు నాలుగు గుణములను కలిగి యుండును.

శశిలేఖ : 'ఉపస్థాతా' అనగా పరిచారకుడని అర్థము.

వి.వ్యా. : రోగోపశమన రూపమయిన చికిత్సయందు ప్రధానముగ వైద్యుని ఆవశ్యకత విశేషముగ నుండుటవలన ఈసూత్రమున తొలుత వైద్యుడు నిర్దేశింపబడెను. పై జెప్పిన నాలుగు పాదములలో ప్రత్యేకముగా ఒక్కొక్క పాదమునకు నాలుగేసి గణములు నిర్దిష్టములైనందున అన్నియు కలిసి పదహారు గణములు ఉండును.

వ్యుత్పత్తి: భిషజ్యతి=భిషక్; భిషజ్ చికిత్సాయాం (చికిత్స సేయువాడు). ద్రవణీయమితి ద్రవ్యం=ద్రుగతౌ; పొందదగినది అని ఒక అర్థము. ద్రవ్యశబ్దము మంచి పదార్థమునకును, గుణాశ్రయమైన వస్తువునకును పేరు.

మూ॥ దక్షస్తీర్థాత్తశాస్త్రార్థో దృష్టకర్మా శుచిర్భిషక్।

ప్రతిపదార్థము: దక్షః=క్రియాసామర్థ్యము కలవాడు; తీర్థాత్తశాస్త్రార్థః= విద్వద్వైద్యుని వద్ద చక్కగా ఆయుర్వేదశాస్త్రముల నెరింగినవాడును; దృష్ట కర్మా=విశేషముగా చికిత్సానుభవము కలవాడు; శుచిః=కాయవాఙ్మనస్సుల చేత పరిశుద్ధమైనవాడుగా; భిషక్=వైద్యుడు; స్యాత్=ఉండవలయును.

తాత్పర్యము : వైద్యుడు, క్రియాసామర్థ్యము కలవాడు, విశేషముగ చికిత్సానుభవముకలవాడు, విద్వద్వైద్యునివద్ద ఆయుర్వేద శాస్త్రార్థముల చక్కగా తెలిసికొన్నవాడు, కాయ వాఙ్మనస్సులచేత శుద్ధమైనవాడుగా ఉండ వలయును.

శశిలేఖ: దక్షః=చతురః=సమర్థుడు అని అర్థము. తీర్థాత్త శాస్త్రార్థః= ఉపాధ్యాయునినుండి గ్రహింపబడిన శాస్త్రస్వరూపము కలవాడు. దృష్ట కర్మా=అనేక రోగములకు చికిత్స చేసినవాడని అర్థము.

మూ॥ బహుకల్పం బహుగుణం సంపన్నం యోగ్యమౌషధం॥

ప్రతిపదార్థము : బహుకల్పం = అనేక కల్పములుగలదిగను; బహు గుణం=అనేక గుణములుగలదిగను; సంపన్నం=పాకసంస్కారాదులతో కూడు కొన్నదిగను; యోగ్యం=దేశకాలాదులనుబట్టి రోగికి రోగమునకును తగినదిగ నున్నది ; ఔషధం=ఔషధము.

తాత్పర్యము : ఔషధము స్వరము, చూర్ణము, లేహ్యము మొదలగు ననేక కల్పములు గలదిగను, గురుమందహిమ స్నిగ్ధాది వింశతి గుణములు కలది

గను, సరియగు పాక సంస్కారాదులతో కూడుకొన్నదిగను, దూష్యదేశ బాల కాల ప్రకృతి వయః సత్వసాత్మ్య ఆహార్యాద్యనుగుణముగ నుపయోగింపతగి నదిగ నుండవలెను.

*శశిలేఖ* :: బహుకల్పం అనగా స్వర సక్వాథచూర్ణరూపమైన అనేక కల్పములుగలదిగా నుండవలెనని భావము. సంపన్నం = పాక సంస్కారాది యుక్తం=పాకము సంస్కారము వీటితో కూడినట్టిదిగా నుండవలెను.

**మూ॥ అనురక్తశ్శుచిర్దక్షో బుద్ధిమాన్ పరిచారకః।**

*ప్రతిపదార్థము* : అనురక్తిః = రోగియందు దృఢమైన భక్తిగలవాడు; శుచిః = కాయవాఙ్మనస్సులచేత పరిశుద్ధమైనవాడు; దక్షః = కార్యమును గొబ్బున జేయువాడు; బుద్ధిమాన్ = జ్ఞానము కలవాడుగా; పరిచారకః = పరి చారకుడు; స్యాత్=ఉండవలెను.

తాత్పర్యము : పరిచారకుడు రోగియందు పూర్ణమైన భక్తికలిగి కాయ వాఙ్మనస్సులచేత శుద్ధుడై సర్వకార్యములయందు సామర్థ్యము కలిగి మంచి జ్ఞానముకలవాడుగా నుండవలెను.

**మూ. ఆఢ్యో రోగీ భిషగ్వశ్యో జ్ఞాపకః సత్వవానపి॥**

*ప్రతిపదార్థము* : రోగీ=వ్యాధిగ్రస్తుడు; ఆఢ్యః = ధనవంతుడు; భిష గ్వశ్యః = వైద్యుడు చెప్పినప్రకారము నడచువాడు; జ్ఞాపకః = రోగ ఆహార విహారాదులయొక్క గుణాగుణములను, నిదానాదులను చక్కగా వైద్యునికి తెలియపరచతగినవాడు; సత్వవానపి=ధైర్యవంతుడునుగా; స్యాత్=ఉండవలెను.

తాత్పర్యము : రోగి ధనవంతుడుగా, వైద్యుని అనుసరించి నడచుకొను వాడుగా, పరిస్థితులను వైద్యునికి సమగ్రముగా తెలియజేయువాడుగా, ధైర్య వంతుడుగా నుండవలెను.

**మూ॥ యద్వైద్యే విగుణే పాదాగుణవన్తోఽప్యనర్థకాః।**
**సపాదహీనానప్యార్తాన్ గుణవాన్ యచ్ఛయాపయేత్॥**
**చికిత్సాయా స్తమేవాతః ప్రధానం కారణం విదుః।**

*ప్రతిపదార్థము* : యది = కారణచతుష్టయమునుండి; వైద్యే = వైద్యుడు; విగుణే=గుణరహితుడైన; పాదాః=మిగిలిన మూడు పాదములు; గుణవన్తోఽపి = గుణములు కలిగియున్నప్పటికిని; అనర్థకాః = ప్రయోజన రహితములు; యచ్ఛ=ఏ కారణమువల్లనైన; సః=ఆ వైద్యుడు; గుణవాన్= గుణములుకలవాడైన; పాదహీనానపి = తక్కిన మూడు పాదములు లేనట్టి; ఆర్తాన్=వ్యాధిగ్రస్తులను; యాపయేత్=మరణమునుండి రక్షించును; అతః= ఇందువలన; చికిత్సాయాం = చికిత్సాకార్యమునందు; తమేవ = ఆ వైద్యునే;

విద్వాంసః=ఆయుర్వేదపండితులు; ప్రధానం=ముఖ్యమైన; కారణం=కారణముగా; విదుః=చెప్పిరి.

ప్రతిపదార్థము : పైనుదాహరించిన వైద్యుడు 'దక్షస్తీర్తాత్త శాస్త్రజ్ఞః దృష్టి కర్మాశుచిః' అను నాలుగు లక్షణములు లేనివాడై తక్కిన ద్రవ్యములు, పరిచారకుడు, రోగ సప్తగ్రలక్షణములతో కూడియున్నప్పటికిని చికిత్సాసిద్ధి ఏర్పడదు. అనర్థమునకు అది మూలమగును. వైద్యుడు సంపూర్ణ లక్షణ లక్షితుడైన తక్కిన మూడు పాదములు గుణరహితములైనప్పటికిని రోగిని మరణము నుండి రక్షించగలడు. అందువలన ఆయుర్వేదాచార్యులు చికిత్సాకార్యమునందు వైద్యునికి ప్రధానస్థానమును కల్పించిరి. అనగా వైద్యుడు చికిత్సా విషయములో ప్రధాన కారణముగా నుడివిరి.

శశిలేఖ : వైద్యునికి చికిత్సావిషయములో ఎందుకు ప్రముఖస్థానము కల్పింపబడిన దనుట కీసూత్రములో వివరణముకలదు. (తక్కిన వివరణము అర్థము ననుసరించియే కలదు).

మూ॥ సాధ్యోఽసాధ్య ఇతి వ్యాధిర్ద్వివిధా తౌతు పునర్ద్వివిధా।
సుసాధ్యః కృచ్ఛసాధ్యశ్చయాప్యోయశ్చానుపక్రమః॥

ప్రతిపదార్థము : వ్యాధిః = రోగము; ద్వివిధా = రెండువిధములు సాధ్యః=సాధ్యము; అసాధ్యః=అసాధ్యము; ఇతి=అని; తౌతు=ఆ సాధ్యాసాధ్యములైతే; పునః=మరల; ద్వివిధా=రెండువిధములు; సుసాధ్యః= సుసాధ్యము; కృచ్ఛ్రసాధ్యః=కృచ్ఛసాధ్యము; సాధ్యః=సాధ్యము; ఇతి=అని; ద్వివిధా = రెండువిధములు; యాప్యః = యాప్యము; అనుపక్రమః = అనుపక్రమము; ఇతి=అని; అసాధ్యః=అసాధ్యము; ద్వివిధా=రెండువిధములు.

తాత్పర్యము : సాధ్యము అసాధ్యమని రోగము రెండువిధములు. మరల సుసాధ్యము, కృచ్ఛ్రసాధ్యమని సాధ్యము రెండువిధములుగాను యాప్యము, అనుపక్రమమని అసాధ్యము రెండువిధములుగాను విభాగము చేయబడినది.

మూ॥ సర్వౌషధక్షమే దేహేయూనః పుంసోజితాత్మనః॥
అమర్మగోఽల్ప హేత్వగ్రరూపరూపోఽనుపద్రవః।
అతుల్యదూష్య దేశర్తు ప్రకృతిః పాదసంపది।
గ్రహేశ్వను గుణేష్వకదోషమార్గో నవః సుఖః
సుఖసాధ్యః సుఖోపాయః కాలేనాల్పేన సాధ్యతే।

ప్రతిపదార్థము : సర్వౌషధక్షమే=తీక్ష్ణాది సమస్త ఔషధములను ఓర్చుకొనునట్టి; దేహే=శరీరమునందు; ఉత్పన్నః=పుట్టిన; వ్యాధిః=రోగము; సుఖః=సుఖసాధ్యము; యూనః=యౌవనవంతుని యొక్క; పుంసః = పురుషుని యొక్క, జితాత్మనః = చాపల్యరహితుని యొక్క, దేహే = శరీరమునందు; ఉత్పన్నః=పుట్టిన; వ్యాధిః=రోగము; సుఖః=సుఖసాధ్యము;

అమర్మగః=శిరస్సు హృదయము వస్తి మొదలగు మర్మస్థానములయందు వ్యాపించనట్టియు; అల్ప హేత్వగ్రమాపరూపః=స్వల్పమైన నిదానపూర్వరూప లక్షణములు కలిగినట్టి; అనుపద్రవః=ఉపద్రవము లేనట్టి (ఉపద్రవమనగా తొలుత జనించిన రోగమునకు చికిత్సా ప్రతిబంధకమును కలుగజేయునట్టి మరియొక రోగము ఉత్తర కాలమందు జనించుట అని అర్థము); అతుల్యదూష్య దేశర్తు ప్రకృతిః=అతుల్యములైన (సమానములుకాని) మేదో మజ్జాది దూష్యములు, అతుల్యములైన అనూపాదిదేశములు, అతుల్యములైన శిశిరాది ఋతువులు అతుల్యములైన వాతాది ప్రకృతులు గలిగినట్టి; పాదసంపది=వైద్యుడు మొదలగు పాద చతుష్టయముతో కూడుకొన్నట్టి; ఏకదోషమార్గః=శాఖాది మార్గములను వానిలో నొకటినే ఆశ్రయించి యుండునట్టి; నవః=నూతనమైనట్టి, వ్యాధిః=వ్యాధి; గ్రహేషు=సూర్యాది నవగ్రహములు; అనుగుణేషుసత్సు=అనుకూలముగ నుండునపుడు; సుఖః=సుఖసాధ్యము; సః సుఖసాధ్యః=అట్టిసుఖ సాధ్యమైన వ్యాధి; సుఖోపాయః=సులభ చికిత్సకలదై; అల్పేవ=స్వల్పమైన; కాలేన= సమయముతో; సాధ్యతే=సాధింపబడు చున్నది.

**మూ॥** కృచ్ఛ్రైః రుపాయైః కృచ్ఛ్రస్తు మహద్భిశ్చ చిరేణచ।
**అసాధ్యలింగ సంకీర్ణ స్తథా శస్త్రాది సాధనః॥**

*ప్రతిపదార్థము :* కృచ్ఛ్రస్తు=కృచ్ఛ్రసాధ్యమైతే; కృచ్ఛ్రైః=మిక్కిలి కష్టమైన; ఉపాయైః=చికిత్సలచేత; మహద్భిః=విశేష చికిత్సలచేత; చిరేణ=చాలాకాలమునకు; సిద్ధ్యతి=ఆరోగ్యము సిద్ధించుచున్నది; అసాధ్యలింగసంకీర్ణః=అసాధ్యమైన హేతువులలో మిశ్రమమై; తథా=అట్లే; శస్త్రాదిసాధనం=శస్త్ర ద్వార అగ్నికర్మలచేత సాధింపబడునదిగా; భవతి=అగుచున్నది.

**తాత్పర్యము :** చాల కష్టముగా మిక్కిలి కఠినమైన చికిత్సలతో చాలా కాలము తరువాత కొద్ది రోగములు శాంతించుచున్నవి. మరికొన్నివ్యాధులు అసాధ్య లక్షణములతో కలిసి శస్త్రద్వార అగ్నికర్మలచేత సాధింపబడునవిగా ఉన్నవి.

***శశిలేఖ :*** 'శస్త్రాది సాధనం' అను పదమునందలి శస్త్రాది అని ప్రయోగించుటవలన ఆదిశబ్దము అగ్నిద్వార కర్మలను కూడ తెలియ చేయు చున్నది. ఇవి కృచ్ఛ్రసాధ్య లక్షణములు.

***వి. వ్యా. :*** శస్త్రద్వార అగ్ని కర్మలు అసాధ్య రోగములలో విశేష చికిత్సలుగా ఈ గ్రంథకారుని అభిమతమైనట్లు ద్యోతక మగుచున్నది. మరియు సుశ్రుతుడు రోగములు రెండు విధములనియు ఆ రోగములు శస్త్ర సాధ్యములు, స్నేహాది క్రియాసాధ్యములనియు పేర్కొనెను. సాధ్యవ్యాధులలో స్నేహాదులు కూడ చేయవచ్చును. కాని స్నేహాది క్రియా సాధ్యవ్యాధులలో శస్త్రకర్మ చేయరాదు.

మూ॥ శేషత్వాదాయుషః పథ్యైర్యాప్యః ప్రాయోవిపర్యయే।
దత్వాఽల్పం సుఖమల్పేన హేతునా సంప్రతన్యతే॥
యాతి నాశేషతాం రోగః కర్మజో నియతాయుషః।
ప్రతిసన్నివ విష్కంభై ర్ధార్యతేఽత్రాతురో హితైః॥

ప్రతిపదార్థము : విపర్యేసతి=సాధ్యలక్షణములు లేనిదగుచు; ఆయుషః=జీవితము యొక్క; శేషత్వాత్=క్షీణించనందువలన (చంపుటకు సాధ్యము కానిదై); ప్రాయః=తరుచుగా; పథ్యైః=నియమిత ఆహార విహారాదులచేత; యాప్యః=యాప్యముగా; కుర్యాత్=చేయవలెను; సః=అట్టివ్యాధి; చికిత్సితేన=వైద్యచికిత్సతో; అల్పం=స్వల్పమైన; సుఖం=సుఖమును; దత్వా=ఇచ్చి; పునః=మరల; అల్పేనహేతునా=స్వల్పకారణముచేత; ప్రతన్యతే=వ్యాపింప చేయబడుచున్నది; కర్మజః=దుష్కృత కర్మవలన పుట్టిన; రోగః=రోగము; నియతాయుషః=నిర్ణయింపబడిన జీవితమును; న అశేషతాంయాతి=నశింపచేయదు (చంపదు కూడ); అత్ర=ఈ యాప్యవ్యాధియందు; ఆతురః=రోగి; హితైః=హితాహారవిహారాదులచేత; యథా=ఎట్లు; విష్కంభైః=దూలములచేత; ప్రతతన్నివ=పడుచున్న ఇంటివలె; ధార్యతే=ధరింపబడుచున్నదో; తథా=అట్లు; ఆతురః=రోగి; ధార్యతే=ధరింపబడుచునాటడు.

తాత్పర్యము : అసాధ్య లక్షణములు కలవ్యాధియైనప్పటికిని పథ్యమైన ఆహార విహారాదులను సేవించుటవలనను ఆయుర్దాయము మిగిలి యున్నందునను సాధారణముగా రోగి మరణించడు. కొద్దిపాటి చికిత్సతో రోగి కొద్ది సుఖమును పొంది అల్లే స్వల్పమైన కారణమును పురస్కరించుకొని మరల వ్యాధి ఎక్కువయగుచున్నది. దీనికి కారణమిట్లున్నది. ఎట్లనగా యాప్యవ్యాధి పూర్వజనము నందలి ఈ జన్మము నందలి కర్మలవలన పుట్టిన కారణముచేత రోగికి ఆయుర్దాయము నియతమై యుండును. ఇందువలన పడుచున్న ఇంటిని స్తంభములు రక్షించునట్లు ఈ యాప్యవ్యాధి మానవుని శాంతముగా నుంచదు మరియు ఇది వ్యాప్య వ్యాధి స్వరూపము.

***శశిలేఖ :*** పథ్యైః అనగా ఆహార విహారములని యర్థము.

మూ॥ పరోఽసాధ్యః క్రియాస్సర్వాః ప్రత్యాఖ్యేయోఽతి వర్తతే।
తస్మా దుపేక్ష్య ఏవాసౌ స్థితోఽత్యన్త విపర్యయే॥
భ్రమ మోహారతి కరోదృష్టరిష్టోఽక్షనాశనః

ప్రతిపదార్థము : పరః=తదితరమైనది; ప్రత్యాఖ్యేయః=చికిత్సించుటకు సాధ్యముకాని వ్యాధి; అసాధ్యః=అసాధ్యము; సర్వాః=సమస్తములైన; క్రియాః=చికిత్సలు; అతివర్తతే=కుంటుపడుచున్నవి. తస్మాత్=అసుఖసాధ్య లక్షణములవలన; అత్యన్తవిపర్యయే=మిక్కిలి విపరీతముగ; స్థితఏవ=ఉన్నప్పుడే;

అసౌ=ఈరోగి; ఉపేక్ష్యః=ఉపేక్షింపదగినవాడు; తథా=అట్లే; భ్రమమోహారతికరః=భ్రమ మోహము అరతి వీటినిచేయుచున్నట్టి; దృష్టరిష్టః= అరిష్టలక్షణములు కనబడుచున్నట్టి; అక్షనాశనః=దృష్టి మొదలగు ఇంద్రియపాటవము లేనట్టివాడు, ఉపేక్ష్యః=ఉపేక్షింపదగినవాడు.

తాత్పర్యము : ప్రత్యాఖ్యేయమనగా=చికిత్సించుటకు అసాధ్యమైన వ్యాధియని అర్థము. అట్టివ్యాధి అసాధ్యముగా నుండును. ఏవ్యాధి అన్నివిధముల చికిత్సలను ప్రయోజనము లేకుండ చేయుచున్నదో మరియు తలతిరుగుట మనస్సు నిలకడ లేకయుండుట దృష్టి మొదలగు ఇంద్రియములు సమర్థవంతములుగా లేకుండుట మొదలగు లక్షణములను గలిగి యున్నదో అట్టి వ్యాధి విడిచి పెట్ట దగినది.

శశిలేఖ : "మోహః" అనగా కదలిక లేకుండుట అని అర్థము. "అరతిః" నిలకడ లేకుండుట "అక్షనాశనః" అనగా దర్శనాది ఇంద్రియములు నశించుట అని అర్థము;

వి.వ్యా. పై నుదాహరించిన సుఖసాధ్య కృచ్ఛ్రసాధ్య యాప్య ప్రత్యాఖ్యేయ రోగములను మొదట పరీక్షించి తదుపరి చికిత్సను ప్రారంభింపవలయును. అట్లురోగిని నిదానాది పంచకము చేత దర్శన స్పర్శన ప్రశ్నములను త్రివిధపరీక్షలచేతను పరీక్షించక చికిత్స కుపక్రమించిన యెడల వైద్యుని కీర్తి ప్రతిష్ఠలకు అతని జ్ఞానమునకు అతని ధనార్జనమునకు హాని సంభవించును.

**మూ. వ్యాధీన్ పురాపరీక్ష్యైవ మారభేత తతఃక్రియామ్॥**
**స్వార్థ విద్యా యశోహాని మన్యథా ధ్రువమాప్నుయాత్।**

ప్రతిపదార్థము : ఏవం=ఇట్లు; పురా=మొదట; వ్యాధీన్ = వ్యాధులను; పరీక్ష్య=పరీక్షించి; తతః = తదుపరి; క్రియాం = చికిత్సను; ఆరభేత = ప్రారంభించవలెను; అన్యథా=లేనియెడల; (అట్లుకానియెడల); స్వార్థ విద్య యశోహానిం=స్వ=తనయొక్క; అర్థ=ధనమునకు; విద్యా=విద్యకు; యశః= యశస్సుకు; హానిం=ప్రమాదమును; ధ్రువం=నిశ్చయముగా; ఆప్నుయాత్ = పొందును.

తాత్పర్యము: పైనుదాహరించిన పద్ధతిని పురస్కరించుకొని ప్రప్రథమమున వ్యాధులను నిదానాదులచేత పరీక్షచేసి తరువాత వైద్యుడు చికిత్స కుపక్రమించవలెను. అట్లు వ్యాధి నిర్ణయముచేయక చికిత్స కుపక్రమించినయెడల వైద్యుడు తన ద్రవ్యార్జనము విద్యాకీర్తిమొదలగు వాటియొక్క ప్రమాదమును నిశ్చయముగా అనుభవింపవలసివచ్చును.

మూ॥ సాధ్యయోరపి సంయోగో బలినోర్యాత సాధ్యతామ్।
విద్యాదసాధ్యమేవాతః సాధ్యాసాధ్యసమాగమమ్॥
నాసాధ్య స్సాధ్యతాం యాతి సాధ్యోయాతిత్వ సాధ్యతామ్।

ప్రతిపదార్థము : బలినోః = బలముతో కూడుకొన్నట్టి; సాధ్యయోరపి = సాధ్యాసాధ్యములయొక్కయు; సంయోగః = సంయోగము (కలయిక); అసాధ్యతామ్ = అసాధ్యత్వమును; యాతి = పొందుచున్నది. అతఏవ=అందువలన (సంయోగమను కారణమువలన); సాధ్యాసాధ్య సమాగమమపి=సాధ్య అసాధ్య వ్యాధులయొక్క కలయికలోకూడ; అసాధ్యమేవ= అసాధ్యమనియే; విద్యాత్ = తెలిసికొనవలయును. అసాధ్యః=అసాధ్యవ్యాధి; సాధ్యతామ్=సాధ్యత్వమును; నయాతి = పొందదు; సాధ్యః = సాధ్యవ్యాధి; అసాధ్యతాం =అసాధ్యత్వమును; యాతి=పొందును.

తాత్పర్యము : సాధ్యలక్షణములతో కూడుకొన్న బలవంతుడైన వానితో కూడ అసాధ్య లక్షణసంయోగము అసాధ్యత్వమును కలిగించును. ఇందువలన సాధ్యాసాధ్య లక్షణసంయోగమును అసాధ్యముగా గుర్తించవలెను. అసాధ్య వ్యాధి ఎప్పుడును సాధ్యవ్యాధిగా మారదు. కాని సాధ్యవ్యాధి తప్పక అప్పుడప్పుడు అసాధ్యత్వమును పొందును.

శశిలేఖ : సాధ్య అసాధ్య సమాగమముకూడ అసాధ్యముగా తెలిసికొనవలయును. అట్లే ఏది అసాధ్య వ్యాధియో అది ఎప్పుడుకూడ సాధ్యత్వమును పొందదు. కాని సాధ్యవ్యాధి అసాధ్యమును అప్పుడప్పుడు పొందును.

మూ॥ పాదాపచారాద్దైవాచ్చ యాన్త్యవస్థాన్తరంగదాః!

ప్రతిపదార్థము : గదాః=రోగములు; పాదాపచారాత్ =పాదచతుష్టయముయొక్క దోషమువలన; దైవాచ్చ = పూర్వజన్మ కర్మవలన; అవస్థాన్తరం= వేరే అవస్థను (స్వరూపలక్షణములు మారుట) యాంతి=పొందుచున్నవి.

తాత్పర్యము : పాదచతుష్టయముయొక్క అపచారమువలన రోగములు వాటి స్వరూప స్వభావములనువదలి వికృతి లక్షణములను పొందుననుట నిస్సంశయము.

శశిలేఖ : 'దైవం' అనగా అన్యజన్మమునందు చేసిన కర్మయని అర్థము.

వి. వ్యా.: 'పూర్వజన్మంకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే,తచ్ఛాంతి రౌషధైర్దానైర్జపహోమ సురార్చనైః' అను ప్రమాణము నాధారముగా చేసికొని పూర్వజన్మమునందు చేసిన పాపకర్మలఫలితము వ్యాధి రూపముగ పరిణమించ గలదనియు అట్టివ్యాధులకు యుక్తి వ్యపాశ్రయ దైవవ్యపాశ్రయ చికిత్సలు రెండును చేయవలయుననియు భావము. కావున పూర్వజన్మము నందు చేసిన కర్మలు వ్యాధులుగాపుట్టి ఈ జన్మలో మానవుని హింసించును.

మూ॥ వరమాశీవిషవిషం దీప్తమగ్నిమయోఽపివా॥
ఉపయుంజీత నత్వార్తాద్వాదామిషం కృపణాజ్జనాత్।

ప్రతిపదార్థము : ఆశీవిషవిషం=పాములయొక్క విషమును, దీప్త=ప్రజ్వరిల్లుచున్న; అగ్నిం=అగ్నిని; దీప్త అయోపివా=కాల్చబడిన ఇనుమును కూడ; వైద్యః=వైద్యుడు; ఉపయుంజీత=ఉపయోగించవచ్చును; వరం=శ్రేష్ఠము; కృపణాత్=లోభగుణము గల; (కృపణ=ఒకనికి పెట్టక తానుతినక ధనమును గూడబెట్టువాడు. లోభి, కుత్సితుడు); ఆర్తాత్=వ్యాధిచేత బాధింపబడు; జనాత్=జనమునుండి; ఆమిషం=భోగింపదగినవస్తువు; నఉపయుంజీత=గ్రహించరాదు.

తాత్పర్యము : ఈ శరీరమునకు పాముయొక్క విషము, మండుచున్న అగ్ని, కాల్చబడిన ఇనుము మొదలగు అనుపయుక్త వస్తువులను గూడ ఉపయోగించుట శ్రేష్ఠమైనదే, కాని లోభగుణముగల రోగులనుండి ధనమునుమాత్రము గ్రహించరాదు.

శశిలేఖ : ఆమిషం అనగా అర్థాదికం అని అర్థము గ్రహింపబడినది.

మూ. వరోభూతదయాధర్మ ఇత్యార్తేషు భిషగ్వరః।
వర్తతే యస్తు సిద్ధార్థః న సర్వమతి వర్తతే॥

ప్రతిపదార్థము : భిషగ్వరః=వైద్యశ్రేష్ఠుడు; భూతదయా=సర్వప్రాణులయందుదయ; వరః=శ్రేష్ఠమైన; ధర్మః=ధర్మము; ఇతి=అని; విదిత్వా=తెలిసికొని; ఆర్తేషు=రోగులయందు; వర్తతే=ఉండవలయును; సః=అట్టి వైద్యుడు; సిద్ధార్థః=అర్థసిద్ధితో కూడినవాడై; సర్వం=సదాచారసంపత్తిగల జనమును; అతివర్తతే=దాటుచున్నాడు.

తాత్పర్యము : వైద్యుడు సర్వప్రాణులయందు దయగలిగి యుండుట శ్రేష్ఠమైన ధర్మమని గ్రహించి రోగుల విషయములో దయగలిగిఉండవలయును. భూతదయయే ప్రధానగుణముగాగల వైద్యశ్రేష్ఠుడు సదాచార సంపన్నులైన సమస్తప్రజలకు శిరోధార్యుడుగా నుండవలయును.

శశిలేఖ : సిద్ధార్థః=అర్థసిద్ధితో కూడుకొన్నవాడు; సర్వం=సదాచారులైన జనమును అని అర్థము; అతివర్తతే అనగా వారిపైన ఉండగలడని అర్థము. సర్వశ్రేష్ఠుడు అని భావము.

ద్వితీయాధ్యాయము సమాప్తము

# అష్టాంగ సంగ్రహ వ్యాఖ్యానము

## తృతీయాధ్యాయము

మూ. **అథాతో** దినచర్యాం నామాధ్యాయం **వ్యాఖ్యాస్యామః।**
**ఇతి హస్మాఽహు రాత్రే యాదయో మహర్షయః॥**

**ప్రతిపదార్థము :** అథ=అటు తరువాత; అతః=ఇందువలన; దినచర్యాం నామ=దినచర్యయను పేరుగల; అధ్యాయం=అధ్యాయమును; వ్యాఖ్యాస్యామః=వ్యాఖ్యానించెదము; ఇతిహ=ఇదేవిధముగా; ఆత్రేయాదయః= ఆత్రేయుడు మొదలగు; మహర్షయః=మహర్షులు; ఆహుస్మ=పలికిరి.

**తాత్పర్యము :** శిష్యోపనయనీయమనునధ్యాయము నుపదేశించిన తరువాత దినచర్యయను పేరుగల ఈ అధ్యాయమును వ్యాఖ్యానించెదము. ఇట్లే ఆత్రేయాది మహర్షులు పలికిరి.

***శశిలేఖ :*** ఈ తంత్రమున ఆయువును రక్షించుట ప్రధానమైన విషయము. ఆయువును రక్షించుటకు రెండు ఉపాయములు గలవు. స్వస్థ వృత్తము మరియు ఆతుర వృత్తమని మంగళకరమగుటవలన, స్వల్పముగ చెప్పవలసి యుండుటవలన, రోగికి మిక్కిలి ఉపయోగపడుటవలన మొదట స్వస్థవృత్తమే చెప్పబడినది. 'అథాతో దినచర్యాం' అని ప్రతి దినమును నడచుకొనుటకు అవలంబించవలసిన పద్ధతియే దినచర్య.

మూ. **బ్రాహ్మేముహూర్త ఉత్తిష్ఠేజ్జీర్ణా జీర్ణం నిరూపయన్।**
**రక్షార్థమాయుషః** స్వస్థః—

**ప్రతిపదార్థము :** స్వస్థః=ఆరోగ్యవంతుడు (రోగము లేనివాడు); ఆయుషః=ఆయుస్సును; రక్షార్థః=రక్షించుటకొరకు; జీర్ణాజీర్ణం=ముందురోజు భుజించిన ఆహారము యొక్క జీర్ణ అజీర్ణమును; నిరూపయన్=నిర్ణయించుచు; బ్రాహ్మేముహూర్తే=బ్రహ్మముహూర్తమునందు; ఉత్తిష్ఠేత్=లేవ వలయును (నిద్రనుండి);

**తాత్పర్యము :** ఆరోగ్యవంతుడు ఆయుస్సును రక్షించుట కొరకు ముందు రోజు తాను భుజించిన ఆహారము జీర్ణమైనది లేనిది నిర్ణయించుకొని బ్రహ్మ ముహూర్తములో నిద్రనుండి లేవవలయును.

***శశిలేఖ :*** ముహూర్తమనగా రెండు నాడికలు. బ్రహ్మయోగ్యమైన కాలము యోగ శాస్త్రముల యందు రాత్రియొక్క పశ్చిమ యామమున్గ

నిశ్చయింప బడినది. రాత్రికి పగటికి ఆ పశ్చిమ యామము సంధ్యా సంసర్గ కాలము కాగలదు. సంధ్యాకాలము నందు స్వప్నము (నిద్ర) నిషేధింప బడినది. జ్యోతిశాస్త్రమునందు సూర్యోదయము మొదలుకొని 28 ముహూర్తమని కలదు. ఆ సిద్ధాంత మిచట సమన్వయించుటకు సాధ్యముకాదు. అన్నము జీర్ణమగు కాలములో నిద్రపోరాదు. అందు పై నుదాహరించిన సంధ్యాకాలము గూడ నిద్రించుటకు నిషేధింప బడినది. అదియే బ్రహ్మముహూర్తము. తెల్ల వారుటకు ముందు 4 గంటలకు బ్రహ్మముహూర్తమని భావము. రాత్రి భుజించిన ఆహారము జీర్ణమైనది లేనిది నిర్ణయించుకొని నిద్రనుండి లేవ వల యును. ఆహారము జీర్ణము కానియెడల నిద్రనుండి లేవకూడదు.

**వి.వ్యా :** రాత్రియొక్క చతుర్దశ ముహూర్తము బ్రాహ్మముహూర్తము ముహూర్తమనగా ద్విఘటికా కాలము. ఇట బ్రాహ్మీ ముహూర్తమనగా రాత్రియొక్క కడపటి యామము నందలి రెండు ఘడియల కాలముఅని అర్థము. అట్టికాలములో స్వస్థుడు నిద్రనుండి లేవవలయును. స్వస్థుడనగా ఆరోగ్యవంతుడని భావము: బ్రాహ్మీముహూర్తము బ్రహ్మజ్ఞానాధ్యయనాదులకు యోగ్యమైన కాలము (స్వస్థలక్షణము సుశ్రుతములో సూ. అ. 15/48 శ్లో॥) "సమదోషః సమాగ్నిశ్చ సమధాతు మలక్రియః, ప్రసన్నాత్మేంద్రియమనాః స్వస్థ ఇత్యభి ధీయతే" అని చెప్పబడినది. పై నుదాహరించిన శ్లోకమును పురస్కరించుకొని సమమైన వాతాది దోషములు జాఠరాగ్ని రసాది సప్తధాతువులు త్రివిధములు శారీరక క్రియలు గలవాడును నిర్మలమైన ఇంద్రియములు మనస్సు గలవాడును నగు స్వస్థుడు (అనగా ఆరోగ్యవంతుడు) ఆయుః పరిపాలనార్థము బ్రాహ్మీ ముహూర్తమున నిద్రనుండి లేవవలయును. ఇట్లు మేల్కొనిన వానికి రోగములు, దరిద్రము ఉండవు. ఇచట స్వస్థః అని ఉదహరించి నందున రోగి బ్రాహ్మీ ముహూర్తమున నిద్రనుండి లేవకూడదని గ్రహించ వలయును.

మూ॥ జాతవేగః సముత్సృజేత్॥

ఉదఙ్ముఖో మూత్ర శకృద్దక్షిణాభిముఖో నిశి।
వాచం నియమ్య ప్రయతః సంవీతాంగో ఽవగుంఠితః॥
ప్రవర్తయేత్ ప్రచలితం నతుయత్నాదుదీరయేత్।
నామేధ్యమార్గ మృద్భస్మగోస్థానాకీర్ణగోమయే॥
పురాన్తికాగ్ని వల్మీకదమ్యోత్కృష్ట చితిద్రుమే।
ననాదీ పూజ్య గోర్కేందు వాయ్వమ్బ్వాగ్ని జలంప్రతి॥
నచాతిరస్కృత్య మహీం భయా శక్తోఽస్తు కామతః।

**ప్రతిపదార్థము ;** జాతవేగః=మలమూత్రాదివేగములు ప్రవర్తించినవి కాగా; ఉదఙ్ముఖః=ఉత్తరాభిముఖము గలవాడై ; ప్రాతః=ప్రాతఃకాలమున; **మూత్రశకృత్**=మూత్రపురీషము; సముత్సృజేత్=వదలవలయును; నిశి=రాత్రి

యందు; దక్షిణాభిముఖః=దక్షిణాభిముఖుడై; సముత్సృజేత్=వదలవలయును; వాచంనియమ్య=మౌనమునుధరించి; ప్రయతః=ఏకాగ్రత కలవాడై; సంవీతాంగః=శరీరమంతయుకప్పుకున్నవాడై; అవగుంఠితః=శిరస్త్రాణముకలవాడై; ప్రచలితమ్=కదలిన వేగమును; ప్రవర్తయేత్=ప్రవర్తింప చేయవలయును; తు=అయితే; యత్నాత్=ప్రయత్నమువలన; నోదీరయేత్=వెలిపరచ కూడదు; అమేధ్య=అపరిశుద్ధస్థలము; మార్గ=మార్గము; మృత్=మట్టి అధికముగా గల స్థలము; భస్మ=బూడిదగల స్థలము; గోస్థానాకీర్ణ=ఆవుల మందలుగల ప్రదేశము; గోమయే=ఆవుపేడగల స్థలమునందు; నప్రవర్తయేత్=శౌచకార్యము నాచరించరాదు; పురాన్తిక=గ్రామ సమీపమున; అగ్ని=అగ్నికి సమీపమున; వల్మీక=పుట్టదగ్గర; రమ్య=సుందరమైన; ఉత్కృష్ట=ప్రశస్తమైన; చితి=స్మశానము; ద్రుమే=వృక్షము యొక్క క్రిందుగ మీదుగ; నప్రవర్తయేత్=శౌచ కార్యము చేయరాదు; నారీ=స్త్రీ సమక్షమున; పూజ్య=పెద్దల సమక్షమున; గో=ఆవుల యెదుట; అర్క-సూర్యాభిముఖముగ; ఇందు=చంద్రుని యెదుట; వాయ్వగ్ని జలంప్రతి=వాయువు అగ్ని జలముల కభిముఖముగ; నప్రవర్తయేత్=శౌచము నాచరించకూడదు; మహీం=భూమిని; అతిరస్కృత్య=త్రవ్వక; న ఉత్సృజేత్=వదలకూడదు; యాదాతు=ఎప్పుడైతే; భయా=చోరాది భయముచేత; అశక్త్యా=శారీరక బాధలచేత శక్తిలేకపోవుటచేత; కామతః=ఇష్టానుసారముగా; ఉత్సృజేత్=విడువవలెను.

**తాత్పర్యము :** మలమూత్రవేగములను విసర్జించుటకు కొన్ని విధులను విధించుచున్నారు. ఉత్తరాభిముఖుడై ప్రాతఃకాలమున, దక్షిణాభిముఖుడై రాత్రియందు మలాదుల విసర్జించవలయును. మౌనమును ధరించి ఏకాగ్రచిత్తుడై శరీరమంతయు కప్పుకొని శిరస్త్రాణమును ధరించి అప్రయత్నముగ మలాదులను విసర్జించవలయును. అపరిశుద్ధప్రదేశముల యందు గోష్ఠమున పెద్దల సమక్షమున సూర్యచంద్రులకభిముఖముగ వాయువు జలము అగ్ని సమక్షమున పుట్టదగ్గర స్మశానమున చెట్టుమీదగాని క్రిందగాని శౌచకార్యముచేయరాదు. భూమిని త్రవ్వక శౌచము వదలకూడదు. చోరాది భయముచేత శారీరక బాధలచేత అశక్తతవలన ఇష్టానుసారముగ మలాదులను విడువవచ్చును.

**శశిలేఖ :** బలాత్కారముగ మలాదులను విసర్జించప్రయత్నించిన వాతాదులకు ప్రకోపమేర్పడును. 'మృత్' శబ్దమున కీచట పుట్ట (వల్మీక) యని అర్థము. 'పూజ్య' శబ్దమునకు గురువు మొదలగువారని అర్థము.

మూ॥ న వేగితో ఽన్యకార్యః స్యాన్నాజిత్వాసాధ్యమామయమ్।

**ప్రతిపదార్థము :** వేగితః=మలమూత్రముల వేగము కలవాడై; అన్య కార్యః=ఇతర కార్యములు కలవాడుగా; నభవేత్=ఉండకూడదు. సాధ్య

మపి=సాధ్యమైనట్టి; ఆమయమ్=వ్యాధిని; అజిత్వా=జయించక (చికిత్సచేయక); న అన్యకార్యః భవేత్=ఇతర కార్యములు కలవాడుగా ఉండకూడదు.

**తాత్పర్యము :** ఇతర కార్యముల యందు చొరక మొదట మలమూత్ర వేగములను వదలవలయును. అట్లే చికిత్సా సాధ్యమైన వ్యాధిని వెంటనే చికిత్స చేసి ఆ వ్యాధిని శాంతింప చేయవలయును.

మూ॥ నిశ్శల్యాదుష్టమృత్పిండి పరిమృష్టమలాయనః
అభ్యుద్ధృతాభిః శుచిభిరద్భిరశ్రుద్భిశ్చ యోజయేత్॥
లేపగంధావపహం శౌచమనుత్పతితబిందుభి॥॥

**ప్రతిపదార్థము :** నిశ్శల్యా=పుల్లలు ముండ్లు లేనట్టి; అదుష్ట=యోగ్యమైనట్టి (వేటిచేత దూషింపబడని); మృత్పిండ=మట్టియుండలచేత; పరిమృష్ట=తుడిచికొనబడిన; మలాయనః=గుదము కలవాడై; అభ్యుద్ధృతాభిః=నదీతటాకాదుల నుండి కలశముచేతగాని దోసిలిచేతగాని తీసికొనిరాబడిన; శుచిభిః=పరిశుద్ధములైన; అనుత్పతిత బిందుభిః=క్రిందబడని బిందువులుకల; అద్భిః=నీళ్ళచేత; లేపగంధావహం=ప్రక్కలకు కరుచుకున్న దుర్వాసనగల మలస్థానము; శౌచం=శౌచమును; యోజయేత్=చేయవలెను.

**తాత్పర్యము :** పరిశుద్ధమైన యోగ్యమైన మట్టి ఉండలచేత గుదముసు తుడిచికొని నదీతటాకాదుల నుండి తెచ్చిన శుభ్రమైన నీళ్ళతో ప్రక్కలకు కరచుకొన్నది పోవునట్లు దుర్వాసన నశించునట్లుగా గుదస్థానము శుభ్రపరచవలెను.

**శశిలేఖ :** ఈ శ్లోకము నందు 'అభ్యుద్ధృతాభిః' అని చెప్పుట నదీ తటాకాదుల నుండి నీరు తీసుకొనివచ్చి గుదమును శుభ్రపరచవలయునే కాని నడుము వరకు నదిలోనే ఉంచి శౌచము నాచరించరాదని చెప్పుటకట్లు చెప్పబడినది. 'లేపగంధావహం' అని చెప్పుట గుదము నందలి లేపము (ప్రక్కలకు కరుచుకున్నది) దుర్గంధము దేనితో నశింపబడగలదో అని అర్థము. 'అనుత్పతితబిందుభిః' అని చెప్పుట వలన క్రిందబడిన నీరు పనికిరాదని భావము.

మూ॥ స్పృష్టాధాతూన్ మలానస్రు వసాకేశనఖాంశ్చ్యుతాన్॥
స్నాత్వాభోక్తుమనా భుక్త్వాసుప్తాసుత్వాసురార్చనే।
రథ్యామాక్రమ్య చాచామే దుపవిష్ట ఉదఙ్ముఖః॥
ప్రాఙ్ముఖోవావివిక్తస్థోనబహిర్జానునాన్యదృక్।
అజల్పన్నుత్తరాసంగీస్వచ్ఛైరంగుష్ఠ మూలగై॥
నోద్ధృతైర్నానతో నోర్ధ్వం నాగ్ని పక్వైర్నపూతిభిః।
నఫేన బుద్బుదక్షారైర్నైక హస్తార్పితైర్జలై॥
నార్ద్రైకపాణిర్నామేధ్యహస్తపాదో న శబ్దవత్।

**ప్రతిపదార్థము :** ధాతూన్ = రక్త మాంస మేధో అస్థి మజ్జ శుక్రములను; మలాన్ = మలమూత్ర స్వేదములను; చ్యుతాన్ = జారిన; అశ్రు = కన్నీటిని; వసా = వసను; కేశ = వెంట్రుకలను; నఖాన్ = గోళ్ళను; స్పృష్ట్వా = తాకి; ఆచామేత్ = ఆచమనము చేయవలెను; స్నాత్వా = స్నానముచేసి; భోక్తుమనాః = భుజించుటకు కోరిక కలవాడై; భుక్త్వా = భుజించి; సుప్త్వా = నిదిరించి; క్షుత్వా = తుమ్మి; సురార్చనే = దేవతార్చన ప్రారంభించునపుడు; రథ్యామాక్రమ్య = మార్గమున సంచారము చేసిన తరువాత; ఉదఙ్ముఖః = ఉత్తరాభిముఖుడై; ప్రాఙ్ముఖో వా = లేదా పూర్వాభిముఖుడై; దిశం = దిక్కును; ఈక్షమాణః = చూడబడినవాడై; వివిక్త స్థః = ఒంటరిగా కూర్చున్నవాడై; అజల్పన్ = మౌనమును ధరించిన వాడగుచు; నబహిర్జాను = మోచేతులు వెలుపటి లేకుండా; నాన్యదృక్ = దృష్టిని మరల్చక; ఉత్తరాసంగీ = వస్త్రాచ్ఛాదనము కలవాడై; స్వచ్ఛైః = పరిశుద్ధమైన; అంగుష్ఠమూలాగ్రైః = బొటనవ్రేలుగుండా వెళ్ళుచున్నట్టి; నోద్ధృతైః = ఎడ తెరిపిలేనిధారతో ఇవ్వబడిన; నాఽనతీతః = వంచనట్టి; నోర్ధ్వం = ; పైకి లేపనట్టి; నాగ్నిపక్వైః = కాచనట్టి; నపూతిభిః = చెడ్డవాసన లేనట్టి నఫేన = నురుగులేని; నబుద్బుద = బుడుగలులేని; నక్షారైః = ఉప్పునీరు కానట్టి; న ఏకహస్తార్పితైః = ఒక చేతితో ఇవ్వబడనట్టి; జలైః = నీళ్ళతో: నార్ద్రైక పాణిః = తడిగాలేని చేతులుగల; నామేధ్యహస్తపాదః = శుద్ధమైన కాళ్లుచేతులు కలవాడై; నశబ్దవత్ = శబ్దము చేయకుండా; ఆచామేత్ = ఆచమనము చేయవలెను.

**తాత్పర్యము :** ఆచమనవిధిని ఇట్లు విధించుచున్నాడు. మలమూత్ర విసర్జనము చేసిన తరువాతనేకాక రక్తాదిధాతువులను మలాది మలములను వసను తాకినప్పుడు మరియు వెంట్రుకలు, గోళ్ళు శరీరము నుండి జారిక్రిందపడినపుడు శరీరమునకు తాకినను స్నానము చేసిన తరువాత, తుమ్మిన తరువాత, దేవతార్చన చేయుటకు ముందు పూర్వాభిముఖుడై లేదా ఉత్తరాభిముఖుడై దిక్కునే చూచుచూ మౌనముగా ఒంటరిగా కూర్చుండి మోచేతులు వెలుపలికి లేకుండా శరీరముపై నుత్తరీయము కప్పుకొని అంగుష్ఠమూలముగ స్వచ్ఛజలముతో ఆచమనము చేయవలయును. ఉప్పుగా నుండక బుడగలు లేక వేడిలేని నీరుగా నుండి దుర్గంధము లేక పరిశుభ్రముగ నుండు జలముతో కాళ్ళుచేతులు శుభ్రముగ ప్రక్షాళనము చేసికొని నిలబడక ఆచమనము చేయవలెను.

**శశిలేఖ :** 'ఆచామేత్' అనగా నీటితో తాకవలెనని అర్థము. 'వసా' యనగా నీటితో పోలికగల మేధస్సుయొక్క భాగము. ఈ విషయమునే చరకాచార్యుడు 'శుద్ధమాంసస్యయస్నేహః సావసా పరికీర్తితా' అని నుడివెను. రథ్యామాక్రమ్య అనగా మార్గమునందు సంచరించి అని అర్థము. 'న శబ్దవత్' అనగా జలపాన సమయమునందు శబ్దము చేయరాదు అని అర్థము,

మూ॥ వటాసనార్క ఖదిర కరంజ కరవీరజం॥
సర్జారిమేదాపామార్గ మాలతీకుకుభోద్భవమ్।
కషాయతిక్త కటుకం మూలమన్యదపదృశమ్॥
విజ్ఞాత వృక్షంఋజ్వగ్ర మృజ్వగ్ర గ్రంధి సుభూమిజమ్।
కనీన్యగ్ర సమస్థౌల్యం సుకూర్చం ద్వాదశాంగులమ్॥
ప్రాతర్భుక్త్వా చ యతవాగ్భక్షయే ద్దన్తధావనమ్।
వ్యాప్యత్రివర్గ త్రితయ క్షౌద్రాక్తేన చ ఘర్షయేత్॥
శనైస్తేన తతోదన్తాన్ దంత మాంసాస్య బాధయన్।

ప్రతిపదార్థము : వట=మఱ్ఱి; అసవ=వేగిస (పచ్చమద్ది); అర్క=జిల్లేడు; ఖదిర=చంద్ర; కరంజ=కానుగు; కరవీరజం=వాడగన్నేరును; సర్జ=సర్జవృక్షము; అరిమేద=దుర్గంధిచంద్ర, కంపుచంద్ర; అపామార్గ=ఉత్తరేణు; మాలతీ=జాజి; కుకుభోద్భవమ్=మద్దిలో నుండి పుట్టిన; మూలం=వేరును; కాష్ఠం=కాష్ఠమును (కఱ్ఱను); కషాయ కటు తిక్తకం=వగరు కారము చేదుగల దానిని; ఈదృశమ్=ఇట్టి; అన్యదపి విజ్ఞాతవృక్షం=తెలిసిన (గుర్తెరిగిన) మరియొక వృక్షమైనప్పటికి కూడ; ఋజ్వాగ్రం=వంకరలేని కొనగల; ఋజు=మంచి కొనగల; అగ్రంధి=గ్రంథులు లేని; సుభూమిజమ్=మంచిపరిశుద్ధమైన భూమిలో పుట్టిన; కనీన్యగ్ర సమస్థౌల్యం=కొనచిటికెన వ్రేలితో సమానమైన లావుగలిగినట్టి; సుకూర్చం=మెత్తనైన మంచి కుంచికగానున్నట్టి; ద్వాదశాంగుళం=పండ్రెండంగులముల నిడుపుగల; మూలం=మూలమును; యతవాక్=మౌనముగలవాడై; ప్రాతః=ప్రాతఃకాలమున; భుక్త్వాచ=భోజనము చేసి; దంతమాంసాని=దంతముయొక్క చిగుళ్ళను; అబాధయన్=బాధపెట్టక (హింసించక); దంతధావనం=పండ్లు తోముటకుగాను; భక్షయేత్=తినవలయును; వ్యాప్య=చంగల్వకోష్ఠు; త్రివర్గ=త్రికటుకములు (శుంఠి, పిప్పళ్ళు, మిరియాలు); త్రితయ=త్రిఫలములు (కరక తాడి ఉశిరికలు); క్షౌద్రాక్తేన=తేనెతో కలసిన; తేన=ఆ దంత కాష్ఠముచేత; శనైః=మెల్లెగా; దంతాన్=పండ్లను; ఘర్షయేత్=తోమవలయును (రుద్దవలయును).

తాత్పర్యము: పైనుదాహరించిన విధిప్రకారము శౌచకార్యము నాచరించి తరువాత దంతధావన కాష్ఠమును భక్షించవలయును. మఱ్ఱి, వేగిస, జిల్లెడు మొదలగు కాష్ఠములతో పండ్లు తోముకొనవలయును. ఈ కాష్ఠములు ఏవి అయినప్పటికిని వగరు, కారము, చేదురసములు గలవిగా ఉండవలయును. ఈ దంతకాష్ఠము వంకర లేక గ్రంథులు లేకుండ చిటికెన వ్రేలుతో సమానమైన లావు గలిగి మృదువైన కుంచికవలె ఉండి పండ్రెండంగుళముల నిడుపు కలదిగా నుండవలయును. ఇట్టి పుల్లను మౌనము ధరించి ప్రాతఃకాలమున, భోజనము చేసిన తరువాత దంతముల యొక్క చిగుళ్ళకు బాధ కలుగకుండ దంతధావనము చేసికొనవలయును,

**శశిలేఖ :** 'విజ్ఞాత వృక్షం' అనగా వృక్షములు మోహింప చేయు నట్టివి ఆకర్షణగలవి, అనేక శక్తులు కలవిగా చూడబడుట వలన తనకు తెలిసిన కాష్ఠమునే గ్రహించ వలయునని అర్థము. 'సుభూమిజం' అనగా స్మశానాదులలో పుట్టినవి గ్రహించరాదని అర్థము. 'వ్యాప్య త్రివర్గ త్రితయ క్షేత్రదాక్తైన' అనగా చంగల్వకోష్ఠు మొదలగు ద్రవ్యములు గల ప్రదేశములు దంతధావనమును చేయ వలెనని అర్థము.

మూ॥ లిఖేదనుసుఖం జిహ్వాం జిహ్వానిర్లేఖనేనచ॥
తథాస్యమల వైరస్యగంధా జిహ్వాస్య దన్తజాః।
రుచి వైశద్యలఘుతాఽనభవన్తి భవన్తి చ॥

**ప్రతిపదార్థము :** జిహ్వానిర్లేఖనేనచ=నాలుకను గీచునట్టి సాధనముచేత; జిహ్వాం=నాలుకను; అనుసుఖం=బాధకలుగనీయక; లిఖేత్=గీచుకొనవలయును జిహ్వాస్యదంతజాః=నాలుక నోరు దంతముల యందు పుట్టిన; ఆస్యాముఖవైరస గంధాః=నాలుకయందలి మలము; విరసత్వము, దుర్గంధములు; నభవంతి=ఉండవు, తథా=అట్లే; రుచివైశద్యలఘుతాః=రుచినైర్మల్యము, లఘుత్వము; భవన్తి=కలుగును.

**తాత్పర్యము :** నిశ్శబ్దముగ దంత ధావనము చేసికొని నాలుకను గీచు నట్టి సాధనముచే దంత మూలములకు బాధ కలుగనీయక నాలుకను గీచు కొనవలయును. నాలుకను గీచుటచేత నాలుక యందలి మలము, విరసత్వము, నాలుక నోరు దంతములు వీనియందు దుర్వాసన, రక్తము మొదలగునవి కారుట,; దురద కలుగకుండును. రుచి నైర్మల్యము, లఘుత్వము కలుగును.

**శశిలేఖ :** 'జిహ్వానిర్లేఖనేనచ' అని చెప్పుటచేత స్వర్ణము, రజతము మొదలగు లోహాదులచేత తయారు చేయబడిన సాధనములచేత కూడ నాలుక గీచుటకు ఉపయోగింపవచ్చునని అర్థము. తరువాత కొద్దిగా కూడ దంతమాంస లను బాధింపక నాలుకను గీచవలయును.

మూ॥ నాద్యాదజీర్ణవ మథుశ్వాసకాస జ్వరార్దితీ।
తృష్ణాస్యపాకహృన్నేత్ర శిరః కర్ణామయీచతత్॥

**ప్రతి పదార్థము :** తత్ = ఆ దంతధావనమును; అజీర్ణ = అజీర్ణము వమధు=వాంతి; శ్వాస=శ్వాసము; కాస=దగ్గు; జ్వర=జ్వరము; అర్దితీ=అర్దిత వాతము; తృష్ణా=దప్పి; ఆస్యపాక్=ముఖపాకము; హృత్=హృదయము; నేత్ర=నేత్రములు; శిరఃకర్ణామయా=శిరస్సుకర్ణములు (చెవులు) వీనియందు రోగము గలవారు; నాద్యాత్=భుజించరాదు (నమలకూడదు).

**తాత్పర్యము :** అజీర్ణము, వాంతి, శ్వాసము, కాసము, జ్వరము, అర్దిత వాతము, దప్పి, ముఖపాకము అను రోగములు కలవారు; హృదయము,

ఓష్ఠము, నేత్రములు, శిరము, కర్ణములు, పీనియందు రోగములుకలవారు; దంత కాష్ఠములచే దంతధావనము చేసికొనరాదు.

*శశిలేఖ :* 'ఆమయ' అను శబ్దముచే రోగపర్యాయముగా గ్రహింప వలెను. ఈ శబ్దమును హృద్యాదులతో అన్వయించవలెను.

మూ॥ నైవశ్లేష్మాత్కారిష్టవిభీతధవధన్వజాన్।
బిల్వవంచుళ నిర్గుండీశిగ్రుతిల్వక తిందుకాన్॥
కోవిదారశమీపీలు పిప్పలేంగుదగుగ్గులూన్॥
పారిభద్రకమమ్లీ కామోచక్యాశాల్మలీంశణమ్॥
స్వాద్వమ్లలవణం శుష్కంసు షిరంపూతి పిచ్ఛిలమ్।

*ప్రతిపదార్థము :* శ్లేష్మాతక=విరిగిచెట్టు; అరిష్ట=కుంకుడుచెట్టు; విభీతక=కరకచెట్టు; ధవ=ఉమ్మెత్తచెట్టు (చంద్రచెట్టు); ధన్వజాన్=మెట్టనేలలో పుట్టిన వృక్షములను; బిల్వ=మారేడు; వంచుల=అశోకము త్రినాసము, (పబ్బచెట్టు); నిర్గుండీ=వావిలి; శిగ్రు=మునగ; తిల్వక=లొద్దుగుచెట్టు; తిందుకాన్=తుమికిచెట్లను; కోవిదార=ఎఱ్ఱకాంచనపుచెట్టు; శమీ=జమ్మిచెట్టు; పీలు=గోలుగుచెట్టు (తాటిచెట్టు); పిపలీ=పిపలిచెట్లు; ఇంగుద=గారచెట్టు; గగ్గులూన్=గుగ్గిలపుచెట్లను; పారిభద్రక=దేవదారుచెట్టు (వేపచెట్టు, మునగచెట్టు);అమ్లికా=చింతచెట్టు; మోచక్యా=అరటిచెట్టు (బూరుగుచెట్టు); శాల్మలీం=బూరుగుచెట్టును; శణమ్=జనుమును; వనై అదాత్=తినరాదు (పండ్లుతోమరాదు) చ=మరియు; స్వాద్వమ్లలవణం=తీపు, పులుపు, ఉప్పుగాను; శుష్కం=ఎండినదానిని; సుషిరం=బెజ్జముగలదానిని; పూతి=దుర్గంధముకలదానిని; పిచ్ఛిలం=సడలినదానిని; నకదాపిఅద్యాత్=ఎప్పుడునూతినరాదు.

**తాత్పర్యము :** విరిగిచెట్టు మొదలగు వాటి పుల్లలను, తీపి పులుసు ఉప్పురసములు గలదానిని, ఎండినదానిని, బెజ్జముగల దానిని, దుర్గంధము గల పుల్లలతో ఎప్పుడునూ పండ్లను తోముకొనరాదు.

మూ॥ పలాశమాసనం దంతధావనం పాదుకేత్యజేత్

*ప్రతిపదార్థము :* పలాశం=మోదుగను; ఆసనం=ఆసనముగాను; దంతధావనం=దంతధావనమునకుగాను; పాదుకే=పాదుకలుగాగాను; త్యజేత్=వదలవలెను.

**తాత్పర్యము :** మోదుగను పండ్లుతోముటకుగాని పీటచేయించిఆసనములుగా ఉపయోగించుటగాని, పాదుకలు చేయించుటకు గాని ఉపయోగపడవు. కావున వాటిని పై నుదహరించిన వాటికి ఉపయోగించరాదు.

మూ॥ దంతాన్పూర్వ మధోఘర్షేత్ప్రాతస్సించేచ్చలోచనే।
తోయపూర్ణముఖో గ్రీష్మ శరదోః శీతవారిణా॥

**ప్రతిపదార్థము**; అధోదన్తాత్ = క్రిందిపండ్లను; పూర్వం = మొదట; ఘర్షేత్ = తోమవలెను (రుద్దవలెను.): ప్రాతః = ఉదయము (ప్రాతఃకాలమున); **లోచనే** = నేత్రములను; గ్రీష్మశరదోః = గ్రీష్మఋతువు శరదృతువుల యందు; తోయ పూర్ణముఖస్సన్ = నీటితో నింపబడిన ముఖముగలవాడగుచు; శీతవారిణా = చల్లటి నీటితో; సించేత్ = తుడుపవలెను.

**తాత్పర్యము :** దంతకాష్ఠముతో పండ్లు తోమునపుడు ముందుగా క్రిందు భాగమునగల పలువరుసను తోమవలెను. ప్రాతఃకాలమున గ్రీష్మ శర దృతువుల యందు నీటితో నింపబడిన ముఖముగలవాడై చల్లటినీటితో నేత్రము లను తుడుపవలెను.

**శశిలేఖ :** 'గ్రీష్మశారదోః' అని చెప్పినందు వలన ఇతర ఋతువుల యందు చల్లటి నీటితోకాక వేడినీటితో పై విధిని అనుసరించి నేత్రములను తుడువవలెనని భావము. కాని అన్ని ఋతువులయందును పైనుదాహరించిన విధి అనివార్యము.

మూ॥ **ప్రణమ్యదేవాన్ వృద్ధాంశ్చ మంగళాష్టశతం శుభమ్।**
**శృణ్వన్ కాంచన విన్యస్తం సర్పిఃపశ్యేదనంతరమ్॥**

**ప్రతిపదార్థము :** దేవాన్ = దేవతలను; వృద్ధాంశ్చ = వృద్ధులను (కు); ప్రణమ్య = నమస్కరించి; మంగళాష్టశతం = దూతాది విజ్ఞానీయమునందు చెప్ప బోవు మంగళమును; శుభం = మంగళమైన దానిని; శృణ్వన్ = వినుచు; అనంతరం = తరువాత; కాంచన విన్యస్తం = బంగారు భాండమునందుంచబడిన; సర్పిః = నెయ్యిని; పశ్యేత్ = చూడవలెను.

**తాత్పర్యము :** దూతాది విజ్ఞానీయమునందు చెప్పబోవు మంగళకరము లైన విషయములను వినుచూ దేవతలకు, వృద్ధులకు నమస్కరించిన తరువాత బంగారు పాత్రయందుంచబడిన నెయ్యిని చూడవలెను.

మూ॥ **సౌవీరమంజనం నిత్యం హితమక్ష్ణో స్తతో భజేత్।**
**లోచనే తేనభవతో మనోజ్ఞే సూక్ష్మదర్శనే॥**
**వ్యక్త త్రివర్ణే విమలే సుస్నిగ్ధ ఘనపక్ష్మణీ।**

**ప్రతిపదార్థము :** తతః = తరువాత; సౌవీరమంజనం = సౌవీరాంజన మును; నిత్యం = ప్రతిదినమును; అక్ష్ణోః = నేత్రములకు; హితం = మంచిదిగాన; భజేత్ = సేవించవలెను; తేన = ఆ అంజనముచేత; లోచనే = నేత్రములు; మనోజ్ఞే = సుందరమైనవిగా; సూక్ష్మదర్శనే = సూక్ష్మమైన రూపమును చూచు నట్టివిగా; వ్యక్తత్రివర్ణే = ఎరుపు తెలుపు నలుపు రూపములు వ్యక్తములుగా నుండుటవలన; విమలే = నిర్మలములుగాను; సుస్నిగ్ధ ఘన పక్ష్మణీ = మనుపైన గట్టివైన రెప్పలుగలవిగాను; భవతః = ఉండును (అగుచుండును).

**తాత్పర్యము :** దంతధావనము చేసిన తరువాత కన్నులకు శ్రేష్ఠమైన సౌవీరాంజనమును ప్రతి దినము కన్నులయందు అంజనము (కాటుక) వేసికొన వలయును. ఇట్లు కన్నులలో ప్రతినిత్యము సౌవీరాంజనమును వేయుటవలన నేత్రములు స్నిగ్ధముగ, ఘనమైన రెప్పలు గలవిగా స్పష్టమైన ఎరుపు తెలుపు నలుపు రంగులు గలవిగ నిర్మలముగ సూక్ష్మవస్తువులను చూడతగిన సామర్థ్యము గలవిగ అగును.

**మూ॥** చక్షుస్తేజోమయం తస్యవిశేషాచ్ఛ్లేష్మణోభయమ్।
యోజయేత్ సప్తరాత్రేఽస్మాత్ స్రావణార్థం రసాంజనమ్॥

**తాత్పర్యము :** చక్షుః=నేత్రము; తేజోమయం=అగ్ని భూతాధిక్యత గలది; తస్య=ఆనేత్రమునకు; విశేషాత్=విశేషముగా; శ్లేష్మణం=శ్లేష్మవలన; భయం=భయము; అస్మాత్=ఇందువలన (దీనివలన); సప్తరాత్రే=ఏడు దినముల లోపల; స్రావణార్థం=శ్లేష్మకరుగుట కొరకు; రసాంజనం=రసాంజనమును; యోజయేత్=ప్రయోగించవలయును.

**తాత్పర్యము :** నేత్రములు అగ్నిభూతాధిక్యతగలవగుటచేత వానికి విశేషముగ కఫముచే ఉపద్రవము కలుగును. కావున కన్నుల నుండి నీరుకారుటకై ఏడు దినములకొక పర్యాయము దార్వీక్వాథ సముద్భవమను పేరుగల రసాంజనమును నేత్రములయందు అంజనము వేసినకొనలయును.

**శశిలేఖ :** కంటికి వాతపిత్తముల కంటె శ్లేష్మదోషముల వలననే విశేషముగ భయము కలదు. ఇది పంచభూతాత్మకమైన ఇంద్రియము.

**మూ॥** అణుతైలం తతోనస్యం తతోగండూషధారణమ్।
ఘనోన్నత ప్రసన్నత్వక్ స్కంధ గ్రీవాస్యవక్షసః॥
సుగంధివదనాః స్నిగ్ధనిస్వనా విమలేంద్రియాః।
నిర్వలీపలిత వ్యంగాభవేయుర్నస్యశీలినః॥
ఓష్ఠస్ఫుటన పారుష్య ముఖశోషద్విజామయాః।
నస్యుఃస్వరోపఘాతాశ్చ స్నేహగండూష ధారణాత్॥
ఖదిరక్షీరి వృక్షారిమేదాంబుక బలగ్రహిః।
అరోచకాస్య వైరస్య మలపూతిప్రసేకజిత్॥
సుఖోష్ణోదక గండూషైర్జాయతే వక్త్రలాఘవమ్॥

**ప్రతిపదార్థము :** తతః=తరువాత; అణుతైలమ్ = అణుతైలమును; నస్యం=నస్యముగాను; తతః=తరువాత; గండూషధారణమ్=గండూషమును (పుక్కిలి పట్టుటను); కుర్యాత్=చేయవలెను; ఘన=వెడల్పు పొడవు లోతుగల ఘనపరిమాణముగల (దిటవుగల): గ్రీవ=మెడ; ఉన్నత=ఎత్తయిన; స్కంధ= మూపు; ప్రసన్నత్వక్=నిర్మలమైన చర్మము; సుగంధివదనాః=మంచివాసనగల

ముఖము; స్నిగ్ధనిస్వనాః=మధురస్వరము; విమలేంద్రియాః=నిర్మలమైన ఇంద్రియములు; నిర్మలీపలితవ్యంగాః=ముడుతలుపడుట (చర్మము) తెల్లగనగుట (వెంట్రుకలు) నల్లగానగుట (ముఖముమీద) ఉండకపోవుట; నస్యశీలినః=నస్యమును సేవించువారికి; భవేయుః=కలుగును; ఖదిర=చంద్ర; క్షీరివృక్షాః=క్షీరివృక్షములు; కవలగ్రహః=గండూషము (పుక్కిలించుట); అరోచక=నోటికి రుచిలేకపోవుట; ఆస్యవైరస్య=ఆస్యవైరస్యము (ముఖవైరస్యము); మల పూతి=మలదుర్గంధము; ప్రసేకజిత్=నోటనీరు వెడలుట వీటిని జయించును. సుఖోష్ణోదక=గోరువెచ్చ నీటియొక్క; గండూషైః=గండూషముచేత; వక్త్రలాఘవమ్=వక్త్రలాఘవమును; జాయతే=కలుగుచున్నది.

**తాత్పర్యము :** అంజనమును కన్నుల కలంకరించిన తరువాత నస్యకర్మ గండూష ధారణము క్రమముగా చేయవలెను. నస్యకర్మ నాచరించుట వలన దిటవుగలమెడ ఎత్తైనమూపు నిర్మలమైన చర్మము, మంచి వాసన గల ముఖము, మధురమైన కంఠస్వరము, నిర్మలమైన ఇంద్రియములు; చర్మముపైన ముడుతలు పడుట వ్యంగమను వ్యాధిలేకుండుట మొదలగు మంచి ఫలితములు కలుగును. గండూషము చేసినందువలన ముఖవైరస్యము మలదుర్గంధము మొదలగునవి ఎప్పుడును మానవుని దరిదాపులకు రాజాలవు.

**శశిలేఖ :** వ్యంగమనగా ముఖమునందు వల్లవి మచ్చలు అని అర్థము. ఖదిరాదులచేత కవలగ్రహము అరోచకాదులు లేకుండుటయే ప్రయోజనము. ప్రసేకమనగా ఆస్యస్రావము (నోటనీరుకారుట).

మూ. ప్రాయోగికం తతో ధూమం గంధమాల్యాది చాచరేత్॥
ధూమాదస్యోర్ధ్వజత్రూత్థా వస్యుర్వాతకఫామయాః॥

**ప్రతిపదార్థము :** తతః= అటుపిమ్మట; ప్రాయోగికం=ప్రాయోగికమను పేరుగల; ధూమం = ధూమపానమును; తతః = అటుపిమ్మట; గంధమాల్యాది=గంధము పూలమాలలు ధరించుట మొదలగునవి; ఆచరేత్=ఆచరించవలెను (చేయవలెను); అస్య = ఈ విధమగు పనులను చేయువానికి; ధూమాత్ = ధూమపానమువలన; ఊర్ధ్వజత్రూత్థాః=కంఠమునకు పైభాగమున ఏర్పడు; వాతకఫామయాః = వాతశ్లేష్మవికారములు; నస్యుః=ఉండవు.

**తాత్పర్యము:** నస్యకర్మ గండూషధారణమును నిర్వర్తించిన తరువాత ప్రాయోగిక ధూమపానమును తదుపరి గంధమాల్యాదులను ధరించుట చేయవలెను. ధూమపానము విధివిహితముగ నాచరించుటవలన కంఠమునకు పైభాగమున ఏర్పడు వాతశ్లేష్మవికారములు ఎప్పుడు ఉండవు.

**శశిలేఖ :** ఆదిశబ్దముచేత వాసాదులను గ్రహించవలెను. అక్షకసంధియను పేరుగల జత్రువునకు పైభాగమున (శిరస్సు పైభాగమున) వాతకఫముల వలన కలిగిన రోగములు ఉండవు.

**మూ॥ అంజనోత్క్లేశితం నస్యైః కబళైర్నావనేరితమ్॥**
**ధూమేనకబళోత్క్లిష్టం క్రమాద్వాత కఫంజయేత్।**
**గంధ మాల్యాదికం వృష్యమలక్ష్మీఘ్నం ప్రసాధనమ్॥**

***ప్రతిపదార్థము:*** అంజన = అంజనముచేత; ఉత్క్లేశితమ్ = వెలిపరుచబడినది; **నస్యైః** = నస్యములచేత; వాతం = వాతమును; జయేత్ = జయించవలయును; నావనా=నస్యముచేత; ఈరిత=వెలిపరుచబడిన; కబళైః = కబళములచేత; ఉత్క్లిష్టం=వెలిపరుచబడిన; కఫం=కఫమును; ధూమేన = ధూమపానముచేత; జయేత్ = జయించవలయును; గంధమాల్యాదికం = గంధము, మాలలు మొదలగునవి; **వృష్యం** = వాజీకరణమును; అలక్ష్మీఘ్నం = దరిద్రమును పారద్రోలునవిగను; ప్రసాధనం=అలంకారముగను; స్యాత్ = ఉండును.

**తాత్పర్యము :** అంజన నస్యకవలగ్రహములచేత ధూమపానముచేతను వాతకఫములు రెండును శాంతించును. గంధమాల్యాదులను ధరించుటవలన వీర్యవృద్ధి కలుగును. మరియు దరిద్రము పోవును. శరీరమునకు అలంకారముగ నుండి సౌందర్యము నినుమడింపజేయును.

***శశిలేఖ :*** అలక్ష్మీఘ్నం=దరిద్రమును పోగొట్టుట కాంతిని ఇనుమడింపజేయుట, వాజీకరణము గంధమాల్యాది ధారణమువలన కలుగునని అర్థము.

**మూ॥ వాసోనధారయేజ్జీర్ణం మలినం రక్తముల్బణమ్।**
**మాల్యం నలంబం నబహిర్న రక్తం జలజాదృతే॥**
**నైవచాన్యేన విధృతం వస్త్రం ప్రష్పముపానహౌ।**

***ప్రతిపదార్థము:*** జీర్ణం = శిథిలమైన; మలినం = మురికియైన రక్తం = ఎఱ్ఱనైన; వాసః = **వస్త్రము**ను; నధారయేత్ = కట్టుకొనకూడదు; మాల్యం=పుష్పమును; లంబం=మాలలను; నధారయేత్=ధరించకూడదు; బహిః=రాజమార్గమున కనబడుచున్నదానిని; నధారయేత్=ధరించకూడదు; జలజాదృతే = కమలమునువిడిచి; రక్తం = ఎఱ్ఱనైనదానిని; నధారయేత్=ధరించకూడదు; అన్యేన=ఇతరునిచేత; విధృతం=విడువబడిన; వస్త్రం= వస్త్రమును: నధారయేత్=ధరించకూడదు; అన్యేన=ఇతరునిచేత; విధృతం= విడిచిపెట్టబడిన; పుష్పం= పుష్పమును; ఉపానహౌ =చెప్పులను;నధారయేత్= ధరించకూడదు.

**తాత్పర్యము :** శిథిలమైన మురికిగానున్న ఎఱ్ఱనైన వస్త్రమును, పుష్పమును, పుష్పమాలలను రాజమార్గము నందున్న పుష్పములను, కమలములుతప్ప ఎఱ్ఱగా నున్నవేటిని కూడ ధరించరాదు. ఇతరులు విడిచిన వస్త్రమును, చెప్పులను, పుష్పములను కూడ ధరించరాదు, మరియు శిథిలమైన వస్త్రమును ధరించకూడదు,

**శశిలేఖ :** మాల్యం అనగా పుష్పం అని అర్థం. లంబం మాలా మొదలగునవి ధరించకూడదు. కమలముతప్ప మిగత ఎఱ్ఱనైనపుష్పములను వేటిని కూడ ధరించరాదు. ఇతరులు కట్టివిడిచిన వస్త్రమును ధరించరాదు. ఇట్లే పుష్పములను చెప్పులను కూడ ధరించరాదు.

మూ॥ రుచివైశద్య సౌగంధ్య మిచ్ఛన్వక్త్రేణధారయేత్॥
జాతీలవంగ కర్పూర కంకోల కటుకైః సహ।
తాంబూలీనాం కిసలయం హృద్యం పూగఫలాన్వితమ్॥
రక్తపిత్త క్షతక్షీణ రూక్షోత్కుపిత చక్షుషాం।
విషమూర్ఛా మదార్తానా మపథ్యం శోషిణాంచ తత్॥
పథ్యం సుప్తోత్థితే భుక్తే స్నాతే వాంతే చ మానవే।
ద్విపత్రమేకం పూగంచ సచూర్ణ ఖదిరంచ తత్॥

**ప్రతిపదార్థము :** రుచి...ఇచ్ఛన్—రుచి=నోటికిరుచిని; వైశద్య=పరిశుభ్రతను; సౌగంధ్యం = మంచివాసనను; ఇచ్ఛన్ = కోరుచున్నవాడు తాంబూలీనాం = తమలపాకుతీగలయొక్క; కిసలయం = చిగురుటాకులను హృద్యం=మనస్సున కింపైనదానినిగాను; పూగఫలాన్వితం=పోకలతోకూడుకున్నట్టిదియు; జాతీలవంగ...కటుకైః—జాతీ = జాజికాయ; లవంగ = లవంగము; కర్పూర = కర్పూరము; కంకోల =కంకోలము; కటుకైఃసహ= పూదీన మొదలగు కటుద్రవ్యములచేతకూడ; వక్త్రేణ=ముఖముతో (నోటితో) ధారయేత్=ధరించవలయును; రక్తపిత్త...చక్షుషామ్- రక్తపిత్త=రక్తపిత్తము క్షతక్షీణ = క్షతక్షీణము; రూక్షోత్కుపిత = రూక్షముచేత ప్రకోపింపబడిన చక్షుషాం=నేత్రరోగములుగలవారికి; విష...నామ్-విష = సర్పాది జంగమ విషపీడితులకు; మూర్ఛ=మూర్ఛరోగులకు; మదార్తానామ్=మదముచేతపీడింపబడువారికి; శోషిణాంచ = రాజయక్ష్మ రోగులకును; తత్ = ఆ తాంబూలము అపథ్యం = హితమైనది కాదు. సుప్తోత్థితే = నిద్రనుంచి లేచినవానియందు; భుక్తే = భుజించినవానియందు; స్నాతే = స్నానము చేసినవానియందు; వాంతేచ = మరియు వాంతి చేసికొనినటువంటి; మానవే = మానవునియందు; సచూర్ణ ఖదిరం = సున్నము కాచును; ద్విపత్రం = రెండు తమలపాకులును; ఏకం పూగంచ=ఒక పోకయును; తత్=అట్టిది (తాంబూలము); పథ్య=హితమైనది.

**తాత్పర్యము :** మానవుడు నోటి సౌభాగ్యమును, రుచినీ, మంచి సువాసనను కోరినట్టివాడై మామనస్సున కింపైనట్టి పోకతో కూడుకొన్నట్టి నాగవల్లీ దళములను (లేత తమలపాకులను); జాజికాయ, లవంగములు, కర్పూరము, కంకోలములు, పూదీన మొదలగువాటితోకూడ సేవించవలయును.

పై నుదాహరించిన తాంబూలము రక్తపిత్తము గలవారికి, క్షతక్షీణులకు నేత్రరోగములు గలవారికి సర్పాది దష్టులకు, మూర్ఛ రోగులకు మదముచేత పీడింపబడినవారికి రాజయక్ష్మరోగులకును పథ్యకరమైనదికాదు.

పైన వర్ణించిన తాంబూలమునకంటె స్వల్పమార్పుతో మరియొక పద్ధతిని ఇచట విధించుచున్నాడు. భోజనము చేసిన తరువాత, స్నానము చేసిన తరువాత, వాంతియైన పిదప ప్రతిపురుషుడు కాచు సున్నము ఒకపోక రెండు తమలపాకులతో కూడిన తాంబూలమును సేవించవలయును. ఇది మిక్కిలి పథ్యకరమైనది.

**శశిలేఖ**: కిసలయ శబ్దమునకు పల్లవమని యర్థము. పల్లవమనగా చిగురుటాకు. మరియు రక్తపిత్తాది ఉపద్రవములచేత పీడింపబడువానికి ఈ తాంబూలము మంచిది కాదు. రూక్షేణకుపితాని చక్షూంషి యేషాంతే రోక్షోత్కుపిత చక్షుషః తేషాం అనిసమాసము.

**మూ॥** ఉత్తిష్ఠేతతతోఽత్యర్థమర్థేష్వర్థాను బంధిషు।
నిందితం దీర్ఘమప్యాయు రసన్నిహిత సాధనమ్॥
కృషిం వణిజ్యాం గోరక్షా ముపాయైర్గుణినం నృపమ్॥
లోకద్వయావిరుద్ధాంచ ధనార్థీసంశ్రయేత్ క్రియామ్॥
ముక్తవేగశ్చ గమనస్వప్నాహార సభాస్త్రియః॥

**ప్రతిపదార్థము**: తతః = అటుతరువాత: అత్యర్థం = మిక్కిలి; అర్థానుబంధిషు = సంపాదనకు హేతువులైన; అర్థేషు = కార్యములయందు, ఉత్తిష్ఠేత = మేల్కొనవలయును (ప్రయత్నించవలయును); యస్మాత్ = ఎందువలననగా; దీర్ఘమపి = పొడవైనదైనను; ఆయుః = జీవితము; అసన్నిహితసాధనమ్ = దారిద్ర్యముతో కూడికొన్నట్టిదని; నిందితమ్ = గర్హింపబడినది; తథా = అట్లే; ధనార్థీ = ధనమును కోరువాడును; కృషిం = వ్యవసాయమును; వణిజ్యాం = వ్యాపారమును; గోరక్షాం = ఆవులను రక్షించుటను; లోకద్వయావిరుద్ధాంచ = ధనలాభహేతువైన ఇహపరలోకములకు విరుద్ధము కాబట్టి: క్రియాం = పనిని; ఉపాయైః = పై జెప్పిన ఉపాయములచేత; గుణినం = సద్గుణవంతుడైన; నృపం = రాజును; సంశ్రయేత్ = ఆశ్రయించవలెను; చ = మరియును; ముక్తవేగః = ఉత్సర్జనము చేయబడిన మూత్రపురీషాది వేగములు గలవాడై; గమన...స్త్రియ — గమన = నడచుటను; స్వప్న = నిద్రించుటను; ఆహార = భుజించుటను; సభాః = సభలను; స్త్రియః = స్త్రీలను; (సేవించవలెను).

**తాత్పర్యము**: తరువాత ధనసంపాదనమునకు హేతువులైన కార్యములయందు మిక్కిలి ప్రయత్నశీలుడుగా నుండవలెను. ఎందుకనగా దీర్ఘకాలికమైన ఈజీవితము దారిద్ర్యముతో ముడివడియుండుట నిందించబడినది. అట్లే ధనార్జనమున కుపక్రమించువాడు ఇహపరములకు విరుద్ధము కాని వ్యవసాయము,

వ్యాపారము, గోరక్షణ మొదలగు ఉపాయములచేత గుణవంతుడై ప్రభువును పొంది ఈపనులను ఆచరించ వలయును. మరియు ఇతరత్ర విపులీకరించు. మూత్రపురీషాదివేగములను విసర్జించిన వాడై గమనము, స్వప్నము, ఆహారము, సభా, స్త్రీలు మొదలైన వాటిని సేవించవలయును.

**శశిలేఖ :** ధనార్జనకు హేతువులైన కార్యములందు మిక్కిలి జాగరూకుడై ప్రయత్నించ వలెను. అసన్నిహిత సాధనం అనగా దారిద్ర్యాయుక్తం (దారిద్ర్యముతోకూడుకొన్నట్టిది అని వ్యాఖ్యానించబడినది) ధనలాభహేతుకీం ఉభయలోకావవిరుద్ధాం అనగా ధనలాభమునకు కారణమై ఇహపరములకు విరుద్ధము కానట్టిది అని అర్థము.

మూ॥ పాణినాఽలభ్య నిష్క్రామేద్రత్న పూజ్యాఽజ్యమంగలమ్॥
సాతపత్ర పదత్రాణో విచరేద్యుగమాత్రదృక్।
నిశిచాత్యయికే కార్యే దండీమౌలీ సహాయవాన్॥
ప్రావృత్య పర్యటేద్రాత్రౌ నప్రావృత్యశిరోఽహని।

**ప్రతిపదార్థము :** రత్నపూజ్యాఽజ్యమంగళమ్-రత్న=నవరత్నములను; పూజ=పూజకుపయుక్తములైన ద్రవ్యములను; ఆజ్య=నేతిని; మంగళమ్=మంగళకర వస్తువులను; పాణినా=చేతితో; ఆలభ్య=పూజతో తాకి (కార్యార్థియై); నిష్క్రమేత్=బయలుదేరవలయును. (బయలుదేరునపుడు); సాఽతపత్ర పదత్రాణః=ఛత్రము పాదరక్షలతో కూడినవాడై; విచరేత్=సంచరించవలెను; నిశి=రాత్రియందు; అత్యయికే=మిక్కిలిప్రయోజనముగల (అత్యవసర పరిస్థితులలో); దండే=కఱ్ఱ; మౌలీ=తలపాగ; (వీటి); సహాయవాన్=సహాయము గలవాడై; తథా=అట్లే; రాత్రౌ=రాత్రియందు; శిరః=శిరస్సును; ప్రావృత్య=కప్పుకొని; పర్యటేత్=సంచరించవలెను; అహని=పగటియందు; శిరః = శిరస్సును; ప్రావృత్య=కప్పుకొని; నపర్యటేత్=తిరుగకూడదు.

**తాత్పర్యము :** కార్యార్థియై ఇంటినుండి బయలుదేరువాడు రత్నాదులను పూజించి వాటిని చేతిలో స్పృశించి బయలుదేరవలెను. మరియు ఛత్రము, చెప్పులు ధరించి ముందు భాగమును రెండు చేతుల పొడవు చూచుచు వెళ్ళవలెను. రాత్రియందు అత్యవసరపరిస్థితులలో వెలుపలికి వెళ్ళవలసి వచ్చినపుడు చేతిలో కఱ్ఱను తలకు తలపాగను ధరించి వెళ్ళవలయును. మరియు రాత్రులందు శిరస్సును కప్పుకొని వెళ్ళవలయును. పగలు శిరస్సును కప్పుకొనకయే తిరుగవలెను.

**శశిలేఖ :** యుగమాత్రదృక్ అనగా యుగః=హస్తద్వయం అని చెప్పుట వలన ముందు రెండు చేతుల పొడవు మార్గమును చూచుచు అని అర్థము. ఎందుకనగా మార్గము నందు విషకీటకాదులు రాళ్ళు మొదలగు వాటి వలన జనించు భయము వలన అని చెప్పబడినది. 'నిశి అత్యయికే కార్యేవిచరేత్' అని

చెప్పినందు వలన ప్రయోజనము గల కార్యము నందే రాత్రులందు సచంరించ వలెనని భావము. లేని యెడల రాత్రియందు సంచరించరాదు.

మూ॥ చైత్యపూజ్య ధ్వజాశస్తఛాయా భస్మతుషా శుచీన్।
నాక్రామేచ్ఛర్కరాలోష్ట బలిస్నానభువోనచ।

**ప్రతిపదార్థము :** చైత్య...శుచీన్—చైత్య=మరుభూమి; పూజ్య= గురువు మొదలగు వారియొక్క; ధ్వజ=ధ్వజముయొక్క; అశస్త=ప్రశస్తము కాని వస్తువుయొక్క; ఛాయా=నీడను; న ఆక్రామేత్=పాదములచేత దాట రాదు; భస్మ = భస్మము; తుషా=ఊక; అశుచీన్= పరిశుభ్రముకాని వాటిని; తథా=అట్లే; శర్కరా=శిలాచూర్ణమును; లోష్ట=మట్టిబెళ్ళను; బలి=బలిని; స్నానభువః=స్నానభువిని; న ఆక్రామేత్=దాటరాదు.

**తాత్పర్యము :** చేత్యాదులయొక్క నీడను కాళ్ళతో దాటరాదు. మరియు భస్మమును ఊకను శిలాచూర్ణమును ఎవడైనా స్నానముచేసిన ప్రదేశ మును దాటరాదు.

**శశిలేఖ :** న ఆక్రామేత్ అనగా కాళ్ళతో దాటరాదు అని అర్థము. పూజ్యః అనగా గురువు మొదలగువారని అర్థము. అశస్తమనగా మంగళకరము కాని వస్తువని అర్థము. 'శర్కరా' అనగా శిలాచూర్ణమని 'బలిః' అనగా భూత ములకొరకుంచబడిన ఉపహారమని, 'స్నానభూః' అనగా ఎక్కడ ఎవడుచేసెనో అనియు అర్థము.

మూ॥ మధ్యాహ్నే సంధ్యయో రాత్రావర్థ రాత్రే చతుష్పథం॥
న సేవేత న శర్వర్యాం వృక్షచైత్యం నచత్వరం।
సూనాటవీ శూన్యగృహ శ్మశానాని దివాఽపిన॥

**ప్రతిపదార్థము :** తథా=పైనచెప్పినట్లే; మధ్యాహ్నే=మధ్యాహ్న సమయమునందు; సంధ్యయోః=సంధ్యాకాలములందు; రాత్రే=రాత్రియందు; అర్ధరాత్రే=అర్ధరాత్రియందు; చతుష్పథం=నాల్గుమార్గములకూడలిని(చౌరస్తా); నసేవేత్=సేవించరాదు; తథా=అట్లే; శర్వర్యాం=సంపూర్ణరాత్రియందు; వృక్షచైత్యం=ఒకవృక్షమును; నసేవేత్=సేవించరాదు; చత్వరం=చావిడిని; నసేవేత్ = సేవించరాదు; సూనాటవీ...శ్మశానినీ—సూనాటవీ = దట్టమైన; అడవి; శూన్యగృహ=విడిచిపెట్టిన యింటిని; శ్మశానాని=శ్మశానములను (మరు భూములను); దివానపి=పగలుగూడా; నసేవేత్=సేవించరాదు.

**తాత్పర్యము :** మధ్యాహ్నమునందు సంధ్యాకాలములలో రాత్రుల యందు అర్ధరాత్రియందు నాల్గు మార్గముల కూడలిని సేవించరాదు. రాత్రి యంతయు ఒక వృక్షమును చావడిని సేవించరాదు. భయంకరమైన అడవిని విడిచిన ఇంటిని శ్మశానమును పగలు కూడా సేవించరాదు.

*శశిలేఖ :* మధ్యాహ్నాదికాలములందు చతుష్పథమును సేవించరాదు. 'శర్వర్యాం' అనుపదమునకు వ్యాఖ్యానమునందు రాత్రియంతయు అని అర్థము-చెప్పబడినది. వృక్షచైత్యము అనగా వృక్షాదేకం అని కలదు. చత్వరం అను పదమునకు త్రిపథము, మూడు మార్గముల కూడలి అని చెప్పిరి. మరి కొందరు గ్రామము వెలుపల విశ్రాంతి గృహమని వివరించిరి. మరికొందరు గ్రామీణ సమాజస్థానము (చావడి) అని నుడివిరి. ఏదైతే చత్వరమని లోకమున ప్రసిద్ధముగా నున్నదో సూనాటవీ శబ్దమునకు 'వధారణ్యాం' అను నర్థము నిర్వచించ బడినది.

మూ॥ నహుం కుర్యాచ్ఛవం పూజ్యం ప్రశస్తాన్ మంగళానిచ।
నాఽపసవ్యం పరిక్రామే న్నేతరాణ్యను దక్షిణమ్॥
చతుష్పథం నమస్కుర్యాత్ ప్రజ్ఞాతాంశ్చ వనస్పతీన్।
నవ్యాళ వ్యాధితాఽశస్తైర్నాదాంతక్షుత్ పిపాసితైః॥
నచ్ఛిన్న పుచ్ఛైర్నైకాక్షైర్గో పృష్ఠేన చనవ్రజేత్।
నాఽతి ప్రగేఽతిసాయం వా నభోమధ్యగే రవౌ॥
నాఽసన్నిహిత పానీయో నాతిపూర్ణం నసంతతమ్।
న శత్రుణా నా విదితైర్నైకో నాధార్మికై స్సహ॥

*ప్రతిపదార్థము :* శవం=శవమును గూర్చి; నహుంకుర్యాత్=హుంకరించ రాదు (మృత శరీరమును హుంకారముతో భయపెట్టరాదు); పూజ్యం=పూజ్యులైన గురువు మొదలగువారిని; ప్రశస్తాన్=ప్రశస్తములైనవాటిని; మంగలాని=మంగళకరములైన వాటిని; అపసవ్యం=ఎడమవైపున; న పరిక్రామేత్=వదలి వెళ్ళకూడదు; ఇతరాణి=పైనుదాహరించిన పూజ్యాదులకంటె వేరైన వాటిని; దక్షిణం=కుడివైపున; న పరిక్రామేత్=విడిచివెళ్ళరాదు; చతుష్పథం=నాలుగు మార్గముల కూడలిని; ప్రజ్ఞాతాంశ్చ=బాగుగానెరిగిన; వనస్పతీన్=వృక్షాదులను; నమస్కుర్యాత్=నమస్కరించవలెను; వ్యాళ=క్రూరములైన మరియు క్షుద్రములైన; వ్యాధిత=రోగగ్రస్తములైన; అశస్తైః=అధిరోహించుటకు ప్రశస్తములు కాని వాటిచేత; నైకాక్షైః=ఒకే కన్నుగల వాటిచేత; గోపృష్ఠేన=ఆవువీపు పైన; నవ్రజేత్=వెళ్ళగూడదు. అతిప్రగే=పూర్వాహ్ణకాలమునకు ముందు; నవ్రజేత్=పయనించకూడదు. అతిసాయంవా=మిక్కిలి సాయంకాలమైన పిదపను: నభోమధ్యగే రవౌ=సూర్యుడు ఆకాశమధ్యము నందుండగా: నవ్రజేత్=వెళ్ళకూడదు, అసన్నిహితపానీయః=నీళ్ళుదగ్గర లేకుండా; అతితూర్ణం=మిక్కిలివేగముతో; సంతతం=చాలాకాలము; శత్రుణాసహ=శత్రువులతోకూడ; నవ్రజేత్=ప్రయాణము చేయకూడదు: నైకః=ఒంటరిగా; అధార్మికైః సహ=అధర్మపరాయణులచేత; నవ్రజేత్=పయనించకూడదు.

*తాత్పర్యము :* మృత శరీరమును ఉచ్ఛస్వరముతో భయపెట్టరాదు. గురువు మొదలుగా గల వారిని ఎడమ భాగమును వదలి అనగా అపసవ్యముగా

వెళ్ళరాదు. గురువు మొదలైన వారికంటెు విపరీతమైన వస్తువులను కుడి భాగమును వదలి వెళ్ళకూడదు. చతుష్పథమును ప్రసిద్ధదేవతా వృక్షములను నమస్కరించ వలెను. దుష్టమై రోగగ్రస్తములై, అప్రశస్తములై అశిక్షితములై దప్పిగానున్న వాటితో ప్రయాణము చేయరాదు. మరియు విరిగిన తోకలు ఒకే కన్నుకలవాటితో, ఆవుపీపుపైన వెళ్ళగూడదు. మిక్కిలి పూర్వాహ్ణకాలము నందు, మిక్కిలి సాయంకాలము నందు, ఆకాశమధ్యమున సూర్యుడుండగా బయలుదేరరాదు. మరియు బయలుదేరునపుడు త్రాగునీటిని దగ్గరగా నుంచుకొని తొందరపడక ఎక్కువకాలము ప్రయాణించ వెళ్ళవలయును. మరియు శత్రువులతోను జాతి కుల నామ రూపములను గుర్తించని వ్యక్తులతోను అధర్మరాయణులతోను ఒంటరిగా బయలుదేరకూడదు.

*శశిలేఖ* : ఇచట 'సంతతం' అను శబ్దమునకు చాలకాలము ప్రయాణించునపుడు మధ్యన విశ్రమించియే వెళ్ళవలయునని యభిప్రాయము. 'అవిదితైః' అను శబ్దమునకు తెలియని రూపు రేఖలు గలవారితో యని యర్థము. 'వ్యాళైః' అను శబ్దమునకు దుష్టః, క్షుద్రః అని అర్థము.

మూ॥ దద్యాద్వర్త్మఽర్త వృద్ధస్త్రీభారి చక్రద్విజన్మనే।
స్నాన భోజన పానాని వాహేభ్యోనాఽచరేత్ పురః॥
నదీం తరేన్న బాహుభ్యాం నాగ్నిస్కంధమభివ్రజేత్।
నాఽరోహే ద్విషమం శైలం నావం సంశయితాం తరుం॥
నిపాతయేన్నలోష్టేన నఫలేన ఫలం ద్రుమాత్।
నవార్యమాణః ప్రవిశేన్నాద్వారేణ నచాఽసనే॥
స్వయం క్షిపేత్ పాణి వాక్పాదదృక్ శిశ్నోదర చాపలమ్।
శ్రీః పక్షస్య కచశ్మశ్రు నఖరోమాణి వర్ధయేత్।
న స్వహస్తేన దన్తైర్వా స్నానం చాను సమాచరేత్॥

*ప్రతిపదార్థము* : ఆర్త...జన్మనే—ఆర్త=పీడితులు; వద్ధ=వృద్ధులు; స్త్రీ = స్త్రీలు; భారి=బరువుపు మోయువారు; ద్విజన్మనే =బ్రాహ్మణుల కొరకు; వర్త్మ=మార్గమును; దద్యాత=వదలవలయును; వాహేభ్యః=వాహనముల; పురః=ముందు; స్నానభోజన పానాని=స్నానము, భోజనము, పానము; నాచరేత్ =ఆచరించకూడదు; బాహుభ్యాం=చేతులతో; నదీం=నదిని; నతరేత్=దాటరాదు; అగ్నిస్కంధః = అగ్నిగోళమును; నాభివ్రజేత్=వెళ్ళకూడదు; విషమం=మిక్కిలి ఎత్తుపల్లములుగల; శైలం=పర్వతమును; నాఽరోహయేత్ = అధిరోహించకూడదు; సంశయితాం = తెలియని స్వరూపస్వభావాలు గల; నావం = పడవను; తరుం = చెట్టును; నాఽరోహేత్ = ఎక్కకూడదు; ద్రుమాత్ = వృక్షము నుండి; లోష్టేన = మట్టితో; ఫలేనా=ఫలముతో; ఫలం=పండుపు; ననిపాతయేత్=పడగొట్టరాదు; పర

గృహే=ఇతరుల గృహమునందు; వార్యమాణః=అడ్డగించబడిన ప్రవేశము గలవాడై; అద్వారేణ=అప్రసిద్ధమైన మార్గముతో; నప్రవిశేత్=ప్రవేశించ కూడదు; చ=మరియు; ఆసనే=ఆసనమునందు; స్వయం=తనంతట తానుగా; నతిష్ఠేత్=కూర్చొనరాదు; యుక్తనిద్రం=నిద్రించుచున్నవానిని; నబోధయేత్= మేల్కొలుపరాదు; పాణి...చాపలమ్—పాణి=చేతులు; వాక్=వాక్కు; పాద=పాదములు; దృక్=నేత్రం: మేఢ్ర=శిశ్నము; ఉదర=కడుపు; మొదలగు వాటియొక్క; చాపలమ్=కదల్చుటను; నాచరేత్=చేయరాదు; పక్షస్యత్రిః= పదిహేను దినములకు మూడుమార్లు; శ్మశ్రు=మీసములు; నఖ=గోళ్ళు; రోమాణి = రోమములను; వర్ధయేత్ = కత్తిరించవలెను; స్వహస్తేన = తనచేతితో; దంతైర్వా=దంతములతోను; నవర్ధయేత్=కత్తిరించరాదు; అను= కత్తిరించిన వెంటనే;స్నానంచ=స్నానమును; సమాచరేత్=ఆచరించవలెను.

తాత్పర్యము : పీడితులు, వృద్ధులు, స్త్రీలు, బరువును మోయువారు, బ్రాహ్మణులు మొదలగువారు ఎదురైనచో వారికి దారి వదలి తరువాత తాను వెళ్ళవలయును. ప్రయాణమును చేయబోవుటకుముందు మొదలు వాహనములకు స్నాన భోజన పానీయాదుల నిచ్చి తరువాత తాను స్నాన భోజన పానీయా దుల నాచరించవలయును. చేతులతో నదినీ దాటరాదు. బాగుగా నిండుచున్న అగ్ని కభిముఖముగా పోగూడదు. మిక్కిలి ఎత్తుపల్లములు గల పర్వతము నెక్క రాదు, సంశయముతో కూడి యుండు పడవను అధిరోహించకూడదు. వృక్షము నుండి పండును మట్టిపెళ్లతోగాని మరియొక పండుతోగాని పడగొట్టరాదు. ఇతరులయొక్క గృహమున వారించబడినవాడై నిషిద్ధమార్గమున ప్రవేశించ గూడదు. తనకు తానై స్వయముగా ఆసనము నందు కూర్చొనరాదు. నిద్రించు వానిని మేల్కొలుపరాదు. చేతులు, వాక్కు, పాదములు, నేత్రములు, మేఢ్రము, ఉదరము వీటిని కదల్చరాదు. పదిహేను దినములకు మూడు పర్యా యములు చంకలలోని వెంట్రుకలను, మీసములను, గోళ్ళను, రోమములను కత్తిరించవలయును. వాటిని తాను స్వయముగా తన చేతితోను దంతములతోను ఉద్ధరించరాదు. వెంటనే స్నానమాచరించవలెను.

శశిలేఖ : పాణ్యాదులయొక్క ఆచాటనము చేయరాదు, ఇచట "హస్తచాపలం" వాద్యాదుల ననుకరించుట, పాదచాపలమ్ వాద్యాదుల ననుకరించుట "వాక్చాపలమ్" ఏదో ఒకటి ఉచ్చరించుట,'దృక్చాపలమ్'పరస్త్రీ మొదలగువారిని చూచుట, 'మేఢ్రచాపలమ్' అప్రశస్తస్త్రీగమనాదులను, 'ఉదర చాపలమ్' భోజనమునందు మిక్కిలి ఆశను, నాఆచరేత్=చేయరాదు అని భావార్థము, 'పక్షస్యత్రిః' అనగా పదిహేనురోజులలో మూడు పర్యాయములని యర్థము. కచాదులను కత్తిరించినవెంటనే స్నానమాచరించవలయును.

మూ॥ అథజాతఽన్నపానేచ్ఛః మారుతఘ్నైసుగంధిభిః॥
యథర్తు సంస్పర్శ సుఖైస్తైలైరభ్యంగమాచరేత్॥
అభ్యంగోవాతహాపుష్టిస్వప్న దార్ఢ్య బృహత్వకృత్।
దగ్ధభగ్న క్షతరుజా క్లమశ్రమజరాపహాః॥
రథాక్ష చర్మ ఘటవత్ భవంత్యభ్యంగతోగుణాః॥
స్పర్శనేఽభ్యధికోవాయుః స్పర్శనంచ త్వగాశ్రయమ్।
త్వచ్యశ్చ పరమభ్యంగో యస్మాత్తం శీలయేదతః॥
శిరః శ్రవణపాదేషు తంవిశేషేణ శీలయత।
సకేశ్యః శీలితో మూర్ధ్ని కపాలేంద్రియ తర్పణః।
హనుమన్యాశిరః కర్ణశూలఘ్నం కర్ణపూరణం।
పాదాభ్యంగస్తు తత్స్థైర్య నిద్రాదృష్టి ప్రసాదకృత్॥
పాదసుప్తిశ్రమ స్తంభ సంకోచస్ఫుటన ప్రణుత్।
వర్జ్యోఽభ్యంగః కఫగ్రస్త కృతసంశుద్ధ్యజీర్ణిభిః॥

ప్రతిపదార్థము : అథ=అటుతరువాత; జాతన్నపానేచ్ఛః=అన్నపానాదుల యందు ఇష్టము కలవాడై; మారుతఘ్నైః=వాతమును పోగొట్టునట్టి; సుగంధిభిః=సుగంధద్రవ్యములు కలిగినట్టి; యథర్తుసంస్పర్శసుఖైః=ఋతుధర్మముల ననుసరించి స్పర్శసుఖము కలిగినట్టి (ఉష్ణకాలమునందు శీతలములైన; శీతకాలమునందు ఉష్ణములైన, తైలైః=తైలములచేత; అభ్యంగం=అభ్యంగస్నానమును; ఆచరేత్ = ఆచరించవలయును; అభ్యంగః = అభ్యంగము; వాతహా=వాతమును హరించును; పుష్టిస్వప్నదార్ఢ్య బృహత్వకృత్=శరీరమునకు బలము, నిద్ర, దృఢత్వము, బృహ్మాణత్వమును కలుగజేయును; దగ్ధభగ్నక్షతరుజాక్లమ శ్రమ జరాపహాః=కాలిన విరిగిన దెబ్బతగులుట చేత కలిగిన బాధ, బడలిక శ్రమ, ముసలితనమును పోగొట్టును. రథాక్ష=రథచక్రము యొక్క కుండకు; చర్మ=చర్మమునకు; ఘటవత్=ఘటమునకు వలె; అభ్యంగతః=అభ్యంగనముచేసికొనుటవలన; గుణాః=స్నిగ్ధత్వాది గుణములు; భవంతి=కలుగుచున్నవి; యస్మాత్=ఎందువలననగా; పరమ్=మిక్కిలి; స్పర్శనే=స్పర్శనేంద్రియమందు; వాయుః=వాతము; అభ్యధికః=మిక్కిలిఎక్కువగానుండును, స్పర్శనం చ=స్పర్శనమైతే; త్వగాశ్రయమ్=త్వక్కునుఆశ్రయించియుండునో, త్వచ్యశ్చ=చర్మమునకు హితమైన; అభ్యంగః=అభ్యంగమో; అతః=అందువలన; తం=ఆ అభ్యంగనమును; శీలయేత్=అనుష్ఠించవలెను. (ఎట్లనగా)శిరః శ్రవణపాదేషు==తల,చెవులు, పాదములు,వీటియందు; విశేషేణ=ఎక్కువగా; తం=ఆ అభ్యంగమును; శీలయేత్=ఆచరించవలయును; సః=ఆ అభ్యంగము; కేశ్యః=వెంట్రుకలకు హితమైనది; మూర్ధ్ని=తలయందు; శీలితః=నిత్యము ఆచరించునట్టివానికి;కపాలేంద్రియతర్పణః=కపాలమునకు, ఇంద్రియములకును తృప్తిచేయునట్టిది; స్నేహేన=తైలముతో; కర్ణపూరణమ్=చెవు

లనునింపుట; హ...ఘ్నమ్—హను=దవడలు; మన్యా=గ్రీవకిరువైపుల నుండు మన్యలను పేరుగల రెండు ధమనులు; శిరః=శిరస్సు; కర్ణశూల=చెవి పోట్లను; ఘ్నమ్=నశింపజేయును. పాదాభ్యంగస్తు=పాదములకు నూనెరాచిన ఎడల: తత్...కృత్—తత్=అది; స్థైర్య=గట్టిదనము; నిద్రా=నిద్రను; దృష్టి=చూపును వీటిని; ప్రసాదకృత్=అనుగ్రహించును. పాద...ణుత్-పాద=పాదములు; సుప్తి=అభిఘాతాదులచేత మొద్దుబారుట: శ్రమ=శ్రమము; స్తంభ=స్తంభించుట: సంకోచ=ముడుచుకొనుట; స్ఫుటన=పగుళ్ళుబారుట; వీటిని; ప్రణుత్=పోగొట్టును.

కఫ...భిః—కఫగ్రస్థ=శ్లేష్మరోగముచేత పీడింపబడుచున్నవారు; కృత సంశుద్ధి=వమనవిరేచనాదులచేత శుద్ధులైనవారు; అజీర్ణభిః=అజీర్ణరోగులచేత; అభ్యంగః=అభ్యంగము; వర్జ్యః=విడువదగినది.

**తాత్పర్యము :** ఆకలి దప్పులు గలవాడగు మానవుడు అనగా ఆహారము జీర్ణమైన పిదప వాతశామకములై సుగంధద్రవ్యములచేత తయారుచేయబడిన తైలముతో అభ్యంగము చేసికొనవలయును. ఈ తైలము ఉష్ణకాలమునందు శీతలముగను, శీతకాలమునందు వేడిగను స్పృశించుటకు అనుకూలముగా నుండవలయును. ఈ అభ్యంగము శరీరమునకు పుష్టిని గాఢ నిద్రను శరీరమునకు పటుత్వమును బలువును కలిగించును. కాలుట విసుగుట దెబ్బతగులుట వలన గలిగిన బాధను బడలిక ఆయాసము ముసలితనము వీటిని రాకుండ చేయును.

చర్మము నాశ్రయించియున్న స్పర్శేంద్రియమునందు వాయువు తప్పక ఉండును. ఈ కారణమువలన చర్మమునకు హితమైన అభ్యంగమును సర్వులు ఆచరించవలయును. రథచక్రముయొక్క కుండకు చర్మమునకుఘటమునకు తైలము రాచినయెడల ఎట్టి మృదుత్వము ఏర్పడుచున్నదో అట్లే శరీరమునకు గూడ మృదుత్వమేర్పడును.

ఈ తైలమును శిరస్సు, చెవులు, పాదములు; వెంట్రుకలు, దవడలు' మన్యలు, వీటికి ఉపయోగించినయెడల వాటికన్నింటికి వ్యాధిహరముగను ప్రసాదముగను ఉండును.

కఫరోగముచేత పీడింపబడువారికి వమనాదులచేత శుద్ధులైనవారు, ఆజీర్ణ రోగులు అభ్యంగము చేసికొనరాదు.

***శశిలేఖ :*** ఆహారము జీర్ణమైనపిదప అభ్యంగము నాచరించవలయును. తైలమును పూయుటచేత రథచక్రముయొక్క కుండకు చర్మమునకు ఘటమునకు ఎట్టి మృదుత్వము, దార్ఢ్యము ఏర్పడునో అట్టి మార్దవము, దార్ఢ్యము శరీరమునకును కలుగును. ఈ అభ్యంగము చర్మమునకు హితకారి, ఈ స్పర్శము

త్వగాశ్రితము. త్వగాశ్రితమైన స్పర్శనేంద్రియమునందు వాతము కలదు. వాతమునకు అభ్యంగము ప్రధానమైనది. శిరస్సు, శ్రవణములు, పాదములు వీటియందు విశేషముగా అభ్యంగమాచరించవలయును. దీనివలన పాదములకు స్థైర్యము, కర్ణబాధలు, శిరోబాధలు నివారించును.

అభ్యంగము శ్లేష్మరోగములకు వమనవిరేచనాదులచేత అప్పుడే దోషములను బహిర్గతము చేసినవారికి అజీర్ణరోగులకు నింద్యము.

మూ॥ శరీరాయాస జననం కర్మంవ్యాయామ ఉచ్యతే॥
లాఘవం కర్మసామర్థ్యం దీప్తోఽగ్ని ర్మేదసఃక్షయః।
విభక్త ఘన గాత్రత్వం వ్యాయామాదుపజాయతే॥
వాత పిత్తామయీ బాలోవృద్ధోఽజీర్ణీచతంత్యజేత్।
అర్ధశక్త్యా నిషేవ్యస్తు బలిభిః స్నిగ్ధభోజిభిః
శీతకాలే వసంతేచ మందమేవతతోఽన్యదా।

ప్రతిపదార్థము : శరీరాయాసజననం = శరీరమునకుబడలిక గలిగించు; కర్మ = పని; వ్యాయామ = వ్యాయామముగా; ఉచ్యతే = చెప్పబడుచున్నది; వ్యాయామాత్ = వ్యాయామమువలన; లాఘవమ్ = శరీరమునకు తేలికను; కర్మసామర్థ్యం = పనులనుచేయుటకు సామర్థ్యమును; దీప్తోఽగ్నిః = జఠరాగ్నికి దీపనము; మేదసః క్షయః = మెదస్సునకు క్షయము; ఉపజాయతే = కలుగును. వాతపిత్తామయా = వాతపిత్తసంబంధమైనరోగములచేత పీడింపబడినవారు; బాల = బాలురు (12 వంవత్సరములకు లోపు); వృద్ధః = వృద్ధులు (70 సంవత్సరములకు పైబడినవారు); అజీర్ణి = అహారముజీర్ణముకానివారు; తం = ఆ వ్యాయామమును; త్యజేత్ = వదలవలయును. బలభిః = బలముగలవారిచేత; స్నిగ్ధ భోజిభిః = స్నిగ్ధమైన అన్నమును భుజించువారిచేత; శీతకాలే = హేమంత శిశిరఋతువులయందు; వసన్తే = చైత్రవైశాఖ మాసములయందు; సచవ్యాయామః = ఆ వ్యాయామము; అర్ధశక్త్యా = సగము శక్తిచేత; నిషేవ్యః = సేవించదగినది. తతోఽన్యదా = వీరికంటె వేరైనవారు; మన్దమేవ = స్వల్పముగనే; నిషేవ్యః = సేవించదగినది.

తాత్పర్యము : శరీరమునకు బడలికచేయుపని వ్యాయామమును పదముచే నిర్వచింపబడుచున్నది. వ్యాయామమువలన శరీరమునకు తేలికదనము దైనందిన కార్యములను నిర్వహించుటయందు సామర్థ్యము, జాఠరాగ్నికి బలము, శరీరములో ఎక్కువగానున్న మేదస్సు క్షయించుట కలుగును. వాతపిత్తములవలన కలుగు వ్యాధులచేత బాధపడువారు 12 సంవత్సరముల లోపల 70 సంవత్సరములకు పైబడిన క్రమముగా బాలురు వృద్ధులు, ముందురోజు భుజించిన ఆహారము జీర్ణము కానివారు వ్యాయామమున కర్హులు. వసంత ఋతువునందు శీతకాలమునందు బలవంతులు స్నిగ్ధాన్నభోజులు సగము శక్తిచేత

ఆ వ్యాయామమును చేయవలయును. వీరికంటె ఇతరులు స్వల్పముగా వ్యాయామము చేయవలయును.

*శశిలేఖ* : ఏ పనులతో శరీరము బడలిక చెందుచున్నదో అది వ్యాయామ మని చెప్పబడుచున్నది. ఇట్లు చెప్పుటచేత కొందరికి తిరుగుటయే వ్యాయాముగా కొందరికి తిరుగుటకంటె అధిక శ్రమతో కూడినది వ్యాయామ మనియు అర్థము. ఇట్లు వ్యాయామము చేయుటవలన శరీరమునకు లాఘవాదు లేర్పడును. వాతపిత్తార్తులు, బాలురు, వృద్ధులు మొదలగువారు ఈ వ్యాయామమును అర్ధశక్తితో ఆచరించవలయును. ఇతరులు మరియు స్వల్పముగా వ్యాయామమును చేయవలయును.

మూ॥ తం కృత్వాఽనుసుఖం దేహం మర్దయేచ్చ సమంతతః॥
తృష్ణాక్షయో ప్రతమకో రక్తపిత్తం శ్రమః క్లమః।
అతివ్యాయామతః కాసో జ్వరః ఛర్దిశ్చ జాయతే॥
వ్యాయామ జాగరాధ్వస్త్రీ హాస్యభాష్యాది సాహసం।
గజం సింహ ఇవాఽకర్షన్ భజన్నితి వినస్యతి॥

ప్రతిపదార్థము: తం=ఆవ్యాయామమును; కృత్వా=చేసి; అనుసుఖం= సుఖము కలుగునట్లుగా; దేహం=శరీరమును; సమంతతః=అంతట; మర్దయేత్= మర్దించవలయును.

అతివ్యాయామతః=వ్యాయామము యొక్క అతియోగమున (ప్రమాణము నతిక్రమించి వ్యాయామము చేయుటవలన); తృష్ణా=దప్పి; క్షయః= రాజయక్ష్మ; ప్రతమకః=ప్రతమకశ్వాసము; రక్తపిత్తం=రక్తపిత్తము; శ్రమః=ఆయాసము; క్లమః=బడలిక; కాసః=దగ్గు; జ్వరః=జ్వరము; ఛర్దిశ్చ=వాంతియును; జాయతే=కలుగుచున్నవి.

వ్యాయామ...సాహసం—వ్యాయామ=వ్యాయామము; జాగర= రాత్రులయందు మేల్కొనుట; అధ్వ=త్రోవనడచుట; స్త్రీ=స్త్రీగమనము; హాస్య=హాస్యము; భాష్యాది=ప్రవచనాదులను; సాహసం=సాహసకృత్యములను; భజన్=సేవించుచు; పురుషః=పురుషుడు; వినస్యతి=నశించు చున్నాడు; యథా=ఎట్లనగా; సింహః=సింహము; గజంఇవ=ఏనుగువలె; ఆకర్షన్= లాగుచు; వినస్యతి=నశించుచున్నది.

తాత్పర్యము : వ్యాయామము చేసిన తరువాత శరీరమునకు సుఖము కలుగునట్లుగా శరీరమంతటిని సమర్దించవలయును. వ్యాయామము ఎక్కువగా చేయుటవలన తృష్ణా ద్యుపద్రవములు కలుగుచున్నవి. వ్యాయామాదులను అతిగా సేవించిన యెడల మానవుడు నశించు చున్నాడు. ఎట్లనగా అతిపరాక్రమము గల సింహము స్వల్పబలము గలదైనప్పటికిని ఎక్కువ బలము గలిగినట్టి ఏనుగును స్వయముగా ఆకర్షించుచు నశించుచున్నది.

*శశిలేఖ* : ఆ వ్యాయామమునుచేసి సమస్త శరీరమును సుఖము కలుగునట్లుగా మర్దించవలయును. ఉపదేశించిన ప్రమాణమునకంటె అధికముగ వ్యాయామము చేసినయెడల క్రమముగా కాసాదిరోగములు బాధించును. వ్యాయామాదులను ఎక్కువగా చేసినఎడల పురుషుడు నశించగలడు. ఎట్లనగా పరాక్రమముగల మిక్కిలి స్వల్పబలముగల సింహము గొప్ప శరీరముగల ఏనుగును ఈడ్చినందునవలన తనకు తానే నశించగలదు.

**మూ॥** ఉద్వర్తనం కఫహరం మేదసః ప్రవిలాపనమ్॥
స్థిరీకరణ మంగానాం త్వక్ప్రసాదకరం పరమ్?

*ప్రతిపదార్థము*: ఉద్వర్తనం=నలుగుపెట్టుకొనుట; కఫహరం=కఫమును హరించును; మేదసః=మేదసును; ప్రవిలాపనం=కరిగించును; అంగానాం=అవయవములకు; స్థిరీకరణం=పటుత్వమును కలిగించును; పరం=మిక్కిలి; త్వక్ప్రసాదకరమ్=చర్మము నందధిక కాంతిని కలుగజేయును.

**తాత్పర్యము** : నలుగుపెట్టు కొనుటవలన కఫము పోవును, మేదస్సు కరుగును, అవయవములకు పటుత్వమేర్పడును. చర్మమునకు మిక్కిలి కాంతి మృదుత్వము ఏర్పడును.

*శశిలేఖ* : తరువాత కషాయ ద్రవ్యములచేత ఉద్వర్తనమును చేయవలయును. వాటి గుణములు తాత్పర్యములో సుదాహరింపబడినవి.

మూ॥ దీపనం వృష్యమాయుష్యం స్నానమూర్జాబలప్రదం॥
కండూమల శ్రమస్వేద తన్ద్రా తృడ్దాహ పాప్మజిత్॥
ఉష్ణాంబు నాధః కాయస్య పరిషేకోబలావహః॥
తేనైవ చోత్తమాంగస్య బలహృత్కేశ చక్షుషామ్॥
నాఽ నాప్లుత్య శిరః స్నాయాన్నచ లేఽ ల్పేన శీతలే॥
స్నానోదకావతరణ స్వప్నాన్ నగ్నోనచాఽ చరేత్॥
పంచపిండాననుధృత్య దస్నాయాత్ పరవారిణి॥

*ప్రతిపదార్థము* : స్నానం=స్నానము; దీపనము=అగ్నిదీపనమును; వృష్యమ్=శుక్రవృద్ధిని; ఆయుష్యమ్=ఆయుర్వృద్ధిని; ఊర్జాబలప్రదం=ఉత్సాహమును, బలమును ఇచ్చును; కండూ...పాప్మజిత్—కండూ=దురద; మల=శరీరమునందలి మురికి; శ్రమ=శ్రమము; స్వేద=చెమట; తంద్రా=జాడ్యము; తృట్=దప్పి; దాహ=తాపము; పాప్మ=పాపము; వీటిని, జిత్=హరించును; అధః కాయస్య=క్రింది శరీరమునకు; ఉష్ణాంబునా=వేడి నీళ్ళతో; పరిషేకం=స్నానము; బలావహః=బలమును చేకూర్చును; ఉత్తమాంగస్య=శిరస్సునకు; తేనైనచ=ఆవేడినీళ్ళతో; పరిషేక.=స్నానము; కేశ చక్షుషాం=వెంట్రుకలు, నేత్రముల యొక్క; బలహృద్=బలమును

హరించును; శిరః=శిరస్సును; అనాప్లుత్య=తడపక; నా=మానవుడు నస్నాయాత్=స్నానము చేయరాదు; స్వల్పే=కొద్దిగానున్న; శీతలే=చల్లనైన; జలే=నదీ మొదలగు వాటిలోనుండు నీళ్ళయందు: నస్నాయాత్=స్నానము చేయరాదు. నగ్నః = దిసమొలవాడుగా; స్నానోదకావతరణ స్వప్నాన్=స్నాన=స్నానమును; ఉదకావతరణ=నీళ్ళలో దిగుటను;స్వప్నాన్ =నిద్రించుట; వీటిని;; నాచరేత్=ఆచరించరాదు; చ=మరియు; పంచ పిండాన్=అయిదు పిండములను; అనుద్ధృత్య=ఎత్తక; పరవారిణి=ఇతరులచే నిర్మింపబడిన తటాకాదుల యందు; నస్నాయాత్=స్నానమాడకూడదు.

తాత్పర్యము : స్నానమువలన అగ్నిదీపనము, శుక్రవృద్ధి, ఆయుర్వృద్ధి, ఉత్సాహము, బలము చేకూరును. శరీరమునందలి మాలిన్యము, శ్రమము, స్వేదము, తంద్ర, దప్పి, తాపము, పాపము, వీటిని పోగొట్టును. (స్నానము రోమ కూపముల ద్వారా బహిర్గతమగుచున్న జాఠరాగ్ని జ్వాలలను నిరోధించి, ఆ జాఠరాగ్ని జ్వాలను మరల లోనచేర్చి అగ్నిదీపనమును కలిగించును. మరియు త్వగాశ్రితమైన భ్రాజకపిత్తము కూడ లోన ప్రవేశించి ఉష్ణమును వృద్ధిపరచును. అందువలన స్నానము దీపనకారియని పేర్కొనబడినది.) ఉష్ణోదకములచేత కంఠమువరకు స్నానముచేసిన శరీరమునకు బలమేర్పడును. ఉష్ణోదకముచే శిరస్స్నానము చేసిన వెంట్రుకలకును కన్నులకుగల బలము పోగొట్టును. నేత్రములు దుర్బలములగును. చల్లనైన స్వల్పమైన నదీ మొదలగు వాటియందలి నీళ్ళలో స్నానము చేయరాదు. మరియు శిరస్సు తడుపుకొనక స్నాన మాచరించరాదు. దిసమొల గలవాడై స్నానము, నీటిలో దిగుట, నిద్ర చేయరాదు. పంచపిండముల నెత్తక ఇతరులచే నిర్మితములైన తటాకాది జలములలో స్నానము చేయరాదు. అనగా స్వయముగా కూప వాస్తు ప్రకారము పంచ మృత్పిండములకు పూజాదికములు నిర్వర్తించి తటాకాదులయందే స్నాన మాచరించవలయుననిభావము, మరియు తటాకాదులందు స్నానము చెయుటకుముందు 5 దోసిళ్ళతో మట్టిని బయటపోసి స్నానము చేయవలెను, ఇట్లు చేసినయెడల తనదైనట్లుగా అది భావింపబడును.

శశిలేఖ : ఉద్వర్తన మాచరించిన వెంటనే స్నానము చేయవలెను. ఈ స్నానము అగ్నిదీపనము, దురద మొదలగు వాటిని పోగొట్టునదిగను ఉన్నది. శిరస్సు నుతడపక స్నానము చేయరాదు. 5 పిండముల నుద్ధరించి తన చేతనే స్నానముకొరకు జలాశయము నిర్మింపబడవలెను.

మూ॥ నాత్మాన మీక్షేత జలేన తటస్థో జలాశయమ్॥
నప్రతిస్ఫాల యేదంబు పాణినాచరణేనవా।
స్నాత్వావమృజ్యాత్ గాత్రాణిధునుయాన్నశిరోరహాన్॥
నివసీ తాఽర్ద్రప వాశు సోష్ణిధౌతవాససే।
నత్వంబరం పూర్వధృతం నచతైలవసేస్పృశేత్॥

వాసోఽన్యదన్యచ్ఛయనే నిర్గమే దేవతార్చనే।
స్నానమర్దిం నేత్రస్య కర్ణరోగాతిసారిషు॥
ఆధ్మాన పీనసా జీర్ణభుక్త వత్సు వగర్హితమ్।

ప్రతిపదార్థము:జలే=నీటిలో; ఆత్మానం=తనను; నేక్షేత=చూడరాదు; తటస్థః=గట్టున ఉన్నవాడై; జలాశయం=కూపాదులను; నేక్షేత = చూడరాదు, అంబు=నీటిని; పాణినా=అరిచేతితో; చరణేనవా=పాదముతోగాని; నప్రతిస్ఫాలయేత్ = కెలకరాదు (కొట్టరాదు); స్నాత్వా = స్నానముచేసి; గాత్రాణి=చేతులు మొదలగు అవయవములను; నపృజ్యాత్=తుడుచుకొనరాదు; శిరోరుహాన్=వెంట్రుకలను; నధునియాత్=విదలించరాదు; ఆర్ద్రైవ=తడిగానే; ధౌతవాససీ = పిండినవస్త్రములను; సోష్ణీషే = తలపాగతోకూడ ఆశు=శీఘ్రముగా; నివసీత=ధరించ వలయును; స్నాత్వాచ=స్నానముచేసి; న స్పృశేత్=తాకరాదు; శయనే=పరుండుట యందు; నిర్గమే=బయలుదేరుట; యందు; దేవతార్చనే=దేవతార్చనమునందు, అన్యదన్యత్=వేరువేరైన; వాసః=వస్త్రము; పరివర్తయేత్=మార్చవలెను; స్నానం=స్నానము; అర్దిత...సారిషు—అర్దిత వాతము; నేత్ర=తిమిరాది నేత్ర రోగములు; ఆస్య=ముఖరోగములు; కర్ణరోగ=కర్ణరోగములు; అతిసారిషు=అతిసారము గల రోగులయందు; ఆధ్మాన...వత్సు - ఆధ్మాన=కడుపుబ్బరము; పీనస=దుష్టప్రతిశ్యాయము; అజీర్ణ=ఆహారము జీర్ణముగాని సమయమునందు; భుక్తవత్సుచ=అపుడే భుజించినవారియందును; గర్హితం=నిందింపబడినది.

**తాత్పర్యము** : అద్దమువలె ప్రతిబింబమును నీటియందు చూడరాదు. కూపాదులయొక్క ఒడ్డునవుండి చూడరాదు, చేతిచేత గాని పాదముచేతగాని నీటిని కొట్టరాదు. స్నానముచేసిన తరువాత చేతులు మొదలగువాటిచేత శరీరావయవములు తుడువరాదు. స్నానముచేసి వెంట్రుకలను విదిలించరాదు. తడిగనేపిండిన దానిని (తలపాగను) పిండిన వస్త్రముసు ధరించవలెను. స్నానసమయమునందు వస్త్రము స్నానము చేసిన తరువాత స్పృశించరాదు. స్నానముచేసిన తరువాత తైలమునుగాని, వసనుగాని తాకరాదు. పండుకొనునపుడు మరియు గమనావసరమునందు దేవతార్చన యందు వేరువేరు వస్త్రములను ధరించవలయును. అర్దితాదులయందు ఆధ్మానాదులయందు స్నానము నిందింపబడినది.

*శశిలేఖ* : 'ఆధ్మాన'మనగా వాయువుచేత ఉదరము పూరింపబడుట అని అర్థము. 'పీనస' ముక్కులనుండి కారుట (నాసాస్రావః) అని అర్థము.

మూ॥ అన్నపాన విధానేన భుంజేతాన్నం వినాఽశ్యయాత్॥
అభినంద్య ప్రసన్నాత్మా హుత్వాదత్వాచ శక్తితః॥
పాకం సజలమేకాంతే యథాసుఖమితి బ్రువన్॥
ప్రియచ్ఛేత్సర్వ ముద్ధిశ్యపాచయేన్నాఽన్నమాత్మనే॥

నాఽన్నమద్యాన్ముమూర్షాణాం మృతానాం దుఃఖజీవినామ్॥
స్త్రీజితక్లీబ పతితక్రూర దుష్కృత కారిణామ్॥
గణాదిగణికా సత్ర ధూర్తాన్నాపణికంచన॥
నోత్సంగే భక్షయేత్ భక్ష్యాన్ జలంనాంజలినా పిబేత్॥
సర్వంచ తిల సంబద్ధం నాఽద్యాపస్తమితేరవౌ॥
న భుక్తమాత్ర ఆయస్యేన్న నిషిద్ధం భజేత్సుఖమ్॥

ప్రతిపదార్థము : అన్నపానవిధానేన=అన్నపానవిధిననుసరించి; వినాత్యయాత్=సకాలమునతిక్రమించక; అన్నం=అన్నమును; భుంజేత్=భుజించవలయును;అభినంద్య=పొందబడిన ఆహారమునకు నమస్కరించి; ప్రసన్నాత్మా=ప్రసన్న హృదయముకలవాడై; హుత్వాచ=అగ్నిముఖమునందు హోమము చేసియు; శక్తితః=యథాశక్తి; దత్వా=బీదలకిచ్చి: ఏకాంతే=ఏకాంతమునందు పాకం=ఆహారమునంతటిని; సజలం=నీటితోకూడ; యథాసుఖం=సుఖముగా ఇతి=అని; బృవన్=చెప్పుచూ; ప్రయచ్ఛేత్=ఇవ్వవలయును; సర్వం ఉద్దిశ్య=సమస్తభూతగ్రామములనుద్దేశించి;అన్నంపాచయేత్=అన్నమును వండవలయును, ఆత్మనేన=తనకొరకు వండకూడదని అర్థము; ముమూర్షాణాం=చనిపోవనిచ్ఛగించువారికి; మృతానాం=చచ్చినవారికి; దుఃఖజీవినామ్=దుఃఖజీవులకు; స్త్రీ.. కారిణామ్-స్త్రీ=స్త్రీలకు;జిత=యుద్ధములోనజయింపబడినవాడు;క్లీబ=షండుడు పతిత=పతితుడు;క్రూర=కూరకర్ముడు; దుష్కృతకారిణాం=చెడ్డపనులనుచేయువారికి; అన్నం=అన్నమును; నాద్యాత్=తినిపించకూడదు; గణ...గణికంచ-గణ=ఎక్కువజనసమూహమున; నాద్యాత్=తినకూడదు. అరి=శత్రువుల యొక్క; గణికా=వేశ్యయొక్క; సత్ర=యజ్ఞమునందు;ధూర్తాన్న=ధూర్తుల చేతఇవ్వబడిన అన్నము; ఆపణికంచ=వైశ్యునికి సంబంధించిన; అన్నం=అన్నమును; నాద్యాత్=తినకూడదు; ఉత్సంగే=నడుముకంటె ఎత్తైనదానియందు; భక్ష్యాన్ తినుభండారములను; నభక్ష్యయేత్=తినరాదు; జలం=నీటిని; అంజలినా=దోసిలితో; నపిబేత్=త్రాగరాదు; అస్తమితేరవౌ=సూర్యుడస్తమించుచుండగా;సర్వంతిలసంబద్ధం=నువ్వులతోకూడిన సమస్తమైన తిను పదార్థములను; నాద్యాత్=తినరాదు; భుక్తమాత్రః=తినుటతోడనే; నఆయస్యేత్=శరీరమునకు ఆయాసము కలుగు పనులు చేయరాదు; నిషిద్ధంసుఖం=స్మృతులచేత నిషేధింపబడిన సుఖమును; నభజేత్=సేవించరాదు.

తాత్పర్యము : సకాలమునందు శాస్త్రవిహితమైన అన్నమును తినవలెను. స్నానము, దేవతార్చనమును చేసిన తరువాత వైశ్వదేవమును చేసికొని తన శక్తికి మించకుండా దానముచేసి పరిపక్వమైన నీటితోకూడిన అన్నమునకు నమస్కరించుచూ ప్రసన్నహృదయముతో ఏకాంతమునందు మౌనముగా కాలానుగుణ్యమైన ఆహారమును సకాలమున తీసికొనవలెయును, ఇట్లే ఇతరప్రాణులకున్న

(ఆవు, కుక్క, పిల్లి మొదలగునవి) ఆహారము నివ్వవలెను. తనకొరకు మాత్రమే అన్నమును పచించరాదు. కొన్నినిమిషములలో మరణించువారికి, మరణించిన వారికి, దుఃఖముతోనే కాలము వెళ్లబుచ్చువారికి, స్త్రీలకు, యుద్ధమున జయించినవారికి, నపుంసకులకు, పాపులకు, క్రూరులకు. గర్హితములైన పనులనాచరించువారికి, మరియు ఎవనికి చాలామంది యజమానులుగలరో వానికి, శత్రువులకు, వేశ్యలకు, యజ్ఞమునందలి ధూర్తునిచేత ఇవ్వబడిన, వైశ్యులయొక్క అన్నమును తినరాదు. నడుముకన్న ఉన్నతప్రదేశమునకు తీసుకొని భోజన పదార్థములను భుజించరాదు. దోసిలితో నీటిని త్రాగరాదు. సూర్యాస్తమయమునకూడా నువ్వులతో కూడిన అన్నివస్తువులను తినరాదు. భోజనము చేసిన వెంటనే వ్యాయామము చేయరాదు. శాస్త్రవర్జితములైన సుఖములను భోగింపరాదు,

శశిలేఖ : తరువాత అన్నపాన విధానముచే అన్నమును భుజించవలయును. తక్కిన దంతయు తాత్పర్యాంశము.

మూ॥ ధర్మోత్తరాభి రర్థాఢ్యాభిః కథాభిస్త్రిగుణాత్మభిః॥
మధ్యం దినస్య గమయేదిష్ట శిష్ట సహాయవాన్॥

ప్రతిపదార్థము : ధర్మోత్తరాభిః=ధర్మప్రధానములైన; అర్థాభిః=అర్థాదులుగలః త్రిగుణాత్మభిః=ధర్మప్రధాన, అర్థప్రధాన, స్వల్పమాత్రతో కూడిన కామమునకు సంబంధించిన; కథాభిః=కథలచేత; దినస్యమధ్యం=మధ్యాహ్న కాలమును; ఇష్టశిష్ట సహాయవాన్=బంధుమిత్రాదులు; సదాచారసంపన్నులతో గూడినవాడై; గమయేత్=వెళ్ళబుచ్చవలయును.

తాత్పర్యము : అటు తరువాత మధ్యాహ్నకాలమును తన బంధుమిత్రాదులు సదాచార సంపన్నులతో కూడినవాడై ధర్మబద్ధమైన, అర్థమయమైన, స్వల్పమాత్రతోకూడినకామమునను సంబంధించిన కథలచేత కాలమును గడప వలయును.

శశిలేఖ ; త్రిగుణాత్మభిః అనగా ధర్మములయొక్క స్థాన వృద్ధిక్షయ లక్షణములు పేర్కొనబడినవి. అనగా ఆకథలు ధర్మముయొక్క స్థితిని అర్థముయొక్క వృద్ధిని కామముయొక్క క్షయరూపమైన లక్షణములను కలిగి యుండవలెనని భావము.

మూ॥ నలోకభూప విద్విష్టైతర్నసంగచ్ఛేనాస్తికైః॥
కలివైర రుచిర్నస్యాత్ ధీరః సంపద్విపత్తిషు।
శ్రుతాదన్యత్ర సన్తుష్టస్తత్రైవచ కుతూహలీ॥
క్షాంతిమాన్ దక్షిణోదక్షః సుసమీక్షిత కార్యకృత్।
హ్రీమాన్ధీమాన్ మహోత్సాహః సంధిభాగ్ప్రియాతిథిః॥

అక్షుద్రవృత్తిర్గంభీరః సాధురాశ్రితవత్సలః।
దాతా పితృభ్యః పిండస్య యష్టా హోతా కృపాత్మకః॥
అనుజ్ఞాతాసు వార్తానాం దీనానామనుకంపకః।
ఆశ్వాసకారీ భీతానాం క్రుద్ధానామనునాయకః॥
పూర్వాభిభాషీ సుముఖః సుశీలః పూజ్యపూజకః;
విత్తబంధు వయోవిద్యా వృత్తైః పూజ్యాయథోత్తరమ్॥

ప్రతిపదార్థము: లోకభూపవిద్విష్టైః=ప్రజలను రాజునుద్దేశించువారిచేత; నాస్తికైః=నాస్తికులచేత; నసంగచ్ఛేత్=స్నేహముచేయరాదు; కలహైరరుచిః=కలహమునందును వైరమునందు ఇష్టముగలవాడుగా; నస్యాత్=ఉండకూడదు; సంపద్విపత్సు=సంపదలు ఆపదలయందును; ధీరః=ధైర్యముకలవాడుగా; స్యాత్=ఉండవలయును; శ్రుతాత్=శాస్త్రశ్రవణముకంటె; అన్యత్ర=భోజనాదుల యందు; సంతుష్ట=సంతోషముగలవాడుగా; స్యాత్=ఉండవలయును; తత్త్రైవచ=ఆశాస్త్రవిషయమునందుకూడా; కుతూహలీ=కుతూహలము కలవాడుగా కూడఉండవలయును; క్షాంతిమాన్=సర్వభూతములయందు దయగలవాడుగాను; దక్షిణః=పరులకు ఉపకారమును చేయువాడు; దక్షః=సమర్థుడు; సుసమీక్షితకార్యకృత్=బాగుగా ఆలోచించిపనులనుచేయువాడు; హ్రీమాన్=లజ్జతోకూడినవాడు; ధీమాన్=బుద్ధిబలముగలవాడును; మహోత్సాహః=మిక్కిలి ఉత్సాహము గలవాడు; సంవిభాగీ=అందరిక్షేమమును కోరువాడును; ప్రియాతిథిః=అతిథులను ప్రేమించువాడును; అక్షుద్రవృత్తిః=నీచకార్యములను చేయనివాడును; గంభీరః=లోతైన హృదయముకలవాడును; సాధుః=సజ్జనుడును; ఆశ్రితవత్సలః=ఆశ్రయించిన వారియందు దయగలవాడును; పితృభ్యః=పితృదేవతల కొరకు; పిండస్య=పిండమును; దాతా=ఇచ్చువాడును; యష్టా=యాగాదులను చేయువాడు; హోతా=హోమముచేయువాడు; కృపాత్మకః=కృపాళువు; సువార్తానాం=మంచిమాటలను; అనుజ్ఞాతా=ఉపదేశించువాడును; దీనానాం=దీనులవిషయములో; అనుకంపః=జాలిగలవాడును; భీతానాం=భయపడువారికి; ఆశ్వాసకారీ=ఓదార్పుకలిగించువాడును, క్రుద్ధానాం=కోపగించువారిని; అనునాయకః=అనునయించువాడును; పూర్వాభిభాషే=మొదట మాట్లాడువాడును సుముఖః=ప్రసన్నముఖముగలవాడును; సుశీలః=మంచినడవడిగలవాడును; పూజ్యపూజకః=పెద్దలనుపూజించువాడును; విత్తబంధువయోవిద్యావృత్తైః=విత్త=ధనముగలవాడు; బంధు=బంధువు; వయః=వయస్సు; విద్యా=విద్య; వృత్తైః=శీలముగలవారిచేత=యథోత్తరః=ఉత్తరానుపూర్విగా; పూజ్యాః=పూజింపదగినవారుగా నుండును,

తాత్పర్యము : ప్రజలచేత రాజులచేత ద్వేషింపబడువారితో ఇహపరలోకాలను ఒప్పుకొనని నాస్తికులతోకూడా కలసియుండరాదు. కలహవైరములందు ఇష్టమును కలిగి యుండగూడదు. సుఖదుఃఖముల యందు ధైర్యము

నవలంబించవలయును. శాస్త్రీయమైన ధర్మమును విని ఎప్పుడు తృప్తిచెంద కూడదు. వాటిని ఆచరణలో ఉంచవలయును. ఇవిగాక సర్వప్రాణుల యొక్క విషయమునందు ప్రతి మనుష్యునికి ఈ క్రింద నుదాహరించబడిన గుణము లుండ వలయును. అవి పరులకు ఉపకారముచేయునాడు, సమర్థుడు, బాగుగా ఆలోచించి కార్యములను చేయునాడు, అభిమానముగలనాడు, బుద్ధిబలముగలవాడు, ఉత్సాహవంతుడు, అతిథులను ప్రేమించువాడును, నీచకార్యములను చేయనివాడును, యాగమును హోమమును చేయువాడును, లోతైన హృదయము గలవాడును, పితృదేవతలకు పిండము విడుచువాడును, కృపాళువును, మంచి నార్తలను అందించునాడును, దీనులయందుజాలికలవాడును, భయపడువారి నోదార్చువాడును, కోపముగలనారిని అనునయించునాడును, మొదట తానే పలుకరించునాడును, ప్రసన్నమైన ముఖము గలనాడును, పెద్దలను పూజించు నాడును, విత్తబంధు విద్యాశీలములు గలవారిలో క్రమముగా మొదటివారికంటె రెండవవారు పూజ్యులుగా నుందురు.

శశిలేఖ : అదృష్టములేదని బోధించువారు నాస్తికులని యర్థము. దక్షిణ శబ్దమునకు పక్షపాతి యని అర్థము. విత్తబంధు అని చెప్పిన వాక్యములో ధనవంతుడు పూజింపదగినవాడు. అతనికంటె బంధువు ఎక్కువ పూజింపదగినవాడు. అతనికంటె వయోవృద్ధులు ఎక్కువగా పూజింపదగినవారు. వారికంటె విద్యావంతులు పూజింప దగినవారు, విద్యావంతులకంటె శీలసంపదగలవారు మిక్కిలి పూజనీయులని అర్థము.

మూ॥ ఆత్మద్రుహ మమర్యాదం మూఢముజ్ఝిత సత్పథం॥
సుతరామనుకంపేత నరకార్చిష్మ దింధనః ॥
ధర్మ్య మర్థ్యం ప్రియం తథ్యం మితపథ్యం వదేద్వచః ॥

ప్రతిపదార్థము : ఆత్మద్రుహం=ప్రాణిద్రోహిని; అమర్యాదం=మర్యాద లేనివానిని, మూఢం=బుద్ధిహీనుని; ఉజ్ఝితసత్పథం=వదలిపెట్టబడిన మంచిమార్గముగలవానిని (దురాత్ముని): నరకార్చిష్మ దింధనం=నరక=నరకమునందలి; అర్చిష్మత్=అగ్నికి; ఇంధనం=ఇంధనమువంటి వానినిగా; సుతరాం=మిక్కిలి అనుకంపేత=ఉపేక్షింపవలయును; ధర్మ్యం=ధర్మముతోకూడినట్టి; అర్థవంతమైన; ప్రియం=ప్రియముగానున్నట్టిదియు; తథ్యం=నిజమైనదియు; పథ్యం=హితమైనదియు; ఐన; వచః=వాక్కును; వదేత్=ఉచ్చరించవలయును.

తాత్పర్యము : ప్రాణులకుద్రోహముచేయువానిని, మర్యాదలేనివానిని సన్మార్గమును వదలిన వానిని, నరకకూపమైన అగ్నికి ఇంధనముగానెంచి వానిని ఉపేక్షింప వలయును. తాను మాట్లాడునపుడు, ధర్మముతో కూడినదియు, అర్థవంతమైనదియు, వినుటకింపుగా నుండునట్టిదియు, సత్యమైనదియు, హితమైనదియు అయినవాక్యమును స్వల్పముగా ఉచ్చరింపవలయును.

*శశిలేఖ :* దయాళుత్వముచేత మంచి మార్గమును యోచించు స్వభావముగలవాడై అట్టి పనులను నిర్వర్తించుటకు మిక్కిలి అనుకంపతో కూడియుండవలయును. అన్నింటివిషయములో ధర్మార్థకామములకు సంబంధించిన వాక్యమునే చెప్పవలయును.

మూ॥ నాఽత్మానమవజానీయాన్నస్తూయాన్నచపీడయేత్।
నహీనానవమన్యేత వృత్తార్థాంగబలశ్రుతైః॥
నాఽరుంతుదః స్యాన్న క్రూరో న తీక్ష్ణో నోఽపతాపవాన్।
హేతావీర్ష్యేన్నతుఫలే పాపం పాపేఽపినాచరేత్।
పరస్యదండం నోద్యచ్ఛేత్ క్రుద్ధో నైనం నిపాతయేత్।
అన్యత్రపుత్రాచ్ఛిష్యాద్వాశాసనార్హాద్ధితాశయః॥
నృత్యవాదిత్రగీతాదేర్నోల్బణా మాచరేత్ క్రియామ్।
ప్రసిద్ధకేశవాగ్వేషశమసాంత్వపరాయణః॥
ఊర్ధ్వంనాభేః శరీరస్య స్పృశేన్నాఽధరవాససా।
నకుర్యాన్మధునీభూయ శౌచం ప్రతివిలంబనమ్॥
నాఽసంవృత ముఖో హాస్యక్షవోద్గార విజృంభణమ్।
పాణి ద్వయేన యుగపత్ కండూయేన్నాత్మనః శిరః॥
వహేన్న భారం శిరసాయుగ పచ్చాగ్ని వారిణీ।
నాశికాన్న వికుష్ణీయాద్దశనాన్న విఘట్టయేత్॥
కుర్యాద్విలేఖనచ్ఛేదభేదా స్ఫోటన మర్దనమ్।
పాదం పాదేన నాఽక్రామేన్నకండూయేన్నశౌచయేత్॥
నఖాంస్య భాజనే తౌచనోపవిష్టః ప్రసాధయేత్)

ప్రతిపదార్థము : ఆత్మానం=శరీరమును (తన); నావజానీయాత్=తిరస్కరించరాదు; నస్తూయాత్=పొగడరాదు; నచపీడయేత్=పీడించరాదు; వృత్తార్థాగబలశ్రుతైః=వృత్త=చరిత్రము; అర్థ=ధనము; అంగ=శరీరావయవములు; బల=బలము; శ్రుతైః=పాండిత్యములచేత; హీనాన్=తక్కువైనవారిని; నావమన్యేత=అవమానించరాదు; అరుంతుదః=మర్మాఘాతములైన మాటలను మాట్లాడువాడుగా; నస్యాత్=ఉండరాదు; క్రూరః=క్రూరముగా (పరుషముగా మాట్లాడువాడుగా); నస్యాత్=ఉండరాదు; తీక్ష్ణః=క్రోధముగలవాడుగా; నస్యాత్=ఉండరాదు; ఉపతాపవాన్=పరులను నిర్బంధించువాడుగా నస్యాత్=ఉండరాదు; హేతౌ=కారణమునందు; ఈర్ష్యేనాత్=ఈర్ష్య చెందవలయును; నతుఫలే=ఫలమునందు ఈర్ష్య చెందరాదు; పాపం=పాపకార్యమును; పాపేఽపి=పాపియందుకూడ; నాచరేత్=చేయరాదు; పుత్రాన్=పుత్రుని కంటె; శాసనార్హాత్=దండనార్హుడైన; శిష్యాద్వా=శిష్యునికంటెను; అన్యత్ర=వేరొకచోట; పరస్య=శత్రువునకు; దండం=శిక్షను; నోద్యచ్ఛేత్=ఇవ్వరాదు

హితాశయః = మంచిఅభిప్రాయముగలవాడు; క్రుద్ధస్సన్ = కోపించినవాడై ; పరస్య = శత్రునికి (ఇతరునికి); ఏవం = ఈశిక్షను; నవిపాతయేత్ = విధించరాదు; నృత్యగీతాది - నృత్య = నృత్యము; వాదిత్ర = వాద్యము; గీతాది = గానము మొదలగు, క్రియాం = కార్యమును; ఉద్బణామ్ = ఎక్కువగా; నాచరేత్ = చేయరాదు; ప్రసిద్ధ...పరాయణః = ప్రసిద్ధికేశ = ప్రశస్తములైన కేశములు; ప్రసిద్ధవాక్ = స్పష్టమైన వాక్కు; ప్రసిద్ధవేష = ఆనుషంగిక వేషము; శమ = ఇంద్రియములననచుట;సాంత్వ = అనునయము; పరాయణః = వీటియందు ఆసక్తిగలవాడు, శరీరసః = శరీరముయొక్క; నాభేః = బొడ్డుకంటె; ఉర్ధ్వమ్ = పైభాగమును; అధరవాససా = క్రిందధరించుబట్టతో;నస్పృశేత్ = తాకరాదు; మిథునీభూయ = సంభోగించి; శౌచంప్రతి = శుద్ధినిగూర్చి; విలంబనమ్ = ఆలస్యమును; నకుర్యాత్ = చేయరాదు; అసంవృతముఖ = మూయబడని ముఖముగలవాడై; హాస్య = నవ్వు; క్షువ = తుమ్ము; ఉద్గార = త్రేపును; విజృంభణం = ఆవలింతను; నకుర్యాత్ = చేయరాదు; ఆత్మనః = తనయొక్క; శిరః = తలను; పాణిద్వయేన = రెండుచేతులచేత యుగపత్ = ఒకేసారి; నకండూయేత్ = గోకరాదు; శిరసా = శిరస్సుతో; భారం = భారమును; నవహేత్ = మోయరాదు; యుగపత్ = ఒకేసారి; అగ్నివారిణీ = నీళ్ళు నిప్పులను; నవహేత్ = మోయరాదు; నాసికాం = ముక్కును; నవికుష్ణీయత్ = ఆకర్షణముచేయరాదు; దశవాన్ = పండ్లను (దంతములను); నవిఘట్టయేత్ = కొరకరాదు; పాదేన = కాలితో; విలేఖన...మర్దనమ్ - విలేఖన = భూమినిగీసుటయు; చ్ఛేద = తృణాదులను తెంచుటయు; భేద = కఱ్ఱలను చీల్చుట: స్ఫోటన = పగులగొట్టుట; మర్దనం = మర్దించుట; నకుర్యాత్ = చేయరాదు; పాదేన = కాలిచేత; పాదం = మరొంపాదమును: నక్రామేత్ = ఆక్రమించరాదు: నకండూయేత్ = గోకరాదు; నశౌచయేత్ = కడుగరాదు; కాంస్యభాజనేచ = కంచుపాత్రయందుకూడ: తే = అపాదములను; నశౌచయేత్ = కడుగరాదు; ఉపవిష్టః = కూర్చున్నవాడై ; తే = ఆకాళ్ళను; నప్రసాధయేత్ = అలంకరించరాదు (కడుగరాదు).

**తాత్పర్యము:** తన శరీరమును నిందించరాదు. పొగడరాదు. పీడించరాదు. నడవడికతో, ధనముతో, శరీరబలముతో, పాండిత్యముతో తక్కువైన వారిని అవమానించరాదు. మర్మాఘాతములైన మాటలతో నొప్పింపరాదు, పరుషముగా మాట్లాడుట, క్రోధము గలవాడుగా నుండుట, పరులను నిర్బంధించుట చేయరాదు, కారణమునందు అసూయ చెందవలయునే కాని ఫలమునందు కాదు. పాపకార్యమును పాపియందుకూడ చేయరాదు. శత్రువును శిక్షించరాదు, మంచి అభిప్రాయము కలవాడు కోపించినవాడై పుత్రునికంటె, దండనార్హుడైన శిష్యునికంటె ఇతరునికి ఈ శిక్షను విధించరాదు. నృత్యము వాద్యము గానము మొదలగు కార్యములను అతిగా చేయరాదు. ప్రశస్తములైన కేశములు, స్పష్టమైన వాక్కు, ఆనుషంగిక వేషము, ఇంద్రియ

నిగ్రహము, అనునయము వీటియందు మిక్కిలి ఆసక్తిగలవాడు, శరీరముయొక్క బొడ్డుకంటె పై భాగమును క్రిందిభాగములో ధరించుబట్టతో తాకరాదు. రతి కేళి ముగిసిన వెంటనే శౌచకార్యము నాచరించవలయును. హస్తాదులచే నోరును మూసికొనక నవ్వు, తుమ్ము, త్రేనుపు, ఆవలింత చేయరాదు. ఒకేసారి రెండు చేతులతో తలను గోకరాదు, శిరస్సుతో భారమును మోయరాదు. అగ్నిని నీటిని ఒకేతూరి తీసుకొని వెళ్ళకూడదు. ముక్కు నాకర్షణము చేయకూడదు. ఒక పంటిని ఒక పంటితో కొరకరాదు. కాలితో భూమిని గీరుట, తృణాదులను త్రెంచుట, కర్రలను చీల్చుట, రాళ్ళను పగులగొట్టుట, పాదముతో పాదము నాక్రమించుట, పాదమును గోకుట చేయరాదు. మరియు కంచుపాత్ర యందు పాదములను కడుగరాదు. కూర్చుండి పాదములను కడుగరాదు.

*శశిలేఖ* : శరీరము నవమానించరాదు. తనను స్తుతించరాదు, మనస్సును హింసించరాదు. తనకంటె వృత్తిలోను, శరీరబలములోను తక్కువయినవారి నవమానించరాదు. మర్మాఘాతములైన మాటలను మాట్లాడరాదు, పరులను బంధించరాదు. హేతువునందు అసూయాపరుడుగా నుండవలెను గాని ఫలము నందసూయాపరుడుగా నుండరాదు, పాపియందుకూడ పాపకార్యముల నాచరించరాదు. పరులను శిక్షించరాదు. పుత్రుణ్ణి దండనకు తగిన శిష్యుణ్ణి వదలు కోపముగలవాడై పరుని శిక్షార్హునిగా చేయరాదు. చేయబడిన వ్యత్యవాయము కలవాడై వెంటనే శౌచకార్యము నాచరించవలెను. శబ్దాదుల నధికముగ చేయరాదు. పాదముచేత పాదము నాక్రమించకూడదు. రుద్దకూడదు. కూర్చుండి కడగరాదు. కాంస్యపాత్రలో ప్రక్షాళనము చేసికొనరాదు.

మూ॥ అభీక్ష్ణం నిర్మలాన్ దధ్యాన్నఖ పాదమలాశయాన్॥
నాఽస్నమిద్ధ ముపాసీత హుతాశం నైవచాశుచిః॥
నాఽనువాతం నవివృతోన క్లాంతోనాఽ న్యమానసః॥
ధమేన్నాఽప్యన నస్కందేన్నాఽధః కుర్యాన్నపాదతః।
సతతం ననిరీక్షేత చలసూక్ష్మా ప్రియాణిచ॥
నాప్రశస్తం నవిణ్మూత్రం నదర్పణ మమార్జితమ్।
ఉద్యన్త మస్తమాయన్తం తపన్తం ప్రతిమాగతమ్॥
ఉపరక్తంచ భాస్వంతం వాససావాతి రోహితమ్।
నాఽన్యదవ్యతి తేజస్విన క్రుద్ధస్య గురోర్ముఖమ్॥
నస్త్రియం ప్రసవన్తీం నోచక్యాం ననగ్నాం నాఽన్య సంగతామ్।
నపత్నీం భోజన స్వప్న క్షుత జృంభా దురాసనే॥
శయీతనైక శయనే నచాగ్ని త్రయాసహ।
తామసీర్ష్యేశ్చ గోపయేత్ స్వైరిణీం నాధివాసయేత్॥
నోచ్ఛిష్ట తారకారాహు తుహినాంశు దివాకరాన్।
పశ్యేన్నయాయాన్న ఘతేన్న ప్రపాన్నన్న స్పృశేచ్ఛిరః॥

పాయ యంతీం చరంతీంవా నాన్యస్మై స్మైగాం నివేదయేత్।
ఆర్కేందు పరివేషోల్కా శతక్రతు ధనూంషిచి॥
నాన్యద్దేవార్చనే కర్మ కుర్యార్థావేన్న వర్షతి।
తిథిం పక్షస్య నబ్రూయాత్ నక్షత్రాణిన నిర్దిశేత్॥
నా ఒత్మనో జన్మలగ్న రక్ష ధన సారం గృహే మలం।
ప్రకాశయే న్నావమానం నచ విస్నేహతాం ప్రభోః॥

ప్రతిపదార్థము : నఖపాదమలాశయాన్=గోళ్ళను పాదములను గుహ్యా ఇంద్రియములను; అభీక్ష్ణం=పలుమార్లు; నిర్మలాన్=శుద్ధములనుగా; దధ్యాత్= ఉంచవలెను; చ=మరియు; అశుచిః=అపవిత్రుడైన; నాసమిద్ధం=హోమాగ్నిని హుతాశ=గార్హపత్యాగ్నిని; నైవఉపాసీత్=ఉపాసించరాదు; హుతాశం= అగ్నిని; అనువాతం=వాతానుకూలముగ; ఆస్యేన=నోటితో; నధమేత్=ఊద రాదు; వివృతః=నోరు తెరచుకొని; నధమేత్=ఊదరాదు; క్లాంతః=బడలిక చెందినవాడై; ఆస్యేన=నోటితో; నధమేత్=ఊదరాదు; అన్యమానసః=మన స్సుపరిభ్రమించుచున్నవాడై;ఆస్యేన=నోటితో;నధమేత్=ఊదరాదు;అతహః= పరుపులనుండి, ఆసనములనుండి క్రిందికి; నన్కందేత్=వెదజల్లకూడదు; పాదతః= పాదములవలన; నకుర్యాత్=చేయకూడదు; చ=మరియు; చలసూక్ష్మప్రియాణి =కదలుచున్న మిక్కిలి సూక్ష్మమైన, మిక్కిలి ప్రేమపాత్రమైన వస్తువులను; అథః=క్రిందికి; నకుర్యాత్=చేయరాదు; అప్రశస్తం=ప్రశస్తముకానిదానిని, నకుర్యాత్=చేయరాదు; విణ్మూత్రం=మలమును మూత్రమును; అథః= క్రిందికి; నకుర్యాత్=చేయకూడదు; ఉద్యంతమ్=ఉదయించుచున్న; అస్తమ యాంతం=అస్తమించుచున్న; తపంతం=ప్రచండమైన;ప్రతిమాగతం=ప్రతిబిం బరూపమైన; ఉపరక్తం=రాహువుచేత పట్టుకొనబడిన; వా=లేక; వాససా= వస్త్రముచేత; తిరోహితం=మరుగుపరుచబడిన; భాస్వంతం=సూర్యుని; నేక్షేత =చూడరాదు; అన్యదపి=ఇతర విధములుగాకూడ; అతితేజస్వి=మిక్కిలితేజ స్సుతో కూడినదానిని; నేక్షేత=చూడకూడదు; క్రుద్ధస్య=అతికుపితుడై; గురోః=గురువుయొక్క; ముఖం=ముఖమును; నేక్షేత=చూడ కూడదు; స్రవంతీం=మూత్రము చేయుచున్న; స్త్రియం=స్త్రీని; నేక్షేత=చూడకూడదు; ఉదక్యాం=రజస్వలయైన స్త్రీని;నేక్షేత=చూడకూడదు; అన్యసంగతాం=ఇతర పురుషునితో సంభోగించుచున్న స్త్రీని; నేక్షేత=చూడరాదు; భోజన స్వప్న క్షుతజృంభాదురాసనే స్థితాం= భుజించుచున్న నిదురించుచున్న ఆకలిగొన్న ఆవలించుచున్న దుష్టమైన ఆసనమునందున్న; పత్నీం=తనభార్యను; నేక్షేత= చూడకూడదు; ఏకశయనే=ఒకే పడక యందు; స్వభార్యయః తయాసహ=తన భార్యతో కూడ; నశయత=పడుకొనకూడదు; నాశ్నీయాత్=ఆహారము భుజిం చరాదు; తాం=ఆమెను; అనీర్ష్యాం=ఈర్ష్య లేనిదానిని; గోపాయేత్=రక్షించ

వలయును; స్వైరిణీం=కులటను; స్వగృహే=తన యింటియందు; నాధివాస యేత్=నివసింపచేయరాదు; ఉచ్ఛిష్టతారక రాహు తుహినాంశు దివాకరాన్= అప్రయత్నముగా నక్షత్రములను, రాహువును, చంద్రుని,సూర్యుని; నపశ్యేత్= చూడకూడదు; నయాయాత్=ప్రయాణించరాదు; నపఠేత్=చదువరాదు; నస్వప్యాత్=నిదురించరాదు. శిరః=తలను; నస్పృశేత్=తాకరాదు; పాయయంతీం=దూడకు పాలిచ్చుచున్న; చరతీం=సంచరించుచున్న; గాం=ఆవును; అన్యస్మై=ఇతరునికి; ననివేదయేత్=చెప్పరాదు; అర్కేందుపరివేషోల్కాశత క్రతుధనూంషి=అర్క=సూర్యుని యొక్క; ఇందు=చంద్రుని యొక్క నీడ; పరివేష=ఆవరణముగా కాబడినపుడు; ఉల్క=చుక్క రాలినపుడు; శతక్రతు ధనూంషి=ఇంద్రధనుస్సును; అన్యతు=వేరైన; దేవార్చనే=దేవతార్చన యందలి; కర్మ=పనిని; ననివేదయేత్=నివేదించరాదు; వర్షతి=వర్షములో; నధావేత్=పరుగెత్తకూడదు; పక్షస్య=పక్షము యొక్క; తిథిం=తిథిని; నబ్రూయాత్ = చెప్పరాదు; నక్షత్రాణి=నక్షత్రములను; ననిర్దిశేత్=చూపెట్టరాదు; ఆత్మనః=తనయొక్క; జన్మలగ్నరక్షఘనసారం=జన్మలగ్నము, నక్షత్రము, ఘనసారములను; నకథయేత్=చెప్పరాదు. గృహేమలం=గృహదోషమును, అవమానం=అవమానమును; ప్రభోః=ప్రభువుయొక్క; నిస్నేహతాం= ద్వేషమును; నప్రకాశయేత్=బయలు పరుచరాదు.

**తాత్పర్యము :** గోళ్ళను, పాదములను, మలాశయములను రోజులో చాలా పర్యాయములు శుద్ధిచేసుకొన వలెను. తాను అపవిత్రుడుగా నున్నప్పుడు హోమము యొక్క అగ్నిని లేక గార్హపత్యాగ్నిని ఉపాసించరాదు. అగ్నిని పవిత్రత తోనే ఉపాసించ వలెను. వాయువున కనుకూలముగ అగ్నిని ఊదరాదు. నోటినంతయు తెరచిగాని లేక బడలిక చెంది యున్నప్పుడుగాని మనస్సు చంచలముగ నున్నప్పుడుగాని అగ్నిని ఊదరాదు. గొట్టముతో గాని లేక విసనకర్ర మొదలగు సాధనములతో గాని అగ్నిని ప్రజ్వరిల్ల చేయవలయును. అగ్నిని వెదజల్లుట లేక పీటల క్రిందికి త్రోయుట మొదలగు పనులను చేయరాదు. పాదములతో అగ్నిని ప్రక్కకు నెట్టుట లేక చల్లార్చుట చేయరాదు, కదలుచున్న సినిమా మొదలగు వానిని మరియు అణువులను అప్రియముగైన వస్తువులను దూరదర్శినీ యంత్రముల ద్వారా చూడరాదు. నింద్యములైన వస్తువులను, నింద్యమైన కార్యములను, మలమూత్రములను, మబ్బుగా నున్న అద్దములను చూడరాదు.ఉదయించుచున్న,అస్తమించుచున్న,మధ్యాహ్న సమయమము నందు ఏదేని వస్తువునందు ప్రతిబింబ రూపముగ కనబడుచున్న రాహువులచేత మ్రింగబడుచున్న, వస్త్రములచేత ఆచ్ఛాదితమైన సూర్యుణ్ణి చూడరాదు. ఇట్లే మరియొక ఏదేని ప్రకాశవంతమైన వస్తువులను కూడ చూడరాదు. కుపితుడైన గురువుయొక్క ముఖమును చూడరాదు. మూత్రము చేయుచున్న స్త్రీనిచూడరాదు.నీళ్ళలో నిలబడియున్న. నగ్నరూపములోనున్న,

ఇతర పురుషునితో సంగమించుచున్న స్త్రీని చూడరాదు. నీటిని పానము చేయు చున్న, భుజించుచున్న, నిదురించుచున్న,ఆవలించుచున్న, ఏకాంతము నందున్న ఇతర వ్యవస్థలో నిమగ్నురాలై యున్న ధర్మపత్నిని గూడ దర్శించరాదు. ధర్మపత్నితో కూడ ఒకే శయనముపైన పరుండరాదు. ధర్మపత్నితో కూడ కలిసి ఒకే పాత్రలో భుజింపరాదు. ఆమెను ఇతరులపైన ఈర్ష్య చూపకుండు నటుల చూడ వలయును. ఇంటిలో భర్తను విడిచి వచ్చిన స్త్రీని ఉంచుకొన రాదు. సూర్య గ్రహణ చంద్ర గ్రహణ సమయములందు, నక్షత్రములు పతన మగు నపుడు చదువుట, నిదురించుట, తల్లను స్పృశించుట, ప్రయాణించుట లను చేయరాదు, వీటిని ఆ సమయములందు చూడరాదు. సూర్య చంద్రుల యొక్క ఛాయను, ఉల్కాపాతమును, ఇంద్ర ధనుస్సును, దేవతా నిమిత్తము లైన కర్మను గురించి ఎవ్వరికిని చెప్పరాదు. వర్షములో ఉరకరాదు. ఈ రోజు ఈ తిథి, ఈ నక్షత్రము, ఈ పక్షము అని ఎవ్వరికిని అడగకుండా చెప్పకూడదు. తనకు జరిగిన అవమానమును, తన అధికారితో తనకుగల ద్వేషమును ఇతరు లతో చెప్పుకొనరాదు. వీటిని తన హృదయము నందే ఉంచుకొన వలయును.

**శశిలేఖ :** నఖాదులను నిర్మలముగ నుంచుకొన వలయును. అగ్నిని నోటితో ఊదరాదు. ముఖవాతముతో అగ్నిని రెచ్చగొట్ట కూడదు. అగ్నిని వెదజల్ల గూడదు. శయన ఆసనాదుల కథో భాగమున అగ్నిని ఉంచరాదు. జన్మలగ్న కుండలిని నక్షత్రాదులను ఎవ్వరికిని చెప్పగూడదు. గృహచ్ఛిద్రముల నితరులకు తెలియ నివ్వరాదు. అవమానము నితరులతో చెప్పుకొనరాదు. రాగద్వేషములను బహిర్గతము చేయగూడదు.

మూ॥ పురోవాతాత పరజస్తుషార పరుషానిలాన్।
అనృజుః క్షవథూద్గార కాసస్వప్నాన్నమైథునమ్॥
సశబ్దమలినమ్ హస్త భ్రూ నేత్రోత్క్షేపనాదికామ్।
కూలచ్ఛాయాం సురాపానం వ్యాళదంష్ట్రి విషా నః॥
హీనానార్యాతి నిపుణసేవాం విగ్రహముత్తమైః।
సంధ్యాస్వభ్యవహార స్త్రీ స్వప్నాధ్యయన చింతనమ్॥
ఆరోగ్య జీవితైశ్వర్య విద్యాసుస్థిరమానితాం।
తోయాగ్ని పూజ్య మధ్యేన యానం ధూమం శవాశ్రయమ్॥
మద్యాతిసక్తిం విస్రంభస్వాతంత్ర్యే స్త్రీషుచత్యజేత్।

**ప్రతిపదార్థము :** పురోవాతపరజస్తుషారపరుషానిలాన్ = ఎదురుగాలి, ఎదు రెండ, దుమ్ము, మంచు, దుష్టమైనగాలి వీనిని; త్యజేత్ = త్యజించవలయును. క్షుమథూద్గార కాసస్వప్నాన్నమైథునమ్ = తుమ్ములు, త్రేనుపులు, దగ్గు, నిద్ర, భోజనము, సంభోగము వీనిని; అనృజుః = వక్రమైన శరీరముగలవాడై చేయ కూడదు. సశబ్దమలినం = శబ్దముతోకూడ ప్రాణవాతమునుగాని అపానవాతముగాని

బహిర్గతము చేయుటను; త్యజేత్ = వదలిపెట్టవలెను. హస్త భ్రూనేత్రోత్క్షేప వాదితామ్ = చేతులు, కనుబొమలు, నేత్రములు వీనిని కదల్చుట లేక చప్పుడు చేయుటను; త్యజేత్ = వదలిపెట్టవలెను. కూలచ్ఛాయాం = నదీతీరము నందలి వృక్షములయొక్క నీడను; సురాపానం = సురాపానమును; వ్యాళదంష్ట్రి విషాణినః = సింహము మొదలగు దుష్ట జంతువులు, పాము మొదలగు విష జంతువులు, పశువు మొదలగు కొమ్ములు గల జంతువు; హీనానార్యాతి నిపుణ సేవాం = కులశీలనాదులచేత హీనులు, దుష్టచేష్టలు చేయువాడు, లుబ్ధుడు మొదలగు వారిసేవను; ఉత్తమైః = సన్మార్గులతో; విగ్రహమ్ = విరోధము; సంధ్యాస్వభ్యవహార స్త్రీస్వప్నాధ్యయనచింతనం = సంధ్యాకాలము నందు భోజనము, స్త్రీసంభోగము, నిద్ర, అధ్యయనము, ఒక విషయమును గురించి ఆలోచించుట మొదలగు కార్యములను; ఆరోగ్యజీవితైశ్వర్య విద్యాసుస్థిర మానితామ్ = నేనారోగ్యవంతుడను. నేను జీవించియున్నాను, నేను ఐశ్వర్య వంతుడను, నేను విద్వాంసుడను ఇట్టి అహంభావము; త్యజేత్ = వదలిపెట్ట వలయును, తోయాగ్ని పూజ మధ్యేన = నీరు, అగ్ని, పూజ్యులయొక్క మధ్యలో; యానం = సంచారము చేయుటను; శవాశ్రయం = శవాశ్రయమైన; ధూమం = ధూమమును; మద్యాతిసక్తిం = మద్యము నందాసక్తిని; త్యజేత్ = వదలిపెట్ట వలయును; స్త్రీషు = స్త్రీలవిషయమై; విస్రంభ = విశ్వాసము; స్వాతంత్ర్యే = స్వాతంత్ర్యములను; త్యజేత్ = వదలిపెట్టవలయును.

**తాత్పర్యము :** ఎదురుగాలి, ఎదురెండ, దుమ్ము, మంచు, దుష్టమైనగాలి వీనిని వర్జింప వలెను; తుమ్ములు, ఆవలింతలు, దగ్గు, నిద్ర, భోజనము, మైథునము వీనిని వక్రమైన శరీరముగలవాడై చేయకూడదు. నదీతీరముల యందలి వృక్షములయొక్క నీడ, రాగద్వేషి, సింహము మొదలగు దుష్ట జంతువులు, పాము మొదలగు విషజంతువులు, పశువులు మొదలగు కొమ్ములుగల జంతువులు, కులశీలనాదులచే హీనులు, దుష్టచేష్టలు చేయువాడు, లుబ్ధుడు మొదలగు వారిసేవను, సన్మార్గులతో విరోధము, సంధ్యాకాలమునందు భోజనము, స్త్రీ సంభోగము, నిద్ర, అధ్యయనము, ఒక విషయమును గురించి ఆలోచించుట మొదలగు కార్యములను వదలిపెట్టవలయును. ఉదకము, అగ్ని, పూజ్యులు వీని నడుమ సంచరించుట, ప్రేతధూమము, మద్యపానమునందు అత్యాసక్తి, స్త్రీల యందు నమ్మకముంచుట, స్త్రీలకు స్వాతంత్ర్యము నిచ్చుట మొదలగు వానిని త్యజించ వలయును,

**శీలేఖ :** హీనసేవను వదలిపెట్టవలయును. నేను ఆరోగ్యవంతుడను, నేను విద్యావంతుడను అను భావమును వదలిపెట్టవలయును.

మూ॥ నైకాహమప్యధివసే ద్వాస్తు తచ్ఛాత్ర శస్త్రితమ్॥
నదేశం వ్యాధి బహులం నావైద్యం నాప్యనాయకమ్।
నాధర్మిజన భూయిష్ఠం నోపసృష్టం నపర్వతమ్॥

**ప్రతిపదార్థము :** వాస్తు=వాస్తు; తచ్ఛాస్త్రగర్హితమ్=వాస్తుశాస్త్రము చేత నిందింపబడిన యింటిలో; ఏకాహమపి=ఒకదినముకూడ; **నాధివసేత్**= నివసింపరాదు; వ్యాధిబహులం=వ్యాధులు ఎక్కువగానున్న; దేశం=దేశము నందు; నాధివసేత్=నివసింపరాదు: అవైద్యం=వైద్యుడులేని ప్రదేశమునందు; **నాధివసేత్**=నివసించరాదు; అనాయకం=నాయకుడు లేనిచోట; అధర్మిజన భూయిష్ఠం=అధర్మపరులైన జనబాహుళ్యము గల ప్రదేశమున; జనపదోధ్వంస కర వ్యాధిగ్రస్తులు వదిలిన ప్రదేశమున; పర్వతమ్=పర్వతమున; నాధివసేత్= నివసింపరాదు.

**తాత్పర్యము :** గృహనిర్మాణ విద్యయైన వాస్తు శాస్త్రముచేత నిందింప బడిన గృహమునందు ఒక దినము కూడ నివసింపరాదు. వ్యాధులుప్రబలియున్న ప్రదేశమున, వైద్యసదుపాయము లేనిచోట, నాయకుడులేని ప్రాంత మున మహామారి మొదలగు వ్యాధులు ప్రబలియున్నందున వదలి పెట్టబడిన ప్రాంతమునందు, అధర్మప్రవర్తకులు ఎక్కువగా గల ప్రదేశమున, పర్వతముల యందు నివసింపరాదు.

**శశిలేఖ :** ఉపసృష్టం=సోపసర్గం మారకాదినా ఇత్యర్థః.

**మూ॥** వనే(ప్రా)జ్యాంబు భైషజ్య సమిత్పుష్పతృణేంధనే।
**సుభిక్షక్షేమ రమ్యాన్తే** పండితైర్మండితే పురే॥
నరామరాణాం సిద్ధానాం శాస్త్రిణాంచాజుగుప్సకః।
ఆరాధకస్త్రి వర్గస్య యథాయోగ్యం జనస్యచ॥
**దశకర్మ పథాన్ రక్షన్ జయన్నాభ్యన్తరానరీన్।**
**హింసాస్తే యాన్యథాకామం పైశున్యం పరుషానృతమ్॥**
సంభిన్నాలాపం **వ్యాపాదమభిద్యాం దృగ్విపర్యయమ్।**
**పాపం** కర్మేతి దశధా కాయ వాఙ్మాన సైస్త్యజేత్॥

**ప్రతిపదార్థము :** ప్రాజ్యాంబుభైషజ్య సమిత్పుష్పతృణేంధనే=మిక్కిలి నీరుగల, వైద్య సంపన్నమైన,సమిధలు పుష్పములు దర్భలు కట్టెలు సమృద్ధిగల; సుభిక్షక్షేమ రమ్యాన్తే=ధనధాన్యములతో సుభిక్షమైన, మంగళకరమైన, మనోహరమైన; పండితైః=పండితులతో; మండితే=అలంకరింపబడిన; నరా మరాణాం=మనుష్యులదేవతలయొక్క; సిద్ధానాం=సిద్ధపురుషులయొక్క; శాస్త్రి ణాం=శాస్త్రములయొక్క; అజుగుప్సకః=ద్వేషింపబడనటువంటి; త్రివర్గస్య= త్రివర్గముయొక్క; ఆరాధకః=ఆరాధకుడుగల; యథాయోగ్యం జనస్య=జనము నకుతగినట్టి; పురే=పట్టణమునందు; అధివసేత్=నివసింపవలయును; దశ=పదివిధము లైన, కర్మపథాన్=కర్మమార్గములను; రక్షన్=రక్షించుచు; ఆభ్యన్తరాన్=ఆభ్యం తరములైన: అరీన్=శత్రువులను; జయన్=జయించుచు; పురే=పట్టణమునందు; అధివసేత్=నివసింపవలెను; హింసా=జీవహింస; స్తేయ=దొంగతనము; అన్యథా

కామం=గురుదారగమనాది నిషిద్ధకామసేవను;పైశున్యం=పిసినత్వమును;పరుషానృతే=క్రూరవచనము, అసత్యవచనముఈ రెండింటిని;సంభిన్నాలాప=సందర్భము లేనివచనము; వ్యాపాద=జీవద్రోహచింత,అభిధ్యా=ఇతరులయొక్క మేలును మంచిగుణములు మొదలగు వానిని సహించ కుండుట; దృగ్విపర్యయమ్=శాస్త్రములయందు విరుద్ధజ్ఞానము (నాస్తికత్వాదులు); దశధా= ఈ పదియును; పాపం కర్మేతి=పాపకార్యములని;కాయవాఙ్మనసైః=కాయ వాక్ మనస్సుల చేత; త్యజేత్=వదలిపెట్టవలయును.

**తాత్పర్యము :** ఏ ప్రదేశమునందు పుష్కలముగ నీరుండునో, ఎచట మందులు మొదలైన వైద్యసదుపాయము లుండునో, సమిధలు, పుష్పములు, దర్భలు, కట్టెలు మొదలగునవి సుసంపన్నములై యుండునో, దేశము ధనధాన్యములతో తులతూగుచుండునో, మంగళకరములైన కార్యము లెచట అవిచ్ఛిన్నముగ కొనసాగుచుండునో, పండితులకెచట గౌరవ మర్యాదలకు లోటు లేకుండునో, మానవులకు దేవతలకు జ్ఞానులకు ఎచట అవమానము జరుగకుండునో, ధర్మ అర్థకామముల కెచట నిరంతరము ఆరాధన జరుగుచుండునో, యోగ్యతగల జనులకు ఆదరము ఎచట లభించునో అట్టి ప్రదేశము నందు నివసించ వలయును.

అంతశ్శత్రువులైన కామక్రోధాదులను జయించి పదివిధములైన కర్మమార్గములను రక్షించుచు జీవింప వలయును. పది విధములైన పాపములను మనసా వాచా కర్మణా త్యజించ వలయును. ఈ త్యాగము క్రమ ప్రాప్తమై యుండ వలెను.

**శశిలేఖ :** కాయ వాఙ్మనసాః అని మూడు విధములు. కాయికములు మూడు. ప్రాణాతిపాతః, పరద్రవ్యాపహారః, అగమ్యాగమనం. వాచికములు నాల్గు విధములు. అసత్య వచనం, పరేషాంభేదకృద్వచనం, పరుష వచనం,, అసంబద్ధ ప్రలాపః. మానసికములు మూడు విధములు. అభిధ్యా వ్యాపాదః. మిథ్యాదృష్టిః, పరస్వస్యాన్యాయేనస్పృహా అభిధ్యా, వ్యాపాదః= సత్త్వవిద్వేషః దృగ్విపర్యయః=శాస్త్ర దృష్టివైపరీత్యం (నాస్తికత్వ మితి యావత్).

మూ॥ పరోపఘాత క్రియయా వర్జయే దార్జనం శ్రియః।
అర్థానాం ధర్మలబ్ధానా మదాతాఽపి హ్యసంభవాత్॥
స్వర్గాపవర్గ విభవా నయత్నే నాధిష్ఠతి.।

**ప్రతిపదార్థము :** పరోపఘాతక్రియయా=ఇతరులను కష్టపెట్టి; ఆర్జనం=సంపాదింపబడిన; శ్రియః=సంపదను; వర్జయేత్=వదలిపెట్ట వలయును; ధర్మలబ్ధానాం=ధర్మపూర్వకముగా పొందబడిన; అర్థానాం=అర్థములను; అసంభవాదపి=అసంభవము లైనప్పటికి; అదాతాపి=దానము చేయని వాడైన

ప్పటికి; స్వర్గాపవర్గ విభవాన్=స్వర్గాపవర్గ విభవములను; అయత్నేన=అయత్నముగ; అధితిష్ఠతి=పొందుచున్నాడు.

**తాత్పర్యము :** న్యాయసమ్మతముగ ఆర్జించిన ధనధాన్యాది వస్తువులను పాత్రాపాత్రతలను గుర్తించి దానము చేయుచు ఇహలోక పరలోక సౌఖ్యములను పొందుటకు అర్హత కలిగియుండును. ఒకవేళ న్యాయ సమ్మతమైన సంపాదన లేక దానాది విధులను నిర్వర్తించక పోయినను పైనుదాహరించిన సౌఖ్యములను పొందవచ్చును. కాని అన్యాయార్జితముగ ధనమును గడించరాదని భావము.

*శశిలేఖ :* ఇతరులను హింసించి సంపాదించిన సంపదను విడిచిపెట్టవలయును. తక్కిన విషయములు సుగమములు.

మూ॥ **సాయం భుక్త్వా లఘుహితం సమాహితమనాః శుచిః॥**
**శాస్తార మను సంస్మృత్య స్వశయ్యాం చాధసం విశేత్।**
**దేశేషు చావ నాకీర్ణే ద్విత్రాప్త పరిచారకః॥**
**యుక్తోపధానం స్వాస్తీర్ణం విస్తీర్ణా విషమం సుఖమ్**
**జాను తుల్యం మృదు శుభంసేవేత శయనాసనమ్॥**
**ప్రాగ్దక్షిణ శిరాః పాదావ కుర్వాణో గురూన్ ప్రతి।**
**పూర్వాపర దిశో భాగే ధర్మమే వాను చింతయన్॥**

*ప్రతిపదార్థము :* సాయం=సాయంకాలము (సూర్యాస్తమావమునకంటె ముందు); లఘు=తేలికగ జీర్ణమగు; హితం=పథ్యకర ఆహారమును; భుక్త్వా=భుజించి; శుచిః=పరిశుద్ధుడై; సమాహిత మనాః=శాంతమైన పరిశుద్ధమైన మనస్సు గలవాడై; శాస్తారం=భగవంతుని; అనుసంస్మృత్య=స్మరించి (అట్లే దినచర్యను కూడ ఒకతూరి మననము చేసుకొని); అధ=తరువాత; స్వశయ్యాం=తన పడకను; సంవిశేత్=పొందవలయును (నిద్రించవలయును); శుచౌదేశే= పరిశుద్ధమైన ప్రదేశమునందు; అనాకీర్ణే = ఏకాంతముగనున్న: (దేశే సంవిశేత్); ద్విత్రాప్త పరిచారకః=ఇద్దరు లేక ముగ్గురు విశ్వాసపాత్రులైన పరిచారకులు గలవాడై; (సంవిశేత్); యుక్తోపధానం=తగిన తలగడను; స్వాస్తీర్ణం=మిక్కిలి వెడల్పైన; విస్తీర్ణ విషమం = ఎగుడుదిగుడుగా వెడల్పు లేక; సుఖం=సుఖకరమైన; జానుతుల్యం=మోకాలితో సమానమైన ఎత్తుగల; మృదు=మెత్తనైన: శుభం = మంగళకరమైన; శయనాసనమ్ = శయనాసనమును; సేవేత్=సేవించవలయును; ప్రాక్దక్షిణశిరాః=తూర్పువైపునగాని దక్షిణము వైపునగాని తలగలవాడై, గురూన్ ప్రతి=గురువులవైపు; పాదౌ=పాదములను; అకుర్వాణః=చేయనివాడై ; సేవేత=సేవించవలయును; పూర్వాపర నిశాభాగే = రాత్రి యొక్క ఆద్యంతములయందు; ధర్మమేవ =ధర్మమునే; అనుచింతయేత్=చింతించవలయును.

**తాత్పర్యము :** సాయంకాలము తేలికగా జీర్ణమగు పథ్యకరమైన ఆహారమును భుజింపవలయును; తరువాత పరిశుద్ధమైన మనస్కుడై శాంత చిత్తముతో భగవంతుని స్మరింపవలయును. మరియు దినచర్యను మననము చేయవలెను. తరువాత ఏకాంతముగానున్న పరిశుద్ధమైన ప్రదేశమునందు ఇద్దరు లేక ముగ్గురు విశ్వాస పాత్రులైన పరిచారకులతో పరివేష్ఠింపబడినవాడై తన తలకు తగిన తలగడగల మిక్కిలి వెడల్పైన సమతలముగనున్న మోకాటి ఎత్తుగల సుఖమును హాయిని ప్రసాదించు మెత్తని మంగళకరమైన పడకపైన తూర్పు లేక దక్షిణ శిరస్కుడై పూజ్యపాదులైన వారివైపు కాళ్ళు పెట్టక హాయిగ నిదురించవలెను.

**శశిలేఖ :** సాయంకాలము మితల భుజించి శాంతచిత్తుడై మహేశ్వరాదులను స్మరించి తన దినచర్యను మరియు శరీరముయొక్క స్థితిని ఒక పర్యాయము పర్యాలోకనముచేసి వరుండవలయును. పరిశుద్ధ ప్రదేశమునందు శయనమును సేవించ వలయును; అకీర్ణః = బహుజన సంకులమైన అని అర్థము. యుక్తోపధానం = తలగడను అని అర్థం.

**విశేషము :** రాత్రి కాలమునందు ప్రొద్దుపోయిన తరువాత భుజించిన యెడల చాలా సేపటికిగాని ఆ ఆహారము జీర్ణము కాదు. రాత్రి కాలమున ప్రొద్దు గడచిన తరువాత భుజించుట శరీరమునకు హానిని కలిగించును. "రాత్రేతు భోజనం కుర్యాత్ ప్రథమ ప్రహారాంతరేకించిదూనం . సమాశ్నీయాద్దుర్జరం తత్రవర్జయేత్. "ప్రథమ ప్రహారముయొక్క అంతరము నందు (సాయంకాలము) రాత్రి భోజనమును చేయవలెను. మరియు తేలికగ, జీర్ణమగునట్లు భుజింప వలయును. కఠినముగ జీర్ణమగు పదార్థములను వదలిపెట్ట వలయునని పై శ్లోకమునకర్థము.

రాత్రి కాలమున ఎంతత్వరగా వరుండినయెడల ప్రాతః కాలమున అంత శీఘ్రముగా మేల్కొన వచ్చును. దీనివలన శరీరమునకు అమితమైన ఆరోగ్యము చేకూరును. ఎట్లనగా-

"ప్రదోష పశ్చిమౌ యామౌ వేదాభ్యాసేన తౌనయేత్।
యామ ద్వయం శయానస్తు బ్రహ్మభూతాయ కల్పతే॥
—దక్షస్మృతి (2-59)

ప్రదోషమునందు నిద్రనుండి లేచి వేదాభ్యాసమును చేయువలెను. రెండు యామములు నిదురించిన యెడల బ్రహ్మత్వము సిద్ధించునని తాత్పర్యము.

మూ॥ అదక్షీత సదా దేహాదిత్థం సారమసారత॥
విశ్వస్తత్ ప్రతిక్షణం మృత్యోర్భయశాలజీ చేష్టితాత్॥
ఆరోగ్యవిశద ప్రజ్ఞా వయోధర్మ క్రియాన్వితః।
సుఖమాయుష్కృతం చోక్తం విపరీతం విపర్యయే॥

ప్రతిపదార్థము : ఇత్థం=ఇట్లు; సదా=ఎల్లప్పుడు; అసారతః=అనశ్వర మైన; దేహాత్=శరీరము నుండి; సారం=సారభూతమైన వస్తువును; ఆదదీత= గ్రహింపవలయును. అయథాతథ చేష్టితాత్ = అనియత-ఆచారముల వలన; ఆరోగ్యవిభవప్రజ్ఞా=ఆరోగ్యము, ఐశ్వర్యము, బుద్ధి; వయః=వయస్సు; సుఖం ఆయుః = సుఖకరమైన ఆయుస్సు; హితం=హితము; లభ్యతే = పొందబడు చున్నది; ఇతి=అని; ఉక్తం = చెప్పబడినది; విపర్యయేత్ = పైనుదాహరించిన దానికి విరుద్ధమైన; విపరీతం=విపరీతముగ; ఉక్తం=చెప్పబడినది.

**తాత్పర్యము :** ఈ విధముగ నెల్లప్పుడు అసారమైన శరీరమునుండి సారభూతమైన వస్తువునే గ్రహించుటకు ప్రతి మానవుడును ప్రయత్నించ వలయును. సారభూతమనగా సాధుశీలత్వమును పెంపొందించుకొనవలయును. ఎందుకనగా మానవుని నీడవలె ఎల్లప్పుడు అనాచారపరుల సమీపమున మృత్యువు తన కరాళదంష్ట్రలచేత కబళించుటకు సిద్ధముగ నుండును. అందువలన మాన వుడు ఆ మృత్యువునకు భయపడుచు సాధుశీలుడై ధర్మమార్గావలంబిగా నుండ వలెను. ఇట్లు ధర్మాచరణరతుడై ఉండిన యెడల ఆరోగ్యమును ఐశ్వర్యమును వయస్సు (దీర్ఘకాలికముగ) బుద్ధిని పెంపొందించ గలదు. హితాయువు గలవాడై 100 సంవత్సరములు జీవింపగలడు.

**శశిలేఖ :** అయథాతథ చేష్టితాత్ =అనియతాచారిణః మృత్యువెపుడు ఆవహించి కబళించునోయను భీతిచే సదాచార శీల సంపత్సమృద్ధిగా జీవికను నడిపించవలయును.

మూ॥ సర్వతేజో నిధానం హిన్నృప ఇత్యుచ్యతేభువి।
అదూషయన్మనస్తస్మాద్భక్తిమాంస్తముపాచరేత్॥

ప్రతిపదార్థము : ఈ భూమిపైన; నృపః=రాజు; సర్వతేజో నిధానం= సమస్త శక్తులకు ధనాగారమువంటివాడు; ఇతి = అని; ఉచ్యతే = చెప్పబడు చున్నది; తస్మాత్=ఆకారణమువలన; మనః=మనస్సును; అదూషయన్=చెడు కార్యములలో జొరనీయక; భక్తిమాన్=భక్తిగలవాడై; తం = ఆ రాజును. ఉపాచరేత్=ఉపాసించవలయును.

తాత్పర్యము : ఈ భూమిపైన రాజు సమస్తశక్తులకు నిధివంటివాడు; కాన ఆరాజును నిర్మలాంతః కరణముతో కూడుకొన్నవాడై భక్తిపూర్వకముగ ఉపాసించ వలయును.

మూ॥ పర్యస్తి కోపాశ్రయ కోపహాస హివాద నిష్ఠీవనజృంభణాని!
సర్వాః ప్రకృత్యర్థి కాళ్చచేష్టా స్తత్సన్నిధానే పరివర్జయేత్తు॥

ప్రతిపదార్థము : తత్సన్నిధానే=ఆరాజుయొక్క సన్నిధానము నందు; పర్యస్తికోపాశ్రాయ కోపహాసవివాద నిష్ఠీవన జృంభణాని - పర్యస్తికా=

యోగులు జంధెమువలె వేసికొనుటకై పట్టు మొదలగు వానితో నేసినది దాని వెనుక భాగము కప్పుకొనియు; ఉపాశ్రయ=ఆసనముపై కూర్చుండి; కోప=కోపముగాని; హాస=నవ్వుగాని; వివాద=వివాదముగాని; నిష్ఠీవన= ఉమియుట గాని: జృంభణాని = ఆవలింతలను: సర్వాః = సమస్తములైన; అప్రకృత్యభిధికాః=అప్రాకృతికములైన; చేష్టాః=చేష్టలను: పరివర్జయేత్ = వదలి పెట్టవలయును.

**తాత్పర్యము :** రాజుయొక్క సన్నిధానమున పట్టు వస్త్రములను కట్టుకొనుట, వారి ఎదురుగా ఆసనముపై కూర్చుండి కోపగించుట, నవ్వుట, వాద ప్రసంగములను చేయుట, ఉమియుట, ఆవలించుట, అప్రాకృతికములైన సమస్త దుశ్చేష్టలను చేయరాదు.

మూ॥ సత్త్వాద్యవస్థా వివిధాశ్చ తాస్తాః
సమ్యక్సమీక్ష్యాఽఽత్మహితం విదధ్యాత్!
అన్యోఽపియః కశ్చిదిహాస్తిమార్గో
హితోపదేశేషు భజేత తంచ॥

**ప్రతిపదార్థము :** సత్త్వాద్యవస్థాః=సత్త్వరజస్తమోగుణముల యొక్క అవస్థలను; తాస్తాః వివిధాః=పలువిధములైన వాటి గతులను; సమ్యక్=బాగుగా; సమీక్ష్య=పరీక్షించి; ఆత్మహితం = తనకుహితమైన దానిని; విదధ్యాత్=చేయవలెను; అన్యోఽపియః కశ్చిత్‌మార్గః=వేరైన ఏదియోనొక సన్మార్గము; ఇహ=ఇచ్చట; అస్తి=ఉన్నదో;హితోపదేశేషు=హితోపదేశములయందు; తం చాపి=దానిని గూడ; భజేత్ =ఆచరింప వలయును.

**తాత్పర్యము :** సత్త్వరజస్తమో గుణముల యొక్క అవస్థలు పలు విధములుగా నుండును. కాన వాటిని బాగుగా పరీక్షించి తనకు మేలును చేకూర్చు దానినే చేయ వలెను. మరియు సత్పురుషులచేత, మను బుద్ధాది రచనలచేత ఉపదేశింపబడిన దేదైనప్పటికి ఆ మార్గము కూడ అనుసరింప దగినదిగా తాను నిర్ణయించుకొని వాటిని గూడ ఆచరింపవలెను.

మూ॥ ఇతిచరిత ముపేతః సర్వజీవోపజీవ్యం
ప్రథిత పృథు గుణౌఘో రక్షితో దేవతాభిః।
సమధిక శతజీవీ నిర్వృతః పుణ్య కర్మా
వ్రజతి సుగతి నిమ్నో దేహభేదేఽపి తుష్టిమ్।

**ప్రతిపదార్థము :** ఇతి=అని; సర్వజీవోప జీవ్యం=సమస్త భూతములచే అనుసరించి నడచుకొనునట్టి; చరితం= నడవడికను (చరిత్రను); ఉపేతః= పొందిన వాడై; ప్రథిత పృథుగుణౌఘః=ప్రఖ్యాతినొందిన విపులమైన గుణ సమూహము గలవాడై; దేవతాభిః=దేవతలచేత; రక్షితః=రక్షింపబడినవాడై,

సమధిక శతజీవీ=నూరు సంవత్సరముల కంటె అధికమైన జీవితము గలవాడై; నిర్వృతః=సుఖించినది, నశించినది గలవాడై; పుణ్యకర్మా=పుణ్యకర్మలు గలవాడై; దేహభేదేపి= నిర్యాణము చెందినప్పటికి; తుష్టిం=అపవర్గాఖ్యమైన ఆనందమును; వ్రజతి=పొందుచున్నాడు; సుగతినిమ్నః=అఖండాత్మలో నిమగ్నుడై.

**తాత్పర్యము:** సమస్త భూతములకు ఆదర్శప్రాయమైన చరిత్రను పొందినవాడై పురుషుడు ప్రఖ్యాతి నొందిన విశాలమైన గుణసమూహాములు గలవాడై దేవతలచేత ఎల్లప్పుడు రక్షింపబడుచు నూరు సంవత్సరముల కంటె అధికముగ జీవించును. దేహాంతము నందు అపవర్గమను పేరుగల అఖండానంద మును పొందును. మరియు అఖండాత్మలో లీనమై జన్మ రాహిత్యమును పొందును.

తృతీయాధ్యాయము సమాప్తము.

# అష్టాంగ సంగ్రహ వ్యాఖ్యానము

## చతుర్థోధ్యాయము

మూ॥ అథాత ఋతుచర్యాం నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః
ఇతిహస్మాహురాత్రేయాదయో మహర్షయః.

**ప్రతిపదార్థము :** అథ=అటు తరువాత; అతః=అందువలన; ఋతుచర్యాం నామ=ఋతుచర్య అను పేరుగల; అధ్యాయమ్=అధ్యాయమును, వ్యాఖ్యాస్యామః=వివరించ గలము; ఇతిహ=ఇట్లని; ఆత్రేయాదయోమహర్షయః=ఆత్రేయుడు మొదలుగాగల మహర్షులు; స్మాహుః=చెప్పిరి,

**శశిలేఖ :** ఇచట స్వస్థవృత్తము ప్రధానమైనది. వెనుకటి అధ్యాయమునందు ఋతువులను సాధారణముగ వివరించడమైనది. అందువలన ఋతువులను గురించి విపులీకరించి చెప్పుట కీయధ్యాయము ఆరంభింపబడు చున్నది.

మూ॥ కాలోహినామ భగవాననాది నిధనోయథోపచితకర్మానుసారీ
యదనురోధాదాదిత్యాదయః ఖాదయశ్చ మహాభూత విశేషాస్తథా
తథావిపరిణ మన్తో జన్మవతాం జన్మమరణస్యర్తురసవీర్య దోషదేహబల
వ్యాపత్సం పదాంచ కారణత్వం ప్రత్యయతాం ప్రతిపద్యన్తే.

**ప్రతిపదార్థము :** కాలోహినామ=కాలమనగ; అనాది నిధనః=ఆద్యంతములు లేనట్టి; యథోపచిత కర్మానుసారి=పూర్వజన్మమునందు చేయబడిన కర్మకు తగినట్లుగ సర్వభూతములను అనుసరించి; భగవాన్=భగవంతుడు; యదనురోధాత్=దేనిననుసరించుట వలన; ఆదిత్యాదయః=సూర్య చంద్రాది గ్రహములు; ఖాదయశ్చ=ఆకాశము మొదలగు; మహాభూతవిశేషాః=విశిష్టములైన మహాభూతములు; తథాతథా=ఆయావిధములుగ (ప్రమాణము, జాతి, సంస్థానము, వర్ణము మొదలగు); విపరిణ మన్తః=మారుచున్నవై ; జన్మవతాం=ప్రాణులయొక్క; జన్మమరణస్య=పుట్టుక మరణమునకు; ప్రత్యయతా=కారణత్వమును; ఋతు-సంపదాంచ=ఋతువులు, రసము, వీర్యము, దోషము, దేహము, బలము వీటియొక్క హ్రాసవృద్ధులకును; కారణత్వం=కారణముగా నుండుటకు; ప్రతిపద్యంతే=పొందుచున్నవి.

**తాత్పర్యము :** కాలమనగా మొదలు చివరలు లేనట్టియు, పూర్వదేహోపార్జిత కర్మానుసారముగా ప్రవర్తించు భగవంతుడు. ఏ కాలము ననుసరించి ఆదిత్యాది గ్రహవర్గమున్ను, ఆకాశాది మహాభూతములున్ను ఆయావిధ

ములుగ విపరిణామము చెందుచు ప్రాణుల యొక్క జన్మమరణములకు కారణ ముగా నుండుటను, ఋతురసాదుల హ్రాసవృద్ధులకు కారణముగా నుండుటను గూడ అంగీకరించుచున్నవో—

*శశిలేఖ:* ఋతువనగా కాల విభాగము. అందుకొరకు కాలోహి అని ఆరంభింపబడుచున్నది. 'అనాది నిధన'మనగా ఆరంభ పరిసమాప్తులు లేనిదని అర్థము. పూర్వదేహోపార్జిత కర్మానుగుణముగా కర్మఫలముల యందు కాలము నిమిత్త కారణత్వమును పొందునని యర్థము. (ఒక కార్యము ఉత్పన్నమగునపుడు సాధారణ అసాధారణ నిమిత్త కారణములను మూడు విధ ములైన కారణములు ప్రసిద్ధములు. ఇచట ఒక నిర్దిష్ట పాపఫలమగు రోగమునకు అనిర్దిష్ట పాపము అసాధారణ కారణముగాను, దైవము సాధారణ కారణము గాను, కాలము నిమిత్త కారణముగాను అగుచున్నది.) ఈ విధముగ సర్వ కార్యము లందు కాలము నిమిత్త కారణముగ పరిగణింపబడుచున్నది. కాలము నకు ప్రత్యేకముగ కార్యము కానరాదు. ఏ కాలము ననుసరించుట చేత ఆది త్యాది గ్రహములున్ను పంచ మహాభూతములున్ను ప్రమాణ జాతి సంస్థాన ర్థాది విశేషములైన అనేక ప్రకారముల పరిణామమును చెందుచూ జీవకోటుల యొక్క జన్మమరణములకు కారణముగా నుండుటను పొందుచున్నవో అదే విధముగా ఋతువుల యొక్కయు రసాదులయొక్కయు హ్రాస వృద్ధులందు ఆదిత్యాది గ్రహములు పరిణామమును పొంది దేనియొక్క ఆధిపత్యమువలన కారణత్వమును పొందుచున్నవో అదియే కాలము. అది యుక్తమే. ఆ ఆదిత్యాది గ్రహములు పంచ భూతములే తమయొక్క ప్రతాప పరిత్యాగ స్వీకరణాదులచే ఋతు విశేషములను కల్పించుచు కాలము ననుసరించి చూడబడుచున్నారు.

కాల విశేషము చేత మహాభూతముల యొక్క ఒకానొక పరిణామము చేత ప్రాణులయొక్క జన్మము, మరొకవిధమైన పరిణామము చేత మరణము. ఈ విధముగనే రసాదుల యందలి విశేషము కూడ మహాభూత పరిణామముచేత ఏర్పడు చున్నది. ఇదియును కాలమే చేయు చున్నది. ఇందువలన కాలమనున దొకటి కలదనుటలో ప్రమాణము కూడ చెప్పబడినది. ఎట్లనగా అట్టి ఈ కాలము ప్రపంచానికి కారణముగా అంగీకరింపబడిన సూర్య చంద్రాది గ్రహ ముల యందు అకారాది మహాభూతములయందు ఎల్లప్పుడును వ్యవస్థితమై (చక్కగా స్థితిని పొందిన) తన ప్రభావము వలన ఒకానొకప్పుడు ఒకానొక వస్తువు యొక్క పుట్టుక జరుగుచున్నది. ఒకానొకప్పుడు ఒకానొక వస్తువు యొక్క నాశమేర్పడుచున్నది. ఆ సూర్య చంద్రాదులకు మాత్రము మార్పు లేదు. అచట తప్పక వేరొక నిమిత్తముండి తీరవలయును. ఈ విధముగా వేరొక గత్యంతరము లేనందు వలన ఏదైతే వేరొక నిమిత్తముండి తీరవలయు నని చెప్పితిమో అదియే కాలము.

మూ॥ సమాత్రా కాష్ఠాకలానాడీకా ముహూర్తయామాహోరాత్ర।
పక్ష మాసర్త్వయన వర్షభేదేన ద్వాదశధా విభజ్యతే॥

**ప్రతిపదార్థము :** సః=ఆకాలము; మాత్రా-భేదేన=మాత్ర, కాష్ఠ, కలా, నాడికా, ముహూర్తయామ,అహోరాత్ర, పక్ష, మాస, ఋతు, అయన, వర్ష భేదములచేత; ద్వాదశధా=పండ్రెండు విధములుగా; విభజ్యతే=విభజింప బడు చున్నది.

**తాత్పర్యము :** ఆ కాలము మాత్రాది భేదములచేత పండ్రెండు విధములుగ విభజింపబడు చున్నది.

**శశిలేఖ :** ఆ కాలము మాత్రాదిరూపములగు పండ్రెండు భేదములచేత కార్యవ్యవహారార్థము విభజింపబడు చున్నది.

మూ॥ తత్రాక్షినిమేషోమాత్రా తాః పంచదశ కాష్ఠా।
త్రాస్త్రింశత్కలా। తాః సదశ భాగా వింశతిర్నాడికా।
నాడికా ద్వయం ముహూర్తశ్చ। తేతుల్యరాత్రిం
దివేరాశి భాగేచత్వారః పాదోనా యామః।
తైశ్చతుర్భి రహో రాత్రిశ్చ। పంచ దశాహోరాత్రాః పక్షః।
పక్షద్వయం మాసః। సశుక్లాంతః। తైర్మార్గ శీర్షాదిభి
ర్ద్వి సంఖ్యైః క్రమాద్ధేమంత శిశిర వసన్త గ్రీష్మ వర్షా
శరదాఖ్యాః షడృతవోభవన్తి। తేషు శిశిరాదయస్త్రయో
రవేరుద గయన మాదానంచ। శేషా దక్షిణాయనం విసర్గశ్చ।
తావా దాన విసర్గౌ వర్షమ్।

**ప్రతి పదార్థము :** తత్ర=ఆ పండ్రెడు విధములలో; అక్షినిమేషో మాత్రా=రెప్పపాటు కాలము మాత్రయగును. తాః=ఆ మాత్రలు; పంచ దశ=పదునైదు; కాష్ఠా=కాష్ఠయగును; తాః=ఆ కాష్ఠలు; త్రింశత్=ముప్పది. కలా=కలయగును; తాః=ఆ కలలు; సదశభాగా=కలలోని పదియవభాగముతో కూడిన; వింశతిః=ఇరువది; నాడికా=నాడియగును; నాడికా ద్వయంచ=రెండు నాడికలు; ముహూర్తః=ముహూర్తమగును; తే=ఆ ముహూర్తములు, తుల్యరాత్రిందివే=రాత్రింబవలు సమానమైన; రాశిభాగే=రాశులకును. పాదోనాః=చతుర్థభాగము తక్కువయైన; చత్వారః=నాలుగు (అనగా మూడు ముప్పావు ముహూర్తములు); యామః=యామమనబడును; తైః=ఆయామములు; చతుర్భిః=నాలుగింటిచేత, అహః=ఒకపగలు; రాత్రిశ్చ=ఒకరాత్రియు అగును; పంచదశ అహోరాత్రాః=పదునైదు రాత్రింబవళ్ళు; పక్షః=పక్షమగును; పక్షద్వయం=రెండుపక్షములు; మాసః=ఒకమాసను; సశుక్లాంతః= అమాసము శుక్ల పక్షముతో అంతమగును; తైః=అమాసములు; ద్విసంఖ్యైః=

రెండు సంఖ్యలుగల; మార్గశీర్షాదిభిః=మార్గశిరము మొదలగు వాటిచేత; క్రమాత్=వరుసగా; హేమంత-శరదాఖ్యాః=హేమంత, శిశిర, వసంత, గ్రీష్మ, వర్ష, శరత్ అను పేర్లుగల; షడృతవః=ఆరుఋతువులు; భవంతి=అగుచున్నవి. తేషు=ఆ హేమంతాది ఋతువులలో; శిశిరాదయస్త్రయః=శిశిరము మొదలగు మూడు; రవేః=సూర్యుని యొక్క; ఉదంగయనం=ఉత్తర దిగ్గమన కాలము (ఉత్తరాయణము); ఆదానంచ=ఆదానకాలమున్ను; శేషాః=మిగిలినవి (వర్ష, శరత్, హేమంతములు); దక్షిణాయనం=సూర్యుని యొక్క దక్షిణ దిగ్గమన కాలము; విసర్గశ్చ=విసర్గ కాలమున్ను; తౌ=ఆ; ఆదానవిసర్గౌ=ఆదాన విసర్గకాలములు రెండు; వర్షమ్=సంవత్సరము.

**తాత్పర్యము :** ఆ పంద్రెండు విధములలో రెప్పపాటు కాలము మాత్ర. మాత్రలు పదునైదు ఒక కాష్ఠ. అవి ముప్పదిఒక కల. కలలో పదియవభాగ మునూమరియు ఇరువదికలలును కలపినదిఒకనాడిక. నాడికలు రెండు ఒకముహూ ర్తము. ఆ ముహూర్తములు మూడు ముప్పావు ఒక యామము. ఆ యామ ములు నాల్గింటితో ఒక పగలు, ఆయామములు నాల్గింటితో ఒక రాత్రియు అగును. పదునైదు అహోరాత్రములు ఒక పక్షము, పక్షములజంట ఒక మాసము. అది శుక్ల పక్షముతో అంతమగును. రెండురెండు సంఖ్యలుగల మార్గశీర్షాది మాసములతో వరుసగా హేమంత శిశిర గ్రీష్మ వర్ష శరత్తులను ఆరుఋతువులగును. అందు శిశిరాదులు మూడు సూర్యునికి ఉత్తరదిగ్గమన కాలము కూడ అగును. మిగిలిన వర్షాదిఋతువులు మూడు సూర్యునికి దక్షిణ దిగ్గమన కాలము. విసర్గకాలము కూడ అగును. ఈ ఆదాన విసర్గములు రెండును ఒక సంవత్సర మగును.

**శశిలేఖ :** తాత్పర్యమే.

మూ॥ తయోరాదాన మాగ్నేయం । తస్మిన్ ఖలు కాల స్వభావ
మార్గ పరిగృహీతోఽత్యర్థోష్ణగభస్తిజాల మండలోఽర్క
స్తత్సంపర్కా ద్వాయవశ్చ తీవ్ర రూక్షాః సోమ్యం॥
గుణమః శోషయన్తో జగతః స్నేహమా దదానా ఋతు
క్రమేణోప జనిత రౌక్ష్యా రూక్షాన్ రసాం స్తిక్త కషాయ
కటు కాంశ్చ ప్రబల యన్తో నృణాం దౌర్బల్య మావహన్తి॥

**ప్రతిపదార్థము :** తయోః=ఆ ఆదానవిసర్గములలో; ఆదానం=ఆదాన కాలము; ఆగ్నేయం=అగ్నికి ప్రాధాన్యముగల కాలము; తస్మిన్ ఖలు=ఆ ఆదాన కాలమునందుగదా; కాలస్వభావ మార్గ పరిగృహీతః=ఆదానకాల స్వభావము వలన ఉత్తర దిఙ్మార్గముచేత స్వీకరింపబడినవాడై; అత్యర్థోష్ణ గభస్తి జాల మండలః=మిక్కిలివేడిగల కిరణ సముదాయములతోకూడిన మండలము గల; అర్కః=సూర్యుడును; తత్సంపర్కాత్=ఆ సూర్యుని యొక్క సంప

ర్కము వలన; వాయవశ్చ=వాయువులును; తీవ్రరూక్షాః=మిక్కిలి రూక్ష గుణములు గలవై; సోమజం గుణం=శీతగుణమును; ఉపశోషయన్తః=శోషింపజేయునవై; జగతః=స్థావర జంగమాత్మకమైన ప్రపంచ; స్నేహం=స్నిగ్ధగుణమును; ఆదదానాః=గ్రహించుచున్నవై; ఋతుక్రమేణ=శిశిర వసంత గ్రీష్మ ఋతువులయొక్క క్రమము చేత; ఉపజనిత రూక్ష్యాః=పుట్టిన రూక్ష గుణము కలవై; రూక్షాన్=రూక్షగుణముగల; తిక్త కషాయ కటుకాన్=తిక్త కషాయ కటుకములను; రసాన్=రసములను; అభిప్రబలయన్తః=పెంచునవై; నృణాం=మానవులకు; దౌర్బల్యం=దుర్బలత్వమును; ఆవహన్తి=కలిగించుచున్నవి.

**తాత్పర్యము :** ఆదాన కాలము అగ్నికి ప్రాధాన్యమగు కాలము. కాల స్వభావము చేత ఉత్తర దిగ్గతుడైనట్టి మిక్కిలి వేడిగల కిరణములతో కూడిన మండలముగల సూర్యుడు, సూర్యసంబంధము వలన వాయువులున్ను మిక్కిలి రూక్షగుణము గలవై శీతగుణమును శోషింపచేయుచు జగత్తునుండి స్నిగ్ధగుణమును గ్రహించు చున్నవై ఋతుక్రమముచేత ఏర్పడిన రూక్ష గుణము గలవై, రూక్ష గుణముగల కటు తిక్త కషాయ రసములను వృద్ధిపరచుచు మానవులకు దుర్బలత్వమును కలిగించుచున్నవి.

*శశిలేఖ :* ఆదానకాల స్వభావముచేత ఉత్తర దిఙ్మార్గ గమనముచేత మిక్కిలి వేడిమిగల కిరణ సమూహములచే వ్యాపించిన మండలముగల భగవంతుడైన సూర్యుడు తత్సంబంధము వలన వాయువులును మిక్కిలి రూక్షగుణములు గలవై చంద్ర జనితమైన గుణమును అనగా జలభాగమును ఎండింపజేయుచు స్థావరజంగమాత్మకమైన జగత్తుయొక్క స్నిగ్ధ గుణమును శిశిరాది ఋతుక్రమముతో దినదినము కొద్దికొద్దిగా గ్రహించునవై, రూక్ష గుణమును ఇచ్చునవై అతిరూక్షములైన తిక్త కషాయ కటురసములను వృద్ధిపొందించుచున్నవై మనుష్యజాతులకు బలహీనము కలిగించుచున్నవి.

మూ॥ విసర్గస్తు సౌమ్యః । తస్మిన్నపి కాలమార్గ **మేఘవాతవర్షాభి
హతప్రభావే** దక్షిణాయనగేఽర్కే శశిని **చావ్యాహతబలే
శిశిరాభిర్భాభిః** శశ్వదాప్యాయమానే **మాహేంద్ర**సలిలప్ర
శాన్త సంతాపే జగత్యరూక్షాః రసాః ప్రవర్ధన్తేఽమ్ల **లవణ**
మధురా యథాక్రమం బలంచోపచీయతే**నృణామితి. భవతి చాత్ర**
హేమన్తే **శిశిరే చాగ్ర్యం** విసర్గాదాన**యోర్బలమ్** ।
శరద్వసంత**యోర్మధ్యం** హీనం వర్షా**నిదాఘయోః** ॥

**ప్రతిపదార్థము :** విసర్గస్తు=విసర్గకాలమైతే; సౌమ్యః=సోముడు అధిపతిగా గల కాలము (సాత్వికకాలము); తస్మిన్నపి=ఆ కాలమునందు కూడ; కాలమార్గ=విసర్గకాలమార్గమందున్నటువంటి; మేఘవాతవర్ష=మేఘములు, వాయువులు, వర్షములచేత; అభిహత=తిరోభూతమైన; ప్రభావే=ప్రభావము గల; అర్కే=సూర్యుడు; దక్షిణాయనగే=దక్షిణదిఙ్మార్గమందుండగా; శశినిచ=

చంద్రుడు కూడ; అవ్యాహతబలేసతి=అప్రతిహతమైన బలముగలవాడగు చుండగా; శిశిరాభిః భాభిః=చల్లనైన కిరణములచేత; శశ్వత్=ఎల్లప్పుడు; ఆప్యాయమానే=చల్లబడుచుండగా; మాహేన్ద్రసలిల=ఇంద్రునిచే వర్షింప బడిన జలములచేత; ప్రశాన్త=చల్లారిన (బాగుగా తగ్గిపోయిన); సంతాపే= సంతాపముగల; జగతి=ప్రపంచమునందు; ఆమ్లలవణమధురాః=పులుపు, ఉప్పు, తీపియైన; ఆరూక్షాః రసాః=రూక్షముకాని రసములు; ప్రవర్ధన్తే=వృద్ధిచెందు చున్నవి; యథాక్రమం=వరుసగా; నృణాం=మానవాళికి; బలంచ=బలము కూడ; ఉపచీయతే=వృద్ధిపొందుచున్నది; అత్ర=ఇచట; హేమన్తే=హేమన్త ఋతువునందు; శిశిరేచ=శిశిరఋతువునందును; విసర్గాదానయో=విసర్గకాలము నకు ఆదానకాలమునకును; బలం=బలము; అగ్ర్యం=అధికమైనదిగా; భవతి= అగుచున్నది; విసర్గాదానయోః=విసర్గాదానములకు; శరద్వసంతయోః=శర ద్వసంతములలో; బలం=బలము; మధ్యం=మధ్యమమైనదిగా; భవతి=అగుచు న్నది; విసర్గాదానయోః=విసర్గాదానములకు;వర్షానిలాఘయోః=వర్షాకాలము గ్రీష్మకాలములలో; బలం=బలము; హీనం=హీనమైనదిగా; భవతి=అగుచు న్నది.

*తాత్పర్యము :* ఈ విసర్గకాలము సాత్వికమైనది. ఆ కాలమున కూడ కాల స్వభావముచేత కలిగిన మేఘములు వాయువులు వర్షములచేత తిరోభూత మైన ప్రభావము కల సూర్యుడు దక్షిణ దిక్కునందు పయనించుచుండగా చంద్రుడుకూడ మిక్కిలి బలవంతుడగుచుండగా చల్లని కాంతులచేత ఎల్లప్పుడూ చల్లబడినదియు, ఇంద్రసంబంధమైన వర్షములచేత శమింపబడిన సంతాపము గలిగి నట్టిదియునైన ప్రపంచమునందు ఆమ్లలవణ మధురములైన స్నిగ్ధరసములు వృద్ధి పొందును. క్రమముగా మానవాళికి అట్టి సమయమున బలము కూడ వృద్ధి చెందును. అది యట్లుండగా విసర్గాదానకాలములకు హేమంత శిశిర ఋతువు లలో ఉత్తమ బలము, శరద్వసంతములలో మధ్యమ బలము, వర్షగ్రీష్మఋతువు లలో హీనబలము కలుగుచున్నది.

*శశిలేఖ :* విసర్గ ఆదానకాలములయొక్క మధ్యకాలము హేమంత శిశిర ఋతువులయందు మానవాళికి ఎక్కువ బలము చేకూరును. హేమంత ఋతువునందు విసర్గకాలము ఉచ్ఛస్థితిని పొందును. శిశిర ఋతువునందు ఆదాన కాలముచేత వ్యాప్తి చెందియుండును. శరద్వసంతములలో ఆదాన విసర్గకాలము లకు మధ్యమకాల మగుటవలన మధ్యమ బలము, గ్రీష్మమందు ఆదానకాలము ఉచ్ఛస్థితిని పొందుటవలనను వర్షాకాలమునందు విసర్గకాలముచేత వ్యాపింపబడుట చేత హీనబలము ఏర్పడుచున్నది.

**మూ॥** ధూమ ధూమ్రమరజోమన్దాస్తుషారావిల మండలాః।
దిగాదిత్యామరుచ్ఛైత్యాదుత్తరోరోమహర్షణః॥

లోధ్ర ప్రియంగు పున్నాగ లవల్యః కుసుమోజ్వలాః।
దృప్తాగజాజ మహిషవాజివాయస సూకరాః॥
హిమానీ పటలచ్ఛన్నాలీన మీన విహంగమాః।
నద్యః సబాష్పాః సోష్మాణః కూపాపశ్చహిమాగమే॥
దేహోష్మాణో విశన్తోఽన్తః శీతేశీతానిలాహతాః।
జఠరే పిండితోష్మాణం ప్రబలం కుర్వతేఽనలమ్॥
విసర్గే బలినాంప్రాయః స్వభావాది గురుక్షమమ్।
బృంహణాన్యన్న పానాని యోజయేత్ తస్య యుక్తయే॥
అనిన్ధనోఽన్యథాసీదేదత్యుదీర్ణతయాఽథవా।
ధాతూనపి పచేదస్య తతస్తేషాం క్షయాన్మరుత్।
తేజః సహచరః కుప్యేచ్ఛీతః శీతే విశేషతః

ప్రతిపదార్థము:- హిమాగమే=హేమంత ఋతువుయొక్కఆగమనమునందు; దిగాదిత్యాః=దిక్కులు సూర్యుడును; ధూమ=పొగవలె; ధూమ్ర=మలినమైన; రజః=ధూళిచేత;మన్దాః=సామర్థ్యముతగ్గినవిగను; తుషా-లాః-తుషార=మంచు చేత; ఆవిల=కలత్రచెందిన; మండలాః=మండలములు గలవిగను; భవంతి=అగు చున్నవి; ఉత్తరః=ఉత్తరదిక్కునుండివచ్చు; మరుత్=వాయువు; శైత్యాత్= చల్లదనము వలన; రోమహర్షణః=గగుర్పాటును కలుగ జేయునదిగా; (భవతి= అగుచున్నది); లోధ్ర=లొద్దుగు; ప్రియంగు=ప్రేంకణము (కుంకుమ పిప్పలి); పున్నాగ=సురపొన్న, తెల్లకలువ; లవల్యః;=వెన్నెల తీగయు; కుసుమోజ్వ లాః=పుష్పించి ప్రకాశించునవిగా; (భవంతి=అగుచున్నవి); గజ—సూకరాః- గజ=ఏనుగు; అజ=మేక; మహిష=దున్నపోతు; వాజీ=గుఱ్ఱము; వాయస= కాకి; సూకరాః=పంది; దృప్తాః=మదించిన వగుచున్నవి; నద్యః=నదులు; హిమానీపటలచ్ఛన్నాః=మంచు తెరలచేత కప్పబడినవిగను; లీన=దాగిన; మీన=చేపలు; విహంగమాః=పక్షులు కలిగినవియును; (భవంతి=అగుచున్నవి); కూపాపశ్చ=బావి నీరును; సబాష్పాః=ఆవిరితో కూడినదిగను; సోష్మాణః= వేడిమి గలవిగను (భవతి=అగుచున్నవి); శీతే=శీతాకాలమైన; విసర్గే=విసర్గము నందు; శీతానిలాహతాః=చల్లని వాయువులచే కొట్టబడినవై; దేహోష్మాణః=శరీ రము నందలి ఉష్ణములు; అంతః=లోపలికి; విశంతః=ప్రవేశించునవై; బలినాం= బలిష్ఠులయొక్క; జఠరే=కడుపులో; ప్రాయః=తరచుగా; పిండితోష్మా ణం=పిండాకారముగ కలసిన వేడిమిగల వాటిని; క్షమం=ఓర్పుగల; స్వభా వాది గురుక్షమమ్=ద్రవ్యస్వభావముచేత గురుగుణముగ; అనలం=అగ్నిని; ప్రబలం=మిక్కిలి బలము కలదానినిగా; కుర్వతే=చేయుచున్నది; తస్య=ప్రబ లాగ్ని యొక్క; యుక్తయే=నిర్వహించుట కొరకు; బృంహణాని=బలకరము లైన; అన్నపానాని = అన్నపానములను; యోజయేత్ = చేర్పవలయును; అన్యథా=అట్లుకానియెడల; అనిన్ధనః=సమగ్ర ఆహారము లేనందువలన;

సీదాత్ = నాశనమగును; అథవా = లేనియెడల; అగ్న్యా = అగ్నియొక్క; అత్యుదీర్ణతయా = మిక్కిలి తీక్ష్ణత్వమగుటచేత; ధాతూనపి = ధాతువులను కూడ; పచేత్ = పాకము చేయుచు; (కాల్చివేయుచు); తతః = అందువలన; తేషాం క్షయాత్ = ధాతువులయొక్క క్షీణించుటవలన; తేజస్సహచరః = అగ్నితో కూడిన; మరుత్ = వాయువు; శీతః = చల్లబడినదై; కుప్యేత్ = ప్రకోపించును.

**తాత్పర్యము :-** హేమంత ఋతువు ప్రవేశించినపుడు ఎనిమిది దిక్కులు సూర్యుడును పొగవలె మలినముగా నుండు ధూళులచేత ఆవరింపబడి వాటి ప్రభావము తగ్గినవిగ నుండును. మరియు దిఙ్మండలములు సూర్యమండలము కలత పరచినవిగా నుండును. ఉత్తర దిక్కునుండి వీచు వాయువు మిక్కిలి శీతలమైనదియై శరీరమునకు గగుర్పాటును కలుగజేయును. లొద్దుగు, ప్రేంకణము, సురపొన్న, వెన్నెలతీగె ఇవన్నియు పుష్పించి ప్రకాశించును. ఏనుగు, మేక, దున్నపోతు, గుఱ్ఱము, కాకి, పంది ఈ జంతువులు మిక్కిలి మదించి యుండును. నదులు దట్టమైన మంచుతో కప్పబడినవిగను నీటిలో దాగిన చేపలు పక్షులు కలవిగను ఉండును. బావినీరు ఆవిరితో కూడినదిగను, వేడిమిగలదిగను ఉండును. శీతకాలమైన విసర్గమునందు చల్లని వాయువుల తాకిడిచేత శరీరమునందలి ఉష్ణములు శరీరము యొక్క లోపలికి ప్రవేశించినవై బలిష్ఠులైన మానవాళి యొక్క కడుపులో పిండాకారము కలసిన వేడిమిగల ద్రవ్య స్వభావముచేత గురుగుణము గలవాటిని ఓర్వగల అగ్నిని మిక్కిలి బలముకలదానినిగా చేయుచున్నది. ఆ ప్రబలమైన అగ్నిని నిర్వాహకము చేయుటకు బలకరములు గురుగుణ యుక్తములైన అన్నపానములను ఇవ్వవలయును. అట్లు కాని యెడల సమగ్రాహారము లేనందున అగ్నియొక్క మిక్కిలి తీక్ష్ణత్వముచేత ధాతువులు కూడ పాకము చేయబడి ఈ శరీరమును నాశనము చేయును. ధాతువులు క్షీణించుటవలన అగ్నితో కూడిన వాయువు విశేషముగ శీతకాలమునందు చల్లబడి ప్రకోపించును.

**శశిలేఖ :** శిశిర ఋతువును గురించి చెప్పునపుడు హేమంత ఋతుచర్యను బదులుగా చెప్పుటకొరకు ఆదానకాలమునకు క్రమభంగముగ హేమంత ఋతుచర్య చెప్పబడుచున్నది. ఇచట ఈ హేమంత ఋతువు మూడు విధములుగ ఉపదేశింపబడుచున్నది. 1) మాసస్వరూపము, మార్గశీర్ష మాసము మొదలు రెండు రెండు మాసములు ఒక ఋతువుగా చెప్పబడినది. ఈ హేమంత ఋతువు మార్గశీర్ష పుష్యమాసములు 2) రాశి స్వరూపమ్ : ధనుస్సు మకరము ఈ రెండు రాశులు హేమంతఋతువు. 3) స్వరూప లక్షణము : అనగా ఈ హేమంతఋతువు యొక్క స్వరూప లక్షణము. "ధూమ ధూమ్ర" అను పై శ్లోకముచే వివరింప బడినది. 4) ప్రయోజనము: ఋతుకాలము యొక్క హీన, మిథ్యా, అతియోగ, సమయోగముల స్వరూప

లక్షణములకు సంబంధించిన జ్ఞానమును పొందుట. పొగవలె మలినమైన పుప్పొడితో శక్తి తగ్గిన దిక్కులు, సూర్యుడును మంచుచేత కప్పబడిన మండలములు కలవారై యుందురు. ఉత్తరము నుండి వీచు వాయువు చల్లదనముతో పుల కాంకురములను కలిగించును.గజాదులు దర్పముతో కూడుకొని యుండును. నదులు మంచుచేత కప్పబడినవై చేపలు, నీటికోంగలు మొదలగు వాటిచే అంత స్థగితములై యుండును. కూపమునందలి నీరు వేడితో కూడుకొని యుండును. హేమంత శిశిర ఋతువులయందు బలిష్ఠములైన మానవులయొక్క శరీరము నందలి ఉష్ణములు స్వభావముచేత గురుగుణములు కలిగినటువంటి యాహారము లను ఓర్వగల ప్రబలమైన అగ్నిని చేయుచున్నవి. విసర్గకాలము అగుటవలన బల వంతులైన మానవులకు శరీరమునందలి ఉష్ణములు వెలుపల ప్రకోపించిన బలిష్ఠ మైన చల్లనైన వాయువుచేత కొట్టబడినవై మరల శరీరములోనికి ప్రవేశించి శరీరములో పిండాకారముగ నేర్పడిన వేడిని ప్రవేశించి స్వభావముగ గురుగణ యుక్తమైన ఆహారములను నోర్చుకొనునదై ఆ ఆహారమును జీర్ణము చేయుటకు సమర్థవంతముగు చున్నది. ద్రవ్య స్వరూపము చేతనే గురుగుణము కలిగినటువంటి మినుములు, సంయోగముచేత సంస్కారముచేత పరిణామముచేత గురుగుణము లయినటువంటి ద్రవ్యములు, వీటిని బలిష్ఠమైన అగ్నియొక్క నిర్వాహకము కొరకు బృంహణములయిన అన్నపానములను ఇవ్వవలయును. ఇట్లు పై నుదాహరించిన అన్నపానములను ఇవ్వని యెడల వెలుపటి అగ్నివలె ఇంధన రహితమై అనగా ఆహారము లేనిదై శరీరమునకు నాశనము పొందిం చును. అగ్ని మిక్కిలి ప్రబలముగా నుండుటచేత ధాతువులను కూడ పాచనము చేయును. ఆ ధాతువులు క్షీణించుట వలన వాయువు అగ్నిలో కలసి ప్రకో పించును.

వి. వ్యా : బలిష్ఠుడైన మానవుని జాఠరాగ్ని హేమంత ఋతువులో చలి అడ్డగించుటవలన శరీరములో వృద్ధినొందును. (శీతవాతాదులు స్రోతో మార్గముల నడ్డగించి రోమకూపములద్వారా జాఠరాగ్నియొక్క వేడిని వెలు పలికి రాకుండా లోననే ఉండునట్లు చేయుటవలన ఆ జాఠరాగ్ని మిక్కిలి వృద్ధి చెందును.) ఇట్లు వృద్ధిచెందిన జాఠరాగ్ని ఆహారమును బాగుగా పచనము చేయును. అట్లు పచనమైన ఆహారము రసాది ధాతువులకు ఆప్యాయము నెక్కువ చేయును. కాన హేమంత ఋతువునందు మానవులకు అధిక బలము కలుగును. అగ్ని ప్రబలమైనది కావున అల్పాహారము నిచ్చిన యెడల అది వాతముచే ఉద్దీ పనము చెంది రసాది సప్తధాతువులను కూడ పచనము చేయును. అందువలన జాఠరాగ్ని హేమంతమునందు ప్రబలమైనదిగా నుండుటవలన గురుగుణ యుక్తములైన పలువిధములైన ఆహారములను తీసుకొనవలయును.

మూ॥ అతోహిమే భజేత్ స్నిగ్ధాన్ స్వాద్వమ్లలవణాన్ రసాన్
విలేశ యౌదకా నూపప్రసహానాం భృతానిచ ।

మాంసాని గుడపిష్టోత్థమద్యాన్యభినవానిచ ॥
మాషేక్షు క్షీర వికృతి వసాతైల నవౌదనాన్ ।
వ్యాయామోద్వర్త నాభ్యంగ స్వేద ధూమాంజనాతపాన్ ॥
సుఖోదకం శౌచవిధౌ భూమి గర్భ గృహాణిచ ।
సాంగార యానాం శయ్యాంచ కుథ కంబల సంస్కృతామ్ ॥
కుంకుమేనాను లిప్తాంగో గురుణాఽగరుణాపివా ।
లఘూష్ణైః ప్రావృతః స్వప్యాత్ కాలేధూమాధివాసితః ॥
పీనాంగ నాంగ సంసంగ నివారిత హిమానిలః ।

**ప్రతిపదార్థము :** అతః=అందువలన; హిమే=శీతకాలము నందు; స్వాద్వమ్ల లవణాన్=తీపి పులుపు ఉప్పునైన; రసాన్=రసములను; స్నిగ్ధాన్=ఘృతాదుల చేత సంస్కరింపబడిన వాటిని; సేవేత్=సేవించవలయును (భుజించ వలయును); బిలేశయ=బిలమునందు శయనించు: ఔదక=నీటియందుండు; ఆనూప=జలప్రాయమైన ప్రాంతము నందలి; ప్రసహానాం=గోరువంక మొద లగు పక్షుల యొక్క; మాంసాని=మాంసములు; భృతాని=ప్రయత్న పూర్వ కముగ పెంచిన ప్రాణులకు సంబంధించిన; మాంసానిచ=మాంసములును; అభినవాని=నూతనములైన (సద్యోహృతములైన); గుడపిష్టోత్థమ మద్యానిచ=బెల్లము తోను, వరి పిండితోను తయారు చేయబడిన మద్యములును; మాష=మినుములు; ఇక్షు=చెరుకు; క్షీర వికృతి=పాలు తద్వికారములు; వస=వస; తైల=తైలము; నవౌదనాన్=వేడిగానున్న అన్నములను; వ్యాయామ=వ్యాయామము; ఉద్వర్తన=నలుగుపెట్టుట; అభ్యంగ=అభ్యంగము; స్వేద=చెమట పట్టించుట, ధూమ=పొగవేయుట; అంజన=కాటుక; ఆతపాన్=ఎండలను; శౌచ విధౌ=శౌచవిధి యందు; సుఖోదకం=సుఖమునిచ్చు నీరు; భూమిగర్భ గృహాణిచ=భూగర్భ గృహములును; సాంగార యానాం=కుంపటితో కూడిన; కుథ కంబళ సంస్కృతాం=పరుపు, కంబళములతో- సంస్కరింపబడిన; శయ్యాం=శయ్యను; భజేత్=సేవింప వలయును; కుంకుమేన= కుంకుమ పువ్వుతో; అనులిప్తాంగః=పూయబడిన శరీరముకలవాడు;అథవా=లేక;గురుణా =దట్టమైన; అగరుణా = అగరు చేతకాని; అనులిప్తాంగః = పూయబడిన దేహము కలవాడై; లఘూష్ణైః=కొద్దివేడిగల వస్త్రాదులచే; ప్రావృతః=కప్పబడిన వాడై; కాలే=సకాలము నందు; ధూమాదివాసితః=పొగ మొదలగు వాటిచే సుగంధ శరీరము కలవాడై; పీనాంగ–నిలః-పీన=పుష్టి చెందిన; అంగనా =స్త్రీలయొక్క; అంగ=అవయవములయొక్క; సంసంగ=సంబంధముచేత; నివారిత=పోగొట్టబడిన: హిమానిలః=చల్లని గాలిని గలవాడై; స్వప్యాత్= నిదురించవలయును.

**తాత్పర్యము :** అందువలన శీతకాలము నందు తీపి, పులుపు, ఉప్పు

నైన రసములను, ఘృతాదులచేత సంస్కరింపబడిన వాటిని భుజింప వలయును. బిలమునందు శయనించు జంతువుల యొక్క లేక ఉడుము యొక్క నీటియందుండు జంతువులయొక్క జలప్రాయమైన ప్రాంతము నందుండు జంతువుల యొక్క గోరువంక మొదలగు ఉష్ణ వీర్య ప్రధానములైన పక్షి విశేషముల యొక్క మాంసము సద్యోహ్యృతములైన గౌడీ, వరి పిండితో చేసిన మద్యములను ఉపయోగింప వలయును. పాలు తద్వికారములు, చెరకు, వస, తైలము, వేడిగానున్న అన్నములను భుజించ వలయును. వ్యాయామము ఉద్వర్తనము అభ్యంగాదుల నాచరించ వలయును. శౌచవిధియందు సుఖముగానుండు నీరునుపయోగింప వలెను. భూగర్భ గృహములను, కుంపటితో కూడిన, పసుపు కంబళముతో సంస్కరింపబడిన శయ్యను సేవించవలయును. మరియు కుంకుమపువ్వు లేక అగరుతో శరీరమునకు లేపనము చేసికొనినవాడై కొద్ది వేడిమిగల వస్త్రములచే కప్పబడినవాడై సకాలము నందు సుగంధద్రవ్యములచే ధూపము వేసికొని పుష్టి చెందిన స్త్రీల అవయవముల యొక్క సంబంధము చేత పోగొట్టబడిన చల్లని గాలిగలవాడై నిదురించవలెను.

**శశిలేఖ :** శీతకాలము నందు స్నిగ్ధమైన మధురాది రసములను సేవించ వలయును. ఎందుకనగా ప్రకోపించిన వాతము శమించగలదు. కుథమనగా ప్రత్తితో నింపబడినదని యర్థము. బలసిన శరీరముతో కూడిన సుందరాంగి యొక్క శరీర సంబంధముచేత తొలగింపబడిన చల్లని వాయువులు గలవాడని అర్థము.

**మూ॥** శిశిరే శీతమధికం మేఘ మారుత వర్షజమ్ ।
రౌక్ష్యం చా దానజం తస్మాత్ కార్యః పురోధికం విధిః ॥

**ప్రతిపదార్థము :** శిశిరే=శిశిర ఋతువునందు; మేఘమారుత వర్షజమ్=మేఘముల చేత, వాయువులచేత, వర్షముచేత కలిగిన; శీతం=చలి; అధికం=ఎక్కువగా నుండును; ఆదానజం=ఆదానకాలము వలన కలిగిన; రౌక్షం చ=రూక్షమును కలుగును; తస్మాత్=ఆ కారణము వలన; పూర్వః=వెనుక చెప్పిన హేమంత ఋతువునందలి; విధిః=విధియే; అధికం=ఎక్కువగా; కార్యం=చేయదగినది.

**తాత్పర్యము :** శిశిరఋతువునందు మేఘములు మారుతములు వర్షములు వీటిచేత కలిగిన శైత్యమధికముగ నుండును. ఆదానకాలమగుట వలన రూక్షగుణముకూడ ఉండును. పై కారణము వలన (అనగా శిశిరమందు ఆదాన తత్వము కన్న విసర్గతత్వమెక్కువగుట వలన హేమంత ధర్మము లెక్కువగా కనబడును) హేమంతఋతువునందు చెప్పబడినటువంటి విధినే ఎక్కువగా పాటించ వలయును.

**శశిలేఖ :** శిశిర ఋతువునందు హేమంత ఋతువుయొక్క స్వరూపము

అధిక మగుటచేత హేమంతఋతువుయొక్క విధియే అధికముగా పాటించ వల యును. ఎందుకనగా శిశిరకాలమునందు అంతరాగ్ని బహిర్గతము కాకుండ అనగా రోమకూపములు శిశిరము చలిచే మూయబడియుండుటచే అగ్ని అడ్డగింప బడిన కుటిలోనే ప్రజ్వరిల్లును. ఆదానకాలమైన దగుట వలన రూక్ష గుణము కూడ కలుగును.

మూ॥ వసంతే దక్షిణో వాయు రా తామ్ర కిరణోరవిః॥
నవప్రవాళత్వక్పత్రాః పాదపాః కకుభోఽమలాః।
కింశుకాశోక చూతాది వనరాజి విరాజితాః॥
కోకిలాలికులాలాపకలకోలాహలాకులాః।
శిశిరే సంచితః శ్లేష్మాదిన కృద్భాభిరీ రితః॥
తదాప్రబాధమానోఽగ్నిం రోగాన్ ప్రకురుతే బహూన్।

ప్రతిపదార్థము: వసన్తే=వసన్తఋతువునందు; వాయుః=వాయువు; దక్షిణః =దక్షిణదిక్కునుండి ప్రసరించునది; రవి; =సూర్యుడు, ఆతామ్రకిరణః=సమగ్ర ముగ ఎఱ్ఱటి కిరణములు గలవాడు (అనగా తీక్ష్ణకిరణుడనియర్థము); పాదపాః= వృక్షములు; నవప్రవాళత్వక్పత్రాః=నూతనమైన చిగురు టాకులు చర్మము పత్రములుకలిగినవి; కకుభః=దిక్కులు; అమలాః=నిర్మలములయినవియు; కింశుక-విరాజితాః=కింశుక= మోదుగ చెట్టు; అశోక=అశోక వృక్షము; చూతాది= మామిడి మొదలగు; వనరాజి = వనముల పంక్తిచేత; విరాజితాః=మిక్కిలి ప్రకా శములైనవియు, కోకిల-కులాః=కోకిల=కోయిల, అలికుల=తుమ్మెదల సమూ హముయొక్క; ఆలాప=గానముచేత కలిగిన; కల=మధుర స్వరము యొక్క; కోలాహల=కోలాహలముచేత, ఆకులాః = వ్యాప్తము లైనట్టివి. శిశిరే=శిశిర ఋతువునందు; సంచితః=ఒకచోట చేరిన; శ్లేష్మ= కఫము; దిన కృద్భాభిః= సూర్యకిరణముల చేత; ఈరితః=ప్రేరేపింపబడినదై; తదా=అప్పుడు; అగ్నిం= జాఠరాగ్నిని; ప్రబాధమానః=మిక్కిలి బాధించుచున్నదై; బహూన్ రోగాన్= అనేక రోగములను; ప్రకురుతే=కలుగచేయుచున్నది.

తాత్పర్యము: వసంతకాలమునందు వాయువు దక్షిణదిక్కునుండి ప్రసరించును. అనగా మలయపర్వతము దక్షిణ దిక్కునందున్నట్లు ప్రసిద్ధము. ఆ పర్వ తము నుండి ప్రసరించు వాయువు మలయ మారుతమని పిలువబడుటయు చల్లగా నుండుననుటయు వసంతకాలమున హితమగుటయు లోక ప్రసిద్ధము. సూర్యుడు సమగ్రముగ ఎఱ్ఱటి కిరణములు గలవాడగును. వృక్షములు కొంగ్రొత్త చిగుళ్ళను వేయుచు కొత్తదైన త్వక్పత్రములను కూడ కలిగియుండును. దిక్కులు నిర్మ లముగను మోదుగు, అశోకము, మామిడి మొదలగు వృక్షజాతుల వరుసలతో ప్రకాశించునవిగను, కోకిల భ్రమరపంక్తులయొక్క మధురమైన ఆలాపముల యొక్క కోలాహలములచే వ్యాప్తములగును. శిశిరమునందు ఒక్కచోట చేరిన

శ్లేష్మము సూర్యకిరణములచేత ప్రేరేపింపబడినదై అగ్నిని మిక్కిలి బాధించుచు అనేక రోగములను కలిగించును.

**శశిలేఖ :** వసంత ఋతువును వర్ణించుచున్నాడు. వసంతమునందు వాయువు దాక్షిణాత్యమగుచున్నది. పూర్వము శిశిరము నందు మధుర ఆమ్ల లవణాది రసములతో కూడిన ఆహారము వలన స్నిగ్ధభోజనము వలన సంచితమైన శ్లేష్మము మిక్కిలి చల్లదనము చేత గడ్డకట్టుకొని పోవుటవలన ప్రకోపించ లేదు. ఇప్పుడు సూర్య కిరణములచేత ఆకఫము ద్రవ స్వరూపమగుటవలన కరిగింపబడి విపరీత స్వభావముగల అగ్నికి బాధను కలిగించును. ఆ బాధచేత అనేక రోగము లుద్భవించును.



మూ॥ **అతోఽస్మిం స్తీక్ష్ణ వమన ధూమగండూష నావనమ్॥**
**వ్యాయామోద్వర్తన క్షౌద్ర యవ గోధూమ జాంగలాన్।**
**సేవేత సుహృదుద్యాన యువతీశ్చమనోరమాః॥**
**స్నాతః స్వలంకృతః స్రగ్వీ చందనాగరురూషితః॥**
**విచిత్రామత్ర విన్యస్తాన్ సహకారోత్పలాంకితాన్॥**
**నిగదాంశ్చాఽసవారిష్ట శీథు మార్ద్వీకమాధవాన్।**
**క్వథితం ముస్త శుణ్ఠ్యంబు సారాంభః క్షౌద్రవారి వా॥**
**గురుశీతదివాస్వప్న స్నిగ్ధామ్లమధురాం స్త్యజేత్।**



ప్రతిపదార్థము :- అతః = అందువలన; అస్మిన్ = ఈ వసంత ఋతువు నందు; తీక్ష్ణ...నావనమ్ = తీక్ష్ణవమన = తీక్ష్ణమైన వాంతి; తీక్ష్ణధూమః = తీక్ష్ణమైనపొగ; తీక్ష్ణగండూష = తీక్ష్ణమైన పుక్కిలి పట్టుట; తీక్ష్ణనావనమ్ = తీక్ష్ణమైన నస్యములను; వ్యాయామ...జాంగలాన్ = వ్యాయామ = వ్యాయామము; ఉద్వర్తన = నలుగుపెట్టుట; క్షౌద్ర = తేనె; యవ = యవలు; గోధూమ = గోధుమలు; జాంగలాన్ = జాంగల దేశమునందలి జంతువులయొక్క మాంసములను; సేవేత = సేవింప వలయును; సుహృద్ ఉ-మనోరమాః = మనోరమాః = మనస్సునకింపైన; సుహృత్ = స్నేహితులు; ఉద్యాన = ఉద్యానవనము; యువతీశ్చ = సుందరాంగులను కూడ; సేవేత = సేవింపవలయును; స్నాతః = స్నానము చేసినవాడై; స్వలంకృతః = అలంకరించుకున్నవాడై; స్రగ్వీ = మాలను ధరించినవాడై; చందనాగరు రూషితః = చందనము, అగరు వీటిచేత పూయబడినవాడై; విచిత్రామత్రవిన్యస్తాన్ = విచిత్రమైన కంచుపాత్రల యందుంచబడిన; సహకారోత్పలాంకితాన్ = మామిడిపూలు నల్లకలువలతో కూడిన; నిగదాన్ = దేశకాలాదులచేత దూషితములు కాని; ఆసవ...మాధవాన్ = ఆసవ = ఆసవములు: అరిష్ట = అరిష్టములు; శీథు = చెఱకు కల్లు; మార్ద్వీక = ద్రాక్షకల్లు; మాధవాన్ = కల్లులను: సేవేత = సేవింవ వలయును; క్వథితం = మర్ల గాచిన; ముస్తశుణ్ఠ్యంబు = తుంగము స్తెలు; శుంఠినీరు; సారాంభః = అసనము ఖదిరము చందనాదుల యొక్క సారముచేత

సంస్కరింపబడిన నీరు; క్షౌద్రవారివా = తేనె కలసిన నీరుగాని; సేవేత = సేవింప వలెను; గురుశీత...మధురాన్ = గురు = బలమైనదియు; శీత = చల్లనైనదియు: దివాస్వప్న = పగటినిద్ర; స్నిగ్ధ = స్నిగ్ధమైనది: అమ్ల = పుల్లనిది; మధురాన్ = తీపియైన వాటిని: త్యజేత్ = వదలవలెను.

**తాత్పర్యము :** ఈ వసంతఋతువు నందు తీక్ష్ణములైన వమనధూమ గండూష నావనములను ధరింపవలయును. వ్యాయామము, ఉద్వర్తనము, తేనె, యవలు, గోధుమలు, జాంగల మాంసములను సేవింపవలయును, స్నేహితులు మనోహరములైన ఉద్యానములను సుందరాంగులను కూడ సేవింపవలయును. స్నానము చేసి చక్కగా అలంకరించుకొని మాలను ధరించి చందనాదుల చేత అనులిప్తుడై విచిత్రములగు కంచుపాత్రముల యందుంచబడినవియు మామిడి పువ్వు నల్ల కలువలతో కూడిన దేశకాలములచే దూషింపబడనటు వంటి ఆసవ ములు అరిష్టములు చెఱకు ద్రాక్షల కల్లులను సేవింప వలయును. చక్కగా కాచ బడిన తుంగముస్తెలు శొంఠి కలిసిన నీరు ఆసవము ఖదిరము చందనము వీటి యొక్క సారము చేత సంస్కరింపబడిన నీరు గాని సేవింవ వలయును. గురు గుణము శీతవీర్యము గలిగిన దానిని పగటినిద్రను స్నిగ్ధమైన అమ్ల మధురమైన పదార్థములను విడిచి పెట్టవలయును.

*శశిలేఖ :* ఆకారణము వలన కఫము నణచుట కొరకు తీక్ష్ణవమనాదులను సేవింపవలయును. నిగదాన్ అనగా దేశకాలాద్యనుప హతములని యర్థము. సారాంభః అనగా వేగిసచెట్టు, చంద్రచెట్టు, చందనము వీటియొక్క సారము చేత సంస్కరింపబడిన నీరు అని అర్థము.

మూ॥ గ్రీష్మేఽతసీ పుష్పనిభస్తీక్ష్ణాంశుర్దావదీపితాః ॥
దిశోజ్వలన్తి భూమిశ్చ మారుతో నైరృతః సుఖః ॥
పవనాతప సంస్వేదైర్జన్తవో జ్వరితా ఇవ॥
తాపార్తి తుంగ మాతంగ మహిషైః కలుషీకృతాః ।
దివాకర కరాంగార నికరక్షపితాంభసః॥
ప్రవృద్ధ రోధసోనద్యః ఛాయా హీనా మహీరుహాః।
విశీర్ణ జీర్ణ పర్ణాశ్చ శుష్క వల్కలతాంకితాః॥
అదత్తే జగతస్తేజస్తదాఽదిత్యో భృశం యతః।
వ్యాయామాతప కట్వమ్ల లవణోష్ణం త్యజేదతః॥
మద్యం న సేవ్యం స్వల్పం వా సేవ్యం సుబహు వారివా॥
అన్యథా శోక శైథిల్య దాహ మోహాన్ కరోతి తత్॥
నవ మృద్భాజనస్థాని హృద్యాని సురభీణిచ।
పానకాని సమన్థాని సితాఢ్యాని హిమానిచ॥
స్వాదు శీతం ద్రవం చాన్నం జాంగలాన్మృగ పక్షిణః।

శాలిక్షీర ఘృతద్రాక్షా నాళికేరాంబు శర్కరాః॥
తాలవృన్తానిలాన్ హారాన్ స్రజః సకమలోత్పలాః।
తన్వీ మృణాళ వలయాః కాన్తాశ్చందన రూషితాః॥
సరాంసి వాపీః సరితః కాననాని హిమానిచ।
సురభీణి నిషేవేత వాసాంసి సులఘూనిచ॥
నిష్పత ద్యన్త్రి సలిలే స్వప్యాద్ధారా గృహేదివా।
రాత్రౌచాఒకాశతలకే సుగన్ధి కుసుమాస్తృతే॥
కర్పూర చందన నార్ద్రాంగో విరళానంగ సంగమః।

ప్రతిపదార్థము : గ్రీష్మే=గ్రీష్మఋతువునందు ;తీక్ష్ణాంశుః=వేడి కిరణములుగల సూర్యుడు; అతసీ పుష్పనిభః=నల్లయగిసె పుష్పమువలె కాంతి గలవాడు; దిశః=దిక్కులు; భూమిశ్చ=భూమియందును; దావదీపితాః=కారుచిచ్చుచేత ప్రకాశింప బడినవై ; జ్వలన్తి=ప్రకాశించు చున్నవి;నైరృతిః=నిరుతిదిక్కునుండి వచ్చు; సుఖః=సుఖమైన; వాయుతః=వాయువు; పవనాతప సంస్వేదైః=గాలి,ఎండ,చెమటలచేత; జన్తవః=జంతువులు(మానవులు); జ్వరితా ఇవ=జ్వరితులవలె; భవన్తి=ఉన్నారు, తపార్త సకృతాః=తపార్త=సంతాపము చేత బాధింపబడిన: తుంగమాతంగ=ఎత్తైన ఏనుగులచేత; మహిషైః=దున్నపోతులచేత; కలుషీకృతాః=కలుషితముగాచేయబడిన; దివాకర-అంభసః=దివాకర=సూర్యునియొక్క;కర=కిరణములు: అంగార=నిప్పులయొక్క; నికర=సమూహాముచేత; ఉషిత= మలినములుగ చేయబడిన: అంభసః=ఉదకములుగల; నద్యః = నదులు; ప్రవృద్ధరోధసః = పెరిగినట్లుగ కలవి: వశీర్ణ జీర్ణ పర్ణా=రాలిన ఎండిన ఆకులు గలవియు; శుష్కవల్కలతాంకితాః=ఎండిన బెరడు గల తీగెలతో కూడినవియునైన; మహీరుహాః=వృక్షములు; ఛాయాహీనాశ్చ=నీడలేనివిగా; భవంతి=అగుచున్నవి: యతః=ఏకారణమువలన; ఆదిత్యః=సూర్యుడు; భృశం=మిక్కిలి; జగతః=ప్రపంచము నుండి; తేజః=తేజస్సును; ఆదత్తే=తీసుకొనుచున్నాడో; అతః=అందువలన; వ్యాయామ–ఉష్ణం=వ్యాయామ = వ్యాయామము; ఆతప = ఎండ; కటుఅమ్లలవణ = కారము పులుపు ఉప్పు; ఉష్ణం=వేడిమిని; త్యజేత్=వదలవలయును: మద్యం=కల్లు; నసేవ్యం=సేవింపదగదు; సుబహువారిణా=ఎక్కువనీటితో, స్వల్పం=కొద్దిపాటిమద్యము; సేవ్యంవా=సేవింపవచ్చును; అన్యథా=అట్లుకానియెడల; తత్=ఆమద్యము: శోఫశైథిల్యదాహమోహాన్=వాపు, శిథిలత్వము, మంట· మోహము వీటిని: కరోతి=చేయును; నవమృద్భాజనస్థాని=క్రొత్తకుండలో నున్న; హృద్యాని=మనోహరములైన; సురభీనిచ=సువాసన గలవియునైన; సమన్థాని=అంబలితో కూడిన; పానకాని=పానకములు; సితాఢ్యాని=ఎక్కువ చక్కెర కలసిన;హిమానిచ=మంచుగడ్డలును;స్వాదు=రుచికరమైన;శీతం=చల్లనైన; ద్రవం=ద్రవముగానున్న; అన్నంచ=అన్నమును; జాంగలాన్=జాంగల

దేశము నందుగల; మృగ పక్షిణః=మృగములు పక్షులను; శాలి=ఎఱ్ఱరాజనాల బియ్యము; క్షీర=పాలు; ఘృత=నెయ్యి; ద్రాక్ష=ద్రాక్ష; నారికేళాంబు= కొబ్బెరనీరు; శర్కరాః=శర్కరలు; తాళవృంతానిలాన్=విసనకఱ్ఱల మూలముగ వచ్చువాయువులను; హారాన్=హారములను; స్రజః=కమలములతోను కలువ పువ్వులతోను కూడిన మాలలను; తన్వీః=సన్ననైన; మృణాళ వలయాః=తామరకాడల చేతనైన కడియములు; చందనరూషితాః= చందనముచేత పూయబడిన; కాంతాః=స్త్రీలు; సరాంసి=సరస్సులు; వాపీః= దిగుడుబావులు; సరితః=నదులు; హిమాని=చల్లనైన; కాననాని=ఉద్యాన వనములు; సురభీణి=సువాసనలుగల; సులఘూని = మిక్కిలి తేలికయైన; వాసాంసిచ=వస్త్రములును; నిషేవేత=సేవించవలయును; నిష్పతద్యంత్రసలిలే= పడుచున్న యంత్రప్రేరితములైన నీళ్ళుగల; ధారాగృహే=నీటిధారతోకూడిన గృహమునందు; దివా=పగలు; స్వప్యాత్=నిదురించవలెను; రాత్రేచ=రాత్రి యందును; ఆకాశతలకే=ఆవరణ రహితమైన గృహోపరిభాగమునందు; సుగంధి కుసుమాస్తృతే=సువాసనగల పుష్పములచేత పరచబడిన శయనము నందు; కర్పూర చందనార్ద్రాంగః=పచ్చ కర్పూరము చందనము వీటిచేత తడిసిన శరీరము గలవాడై; విరళానంగసంగమః=స్వల్పమైన రతిగలవాడై; స్వప్యాత్=నిదురించవలెను.

తాత్పర్యము : గ్రీష్మఋతువునందు నల్లయగిసె పుష్పకాంతిగలవాడై సూర్యుడు వేడి కిరణములతో ప్రకాశించును. దిక్కులు భూమి కారుచిచ్చు చేత ప్రకాశించును. దక్షిణపశ్చిమ దిక్కుల మధ్యనున్న నైఋతి దిక్కునుండి వచ్చు సుఖమైన వాయువు గలిగి యుండును.గాలి ఎండ చెమటలచేత మానవులు జ్వరితుల వలె ఉందురు. ఎండవేడిమికి తాపము చెందిన ఎత్తైన ఏనుగులచేత, దున్నపోతులచేత కలుషితములుగా చేయబడిన సూర్యుని కిరణములవలె తీక్ష్ణము లైన నిప్పులయొక్క సమూహముచేత మలినముగ చేయబడిన జలములుగలనదులు గట్లు పెరిగినట్లు గలవిగా నుండును. ఎండిరాలిన ఆకులు, ఎండిన బెరడుతో కూడిన తీగలు గల వృక్షములు నీడలేని వగుచున్నవి. ఏకారణముచేతననగా సూర్యుడు ప్రపంచమునుండి తేజస్సును (రసాదిధాతువుల యొక్క స్నేహ భాగ మును.) తీసుకొనుచున్నాడో అనునట్లు అందువలన వ్యాయామమును చేయుట, ఎండను సేవించుట, కారము, ఉప్పు, పులుపు రసములతో కూడిన పదార్థముల సేవను,వేడిగానుండు పదార్థములను వదలిపెట్టవలయును.కల్లుత్రాగరాదు.ఒకవేళ అభ్యాసము గలవారు సేవించ వలయునన్న ఎక్కువ నీరు చేర్చిన కొద్దిపాటి మద్యమును త్రాగవలెను. అట్లు చేయనియెడల వాపు శరీరమునందు మంట, మోహము కలిగించును. కొత్తకుండలో నుంచిన మనోహరములైన సువాసనలతో కూడిన పానకములను, ఎక్కువ చక్కెర కలసిన మంచుగడ్డలను రుచిగల, చల్ల

నైన ద్రవప్రాయముగనున్న అన్నమును జాంగలదేశమునందుగల మృగములను పక్షులను, ఎఱ్ఱరాజనాల బియ్యమును; పాలను, నేతిని, ద్రాక్షను, కొబ్బెరి నీరును, శర్కరను తినవలెను. విసన కఱ్ఱల మూలముగా వచ్చు వాయువులను సేవించవలయును. హారములను కమలములతోను, కలువపువ్వులతోను కూడిన మాలలను సన్ననైన తామర కాడలచేత చేసిన కడియములను ధరించవలెను. చందనము చేత పూయబడిన స్త్రీలు, సరస్సులు. దిగుడుబావులు, నదులు, చల్లగానుండు ఉద్యానవనములు, సువాసనలుగల మిక్కిలి తేలికయైన వస్త్రములను ధరించవలెను. పడుచున్న యంత్రప్రేరితములైన నీళ్ళుగల, నీటిధారలతో కూడిన గృహమునందు పగలు నిదురించవలెను. ఆవరణములేని గృహోపరిభాగమునందు సువాసన గలపుష్పములచేత పరుచబడిన శయనమునందు పచ్చకర్పూరము చందనమువీటిచేతతడిసిన శరీరముగలవాడై మరియు స్వల్పమైన రతి సుఖముగలవాడై రాత్రియందు నిదురించవలెను.

*శశిలేఖ*: గ్రీష్మ అను పదముచేత గ్రీష్మఋతువుయొక్క స్వరూపలక్షణమును చూపెట్టుచున్నాడు. తీక్ష్ణ కిరణములుగల సూర్యుడు గ్రీష్మము నందు చుట్టూ నల్లని రంగు గలవాడువలె నుండును. తేజశ్శబ్దమునకు శుక్రము అంతమునందుగల రసాది సప్తధాతువుల యొక్క స్నేహమని యర్థము. సూర్యుడు మిక్కిలి ప్రచండముగా నున్నందున వ్యాయామాదులను విడిచి పెట్టవలయును. మన్థః అనగా ఎక్కువ నీటితో కూడిన వరిపిండి మొదలగునవి. అర్థాత్ = అంబలి యని అర్థము. తాళవృంతమనగా విసనకర్రయని అర్థము. ఆకాశతలక మనగా ఆవరణరహితమైన గృహోపరిభాగమని యర్థము.

మూ॥ వర్షాసు వారుణో వాయుః సర్వసస్య సముద్గమః॥
భిన్నేంద్రనీల నీలాభ్రవృంద మందానిలం నభః।
దీర్ఘికానవ వార్యోఘ మగ్నసోపానపంక్తయః॥
వారిధారా భృశాఘాత వికాసిత సరోరుహాః।
సరితః సాగరాకారాఘోర వ్యక్తజలస్థలా॥
మన్ద్రస్తనిత జీమూత శిఖదర్దుర నాదితా।
ఇంద్రకోప ధనుఃఖణ్డ విద్యుదుద్యోత దీపితా॥
పరితః శ్యామల తృణాసిలీన్ధ్రకుట జోజ్వలా।
తదాఽదానవలే దేహే మన్దేఽగ్నౌ బాధతేపునః॥
వృష్టిభూ బాష్పతోయామ్లపాకే దుష్టైశ్చలాదిభిః।
వస్తి కర్మనిషేవేత కృతసంశోధన క్రమః॥
పురాణశాలి గోధూమ యవాన్ యూషరసైఃకృతైః।
నిగదం మది హరిష్ట మార్ద్వీకం స్వల్పమంబువా॥
దివ్యం కథిత కూపోత్థం చౌండం సారసమేవవా।

వృష్టివాతాకులేత్వహ్ని భోజనం క్లేదవాతజిత్॥
పరిశుష్కం లఘుస్నిగ్ధముష్ణామ్లలవణం భజేత్।
ప్రాయోఽన్నపానం సక్షౌద్రం సంస్కృతంచ ఘనోదయే॥
అసరీ సృప ధూబాష్పశీత మారుత శీకరమ్।
సాగ్నియానం చభవనం నిర్దంశమశకోన్దురమ్॥
ప్రఘర్షో ద్వర్తన స్నానధూమ గన్ధాగరు ప్రియః।
యాయాత్ కరేణు ముఖ్యాభిశ్చిత్రస్రగ్వస్త్రభూషితః॥
నదీజలోదమన్థాహః స్వప్నాతిద్రవ మైథునమ్।
తుషారపాద చరణ వ్యాయామార్కకరాన్త్యజేత్॥

ప్రతిపదార్థము : వర్షాసు=వర్షాకాలమునందు; వారుణః = పశ్చిమ దిక్కునుండి ప్రసరించునది; వాయుః,=వాయువు; సరసస్యసముద్గమః=అన్ని విధములైన పైర్లు మొలకెత్తుట (జరుగును); నభః=ఆకాశము; భిన్న—అవిలం= భిన్నేంద్రనీల=పగిలిన ఇంద్రనీలమణివలె; నీల=నల్లనైన; అభ్రవృంద=మేఘ సమూహములచేత; మందావిలం=కొద్దిగా వ్యాప్తమైనది; దీర్ఘికాః=దిగుడు బావులు; నవ—పంక్తయః=నవ=నూతనమైన; వారి=నీటియొక్క; ఓఘ= సమూహమునందు; మగ్న = మునిగిన: సోపానపంక్తయః = మెట్ల వరుసలుగలవి; వారి—సరోరుహాః వారిధారా = నీటిధారలయొక్క; భృశా ఘాత = మిక్కిలి తాకిడి చేత; వికాసిత = వికసింపచేయబడిన; సరో రుహాః = కమలములుగలవిగా నుండును; సరితః = నదులు; సాగరా కారః=సముద్రమువలె ఆకారము గలవగును; భూః=భూమి; అవ్యక్తజలస్థలా= జలము స్థలము వ్యక్తముకానిది (అనగా అంతట నీటితో నిండియుండునది) మన్ద్ర-నాదితా=మన్ద్ర=మధ్యస్థాయిలో; స్తనిత=శబ్దించుచున్న; జీమూత= మేఘములు; శిఖి=నెమళ్ళు; దర్దుర=కప్పలు వీటిచేత; నాదితా=చప్పుడు గలదిగా చేయబడునదియు, ఇంద్రగోప—దీపితా=ఇంద్రగోప=ఇంద్రగోప పురుగులయొక్క;ధనుఃఖండ=ఇంద్రధనుస్సుయొక్క; విద్యుత్=మెరుపుయొక్క ఉద్యోత=కాంతిచేత; దీపితా=ప్రకాశము కలదియు; పరితః=నాలుగువైపు; శ్యామల తృణా=పచ్చని గడ్డిగలదియు; శిలీన్ధ్ర కుటజోజ్వలా=అరటిపువ్వు; కొడిశపాలపువ్వులచేత; ఉజ్జ్వలా=ప్రకాశించునదియు అగును; తదా=అప్పుడు; ఆదానబలే=ఆదాన కాలస్వభావమువల్ల బలహీనమైన; దేహే=శరీరమునందు; అగ్నౌ=జాఠరాగ్ని; మన్దేసతి=సన్నగిల్లినదగుచుండగా (మందమైన దగు చుండగా); వృష్టి—దలః=వృష్టి=వర్షము; భూబాష్ప=భూమినుండివచ్చు ఆవిరి; తోయ=కొత్తనీరు; అమ్లపాక=అమ్లపాకముచేతను: దుష్టైః=దూషింపబడిన; చలాదిభిః=వాతాదిమూడుదోషములచేత; పునః=మరల; బాధితే=బాధింప బడినదగుచుండగా; కృత సంశోధనక్రమః=చేయబడిన వమన విరేచన రూపమైన

శోధనము కలవాడై; వస్తికర్మ=వస్తికార్యమును; నిషేవేత=సేవించవలయును; పురాణ-యవాన్=పురాణశాలి=పాతరాజనాల బియ్యము; గోధుమ=గోధుమలు; యవాన్=యవలును; కృతైః=చేయబడిన స్నేహము శుంఠి మొదలగు వాటిచేత కూడిన; యూషరసైః=యూషరసములతో; నిగదం=దోషరహితమైన; మదిరారిష్ట మార్ద్వీకమ్=మద్యము, అరిష్టము, తేనెనుగాని; స్వల్పం అంబువా = కొద్ది జలముగాని; దివ్యం = ఆకాశోకదకముగాని; క్వథిత కూపోత్థం=కాచిన బావినీరుగాని; చౌండం=పర్వతము నందలి రాతిపల్లములలో నుండు నీరుగాని; సారసమేవవా = కొలను నీరుగాని; నిషేవేత = త్రాగవలయును; వృష్టి వాతాకులే = వర్షము, గాలి, వీటిచేత ఎక్కువగా నున్న; అహ్ని=పగటియందు; క్లేదవాతజిత్=కఫమును వాతమును జయించునట్టి; పరిశుష్కం = ఎండిన; లఘు=తేలికయైన: స్నిగ్ధం = స్నేహయుక్తమైన; ఉష్ణామ్ల లవణమ్=వేడియైన పులుపు ఉప్పుతో కూడిన; భోజనం=భోజనమును; భజేత్=సేవించవలయును; ప్రాయః=తరచుగా; ఘనోదయే=వర్షాకాల ప్రారంభమున; అన్నపానం=అన్నపానము; సక్షౌద్రం=తేనెతో కూడినదియు; సంస్కృతంచ=కాలయోగ్యద్రవ్యములతో సంస్కరింపబడినదియు; భజేత్= సేవింపవలయును; అసరీ—శీకరమ్ = అసరీసృప = ప్రాకుడు క్రిమికీటకాదులు లేనిదియు; భూబాష్ప=భూమి అవిరి లేనిదియు; శీత మారుత=చల్లటిగాలి లేనిదియు; శీకరమ్=తుంపురులు లేనిదియు; సాగ్నియానమ్=నిప్పు కుంపటితో కూడినదియు; నిర్దంశ మశకోన్దురమ్=ఈగలు దోమలు ఎలుకలు లేనటువంటి; భవనం=ఇంటిని; భజేత్=పొందవలయును; ప్రఘర్ష—ప్రియః=ప్రఘర్ష= ఓషధులచే బాగుగా మర్దించుట; ఉద్వర్తన=నలుగుపెట్టుకొనుట; స్నాన= స్నానము; ధూమగంధ=సుగంధద్రవ్యములచేత వచ్చు పొగయందు; గరు ప్రియః=అగరునందు ప్రియమైనవాడు; చిత్రస్వగ్వస్త్రిభూషితః = చిత్రములైన వస్త్రములు వీటిచేత; భూషితః=అలంకరింపబడినవాడై ; కరేణుముఖ్యాభిః = ఆడ ఏనుగు మొదలగు ముఖ్యమైన వాహనములచేత; యాయాత్=పయనించవలెను: నదీ—మైథునమ్—నదీజల=నదియొక్కనీరు; ఉదమన్థ=నీటిలో గోలించి నేతితో భర్జనము చేసిన పిండి; అహఃస్వప్న=పగటినిద్ర; అతిద్రవ=మిక్కిలి పలుచనైన పదార్థములు; మైథునమ్=సంభోగమును; తుషార—కరాన్- తుషార=మంచును; పాదచరణ=పాదములను తిరుగుటను; వ్యాయామ= వ్యాయామమును; త్యజేత్=వదలవలయును.

తాత్పర్యము : వర్షఋతువునందు వాయువు పశ్చిమదిక్కునుండి వీచును. సమస్తమైన పైర్లు మొలకెత్తును. పగిలిన ఇంద్రనీలమణివలె నల్లనైన మేఘ సమూహము చేత ఆకాశము వ్యాప్తమైయుండును, దిగుడు బావులు పూర్ణమైన నీటిలో మునిగిన సోపానములు కలిగి ఉండును. మరియు నీటి అలల తాకిడిచేత వికసింప చేయబడిన కమలములు గలిగినవిగ నుండును. నదులు సముద్రమువలె

గంభీరముగ నుండును. భూమి అంతట నీటితో నిండి మధ్యమ స్థాయిలో శబ్దము చేయుచున్న మేఘములు, నెమళ్ళు, కప్పలచేత శబ్దముచేయబడినదియు, ఇంద్రగోప పురుగులు ఇంద్రధనుస్సు, మెరుపు వీటియొక్క కాంతితో ప్రకాశము గలదియు, నాలుగువైపుల పచ్చనిగడ్డిగలదియు, అరటిపువ్వు, కొడిశ పాలపువ్వులచేత మిక్కిలి ప్రకాశించునదియు అగును. అపుడు ఆదానకాల స్వభావమువలనబలహీనమైన శరీరము నందు జాఠరాగ్ని మందగించినదై, వర్షములు, భూమినుండి వచ్చు ఆవిరి, క్రొత్త నీరు, భుజించిన ఆహారము ఆమ్లవిపాకము చెందుట చేతను వాత పిత్త శ్లేష్మములు దూషింపబడినవై మరల అగ్ని బాధింపబడిన దగుచుండగా ప్రతిపురుషుడు వమన విరేచన రూపమైన శోధనముల చేత శుద్ధుడై వస్తికర్మను సేవించవలయును. పాతబియ్యము, గోధుమలు, యవలు ఈధాన్యములను స్నేహము, శుంఠి మొదలగుదీపన ద్రవ్యములచేత సంస్కరింపబడిన యూషరసములతోను, దోష రహితమైన మద్యము అరిష్టము తేనె మొదలగు వాటినిగాని కొద్దిజలముగాని ఆకాశోదకముగాని, కాచిన బావినీరుగాని, పర్వతములందలి రాతిపల్లములలో నిలిచిన నీరుగాని, కొలను నీరుగాని, త్రాగవలెను. ఎక్కువగా వర్షము గాలి ఉన్న పగటి వేళయందు కఫమును వాతమును జయించునట్టి, ఎండిన, తేలికయైన స్నేహముతో కూడిన, వేడియైన, పులుపు ఉప్పుతో కూడిన భోజనమును భుజించ వలయును. తరచుగా వర్షాకాలము నందు తేనెతోకూడిన, కాలయోగ ద్రవ్యములతో సంస్కరించిన అన్నపానములను తీసికొనవలయును. భూమిమీద సంచరించు క్రిమికీటకాదులు లేని, భూమిఆవిరిలేని (చెమ్మలేని), చల్లటి గాలిలేని, నిప్పుల కుంపటితో కూడిన, ఈగలు, దోమలు, ఎలుకలు లేనటువంటి భవనము నందు నివసించవలయును.

ఓషధులచే శరీరమును మర్దించుట, నలుగుపెట్టుట, స్నానము, సుగంధ ద్రవ్యములైన అగరుధూపములు, చిత్రములైన మాలలు, చిత్రము లైన వస్త్రముల చేత అలంకరింపబడిన వాడై ఆడ ఏనుగు మొదలగు ముఖ్యములైన వాహనములతో పయనించవలెను. నీటిలో కలిపి నేతితో వేయించిన పిండిని, పగటి నిద్రను, మిక్కిలి పలుచనైన పదార్థములను, సంభోగమును, మంచును, కాలి నడకని, వ్యాయామమును వదలి పెట్ట వలెను.

*శశిలేఖ* : వర్షాసు అను పదముచేత వర్షఋతువుయొక్క స్వరూప లక్షణము చెప్పబడు చున్నది. సర్వసస్యములు మొలకలెత్తుటకు కారణము పశ్చిమ దిక్కునుండి వీచు వాయువులుగా పేర్కొనబడినది. భిన్నేంద్ర నీల అని చెప్పుట వలన ఇంద్రనీలమణి మిక్కిలి నల్లగానుండును. పగిలిన ఇంద్ర నీలమణికి అంత నలుపు ఉండదని భావము. పుష్కరిణులు పూర్ణములుగా (నిండుగా) నుండును,

వర్ష ఋతువునందు వట్టినేల కనిపించదు. నేల యంతయు నీటిమయమై ఉండును, సిలింధ్రైః అనగా అరటిపుష్పములని అర్థము చౌండం అనగా పర్వతము నందలి రాళ్ళ యందున్న పల్లములలో పుట్టిన నీరని అర్థము. సరీసృపాః అనగా సర్పములు తేళ్ళు మొదలగునవి యని అర్థము.

మూ. శరద్వ్యోమ శుభ్రాభ్రం కించిత్పంకాంకితామహీ।
ప్రకాశ కాశ సప్తాహ్వకుముదాశా విశాలినీ॥
విక్షిప్త తీక్ష్ణ కిరణో మేఘౌఘ విగమాద్రవిః।
బభ్రువర్ణోఽతివిమలాః క్రౌంచ మాలా కులాదిశః॥
కమలాంతర సంలీన మీనహంసాంస ఘట్టనైః।
తరంగ భంగ తుంగాని సరాంసి విమలానిచ॥
వర్షాశీతోచితాంగానాం సహసై వార్కరశ్మిభిః।
తప్తానాం సంచితం పూర్వం తదాపిత్తం ప్రకుప్యతి॥
శస్తంతిక్త హవిః పానం విరేకోఽస్రస్రుతిఃసదా।
శీతం లఘ్వన్నపానం చ కషాయ స్వాదు తిక్తకమ్॥
శాలి షష్టిక గోధూమ యవ ముద్గాసితామధు।
పటోలామలకం ద్రాక్షా జాంగలం శుభ్వతాం భృశమ్॥
దివాదివాకర కరైర్నిశాకర కరైర్నిశి।
సన్తప్తం హ్లాదితం తోయ మగస్త్యేనా విషీకృతమ్॥
నిర్మలం శుచి కాలేన పక్వంపానేఽమృతోపమమ్॥
హంసౌఘ పక్షవిక్షేపభ్రమత్ భ్రమర పంక్తిషు॥
సుసరోరుహ సేవ్యాసు సరసేషు ప్లవేత చ।
లఘు శుద్ధాంబర స్రగ్వీ శీతోశీర విలేపః॥
సేవేతచన్ద్రకిరణాన్ ప్రదోషే సౌధ మాశ్రితః।
తృప్తిం దధ్యాత వజ్రారవసాతైల పురోనిలాన్।
తీక్ష్ణ మద్యా దివాస్వప్నతుషారాంశ్చ వివర్జయేత్।

ప్రతిపదార్థము : శరధి = శరత్కాలమునందు; వ్యోమ = ఆకాశము; శుభ్రాభ్రమ్ = తెల్లని మేఘములను గలది; మహీ = భూమి; కించిత్ పంకాంకితా = కొద్దిపాటి బురదతో కూడినదియు; ప్రకా-కుముదా = ప్రకాశ = కాంతివంతమైన, కాశ = రెల్లుపుష్పము; సప్తాహ్వ = ఏడాకులరటి; కుముదా = కలువలు గలదియు; శాలిశాలినీ = పైర్లుగలదియు నగుస ; రవిః = సూర్యుడు; మేఘౌఘవిఘమాత్ = మేఘపంక్తులుతొలగిపోవుటవలన; విక్షిప్త తీక్ష్ణకిరణః = వెదజల్లబడిన తీక్ష్ణ కిరణములు కలవాడును; బభ్రువర్ణః = పచ్చనిరంగు గలవాడు అగుచున్నాడు; దిశః = దిక్కులు; అతివిమలాః = మిక్కిలి నిర్మలములైనవియు; క్రౌంచమాలా కులాః = క్రౌంచ పక్షుల వరుసలతో వ్యాపించినవి అగుచున్నవి; సరాంసి = సరస్సులు; కమలా-ఘట్టనైః = కమలాన్తర = కమలముల మధ్యన; సంలీన = దాగిన;

మీన=చేపలయొక్క; హంస=హంసలయొక్క; అంసఘట్టనైః=మూపుయొక్క తాకిడులచేత; తరంగభంగతుంగాని=అలలయొక్క హెచ్చు తగ్గులచేత ఎత్తైన వియు; విమలానిచ=స్వచ్ఛమైనవియు అగుచున్నవి; వర్షా శీతోచితాంగానామ్= వర్షాకాలమునకు శీతాకాలమునకు ఉచితమైన అంగ సంస్కారము కలవారును; సహసైవ=వెంటనే (శరత్కాలమారంభించిన వెంటనే);అర్కరశ్మిభిః=సూర్య కిరణములచేత; తప్తానామ్=తాపమును చెందిన (జనుల యొక్క); పూర్వం= వర్ష ఋతువునందు; సంచితమ్=తనస్థానమున వృద్ధిచెందిన; పిత్తం=పిత్తము; తదా=శరత్కాలారంభము నందు; ప్రకుప్యతి=ప్రకోపమును చెందుచున్నది; తిక్త హవిః పానమ్=తిక్త ఘృత పానము; శస్తమ్=ప్రశస్తమైనది; సదా= ఎల్లప్పుడు; విరేకః=విరేచనము; అస్రస్రుతిః=రక్త మోక్షణము; శస్తా=ప్రశస్త మైనవి; కషాయ స్వాదు తిక్తకమ్=వగరు తీపి చేదు రసములు గల; శీతం= చల్లనైన; లఘ్వన్న పానం చ=తేలికయగు అన్న పానములు; శస్తం=ప్రశస్త మైనది; శాలి-మధు; శాలి=శాలిధాన్యము; షష్టిక=షష్టిక ధాన్యము; గోధూమ=గోధుమలు; యవ=యవలు; ముద్గ=పెసలు; సిత=చక్కెర; మధు= తేనె; పటోలామలకం=పొట్ల ఉశిరికలు:ద్రాక్ష=ద్రాక్ష; జాంగలమ్=జాంగల దేశము నందలి మాంసము; క్షుద్వతాం=ఆకలిగొన్న వారికి; భృశం=మిక్కిలి; శస్తం=ప్రశస్తమైనది: దివా=పగలు; దివాకర కరైః=సూర్య కిరణముల చేత; సన్తప్తం=తపింప చేయబడినదియు; నిశి=రాత్రియందు;నిశాకర కరైః=చంద్ర కిరణములచేత;హ్లాదితం=చల్లపరుపబడినదియు; అగస్త్యేన=అగస్త్యనక్షత్రముతో; అవిషీ కృతమ్=విషము లేకుండ చేయబడినదియు; నిర్మలమ్=మల రహితమైన దియు; శుచి=పరిశుద్ధమైనదియు; కాలేన=శరత్కాలము చేత; పక్వం=పక్వ మైనదియు;పానే=త్రాగుటయందు;అమృతోపమమ్=అమృతముతోసమానమైన దియునైన;తోయం=నీరు; శస్తం=ప్రశస్తమైనది;హంసౌఘపంక్తిషు=హంసౌఘ =హంసలసముదాయముయొక్క;పక్ష=రెక్కలయొక్క; విక్షేప=విసరుట చేత; భ్రమత్=తిరుగుచున్న; భ్రమర పంక్తిషు=తుమ్మెద పంక్తులుగల; సుసరో మహాసేవ్యాసు=మంచి తామరల చేత సేవింప దగిన; సరసీషు=కొలనులందు; ప్లవేత=తెప్పల మీద విహారము చేయవలెను; లఘుశుద్ధాంబరః=తేలికయైన పరిశుద్ధమైన వస్త్రము గలవాడు; స్రగ్వీ=మాలను ధరించినవాడు; శీతోశీరవిలే పనః=చల్లనైన వట్టివేరు గంధముతో లేపనము చేసికొనినవాడు; ప్రదోషే= సాయంకాల వేళయందు; సౌధం=మేడను; ఆశ్రితః=చేరినవాడై; చంద్ర కిరణాన్=చంద్రకిరణములను: సేవేత=సేవించవలెను; తృప్తి-పురోనిలాన్= తృప్తి=కడుపునిండాభుజించుటను; దధి=పెరుగును; ఆతప=ఎండను; క్షార= క్షారములను; వసా=వసను; తైల=తైలమును; పురోనిలాన్=ఎదురుగా వచ్చువాయువులను; తీక్ష్ణ...తుషారాంశ్చ=తీక్ష్ణ=తీక్ష్ణములైన; మద్య=మద్య

మును; దివాస్వప్న = పగటినిద్రను; తుషారాంశ్చ = మంచును; వర్జయేత్ = విడిచిపెట్టనలయును.

తాత్పర్యము : శరత్కాలమునందు ఆకాశము తెల్లని మేఘములతో నుండును. భూమి కొద్దిపాటి బురదకలిగి ప్రకాశవంతములైన రెల్లుపుష్పములు, ఏడాకు లరటి, కలువలు, పైర్లు కలదై యుండును. మేఘపంక్తులు తొలగి పోవుటవలన ప్రసరించబడిన తీక్ష్ణ కిరణములు గలిగి సూర్యుడు పచ్చని రంగు గల వాడగుచున్నాడు. నిర్మలములైన దిక్కులు క్రౌంచపక్షుల వరుసలతో వ్యాపించి యుండును. సరస్సులు కమలముల మధ్య దాగిన చేపలు హంసలయొక్క మూపుర తాకిడుల చేత ఏర్పడిన అలలతో ఎత్తైనవియు అగుచున్నవి. వర్షా కాలమునకు శీతాకాలమునకు తగిన అంగసంస్కారము కలవారును శరత్కాల మారంభమైన వెంటనే సూర్యకిరణములచేత తాపమును చెందిన మనుజులకు పూర్వము (వర్షఋతువునందు) స్వస్థానమున వృద్ధిచెందిన పిత్తము శరత్కాలా రంభమున ప్రకోపమును చెందుచున్నది. ఈ ఋతువునందు తిక్తఘృత పానము యుక్తమైనది. ఎల్లప్పుడు విరేకము రక్తమోక్షణము ప్రశస్తము. కషాయ స్వాదు తిక్తరసములు చల్లనైన తేలికయైన అన్నపానములు హితకరములు. శాలిధాన్యము షష్టికధాన్యము గోధుమలు యవలు పెసలు చక్కెర తేనె ఇవన్నియు ఆకలిగొన్న వారికి చాల ప్రశస్తములు. పగలు సూర్యకిరణముల చేత తప్తములై, రాత్రి చంద్రకిరణములచేత చల్లబరుచబడి అగస్త్య నక్షత్రము చేత నిర్విషముగ చేయబడినట్టి మలరహితమైనట్టి, పరిశుద్ధమైనట్టి, శరత్కాలము చేత కాలమునుబట్టి పక్వమైనట్టి, పానమునందు అమృత తుల్యమైనట్టి నీరు మంచిది. హంసలు పక్షులు వాటి రెక్కలతో విసురుటలచేత తిరుగుచున్న తుమ్మెదల పంక్తులుగల, మంచి తామరలచేత సేవింపదగిన కొలనులయందు తెప్పలమీద విహారము చేయవలెను. సన్ననైన పరిశుద్ధమైన వస్త్రమును ధరించినవాడై చల్లనైన వట్టి వేళ్ళ గంధము మేన నలందికొని మెడలో మాలను ధరించి సాయంకాల వేళయందు మేడపైనుండి చంద్రకిరణములను సేవించవలయును. కడుపునిండా తృప్తితీర భుజించుట, పెరుగు, ఎండ, క్షారములు, వస, తైలము, ఎదురుగా వచ్చుగాలి, తీక్ష్ణములైన గాలి, మద్యములు, పగటి నిద్ర, మంచు- వీటిని శరదృతువునందు విడిచిపెట్టవలయును.

శశిలేఖ : శరది అను పదముచేత శర్కాల స్వరూప వర్ణనమును చేయుచున్నాడు. మేఘములు తొలగిపోవుట వలన సూర్యుడు తీక్ష్ణకిరణములను నలుదిశల వెదజల్లుచు కపిలవర్ణము గలిగి ఉండును. వర్షఋతువునందు ఆమ్ల విపాకమును చెందిన నీరు మద్యము మొదలగు వాటిచేత పిత్తము స్వస్థానమున వృద్ధిచెంది ఉన్నందున శరత్కాలమున ప్రకోపించుచున్నది. ఈ ఋతువునందు మహాతిక్త పంచతిక్తాది ఘృతములు తిక్తద్రవ్యములతో సిద్ధముచేసినవి ముఖ్య ముగా వాడవలెను.

**మూ॥** నిత్యం సర్వరసాభ్యాసః స్వస్వాధిక్య మృతావృతౌ॥

**ప్రతిపదార్థము :** నిత్యం = ప్రతిదినము; సర్వరసాభ్యాసః = మధురాది షడ్రసముల యొక్క అభ్యాసము (కుర్యాత్ = చేయవలెను); ఋతౌ ఋతౌ = ప్రతిఋతువునందు; స్వస్వాధిక్యమ్ = తమతను ఋతువులలో ఎక్కువగా నున్న వాటిని; (సేవేత = సేవించవలెను).

**తాత్పర్యము :** అన్ని ఋతువులయందు మధురాది షడ్రసములు విహితములు. ఇవి బలమును కలిగించుచున్నవి. ఏ ఋతువునందు ఏఏ రసములు విశేషముగ వాడవలయునని ఉపదేశించిరో వానిని విశేషముగ ఆయా ఋతువులలో అభ్యసించ వలయును.

**మూ॥** ఋతోర్వరన్త్యాది సప్తాహావృతు సన్ధిరితిస్మృతః।

**ప్రతిపదార్థము :** ఋతోః = ఋతువుయొక్క; అన్త్యాది సప్తహా = చివరి మొదటి ఏడు దినములు (అనగా పదునాలుగు దినములు); ఋతుసన్ధిరితి = ఋతు సంధియని; స్మృతః = చెప్పబడినది.

**తాత్పర్యము :** శిశిరవసంతాది రెండు ఋతువులయొక్క కడపటి ఏడు దినములు రాబోవు ఋతువుయొక్క ఏడు దినములు జేరి పదునాల్గు దినములు ఋతు సంధియని చెప్పబడుచున్నది.

**శశిలేఖ :-** పోవుచున్న ఋతువుయొక్క కడపటి ఏడు దినములు రాబోవు (వచ్చుచున్న) ఋతువుయొక్క ఏడు దినములు కలసి 14 రోజులు ఋతు సంధిశబ్ద వాచ్యములు.

**మూ॥** **తత్ర పూర్వోవిధి స్త్యాజ్యః సేవనీయోపరః క్రమాత్।**
**అసాత్మ్య జాహిరోగాః స్యుః సహసాత్యాగ శీలనాత్॥**

**ప్రతిపదార్థము :** తత్ర = ఆ ఋతుసంధియందు; పూర్వోవిధిః = వెనుక చెప్పిన నియమము; త్యాజ్యః = వదలవలయును; క్రమాత్ = వరుసగా; పరః = తరువాతి ఋతునియమము; సేవనీయః = సేవింపదగినది; హి = యుక్తమే; సహసా = వెంటనే; త్యాగశీలనాత్ = నియమములను వదలుట వలన; అసాత్మ్యజాః = అనుచిత పదార్థసేవవలన జనించునట్టి; రోగాః = వ్యాధులు; స్యుః = కలుగును.

**తాత్పర్యము :** వానిలో ముందుచెప్పబడిన ఋతువుయొక్క నియమములను విడిచి వచ్చుచున్న ఋతువుయొక్క విధిని క్రమముగా ఆయా ఋతువులలో ఉపదేశించిన విధానముల ననుసరించనలెను. వెంటనే ఒక ఋతువు యొక్క విధిని విడిచి మఱియొక ఋతువుయొక్క క్రమము ననుసరించిన యెడల అనుచిత పదార్థ సేవవలన కలుగు వ్యాధులు కలుగును.

***శశిలేఖ :*** ఋతుసంధియందు పోవుచున్న ఋతువుయొక్క విధి క్రమముగ విడిచిపెట్టవలయును. అట్లే క్రమముగా రాబోవు ఋతువుయొక్క విధి సేవించ దగినది. క్రమమనగా (పాదేన పథ్యమభ్యస్తం పాదపాదేన వా త్యజేత్) పై వాక్యము ద్వారా చెప్పబడును. అట్లు క్రమము తప్పి వెంటనే విధిని విడుచుట వలన అసాత్మ్యాదుల వలన పుట్టిన రోగములే కలుగును.

**మూ॥** ఋతుష్వేవం విధేష్వేవ విధిః స్వాస్థ్యేచ దేహినామ్॥
నిర్దేశ్యతేఽన్యరూపేషు విరుద్ధజ్ఞాని కోవిధిః।

***ప్రతిపదార్థము :*** దేహినామ్=దేహులకు; స్వాస్థ్యేచ=ఆరోగ్యమునందు; ఏవం విధేషు=ఇట్టి; ఋతుషు=హేమంతాది ఋతువులయందు; విధిః=క్రమము; అన్యరూపేషు=ఇతర రూపములయందు; విరుద్ధజ్ఞానికః=విరుద్ధజ్ఞానికమైన; విధిః=క్రమము; నిర్దిశ్యతే=నిర్దేశింపబడగలదు.

**తాత్పర్యము :** మానవులకు ఋతువునందు విధించిన క్రమము ఆరోగ్యమును కలిగించునది. తద్విపరీత క్రమము చెప్పబడగలదు.

***శశిలేఖ :*** చెప్పబడిన ఋతువులయందే ఈ విధి యుక్తమైనది. ఈ విధి ననుసరించుటచేత ఆరోగ్యము చేకూరును. ఇతర రూపముల యందు విరుద్ధ విజ్ఞాన ప్రసంగములో చెప్పబడును.

**మూ॥** మాసరాశి స్వరూపాఖ్య మృతోర్యల్లక్షణత్రయమ్॥
యథోత్తరం భజేచ్చర్యాం తత్ర తస్య బలాదితి।

***ప్రతిపదార్థము :*** ఋతోః=ఋతువుయొక్క; మాసరాశిస్వరూపాఖ్యం=మాసము రాశి స్వరూపమను వాటిచేత చెప్పబడుచున్న; యత్=ఏ; లక్షణత్రయమ్=మూడు లక్షణములు; తత్ర=అచట; యథోత్తరం=పై పై దానిని శ్రేష్ఠముగా భావించి; చర్యాం=ఋతుచర్యను; భజేత్=సేవించవలయును; తస్య=ఆయాయథోత్తర లక్షణముయొక్క; బలాత్=బలము కలిగియుండుటవలన;

**తాత్పర్యము :** ఋతువుయొక్క మాసాది మూడు లక్షణములు చెప్పబడినవో వాటియందు ఉత్తరోత్తరముగా బలము కలవైనందువలన దానికి తగినట్లుగా ఋతుచర్య నాచరించవలెను.

***శశిలేఖ :*** ఈ ఋతువునకు మాసాది క్రమముగా ఏ లక్షణము చెప్పబడినదో వాటియందు క్రమేణ ఒకదానికన్న నొకటి బలమగుటచేత ఆ క్రమమే అనుసరించి ఋతు చర్యను సేవించవలయును. ఏ ఋతువు యొక్క ఏక్రమము చెప్పబడినదో ఆక్రమము అమాస ప్రారంభమున నే కొద్దిగా ఆచరించ దగినది. ఎచట మాస విధి ప్రారంభింపబడునో అచట రాశి స్వరూపముల యొక్క

క్రమము ఉండదు. ఇట్లు చెప్పిన యెడల ఒకప్పుడు రాశిగూడ ప్రాప్తించును. ఎచటనైతే, ఏ మాసము నందైతే రాశి స్వరూపలక్షణముపరిపూర్ణముగ నుండునో అచట విధికూడ పూర్ణమే. అట్లే మాసము గాక రాశి వచ్చిన యెడల అచట స్వరూప లక్షణము లేకుండిన యెడల మధ్యమైన విధిని అనుసరించవలెను. ఈ రాశిమాసమునకు స్వరూప లక్షణమునకు మధ్యానుండుటవలన బలకరము. ఎచట మాసరాసులు లేకుండ పూర్ణమైన స్వరూప లక్షణము ఉండునో అక్కడ పూర్ణమైన విధిని ఆచరించవలెను. యథోత్తరముగా స్వరూప లక్షణము బలకరము.

నాల్గవ అధ్యాయము
సమాప్తము.

# అష్టాంగసంగ్రహ వ్యాఖ్యానము

## పంచమోధ్యాయము

మూ॥ అథాతో రోగా నుత్పాదనీయం నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః।
ఇతి హస్మాఽఽహు రాత్రేయాదయో మహర్షయః॥

**ప్రతిపదార్థము :** అథ=అటుతరువాత; అతః=ఇందువలన; రోగా నుత్పాదనీయం = రోగానుత్పాదనీయమను; నామ = పేరుగల; అధ్యాయం= అధ్యాయమును; వ్యాఖ్యాస్యామః = వ్యాఖ్యానించగలము; ఇతిహ=ఇట్లని; ఆత్రేయాదయః=ఆత్రేయాదులైన; మహర్షయః=మహర్షులు; ఆహుస్మ= పలికిరి;

**తాత్పర్యము :** పై చెప్పిన కారణముల వలన తరువాత రోగానుత్పాద నీయమను నధ్యాయమును వివరించగలమని మహర్షులైన ఆత్రేయాదులు ఇట్లు చెప్పిరి.

**శశిలేఖ :** ఆరోగ్యవంతుని స్థితిని గురించిన విపులీకరణము ప్రస్తుతము (ఆరోగ్య వివరణము) వేగములను అనగా వాతాదిత్రయోదశ వేగములను నిరోధించువానికి స్వాస్థ్యము గగన కుసుమము వంటిది. దానివలన తెలియున దేమనగా వేగధారణ ప్రతిషేధము వలన రోగములు ఉత్పన్నములు కావు. వాని నుద్దేశించి ఈ యధ్యాయ మారంభింపబడుచున్నది.

మూ॥ వేగాన్ నధారయే ద్వాత విణ్మూత్రక్షవ తృట్ క్షుధాం।
నిద్రాకాసశ్రమ శ్వాస జృంభాశ్రుచ్ఛర్ది రేతసామ్॥

**ప్రతిపదార్థము :** వాత విణ్మూత్ర క్షవ తృట్ క్షుధాం = వాతము మలము, మూత్రము, తుమ్ము, దప్పి, ఆకలి వీటియొక్కయు; నిద్రాకాసశ్రమ శ్వాస జృంభాశ్రుచ్ఛర్ది రేతసాం=నిద్ర, దగ్గు, దేహపరిశ్రమవలనన కలిగిన శ్వాసం, ఆవలింత, కన్నీరు, వాంతి, రేతస్సు వీటియొక్కయు; వేగాన్ = వేగములను; నధారయేత్=అడ్డగించరాదు.

**తాత్పర్యము :** వాతము (అపానవాతము), మలము, మూత్రము, తుమ్ము, దప్పి, ఆకలి, నిద్ర, దగ్గు, దేహపరిశ్రమవలన కలిగినశ్వాస, ఆవలింత,

కన్నీరు, వాంతి, వీర్యము అను వీటియొక్క (పదునాలుగు) వేగములను నిరోధించరాదు.

**శశిలేఖ :** సంప్రాప్తములైన వేగములను నిరోధించకుండుట అను కారణమున రోగములు కలుగకుండుట చెప్పబడుచున్నది. అపానవాతాదుల యొక్క సంప్రాప్తమైన విసర్జనము అనగా స్వభావసిద్ధమైన వేగప్రవృత్తిని అడ్డగించ దగినదికాదు; పైనుదాహరించిన క్రమముననుసరించి తరువాత వివరించుచున్నాము. ఊర్ధ్వవాతము, అధోవాతము అని వాతము రెండువిధములు. అందు మూత్రపురీషాదులన్నియు ఒకే వర్గమునకు చెందినవి. కాబట్టి తత్ప్రేరకమైన అధోవాతము మొదట నిరూపింపబడుచున్నది.

**మూ॥ అధోవాతస్య రోధేన గుల్మోదావర్త రుక్శ్రమాః ।**
**వాతమూత్ర శకృత్సంగ దృష్ట్యగ్నివధ హృద్గదాః ॥**

**ప్రతిపదార్థము :** అధోవాతస్య=అధోవాతముయొక్క అనగా అపాన వాతము (క్రిందికి ప్రసరించు వాతము); రోధేన=అడ్డగించుటచేత; గుల్మోదావర్తరుక్శ్రమాః=గుల్మము, ఉదావర్తము, బాధ, ఆయాసములు; వాత, మూత్ర శకృత్సంగ దృష్ట్యగ్నివధహృద్గదాః=అధోవాతము, మూత్రము, మలము వీటి యొక్క అడ్డగించుట, దృష్టినాశము, అగ్నినాశము (జాఠరాగ్నినాశము), హృద్రోగములు; సంభవంతి=కలుగుచున్నవి.

**తాత్పర్యము :** అధోవాతము అనగా అపానము యొక్క నిరోధము చేత గుల్మము, ఉదావర్తము, వేదన, శ్రమములు కలుగును. వాతము నడ్డగించుట, మూత్రము నడ్డగించుట, మలము నడ్డగించుట వలన దృష్టి నాశ అగ్నినాశ హృద్రోగములు యథాసంఖ్యముగా కలుగ గలవు.

**శశిలేఖ :** అధోవాతము యొక్క అనగా గుదవాతము యొక్క ప్రతిరోధము వలన గుల్మలు కలుగ గలవు. ఉదావర్తము యొక్క స్వరూప స్వభావములు అర్శోరోగ నిదానము నందు వివరింప బడగలదు. అదేవిధముగ వేదన శ్రమమును ఏర్పడగలవు. మరియు అపాన వాయువు మూత్ర మలముల అప్రసారము వలన దృష్టి నాశము అగ్నినాశము హృద్రోగములు సంభవించును.

**మూ॥ శకృతః పిండికోద్వేష్టప్రతిశ్యాయ శిరోరుజః।**
**ఊర్ధ్వవాయుః పరికర్తు హృదయస్యోపరోధనమ్॥**
**ముఖ్యే విట్ ప్రవృత్తిశ్చ పూర్వోక్తాశ్చామయాః స్మృతాః।**

**ప్రతిపదార్థము :** శకృతఃరోధేన = మలప్రవృత్తి నడ్డగించుటచేత; పిండికోద్వేష్టప్రతిశ్యాయ శిరోరుజః=పిండికోద్వేష్ట=జంఘాకాండము యొక్క వెనుక భాగము నందలి పిండాకారమై కఠినమైన మాంసము యొక్క చుట్టుకొనుట; ప్రతిశ్యాయ=పడిశము; శిరోరుజః=తలనొప్పి; ఊర్ధ్వవాయుః= ఊర్ధ్వప్రస్తుతమైనవాయువు; పరికర్తః=కత్తిరించినట్లు బాధ; హృదయస్య=

హృదయముయొక్క; ఉపరోధనమ్=బంధము; ముఖేన=నోటితో; విట్ ప్రవృత్తిశ్చ=మలప్రవృత్తి; చ=మరియు; పూర్వోక్తాః=వాతమునడ్డగించుటచే సంభవించు; ఆమయాః=వ్యాధులు: స్మృతాః=చెప్పబడినవి.

**తాత్పర్యము :** మలరోధము వలన పిండికోద్వేష్టాది వ్యాధులు మరియు వాతము నడ్డగించుట సంభవించు వ్యాధులును ఏర్పడగలవు.

**శశిలేఖ :** పురీషము నడ్డగించుటవలన పిండికోద్వేష్టాదులు సంభవించును. పిండికా అనగా జంఘా కాండము యొక్క వెనుక భాగమున పిండాకారముతో నున్న మాంసము అచట చుట్టుకొన్నట్లు బాధ సంభవించును. ఇప్పుడు ఉదాహరించిన వ్యాధులన్నియు రాబోవు ప్రకరణములలో విపులీకరించబడును. మలము చేత మార్గము నడ్డగింపపడుటవలన కుంటుబడిన వాయువు మరలినదై పైకి ప్రవర్తించును. దీనినే ఊర్ధ్వ వాయు వందురు. పరికర్తనమనగా కుక్షిలో నంతట కత్తిరించినట్లు వేదన కలుగుట, ఊపిరికుట్టు ఏర్పడును. ఇవిగాక వెనుక చెప్పిన వాతావరోధజనిత వ్యాధులును కలుగును.

మూ॥ అ గభంగా శ్మరీవస్తిమేఢ్ర వంక్షణ వేదనాః॥
మూత్రస్య రోధాత్ పూర్వేచప్రాయోరోగాః।

**ప్రతిపదార్థము :** మూత్రస్య=మూత్రము యొక్క; రోధాత్=అడ్డగించుట వలన; అంగభంగా శ్మరీ వస్తి మేఢ్ర వంక్షణ వేదనాః=అంగభంగ=శరీరావయవములు పగిలినట్లుండుట; అశ్మరీ=అశ్మరి; వస్తి=వస్తి ప్రదేశము; మేఢ్ర=శిశ్నము; వంక్షణ=గజ్జలు వీటియందు; వేదనాః=బాధలు: చ=మరియు; పూర్వేప్రాయోరోగాః=ముందు చెప్పబడిన వాత మల ప్రతిరోధము వలన కలుగు వ్యాధులన్నియు; సంభవంతి=సంభవించును.

తాత్పర్యము : మూత్రము నడ్డగించుటవలన అంగభంగాదులు మరియు ముందు చెప్పబడిన వాత మలరోధము వలన కలుగు వ్యాధులన్నియు కలుగును.

శశిలేఖ : మూత్రరోధము వలన అంగభంగాదులు కలుగును. భంగ ఇవ స్ఫోటన మివ భంగః—అంగభంగః, పగిలినట్లు వేదన కలుగుట వస్త్యాదిశబ్దములకు వేదనా శబ్దముతో సంబంధము. 'పూర్వేచ' అనగా వాత శకృద్రోధ, జన్యరోగములును అని అర్థము.

మూ॥ తదౌషధమ్।
వర్త్యభ్యంగావగాహాశ్చ స్వేదనం వస్తికర్మచ॥
అన్నపానంచ విచ్ఛేది విడ్రోధోత్థేషుయత్మసు॥
మూత్రజేషుతు పానేచ ప్రాగ్భక్తం శస్యతే ఘృతమ్।
జీర్ణాంతికం చోత్తమయా మాత్రయా యోజనాద్వయమ్॥
అవపీడకమేతచ్చ సంజ్ఞితమ్–

**ప్రతిపదార్థము** : తదౌషధమ్ = పూర్వోక్తవ్యాధులకు ఔషధము; విడ్రోధోత్థేషు=మలము నడ్డగించుటవలన కలిగిన: యత్నేసు=వ్యాధులయందు; వర్త్యభ్యంగావగాహాః=వర్తి అభ్యంగము అవగాహములు; స్వేదనః=చెమట పట్టించుట; చ=మరియు; వస్తికర్మ=వస్తిక్రియ; విడ్భేది=మలమును భేదించు; అన్నపానం=అన్నపానీయములు; శస్యతే=చెప్పబడుచున్నవి: మూత్రజేషు (యత్నేసు) తు=మూత్రరోధ జన్యములైన వ్యాధులయందైతే; పానేచ= పానమునందు; ప్రాగ్భక్తం=భోజనమునకంటె పూర్వము; ఘృతమ్=నెయ్యి; శస్యతే=చెప్పబడుచున్నది; జీర్ణాన్తికం=పూర్వము భుజించిన ఆహారము జీర్ణమైన తరువాత; ఉత్తమయా మాత్రయా=ఉత్తమ మాత్రచేత; ఘృతం= ఘృతపానము; శస్యతే=చెప్పబడుచున్నది; ఏతత్ యోజనాద్వంచ=ఈ రెండు ప్రక్రియలును; అపపీడకం=అవపీడకమను (ఇతి=అని); సంజ్ఞితమ్=పేరుగలవి.

**తాత్పర్యము** : అధోవాయువు మలము మూత్రము మరియు ప్రవర్తించు వేగముల నడ్డగించుటవలన సంభవించు వ్యాధులలో ఫలవర్తులు (గుదద్వార ముద్వారా ఇచ్చుట) తైలాదులతో అభ్యంగములు (మాలిస్ మొదలగునవి) ఓషధులను వేసి కాచిన నీళ్ళు తైలాదులతో ఒక పెద్దపాత్రను నింపి మల మూత్ర మార్గములను అందులో నుంచి అవగాహము చేయుట, తాపాదులచేత 4 విధములైన స్వేదములను చేయుట, ఔషధరూపముగా తయారైన తైలాదు లను గుదమార్గము ద్వారా బస్తికర్మచేయుట, ఈ ప్రక్రియలు పరమౌషధములు సాధారణ చికిత్సా ప్రక్రియలుగా చెప్పబడుచున్నవి. పురీషరోధజనిత వ్యాధులలో విశేషముగా బంధింప బడిన మలమును విడగొట్టి బయటికి నెట్టు అన్నపానములను సేవించవలయును. మూత్రరోధజనిత వ్యాధులలో భోజనమునకు ముందు అల్ప మాత్రతో అట్లే ఆహారము పాకము చెందుచున్నప్పుడు ఉత్తమ మాత్రతో (ఏ మాత్ర 24 గంటలలో పాకము కాగలదో) ఘృతపానము చేయవలెను. భోజనమునకు ముందు మరియు ఆహార జీర్ణకాలములో చేయు ఘృతపానము యొక్క ఈ రెండు ప్రక్రియలను అవపీడకమని చెప్పుదురు.

**శశిలేఖ** : జీర్ణాంతిక మనగా ముందురోజు భుజించిన ఆహారము జీర్ణమైన దగుచుండగా అని అర్థము. తక్కిన శశిలేఖా వ్యాఖ్యానము నందలి విషయములు పై తాత్పర్యమునందు చెప్పబడినవి.

**మూ॥** ధారణాత్ పునః॥

ఉద్గారస్యారుచిః కంపో విబంధో హృదయోరసోః।
ఆధ్మాన కాసహిధ్మాశ్చ హిధ్మావత్తత్ర భేషజమ్॥

**ప్రతిపదార్థము**: పునః=మరల; ఉద్గారస్య ధారణాత్=త్రేనుపునడ్డగించుట వలన; అరుచిః=రుచి తెలియకపోవుట; కంపః=వణుకుడు; హృదయోరసోః= హృదయము ఉరస్సు వీటియొక్క; విబంధనః=స్తంభనము; ఆధ్మానకాస

హిధ్మాశ్చ=కడుపుబ్బరము, దగ్గు, ఎక్కిళ్ళును; సంభవంతి=సంభవించును; తత్ర=ఉద్గార నిరోధమునందు: హిధ్మావత్=ఎక్కిళ్ళ చికిత్సవలె; భేషజం= ఔషధము; దాతవ్యం=ఇవ్వదగినది.

**తాత్పర్యము :** ఉద్గారము నడ్డగించుటవలన అరుచి కంపాదులు కలుగును.

**శశిలేఖ :** పునశ్శబ్దము సామాన్యముగా నిర్దేశింపబడిన వాతము వలన కలుగు వికారములు పోను మిగిలిన ఉద్గారమనెడు వాతమును చెప్పుటకొరకు దిష్టమైనది. త్రేనుపుల నడ్డగించుటవలన అరుచ్యాదులు కలుగును. ఉరస్ అనగా వక్షము హృదయము వక్షమునకు క్రిందుభాగమున నుండును. ఈ రెంటియొక్క విబంధమనగా లోపల స్తంభించినట్లుండుట. అధ్మాన మనగా కుపితమైన వాయువు వలన బొడ్డు క్రిందుగా శూలవేదనతో కూడిన ఉబ్బరము. ఈ వ్యాధులయందు చికిత్సాస్థానమునందు చెప్పబడు ఎక్కిళ్ళ చికిత్సను చేయవలయును.

మూ॥ శిరో ర్తీంద్రియ దౌర్బల్యమన్యా స్తం భార్దితం క్షుతేః।
తీక్ష్ణ ధూమాంజ నాఘ్రాణ నావనార్క విలోకనైః॥
ప్రవర్తయే త్క్షుతిం సక్తాం స్వేదాభ్యంగౌచ శీలయేత్।
యోజ్యం వాతఘ్నమన్నంచ ఘృతం చౌత్తర భక్తికమ్॥

**ప్రతిపదార్థము :** క్షుతేః=తుమ్ముయొక్క; రోధాత్=అడ్డగించుట వలన; శిరో-అర్దితమ్=శిరోర్తి=శిరోవేదన; ఇంద్రియదౌర్బల్య=ఇంద్రియములకు దుర్బలత్వము; మన్యాస్తంభ = మెడకిరుప్రక్కలనుండు మన్యాఅను పేరుగల నరములు బిగుసుకొనుట: అర్దితం=అర్దితవాయువును ఏర్పడగలవు; తీక్ష్ణ-విలోకనైః =తీక్ష్ణధూమము = తీక్ష్ణమైన ధూమము; తీక్ష్ణాంజనము=తీక్ష్ణాంజనము; తీక్ష్ణాఘ్రాణం=తీక్ష్ణమైన ద్రవ్యములు పుష్పములు మొదలగువాటిని వాసనచూచుట; తీక్ష్ణనావనం=తీక్ష్ణనస్యములు; తీక్ష్ణార్క విలోకనైః=ప్రచండభానుని నవలోకించుట చేత; సక్తాం=ప్రతిరుద్ధమైన; క్షుతిం=తుమ్మును; ప్రవర్తయేత్=బహిర్గతము చేయవలెను; చ=మరియు; స్వేదాభ్యంగౌ=స్వేదమును అభ్యంగమును; శీలయేత్=ఆచరించవలెను; వాతఘ్నం=వాతమును హరించునట్టి; అన్నంచ= అన్నమును; యోజ్యం=ఇవ్వదగినది; ఔత్తరభక్తికం=భోజనము తరువాత; ఘృతం చ=నెయ్యినికూడ; యోజ్యం=ఇవ్వదగినది.

**తాత్పర్యము :** తుమ్మునడ్డగించుటవలన శిరోవేదన, ఇంద్రియ దౌర్బల్యము, మన్యాస్తంభము మొదలగు వ్యాధులు జనించును. తీక్ష్ణధూమాదులు ప్రచండభానుని చూచుట మొదలగు క్రియలచేత అడ్డగించబడిన తుమ్మును వెలిపుచవలెను. స్వేదాభ్యంగములు వాతహరములైన అన్నాదులు భోజనానంతరము ఘృతపానమును కూడ చేయించవలయును.

**శశిలేఖ :** తుమ్మును నిరోధించుటవలన శిరోవేదన మొదలగు వ్యాధు

లేర్పడును. జ్ఞానేంద్రియములకు (చక్షుశ్శ్రోత్రత్వక్ జిహ్వాఘ్రాణములు) స్వవిషయ గ్రహణమునందు దౌర్బల్యమేర్పడుటను ఇంద్రియ దౌర్బల్యం అను పదముచే వ్యక్తీకరించబడినది. ఇచట ప్రతిషిద్ధమైన తుమ్ముమను తీక్ష్ణధూమము లతో వెలిపరుచవలెను. తీక్ష్ణధూమలక్షణము తరువాత చెప్పబడగలదు. తీక్ష్ణ ఘ్రాణమనగా ముక్కుతో మిరియములు మొదలగు వాటిని గ్రహించుట. ఔత్తరభక్తిక మనగా భుజించిన వెంటనే నేతిని తీసికొనుట.

మూ॥ శోషాంగసాద బాధిర్య సమ్మోహభ్రమ హృద్గదాః ।
తృష్ణాయా నిగ్రహాత్తత్ర శీతస్సర్వో విధిర్హితః ॥

*ప్రతిపదార్థము :* తృష్ణాయాః=దప్పియొక్క; నిగ్రహాత్=అడ్డగించుట వలన; శోష=శోషము; అంగసాద=అంగములయందు బాధ; బాధిర్య=చెవుడు; సమ్మోహ=మోహము; భ్రమ=తలతిరుగుట; హృద్గదాః=హృదయ వ్యాధులు; సంభవేయుః=ఏర్పడగలవు; తత్ర=అచట; (దప్పి నడ్డగించుట చేత కలిగిన ఉపద్రవములు శాంతించుటకు); సర్వోవిధిః=స్నానము, అన్నము; పానము మొదలగు సమస్తము; శీతః = చల్లగా నుండు; విధిః = క్రియ, హితః=పథ్యమైనది.

**తాత్పర్యము :** దప్పిల అడ్డగించుట వలన శోష సర్వాంగముల యందు బాధ, చెవుడు హృదయవ్యాధులు ఏర్పడును. అపుడు శీతలమైన క్రియలు అన్నియు పథ్యమైనవి.

*శశిలేఖ :* బాధిర్యమనగా వినబడకుండుట. దప్పిని అడ్డగించుటవలన స్నానము అన్నపానములు మొదలగు సమస్త క్రియలు చల్లగా నుండునట్లు చేయవలయును.

మూ. అంగభంగారుచిగ్లాని కార్శ్యశూల భ్రమాః క్షుధః।
తత్ర యోజ్యం లఘుస్నిగ్ధ ముష్ణమల్పంచ భోజనమ్॥

*ప్రతిపదార్థము :* క్షుధః = ఆకలిని; రోధాత్ = అడ్డగించుటవలన; అంగ భంగ=అవయవములు విరిగినట్లుండుట; అరుచి=నోటికి రుచి లేకపోవుట; గ్లాని=శ్రమించలేని బడలిక; కార్శ్య=కృశత్వము; శూల=నొప్పి; భ్రమాః=తలతిరుగుటలు; సంభవంతి = కలుగుచున్నవి; తత్ర = అచట; లఘు=తేలికయైన; స్నిగ్ధం=జిడ్డుతోకూడిన; తత్ర=అచట; లఘు=తేలికయైన; స్నిగ్ధం=జిడ్డుతో కూడిన; ఉష్ణం=వేడియైన; అల్పంచ=కొద్దిపాటి మాత్రగల; భోజనం=భోజనము; యోజ్యం= ఇవ్వదగినది.

*శశిలేఖ :* లఘు అన శాల్యాదులకు భుజించ ననిఅర్థము.

మూ. నిద్రాయా మోహమూర్ధాక్షి గౌరవాలస్య జృంభికాః।
అంగమర్దశ్చ తత్రేష్టః స్వప్నః సంవాహనానిచ॥

ప్రతిపదార్థము : నిద్రాయాః=నిద్రను; రోధాత్=నిరోధించుటవలన; మోహ=మోహము; మూర్ధాక్షిగౌరవ = శిరస్సుకండ్లు బరువుగానుండుట; ఆలస్య=సోమరితనము; జృంభకాః=ఆవలింతలు; అంగమర్దశ్చ=సర్వ శరీరము నందు నొప్పియు కలుగ గలవు. తత్ర=అట్టిస్థితిలో; స్వప్నః=నిద్ర; ఇష్టః= విహితమైనది; సంవాహనానిచ = కొద్దిగా ఒడలు పట్టించుకొనుటయు యుక్తము.

తాత్పర్యము : నిద్రారోధము వలన మోహాదులు ఏర్పడగలవు. అందు నిద్ర కొద్ది ఒడలు పట్టించుకొనుటయు చికిత్సాపద్ధతులు.

శశిలేక : సంవాహనమనగా శరీరమును స్వల్పముగా మర్దించుట.

మూ. కాస్యరోధాత్తద్వృద్ధిః శ్వాసారుచి హృదామయాః।
శోషోహిధ్మాచ కార్యోఽత్ర కాసహాసుతరాం విధిః॥

ప్రతిపదార్థము : కాసస్య = దగ్గును; రోధాత్=అడ్డగించుటవలన; తద్వృద్ధిః=కాసముయొక్క ఆధిక్యము; శ్వాస=ఉబ్బసము: అరుచి=రుచి లేకుండుట; హృదామయాః = హృదయవ్యాధులు; శోషః = శోషము; హిధ్మాచ=ఎక్కిళ్ళును; సంభవంతి=కలుగును; అత్ర=ఇచట; సుతరాం= మిక్కిలి; కాసహా = దగ్గునుపోగొట్టగల; విధిః = చికిత్స; కార్యః=చేయ దగినది.

తాత్పర్యము: దగ్గును నిరోధించుటవలన దగ్గు అధికమై ఉబ్బసము, అరుచి, హృదయవ్యాధులు మొదలగునవి ఏర్పడగలవు. ఇచట దగ్గును పోగొట్ట గల చికిత్స చేయవలయును.

శశిలేఖ: దగ్గును నిరోధించుట వలన దగ్గు అధికమై శ్వాసాదులు ఏర్ప డును. శ్లోకమునందు కాసహా అను పదము ప్రయోగింప బడినది, మరియు అచట విధిః కార్యః అను రెండు పదములు పుంలింగములు. వ్యాఖ్యానములో కాసచికిత్సలో చెప్పబడిన క్రియాక్రమము అనుష్ఠించ దగినదని యున్నది, ఈ విషయమును శాస్త్రకారులు గ్రహించగలరు.

మూ॥ గుల్మ హృద్రోగ సమ్మోహాః శ్రమ శ్వాసాద్విధారితాత్ ॥
హితం విశ్రమణం తత్ర వాతఘ్నశ్చక్రియాక్రమః ।

ప్రతిపదార్థము :- విధారితాత్=నిరోధింపబడిన; శ్రమశ్వాసాత్=దేహ పరిశ్రమవలన ఏర్పడిన శ్వాసమువలన; గుల్మ=గుల్మము; హృద్రోగ=హృదయ వ్యాధి; సమ్మోహాః=సమ్మోహములు; సంభవంతి=కలుగగలవు; తత్ర=అచట; విశ్రమణం = విశ్రాంతి; హితం=మంచిది; వాతఘ్నః = వాతహరమైన; క్రియాక్రమశ్చ=చికిత్సాక్రమము కూడ; హితః=మంచిది.

తాత్పర్యము : దేహపరిశ్రమాదుల వలన ఏర్పడిన శ్వాసమును అపుట

వలన గుల్మాదులు ఏర్పడగలవు. అచట విశ్రాంతి ముఖ్యమైనది. వాతహర ములైన చికిత్సలుకూడ ప్రధానములైనవి,

**శశిలేఖ :** శ్రమశ్వాసమనగా దూరప్రయాణము, అతివ్యాయామము మొదలగు సాహసకార్యములచే వెంటనే కలిగిన శ్వాసము (ఎగఊపిరి). దాని వేగమునడ్డగించుటవలన గుల్మాది వ్యాధులు ఉత్పన్నమగును.

**మూ॥** జృంభాయాః క్షువవద్రోగాః సర్వశ్చానిల జిద్విధిః।

**ప్రతిపదార్థము :** జృంభాయాః=ఆవలింతను; రోధాత్=అడ్డగించుట వలన; క్షువవత్=తుమ్మునడ్డగించుటవలన కలుగు; రోగాః=వ్యాధులు;సంభవంతి= కలుగును; అనిలజిత్=వాతముజయించగల; సర్వః=సమస్తమైన; విధిశ్చ= చికిత్సాక్రమము; హితః=మంచిది.

**తాత్పర్యము :** ఆవలింత నడ్డగించుటచే, తుమ్మునడ్డగించుట వలన సంభ వించు వ్యాధులన్నియు నేర్పడును. వాతహరములైన సమస్త చికిత్సలు **హితములు.**

**శశిలేఖ :** జృంభా అనగా నోరు విచ్చుకొనుటతో శరీరము వంగుట అని అర్థము.

**మూ॥** పీన సాక్షి శిరోహృద్రుజ్మన్యాస్తంభారుచిభ్రమాః।
సగుల్మా బాష్పత స్తత్రస్వప్నో మద్యం ప్రియాః కథాః॥

**ప్రతిపదార్థము :** బాష్పతః=కన్నీటిని అడ్డగించుటవలన; పీనస=దుష్ట ప్రతిశ్యాయము; అక్షిరుక్=నేత్రబాధ; శిరోరుక్=శిరోవేదన; హృద్రుక్= గుండెనొప్పి;మన్యాస్తంభ=మన్యాస్తంభము;అరుచి=అరుచి;భ్రమాః=భ్రమలు; సగుల్మాః=గుల్మనుతోకూడ అనగా గుల్మముకూడ అని అర్థము; సంభవంతి= కలుగగలవు; తత్ర = అచట; స్వప్నః = నిద్ర; మద్యం = మద్యము; ప్రియాః కథాః=ఇంపైన కథలు: హితాః=హితములు;

**తాత్పర్యము :** కన్నీరు నాపినందున పీనసాది రోగములును గుల్మ మును కలుగును. అందు నిద్రయు మద్యము ప్రియమైన కథలు హితములు.

**శశిలేఖ :** పీనసమనగా ముక్కునుండి నీరుకారక నిండియుండుట.

**మూ॥** వినర్ప కోఠ కుష్ఠాక్షి కండూపాండ్వామయజ్వరాః।
సకాశ శ్వాస హృల్లాస వ్య గశ్వ ఠ థవో వమేః॥
గంఢూషధూమానాహారం రూక్షం భుక్త్వా తదుద్వమః।
వ్యాయామః స్రుతిరస్రస్యశస్తం చాత్ర విరేచనమ్ః
సక్షారలవణం తైల మభ్యంగార్థేచశస్యతే॥

ప్రతిపదార్థము ; వమేః రోధాత్ = వాంతినాపుటవలన; విసర్ప = విసర్పము; కోఠ = నల్లనిమచ్చలు; కుష్ఠః = కుష్ఠము; అక్షి = నేత్రవ్యాధి; కండూ = దురద; పాండ్వామయ = పాండురోగము; జ్వరాః = జ్వరములు; సకాస = దగ్గు, శ్వాస = ఉబ్బసము; హృల్లాస = ఓకరింతలు, వ్యంగ = వ్యంగము; శ్వయథవః = వాపులు; సంభవంతి = కలుగుచున్నవి; అత్ర = ఇచట; గండూషధూమాన్ = గండూషము (పుక్కిలి పట్టుట); ధూమాన్ = ధూమములను; రూక్షం = జిడ్డులేని (గరగర లాడుచున్న); ఆహారం = ఆహారమును; భుక్త్వా = భుజించి; తదుద్వమః = వమనము చేయించవలయును; వ్యాయామః = వ్యాయామము; అస్రస్య స్రుతిః = రక్తమోక్షణము; విరేచనం = విరేచనము; శస్తం = ప్రశస్తమైనది; అభ్యంగార్థే = అభ్యంగస్నానముకొరకు; సక్షారలవణం = క్షారలవణములతో కూడిన; తైలం = తైలము (నువ్వులనూనె); శస్యతే = చెప్పబడుచున్నది.

తాత్పర్యము : వాంతి నాపుటవలన విసర్పము, శరీరముపైన వాపుతో కూడిన ఎరుపు నలుపుమచ్చలు ఏర్పడుట, నేత్రవ్యాధులు, పామా విచర్చికా మొదలగు క్షుద్ర కుష్ఠముల వలన శరీరమునందు దురద, పాండురోగము, జ్వరములు, దగ్గు, వుబ్బసము, ఓకరింతలు, ముఖముపైన నల్లని మచ్చలు కలుగును. ఇట్లుసంభవించినపుడు దీనినాపుటకు పుక్కిలి పట్టుట, పొగవేయుట, త్రాగుట (ధూమపానము), విరేచనమున కిచ్చుట ప్రశస్తమైనది. జిడ్డులేని ఆహారమును భుజించి దానిని వాంతి చేయించ వలయును. మరియు వ్యాయామము, ఉపవాసము, రక్తమోక్షణము చేయుట, విరేచనము చేయించుట ప్రశస్తమైనది. క్షారలవణములతో కూడిన తైలమును అభ్యంగనము కొరకుపయోగించ వలయును.

శశిలేఖ : కోఠః అనగా నల్లనిమమచ్చలని అర్థము. స్నిగ్ధుడైన వానికి కఫమును వెలిపరచుట సులభమైనదిగా నుండుసు. రూక్షాన్నమును భుజింపచేసి వాంతి చేయించిన యెడల ప్రకోపించిన ప్రాణవాయువు తిరిగి తన స్థానమును చేరుకొనును. మరియు వ్యాయామము రక్తమోక్షణము చేయించుట మొదలగు చికిత్సలు ఉపద్రవశామకము లగును.

మూ॥ శుక్లాత్తత్స్రవణం గుహ్యావేదనాశ్వయథుజ్వరాః।
హృద్వ్యథామూత్ర సంగాంగభంగ వృద్ధ్యశ్మషండతాః॥
తామ్రచూడ సురాశాలి వస్త్యభంగావగాహనమ్।
బస్తిశుద్ధికరైః సిద్ధం భజేత్ క్షీరం ప్రియాస్త్రియః॥
తత్ర సేవేత.

ప్రతిపదార్థము : శుక్లాత్ = శుక్లము నడ్డగించుటవలన, తత్స్రవణం = శుక్లము స్రవించుట; గుహ్యావేదనా = శిశ్నమునందుబాధ; శ్వయథు = వాపు; జ్వరాః = జ్వరములు; హృద్వ్యథా = గుండెపోటు; మూత్రసంగ = మూత్రావ

రోధము; అంగభంగ=శరీరము పగులగొట్టి నట్లుండుట; వర్ధ్మ=అండకోశము నందు బాధ; అశ్మ=అశ్మరి; షండతాః=నపుంసకత్వములు; జాయన్తే= కలుగుచున్నవి; తత్ర=అచట; తామ్రచూడ = కోడి మాంసము; సురా = మద్యము; శాలి=ఎఱ్ఱరాజనాలు; వస్తి=వస్తి; అభ్యంగ=అభ్యంగము; అవగాహనమ్=అవగాహనము; బస్తి శుద్ధి కరైః = చేదుదోస మొదలగు వాటిచేత చేయపడినబస్తిశుద్ధి చేయునట్టి; క్షీరం=పాలనను; భజేత్ =సేవించవలయును; ప్రియాః=ఇష్టులైన; స్త్రియాః=స్త్రీలను; సేవేత=సేవించవలయును.

**తాత్పర్యము :** వీర్యము నడ్డగించుట వలన కలుగువ్యాధులు మరియు చికిత్సా-వీర్యము నడ్డగించుటవలన వీర్యస్రావము, గుహ్యావేదన (శిశ్నమునందు బాధ), వాపు, జ్వరములు, హృదయమునందు బాధ, మూత్రావరోధము, శరీరము నందంతట విరిగినట్లు బాధ, అండకోశమునందు బాధ, అశ్మరీ నపుంసకత్వము ఏర్పడును. వీటిని శాంతింపజేయుటకు కోడిమాంసము, శాలి ధాన్యముతో భోజనము, అవగాహనము, వస్తి ప్రదేశమును శుద్ధిచేయునట్టి చేదుదోస కూష్మాండము మొదలగు ద్రవ్యములచేత సిద్ధము చేసిన పాలను త్రాగుట, తమకింపైన వనితలతో రమించుట చేయవలయును.

**శశిలేఖ :** షండతా అను శబ్దమునకు స్త్రీనిపొందుట కశక్తతయని, అర్థము. వస్తిని సిద్ధపరచు చేదుదోస మొదలగువాటిచేత సిద్ధముచేసిన పాలను సేవించుట చేయవలెను.

**మూ॥** సర్వంచ వర్జయే ద్వేగ ధారిణమ్।
విడ్వామినం పరిక్లిష్టం క్షీణం తృట్ఛూల పీడితమ్॥

**ప్రతిపదార్థము :** విడ్వామినం=మలము వాంతి చేసుకొనువానిని; పరిక్లిష్ట=మిక్కిలి ఆయాసముతో నున్నవానిని; క్షీణం=కృశించినవానిని; తృట్శూలపీడితమ్=దప్పినొప్పులతో బాధపడువానిని, ఇట్టి; వేగధారిణం= వేగముల్ను ధరించువానిని; సర్వంచ=వీరందరిని; వర్జయేత్ =వదలివేయవలెను; చికిత్సకు అనర్హులని భావము.

**తాత్పర్యము :** మలమును వాంతిచేసుకొనువాడు, మిక్కిలి ఆయాసమును పొందినవాడు, కృశించినవాడు, దప్పినొప్పులతో బాధపడు వాడును అయిన వాతాది వేగముల నడ్డగించు వారినందరిని చికిత్సానర్హులుగా భావించి వదలి వేయవలెను.

**శశిలేఖ :** వేగము నడ్డగించు వారందరికి చికిత్స చేయరాదు.

**మూ॥** రోగాః సర్వేఽపి జాయన్తే వేగోదరణ ధారణైః।

**ప్రతిపదార్థము :** రోగాః సర్వేఽపి = రోగములన్నియు; వేగోదరణ

ధారణైః = వాతాదుల యొక్క అప్రాప్తవేగమును సృష్టించుట వలనను (బలాత్కారముగ) ప్రాప్తమైన వేగమును నిరోధించుట వలనను; జాయన్తే = కలుగుచున్నవి.

**తాత్పర్యము :** వాతాదుల యొక్క అప్రాప్తవేగములను బలాత్కారముగ వెలిపరచుటచేతను, ప్రాప్తవేగముల నడ్డగించుటచేతను వ్యాధులన్నియు ఏర్పడును.

*శశిలేఖ :* వేగముల నడ్డగించుటచేత సంభవించు వ్యాధులను విపులీకరించి వాతాది వేగములను బలాత్కారముగా వెలిపరచుటచేత కలుగు వ్యాధులను చెప్పుచున్నాడు. అట్లయిన యెడల ధారణ శబ్ద ప్రయోగమిచట చేయనక్కరలేదు. ఎందుకనగా ఉదీరణము (బలాత్కారముగా వెలిపరచుట) చేతనే సర్వరోగములు కలుగుచున్నవి. ఉదీరణము చేతనే ధారణమునందు చెప్పబడిన రోగములయొక్క పుట్టుక కలుగు చున్నందున ఆ భావమును తొలగించుటకు ఇచట ధారణ అను పదము గ్రహించ బడినది.

**వి.వ్యా :** మలమూత్రాది వేగములు సాధారణముగ బహిర్గతము కాకుండు నపుడు బలవంతముగా వెడలింపచేయుట, ధారాళముగ వచ్చు నపు డడ్డగించుట ఈ రెంటిచే మానవులకు సమస్తవ్యాధులు కలుగును. మలాదులను బహిర్గతము చేయుట లేక నిరోధించుట అను నీరెండును వాత కృత్యములు. "విట్ శ్లేష్మ పిత్తాది మలాయనానాం విక్షేప సంహార కరస్సయస్మాత్" అని చెప్పుట వలన. కావున వేగములను బలాత్కారముగ బహిర్గతము చేయుట,లేక నిరోధించుట చేతను వాతము ప్రకోపించి వ్యాధులన్నింటిని కలిగించును. కావున వేగ రోధము, వేగ ఉదీరణము ఈ రెండును ప్రమాద హేతువులగుచున్నవి.

మూ॥ నిర్దిష్టం సాధనం తత్ర భూయిష్ఠ యేతు తాన్ ప్రతి।
తత శ్చానేకధా ప్రాయః పవనోయ త్ప్రకుప్యతి।
అన్న పానౌషధం తస్య యుంజీతా తోఽనులోమనమ్॥

**ప్రతిపదార్థము :** తత్ర = వేగధారణ ఉదీరణములలో; భూయిష్ఠం = అధికముగా; యేతు = ఏ వ్యాధులు కలుగుచున్నవో; తాన్ ప్రతి = వాటిని గురించి; సాధనం = చికిత్స; నిర్దిష్టం = చెప్పబడినది; తతః = ఉదీరణమువలన; ప్రాయః = తరచుగా; అనేకధా = పలువిధములుగా; పవనః = వాతము; యత్ = ఎందువలన; ప్రకుప్యతి = కోపము చెందుచున్నదో; అతః = అందువలన; తస్య = ఆవాతమునకు; అనులోమనమ్ = అనులోమనము చేయునట్టి; అన్నపానౌషధమ్ = అన్నము, పానము, ఔషధమును; యుంజీత = ఉపయోగించవలయును.

**తాత్పర్యము :** మలమూత్రాది వేగములను నిరోధించుటవలన సంభవించు నట్టి సమస్తవ్యాధులయందు గుల్మోదావర్తాది రోగములకు వర్తి · అభ్యంగము

మొదలగు చికిత్సలు వెనుక చెప్పబడినవి. అయినప్పటికిని ప్రధానముగా మల మూత్రాదుల నడ్డగించుట వలన వాతము ప్రకుపితమై అనేకరోగములను కలుగ జేయును. కావున ప్రకోపించిన వాతమును శమింపజేసి అనులోమ గతిని కలుగజేయు అన్నపానౌషధములను సేవించవలయును.

**శశిలేఖ :** మలాదివేగములను బలాత్కారముగా వెలిపరచుట, అడ్డగించుటవలన వ్యాధులన్నియు కలుగునని చెప్పినను మలమూత్రాదులను నిరోధించుటచే (ధారణముచే) ఎటువంటి కఠినమైన దారుణమైన దీర్ఘకాలికములైన వ్యాధులు పుట్టునో అట్టివ్యాధులు వానిని బలాత్కారముగా వెలిపరచుట వలన కలుగనేరవు. కావున వానికి విశేషించి చికిత్సలు చెప్పలేదు. వేగధారణము కంటె వేగఉదీరణమున వాయువే ప్రకోపించుచున్నందున అట్టివాతమునకు అనులోమగతిని కలిగించు అన్నపాన ఔషధములు హితములు.

మూ॥ **పాయుమేహనముష్కేషు శూలం శోషోహృదివ్యథా ।**
**తేషు తేషు వికారేషు యథాస్వంచ చికిత్సితమ్ ॥**

**ప్రతిపదార్థము :** పాయుమేహన ముష్కేషు = గుదము, శిశ్నము, వృషణములు-వీటియందు; శూలం = నొప్పి; శోషః = క్షయరోగము; హృది వ్యథా = హృదయమునందు నొప్పి (గుండెపోటు); సంభవంతి = కలుగుచున్నవి; తేషు తేషు వికారేషు = ఆయా వ్యాధులయందు; యథాస్వంచ = తగినట్లుగా; చికిత్సితమ్ = చికిత్స; కార్యం = చేయదగినది.

**తాత్పర్యము :** గుద శిశ్న వృషణములయందు నొప్పి క్షయరోగము గుండెపోటుకలుగును. వాటికి అనురూపమైన చికిత్సలుచేసి శాంతింవ జేయవలెను.

మూ॥ **క్రమాదపామపిమణౌ పంకోఽవశ్యం భవత్యతః।**
**ఉత్తిష్ఠేత యథాకాలం మలానాం శోధనం ప్రతి॥**

**ప్రతిపదార్థము :** క్రమాత్ = క్రమముగా; అపామపి = నీటికిని; మణౌ వపి = మణియందును; పంకః = బురద; అవశ్యం = తప్పని సరిగా; భవతి = కలుగు చున్నది; తతః = అందువలన; యథాకాలం = కాలము నతిక్రమించక; మలానాం శోధనం ప్రతి = వాత పిత్త శ్లేష్మల యొక్క శోధనమును గురించి; ఉత్తిష్ఠేత = లేవ వలయును అనగా ప్రయత్నించవలయును.

**తాత్పర్యము :** నిర్మలమైన మణియందును, స్వభావ నిర్మలములై కాగులోనున్న నీళ్ళయందును, కాలపరిపాకమువలన ఎట్లు బురద ఏర్పడునో ఆవిధముగా వాత పిత్త శ్లేష్మ పురీషమూత్రాదిమలములు స్వస్థానమునందు చయావస్థను చెంది మిథ్యాహార విహారముల వలన ప్రకోపించి ఒకానొక సమయమున మానవుని చంపగలవు. కావున ఆయా మలములకు యుక్తమైన కాలమున శోధించుటకై ప్రయత్నించవలెను. శరీరమునందు మలములధికముగ వృద్ధి

చెందినపుడు వాటికి సరియగు చికిత్స శోధనరూపమైన చికిత్సయే పరమోత్కృష్ట మైనది.

*శశిలేఖ :* ఆరోగ్యమును కాపాడుటకు వ్యాధుల నుపశమింపజేయుటకు చెప్పబోవు విషయమున క్రమాత్ అను పదముతో ప్రారంభించుచున్నాడు. నిర్మలమైన మణియందును కాగులోనున్న నీళ్ళయందును కాలాంతరమున బురద ఏర్పడునట్లు ఋతు చర్యను సమర్థవంతముగ పాటించుచున్నను దోషములకు చయావస్థ ఏర్పడును. అందువలన శోధనకాలమును అతిక్రమించక వాత పిత్త శ్లేష్మల శోధనరూపమైన చికిత్స అవశ్యము చేయుటకు ప్రయత్నించవలెను.

శ్లో॥ చయకాకాష్ఠాము పారుహ్యా కుర్వతే తేహ్యుపేక్షితాః ।
ప్రాయశః సుచిరేణాపి భేషజద్వేషిణోగదాన్ ॥
అతిస్థౌల్యాగ్ని సదనమేహా కుష్ఠహృతాజసః ।
స్రోతో రోధాక్ష విభ్రంస శ్వాస శ్వయథు పాండుతాః ॥
ఆమోరు స్తంభ జఠర కుచ్ఛ్రాల సక దండకాన్ ।
ఛర్ది గండ కృమి గ్రన్థి తన్ద్రా దుస్వప్న దర్శనమ్ ॥
కంఠామయాన్ మూర్ధరుజం ప్రణాశంబుద్ధినిద్రయోః।
తేజో వర్ణ బలానాంచ తృప్యతో బృంహణైరపి ॥
ఉచితైరపి చాఽహారై ర్యస్మాదస్య వహన్తినః।
దోషోప లిప్త వదనా రసం రసవహాః సిరాః॥
వమనాదీన తోయుఞ్జ్యాత్ స్వస్థ స్యైవ యథావిధి।
దోషాః కదాచిత్ కుప్యంతి జితాలింఘన పానసైః॥
యేత సంశోధనైః శుద్ధాః నతేషాం పునరుద్భవః।
యథాక్రమం యథాయోగమత ఊర్ధ్వం ప్రయోజయేత్॥
రసాయనాని సిద్ధాని వృష్య యోగాంశ్చ కాలవిత్।

*ప్రతిపదార్థము :* తేహి=ఆ వాతపిత్త శ్లేష్మములు; చయకాష్ఠాముపారుహ్యా=స్వస్థానము నందు వృద్ధిపొంది; ఉపేక్షితాస్సంతః=నిర్లక్ష్యము చేయబడినవై ; ప్రాయశః=తరచుగా: సుచిరేణాపి=చాలా కాలమైనప్పటికిని; భేషజద్వేషణః=చికిత్సను ద్వేషించువానికి; గదాన్=వ్యాధులను; కుర్వతే= చేయు చున్నవి. (కలుగజేయు చున్నవి); అతి-నిద్రయోః – అతిస్థౌల్యము, అగ్ని మాంద్యము, ప్రమేహము, కుష్ఠము, అభిన్యాసమను పేరు, సన్నిపాత జర్వము, రసరక్తాది ధాతువులను ధరించు స్రోతస్సుల యొక్క అవరోధము (స్రోతరోధము); ఇంద్రియ వినాశము, ఉబ్బసము, వాపు, పాండు రోగము, ఆమము, ఊరు స్తంభము, యకృత్ప్లీహోదరాదులు, కడుపుకుట్టు, అలసకము, దండాలసకము, వాంతి, గలగండము, క్రిమిరోగము, గ్రన్థి, జాడ్యము, చెడ్డకలలు వచ్చుట, కంఠరోగములు, శిరోవేదన, బుద్ధి నాశము, నిద్రానాశము—ఈ వ్యా

ధులు కలుగ గలవు; బృంహణైః=బలమును చేకూర్చు నట్టి; ఉచితైః=సాత్మ్య ములైన; ఆహారైశ్చ=ఆహారములచేత కూడ; తృప్యతోఽపి=తృప్తిపొందు చున్నవానికి కూడ; తేజో వర్ణ బలానాం నాశః=తేజస్సు, వర్ణము, బలము-వీటి యొక్క నాశము కలుగును; యస్మాత్=ఏకారణము వలన; అస్య=ఇత నికి; రసవహాః=రస ధాతువును వహించు; సిరాః=సిరలు (దుష్ట రక్తమును ధరిం చునవి); దోషోప లిప్తవదనాః=వాతపిత్త శ్లేష్మములను దోషములచేత పూయబడిన ముఖములు గలవై; రసం=రసధాతువును; నవహన్తి=ధరించవో; అతః=అందువలన; స్వస్థస్యైవ=ఆరోగ్యవంతుడైన వానికన్న: యథా విధి= శాస్త్రప్రకారము; వమనాదీన్=వమనము విరేచనము ఆస్థాపనము అనువాస నము, నస్యమును పంచకర్మలను, యుంజ్యాత్=చేయ వలయును (ప్రయోగించ వలయును); లంఘనపాచనైః=లంఘుపాచన రూపమైన చికిత్సల చేత; జితా స్సంతః=జయింపబడినవైనప్పటికిని; దోషాః=వాతపిత్త శ్లేష్మములు; కదా చిత్=ఒకానొకప్పుడు; కుప్యంతి=ప్రకోపించుచున్నవి; యేతు=ఏవాతపిత్త శ్లేష్మములైతే; సంశోధనైః=వమనాది శోధన చికిత్సల చేత; శుద్ధాః=శుద్ధము లగునో; తేషాం=ఆదోషములకు; పునరుద్భవః=మరల పుట్టుక: న=లేదు; అత ఊర్ధ్వం=సంశోధనాంతరము; సిద్ధాని=తయారైన; రసాయనాని=బ్రాహ్మీ ఆమలకీ మొదలగు రసాయనములను; వృష్యయోగాంశ్చ=ధాతువృద్ధికరము లైన యోగములనుకూడ; కాలవిత్=చికిత్సాకాలజ్ఞుడైన వైద్యుడు; యథా క్రమం=శాస్త్రానిరోధముగా; యథాయోగం=వ్యాధికి తగినట్లుగా; ప్రయో జయేత్ = ప్రయోగించవలయును

**తాత్పర్యము:** వమన విరేచనాది శోధన చికిత్సలను ద్వేషించు మాన వుల వలన ఉపలక్షింపబడిన వాతపిత్తశ్లేష్మలు తమతమ స్థానములయందే; వృద్ధి చెంది కాలాంతరము నందు అతిస్థౌల్యము, ప్రమేహము, అభిన్యాసమును సన్నిపాతము మొదలగు వ్యాధులను కలిగించును. బలకరములై ఓకసాత్మ్య ములైన పథ్యకరములైన ఆహారాదులచేత తృప్తిని పొందినవానికి కూడ తేజస్సు, వర్ణము, బలము మొదలగు వాటికి నాశమేర్పడును. ఏ కారణము వలన రసదాతువును వహించు దుష్టరక్త వాహకములైన సిరలు వాతపిత్తశ్లేష్మ లను మూడు దోషములచేత పూయబడిన ముఖములు గలవై రసధాతువును ధరించవో అందువలన ఆరోగ్యవంతునికి కూడ శాస్త్రప్రకారము వమనాది పంచ కర్మలను ఆయా నిర్దిష్ట కాలములలో చేయవలయును. లంఘన పాచనాదులచే శుద్ధిని పొందిన వాతపిత్త శ్లేష్మలు ఒకానొకప్పుడు ప్రకోపించును. వమనము విరేచనము మొదలగు శోధన చికిత్సలతో శుద్ధి చేయబడిన వాతాదులు ఎప్పు డును ప్రకోపమును చెందవు. కావున లంఘన పాచనాది చికిత్సలకంటె శోధన రూపమైన వమనాదులనే చేయవలయును. దూష్యము దేశము బలము కాలము జాఠరాగ్ని మొదలగు వానిని చక్కగా గుర్తించిన వైద్యుడు అనుభవసిద్ధమైన

రసాయనములను శాస్త్రమునందు చెప్పబడిన ప్రకారము వమనాది పంచవిధ క్రియల వలన మరల శరీరమును శుద్ధిచేసి వాజీకరణములైన వృష్యయోగములను చేయవలయును.

*శశిలేఖ* : హృతౌజమ్ శబ్దము పుంలింగము. సన్నిపాత జ్వరమునకు పర్యాయము. (సన్నిపాతము భిన్న్యాసం తంత్రబ్రూయాచ్చ హృతౌజసం) అక్షి విభ్రంశమనగా చక్షుశ్శ్రోత్రాది ఇంద్రియ నాశమని అర్థము. అలసకము దండకము ఇవి ఉత్తరోత్తర లక్షణసహితముగ చెప్పబడగలవు. తృప్తిః=భుజింపక పోయినప్పటికిని భుజించునట్లనుకొనుట (ప్రమీలకం=స్తైమిత్యం, అనగా స్తబ్ధత యని అర్థము. అమ్ల పిత్తమున కిది మరియొక పేరని చెప్పుచున్నారు. "పచ్యమానంవిదాహ్యాన్నం రక్తాదీన్ కోపయేద్యదాయే పిత్తంచ కోపయేదాశు కఫస్థానాని వేదితమ్, తదాభవతి హృచ్ఛూలముఖవైరస్య సాదనమ్, లవణం తిక్తమమ్లంచ సతతం ఛర్దయత్యపి, దాహోఽతి నిద్రావిట్సంగోవైవర్ణ్యం కార్శ్యమేవచ, అరోచకోహ్యుచ్ఛికితా ప్రసేకః శ్లేష్మణస్తథా, సర్వత్రైతాని లింగాని నిర్దేశేత్ తత్ ప్రమీలకమ్ । పర్యాయాదమ్లపిత్తంచ తథాపిత్తవిషూచికే" పాకమును పొందుచున్న అన్నమును దహించి రక్తాదులను ప్రకోపింపచేయును. కఫస్థానమైన హృదయమున నున్న వాయువుచేత ప్రేరితమైన పిత్తముకూడ ప్రకోపమును చెందును. అప్పుడు గుండెనొప్పి, నోటికి రుచి తెలియకపోవుట, అగ్నిమాంద్యము, అరోచకము, కఫస్రావము (నోట కఫము స్రవించుట) మొదలగు లక్షణములు ఏర్పడును. దీనినే ప్రమీలక మందురు. పై నుదోహరించిన వ్యాధులకన్న, యీ వ్యాధి ఆహారము చేయకపోయినను సంభవించును. దీనినే పిత్త విషూచిక, అమ్ల పిత్తము అనికూడ అందురు. ఇది చాల భయంకరమైన వ్యాధి.

మూ॥ భేషజ క్షపితే పథ్యమాహారైర్బృంహణక్రమాత్॥
శాలిషష్టిక గోధూమ మాంసక్షీర ఘృతాదిభిః।
హృద్యదీప భైషజ్య సంయోగాద్రుచి పంక్తిదైః॥
సాభ్యంగోద్వర్తన స్నాన నిరూహస్నేహవస్తిభిః।
తథాసలభతే శర్మ సర్వపావక పాటవమ్॥
ధీవర్ణేంద్రియ వైషమ్యం వృషతాం దైర్ఘ్యమాయుషః।

**ప్రతిపదార్థము** : భేషజక్షపితే=అనేక ఔషధ ప్రయోగములవలన కృశించిన శరీరమునందు; ఆహారైః=బలకరములైన ఆహారములచేత; బృంహణం=పుష్టిని చేకూర్చుట; పథ్యం=హితమైనది; క్రమాత్=వరుసగా; శాలి=శాలి ధాన్యము; షష్టిక=షష్టిక ధాన్యము (అరువది రోజులలో తయారగు పంట); గోధూమ=గోధుమలు; మాంస=మాంసము; క్షీర=పాలు; ఘృతాదిభిః=నెయ్యిమొదలగు వాటితో; హృద్య=మనసున కింపైనదియు; దీపన=అగ్నివృద్ధికరమైన; భైషజ్యసంయోగాత్=ఔషధముల యోజనవలన; రుచి

పంక్తిదైః = రుచిపాకములను కలుగజేయునట్టి వాటిచేత; సాభ్యంగ = అభ్యంగనముతోను; ఉద్వర్తన = మర్దనముతోను కూడిన; స్నాన = స్నానము; నిరూహ = కషాయవస్తి; స్నేహవస్తిభిః = స్నేహవస్తువుల చేతను; సర్వపావకపాటవమ్ = సమస్తమైన జాఠరాగ్ని పటుత్వమును; శర్మ = సుఖమును; ధీవర్ణేంద్రియ వైమల్యం = బుద్ధివర్ణము ఇంద్రియములు వీటికి కలుషరాహిత్యమును; వృషతాం = వాజీకరణమును; తథా = అట్లే; ఆయుషః = జీవితముయొక్క; దైర్ఘ్యం = సమృద్ధిని; సః = వాడు; లభతే = పొందగలడు.

తాత్పర్యము : శోధనాదులచే శుద్ధిచేయబడిన రోగికి అభ్యంజనము స్నానము నిరూహ అనువాసన వస్తువులు మొదలగువానిని చేయించి మనోహరములు దీపనకరద్రవ్యములు మొదలగువానితో రుచినిజీర్ణమును కలుగజేయునట్టి పథ్యకరమైనశాలి, షష్టికధాన్యములు, గోధుమలు, మాంసము, నెయ్యిమొదలగు బలకరమైన యాహారములచే యథాక్రమముగా శరీరమునకు బలమును కలుగజేయవలయును. దీనివలన జాఠరాగ్ని పటుత్వమును, ధీవర్ణేంద్రియ వైమల్యమును వాజీకరణమును సుఖమును దీర్ఘాయుస్సునుగూడ అతడు పొందగలడు.

శశిలేఖ : అనేక ఔషధప్రయోగములచేత కృశించిన శరీరమునందు ఆహారములచేతనే క్రమముగ బలమును చేకూర్చుట హితము. సర్వపావక పాటవం అనగా జాఠరాగ్ని ధాత్వగ్నులయొక్క పటుత్వమని భావము.

మూ। యేభూతవిషవాయ్వగ్ని క్షతభంగాది సంభవాః॥
కామక్రోధ భయాద్యాశ్చ తే స్యురాగన్తవోగదాః।

ప్రతిపదార్థము : యే = ఏవైతే; భూత = భూతప్రేతాదులు; విష = విషము; వాయు = గాలిసోకుడు; అగ్ని = అగ్ని; క్షత = దెబ్బ; భంగాది = విరుగుడు మొదలగు వాటిచేత; సంభవాః = పుట్టునటువంటి; కామక్రోధ భయాద్యాశ్చ = కామము, క్రోధము, భయము మొదలగునవి కలవో; తే = అవి; ఆగన్తవః = ఆగన్తుకములైన; గదాః = వ్యాధులుగా; స్యుః = అగుచున్నవి.

తాత్పర్యము : భూతములు, విషము, వాయువు, అగ్ని, గాయము; అవయవములు విరుగుట మొదలగు వానివలన సంభవించిన జ్వరాది రోగములును, కామ క్రోధ లోభ మోహాదులును ఆగంతుక రోగములనబడును.

శశిలేఖ : నిజరోగములనగా వాతపిత్త శ్లేష్మలవలన జనించువ్యాధులు వాటికి చికిత్సలు చెప్పిన తరువాత ఆగంతుక వ్యాధులు, వాటి చికిత్సలను చెప్పుట కుపక్రమించుచున్నాడు. భూతాదులచేత సంభవించువ్యాధులు రాగాదులు ఆగంతుక రోగములుగా పేర్కొనబడుచున్నవి.

మూ॥ త్యాగః ప్రజ్ఞా పరాధానా మిన్ద్రియోపశమః స్మృతిః ॥
దేశ కాలాత్మ విజ్ఞానం సద్వృత్తస్యానువర్తనం ।
అధర్వవిహితా శాన్తిః ప్రతికూల గ్రహార్చనమ్ ।
భూతాద్య స్పర్శనోపాయో నిర్దిష్టశ్చ పృథక్ పృథక్ ।
అనుత్పత్త్యై సమాసేన విధిరేషః ప్రదర్శితః ॥
నిజాగంతు వికారాణాముత్పన్నానాంచ శాంతయే।

ప్రతిపదార్థము : ప్రజ్ఞాపరాధానాం=శాస్త్ర విహితనిత్యకర్మానుష్ఠానములయొక్క; త్యాగః=త్యాగము (ఇదియే బుద్ధి పూర్వకముగా చేయు అపరాధము); ఇంద్రియోపశమః=మనస్సు మొదలగు ఇంద్రియములను జయించుట; స్మృతిః=అనుభూత పదార్థ జ్ఞానము, దేశకాలాత్మవిజ్ఞానం—దేశ=జాంగల ఆనూప సాధారణ దేశముల యొక్క; కాల=శీతాది కాలములయొక్క; ఆత్మ=వాతాది ప్రకృతులయొక్క; విజ్ఞానం=విశేషజ్ఞానము; సద్వృత్తస్య=సత్పురుషులను;అనువర్తనం = అనుసరించియుండుట;అధర్వ విహితా శాంతిః = అధర్వ వేదోపదిష్టమైన శాంతిప్రయోగము; ప్రతికూల గ్రహార్చనం=ప్రకృతోపద్రవమునకు కారకుడుగా చెప్పబడు గ్రహమునకువిరుద్ధగ్రహమును అర్చించుట; పృథక్, పృథక్ = వేరువేరుగా; భూతాద్య స్పర్శనోపాయః=భూతాది తాకిడి లేకుండుటకు ఉపాయముగా; నిర్దిష్టశ్చ=నిర్దేశింపబడియున్నది; ఉత్పన్నానాం=సంభవించినటువంటి; నిజాగంతు వికారాణాం = నిజఆగంతు రోగములయొక్క శాంతయే = ఉపశమనము కొరకు; అనుత్పత్త్యైచ=రాకుండుట కొరకు; సమాసేన =సంగ్రహముగ; ఏషవిధిః=ఈక్రమము; ప్రదర్శితః=చూపెట్టబడినది.

తాత్పర్యము ; నిజాగంతుక వ్యాధులయొక్క :పరిహారార్థము ఁ అట్టి వ్యాధులు రాకుండుటకును సంగ్రహముగ ఈక్రమము ఆచార్యుచేత నిర్దేశింపబడినది. ఆక్రమమేమనగా ప్రజ్ఞాపూర్వకమైన అపరాధమును చేయకుండుట, ఇంద్రియ నిగ్రహము, అనుభూత పదార్థజ్ఞానము, దేశకాలాది విజ్ఞానము, సచ్ఛీలము, అధర్వవేద విహిత శాంతి ప్రయోగము, ప్రకృతరోగ కారకుడైన గ్రహమునకు ప్రతికూలమైన గ్రహమును పూజించుట ఇవన్నియు యథాక్రమముగా నిజాగన్తు రోగములకు పరిహారముగా నున్నవి.

శశిలేఖ : ప్రజ్ఞాపరాధమనగా దిన చర్యయందు చెప్పబడిన విధిని అతిక్రమించుట యని అర్థము. దేశకాల ఆత్మవిజ్ఞానములను ఆకళించుకొనుటవలన మనస్సు నిర్మలమగును. దేశకాలాత్మ విజ్ఞానమనగా తాను పుట్టిన దేశమును తెలిసికొనుట, దేశమును పురస్కరించి ఆ దేశమునందు ఏది ఆచరించవలయును, ఏది ఆచరించరాదు, తన స్వభావాదులను తెలిసికొనుట, కాలాదులనుబట్టి తదనుగుణముగా క్రియలనాచరించుట, ఇట్టి కల్పనా ప్రకారములు భూతప్రేత పిశాచాదుల తాకిడి లేకుండుటకు ఉపాయము భూత విద్యలో ఉటంకించబడినది.

మరియు ఆ భూతములు కొన్ని ఆవేశించి యుండును. కొన్ని మానవుని చంపు నని చెప్పబడియున్నది.

మూ॥ శీతోద్భవం దోషచయం వసన్తే
విశోధయన్ గ్రీష్మజ మభ్రకాలే
ఘనాత్యయే వార్షిక మాశు సమ్యక్
ప్రాప్నోతి రోగానృతుజాన్ నజాతు॥

అర్థములు : శీతోద్భవం = హేమంత శిశిర ఋతువులయందు జనించిన. దోషచయంయ = వాతపిత్త శ్లేష్మలను దోష సమూహమును; వసన్తే = వసంత ఋతు ప్రారంభమునందు; గ్రీష్మజం = గ్రీష్మఋతువునందు జనించిన; దోష చయం = దోషములను; అభ్రకాలే = వర్షాకాల ప్రారంభమునందు; వార్షికం = వర్షాకాలమునందు జనించిన; దోషచయం = దోషములను; ఘనాత్యయే = (వర్షాకాలము గడిచిన పిదప) శరత్కాలమునందు (కార్తీకమాసమునందు); ఆశు = త్వరగా; సమ్యక్ = బాగుగా; విశోధయన్ = శోధించుచూ; ఋతు జాన్‌రోగాన్ = ఆయా ఋతువులందు కలుగు రోగములను; జాతు = ఎప్పుడు గూడ; ప్రాపోన్నతి = పొందడు.

తాత్పర్యము : హేమంత శిశిర ఋతువులయందు జనించిన దోషములను వసంత ఋతు ప్రారంభమునందు అనగా చైత్రమాసమునందే శోధించవలయును. గ్రీష్మఋతువునందు జనించిన దోషములను వర్షాకాల ప్రారంభమున శోధించవలయును. వర్షాకాలమునందు జనించిన దోషములను శరత్కాలము నందు శోధించవలయును. ఇట్లు ఆయా ఋతువులయందు జనించిన దోషముల నాయా కాలములయందు తప్పక బాగుగా శుద్ధిచేసికొనిన పురుషుడు ఆ యా ఋతు సంబంధము వలన కలిగిన రోగముల నెపుడును చెందకుండును (బాధ పడడు).

శశిలేఖ : దోషాదులయొక్క శోధన ప్రకారము చెప్పబడినది. దానికి కాలమిపుడు చెప్పబడుచున్నది. శీతోద్భవమని, సాధారణ కాలముల యందు దోషములను పరిహరించుకొనుచు ఆయా ఋతువులలో జనించు వ్యాధులను పొందడు.

మూ॥ నిత్యం హితాహార విహార సేవీ
సమీక్ష్యకారీ విషయే ష్వసక్తః
దాతాసమః సత్యపరః క్షమావా
నాప్తోపసేవీచ భవత్యరోగః॥

ప్రతి పదార్థము : నిత్యం = ఎల్లప్పుడును; హితాహార విహారసేవీ = పథ్యకరములగు ఆహార విహారములను సేవించువాడు; సమీక్ష్యకారీ = ఆలోచించిం

పనులను చేయువాడు; విషయేషు=ఇంద్రియ విషయముల యందు; అసక్తః= తగులుకొనని వాడు; దాతా=దానశీలుడు; సమః=సమదృష్టి కలవాడు; సత్యపరః=సత్యమునందే ఆసక్తి కలవాడు; క్షమావాన్=ఓర్పుగలవాడు; ఆప్తోపసేవీ=ఆప్తుల నాశ్రయించి యుండువాడు; అరోగః=రోగము లేని వాడుగా; భవతి=అగుచున్నాడు.

తాత్పర్యము : ఎల్లప్పుడు పథ్యకరములగు ఆహారవిహారములను సేవించువాడు. కామ క్రోధాది ఇంద్రియవిషయములందు తగులుకొననివాడు, సత్యపరుడు, సమదృష్టి కలవాడు, ఓర్పుగలవాడు, ఆప్తుల నాశ్రయించి యుండువాడు రోగ రహితుడుగా చెప్పబడు చున్నాడు.

మూ॥ అర్థేష్వ లభ్యేష్వ కృతప్రయత్నం
కృతాదరం నిత్యముపాయవత్సు
జితేంద్రియం నానుపతన్తిరోగా
స్తత్కాల యుక్తం యదినాస్తి దైవమ్ ॥

ప్రతిపదార్థము : అలభ్యేషు=అలభ్యములైన; అర్థేషు=అర్థముల (ధర్మార్థ కామ మోక్షముల) యందు; అకృత ప్రయత్నం=చేయని వానిని; ఉపాయవత్సు=ఉపాయ సాధ్యములైన విషయము లందు; నిత్యం=ఎల్లప్పుడు; కృతాదరం=ప్రయత్నశీలుని; జితేంద్రియం=ఇంద్రియములను జయించిన వానిని; తత్కాల యుక్తం=హీన మిథ్య అతియోగ రహితమైన కాలముతో కూడు కొన్నట్టి వానిని; దైవం యది నాస్తి=దుర్దైవము లేనియెడల; రోగాః= వ్యాధులు; నానుపతన్తి=రాకవు.

తాత్పర్యము : తనకు లభ్యములు కాని వస్తువులను గురించి ప్రయత్నము చేయని వానిని ప్రయోజనముతో కూడిన పనులయందు ఆసక్తుడైన వానిని ఇంద్రియములను నిగ్రహించువానిని దైవము అనుకూలముగ నుండు నపుడు రోగములు కలుగనేరవు. (ఏమియును చేయజాలవు. బాధించవని అర్థము).

శశిలేఖ : ఎవడైతే అనంత లాభములతో కూడిన అలభ్యములైన పురుషార్థములందు ప్రయత్నము చేయనివానిని ఉపాయముల సాధ్యములైన వాటియందు ప్రయత్నశీలుని, జితేంద్రియుని, ఆయా కాలముల యందు దైవ మనుకూలించిన యెడల రోగములు కలుగనేరవు.

మూ॥ కాలో౽నుకూలో విషయామనోజ్ఞా ।
ధర్మ్యాం క్రియాః కర్మసుఖాను బంధి ॥
సత్వం విధేయం విశదాచ బుద్ధి ।
ర్భవన్తి ధీరస్య సదాసుఖాయ ॥

*ప్రతిపదార్థములు :* ధీరస్య=ధీరపురుషునికి; సదా=ఎల్లప్పుడు; కాలః= కాలము; అనుకూలః=అనుకూలము; విషయాః=ఇంద్రియ విషయములైన అర్థములు; మనోజ్ఞాః=మనోహరములు; క్రియాః=కార్యములు; ధర్మ్యాః= ధర్మముతో కూడియుండునవి; కర్మ=వ్యాపారము; సుఖానుబంధి=ఇహ పరములయందు సుఖమును కలిగించునది; సత్వం=మనస్సు; విధేయం=తనకు లోబడినట్టిది; విశదా=నిర్మలమైన; బుద్ధిశ్చ=బుద్ధియు; సుఖాయ=సుఖము కొరకు; భవన్తి=అగుచున్నవి.

తాత్పర్యము : అనుకూలమైన కాలము, మనోహరములైన ఇంద్రియార్థములు, ధర్మముతో కూడియుండు వ్యాపారములు, తనకు లోబడియుండు మనస్సు, నిర్మలమైన బుద్ధి ఇవన్నియు ధీరపురుషునికి ఎల్లప్పుడు సుఖమును కలిగించును.

ఐదవ అధ్యాయము

సమాప్తము

---

# అష్టాంగ సంగ్రహ వ్యాఖ్యానము

## షష్ఠో౽ధ్యాయము

మూ॥ అథాతో ద్రవద్రవ్య విజ్ఞానీయమ్ నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః।
ఇతిహాస్మాఽఽహు రాత్రేయాదయో మహర్షయః

*ప్రతిపదార్థము :* అథ = తరువాత; అతః = ఇందువలన; ద్రవద్రవ్య విజ్ఞానీయమ్ = ద్రవద్రవ్యవిజ్ఞానీయమను; నామ = పేరుగల; అధ్యాయమ్ = అధ్యాయమును; వ్యాఖ్యాస్యామః = వివరించగలము; ఇతిహ = ఇట్లని; ఆత్రేయాదయోమహర్షయః = ఆత్రేయుడు మొదలుగాగల మహర్షులు; ఆహుస్మ = పలికిరి.

*శశిలేఖ :* ఆరోగ్యవంతులకు హితముగా నుండు విషయములు తెలియచేయు సందర్భమున అన్నపానములను చెప్పుచున్నారు. సంస్కరింపబడి ఉపయోగించు అన్నపానములను చెప్పునప్పుడు మొదట తోయమే చెప్పవలయును కాన మొదట తోయాదులను గురించియే చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** అన్నపానములు సంస్కరింపబడిన తర్వాతనే వాటి వుపయోగము జరుగుచున్నది. అన్నపానములలో ద్రవరూపమైన నీటికి ప్రాధాన్యత కలదు. నీరు లేనిదే ఘనపదార్థముల సంస్కారము వీలుపడదు. కాన మొదట నీటిని గురించియే వివరించుచున్నాము.

మూ॥ జీవనం తర్పణం హృద్యం హ్లాది బుద్ధి ప్రబోధనమ్ !
తన్వవ్యక్తరసం మృష్టం శీతం శుచ్యమృతోపమమ్ ॥
సూర్యోద్ధృత ప్రముక్తత్వాల్లఘు వాత కఫాపహమ్ ।
శైత్య జీవని సౌమ్యత్వైః పిత్తరక్త విషార్తిజిత్ ॥
గంగా బునభసోభ్రష్టం స్పృష్టం త్వర్కేందు మారుతైః
హితాహితత్వే తత్ భూయో దేశ కాలావపేక్షత॥

*ప్రతిపదార్థము :* జీవనం = సౌమ్యధాతువులను వృద్ధిచేయునది; తర్పణం = తృప్తిని చేయునది; హృద్యమ్ = హృదయమునకు పథ్యమైనది; హ్లాది = ఆహ్లాదమును కలిగించునది; బుద్ధిప్రబోధనమ్ = బుద్ధికి పటుత్వము కలిగించునది; తను = స్వచ్ఛమైనది; అవ్యక్తరసం = మాధుర్యాది రసములు లేనిది; మృష్టం = స్వాదుత్వాది గుణములతో కూడినట్టిది; శీతం = వీర్యముతో శీతమైనది; శుచి =

పవిత్రమైనది; అమృతోపమమ్ = అమృతముతో సమానమైనది; సూర్యోద్ధత ప్రముక్తతావత్ = సూర్యునిచేత గ్రహింపబడి వదలిపెట్టుటవలన; లఘు = తేలికయైనది; వాతకఫాపహమ్ = వాతకఫములను పోగొట్టునది, శైత్యజీవన సౌమ్యత్వైః = శీతవీర్యము సౌమ్యధాతుపోషకము సౌమ్యము అగుటచేత; పిత్తరక్తవిషార్తిజిత్ = పిత్తరక్త విషబాధలను పోగొట్టునది; అర్కేందుమారుతైః = సూర్యచంద్రవాయువుల చేత; స్పృష్టం = భూమిమీద పడిన వెంటనే స్పృష్టమైనది; నభసః = ఆకాశమునుండి; భ్రష్టమ్ = పడినదియైన; గంగాంబు = గంగాజలము; తత్ = ఆ గంగాజలము; హితాహితత్వే = పథ్యాపథ్యములను నిర్ణయించుటలో; భూయః = మరల; దేశకాలౌ = దేశకాలములను; అపేక్షత = అపేక్షించుచున్నది.

**తాత్పర్యము :** అన్నపానీయములను గురించి వివరించునప్పుడు సంస్కృతములైన అన్నపానములను చెప్పుటకు ముందు ప్రకృతి సిద్ధములైన పానములను వివరించుచున్నారు. ఆకసమునుండి పడిన గంగాజలము సౌమ్యధాతువులను వృద్ధిచేసి, వాతపిత్తశ్లేష్మములను సమస్థితిలో నుంచును. లఘువుగను స్వాదుత్వాది గుణములతో కూడుకొనినదిగను వుండును. సూర్యునిచేత గ్రహించబడి వదలిపెట్టినది కాన స్వచ్ఛమైనది పవిత్రమైనదిగా కూడా వుండును. ఈ గంగాజలము దేశకాలాదులను బట్టి పథ్యాపథ్యములుగా మారుచుండును. మరియు సంస్కారాదుల చేత విశేషగుణదాయిగా కూడా వుండును.

**శశిలేఖ :** నీటికి ప్రథమ స్థానమున్నందున మొదట నీటినే గ్రహించడమైనది. మృష్టం అని చెప్పుటవలన మాధుర్యాది రసములు లేకున్నను స్వాదుత్వాది గుణములతో కూడుకొన్నది, శీతం అని చెప్పుటవలన శీతవీర్యమనియు, అగ్ని ఆతపాదుల చేత అతప్తమైన ఇతర ఉదకముల కంటె శీతతరమ్ అని చెప్పడమైనది. ఇతర జలముల కంటె గంగాజలము వాతపిత్త శ్లేష్మములను మూడింటిని పోగొట్టునది యని చెప్పడమైనది. దేశకాలములు ముందు చెప్పబోవుచున్నందున వాటి వివరణము ముందు రాబోవుచున్నది.

**మూ॥** యేనాభివృష్టమమలం శాల్యన్నం రాజతస్థితమ్।
అక్లిన్నమవివర్ణం చ తత్పేయం గాంగమన్యథా॥
సాముద్రం తన్న పాతవ్యం మాసాదాశ్వయుజాద్వినా।

**ప్రతిపదార్థము :** యేన = యేనీటితో; అభివృష్టం = తడుపబడిన; అమలం = నిర్మలమైన; శాల్యన్నమ్ = శాల్యోదనము; రాజతస్థితమ్ = వెండిపాత్రలో నుంచినది; అక్లిన్నం = తడవనిది; అవివర్ణమ్ = వర్ణము మారనిదిగా; భవతి = అగుచున్నది; తత్ గాంగమ్ = ఆ గంగాజలము; పేయం = త్రాగదగినది; అన్యథా = అట్లు కానిపక్షమున; ఆశ్వయుజాద్ మాసాత్ వినా = ఆశ్వయుజమాసమును విడిచి; సాముద్రం = సముద్రజలము; నపాతవ్యమ్ = త్రాగదగినది కాదు,

**తాత్పర్యము :** పానయోగ్యమగునుదక ప్రశస్తిని సంగ్రహకారుడు సూక్ష్మాతిసూక్ష్మముగ వివరించుచున్నాడు. శాల్యోదనము నీటితో తయారు చేయబడినది. వెండిపాత్రలో నుంచిన అన్నము తడవనిది వర్ణము మారనిదిగా యగునో అట్టి గంగాజలము పానయోగ్యమైనది. అట్లుకాకున్న ఆశ్వయుజమాసమును వదలిపెట్టి ఇతర మాసముల యందు సముద్రజలములను పానముచేయరాదు.

**శశిలేఖ :** నిర్మలమైన యేనీటితో తడుపబడి సిద్ధముచేసిన శాల్యోదనము రజత పాత్రలోనుంచిన,తడవనిది(మెత్తబడనిది)వర్ణముమారనిదిగావుండునో అట్టి గంగాజలము పానయోగ్యమైనదిగా నిర్ణయింప బడినది. మరియు ఇతర మాసములను విడిచిపెట్టి ఆశ్వయుజ మాసములో సాముద్రజలములు పానయోగ్యములుగా చెప్పబడినవి.

**వి. వ్యా. :** "సాముద్రం తన్నపాతవ్యం మాసాదాశ్వయుజాద్వినా" అను వాక్యము సుశ్రుత సూత్రస్థానమునందలి 45 అధ్యాయములోనిది. ఆ వాక్యమును యీగ్రంథకారుడు గ్రహించెను. సుశ్రుతమునందు గంగాసాముద్రోదకముల భేదమిట్లు చెప్పబడినది. సన్నవరి యన్నము ముద్దను పాసి పోకుండుదానిని ఎక్కువ నెండిపోకుండా దానిని గ్రహించి యొక వెండిగిన్నెలో బెట్టి వర్షముపడునపుడు ఆరుబయట నుంచవలెను. వర్షోదకములో దడిసిన యాయన్నము రెండుగడియల తర్వాత వేసినది వేసినట్లుండి మెత్తబడి పోకుండనుండిన యెడల గాంగోదకము వర్షించుచున్నదని తెలియవలెను. అట్లుగాక రంగుమారి మెతుకు మెత్తబడి పోయినచో సాముద్రోదకము వర్షింపుచున్నదని తెలియవలెను. ఇందులో గాంగోదకమే ప్రధానము. దీనినే ఆశ్వయుజ మాసములో గ్రహింపవలెను.

సాముద్ర జలము నిలువ చేయకూడదు. సముద్ర జలమైనను ఆశ్వయుజ మాసమున గురిసిన దానిని సంగ్రహించినచో గాంగోదకమువంటి గుణము కలిగి యుండును. అగస్త్యోదయము ఆశ్వయుజ మాసమున ఏర్పడును. విష సదృశములైన జలములు పై మాసమున నిర్విషములగును. ఈ విషయములో చరకుడు ఇట్లు వివరించుచున్నాడు. ఆకసము నుండి పడిన నీరు కాలమును బట్టి సంచరించుచుండును. చంద్ర వాయు సూర్యుల యొక్క స్పర్శ యేర్పడిన తరువాత పృథివి యొక్క గుణమును బట్టి శీత ఉష్ణ స్నిగ్ధ రూక్షాది గుణములతో కూడిన దిగ నుండును. వాటికి దేశ కాలాదులను బట్టి గుణములు మారుచుండును. అష్టాంగ సంగ్రహమునే అష్టాంగ హృదయకారుడు గూడ ప్రతిపాదించినట్లు స్పష్టము.

మూ॥ శాలి క్షాత శిలా స్పృష్ట వస్త్రాద్రి శ్మశ్రు స్రుతం జలమ్॥
హేమ ప్యృణ్మయ పాత్రస్థ మవిపన్నం సదాపిబేత్।

ప్రతిపదార్థము : ఖాత=త్రవ్వబడిన పల్లము నందలి; ధౌత శిలా పృష్ట=నిర్మలమైన రాతి ప్రదేశము నందలి;వస్త్రాదిభ్యః=నిర్మలమైన వస్త్రముచే గ్రహింపబడిన: హేమ మృణ్మయ పాత్రస్థమ్=బంగారు వికారమైన లేక మట్టితో చేయబడిన పాత్రలో వుంచిన; అవిపన్నమ్=వికృతి చెందనటువంటి; జలం=నీరు; సదా=ఎల్లప్పుడు; పిబేత్=త్రాగ వలెను.

తాత్పర్యము : త్రవ్వబడిన పల్లమునందలి జలమును రాతి ప్రదేశము నందలి జలమును నిర్మలమైన వస్త్రముచే గ్రహింపబడిన జలమును, వికృతి చెంద నటువంటి జలమును, బంగారు పాత్రలో లేక మట్టి పాత్రలో నుంచిన జలమును అన్ని కాలముల యందును వుపయోగించుకొన వచ్చును.

శశిలేఖ : వర్షించిన నీటిని మొదట గర్తలము నుండి ఉపాయముగ గ్రహించ వలెను. తెల్లటి వస్త్రమునుండి గ్రహించిన జలముబంగారుపాత్రలో నుంచిన నీరు శ్రేష్ఠమైనది.

మూ॥ తద భావేచ భూయిష్ఠ మాన్తరిక్షానుకారియత్॥

ప్రతిపదార్థము : తదభావే=అట్టి జలము లభించని యెడల, భూయిష్ఠమ్=మిక్కిలి; యత్=యేస్వచ్ఛత్వాది గుణములచే; ఆన్తరిక్షాను కారి=ఆకాశోదకమును అనుకరించు చున్నది. (అట్టి గుణములతో కూడిన) తత్=వాటితో సమానమైన గుణములతో; స్యాత్=వుండును.

తాత్పర్యము : ఆకాశోదకము దొరకని యెడల నైర్మల్యాది గుణ ముల వలన తరుచుగా ఆకాశోదకమునకు సమానమైన యుదకమును పానము చేయవలెను.

శశిలేఖ : నైర్మల్యాది గుణముల వలన ఆకాశోదకమును ఏ జలము అనుకరించుచున్నదో ఆ నీటిని యెక్కువగా పానము చేయువలెను.

మూ॥. శ్వేత కషాయం తత్స్వాదు కృష్ణే తిక్తంచ పాండురే॥
నీలే కషాయ మధురం దేశా లవణ మూషరే।
సక్షారం కపిలేమిశ్రం మిశ్రే యాంబు గుణాదికే
మధురం లవణామంతు భవేద్భూమి గుణాదికే।
తేజోదికే తిక్త.కటు కషాయం పవనాదికే।
దివ్యానుకారిత్వ వ్యక్తరస త్వాత్ ఖ గుణాధికే।
శుచి పృథ్వసి తశ్వేత దేశే చాన్యానిలాహతాత్।

ప్రతిపదార్థము : శ్వేతమృది = తెల్ల మట్టిలో; స్థితం=ఉన్న; ఉద కం=నీరు; కషాయం=కషాయ రసమును; కృష్ణే=నల్ల మట్టిలో నున్న ఉద కము; స్వాదు=మధుర భావమును; పాండురే=పాండు వర్ణము గలిగిన భూమి యందున్న నీరు; తిక్తతాం=చేదును; నీలే=నల్ల భూమియందున్న ఉదకము;

కషాయ మధురం=ఒగరు స్వాదు రసములను; ఊషరే దేశే=చవిటి నేలలో ఉన్న నీరు; లవణం=ఉప్పుగానూ; కపిలే దేశే=గోరోజనము వంటి వర్ణము గల ప్రదేశము నందున్న నీరు; సక్షారం=క్షారత్వ గుణముతో కూడినదిగా; భవతి=అగుచున్నది. (మృదు భావము); మిశ్రే=మిశ్ర లక్షణములతో గూడిన భూమి యందున్న నీరు; మిశ్రం=మిశ్రగుణములు గలదిగా; భవతి=అగుచున్నది; అంబుగుణాధికే దేశే=అప్య భాగము అధికముగా గల దేశము నందు; మధురం=తియ్యగా; ఉదకం=నీరు; భవతి=అగుచున్నది; భూమి గుణాధికే దేశే=పార్థివ గుణము అధికముగా గల భూమి యందు; లవణామ్లం జలం భవేత్=లవణామ్ల గుణ యుక్తమైన; ఉదకం=నీరుగా; భవేత్=అగును; తేజోధికే=ఆగ్నేయాంశము అధికముగా గలిగిన; దేశే=భూమియందు; ఉదకం=నీరు; తిక్తకటు=చేదు కారమును; భవేత్=పొందును; పవనాధికే=వాయవ్యాంశము అధికముగ్గాగల; దేశే=దేశమునందలి; ఉదకం=నీరు; కషాయం=ఒగరుగా; భవేత్=అగును;ఖగుణాధికేతు=ఆకాశ గుణాధిక్యమునందైతే; అవ్యక్త రసత్వాత్=అవ్యక్త రసము వలన; దివ్యానుకారి=ఆకాశోదక సమానమైన గుణము కలదిగా; భవేత్=అగును; చ=మరియు; శుచి=పరిశుద్ధమైన; పృథౌ=విశాలమైన; అసిత=నల్లనైన; శ్వేత=తెల్లనైన; దేశే=భూమి యందలి; జలం=నీరు: అర్కానిలాహతమ్=సూర్య వాయువుల చేత స్పృశింప బడినది; దివ్య సదృశమ్=ఆకాశోదక సమానమైనదిగా; భవేత్=అగుచున్నది.

తాత్పర్యము : దేశ విశేషమును బట్టి జలమునకు కలుగునట్టి రసములను వివరించుచున్నాడు—మట్టి తెల్లగా నుండు ప్రదేశములో నున్న నీరు కషాయ రస భావమును, నల్ల మట్టిలో నున్న నీరు మధుర భావమును, తెలుపు మించిన పచ్చని భూమిలోనున్న నీరు తిక్త భావమును, నల్ల రేగడిలో నున్న నీరు కషాయ మధుర భావమును, చవిటి నేలలోనున్న నీరు లావణ్యమును, మిశ్ర గుణములు గలిగిన మట్టిలోనున్న నీరు మిశ్ర లక్షణములను కలిగి యుండును. మరియు ఆప్యాంశ మధికముగా గల ప్రదేశము నందలి నీరు మధురముగా నుండును. పార్థివాంశమధికముగాగలభూమి యందలి నీరులావణ్యా అమ్లయుక్తముగా నుండును. ఆగ్నేయాంశము అధికముగా గల భూమి యందలి నీరు తిక్త కటు భావమును చెందును. వాయవ్య భాగ మధికముగా గల దేశ మందలి నీరు ఒగరుగను ఉండును. ఆకాశ గుణాధిక్యము నందు ఆకాశము నందలి నీరు అవ్యక్త రసమును కలిగి యుండుట వలన పై ఉదకములో ఆకాశోదకముతో సమానమైన గుణ ముండును. మరియు శుద్ధమైన ప్రదేశమునందు విశాలమైన ప్రదేశమునందు నల్ల మట్టియందు, తెల్ల మట్టి యందు ఉన్న నీరు, సూర్యుని చేత వాయువు చేత స్పృశింపబడుట వలన ఆకాశోదకముతో సమానమైన ప్రతిపత్తి గలదిగా గ్రహింప బడినది.

**శశిలేఖ** : వెనుకటి వాక్యమునందు 'భూయిష్ఠం' అని చెప్పబడినది. దానినే దేశ విశేషముచేత ఈ భాగమునందు విశేషముగా చెప్పబడుచున్నది. ఊషర అనుపదము "ఊషరః క్షారమృత్తికా" క్షారసదృశమైన మట్టిఅని అర్థము. క్షారమనగా రసవిశేషము. క్షారమనగా సౌమ్యమని అర్థము. సౌమ్యమనగా మృదుత్వమని అర్థము. ఈ భూమి యంతయు పంచభూతాత్మకము. అయినను అన్ని ప్రదేశములందును భూతసామ్యము ఉండదు. అందువలననే భూతాధిక్యత వలన ఏర్పడు పరిణామములను వాటివలన గలుగు రస విశేషములను ఇందు పొందు పరచ బడినవి. ఇచట ఉపయోగింపబడిన గుణశబ్దము భాగపర్యాయము

మూ॥ కౌపసారస తాటాకై చౌణ్డ ప్రాస్రవణౌద్భిదమ్॥
వాపీ-దీతోయమితితత్ పునః స్మృతమష్టధా॥

**ప్రతిపదార్థము** : తత్=ఆజలము; పునః=మరల; అష్టధా=ఎనిమిది విధములుగా; స్మృతం=చెప్పబడినది; కౌప=నూతులలోని నీరు; సారస=సరస్సునందలి జలము; తాటాక=చెరువులలోని నీరు; చౌణ్డ=చెలమలలోని నీరు; ప్రాస్రవణ = సెలయేటి యందలి నీరు; ఔద్భిదమ్ = నేలలోనుండి యుబికెడి జలము (ఊట); వాపీ = దిగుడుబావులలోని నీరు; నదీతోయం = నదీ జలము; ఇతి=అని.

**తాత్పర్యము** : నూతులయందలి, సరస్సులయందలి, చెఱువుల యందలి, చెలమల యందలి, సెలయేటి యందలి, ఊటలయందలి, దిగుడుబావులలోని, నదియందలి నీరు ఎనిమిది విధములుగా నుండును.

**శశిలేఖ** : కూపేభవం=కౌపమ్, సరసే-భవం=సారసం, చౌణ్డం= పర్వతాదులయందలి రాళ్ళక్రిందనుండు నీరు, తాటాకం = ఆకసమునుంచి పడి భూమిలోనున్ననీరు, ప్రాస్రవణం=పర్వతమునుండి జారిననీరు, ఔద్భిదం = భూమినిత్రవ్వి అచటనుండు నీరు, వాపీ=బావివలె అంతటన మెట్లు గలది.

మూ॥ సక్షారం పిత్తకృత్ కౌపం దీపనాన్న తివాతళమ్॥
సారసం స్వాదు లఘుచ తాటాకం గురువాతళమ్
చౌణ్డంతు పిత్తళం దోషహారం ప్రాస్రవణోదకమ్॥
ఔద్భిదం స్వాదు పిత్తఘ్నం స్వాదు వాపీజలం లఘు॥
నాదేయం వాతళం రూక్షం కటుకఞ్చత దాదిశేత్॥
ధన్వానూప మహీధ్రాణాం సామీప్యాత్ గురులాఘవమ్॥

**ప్రతిపదార్థము** : సక్షారం=క్షారరసముతో కూడి; పిత్తకృత్=పిత్తమును వృద్ధిచేయును; కౌపంతోయం=నూతులలోని నీరు; దీపనాత్=అగ్నిదీపనమును చేయుట వలన; సారసంతోయం = సరస్సులయ దలి నీరు; నాతివాతళమ్ = ఎక్కువ వాతవృద్ధికరముకాదు; చ=మరియు; స్వాదు=మధురము; లఘు =

లఘుగుణముకలది; తాటాకంతోయం = చెరువులలోనినీరు; గురు = గురుగుణ ముకలది; వాతళమ్ = వాతమును వృద్ధిచేయునది; చౌణ్డంతోయం = చెలమల లోనినీరు; పిత్తళం = పిత్తకారకమైనది; ప్రాస్రవణం = సెలయేటియందలి; ఉదకమ్ = నీరు; దోషహారం = త్రిదోషములను హరించును; ఔద్భిదం = ఊటల యందలి నీరు; మధురం = తీయనైనది; పిత్తఘ్నం = పిత్తదోషమును శమింప చేయును; వాపీజలం = దిగుడుబావులలోని నీరు; మధురం = తీయనైనది; చ = మరియు; లఘు = లఘుగుణముకలది; నాదేయంతోయం = నదీజలము; వాతళం = వాతమును వృద్ధిచేయును; రూక్షం = రూక్షగుణముకలది; చ = మరియు; కటుకం = కటురసయుక్తమైనది; దన్వానూప మహీధ్రాణాంధన్వ = జాంగల దేశమునందున్న ఆనూపదేశమందలి పర్వతములయొక్క; సామి ప్యాత్ = దగ్గరగా నుండుటవలన; గురులాఘవం = గురులాఘవములు; తత్ = ఆదిశేత్ = అదిగో చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** ఈ భాగము నందు ఎనిమిది విధములైన నీటి యొక్క గుణములు వివరింపబడు చున్నవి. కూప జలము క్షార గుణము కలిగి, పిత్త వర్ధ కమైనదిగాను, సరస్సు నందలి నీరు అగ్ని దీపనము చేసి, కొద్దిగా వాతమును వృద్ధి చేయదగినదిగాను మరియు స్వాదు గుణములు కలదిగాను, తటాక జలము గురుగుణము మరియు వాతమును వృద్ధి చేయునదిగాను, చెలమలలోని నీరు పిత్త వర్ధక మయినదిగాను, దిగుడుబావులలోని నీరు మధురమైనదిగను, లఘుగుణము కలది గాను, సెలయేటి యందలి నీరు త్రిదోష హరముగాను, ఊటల యందలి నీరు మధురము గాను పిత్త శామకముగాను, నదీ జలము, వాతవృద్ధికరముగ రూక్ష గుణము కలదిగా, కటు రసము కలదిగాను గ్రహించ వలెను. జాంగల దేశములో జనించిన కూపాదీ జలములకు ఎక్కువగా నీటితో సంబంధము లేకుం డుటచే బందముండుటచే గురువుగా నుండును. పర్వతములో పుట్టిన నీళ్ళకు కొద్దిగా జలముతో సంబంధముండుటచే లఘువుగ నుండును.

**శశిలేఖ :** జాంగల దేశము నందున్న ఉదకములు లఘు గుణములు కలవి. ఎందు కనగా అచట ఎక్కువ నీటితో సంబంధము లేకుండుటవలన జాంగల దేశము నందలి పర్వతముల వద్దనున్న కూపముల యందలి నీరు చాల తేలికయైనది. ఆనూప దేశము లందలి కూపాదుల యందలి నీరు గురు గుణము కలిగి యుండును.

**వి. వ్యా. :** నూతులలోని నీరు శ్లేష్మమును హరించునదిగను, లఘు గుణము గలిగి దీపనము చేయునది గను, సుశ్రుతుడు చెప్పెను. (దీపనమనగా ఆమమును పచనము చేయక అగ్నిదీపనము మాత్రము కలుగ జేసెడిది. తటాకములోని నీరు, సుశ్రుతుడు తీపి వగరు రుచి కలిగి

కటు విపాకము నందునని చెప్పినాడు. చెలమలలోని నీరు మధురమై రూక్ష గుణము కలది. అగ్ని దీపనమును కలిగించి కఫవృద్ధి చేయునని సుశ్రుతుడు వక్కాణించెను. సెలయేటి యందలి నీరు లఘువు కఫహారము, హృద్యము దీపనమని పేర్కొనెను. ఇట్లు ఏడు విధములైన నీటిని గురించిన అష్టాంగ సంగ్రహమందలి వివరణము, సుశ్రుత మందలి వివరణము, చరక మందలి వివరణము వేరు వేరుగా కన్పట్టుచున్నవి. వీటిని గురించిన విపులీకరణ ముందు ప్రస్తావించబడినది.

మూ॥ పశ్చిమోదధి గారి శీఘ్ర వహా యాశ్చా మలోద కారి॥
పథ్యాః సమాసాత్తా నద్యో విపరీతా స్తతోన్యథా।।
ఉపలాస్ఫాల నాక్షేప విచ్ఛేదైః ఖేదితోదకారి।
హిమవన్మలయోద్భూతాః పథ్యాస్తా ఏవచ స్థితాః।
క్రిమి శ్లీపదహృత్ కంఠ శిరో రోగాన్ప్ర కుర్వ తే॥

**ప్రతిపదార్థము :** యాః నద్యః=యే నదులు; పశ్చిమోదధి గారి= పశ్చిమ సముద్రమును చేరునవియు; శీఘ్రవహారి=శీఘ్రముగ ప్రవహించునవియు; అమలోదకాః=నిర్మలమైన ఉదకములుగలిగియుండునో; తానద్యః=ఆ నదులు; సమాసాత్=సంక్షేపముగా; పథ్యాః=పథ్యకరములు; తతోఽన్యథా=ఈ నదుల కంటే; విపరీతాః = విపరీత లక్షణములు గలవి (అపథ్యకరములు); హిమవన్మలయోద్భూతాః=హిమవత్పర్వతము, మలయ పర్వతములయందు పుట్టిన, ఉపలాస్ఫాల నాక్షేప విచ్ఛేదైః=కంకర రాళ్ళ యొక్క తాకిడుల చేత అడ్డగింపబడి భిన్నములగుటచేత; ఖేదితోదకాః = బాధింపబడిన జలములు(నిర్మలములైన జలములు); పథ్యాః=పథ్యకరములు; చ=మరియు; తాఏవ=హిమవత్పర్వతములు మలయ పర్వతమునందు పుట్టిన జలములే; స్థిరాః=నిలిచియుండునవి; కృమిశ్లీపద హృత్కంఠ శిరోరోగాన్ =కృమిరోగము శ్లీపదము రొమ్ము నొప్పి కంఠ రోగము శిరో రోగములను; ప్రకుర్వతే = చేయుచున్నవి.

**తాత్పర్యము :** పశ్చిమ సముద్రమును జేరునవియు, త్వరగా ప్రవహించునవియు, నిర్మలమైన యుదకము కలిగియుండునవియైన నదులు సంక్షేపముగ పథ్యకరములు. ఈ నదులకంటే విపరీతలక్షణములు గలవి అపథ్యకరములు. హిమవత్పర్వతము మలయ పర్వతములయందు బుట్టినవియు, రాళ్ళపై బడుట చేత కలకబారి తేటదనమును పొంది వేగముగ ప్రవహించుచున్న నదీజలములు పథ్యకరములు. హిమవత్పర్వతములోపుట్టి యచటనే స్థిరముగ నిలచియుండు జలము కృమిరోగము, శ్లీపదము, రొమ్మునొప్పి, కంఠరోగము, శిరోరోగములను కలుగచేయును.

**శశిలేఖ :** తాత్పర్యమునందలి విషయమే వ్యాఖ్యానము నందును కలదు.

వి. వ్యా. : హిమవత్పర్వతములో పుట్టిన జలమంతయు పథ్యకరమని చరకాచార్యుడు చెప్పెను. కృష్ణాత్రేయుడు హిమవత్పర్వతములోపుట్టిన జలము అపథ్యమని చెప్పెను. ఈ విషయమునే సుశ్రుతాచార్యుడుగూడ ధ్రువీకరించెను. అందువలన వాగ్భటాచార్యుడు రాళ్ళపై బడి వేగముగా ప్రవహించు హిమాలయములందలి జలములు పథ్యకరములనియు, ప్రవహింపక అచటనే స్థిరముగానుండు జలము అపథ్యకరమనియు విభజన పూర్వకముగా సిద్ధాన్తీకరించెను.

మూ॥ ప్రాచ్యావన్త్య పరాన్త్థాదున్నామాని మహేంద్రజాః।
ప్రదరశ్లీపదాతంకాన్ సహ్యావింధ్య భవాఃపునః
కుష్ఠపాండు శిరోరోగాన్ దోషఘ్న్యః పారియాత్రజారి।
బల పౌరుష కారిణ్యస్సాగరాంభ స్త్రి దోషకృత్।

*ప్రతిపదార్థము* : ప్రాచ్యావంత్యపరాంత్థః = గౌడము,మాలవము, కొంకణము అను నీదేశములయందు పుట్టిన; మహేంద్రజాః=మహేంద్ర పర్వతమునందు పుట్టిన (నదీజలం=నదీజలము);ఉదరశ్లీపదాతంకాన్ =ఉదర శ్లీపదరోగములను; దుర్నామాని=దుర్నామరోగమును (కలుగజేయును); పునః=మరల; సహ్యావింధ్యభవాః=సహ్యా వింధ్య పర్వతములయందు పుట్టిన (నదీజలము); కుష్ఠపాండు శిరోరోగాన్ =కుష్ఠు పాండు శిరోరోగములును; పారియాత్రజారి = పారియాత్ర పర్వతమునందు పుట్టిన (నదీజలము); దోషఘ్న్యః=త్రిదోషములను పోగొట్టును; చ=మరియు; బలపౌరుష కారిణ్యః=బలమును పుంసత్వమును (కలుగచేయును); సాగరాంభరి=సముద్రోదకము; త్రిదోషకృత్=త్రిదోషము లను చేయును.

**తాత్పర్యము:** గౌడము,మాళవము,కొంకణము అను దేశములయందును' మహేంద్ర పర్వతమునందును పుట్టిన నదీజలము ఉదరరోగము శ్లీపదము' దుర్నామ రోగములను కలుగచేయును. సహ్యా వింధ్యపర్వతములయందు పుట్టిన నదీజలము కుష్ఠరోగము పాండువు శిరోరోగములను కలిగించును. పారియాత్ర పర్వతములందు పుట్టిన నదీజలము త్రిదోషములను పోగొట్టును. మరియు బలమును పుంసత్వమును కలుగచేయును. సముద్రోదకము త్రిదోషములనుచేయును.

*శశిలేఖ* : ప్రాచ్యా=గౌడదేశము, అవన్తీ=మాళవదేశము, అపరాన్తాః=కొంకణ దేశములు, పౌరుషం = పుంసత్వము. తక్కిన వివరములు తాత్పర్యాంశములు.

వి. వ్యా. : ఈ విషయములో చరకాచార్యులు పారియాత్ర వింధ్య సహ్యాపర్వతములందు పుట్టిన నదులజలము హృదయరోగమును కుష్ఠమును శ్లీపద రోగములకుకూడా కారణమగునని నుడివిరి.

"పారియాత్రభవారి" అను పదముచే పారియాత్రమునపుట్టి ప్రవహించవక నిల్కడగ నిలిచియుండు హ్రదాదిజలము గ్రహింపబడును. అట్టి జలము శిరో రోగాదులను గల్గించునని గ్రహింపవలెను. పారియాత్రమునుండి ధారాళముగ ప్రవహించు జలము పథ్యముగనుండును. ఈ విషయమునే వాగ్భటాచార్యులు గూడ బలపరచిరి.

మూ॥ కీటాహి మూత్ర విట్కోథ తృణజాలోత్కరావిలమ్।
పంక పంకజ శైవాల హఠ పర్ణాది సంస్కృతమ్।
సూర్యేందు పవనాదృష్టం జుష్టంచ క్షుద్ర జంతుభిః।
అభివృష్టం వివర్ణం చ కలుషం స్థూలఫేనిలమ్।
విరసం గన్ధవత్తప్తం దన్త గ్రాహ్యాతి శైత్యతః।
అనార్తి వంచ యద్దివ్య మార్తవం ప్రథమంచ యత్॥
లూతాది తన్తు విణ్మూత్ర విషమం శ్లేష దూషితమ్
తత్కుర్యాత్ స్నాన పానాభ్యాం తృష్ణాధ్మా నోదరజ్వరాన్।
కాసాగ్ని సాదాభిష్యంద కండూగండాది కానతః।
తద్వర్జయే దభావే వాతో యస్యాన్యస్య శస్యతే।
ఘన వస్త్ర పరిస్రావైః క్షుద్ర జన్త్వభిరక్షణమ్।
వ్యాపన్నస్యాస్యతపన మగ్న్యర్కాయ సపిండకైః।
పర్ణి మూలాల బిలగ్రన్థి ముక్తాకతకశైవలైః।
వస్త్ర గోమేదకాభ్యాం వాకార వేతత్ప్రసాదనమ్।
పాటలా కరవీరాది కుసుమైర్గంధనాశనమ్।

ప్రతిపదార్థము : కీటాహి మూత్ర విట్ కోథ తృణజాలోత్కరా విలమ్=కీట, చిన్న పురుగులు మొదలగు వాటి యొక్క; అహి=సర్పముల యొక్క; మూత్ర=మూత్రము చేత; విట్=మలము చేత; కోథ=మృత శరీరము నుండి స్రవించిన నీటిచేత; తృణజాల=తృణ సమూహము చేత) ఉత్కర=జలాశయముల చేత (ధాన్యాదుల యొక్క మార్జనము చేత; ఆవిలమ్=కలుషితము చేయబడిన (జలం=నీరు); పంక=దుర్గంధ యుక్తమై బురద యందలి నీరు; పంకజ=కమలముల యొక్క; శైవాల=నాచు యొక్క హఠ=జలకుమ్భియను పేరుగల నీటియందు బుట్టి తీగెల యొక్క (ఆకుల చేత పుష్పముల చేత కప్పబడిన లేక ఆ నీటిపై పరచినట్లున్న); జలం=నీరు; సూర్యేందు పవనాదృష్టమ్= సూర్యుని చంద్రుని కిరణములయొక్క వాయువు యొక్క స్పర్శ లేనటు వంటి (నీరు); క్షుద్ర జంతుభిః=కప్పలు చేపలు మొదలగు జంతువుల చేత; జుష్టం=సేవింప బడినటు వంటి (నీరు); అభివృష్టమ్= అప్పుడే పడిన వర్షపు నీటితో కలిసిన నీరు; వివర్ణం=రంగు మారిన నీరు; కలుషమ్=కలుషితమైన నీరు; స్థూలఫేనిలమ్=పెద్ద నురగలుగల నీరు; విరసం= చెడ్డ వాసన గలనీరు; గన్ధవత్తప్తం=కాచినపుడు దుర్వాసన వేయునట్టి నీరు; అతి

శైత్యతః=మిక్కిలి చల్లగా నుండుట వలన; దన్తగ్రాహి=పళ్ళు జివ్వుమనునట్లుగా చేయు నీరు (దన్తములు పట్టినట్లుగా);అనార్తవమ్=ఆ కాలమునందు వర్షించిన; యత్=యే; దివ్యం=ఆకాశోదకము; ఆర్తవం=ఋతుకాలము నందలి; ప్రథమం=తొలకరి వర్షపు నీరు; లూతాదితన్తువిణ్మూత్ర విష సంశేష దూషితమ్=సాలీడు మొదలగు వాని యొక్క గూళ్ళ మల మూత్రములు విషము యొక్క సంపర్కము చేత దూషితమైన జలము; స్నాన పానాభ్యాం=స్నాన పానముల యందు ఉపయోగించుట చేత; తృష్ణాధ్మానోదరజ్వరాన్=దప్పి ఉదర రోగము జ్వరములను; కాస=దగ్గు, అగ్నిసాద=అగ్నిమాంద్యము; అభిష్యంద=నేత్ర రోగము; కండూ=దురద; గండాదికాన్=గండమాలా మొదలగు రోగములను; తత్=ఆ జలము; వర్జయేత్=విడిచి పెట్టవలయును (సేవించ రాదు); అన్యస్యతోయస్య=ఇతర జలము యొక్క; అభావే=దొరకని యెడల; ఘన వస్త్ర పరస్రావైః = ముతక వస్త్రము చేత; వడియగట్టుచేత క్షుద్ర జన్తుభిరక్షణం=క్షుద్ర జంతువుల చేత రక్షింప బడును; కుర్యాత్=చేయవలయును; వ్యాపన్నస్య=వికృతి చెందిన; అస్య=ఈ ఉదకమును; అగ్ని=అగ్ని చేత; అర్క=సూర్యుని చేత; ఆయస పిండకైః=అయః పిండముల చేత; తపనం=కాల్చ బడినది; ప్రశస్తం=ప్రశస్తమైనది; పర్ణీమూల బిసగ్రంథి ముక్తా కతక శైవలైః=దర్భమూలముల చేత, తామర గడ్డల చేత, ముత్యములచేత, చిల్ల గింజల చేత, నాచు చేత స్వచ్ఛముగా చేయ బడినది; వస్త్ర గోమేదకాభ్యాం=వస్త్రములు, గోమేదక మణుల చేత; ప్రసాదనం=స్వచ్ఛముగా; కారయేత్=చేయించవలెను; పాటలాకరవీరాదికుసుమైః = పాదిరి గన్నేరు మొదలగు పుష్పముల చేత; దుర్గంధ నాశనం=దుర్వాసనను పోగొట్టుటను; కారయేత్=చేయించవలెను.

**తాత్పర్యము** : నీటియందు నివసించు కీటాణువుల చేత, సర్పముల యొక్క మూత్ర పురీషముల చేత అనేక విధములైన ధర్భ గడ్డిమొదలగు వాటి యొక్క రాశి చేత మలినముగా చేయబడిన అసహ్యామైన దుర్గంధముగల తామర జలకుంభి మొదలగు ద్రవ్యముల యొక్క ఆకుల చేత పరచబడిన లేక మరుగు పరచ బడిన సూర్య చంద్రుల యొక్క కిరణములు పడనటు వంటి వాయువు యొక్క స్పర్శ లేనటువంటి కప్పలు, చేపలు మొదలగు క్షుద్ర జంతువుల చేత నిండియున్నటువంటి అప్పుడే వర్షించిన వికృతి జెందిన వర్ణముకల కాగునపుడు వాసన వచ్చునటువంటి,పళ్ళు జివ్వుమనునట్లుచేయు చల్లదనము కలిగిన, కాలము గాని కాలమునందు వర్షించిన సాలీడు మొదలగు కీటకముల యొక్క మల మూత్రాదులు, విషము చేత దుష్టమైన నీటి యొక్క స్నానపానాదుల చేత దప్పి, కడుపుబ్బరము, ఉదర రోగము, జర్వము మొదలగునవి కలుగును. అందు వలన ఆ నీరు విసర్జించ వలయును. వికృతి చెందిన నీటిని కాచియు సూర్య కిరణములు పడునట్లు చేసియు కాల్చిన ఇనుప ముద్దలను నీటిలో వేసియు శుభ్ర

ముగ చేయవలయును. చిల్ల గింజలు తామర తూండ్లు దర్భ మూలము గోమే దకమణుల చేత నీటిని స్వచ్ఛముగా చేయవలయును. పాదిరి గన్నేరు మొద లగు చెట్ల యొక్క పువ్వుల చేత నీటిలోనున్న దుర్వాసనను తొలగింప వల యును.

అప్పుడే వర్షించిన జలమును నురుగుతో కూడిన జలమును పురుగులు మొదలగు వాటిచే వ్యాప్తమైన నీరును అగ్ని సంబంధములేకయే యెండతో వేడిగ నుండు జలమును మిక్కిలి చల్లనై పండ్లు కిట్టికొన చేయు జలమును వర్జించ వలెను.

*శశిలేఖ* : కీటకాదుల చేత కలుషితమైన నీటిలో స్నానమును గాని త్రాగుట గాని చేయుట వలన దప్పి మొదలగు వ్యాధులు కలుగును. "కోథ" శబ్దమునకు మృత శరీర క్లేదమని యర్థము. "ఉత్కర" మనగా గ్రహాది మార్జన రాశియని యర్థము (సమూహము). "అభివృష్ట" మనగా అప్పుడే పడిన వర్షపు నీటితో కలిసిన నీరు అని అర్థము. దివ్యమనగా ఆకాశోదకమని అర్థము. "ప్రసాదనం" నిర్మలీకరణం (శుద్ధముగా చేయుట). "ఎరకా" అనగా కాశ్మీర దేశమునందు "పిత్తీ" అనియు సర్వత్ర దణ్ణేరక పట్టేరక అను పేర్లతో ప్రసిద్ధమైనది. మరియు పాటలాది పుష్పముల చేత దుర్వాసనను తొలగించవలెను.

మూ॥ పానీయం నతు పానీయం పానీయేఽన్యప్రదేశజే।
అజీర్ణే క్వథితం చాఽగ్రే పక్వే జీర్ణే ఽపినేతరమ్॥
శీతే విధిరయం తప్తేత్వ జీర్ణే శిశిరం త్యజేత్।

*ప్రతిపదార్థము* : అన్యప్రదేశజేపానీయే = అన్యప్రదేశ జనిత జలము; అజీర్ణేసతి=జీర్ణముకాకుండునపుడు; నతుపానీయం=పానము చేయరాదు; తథా =అట్లే; ఆమే=అపక్వజలము; అజీర్ణే=జీర్ణముకాకుండునపుడు; క్వథితం= కాచబడిననీరు; నపేయమ్=త్రాగరాదు; తథా=అట్లే; పక్వే=కాచిననీరు; జీర్ణేఽపి=జీర్ణమైనప్పటికి; క్వథితమ్=కాచిన; జలం=నీరు; నపేయమ్=త్రాగ రాదు; ఏషచవిధిః=ఈక్రమమమే, శీతే=ఆమపక్వజలములకు; తప్తేతు అజీర్ణఏవ= కాచిననీరు జీర్ణమైతే; శిశిరమ్ = చల్లనినీరు; త్యజాత్ =వదలిపెట్టవలయును.

*తాత్పర్యము* : త్రాగినజలము ఇతర ప్రదేశములయందలిదైనను జీర్ణ ముకానప్పుడు ఇంకో ప్రదేశమునందలి నీటిని పానముచేయరాదు(అనగా కూపోద కమును పానము చేసి తర్వాత అది జీర్ణముకాకుండునపుడు తటాకోదకమును త్రాగరాదు. ఇట్లే తటాకోదకము పానముచేసిన తర్వాత నదిజీర్ణము కాకున్న కూపోదకమును పానము చేయరాదు) మరియు పానము చేయబడిన శీతోదకము జీర్ణము కాకుండునప్పుడు ఉష్ణోదకమును, పానము చేయబడిన ఉష్ణోదకము జీర్ణ మైయుండునప్పుడు శీతోదకమును పానము చేయరాదు. (ఒకటే విధమగు ఉదక మును పానము చేయవలయును,) ఈవిధి కాగిచల్లారిన యుదకమునకే ఉపయో

గించును. కాగిననీరు జీర్ణము కాకుండునప్పుడు శీతోదకమును త్రాగరాదు. దప్పివలన నుదకము నధికముగ పానము చేసినచో ఆరోగ్యవంతునికి గూడ శ్లేష్మపిత్తములు వృద్ధిచెందును. జ్వరితుడు శీతోదకమును పానము చేసినచో అగ్నిమందగించి జ్వరము విశేషముగ వృద్ధిచెందును.

**శశిలేఖ** : త్రాగదగిననీరు ఇతర ప్రదేశములందు బుట్టిననీరు జీర్ణము కానియెడల అన్యజలము పానయోగ్యముకాదు. విజాతీయమైననీరు త్రాగిన తరువాత అది జీర్ణమగునంతవరకు ఇతరత్ర వున్నటువంటి యేజలమును త్రాగరాదని భావము, యెటులనగా బావి యందలి నీరు త్రాగినతర్వాత అది జీర్ణము కానపుడు తటాకజలమును త్రాగరాదు. ఇట్లే తక్కినవిగూడ తెలియవలెను.

> మూ. పానీయం ప్రాణినాం ప్రాణా విశ్వమేవచ తన్మయమ్॥
> అతోఽత్యన్త నిషేధేన క్వచిద్వారి వార్యతే॥
> ఆస్యశోషాంగ సాదాద్యా[illegible]త్యత్వాత లాభతః,
> నహితో యాద్వినా వృత్తిః స్వస్థస్య వ్యాధితస్యవా॥

**ప్రతిపదార్థము** : పానీయమ్ = త్రాగుటకు యోగ్యమైన జలము; ప్రాణినాం = ప్రాణులకు; ప్రాణాః = ప్రాణములు; చ = మరియు; విశ్వమేవ = స్థావర జంగమాత్మకమగు ప్రపంచమే; తన్మయమ్ = నీటితోకూడినది; అతః = అందువలన; అత్యన్తనిషేధేన = మిక్కిలి నిషేధముగ; క్వచిత్ వారి = ఏవిధమైననీరు నవార్యతే = వారింపబడదు (నిషేధింపబడదు); తదలాభతః = నీరు దొరుకక; పోవుటవలన; ఆస్యశోష = నోరు ఎండిపోవుట; అంగసాద = వళ్ళునొప్పులు; ఆద్యాః = మొదలగునవి, సంభవంతి; తోయాద్వినా = నీరు లేకుండా; స్వస్థస్య = ఆరోగ్యవంతునికి; వా = లేక; వ్యాధితస్య = రోగికి; వృత్తిః = వర్తనము; (జీవనము) నాస్తి = లేదు.

**తాత్పర్యము** : సర్వ ప్రపంచమునందు నివసించుచున్న ప్రాణులకు మంచినీరు లేని యెడల జీవించుట దుర్లభము. మంచినీటి వలననే సర్వ ప్రాణులు జీవించుచున్నారు. స్థావర జంగమాత్మకమైన ప్రపంచమే జలమయమైయున్నది. కావున యెట్టి జలమైనను విధి నిషేధములతో కూడి యుండునే. కాని పూర్తిగ నిషేధింప బడదు. నీరు లభించని యెడల నోరు ఎండి పోవుట, శరీరమంతయు పోట్లు మొదలగు కృచ్ఛ్రవ్యాధులు సంభవించి శరీరమును పీడించును. ఆరోగ్యవంతుడు గాని, రోగిగాని మంచినీరు లేకుండ జీవించ జాలరు.

**శశిలేఖ** : త్రాగు నీరు ఆహ్లాదమును కలిగించును. స్థావరజంగమములు సర్వము జల మయమైనవియే. యెందు వల్లననగా ఆరోగ్యవంతునికి వ్యాధివంతునికి గూడ నీరు లేకుండా జీవనము లేదు.

మూ॥ కేవలం సౌషధం పక్వమామ ముష్ణం హితం చ తత్ ।
సమీక్ష్య మాత్రయా యుక్త మమృతం విషమన్యథా।

ప్రతిపదార్థము : కేవలం=త్రాగుటకు యోగ్యమైన కేవల జలము, సౌషధం=ఓషధులతో మిశ్రమైన జలము; పక్వ=పక్వము చేయబడిన లేక మర్ల కాచిన జలము; ఆమ=ఔషధము లేకుండ కాచిన జలము; ఉష్ణ=మర్ల కాచిన నీరు; మాత్రయా=శాస్త్రము నందు చెప్పబడిన ప్రమాణముతో; యుక్తమ్=కూడిన; జలం=నీటిని; సమీక్ష్య=బాగుగా పరీక్షించి; యత్=యేది; ఉపయుజ్యతే=ఉపయోగించబడు చున్నదో; తత్=ఆ జలము; హితమ్=హితమైనది; చ=మరియు; అమృతమ్=అమృతముతో సమానమైనది; అన్యథా=అట్లు కానిది; విషమ్=విషముతో సమానమైనది.

తాత్పర్యము : త్రాగుటకు యోగ్యమైన జలము 5 విధములుగా నిర్దేశించబడినది. త్రాగుటకు ఉచితమైన జలము ఔషధములు కలిపిన నీరు పక్వము చేసిన నీరు, ఔషధము లేకుండ కాచిన నీరు, వేడి నీరు, మరల కాచిన నీరు అని ఈ 5 విధములైన నీరు ప్రమాణముతో స్నాన పానాదులకు అనగా బాహ్య ప్రయోగ అంతః ప్రయోగములలో ఉపయోగించిన యెడల అమృత తుల్యముగా నుండును. శాస్త్రవిరుద్ధమైన ఉదకము విషతుల్యమైనదిగా పరిగణింప బడుచున్నది.

శశిలేఖ : అవస్థానుసారముగా 5 విధములైన నీరు చెప్పబడు చున్నది 1. కేవలమ్, 2. సౌషదమ్, 3. పక్వమ్, 4. ఆమమ్, 5.ఉష్ణమ్, ఈ నీటిని మాత్రాప్రమాణముగ పర్యాలోకన చేసి సేవించిన యెడల అమృత తుల్యమనియు అట్లు కాకున్న విష సదృశమనియు చెప్పబడినది.

మూ॥ అతి యోగేన సలిలం తృష్యతోఽపి ప్రయోజితమ్।
ప్రయాతి శ్లేష్మ పిత్తత్వం జ్వరితస్య విశేషతః।
వర్ధయత్యా మతృన్నిద్రా తం ద్రాధ్మానాంగ గౌరవమ్।
కాసాగ్ని సాద హృల్లాస ప్రసేక శ్వాస పీనసాన్।

ప్రతి పదార్థము : తృష్యతోఽపి=దప్పి గొన్న వానికి కూడ; అతి యోగేన=ఎక్కువ పర్యాయములు;సలిలమ్=నీరు;ప్రయోజితమ్=ప్రయోగింపబడినట్లైతే; పిత్త శ్లేష్మత్వమ్=పిత్త శ్లేష్మ వికారములను; ప్రయతి=పొందించుచున్నది; విశేషతః=విశేషముగా; జ్వరితస్య=జ్వరితునికి; ఆమ=ఆమమును; తృట్=దప్పిని; నిద్రా=నిద్రను; తంద్ర=జాడ్యమును; ఆధ్మాన=కడుపుబ్బరమును; అంగ గౌరవమ్=శరీర గురుత్వమును; కాస=దగ్గును; అగ్నిసాద=అగ్ని మాంద్యమును;హృల్లాస=ఓకరింతలను,ప్రసేక=నీరూరుటను; శ్వాస=ఆయాసమును (బుసను); పీనసాన్=దుష్ట ప్రతిశ్యాయాదులను; వర్ధయతి=వృద్ధి చేయును.

**తాత్పర్యము :** దప్పిగొన్నవానికి కూడ అధికముగ పలుమార్లు నీటిని త్రాగించిన యెడల పిత్తశ్లేష్మవికారములు నిద్రాదులు వృద్ధిచెందును.

**శశిలేఖ :** ఎక్కువగా దప్పికొన్నవానికికూడ పిత్తశ్లేష్మ వికారములు సంభవించును. విశేషముగ జ్వరితునికి నిద్రాదులు వృద్ధియగును. హృల్లాస మనగా నోటిజల్లుతోకూడిన ఓకరింతలు అని అర్థము (సప్రసేకోహృదయోత్క్లేశంహృల్లాసం) ప్రసేకః = స్వతంత్రముగ వుమ్మివేయుట అని అర్థము. ప్రసేకః = స్వతంత్ర ఏవతచ్ఛష్ఠీవనమ్.

**వి.వ్యా. :** జ్వరమునందు ఆమదోషము, ఆమాజీర్ణము, ఆమవాతము మొదలగు వ్యాధులలో ఎక్కువనీటిని త్రాగకూడదు. దప్పి ఎక్కువగా వున్న ప్పటికిని పలుమార్లు దప్పియగు చున్నపుడుగూడ నీరు ఎక్కువగా త్రాగినప్ప టికిని దప్పిచల్లారదు. అవస్థానుసారము ఆ స్థితిలో కొద్దికొద్దిగా నీరు తాగ వలయును. వాత వృద్ధివలన పుట్టిన వ్యాధులలో చల్లనినీరు త్రాగినప్పటికి దప్పి ఎక్కువగునేగానితగ్గదు.విసూచియందుగూడ నీరు త్రాగుటవలన దప్పిచల్లారదు. ఈ స్థితిలో కొద్ది ప్రమాణములో పలుమార్లు నీటిని వుపయోగించవలెను. శ్లేష్మ పిత్తమనగా అమ్లపిత్తము. భావప్రకాశకారుడుగూడ అమ్లపిత్త నిదానములో ఇట్లు చెప్పెను.

> తతో మూర్ఛా ఽరుచిశ్ఛర్దిః ఆలస్యంచశిరోరుజా
> ప్రసేకో ముఖమాధుర్యంశ్లేష్మ పిత్తస్యలక్షణమ్॥ అని-

మూ॥ పాకేస్వాదు హిమం వీర్యే తదుష్ణమపి యోజితమ్।
తస్మాదయోగపానేన లాఘవాన్నవియోజయేత్॥

*ప్రతిపదార్థము :* తత్ = ఆ శీతజలము; ఉష్ణమపి = వేడిదైనప్పటికిని; పాకే = పాకమునందు; స్వాదు = మధురము; వీర్యే = వీర్యమునందు; హిమమ్ = శీతమైనదిగా; యోజితమ్ = అంగీకరింపబడినది; తస్మాత్ = ఆ కారణము వలన; అయోగపానేన = స్వల్పజలపానముచేత; లాఘవాత్ = స్వల్పమగుటవలన; నవియోజయేత్ = వదలిపెట్టకూడదు.

**తాత్పర్యము :** చల్లనీటివలె వేడినీరుగూడ పాకమునందు మధురము వీర్యమందు శీతముగా అంగీకరించ బడినది. మరియు కొద్దిగా త్రాగుటవలన లఘువుగా వుండును. త్వరగా పాకము చెందును. అందువలన యెట్టిపరిస్థితిలో గూడ వేడినీరు విడువగూడదు.

**శశిలేఖ :** జలములన్నియు మధుర విపాకము చెందునవియే. అందు వలన గోరు వెచ్చనినీరుగూడ శీతవీర్యమైనదిగా అంగీకరింపబడినది.

మూ॥ ఆమ విష్టబ్ధయోః కోష్ణః నిష్పిపాసోఽప్యపరిపిబేత్।
యావత్యః క్లేదయన్త్యన్నమతిక్లేదోఽగ్నినాశనః॥
విబద్ధః కఫవాతాభ్యాం ముక్తామాశయబన్ధనః
పచ్యతేఽతి క్షిప్రమాహారః కోష్ణతోయద్రవీకృతః

*ప్రతిపదార్థము* : ఆమవిష్టబ్ధయోః =ఆమాజీర్ణవిష్టబ్ధాజీర్ణములయందు; **నిష్పిపాసోఽపి** = దప్పిగొననివాడుకూడ; కోష్ణంఅపరి = గోరువెచ్చని నీరు; **పిబేత్** = త్రాగవలెను. యావన్త్యః=యెంతనీరు; అన్నం=అన్నమును; క్లేద **యంతి**=తడుపుచున్నచో; అతిక్లేదః = ఎక్కువద్రవముతో కూడిన అన్నము; **అగ్నినాశనః** = జఠరాగ్నిని చెరచును; కఫవాతాభ్యామ్ = కఫవాతములచేత; **విబద్ధః**=అడ్డగింప బడినదై, కోష్ణతోయద్రవీకృతః=గోరువెచ్చనినీటితో పలు **చగా** చేయబడినదై; ముక్తామాశయ బన్ధనః=బంధింప బడిన **ఆమాశయము** నుండి విడిపడినదై; క్షిప్రం=శీఘ్రముగా; పచ్యతే=పచింపబడుచున్నది.

*తాత్పర్యము* : ఆమాజీర్ణవిష్టబ్ధా జీర్ణములయందు దప్పిలేకున్నను గోరు వెచ్చని నీటిని త్రాగుచుండవలెను. ఎంత ఉదకము అన్నమును ఆర్ద్రిముగా చేయునో అంత జలమును పానము చేయవలెను. ఎక్కువనీరు త్రాగినయెడల అగ్నిమాంద్యమేర్పడును.

*శశిలేఖ* : ఆమం=(శ్లేష్మణోపహతజఠరత్వాదజీర్ణమన్నమ్) అనిఅర్థము; విష్టబ్ధమ్=వాతాజీర్ణమ్.

**భావార్థము**: కఫవాతములచేత అడ్డగింపబడిన అన్నము జీర్ణముకాక **ఆమా** జీర్ణ విష్టబ్ధాజీర్ణములను కలిగించును. **ఈ** ప్రక్రియ ఆమాశయమునందు జరుగు చున్నది. గోరువెచ్చని నీరు త్రాగుటచేత ఆమాశయమునందు ఆన్త్రిముల యందు రుద్ధమైన **ఆమము** జీర్ణింపబడి పైదోషములకు గమనానుకూల వ్యాపారమేర్పడును. అనగా విష్టబ్ధాజీర్ణమందు, అడ్డగింపబడిన **ఆహారము** ఆన్త్రిములలోనికివెళ్ళి పాకము చెందును మరియు ఉష్ణజలము ఆమాశయము నందు పిండీభూతమైన ఆహారమును ద్రవప్రాయముగా చేయును. అందువలన సుగమముగా ద్రవీభూతమైన **ఆహారము**ను ఆన్త్రిములలోనికివెళ్ళి పాకావస్థను చెందును.

మూ॥ అనవస్థితదోషాగ్నేర్వ్యాధి క్షీణబలస్యచ॥
నాల్పమప్యామముదకం హితం తద్ధిత్రిదోషకృత్।
శ్లేష్మణః ప్రతిపక్షత్వాన్మందాగ్నిర్వర్జయేజ్జలమ్।
సర్వ యేవత థాస్యన్త ప్లీహ విద్రధి గుల్మనః।
పాండూదరాతి సారార్శో గ్రహణీ శోషశోఫినః
కామ మల్పమశక్తాతుం పేయమౌషధ సంస్కృతమ్
ఋతేశరన్నిదాఘాభ్యాం పిబేత్ స్వస్థోఽపి చాల్పశః।

*ప్రతిపదార్థములు* : అనవస్థితదోషాగ్నేః = వాతాది దోషములు జాఠరాగ్ని విషయముగ నుండు వ్యాధితునికి; చ = మరియు; వ్యాధి క్షీణ బలస్య = వ్యాధియే కారణమై క్షీణించు బలము గలవానికి; అల్పమప్యా మముదకమ్ = కొద్ది ప్రమాణమైనను పట్టి నీరు; నహితమ్ = పథ్యము కాదు; తద్ధి = ఆ అసంస్కృత జలము; త్రిదోషకృత్ = మూడు దోషములను వృద్ధి చేయును; తేజసః = అగ్నికి; ప్రతిపక్షత్వాత్ = విరోధియగుట వలన (జలము) మందాగ్నిః = సన్నగిల్లిన జాఠరాగ్నిగల మానవుడు; జలం = నీటిని; వర్జయేత్ = విడువవలయును; తథా = అట్లే సర్వం (జలమ్); అపి = కూపాదుల యందలి నీటిని కూడ; వర్జయేత్ = విడువవలెను; స్వస్థ = అభిష్యందమను పేరుగల నేత్ర రోగము; ప్లీహ = ప్లీహోదరము; విద్రధి = విద్రధి రోగము; గుల్మినః = గుల్మరోగికి; పాండు = పాండురోగము; ఉదర = ఉదరరోగము; అతిసార = అతిసార రోగము; అర్శ = అర్శరోగము; గ్రహిణీ = గ్రహిణీ రోగము; శోష = శోష రోగము; శోఫినః = శోఫ రోగికి; సర్వమేవ జలం = నీరు గోరువెచ్చని నీరు; నహితమ్ = మంచిదికాదు; తతః = అందునలన; వర్జయేత్ = విడువ వలెను; అశక్తౌతు = శక్తిలేనివాడైనయెడల; ఔషధ సంస్కృతమ్ = తగిన ఔషధములయొక్క సంయోగముచేత సంస్కరింపబడిన; అల్పమ్ ఉదకమ్ = స్వల్పమాత్రతో గూడిన పై జలమును; కామం = కోరికకు తగినట్టుగా; సేయమ్ = త్రాగదగినది; స్వస్థోఽపి = ఆరోగ్యవంతుడై నప్పటికిని; అల్పశః = కొద్దిగా; పేయమ్ = త్రాగదగినది; ఋతశరన్నిదాఘాభ్యామ్ వినా = శరద్ గ్రీష్మ ఋతువులను విడిచిపెట్టి.

*తాత్పర్యము* : మిథ్యాహార విహారాదులచేత వాత పిత్త శ్లేష్మములుజాఠరాగ్ని విషమముగా నున్నపుడు, రోగములచేత దుర్బల శరీరుడుగా నున్నపుడు కొంచమైనను మంచినీటిని త్రాగరాదు. త్రాగిన యెడల ఆ జలము వాత పిత్త శ్లేష్మలను వృద్ధి పరచుటయేగాక జాఠరాగ్నికిమరింతవిషమమునుచేకూర్చగలదు. నీరు అగ్నికి బద్ధ శత్రువు. అందుకొరకు మందాగ్నిగల మానవుడు నీటిని త్రాగరాదు. ఉష్ణ జలమును కొద్ది కొద్దిగా త్రాగవలయును. అభిష్యన్దాది రోగములచే పీడింపబడుచున్న రోగి అన్ని విధములైన జలములను విడిచిపెట్టవలయును. కోరికను బట్టి దప్పిక చల్లారుటకు సంస్కరింపబడిన నీటిని కొద్ది కొద్దిగా త్రాగవలెను. ఆరోగ్యవంతుడు గూడ శరత్ గ్రీష్మ ఋతువులను వదలి ఇతర ఋతువులలో చాలా కొద్దిగా జలపానము చేయవలయును. శరత్ గ్రీష్మ ఋతువులలో కడుపునిండా నీరు త్రాగినప్పటికిని ఆ జలము పాకమగును. ఎందుకనగా ఆ రెండు ఋతువులు ఉష్ణకాలములు. అందువలన ఆ రెండు ఋతువులలో ఎక్కువ నీటితో అవసరముండును.

*శశిలేఖ* : వ్యాధులచే బలక్షయ మేర్పడినపుడు ఆ వ్యాధిగ్రస్తునికి ఆమజలము త్రిదోషములను వృద్ధి పరచును. అట్లే మన్దాగ్నిగల మానవునికి

కూపతటాకాదుల యందలి నీరు పక్వము చేయబడిన నీరు ఎక్కువ ప్రమాణ ములో వదలి పెట్టవలయును.

మూ॥ భక్తస్యాదౌ జలం పీత మగ్ని సాదం కృశాంగతామ్।
అన్తే కరోతి స్థూలత్వ మూర్ధ్వంచామాశయాత్ కఫమ్॥
మధ్యే మధ్యాంగతాం సామ్యం ధాతూనాం జీరణం సుఖమ్।

**ప్రతిపదార్థము :** తత్ జలం = ఆ ఉదకము; భక్తస్యా ఒ దౌ = భోజన సమయమునకు ముందు; పీతం = పానం చేసిన; అగ్నిసాదం = అగ్నిమాంద్యమును; కృశాంగతాం = కార్శ్యమును; కరోతి = చేయుచున్నది; అన్తే = భోజనము ముగిసిన తర్వాత, పీతం = త్రాగిన జలము, స్థూలత్వం = శరీరమునకు స్థౌల్య మును; చ = మరియు; ఆమాశయాత్ = ఆమాశయమునకంటె పై భాగమున; కఫం = శ్లేష్మవృద్ధిని; కరోతి = చేయుచున్నది; మధ్యే = భోజనమునకు మధ్యన; పీతం = త్రాగిన నీరు; మధ్యాంగతాం = మధ్యమ స్థితిని; ధాతూనాం సామ్యం = ధాతువులకు సామ్యావస్థను; సుఖమ్ = సుఖముగా; జీరణం = జీర్ణమును; కరోతి = చేయుచున్నది.

**తాత్పర్యము :** ఈ శ్లోకములో భోజన సమయములో ఆదిమధ్యఅంత కాలములలో త్రాగిన నీటివలన కలుగు ప్రయోజనములను వివరించుచున్నారు. భుజించుటకు ముందు నీటిని త్రాగుటవలన మందాగ్ని శరీరము కృశించి పోవుట సంభవించును. భుజించిన తర్వాత త్రాగిన జలము శరీరమునకు స్థౌల్యమును కలిగించును. ఇట్లే ఆమాశయమునందును ఆమాశయ పైభాగమునందలి ఉరస్సు కంఠము శిరస్సులలో కఫవృద్ధిని చేయును. భోజన మధ్యమున నీరు త్రాగిన యెడల శరీరమును మధ్యమ స్థితిలోనుంచి (కృశత్వమును స్థూలత్వమును కలి గించక) రసరక్తాది ధాతువులను సమస్థితిలో నుంచును. మరియు సుఖముగ ఆ నీరు జీర్ణమగును. (అనగా భోజనము యొక్క ఆద్యంతముల యందు నీటిని త్రాగరాదు. భోజన మధ్యములో మాత్రమే జలపానము ఆరోగ్యప్రదముగా నుండును).

**శశిలేఖ :** తాత్పర్యాంశమే పొందుపరచబడినది.

మూ॥ శీతం మదాత్యయగ్లాని మూర్ఛా చర్ది శ్రమ భ్రమాన్।
తృష్ణోష్ణ దాహ పిత్తా సృగ్విషాణి చ నిహన్తి తత్।

**ప్రతిపదార్థము :** తత్ శీతం అమ్బు = ఆ చల్లని నీరు; మదాత్యయ = మదాత్యయరోగము = గ్లాని, శ్రమచేత గలిగిన దౌర్బల్యము; మూర్ఛ = మూర్ఛ (స్మృతి దప్పుట) (సొమ్మ) ఛర్ది = వాంతి; శ్రమ = అలసట; భ్రమాన్ = భ్రమ రోగములను (తిరుగుడు); తృట్ = దప్పి; ఊష్మ = వేడినిట్టూర్పు; దాహ =

తాపము; పిత్త=పిత్త వికారము; అస్రి=రక్త వికారము; విషాణి=విష వికారములను; నిహన్తి=నాశము చేయును.

తాత్పర్యము : శీత జలము మదాత్యయాది రోగములను నాశనము చేయును.

*శశిలేఖ :* దాహః అనగా ఉష్ణ కాలము చేత వేడియైన ఆహారాదుల చేత ఏర్పడు దానిని ఉష్ణ దాహఃయని యందురు.

వి. వ్యా : ఊష్మ యనగా చెమటలు ఎక్కువగా పట్టుట, లోపలనున్న వేడి చేత స్వేదము ఉత్పన్నమగును. అప్పుడే అన్తర్దాహి యేర్పడును. మరియు ఉష్ణ జనిత దాహము శీత జలముతో శాన్తించును. కాని విషూచియందేర్పడిన దాహము వేడి నీటితోనే శాన్తించును కాని చన్నీటితో శాన్తించదు.

మూ॥ క్షీణ పాద త్రిభాగార్థం దేశర్తు గురు లాఘవాత్।
క్వథితం ఫేన రహిత మవేగ మమలం హితమ్
హిధ్మాధ్మానా నిల శ్లేష్మ తృట్ కాస శ్వాసపీనసే।
పార్శ్వ శూల మమేదస్సు సద్యః శుద్ధేనవజ్వరే।
దీపనం పాచనం కంఠ్యం లఘువస్తి విశోధనమ్।

*ప్రతిపదార్థము :* దేశర్తు గురులాఘవాత్=దేశ ఋతు గురు లాఘవముల వలన; వికల్ప్య=కల్పించి; క్షీణపాద, త్రిభాగ అర్థమ్=పాదహీనముగ, త్రిభాగ హీనముగ, అర్థభాగముగాగల; ఫేన రహితం=నురుగు లేకుండ; క్వథితం= కాచబడిన; అమలం=స్వచ్ఛమైన (నిర్మలమైన); జలం=నీరు; హితమ్ = పథ్యమైనది; చ=మరియు; హిధ్మ=ఎక్కిళ్ళు; ఆధ్మాన =కడుపుబ్బరము; అనిల= వాత జనిత రోగములు; శ్లేష్మ=కఫ జనిత రోగములు; తృట్ =దప్పి; కాస= దగ్గు, శ్వాస, ఋస, పీనసే — ప్రతిశ్యాయము నందు, పార్శ్వశూల=ఇరు పార్శ్వములయందు నొప్పి; ఆమ=ఆమజనిత రోగముల యందు; మేదస్సు=మేదో ధాతు గత రోగముల యందు; సద్యః శుద్ధే=అప్పుడే చేసిన వమన విరేచనాది సంశోధనమునందు; నవజ్వరే=నవజ్వరము నందు; హితం=పథ్యమైనది; చ= మరియు; దీపనం=దీపనమును; పాచనం=పాచనమును; కంఠ్యం=కంఠ రోగ నాశకముగను, లఘు=లఘువుగను; బస్తివిశోధనమ్=మూత్రాశయమును శుద్ధి చేయునదిగను; భవతి=అగుచున్నది.

తాత్పర్యము : వేడినీరు తయారు చేయుటకు విధి, వేడి నీటి గుణములు చెప్పబడుచున్నవి.

1. క్షీణ పాద=4 భాగములు జలము, 3 భాగములు మిగుల్చుట.

2. త్రిభాగ=3 భాగములు జలము 1 భాగము మిగుల్చుట,

3. అర్ధ = 4 భాగములు జలము, 2 భాగములు మిగుల్చుట.

4. క్వథితమ్ = 1, 2 మార్లు మర్ల గాచుట.

ఇట్లు సంస్కరింపబడు జలము దేశ (అనూప జాంగల సాధారణ) మును బట్టి ఋతు (హేమంతాది ఋతువులు) విభాగమును బట్టి మరియు నీటి యొక్క గురు లఘువులను నిర్ణయించి ఉపయోగించ వలెను. నీటిని కాచునపుడు నురుగు మలినము లేకుండునపుడు అది పథ్యకరమైనదిగా గ్రహించవలెను. ఇట్టి జలము హిక్కాది రోగములను శమింపచేయును. మరియు మూత్రాశయమైన వస్తిని గూడ శోధించును. స్వచ్ఛమైన జలమును కాచునపుడు నురుగు రాదు. నురుగు వచ్చిన యెడల అది స్వచ్ఛ జలముగా పరిగణింప బడదు. పక్వ జలము శీతలమైనను పానయోగ్యమగును.

*శశిలేఖ :* యే జలము దేశమును బట్టి ఋతువునుబట్టి గురు లఘువులను బట్టి క్షీణ చతుర్భాగముగ కాచవలెను.. (4 భాగములు నీరు 1 భాగము మిగుల్చుట). ఒక్క గురువుగా నున్న జలము క్షీణ త్రిభాగము (3 భాగముల జలము 1 భాగము మిగుల్చుట) స్వల్ప గుణము గురువుగానున్న అర్ధక్షీణముగా (4 భాగములు నీరు 2 భాగములు మిగుల్చుట) కాచవలెను. ఆ నీరు అగ్నితో తప్తమైనప్పటికి నురుగారని యెడల ఆమ జలముగా తెలుసుకొన వలెను. నురుగు లేనిది కాచినదియేయగును. కాచబడిన నీటికి కాచునపుడు పొంగు రాకుండుట స్వచ్ఛముగా నుండుట (నిర్మలము) లక్షణము. కాచిన హిక్కాదులను శమింప చేయును. మరియు దీపనము ఆమ దోషము పోగొట్టును. స్వర భంగమును పోగొట్టు శరీరమునకు తేలికదనము నిచ్చి మూత్రాశయమైన వస్తిని శోధించును. నవజ్వరమనగా సామ జ్వరముగా నిర్ణయించవలెను.

మూ॥ పాషాణ రూప్య మృద్ధేమ జతు తాపార్క తాపితమ్॥
పానీయ ముష్ణం శీతం వా త్రిదోషఘ్నం తృడర్తిజిత్॥
లఘ్వ రూక్షం క్రమఘ్నంచ తోయం క్వథిత శీతళమ్।
సంసర్గే పిత్త కఫయోః సన్నిపాతేచ శస్యతే।
తోయం వహ్ని గుణ భ్రష్టం పాకే ఒమ్లం సర్వదోషకృత్॥
భవేత్పర్యుషితం తచ్చ—

*ప్రతిపదార్థము :* పాషాణ=అగ్ని తప్తమైన రాయిచేత; రూప్య= వెండితో; మృత్=మట్టితో; హేమ=బంగారముతో; జతు=లక్కతో (లక్కను అగ్ని సంస్కారము చేసివైచిన); తాప=అగ్నియొక్క వేడితో; అర్క=సూర్య కిరణములతో; తాపితం=వేడి చేయబడిన; పానీయమ్=పానయోగ్యమైన; తోయం=జలము; ఉష్ణమ్=వేడిదియైన; వా=లేక; శీతం=చల్లనైనది. (త్రిదోషఘ్నం=వాత పిత్త శ్లేష్మలను శమింపచేయును; తృడర్తిజిత్=దప్పిని

శరీరవేదనను జయించును, క్వథిత్ శీతలమ్=కాగి చల్లారిన; పర్యుషితం=బహు కాలముంచబడిన; తోయం=ఆ జలము; లఘు=లఘువుగా నుండును; అరూక్షమ్=రూక్షముగా వుండదు; చ=మరియు; క్లమఘ్నమ్=గ్లాని పోగొట్టును; పిత్తకఫయోః=పిత్త కఫముల యొక్క; సంసర్గే=సంసర్గమునందు; చ=మరియు; సన్నిపాతే=త్రిదోష సన్నిపాతమునందు; శస్యతే=ప్రశస్తమైనది; వహ్ని గుణ భ్రష్టమ్=అగ్నితప్తమైన గుణముల నుండి భ్రష్టమైన; తోయం=నీరు; పాకే=పరిణామమునందు; అమ్లమ్=ఆమ్లమైనది; సర్వ దోషకృత్=వాయువు మొదలగు సమస్త దోషములను వృద్ధి చేయునదిగా; భవేత్=అగును.

తాత్పర్యము : అగ్నిలో వేసి కాల్చిన రాళ్ళతో, వెండితో, మట్టితో లేక ఇటుకతో, బంగారముతో, అగ్నిలో తప్తమైన లక్కతో లేక ఎండలో పెట్టి సూర్యకిరణములతో వేడిచేయబడిన జలము, వేడిగా నున్నపుడు గాని చల్లారి చల్లగా నున్నపుడు త్రిదోష శామకముగా, లఘువుగా,రూక్షము లేకుండు నదిగ గ్లానిని పోగొట్టునదిగ శరీరవేగము రూపుమాపునదిగ ద్విదోష సంసర్గములో సన్నిపాతములో కూడ ప్రశస్తమైనదిగా చెప్పబడినది. కాచబడిన జలము 1, 2 దినములు ఉంచబడినట్లైన అగ్నియొక్క దీపన పాచనాది గుణములనుండి భ్రష్టమగుచున్న (దీపనపాచనాదిగుణములు ఆ జలములో నుండవని తాత్పర్యము) పరిణామమునందు గూడ ఆ జలము ఆమ్లపాకమును చెంది వాయువు మొదలగు సమస్త దోషములను వృద్ధిచేయును.

శశిలేఖ : పాషాణాదులచేత తప్తమైన జలము అప్పుడే వేడిచేయబడి చల్లార్చిన జలము త్రిదోషశామకము దప్పిని చల్లార్చునదిగా కూడ అగును. పై చెప్పబడిన భాగములయందు, శీతజలము వాతశ్లేష్మలను వృద్ధిచేయునని చెప్పబడును. తక్కినది తాత్పర్యాంశము.

మూ॥ తోయం హిమకరోద్భవమ్ ।
అగ్నిశైత్యగురుస్థైర్యసంఘాతైః కఫవాతకృత్ ।
చంద్రకాంతభవం రక్షోవిషపిత్తజ్వరాపహమ్
దృష్టిమేధావపుస్థైర్యకరం స్వాదుహిమం లఘు ।
తృష్ణాపిత్తానిలహరం దీపనం వస్తిశోధనమ్ ॥

ప్రతిపదార్థము : హిమకరోద్భవం=వడగండ్లు పడుటచేత పుట్టిన; తోయం=జలము; అతిశైత్య గురుస్థైర్యసంఘాతైః=మిక్కిలి చల్లదనము గురు గుణము కలది, ఎక్కువ గమనానుకూల వ్యాపార రహితమైకూడియుండుటచేత; కఫవాతకృత్=కఫవాతములను వృద్ధిపరచును; చంద్రకాంతభవం=చంద్ర కిరణములచేత ఉత్పన్నమైన; తోయం=జలము; రక్షోవిషపిత్తజ్వరాపహమ్= రాక్షస బాధను విషబాధలను పిత్తవికారములను జ్వరమును పోగొట్టును; స్వాదు=మధురమైనది; హిమం=చల్లనైనది; లఘు=లఘుగుణముకలది;

నాళికేరోదకం=టెంకాయయందలి నీరు; స్నిగ్ధం=స్నిగ్ధగుణమును; స్వాదు=మధురరసమును, వృష్యం=వాజీకరముగను, హిమం=చల్లగను; లఘు=తేలికగను, దీపనం=దీపనము చేయునదిగను; వస్తిశోధనమ్=వస్తిని శోధించునదిగను వుండును; తృష్ణాపిత్తానిలహరం=దప్పిని వాతపిత్తములను శమింప చేయును.

**తాత్పర్యము :** చంద్రకిరణముల చేత ఉత్పన్నమైన జలము రాక్షస బాధలను విషవికారములను పిత్తజ్వరమును తొలగించును. దృష్టిని వర్ధకముగను మేధావర్ధకముగను శరీరమునకు కాన్తిని పుష్టిని ప్రసాదించునదిగను ధైర్యము కలిగించునదిగను ప్రతిపాదింపబడినది. మరియు మధురముగా నుండి శీతలమై లఘుగుణము కలిగియుండును.

నారికేళోదకము స్నిగ్ధగుణమును మధురరసమును వాజీకరణముగను శీతలమైనదిగను, తేలికగా జీర్ణమగునదిగను వుండును, మరియుదప్పిని పిత్తవాత వికారములను శమింపజేసి అగ్నిని వృద్ధిపరచి మూత్రాశయమైన వస్తిని శోధించును.

*శశిలేఖ :* హిమకరస్రుతమైన జలము ఎక్కువ చల్లదనముగలది యగుట వలన వాతశ్లేష్మలను వృద్ధిపరచును. చంద్రకాంతభవమైన జలము రక్షోఘ్నముగా నుండును.

వి.వ్యా. తత్ర ఆన్తరిక్షం చతుర్విధమ్- తద్యథా- ధారం, కారం, తౌషారం హైమం ఇతి, తేషాం ధారం ప్రధానం లఘుత్వాత్, తత్పునః గాంగం సాముద్రం చ ఇతి, తత్ గాంగం ఆశ్వయుజే మాసిప్రాయశోభవతి । సు. సూ. అ 45/7. ఆకాశోదకము 4 విధములు. 1) ధారం, 2) కారం, 3) తౌషారం, 4) హైమం. 1) ధారం=వానకాలు (వర్షజలము) కారం=వడగండ్లు నీరు, తంపరవాననీరు, చల్లని నీరు, తౌషారం=మంచునీరు, హైమం=మంచుగడ్డల నీరు. వీటిలో వర్షజలము (ధారం) శ్రేష్ఠము. ఎందుకనగా తక్కిన 3 విధములైన నీటికంటె లఘువుగా నుండును.

ఆకాశోదకము మరల రెండు విధములు, గాంగం, సాముద్రమని. గంగోదకము తరుచుగా ఆశ్వీజమాసములో ప్రవహించును. కారజలము తరుచుగా మాఘ ఫాల్గుణమాసముల వర్షముతో కూడ శనగగింజ తానికకాయ ప్రమాణముతో పడును. వీటినే "వడగండ్లు" యని చెప్పుదురు.

తౌషారజలము ప్రొద్దున పూట గడ్డిపైన ముత్యములవలె ప్రకాశవంతముగా నుండును. ఈ నీటిని సర్పములు కుక్కలు మొదలగు నాలుకచే దప్పిని శాంతిప చేసుకొను జంతువులు త్రాగుచుండును. ఈ నీరు రాత్రులందే కనబడును. పగలు సూర్యకిరణములచేత ఎండిపోవును.

---

**గమనిక : 161 పేజీ బదులు 177 పేజీ 11 ఫారం బదులు 12 ఫారం అనీ, పొరపాటున ముద్రింపబడినది. మేటరు వరుసక్రమంలో తేడాలేదు.**

హైమజలము మంచుకొండలలో వుండును. ఇది సూర్యకిరణములు పడుట చేత పగిలి నీరుగా ప్రవహించును.

మూ॥ దివ్యంవారి వరం వర్షే నాదేయమవరంపరమ్ ।

ప్రతిపదార్థము : వర్షే = వర్ష ఋతువునందు; దివ్యంవారి = ఆకాశోదకము; వరం = మిక్కిలి శ్రేష్ఠమైనది; నాదేయమ్ = నదినుండి తెచ్చిన నీళ్ళు; పరం అవరమ్ = మిక్కిలి అశ్రేష్టమైనది (అపథ్యము).

తాత్పర్యము : వర్ష ఋతువునందు ఆకాశోదకము శ్రేష్ఠము. నదీజలము నింద్యము.

శశిలేఖ : తాత్పర్యాంశమే.

## క్షీరవర్గము

మూ॥ స్వాదు పాకరసం స్నిగ్ధ మోజస్యం ధాతువర్ధనమ్ ।
వాతపిత్తహరం వృష్యం శ్లేష్మలం గురుశీతలం॥,
ప్రాయః పయః ।

ప్రతిపదార్థము : ప్రాయః = తరచుగా; పయః = పాలు; స్వాదు = మధురమైనవి; పాకరసం = పాకమునందు మధుర విపాకము గలవి; స్నిగ్ధం = స్నిగ్ధముగా నుండును; ఓజస్యం = ఓజోవృద్ధిని చేయును; ధాతువర్ధనం = ధాతువులను వృద్ధిపరచును; వాతపిత్తహరం = వాతపిత్తములను శమింపచేయును; వృష్యం = వాజీకరణమును చేయును; శ్లేష్మలం = శ్లేష్మమును చేయును; గురు = గురుగుణమును; శీతలం = చల్లదనము కలిగించును.

తాత్పర్యము : అన్ని జాతులకు చెందిన పాలు, మధురరసమును మధురవిపాకమును కలిగియుండును. ఓజోవర్ధకముగను ధాతువర్ధకముగను వృష్యముగను శ్లేష్మములను వృద్ధిచేయునదిగను గురుగుణము కలదిగను చల్లనైనదిగను చెప్పబడినది.

శశిలేఖ : ఓజసేహితంఓజస్యం- ఓజస్సు అనగా ధాతువులయొక్క సారభూతము, వృష్యమనగా శుక్రమను పేరుగల ధాతువృద్ధికంటె స్త్రీని రమించు శక్తి యెక్కువగా చేయునది అని అర్థము.

వి. వ్యా. : పై శ్లోకమునందు ప్రాయః అను పదము గలదు. ధాతువులు వృద్ధిచెందుటవల్లనే శుక్రము కూడా వృద్ధిచెందును అను అర్థమగుచున్నప్పటికి ప్రాయః అను పదమునుపయోగించుట వలన కొన్ని క్షీరములు ధాతువృద్ధిని చేయుటలేదు, ఎందువల్లననగా ఒంటెపాలు కొద్దిరూక్ష, ఉష్ణగుణములు కలవిగాను లవణరసము కలదిగను ముందు చెప్పబడుచున్నది. మరియు మేకపాలు

లము గుణము కలవిగను, గోక్షీరపాలు ఉష్ణ వీర్యము కలవిగను, గుఱ్ఱముపాలు ఉష్ణవీర్యమును అమ్లలవణరసములు కలవిగనుముందు చెప్పబడుచున్నది. మధుర రసము మధుర విపాకముగల పాలకు స్నిగ్ధవృష్యాది గుణములు స్వతస్సిద్ధములై యుండగా మరల ఆగుణములు ఎందుకు చెప్పబడినవను ప్రశ్నమునకు, క్షీరమునకు స్నిగ్ధవృష్యాది గుణములకంటె వేరైన అనేక గుణములు క్షీరమునందు కలవని తెలుపుటకే స్నిగ్ధాది గుణము మరల చెప్పబడెనని సమాధానము చెప్పుకొనవలెను. మధుర రసము అని చెప్పినంత మాత్రముననే మధుర విపాకమని గుర్తించవలసి యున్నది. ఎందుకనగా "స్వాదుః పటుశ్చ మధురం అమ్లోమం పచ్యతే రసః" అని చెప్పుట వలన ఇట్లు అర్థమగుచుండగా "పాకః" అని మరల చెప్పుట ఎందుకు ? గురు గుణముగల సమస్త పదార్థములకు విదాహావస్థయనునది గలదు. అప్పుడు అమ్ల భావమును చెందును. పాలు మాత్రము గురుగుణము కలవి, అయినప్పటికి కూడా విదాహావస్థయందు పరిణామమును చెందక పూర్వమే మధుర విపాకమును చెందుచున్నవి. ఈ విషయమును స్పష్టీకరించుటకే "పాకః" యను పదము వుపయోగింపబడినది. స్త్రీలకు ఆహార రసమే అపత్యస్నేహము వలన క్షీరముగా పరిణామము చెందుచున్నది. ఈ విషయములో "స్త్రీణాం అపత్య జాత్ హార్షాత్" "రసః క్షీరాయ కల్పతే స్నేహాత్ రసః క్షీరతి ఏవం హృదయాత్ క్షీర మేతి అతః" అని.

మూ॥ అత్ర గవ్యంతు జీవనీయం రసాయనం
క్షత క్షీణ హితం మేధ్యం బల్యం స్తన్యకరం సరం ।
శ్రమ, భ్రమ, మదా లక్ష్మీ శ్వాస కాసాతి తృట్ క్షుదః
జీర్ణ జ్వరం మూత్ర కృచ్ఛ్రం రక్త పిత్తం చనాశయేత్ ।

ప్రతిపదార్థము : అత్ర=ఇచ్చట; గవ్యంతు=ఆవుపాలయితే; జీవనీయం=జీవనాధారమైనవి; రసాయనం=రసాది ధాతువులను వృద్ధి పరుచునది; క్షత క్షీణ హితం=ఉరక్షత, రాజయక్ష్మ రోగులకు హితమైనది; మేధ్యం=బుద్ధిబలమును పెంపొందించునది; బల్యం=శక్తివర్ధకమైనది; స్తన్యం = స్తన్యవృద్ధికరమైనది, సరం=సర్వశరీరమును వ్యాపించునది;చ = మరియు; శ్రమ=ఆయాసమును, భ్రమ=తలతిరుగుటను; మద=మదమును, అలక్ష్మి=కాంతిహీనతను; శ్వాస=ఉబసరోగమును, కాస=దగ్గును, అతి తృట్ క్షుదః=ఎక్కువగా నున్న ఆకలి దప్పులను (భస్మకరోగం)మూత్రకృచ్ఛ్రం = మూత్రకృచ్ఛ్రమును, రక్తపిత్తం =రక్తపిత్తమును, జీర్ణజ్వరం=జీర్ణజ్వరమును; నాశయేత్ = నశింపజేయును.

తాత్పర్యము : ఆవుపాలు ఎక్కువకాలము జీవించుటకు ఉపయోగపడుచు రస రక్తాది ధాతువులయొక్క నిర్మాణమునకు వృద్ధికి దోహదకారియగు

చున్నవి. ఉరక్షతాది రోగములను నశింపజేయు చున్నవి. ధనమును సంపాదించు టకు అసమర్థుడైన మానవునకు, కాంతిని, ఉత్సాహమును కలిగించును.

**శశిలేఖ** : జీవనీయ మనగా సౌమ్యధాతువులైన రసరక్తాదిధాతువులను వృద్ధిచేయుటవలన జీవితమును పెంపొందించునని యర్థము-మేథాయైహితం మేధ్యం-బుద్ధిని వికసింపజేయునది, సరం-శరీరమునందు ఒకచోట వుండునదికాదు (సర్వశరీరవ్యాపి యని అర్థము).

**మూ॥** హితమత్యగ్న్యని ద్రేభ్యోగరా యో మాహిషం హిమం.

**ప్రతిపదార్థము** : మాహిషం=బఱ్ఱెపాలు, అత్యగ్ని=తీక్ష్ణాగ్నిగలవారికి; అనిద్రేభ్యః=నిద్రలేనివారికి, హితం=శ్రేష్ఠమైనది. హిమం=శీతవీర్యమైనది. చ=మరియు, గరాయం=గురుగుణముకలది.

**తాత్పర్యము** : బఱ్రెపాలు తీక్ష్ణాగ్నికలవారికి, నిద్రలేనివారికి, పథ్యకరమైనవి, గురుగుణము కలది. మరియు శీతవీర్యమైనది.

**శశిలేఖ** : శ్లోకమునందు గరేయః వ్యాఖ్యానకారుడు "అతిగురు" అని గురుగుణమును చెప్పెను.

**వి. వ్యా** : బఱ్ఱెపాలు ఎక్కువ జాఠరాగ్ని గలవారికి నిదానాది కారణములచేత నిద్రలేనివారికి గురుగుణము కలవిగావున పథ్యకరమైనవి. ఈవిషయములో చరకుడు" మహిషేణాంగురుతరం" గవ్యాచ్ఛీతతరంపయః స్నేహోదూనమనిద్రాణా మత్యగ్నినాం హితం చతత్" "చ. సూ. అ. 27/295" ఆవుపాలకంటె బఱ్రెపాలలో ఎక్కువ స్నిగ్ధత లభించుచున్నది అని చెప్పెను. ఆవుపాలకంటె ఎక్కువ స్నిగ్ధగుణమునుఎక్కువ గురుగుణమునుకలిగి బఱ్రెపాలు నిద్రను కలుగ జేయునని రవిగుప్తుడను ఆచార్యుడు నుడివెను. ఏమైనప్పటికిని బఱ్రెపాలుకూడ శ్రేష్ఠమైనవి.

**మూ॥ అల్పాంబుపాన వ్యాయామ కటుతిక్తాశనైర్లఘు।**
**ఆజం శోషజ్వశ్వాస రక్తపిత్త అతి సారజిత్॥**

**ప్రతిపదార్థము** : ఆజంపయః=మేకపాలు, అల్పాంబుపాన=కొద్దిగా నీరు త్రాగుటచేత, వ్యాయామః= ఎగురుట దుముకుట, ఉరుకుట మొదలగు వ్యాయామముల చేత, కట్టుతిక్తాశనైః=కటురసముగల జిల్లేడు మొదలగు ఆకులను చేదుగల వేపమొదలగు వృక్షములయొక్క ఆకులను తినుటచేత, లఘు=లఘు గుణముకలది; శోష=రాజయక్ష్మను, జ్వర=జీర్ణజ్వరమును; శ్వాస=ఉబ్బసమును; రక్తపిత్తమును; అతిసార=అతిసార, రోగమును; జిత్=జయించును.

**తాత్పర్యము** : మేకపాలు లఘు గుణముకలవి. మరియు శోషాదిరోగములను శమింపచేయును. అల్పాంబు పానాదుల చేత మేకపాలయందులఘు గుణము

స్వతస్సిద్ధముగా నుండును.

*శశిలేఖ :* మేకలకు స్వల్పాంబు పానములు స్వభావసిద్ధ**ము**లు. ఇచట అల్పాంబు పానాదులు క్షీరములందలి లఘుత్వ గుణమును తెల్పుటకే చెప్పబడి నవి.

వి. వ్యా : ఏజంతు వైనప్పటికి దానియొక్క ఆహారవిహారములనుబట్టి గురు, లఘు గుణములు నిర్ణయించవలసి యుండును. మరియొక విశేషమేమ నగా ప్రభాత సమయమున గ్రహింప బడిన క్షీర**ము** విహారాదులు లేనందువలన గురుగుణము కలిగి యుండును. ఎందుకనగా ప్రాణికోటి రాత్రులయందు చేష్టారహితులుగా నుందురు. పగలు పరిగెత్తుట, నడచుట, దుముకుట మొద లగు చేష్టలను కలిగియుండుట వలన సాయంత్రము గ్రహింపబడిన క్షీరము లఘు గుణము కల్గియుండును.

**మూ॥** ఈషద్రూక్షోష్ణ **లవణ** మౌష్ట్రికం దీపనం లఘు॥
శస్తం వాతకఫానాహక్రిమి శోఫోద రార్శసామ్।

*ప్రతిపదార్థము:*ఔష్ట్రికం = ఒంటెపాలు,ఈషత్ =కొంచము, రూక్ష = రూక్ష గుణము,ఉష్ణ = ఉష్ణవీర్యము,లవణఘు =లవణరసముకలిగివుండును,దీపనం =అగ్ని దీప్తినికలిగించును, లఘు =లఘుగుణముగలది, వాత=వాత వికారముల; కఫ= కఫవికారములను, ఆనాహ =కడుపుబ్బరము,క్రిమి =క్రిమి రోగము,శోఫ =నంజు; ఉదర =ఉదరము, అర్శసామ్ = అరోశ్శరోగములకు, శస్తమ్ = పథ్యాకరమైనది.

**తాత్పర్యము :** ఒంటెపాలు కొంచము రూక్షగుణమును ఉష్ణవీర్యమును లవణరసమును కలిగి అగ్ని దీపనమునుచేసి లఘుగుణముకలిగి యుండును వాత కఫ వికారములను కడుపుబ్బరమును క్రిమి రోగమును అర్శరోగమును శమింప చేయును.

*శశిలేఖ :* ఒంటెపాలు రూక్షాది గుణములను కలిగియుండును. వాతాది వికారములను శమింపజేయును.

మూ॥ మానుషం వాతపిత్తా సృగభి ఘాతాక్షిరోగజిత్॥
తర్పణాశ్చ్యోత నైర్నస్యైః.

*ప్రతిపదార్థము:*మానుషం =నారీక్షీరము,వాత = వాతముచేత,పిత్త=పిత్తము చేత, అసృజాః =రక్తముచేత, అభిఘాత = దెబ్బలచేత కలిగిన, అక్షిరోగ =నేత్ర రోగములను, జిత్ =జయించును; తర్పణ=తర్పణ విధిచేత, ఆశ్చ్యోతనైః = ఆశ్చ్యోతనవిధిచేత; నస్యైః = నస్యప్రయోగములచేత, శామ్యేత్ =శమింప చేయవలెను.

తాత్పర్యము : నారికేళీరము, తర్పణాది ఉపచారములచేత వాత పిత్తాదులచేత సంభవించిన నేత్రరోగములను పోగొట్టును.

శశిలేఖ : విశేషములేదు.

మూ॥ అహృద్యం తూష్ణమావికమ్।
వాతవ్యాధిహం హిధ్మా శ్వాస పిత్త కఫ ప్రదమ్॥

ప్రతిపదార్థము: ఆవికం=గొఱ్ఱెపాలు, అహృద్యం=హృదయమునకు మంచిదికాదు; ఉష్ణం=ఉష్ణగుణముకలది; వాతవ్యాధిహారం=వాతవ్యాధులను హరించును; హిధ్మా=ఎక్కిళ్ళను; శ్వాస=ఉబ్బసమును; పిత్త=పిత్తము, కఫప్రదం=కఫమును కలిగించును.

తాత్పర్యము : గొఱ్ఱెపాలు ఉష్ణగుణముకలిగి హృదయమునకు చెరుపు చేయును. వాత వ్యాధులను బరిహరించును. ఎక్కిళ్ళను బుసను పిత్తకఫములను వృద్ధి చేయును.

శశిలేఖ : తాత్పర్యాంశమే.

వి. వ్యా : భావప్రకాశకారుడు గొఱ్ఱెపాలు లవణ మధుర రసములు గల్గి స్నిగ్ధోష్ణగుణములు గలిగి యుండును, అశ్మరిని బోగొట్టును, నోటికి రుచిలేకుండును, తర్పణము, వృష్యము, శుక్ర పిత్త కఫములను వృద్ధి పరుచును, వాత కాసమునందును కేవల వాతము నందును మంచిదని నుడివెను.

మూ॥ హాస్తిన్యాః స్థైర్యకృత్ బాఢమ్॥

ప్రతిపదార్థము : హాస్తిన్యాఃక్షీరం = ఏనుగుపాలు; వాఢమ్ = ఎక్కువగా, స్థైర్యకృత్ = శరీర దార్ఢ్యమును కలిగించును.

తాత్పర్యము : ఏనుగు పాలు ఎక్కువగా శరీరదార్ఢ్యమును కలిగించును.

శశిలేఖ : విశేషములేదు.

వి. వ్యా : భావప్రకాశకారుడు ఏనుగుపాలు బృంహణము, మధురము, కషాయము, గురువు, వృష్యము, బలకరము, శీతము, స్నిగ్ధముసై యుండునని వక్కాణించెను.

మూ॥ ఉష్ణం త్వైక శఫం లఘు
శాఖా వాత హారం సామ్లలవణం జడతాకరమ్ ॥

ప్రతిపదార్థము : ఏకశఫం=గుఱ్ఱపుపాలు; ఉష్ణం=ఉష్ణగుణమును; లఘు=లఘుగుణమును కలిగియుండును; శాఖావాతహారం=శాఖలయందు చేరిన వాతమును హరించును; సామ్లలవణం=ఆమ్లలవణరసములు గలిగియుండును; జడతాకరమ్=మాంద్యమును చేయును.

తాత్పర్యము : గుఱ్ఱము గాడిదల పాలు ఎక్కువ ఉష్ణవీర్యముగా నుండును. లఘుగుణము కలవి. శాఖలయందు, చర్మమునందు, రస రక్తాది ధాతువులయందు చేరిన వాయువును శాంతపరుచును.

శశిలేఖ : ఏక శఫస్య ఇదం = ఐకశఫం, ఏక విభాగః శఫః యస్యసరి, ఏకశఫః = అశ్వగర్ధభాదిరి, అని ఏకశఫమనగా గుఱ్ఱము గాడిద మొదలగు ఒకే గిట్టగల జంతువులు అనిఅర్థము. శాఖారక్తాదయః ధాతవరిత్వశ్చ- శాఖలు రక్తాది ధాతువులు చర్మము అని అర్థము. జాడ్యమనగా స్తైమిత్యమని అర్థము.

మూ॥ పయోఽభిష్యంది గుర్వామం యుక్త్యాశృతమతోఽన్యథా ।
భవేత్ గరీయోఽతిశృతం ధారోష్ణ మమృతోపమమ్ ॥

ప్రతిపదార్థము : ఆమం పయః = పచ్చిపాలు; అభిష్యంది = అభిష్యందమును చేయును; గురు = గురువు; యుక్త్యా = యుక్తితో; శృతంపయః = కాచిన పాలు, అతోఽన్యథా = వాటికి విరుద్ధముగ నుండును; అతిశృతము = ఎక్కువగా కాచిన పాలు; గరీయః = మిక్కిలి శ్రేష్ఠముగా; భవేత్ = అగును; ధారోష్ణం = పితుకుచుండగనే వేడిగనుండు పాలు; అమృతోపమమ్ = అమృతముతో సమానమైనవి.

తాత్పర్యము : పచ్చిపాలు అభిష్యందమును చేయును. గురుగుణము గలవిగా నుండును. యుక్తితో కాచబడిన పాలు లఘుగుణము గలిగి శరీరమునకు ఆరోగ్యమును ప్రసాదించును. ఎక్కువ కాచిన పాలు మిక్కిలి శ్రేష్ఠమైనవిగా చెప్పబడినవి. మరియు పితుకుచుండగనే వేడిగనుండు పాలు (ధారోష్ణములు) అమృతముతో సమానమైనవిగా యుండును.

శశిలేఖ : ఆమమనగా అపక్వమని అర్థము. అభిష్యంది యనగా (మాలిన్యేనస్రోత సాం స్రావకమ్) మలినములై స్రోతస్సుల యొక్క స్రావము ధారోష్ణం అమృతోపమం పథ్యమేవ అని అర్థము.

వి.వ్యా : అభిష్యంది - దోష ధాతుమలస్రోతసాం క్లేదజననే, కుసుమాటీ జ్వరే, స్రోతస్రాదిద్రవ్యే. వా. టీ. హే. కఫకృత్ పదార్థే దధ్యాదికే, తల్లక్షణం యథాః- పైచ్ఛిల్యాత్ గౌరవాత్ ద్రవ్యం రుధ్వారసవహాః సిరో ధత్తేయద్గావంత్సా దభిష్యంది యథాదధి, భామ, స్రోతసాం స్రావకం దోషసంఘాత విచ్ఛేదకరం.

దోష ధాతు మలములకు స్రోతస్సులకు క్లేదమును కలిగించునది స్రోతస్స్రావకము. కఫమును కలిగించు దధ్యాది పదార్థములు అభిష్యంది లక్షణము పిచ్ఛిలత్వము గురుత్వముగల ద్రవ్యములు రసవహాసిరలందు అడ్డుకలిగించి అచటి ధాతువులకు గురుత్వమును కలిగించును, అభిష్యంది యగును,

మూ॥ పిణ్యాకామ్లా శినీనాంతు గుర్వభిష్యంది తద్భృశమ్ ।
అచేష్టయాచ ప్రాదోషాద్ గరీయః స్మృతమౌషసమ్ ॥
వ్యాఖ్యాత స్తేన లఘు మాచేష్టా వత్ప్రకృతిష్వపి ।
హ్రాస్వేషు చాతిదేహేభ్యో మాంసష్వ ప్యేవయాదిశేత్ ॥

**ప్రతిపదార్థము :** పిణ్యాక = తెలికపిండిని, అమ్లాశినీనాంతు = పుల్లని పదార్థములను భక్షించు క్షీరయోనులయొక్క; తత్ = క్షీరము; భృశం = ఎక్కువ; గురు = గురువు; అభిష్యంది = అభిష్యందముగా వుండును; అచేష్టయా = చేష్ట లేకుండుటచేత; ప్రాదోషాత్ = అపర్ణాహ్ణమునందు గ్రహింపబడిన పాలకంటె; ఔషసం = ప్రభాతమునందు గ్రహించిన పాలు; గరీయః = గురుగుణముగలవిగా; స్మృతం = చెప్పబడినది; చేష్టావత్ = చేష్టలుగల; ప్రకృతిష్వపి = ప్రాకృతజంతువుల విషయములకూడ; తేన = ఆ కారణముచేత, లఘిమా = లఘు గుణము; వ్యాఖ్యాతః = వ్యాఖ్యానము చేయబడినది; అతిదేహేభ్యః = ఏనుగు మొదలగు బలిష్టమైన శరీరముగల జంతువులయొక్క పాలకంటే: హ్రాస్వేషు = చిన్నవియగు జంతువుల యొక్క పాలలో; లఘిమా = లఘుగుణము కలదు; ఏవం = ఇట్లే; మాంసేష్వపి = ప్రాణులయొక్క మాంసములయందు కూడ; ఆదిశేత్ = నిర్ణయించవలెను.

**తాత్పర్యము :** చింతాకు ఉశిరిక ఆకు మొదలగు పుల్లని వస్తువులను భుజించు గొఱ్ఱె మొదలగు జంతువులయొక్క పాలు గురుగుణము కలిగి యుండును. మినప,అవాలు మొదలగు చెట్లయొక్క ఆకులు తినుజంతువులయొక్క పాలుగూడ గురుగుణము కలిగియుండును. గురు పదార్థములను తిన్నయెడల గురుగుణము పాలలో ఉత్పన్నమగును. లఘు సేవనవలన లఘు గుణము పాలలో ఉత్పన్నమగును. ఇట్లే లఘు శరీరముగల జంతువుల యొక్క పాలు లఘు గుణమును, లావు శరీరముకల జంతువులయొక్క పాలు గురు గుణమును కలిగియుండును. రాత్రియందు చంద్రుని గుణము హెచ్చుగా నుండుట చేతను, వ్యాయామము రాత్రియందు లేకపోవుట చేతను ఉదయమున పితికిన పాలు త్రాగిన యెడల ప్రదోషమందు పితికిన పాలకంటె గురువుగను శీతముగ నుండును. సూర్యకిరణ స్పర్శచేతను వ్యాయామము, అగ్ని మొదలగు వాటిని సేవించుట చేతను సాయంకాలము పితికిన పాలు లఘువుగను వాత కఫముల బోగొట్టునదిగను నుండును. మాంసవిషయము ప్రకృతి దోషాదులను బట్టి గురులాఘవములను నిర్ణయించవలెను. గురులఘు గుణములతో కూడిన ఆహారములను సేవించు జంతువులయొక్క పాలు చల్లగా వేడిగా స్నిగ్ధముగ రూక్షముగ చిక్కగా ద్రవముగా అనేక భేదములు కలిగి యుండును. ఈ భేదము యొక్క ప్రభావము ఆ క్షీరములను సేవించు మానవులపై పడును.

శశిలేఖ : పిణ్యాకం = తెలక పిండియని అర్థము. తక్కిన వివరము తాత్పర్యాంశములే; దధి=పెరుగు.

మూ॥ అమ్ల పాకరసం గ్రాహిగురూష్ణం దధి వాతజిత్
మేదః శుక్రబల శ్లేష్మ పిత్తరక్తాగ్ని శోఫకృత్ ॥
రోచిష్ణు శస్త మరుచౌ శీతకే విషమ జ్వరే ।
పీనసే మూత్ర కృచ్ఛ్రే చ రూక్షంతు గ్రహణీ గదౌ ॥
నైవాద్యాన్నిశి నైవోష్ణం వసన్తోష్ణ శరత్సునః ।
నాముద్గ సూపం నాక్షౌద్రం నాఘృతం నాసితో పలమ్ ॥
నచా నామలకం నాపి నిత్యం నోమన్ద మన్యథా ।
జ్వరా సృక్పిత్త వీసర్ప కుష్ఠపాండ్వా మయప్రదత్ ॥

ప్రతిపదార్థము : దధి=పెరుగు; అమ్లపాకరసం=అమ్లరసమును అమ్ల విపాకము గలది; గ్రాహి=గ్రాహి; గురు=గురుగుణము; ఉష్ణం=ఉష్ణవీర్యమును కలిగి; వాతజిత్=వాతమును జయించును; మేదః=మేదో ధాతువును మేదో దోషమును; శుక్ర=శుక్రమును; బల=బలమును; శ్లేష్మ=కఫమును; పిత్తరక్త=రక్తపిత్తమును; అగ్ని=జాఠరాగ్నిని; శోఫకృత్=శోఫను చేయును (వృద్ధి పరచును); రోచిష్ణు=ఎక్కువ రుచిని కలిగించును; అరుచే=అరుచియందు; శస్తం=పథ్యకరమైనది; శీతకే విషమజ్వరే=శీతపూర్వక విషమ జ్వరమునందు; పీనసే=పడిశమునందు; మూత్ర కృచ్ఛ్రే=మూత్ర కృచ్ఛ్ర వ్యాధియందు; శస్తం=పథ్యకరమైనది; చ=మరియు; గ్రహణీ గదౌ=గ్రహణీ రోగమునందు; రూక్షం=రూక్షగుణముకల పెరుగు; శస్తం=పథ్యకరమైనది; నిశి=రాత్రియందు; దధి=పెరుగు; నైవాద్యాత్=తినరాదు; నసిద్యాత్=తినరాదు; అముద్గసూపం=పెసరపప్పు లేనిది; అక్షౌద్రం=తేనె కలపనిది; అఘృతం=నెయ్యి చేర్చనిది; అసితోపలమ్=ఖండ శర్కర కలపనిది; అనామలికం=వుశిరికాయ చేర్చనిది; నిత్యం=ప్రతిదినమును; దధి=పెరుగు; నైవాద్యాత్=తినకూడదు (నిషేధము); మన్దం=చక్కగా తోడుకొనని; దధి=పెరుగు; నాద్యాత్=తినరాదు; తతో అన్యథా=అట్లు కాని పక్షమున; జ్వర=జ్వరము; అసృక్ పిత్త=రక్త పిత్తము; వీసర్ప=వీసర్ప రోగము; కుష్ఠ=కుష్ఠు వ్యాధి; పాండు=పాండురోగమును; భ్రమప్రదమ్=భ్రమను కలిగించును.

తాత్పర్యము : రస విపాకములు అమ్లముగాగల పెరుగు, గ్రాహి, గురు ఉష్ణ గుణ వీర్యములను కలిగి వాతమును వాత వ్యాధులను జయించును. మేదో ధాతువును మేదో దోషమును, శుక్రమును, బలమును కఫమును రక్త పిత్తమును జాఠరాగ్నిని నంజును వృద్ధి పరచును. అరుచియందును ఎక్కువ

రుచిని బుట్టించుటయందును ప్రశస్తమైనది. శీతపూర్వక విషమ జర్వము వచ్చుటకు రెండు గంటలు ముందుగా పెరుగును, తృప్తిగా త్రాగిన యెడల ఆ జ్వరము రాదు. పీనస రోగమునందు ఆకలియగు చున్నప్పుడు బెల్లముకాని కలకండను వేసిన పెరుగును గ్రహణీ రోగమునందును ఎక్కువ లాభకరముగా నుండును. రూక్షమైన పెరుగు (మీగడ తీసిన పెరుగును వెన్న తీసిన పాలను తోడు పెట్టిన పెరుగు) మిక్కిలి ప్రశస్తమైనది.

రాత్రులయందు పెరుగు సేవించరాదు. పెరుగును వేడి చేసి తినరాదు. వసన్త గ్రీష్మ శరదృతువులయందు పెరుగు తినరాదు. పెసర పప్పును చేర్చక, తేనె కలుపక, ఖండ శర్కర కూర్చక పెరుగున్ను సేవించరాదు. వుశిరి కాయలను విధి విధానముగ చేర్చని దధిని తినరాదు. తోడుకొనని పెరుగునుతిన రాదు. అట్లుకాక పైనుదాహరించిన విధానముగనే పెరుగును తినిన యెడల జ్వర రక్త పిత్తవి సర్పాది రోగములు ఉత్పన్నమగును.

*శశిలేఖ* : దధితోకూడిన ఇతర ఆహారములుగూడ నోటికి ఎక్కువ రుచిని కలిగించును. సతతకాదులైన విషమ జ్వరములయందు పెరుగు ప్రశస్తమైనది. రూక్షమైన పెరుగు గ్రహణీ రోగమునందు పథ్యాకరమైనది. ("ఏవ" అనుపద ప్రయోగముచేత రాత్రియందు గ్రీష్మఋతువునందు అత్యంత నిషేధమును సూచించుటకు) ప్రతి దినమును పెరుగును భుజింపరాదు. ఎవరైనను నియమమును పాటించక పెరుగును భుజించిన యెడల పత్వక (అవశ్యం) జ్వరాది రోగములకు ఆశ్రమమగు చున్నారు.

**వి. వ్యా:** పెరుగు తియ్యనిది, పుల్లనిది, మిక్కిలి పుల్లనిది (మధురము), ఆమ్లము, అత్యమ్లము) అని మూడు విధములుగా సుశ్రుతుడు చెప్పెను. మరియు ప్రాణశక్తిని దృఢపఱచి, మంగళములను చేకూర్చుననియు చెప్పెను. మంగళకరమైనదనియు వాతమును హరించుననియును చరకాచార్యులు గూడ నుడివిరి.

మూ॥ తక్రం లఘు కషాయామ్లం దీపనం కఫవాతజిత్।
శోఫోదరార్శోగ్రహణీ దోషమూత్ర గ్రహారుచేః॥
గుల్మప్లీహాఘృత వ్యాపద్గర పాండ్వామయాన్ జయేత్।
తద్వన్మస్తు సరం స్రోతశ్శోధి విష్టంభజిల్లఘు॥

ప్రతిపదార్థము : తక్రం=మజ్జిగ, లఘు=లఘు గుణముకలది. కషాయ=కషాయరసమును, అమ్లం=అమ్లరసమునుగలది; దీపనం=అగ్నిదీపకం, కఫవాతజిత్=కఫ వాతవికారములను జయించును; శోఫ=నంజును, ఉదర=ఉదరరోగమును, అర్శ=అర్శరోగమును, గ్రహణీ దోష=గ్రహణియను పేరు కల కలావికృతియందును; మూత్రగ్రహ=మూత్ర సంగమునందు; అరుచౌః అరుచియందును, గుల్మ=గుల్మమును, ప్లీహ=ప్లీహవ్యాధిని; ఘృతవ్యాపత్=

ఘృతపానమున కలిగిన వికారములకు, గర = పెట్టుమందు వలన ఏర్పడిన వికారములను, పాండ్వామయాన్ = పాండువికారములను, జయేత్ = జయించును. తద్వత్ = మజ్జిగవలె; మస్తు = పెఱుగుమీది మీగడ, సరం = సర్వ శరీరమును వెంటనే వ్యాపించును. స్రోతశ్శోధి = స్రోతస్సులను శోధించును; విష్టంభజిత్ = విష్టంభమును జయించును; లము = లఘుగుణముకలది;

తాత్పర్యము: పెఱుగు కంటే మజ్జిగ మిక్కిలి లఘు గుణముకలది. ప్రారంభమునందు కషాయరసము అమ్ల రసములు ఒకదానితో నొకటికలసి వుండును. జాఠరాగ్నిని వృద్ధిపరుచును. కఫవాత వికారములను శమింప జేయును. శోఫ ఉదర అర్శో రోగములను గ్రహణీ దోషమును మూత్రకృచ్ఛ్రమును అరుచిని గుల్మప్లీహవ్యాధులను ఘృత పానము వలన జనించిన వ్యాపత్తులను, పాండు రోగమును శమింప జేయును. మజ్జిగవలె తక్రము నందలినీరు (లేక మీగడ) సమానమైన గుణములుగాకూడ హానికరములు యగుచున్నవి. విశేషించి సర్వశరీరవ్యాపకత్వము, స్రోతశ్శోధకత్వము విష్టంభనాశకముగా అగుచున్నది. లఘు గుణముకలదిగాకూడ అగుచున్నవి.

శశిలేఖ: తక్రమునకంటే పెరుగుమీది తేటకు (లేక మీగడకు) స్రోతశ్శోధ కత్వము విష్టంభనాశకత్వము లఘు గుణము విశేషించి చెప్పబడినది.

మూ॥ శీతం స్వాదు కషాయామ్లం నవనీతం నవోద్ధృతమ్।
యక్ష్మార్శోర్దిత పిత్త సృగ్వాత రక్త పిత్తాక్షిరోగజిత్॥
సృశ్వాతజిత్ గ్రాహి దీపనమ్।

ప్రతిపదార్థము: నవోద్ధృతం = అప్పుడేతీయబడిన, నవనీతం = వెన్న, శీతం = శీతవీర్యమైనది, స్వాదు = మధురము, కషాయామ్లం = కషాయ అమ్ల రసములతో కూడినది, యక్ష్మ = రాజయక్ష్మను; అర్శో = అర్శోరోగమును; అర్దిత = ముఖగత పక్షవాతమును పిత్తాసృగ్ = రక్తపిత్తమును, వాతజిత్ = వాత వికారములను జయించును. గ్రాహి = మల మూత్రాదులను బంధించును, దీపనం = అగ్నిదీప్తిని కలిగించును. క్షీరోద్భవంతు = పాలనుండి తీసినవెన్నయయితే, సంగ్రాహి = మలమూత్రాదులను బంధించును, రక్త పిత్తాక్షిరోగనుత్ = రక్త పిత్తమును అక్షిరోగములను పోగొట్టును.

**తాత్పర్యము:** క్రొత్తగా తీయబడిన వెన్న శీతవీర్యము మధురరసము కలిగియుండును. కషాయరసము ఆమ్లరసము కలిగియుండును. రాజయక్ష్మను అర్దితవాతమును రక్తపిత్తమును వాతవికారములను శమింపజేయును. మల మూత్రాదులను బంధించును. అగ్నిదీప్తిని కలిగించును.

పాలనుండి తీసిన వెన్న మలమూత్రాదులను బంధించి రక్తపిత్తమును అక్షిరోగములను పోగొట్టును.

*శశిలేఖ* : నవోద్ధృతం = సద్యఃఉద్ధృతమని అర్థము. సంగ్రాహియనగా యద్రవాన్‌భావాన్ పిండకరోతియని అర్థము. క్షీరోద్భవమనగా క్షీరమేవ మథిత్వా ఉత్పాదితమని అర్థము.

వి. వ్యా : తక్రంవిషయమై కొన్నితంత్రములలో భేదములు కనబడు చున్నవి. "రూక్షమర్ధోద్ధృత స్నేహంయన్నస్యాద్ధృతం ఘృతం తక్రంధ దోషాగ్ని బలకృత్ త్రివిధం తత్ప్రయోజయేత్ "అని కలదు. తక్రం బొత్తుగా జిడ్డులేకుండ వెన్నదీసినది. సగము జిడ్డుమిగులునట్లు వెన్నతీసినది. ఏమియు వెన్న తీయకుండినది, అని మూడు విధములు. తక్రము బొత్తుగా జిడ్డులేకుండ తీసినది దోషములను వృద్ధిచేయును. సగము జిడ్డుమిగులునట్లు వెన్నతీసినది అగ్నిని దీపింప జేయును. ఏమియు వెన్న తీయకుండునది బలమును కలిగించునదిగా వుండునని డలహణ టీకలో వివరణము కలదు. మరియు ధన్వంతరినిఘంటువునందు తక్రం చతుర్విధంజ్ఞేయం ఘోళం మథిత మేవచ, ఉదశ్విత్తక్రమిత్యేవం కథితాని యథాక్రమమ్ సరసం నిర్జలం ఘోలం మథితం రసవర్జితమ్ సమోదకం స్యాన్మ థితముదశ్విత్త్వర్ధవారికమ్ పాదోదకం భవేత్తక్రమర్థాం భోఽన్యే బభాషిరే" అని మజ్జిగ ఘోళమనియు, మథితమనియు, ఉదశ్విత్తనియు, తక్రమనియు నాలుగు విధములు. నీరులేకుండ పెఱుగుయొక్క రుచి చెడకుండి చిలికినది ఘోళము. పెరుగునకు సమానభాగముగ నీరుపోసి పెఱుగు రుచి మారునట్లు చిలికినది మథితము. పెఱుగుకు అర్థభాగము మాత్రమే నీరుపోసి కవ్వముచే మథించినది ఉదశ్విత్తు. నాల్గవ భాగము నీరుపోసి చిలికిన తక్రము. తక్రము నాలుగు విధములని యొక పక్షము. మూడు విధములని యొక పక్షము కలదు. వాటికి గుణభేదములుగూడ చెప్పబడినందున ఆమోదయోగ్యమైనవిగా పరిగణింప బడుచున్నవి. సుశ్రుత సూత్రస్థానములో 45 అధ్యాయములో 85-89 శ్లోకములు గుణధర్మాదులనుగూడ సూచించుచున్నవి. గ్రంథవిస్తరభీతిచే ఇచట పొందుపరచలేదు.

మూ॥ శస్తంధీస్మృతిమేధాగ్ని బలాయుఃశుక్ర చక్షుషామ్॥
బాలవృద్ధ ప్రజాకాన్తి సౌకుమార్య స్వరార్థినామ్
క్షతక్షీణ పరీసర్ప శస్త్రాగ్నిగ్లపితాత్మనామ్॥
వాతపిత్త విషోన్మాద శోషాలక్ష్మీ జ్వరాపహమ్।
స్నేహానాముత్తమం శీతం వయసః స్థాపనం ఘృతమ్॥
సహస్రవీర్యం విధిభిః కృతంకర్మ సహస్రకృత్
మదాపస్మార మూర్ఛాయ శిరః కర్ణాక్షి యోనిజాన్॥
పురాణం జయతి వ్యాధీన్ వ్రణశోధన రోపణమ్॥
పూర్వోక్తాలశ్చాధికాన్ కుర్యాత్ గుణాంస్తదమృతోపమమ్।
తద్వచ్ఛఘృతమందో ఽ పిరూక్షస్తీక్ష్ణస్తనుశ్చసః।

ప్రతిపదార్థము : ఘృతం = నేయియయితే: ధీ = బుద్ధి; స్మృతి = గడచిన విషయమును విచారించుటలో శక్తి; మేధ = ధారణాశక్తి, బల = బలము, ఆయుః = ఆయువు, శుక్ర = శుక్రము; చక్షుషామ్ = నేత్రములకు, ర స్తం = మంచిది బాల = పిల్లలకు; వృద్ధ = ముసలివారికి; ప్రజా = సంతతికి; కాన్తి = కాన్తి వర్ధనము నకు; సౌకుమార్య = సుకుమారత్వమునకు; స్వర = మంచి కంఠస్వరమును; అర్థినాం = కోరువారలకు; క్షత = గాయము; క్షీణ = ధాతుక్షయము గలవారికి; పరాసర్ప = విసర్పరోగులకు; శస్త్రి = శస్త్రిము; అగ్ని = నిప్పు మొదలగు వాటిచేత పీడింపబడిన శరీరముగలవారికి, శస్తం = హితమైనది; వాతపిత్త = వాతాపిత్తవికారములను; విష = విషము, ఉన్మాద = ఉన్మాదము; శోష = శోష; అలక్ష్మి = దరిద్రము; జ్వరాపహ = జ్వరమును తొలగించును, స్నేహానాం = తైలాది స్నేహములకంటే; ఉత్తమం = శ్రేష్ఠమైనది, శీతము = శీతవీర్యముగలది. వయసఃస్థాపనం = ముసలితనం లేకుండ యౌవ్వనమును నిలుపును. విధిభిః శృతం = శాస్త్రివిధిననుసరించి సంస్క రింపబడినది, సహస్రవీర్యం = అనంతమైన శక్తిగలది. పురాణం = మిక్కిలిపాతపడిన నెయ్యి; మద = మదమును; అపస్మార = అపస్మారమును; మూర్ఛాయ = మూర్ఛను; కర్ణ = శిరః = శిరోరోగము, కర్ణరోగము అక్షి = నేత్రరోగము; యోని జాన్, యోనియందు బుట్టిన వ్యాధీన్ = వ్యాధులను (పొగొట్టును); వ్రణశోధన రోపణం = వ్రణములను శుద్ధిపరచి యార్చును; పూర్వోక్తాన్ = వెనుక చెప్పబడిన; అధికాన్ గుణాన్ = ఎక్కువ గుణములను, కుర్యాత్ = చేయును, తత్ = ఆ ఘృతము; అమృతోపమమ్ = అమృతముతో సమానమైనది; ఘృతమందోపి = ఘృతము మీది మీగడకూడ; తద్వత్ = అమృతముతో సమానమే; చ = మరియు, సః = అఘృతకుందము, రూక్షస్తీక్ష్ణస్తమః = రూక్షగుణము ఉష్ణగుణము కలిగి యుండను.

**తాత్పర్యము :** నెయ్యి వస్తు గ్రహణ శక్తిని ప్రసాదించి గతిగించిన విషయములను జ్ఞప్తికి తెచ్చును. చదివిని విషయమును ధారణచేయశక్తి నిచ్చును. జఠరాగ్నికి బలమునుచేకూర్చును. శుక్రవృద్ధికి తోడ్పడి నేత్రము లకు మంచి చూపును కలిగించును. బాలవృద్ధులకు పథ్యకరమైనది. క్షతాదు లలో రోపణముగానుండును. క్షీణులకు ధాతువృద్ధిని కలిగించును. అలక్ష్మిని తొలగించును. వాత పిత్త విషఉన్మాదాది రోగములను పరిమార్చును. తైలాది అన్ని స్నేహములకంటే ఉత్తమోత్తమమైనది. శీతవీర్యము; ఈ ఘృతము ఏ ద్రవ్యముతో జేర్చి ప్రయోగింపబడునో. లేక యే ద్రవ్యముతోనైనను జేర్చి సంస్కృతము చేయబడునో అట్టి ద్రవ్యములయొక్క శక్తిని అనుసరించి ప్రయో గములకు చక్కటి సిద్ధిని చేకూర్చును. ఈ ఘృతముచేత నెయ్యి సంస్కార ములు చేసి చికిత్సలో ఉపయోగించవచ్చును.

మిగుల పాతబడిననెయ్యి మద అపస్మారమూర్ఛ శిరోరోగముల యందు నస్యకర్మ చేయుటకు ద్రవ్యములయొక్క కలయికతో ఘృతాదులను తయా

చేయుటకు చాల ప్రశస్తమైనది. ఇది అమృతతుల్యమైనదని వేరుగా చెప్పగా చెప్పనక్కర యుండదు.

ఘృతముపైననుండు మీగడకూడ అమృత తుల్యమైనదియే. కాని రూక్ష ఉష్ణగుణములను కలిగియుండును.

**శశిలేఖ :** ధీ=యనగా బుద్ధికి వస్తుగ్రహణ శక్తియని అర్థము. స్మృతిః =అతీతవిచారశక్తిః (గడచిన విషయము నెమరువేసికొనుట) మేధా=వస్తువివేక శక్తిః;=వస్తువును గ్రహించుశక్తి, ప్రజా=అపత్యం(అనగా శుక్రము ఫలవంతమైన దని భావము) వయస్థాపనం=జరయా వినావయః స్థాపయతీతి)=మహాస్త్రీ) వీర్యం=అనేక శక్తిని, మందః=ఉపరిభవః స్వచ్ఛః.

**వి. వ్యా:** "వరం ఏకాదశం ప్రాప్తం సర్వ దోషహరం; స్థితం వర్షశతం భూమౌకాంభమిత్యపదిశ్యతే స్వల్పక్షీరో బహూస్తక్రః కిలాటస్స్వల్ప శర్కరః" పదునొకటవ సంవత్సరమున(అంతకాలము పాతబడినది)నెయ్యి మిగుల శ్రేష్ఠమైన రవ దోషములను హరించును. నూరు సంవత్సరముల కాలము భూమిలో నుంచ బడిన నెయ్యి కౌంభమనబడునని తంత్రకారుల అభిప్రాయము "యథా యథాజరాం యాతిగుణవత్స్యాత్తథా" అనిహారీతసంహితా కారుడుచెప్పినట్లుగా నెయ్యిపాతబడు కొలది గుణోత్తమమైనది. మరియొక తంత్రకారుడు "పురాణం దశవర్షం స్యాత్; ప్రపురాణ మతఃపరం" పది సంవత్సరముల కాలము గడ చిన నెయ్యి పురాణమనియు; అంతకన్న ఎక్కువగ గడచినది. ప్రపురాణ మనియు చెప్పెను.

మూ॥ కిలాట దధి కూచీకా తక్ర పిండక మోరటాః॥
సక్షీర శాక పీయూషా రోచనా వహ్నిసాదనాః।
శుక్రనిద్రాకఫ కరావిష్టంభ గురు దోషలాః॥

**ప్రతిపదార్థము :** కిలాట=కొంచము పాలులో ఎక్కువగా మజ్జిగ చేర్చి చేయబడినది.దధికూచికా=పెరుగు మజ్జిగ కలిపి చేయబడినది,తక్రపిండక= ఒక గట్టి గుడ్డలో వడియ గట్టగా గుడ్డకు అంటుకొనిన ఘనపదార్థము. మోరటాః=పగులగొట్టినపాలు, క్షీరశాక=సంయోగము లేకుండవిరిగినపాలు, పీయుషీ=జున్ను, రోచనా=రుచిని పుట్టించును, వహ్నిసాదనాః=అగ్నిసాదన మును చేయును, శుక్రనిద్రా కఫకరాః=శుక్రమును నిద్రను కఫమును వృద్ధి పరచును, విష్టంభ=మలబంధము, గురు=గురుత్వమును, దోషలాః=దోష ప్రకోపమును చేయును.

**తాత్పర్యము :** మజ్జిగ అధికప్రమాణము చేర్చబడినపాలు, పెరుగు మజ్జిగ కలిపి చేయబడినది, శ్రీకండము. అమ్లాది ద్రవ్యనిక్షేపములను వేసి విరగ గొట్టిన పాలు, అమ్లాది ద్రవ్యమున సంయోగము లేకనే విరిగినపాలు, జన్ను

యనియు రుచిని బుట్టించి అగ్నిని మందగింపచేయును. శుక్రము నిద్ర, కఫము వీనిని వృద్ధి చేయును. మలబంధమును కలిగించి శరీరమునకు గురుత్వమును చేకూర్చును. దోషములను వృద్ధి పరచును. "విష్టంభ గురుదోషలా;" అని చెప్పుట వలన జఠరాగ్నిని నశింపచేయును.

*శశిలేఖ :* మోరటః = క్షీరసదృశః కిలాటికా, పీయూషం = సద్యః సూతాయాః క్షీరకృతం దధి యని అర్థము.

**వి. వ్యా :** కిలాట మనగా నష్టక్షీర భాగమని చక్రపాణి నుడివెను. డల్హణుడు "కూర్చికా ఘాతక్షీరస్య ఘనభాగః లాటః" అని చెప్పెను. హేమాద్రి తక్ర పిండకమనగ "ఘన వస్త్రబద్ధం స్వయం స్రుత ద్రవభాగం తక్రం తక్ర పిండకః" అని చెప్పెను.

మూ॥ విద్యాద్దధి ఘృతాదీనాం గుణ దోషాన్ యథాపయః।
గవ్యేక్షీర ఘృతే శ్రేష్ఠే నిందితేచా ఒవిసంభవే"

*ప్రతిపదార్థము :* దధిఘృతాదీనాం = పెరుగు నెయ్యి మొదలగు వాటి యొక్క, గుణదోషాన్ = గుణదోషములను, విద్యాత్ = తెలియవలెను, యథా = ఎట్లనగా, పయః = పాలు

**తాత్పర్యము :** పెరుగు నెయ్యి మొదలగు వాటి యొక్క గుణ దోషములను పాలతో సమానముగానే వుండును. ఆవు యొక్క పాలు పెరుగు నెయ్యి మొదలగునవి శ్రేష్ఠమైనవిగా చెప్పబడినవి. గొర్రెయొక్క పాలు పెరుగు నెయ్యి మొదలగునవి నింద్యములుగా పేర్కొనబడినవి.

*శశిలేఖ :* స్వాదు పాకరసం అను వాక్యములచేత సామాన్యముగ క్షీరగుణములు చెప్పబడినవి. అట్లే పెరుగు యొక్క గుణములు గూడ సామాన్యముగ చెప్పబడినవి.

## ఇతిక్షీర వర్గః

శ్లో॥ ఇక్షోరసోగురుఃస్నిగ్ధో బృంహణః కఫమూత్రకృత్॥
వృష్య శ్శీతః పవనజిత్ భుక్తే వాత ప్రకోపనః
రక్త పిత్త ప్రశమనః స్వాదుపాక రసోసరః॥

*ప్రతిపదార్థము :* ఇక్షోః = చెఱుకు యొక్క; రస = రసము; గురుః = గురువుగ; స్నిగ్ధః = స్నిగ్ధముగ నుండును; బృంహణః = శరీరమునకు పుష్టి నిచ్చును; కఫమూత్రకృత్ = కఫమూత్రములను వృద్ధి చేయును; వృష్యః = రతియందు శక్తిని వృద్ధి చేయును; శీతః = శీత వీర్యము; పవనజిత్ = వాతశామకమైనది; భుక్తే = భోజనానంతరము; వాత ప్రకోపనః = వాతము ప్రకోపింపజేయును; రక్త పిత్త ప్రశమనః = రక్త పిత్తములను శమింపజేయును; స్వాదు

విపాకరసః=మధుర రసమును మధుర విపాకమును కలిగియుండును; సరః= సరగుణముకలది.

తాత్పర్యము: ఇక్షు రసము గురువుగ స్నిగ్ధముగ నుండును. శరీరమునకు పుష్టినిచేకూర్చి కఫమూత్రములను శుక్రమును వృద్ధి పరుచును. శీత వీర్యము గలది వాతమును శమింపజేయును. భోజనము చేసిన తరువాత చెఱకు రసమును త్రాగిన యెడల వాయువును ప్రకోపింపజేయును. రక్త పిత్త వ్యాధిని శమింపజేయును రస విపాకములు మధురముగా నుండును. సరగుణము కలది.

శశిలేఖ: ద్రవములను గురించి చెప్పుచు చెఱుకు రసమును చెప్పుచున్నారు. ఇక్షురసము సరత్వాది గుణములను కలిగియుండును. వాత నాశకము భుక్త మాత్ర పేతః వాతప్రకోపనః

మూ॥ సోఽగ్రే సలవణో దన్తపీడితః శర్కరా సమః

ప్రతిపదార్థము: సం = ఆ చెఱుకురసము, అగ్రే=చెఱుకుయొక్క కొనలో, సలవణః=లవణ రసముతో కూడి యుండును, దన్తపీడితః=దన్తములతో నమలుటచేత బుట్టిన రసము, శర్కరాసమః=శర్కరతో సమానమైనది.

తాత్పర్యము: చెఱుకు రసము కొనలో కొంచము ఉప్పగానుండును. దంతములతో నమలుటచేత జనించిన రసము శర్కరతో సమానమైన గుణములు గలది.

శశిలేఖ: ఆ రసము కొనయందు కొంచము ఉప్పగా నుండును. (దన్త పీడిత యన్త్రి కాలాద్యనుపహతత్వాత్ గుణైః శర్కరయాసమః) యన్త్రము మొదలగు వీటి చేత తీయబడినది అని యర్థము.

వి. వ్యా: "అతీత మధురోమూలే మధ్యే మధుర ఏవచ, అగ్రేత్వక్షి విజ్ఞేయ ఇక్షూణాం లవణోరసః" చెఱుకు యొక్క క్రింది భాగమునందలి రసము మిక్కిలి తియ్యగనుండును. మధ్య ప్రదేశము నందలి రసముగూడ తియ్యగ నుండును గణుపులు కొన వీటి యందలి రసము ఉప్పగ నుండునని సుశ్రుతము నందు చెప్పబడినది.

మూ॥ మూలాగ్రజన్తు జగ్ధాది పీడనాన్మల సంకరాత్
కించిత్ కాల విధృత్వాచ్చ వికృతింయాతి యాన్త్రికః॥
విదాహీగురువిష్టంభీ తేనాసౌ-

ప్రతిపదార్థము: యాంత్రికః=యంత్రమువలన తీయబడిన రసము, మూలాగ్ర=వేరు; కొనజన్తుదిజగ్ధా=జంతువులచేత నమలబడుటవలన కలిగిన;పీడనాత్=పీడనమువలన; మల సంకరాత్=యన్త్రాదులయందలి మురికి చేరుటవలన కించిత్కాలం విధృత్వాచ్చ=కొంచముకాల విలంబనమేర్పడుటచేతను, తేన=

ఆకారణముచేత; అసౌ=ఆరసము; వికృతిం=వికారమును; యాతి=పొందు చున్నది. విదాహీ=విదాహగుణముగలది; గురు=గురుగుణముగలది. విష్టంభి= మలమును బంధించును.

తాత్పర్యము : యంత్రమునుండి తీయబడిన చెఱకురసములో చెఱకు యొక్క వేసుకొ న జంతువులచేత కొరకబడిన దగుటవలనను మురికిచేరి యుండుట చేతను కాలవిలంబనము జరుగుట వలనను ఆ రసము వికారమును చెంది యుండును, కాన యంత్రముచే తీయబడిన రసము విదాహగుణముతో గుడి యుండును. (విదాహియనగ; జాఠరాగ్ని సంయోగము వలన పాకమై పిత్తమును వృద్ధిచేయుచు చిరకాలమునకు అజీర్ణముకాకుండ చేయునది యని అర్థము) మలమును బంధించి గురువుగానుండును.

వేరుకొన పురుగు పట్టిన చెఱుకు మురికిసంబంధము ఇవిలేకుండయంత్రము నందు తీయబడిన చెఱకు రసమునకు విదాహాది దుర్గుణములులేకుండును.

శశిలేఖ : ఈయాంత్రికమైన చెఱకురసము విదాహివిష్టంభమును కలి గించును. జంతుజగ్ధః=క్రిములచేత తినబడినది యని అర్థము; విదాహీయనగ సౌమ్యభావములను విశేషముగ దహించు స్వభావము అని అర్థము. కారణా భావాత కార్యాభావః అను నైయ్యాయిక సిద్ధాంతమును పురస్కరించుకొని రక్తపిత్తము ఇచ్చట నుదహరించినప్పటికిని విదాహియను పదము బాధాకరము గాదు.

శ్లో॥ తత్రపౌండ్రకః శైత్యప్రసాద మాధుర్యాద్వా రస్తమనువాంశికః ।
శాత పర్వక కాన్తార నైపాళీద్యాః తతః క్రమాత్ ।
సక్షారాః సకషాయాశ్చ సోష్ణాః కించిద్విదాహినః॥

ప్రతిపదార్థము : తత్ర=చెఱుకు రసములలో, పౌండ్రకః=పౌండ్రక మును చెరుకురసము, శైత్య=శైత్యము, ప్రసాద=ప్రసన్నత్వము, మాధుర్యైః= మాధుర్యములచేత, వరః=శ్రేష్ఠమైనది. తరునువాంశికః=శైత్యాది గుణముల చేత, పౌండ్రకముకంటే తక్కువ గుణములుకలది వాంశికము, శాతపర్వక= శతపర్వము, కాంతార=కాంతారము, నైపాలాద్యాః=నేపాళము మొదలుగా గల చెఱుకు రసములు, క్రమాత్తతః=యథాక్రమముగ నొకదాని కన్న నొకటి సక్షారాః=క్షారముతో కూడినవి, సకషాయాః=కషాయరసముతో కూడినవి, సోష్ణా=ఉష్ణగుణముతో కూడినవి, కించిద్విదాహినః=కొంచము విదాహ గుణముతో కూడినవిగనుండును.

తాత్పర్యము : చెఱకులలో పౌండ్రకమను చెఱకు యొక్క రసము శైత్యము ప్రసన్నత్వము మాధుర్యము అనుగుణములవలన శ్రేష్ఠమైనది. వంశమను చెఱకు యొక్క రసము పౌండ్రకమను చెఱకు యొక్క రసమున కంటే తక్కువైన శైత్యాది గుణములు కలిగియుండును. శతపర్వము, కాంతారము, నేపాళము, మొదలగు ఔషధములుగల చెఱకు రసములు వరుసగా నొకదాని కన్ననొకటి శైత్యాది గుణముల వలన తక్కువగా నుండును. మరియును కొంచము ఉప్పగ, కషాయముగ, ఉష్ణముగ, విదాహగుణములతో కూడియుండును.

*శశిలేఖ* : చెఱుకు రసములలో అన్నిటి కంటె మిక్కిలి శ్రేష్ఠమైనది పౌండ్రకము (శైత్యాదిభిః పౌండ్రకాత్ హీనోవాంశికః)

మూ॥ ఫాణితంగుర్వ భిష్యంది చయకృన్మూత్ర శోధనం
నాతిశ్లేష్మ కరోధౌత స్సృష్ట మూత్ర శకృద్గుడః
ప్రభూత క్రిమిమజ్జా సృజ్మేదోమాంస కఫోఽపరః
హృద్యః పురాణః పథ్యశ్చ నవః శ్లేష్మాగ్ని సాదకృత్

*ప్రతిపదార్థము* : ఫాణితం=కండచక్కెర; గురు=గురుత్వము, అభిష్యంధి=ధాతు మాలిన్యముచేత స్రోతస్సులయందు స్రవించుట, చయకృత్=త్రిదోషములను సంచయముగా చేయును, మూత్రశోధనం=మూత్రమును శుద్ధి పరచును; ధౌతః గుడః=సంస్కారాధిక్యతచేత నిర్మలమైన బెల్లము, నాతి శ్లేష్మకరః=కొంచెముగా కఫమును వృద్ధిచేయును, మూత్రశకృత్=మూత్రమును మలమును బైలు పరచును; అపరః=సంస్కారములేని బెల్లము (మురికితో కూడి యుండునది.) ప్రభూతక్రిమి = అధికములైన క్రిములు, మజ్జా=మజ్జ, అసృక్=రక్తము, మేద= మేదస్సు, కఫః=కఫము గలది, పురాణః=ప్రాతబెల్లము, హృద్యః=హృదయమునకు మేలు చేయును, చ=మరియు, పథ్యః=పథ్యకరము; నవః=నూతనమైన బెల్లము, శ్లేష్మాగ్ని సాదకృత్=కఫకారి; జాఠరాగ్నిని నశింప జేయును.

**తాత్పర్యము** : కండ చక్కెర గురు, అభిష్యంద గుణములు కలది. దోషములను మలములను వాటి వాటి స్థానములయందే వృద్ధిపరచి మూత్రమును అధికముగా ప్రవర్తింప జేయును.

సంస్కారము ఎక్కువగా చేయబడి మలినమైన చెరకు రసముతో తయారు చేయబడిన గుడము క్రిములను పుట్టించును, మరియు మజ్జ రక్త మేదో మాంస ధాతువులను కఫమును వృద్ధిపరచును.

ప్రాతదియగు బెల్లము హృదయమునకు శక్తిని వృద్ధిచేయును, పథ్యకరమైనది.

క్రొత్త బెల్లము కఫమును వృద్ధి పరచి జాఠరాగ్నిని నశింప జేయును.

**శశిలేఖ:** చయకృత్ అను పదమునకు మూడు దోషములను తమ తమ స్థానముల యందు వృద్ధి చేయునని యర్థము. మూత్ర సంశోధమనగా మూత్రమును ఎక్కువ స్రవింప జేయునని భావము. పథ్యాః అనగా శరీరమునకు మంచిదియని అర్థము.

మూ॥ వృష్యాః క్షతక్షీణహితా రక్తపిత్తానిలాపహాః
మత్స్యండీ ఖండసితాః క్రమేణ గుణవత్తమాః
తద్గుణో తిక్త మధురా కషాయా యాసశర్కరా
త్రిదోషఘ్నీ సితా కాశేషు దర్భచ్ఛద సంభవా॥
దాహతృట్ ఛర్ది మూర్ఛాసృక్ పిత్తఘ్నః సర్వశర్కరాః

**ప్రతిపదార్థము:** మత్స్యండికా=పాక భేదముచే మత్స్యములయండముల బోలిన శర్కరా విశేషము; ఖండ=కలకండ; సితాః=శర్కర; క్రమేణ =వరుసగా; గుణవత్తమాః =మంచిగుణములుకలిగియుండును; వృష్యాః=శుక్రమును వృద్ధిచేయును; క్షీణ =క్షీణధాతువు గలవారు, క్షతా=గాయపడిన వారలకు హితాః=పథ్యకరమైనది; రక్తపిత్త=రక్తపిత్తమును; అనిలాపహాః=వాతమును పోగొట్టును; యాసశర్కరా=యాస శర్కర (దూలగొండి కషాయముచే చేయబడిన చక్కెర). తిక్తమధురాః=చేదుగా మాధుర్యముగా; కషాయా =కషాయ రసము కలదిగా యుండును; తద్గుణా =శర్కరతో సమానమైన గుణములు కలది, కాశేషు = రెల్లుకసవులందు; దర్భచ్ఛదః=దర్భభాగముల నుండి; సంభవ= పుట్టిన; సితా=చక్కెర; త్రిదోషఘ్ని=మూడు దోషములను పోగొట్టును; సర్వశర్కరాః=అన్ని విధములైన శర్కరలు, దాహః=దాహమును; తృట్ = దప్పిని; ఛర్ది=వాంతిని; మూర్ఛా =మూర్ఛను; అసృక్పిత్తఘ్న్యః=రక్తపిత్తమును శమింపజేయును.

**తాత్పర్యము:** మత్స్యండిక, కలకండ; శర్కర క్రమముగా అంతకంత గుణవత్తములై శుక్రమును వృద్ధిపరచును. గాయపడిన వారికి ధాతువులు క్షీణించిన వారికి చాల ప్రశస్తమైనవి. రక్తపిత్తము వాతమును పోగొట్టును. యవా శర్కర కొంచెము చేదుగా, మాధుర్యముగా, వగరు గల రసముగా యుండును. శర్కరతో సమానమైన గుణముకలది..కాశ, శర దర్భల యొక్క ఆకుల నుండి తీయబడిన రసముతో తయారుచేయబడిన శర్కర శర్కరతో సమానమైన గుణములు కలిగియుండును. త్రిదోషములను పోగొట్టును. అన్ని చక్కెరలు కూడా దాహ, తృట్, ఛర్ది, మూర్ఛ, రక్తపిత్త వికారములను శమింప జేయును

**శశిలేఖ:** యాసశర్కరయనగా లోకమునందు యవాస శర్కరాయను పేరుతో ప్రసిద్ధమైనది. ఈయవాసశర్కర దూలగొండి రసముతో చేయబడు

చున్నదని కొందరు చెప్పుచున్నారు.

వి. వ్యా :- సుశ్రుత సంహితయందు మత్స్యండికా శబ్దము, మందం "శలంచతే=మత్స్యండికా" అను వ్యుత్పత్తినిబట్టి ఫాణితమునకును గుడమునకును మధ్యావస్థలో యుండుపాకమనియు నది యెక్కడనుంచినను కొంచెము కారు చుండుస్వభావము కలదని చెప్పిరి. వారితాత్పర్యమునుబట్టి గుడమునకు తరువాత యవస్థలోనుండు పాకమే మత్స్యండికయని అర్థమగుచున్నది. చక్కెర ఇక్షువికారములన్నింటిలో శ్రేష్ఠమైనదిగాను చెప్పుచున్నారు యవాస శర్కర యనగా పిన్నరేవటి దూలగొండి వేరును కషాయము కాచి దానిని ఇగుగునట్లు వండినచో చక్కెరవలె తేలును. దానినే యవాస శర్కరయందురు. పైనుదాహరించిన చెరకు, దూలగొండి అనువానివల్ల కలిగిన చక్కెరలన్నియు మంటను పోగొట్టి రక్తపిత్తమును హరించి, వాంతులను, మూర్ఛను, దప్పిని పోగొట్టును.

మూ॥ "శర్కరేక్షు వికారాణాం ఫాణితం చవరావరే.

ప్రతిపదార్థము : ఇక్షువికారాణాం = ఇక్షువికారములలో, శర్కరా= ర్కర, వరా= శ్రేష్ఠమైనది, చ =మరియు, ఫాణితము = ఫాణితము, అవర = నికృష్టమైనది.

తాత్పర్యము:- ఇక్షు వికారములలో పంచదార శ్రేష్ఠమైనదిగను ఫాణితము నికృష్టమైనదిగ నుండును.

శ్లో॥ చక్షుష్యం ఛేదితృట్ఛ్లేష్మ విషహిధ్మాస్రపిత్తనుత్॥
కుష్ఠ మేహక్రిమిచ్ఛర్ది శ్వాస కాసాతి సారనుత్॥
వ్రణశోధన సంధాన రోపణంవాతలం మధు।
రూక్షం కషాయ మధురం తత్తుల్యా మధు శర్కరా॥
ఉష్ణముష్ణార్తముష్ణే చ యుక్తం చోష్ణైర్నిహంతితత్।
విషాన్వయత్వేన విషపుష్పే భ్యోఽపేయతో మధు
కుర్వతే-తే స్వయం యచ్చ సవిశాభ్రమరాదయః।
ప్రచ్ఛర్దనే నిరూహే చ మధూష్ణం ననివార్యతే
అలబ్ధపాకమాశే వతయోర్యస్మా న్నివర్తతే।
గురు రూక్షకషాయత్వాచ్ఛైత్యాచ్చాల్పం హితం మధు॥
నహి కష్టతమం కించి త్తదజీర్ణాద్యతోనరం।
ఉపక్రమ విరోధిత్వాత సద్యోహన్యాద్యథావిషం।
నానాద్రవ్యాత్మకత్వాచ్చ యోగవాహి పరం మధు
వృష్య యోగైరతో యుక్తరం వృషతామానువర్తతే
భ్రామరం పౌష్టికం క్షౌద్రం మాక్షికంచ యథోత్తరమ్।
వరం జీర్ణరచ తేష్వంత్యే ద్వే యేవష్యావ యోజయేత్॥

ప్రతిపదార్థము :- మధు = తేనె, చక్షుష్యం = నేత్రములకు మంచిది, భేది = తీక్ష్ణతవలన పిండభూతములైన భావములను విభజించును. (శరీరము నందు ఉండలుకట్టియుండు పదార్థములను విభజించుట), తృట్ = దప్పి, శ్లేష్మ = కఫము, విష = విషము, హిధ్మా = ఎక్కిళ్ళు, అసృపిత్తనుత్ = రక్తపిత్తమును శమింప జేయును, కుష్ఠ = కుష్ఠము, మేహ = ప్రమేహము, కృమి = క్రిములు, ఛర్ది = వాంతి, శ్వాస = ఉబ్బసము, కాస = దగ్గు, అతిసారనుత్ = అతిసారవ్యాధిని శమింపచేయును; రోపణం = వ్రణములనార్చును, వాతలం = వాతమును వృద్ధి చేయును, రూక్షం = రూక్షగుణమును కలిగి; కషాయమధురం = వగరుగ మధురముగ నుండును, మధు శర్కరా = తేనెవలన బుట్టిన శర్కర; తత్తుల్యా = తేనెలో సమానమైన గుణములు గలది; ఉష్ణం = కాచిన తేనెతో, ఉష్ణార్తం = ఉష్ణముచేత పీడితుడైనవానిని, ఉష్ణేకాలే దేశే = ఉష్ణకాలము ఉష్ణదేశమునందుగాని; చ = మరియు; ఉష్ణైఃయుక్తం = ఉష్ణకరమైనఆహారాదులతో చేర్చి గాని (ఉపయోగించిన) తతో = ఆ కాచినతేనె; నిహన్తి = చంపును; యతః = యెందుకనగ; భ్రమరాదయః = భ్రమరాదులు; స్వయం = శరీరముచేతనే; సవిషాః = విషముతో కూడినవి, విషాద్వయత్వేన = విషముతోకూడియుండుట చేత, విషపుష్పేభ్యోపి = విషముతో కూడిన పుష్పములనుండి కూడ; మధు = తేనెను; కుర్వతే = చేయుచున్నవి, యత్ = యేతేనె; ప్రచ్ఛర్ధనే = వమనమునందు; చ = మరియు, నిరూహే = నిరూహ వస్తియందు, ఉష్ణం మధు = కాచబడిన తేనె; ననివార్యతే = నిషేధింపబడదు, యస్మాత్ = యేకారణమువల్లనైన, తయోః = పాకముచెందకయే; ఆశు = శీఘ్రముగ; నివర్తతే = బయలువెడలును; మధు = తేనె, గురు = గురువు; రూక్ష = రూక్షగుణము; కషాయత్వాత్ = వగరుగానుండుట వలన; శైథిల్యాచ్చ = శిథిలత్వమును కలిగించుట వల్లను, అల్పం = స్వల్పము (గా సేవించుట), హితం = పథ్యకరమైనది.

యతః = యెందుకనగ; కించిత్తతః = మూత్రము అధికమైన యెడల, అజీర్ణాత్ = జీర్ణముకానందువలన; కష్టతమం = మిక్కిలి బాధాకరమైనదిగా; భవతి = అగుచున్నది. తథాహి = అదియుక్తమే, ఉపక్రమవిరోధత్వాత్ = చికిత్సావైద్యము వలన; సద్యః = వెంటనే నరం = మానవుణ్ణి, విషంయథా = విషమెట్లు; తథా = అట్లే; హన్తాత్ = చంపును, మధు = తేనె; నానాద్రవ్యత్మకత్వాత్ = అనేక పుష్పరసముల కలయికవలన; పరం = మిక్కిలి; యోగవాహి = యోగవాహి; చ = మరియు, అతః = ఇందువలన; వృష్యయోగైః యుక్తం = వాజీకరణ యోగములతో చేర్చబడనిది; వృషతాం = వాజీకరణమును; అనువర్తతే = అనుసరించు చున్నది. భ్రామరం = భ్రామరము; పౌత్తికం = పౌత్తిక; క్షౌద్రం = క్షౌద్రముచ = మరియు; మాక్షికం = మాక్షికము; యథోత్తరం = ఉత్తరోత్తరము; వరం = శ్రేష్ఠమైనది, జీర్ణంమధు = ప్రాతదియగు తేనె; తేషు = ఆనాలుగు విధములలో, అస్త్యాద్వేపవ = చివరి రెండే; ఉపయోజయేత్ = ఉపయోగించవలెను

తాత్పర్యము :- తేనె=మధుశర్కర.

తేనె నేత్రములకు మిక్కిలి శ్రేష్ఠమైనది. దప్పిని కఫవికారములను, ఎక్కిళ్ళను, రక్త వికారములను, కొత్త వికారములను, కుష్ఠ, ప్రమేహ, కృమి, ఛర్ది, శ్వాస, కాస, అతిసార రోగములను పోగొట్టును. వ్రణము లను శోధించును; వ్రణములను సంధానము చేయును (రెండు వ్రణముఖముల నొకటిగా చేయును). వాతమును వృద్ధిపరుచును. మధుర రసము కటు విపాకము గలది.

మధుశర్కర మధువుతో సమాన గుణములను కలిగియుండును. తేనెను ఒక సీసాలోవైచి కొన్ని మాసములల్లే వుంచినయెడల క్రింద భాగమున శర్కర తయారగును. దానినే మధు శర్కర యందురు.

**కాచినతేనె :** అనేకవిధములైన రసగుణవీర్య విపాకములచేత విరుద్ధములైన పువ్వుల మకరందమునుండి తయారగుట వలన, విషయుక్తము లగు తేనెటీగలచేత కూర్పబడుట వలనను వేడిని సాత్మింపజేయజాలదు. అన్ని విధములగు తేనెలును విషముతో కూడియుండుటచేత ఉష్ణపదార్థములతో విరోధించును. కాన ఉష్ణపీడితులకు ఉష్ణ ద్రవ్యములతో చేర్చబడిన దానిని సేవించిన వారిని; ఉష్ణకాలములో ఉష్ణదేశములో సేవించిన వారిని విషమువలె జంపును. వమనము నిరూహవస్తితో చేర్చబడిన కాచిన తేనెను ఉప యోగించినను అది ఉదరమునందు పాకమును చెందకయే శీఘ్రముగా బయలు వెడలును కాన వమననిరూహ వస్తులయందు అది నిషేధింప బడలేదు.

## మధుగుణములు, మాత్రాప్రమాణము

గురుగుణము, రూక్షగుణము, వగరురసము శీతవీర్యము గలది యగుట వలన తేనె స్వల్ప మాత్రలో వుపయోగించవలయును, ఎక్కువ మాత్రలో ఉపయోగించరాదు. అధిక మాత్రలో ఉపయోగించిన యెడలఅజీర్ణము చేయును. ఈ అజీర్ణము చాల కష్టదాయకమైనది. ఎందుకనగ ఏ పదార్థము కడుపులో జీర్ణము కాకున్నను ఉష్ణ చికిత్స చేయవలసియుండును. ఉష్ణ చికిత్స తేనెకు విరుద్ధమైనది. ఇట్టి స్థితిలో తేనె విషమువలె మానవుని చంపును. కావున తేనె స్వల్ప మాత్రలో వుపయోగించవలెను.

## మధు ఉపయోగము

మధు యోగవాహి ద్రవ్యము. ఎందుకనగ పలువిధములైన పుష్ప మక రందములతో తయారయినది. మరియు వాజీకరణ యోగములతో చేర్చి సేవిం చిన తేనె చాల శ్రేష్ఠమైనది. వృష్యకరముగా నుండును.

యోగవాహియనగ, యే ద్రవ్యము మరియొక ద్రవ్యముతో కలిసి తన స్వభావ రసగుణ వీర్య విపాకములను వదలిపెట్టి తాను కలిసిన ద్రవ్య స్వభావాదులను అనుసరించునో అదియని కొందరి యభిప్రాయము. ఇట్లు అర్థము చెప్పిన యెడల నిరర్థకమగును. ఎందుకనగ యోగవాహి ద్రవ్య సంయోగము చెందని స్వభావ గుణములు గల ద్రవ్యము యోగవాహి ద్రవ్యము కలిసిన యెడల తన స్వభావ గుణములు మారక ఆ గుణములు దానిని అనుసరించియే యుండును. అందువలన యే ద్రవ్యము ద్రవ్యాంతరముతో కలిసినపుడు ఆ ద్రవ్యమునకు ఎక్కువ శక్తిని పుట్టైనని చెప్పుట యుక్తము. ఇట్లు చెప్పుటవలన శకిని వృద్ధి పరచు ప్రతి ద్రవ్యము యోగివాహిత్యమును పొందును. కాన ఇదియు యుక్తముకాదు, యే ద్రవ్యము మరియొక ద్రవ్యముతో అనుసరించక పోయినప్పటికి కలిసినట్లైన ఆ ద్రవ్యము యొక్క గుణములను అనుసరించి ఆ ద్రవ్యమునకు విరోధమేర్పరుపక తనకార్యమును కొంచెముచేయునో భృత్యుని వలెఅది యోగవాహిద్రవ్యమని పిలువబడును. ఎట్లనగా భృత్యుడు స్వామికార్యములను సక్రమముగా ఆచరించుచు స్వకీయమై శరీరయాత్రాదులుస్వామి కార్యములకువిరోధమునుకలిగించక నిర్వహించుకొనుచుండునో అట్లే తేనె మంగకాయతో కలిసినయెడల వమన కార్యమును చేయునేకాని స్వభావగుణమైన వమన నివారణమునుచేయుటలేదు. మరియు హారీతకితో కలిసిన తేనె విరేచనకార్యమునే చేయునేకాని స్వభావగుణమైన స్తంభన రూపకార్యమును చేయుటలేదు.

## మధు భేదములు 4

తేనె భ్రామ రమనియు, పౌత్తికములనియు, క్షౌద్రమనియు, మాక్షికమనియు 4విధములు. తేనెటీగలచేత కూర్పబడినది భ్రామరము. పెద్దవై తుమ్మెదల వంటి తేనెటీగలు.

"మహత్యః పింగలాయాస్తు మాక్షికాః పుత్తికాస్మృతా" అను వచనాను సారము పసుపురంగు గలిగి పెద్దవిగా నుండు తేనెటీగలు పుత్తికములు. అట్టి వానివలన జేర్పబడినది పౌత్తికము.

క్షౌద్రమనగా, చిన్నవిగా నుండు తేనెటీగలచేత చేర్పబడినది. మాక్షికములు "మహత్యః పిఙ్గలా స్తీక్ష్ణా విపాస్తా మక్షికాస్మృతాః" అని పెద్దవిగాను తేనె రంగుగా నుండి పొడిచినచో తీక్ష్ణమైన విషమెక్కునట్టివి మక్షికములు. వీటిచేత కూర్పబడినది మాక్షికము.

భ్రామరమను తేనె శుక్ల వర్ణముగను, పౌత్తికమను తేనె ఘృత వర్ణముగను క్షౌద్రమను తేనె కపిల వర్ణముగను, మాక్షికమను తేనె తైల వర్ణముగను వుండును.

శశిలేఖ: "భేది" యనగా తీక్ష గుణముగల దేహమునందలి పిండ

భూతముగనున్న భాగములను వేరుగా చేయునది. "సంధానం" రెండు వ్రణ మార్గముల నొకటిగా కలుపును. ఎక్కువగా తేనె నుపయోగించిన యెడల అజీర్ణము చేయును. అజీర్ణము చేసినపుడు ఉష్ణోదక పానాదులు విధించబడినవి. ఉష్ణోదక పానము తేనెకు విరుద్ధము. అందువలన శీతముగా నుండు చికిత్సలు చేయవలెను. శీతగుణ వీర్యములు కల్ల చికిత్సలు అజీర్ణరోగికి అపథ్యములుగా నుండును. ఇందువలన ఉపక్రమ విరోధము కలుగుచున్నది. తక్కిన వన్నియు తాత్పర్యాంశములు.

మూ॥ తైలం స్వయోని వత్తత్ర ముఖ్యం తీక్ష్ణం వ్యవాయిచ।
త్వగ్దోషకృద చక్షుష్యం సూక్ష్మోష్ణం కఫకృన్నచ॥
కృశానాం బృంహణీయాలం స్థూలానాం కర్శనాయచ।
బద్ధ విట్కం క్రిమిఘ్నంచ సంస్కారాత్సర్వ రోగజిత్॥
తైల ప్రయోగాద జరానిర్వికారా జితశ్రమాః।
ఆసన్నతి బలాయుద్ధే దైత్యాధిపతయః పురా॥

**ప్రతిపదార్థము :** తైలం = నూనె; స్వయోనివత్ = తమ కారణ వస్తువులతో సమాన గుణములుగలవి; తత్ర = అచట; తైల = నువ్వుల నుండి తీయబడినది, ముఖ్యం = శ్రేష్ఠమైనది, తీక్ష్ణం = తీక్ష్ణ గుణముకలది; వ్యవాయి = శరీరము నందంతటా వ్యాపించు స్వభావముగలది; త్వక్ దోషకృత్ = చర్మమును దూషించును; అచక్షుష్యం = నేత్రములకు మంచిదికాదు; సూక్ష్మ = చిన్నవిగా నుండు స్రోతస్సులలో సంచరించును; ఉష్ణం = ఉష్ణవీర్యము గలది, నచకఫ కృత్ = మరియు కఫకరమైనదికాదు; కృశానాం = కృశించినవారికి; బృంహణాయ = బలియుట కొఱకు; అలం = చాలును; స్థూలానాం = బలిసిన వారికి (మేదస్సులకు), కర్శనాయచ = మరియు కృశించుటకొఱకు; అలం = చాలును; బద్ధవిట్కం = మలమును బంధించును; క్రిమిఘ్నంచ = మరియు క్రిములను నశింప జేయును; సంస్కారాత్ = సంస్కారమువలన; సర్వరోగజిత్ = సమస్త రోగములను జయించును; పురా = పూర్వము; దైత్యాధిపతయః = దైత్యులయొక్క రాజులు; తైలప్రయోగాత్ = తైలమును వుపయోగించుటవలన; అజరాః = ముసలితనము లేనివారు; నిర్వికారాః = వ్యాధులు లేనివారు; జితశ్రమాః = శ్రమను జయించిన వారుగా నుండిరి; చ = మరియు; యుద్ధే = యుద్ధమునందు; అతిబలాః = మిక్కిలి బలశాలురుగా; ఆసన్ = వుండిరి.

తాత్పర్యము : తైలములన్నియు తమకారణవస్తువులతో సమాన గుణములుగలవై యుండును. ఏవస్తువులో నుండి తైలము తీయబడినదో ఆ వస్తువు యొక్కగుణమే ఆతైలము నందుండును. తైలములలో నువ్వులనూనె ముఖ్యమైనది. తీక్ష్ణగుణముకలిగి శరీరము నందంతట వ్యాపించును. పానాభ్యాసము వలన చర్మమును దూషించును. నేత్రములకు మంచిదికాదు. సూక్ష్మస్రోతస్సు

లలో సంచరించుచుండును. ఉష్ణవీర్యము గలది. కఫకరముకాదు. తైలము కృశించినవారికి పౌష్టికము; మేదస్వులకు కార్శ్యమును కలిగించును. మలమును బంధించి క్రిములను నశింపజేయును. సంస్కారము వలన అనేక రోగములను బోగొట్టును. పూర్వము ఇంద్రాది దేవతలు తైల ప్రయోగములద్వారానే అజరామరులుగా జితేంద్రియులుగా యుద్ధమునందు అతిబలులుగానుండిరి.

*శశిలేఖ :* ద్రవముగా నుండుటవలన తైలమని చెప్పబడుచున్నది. వ్యవాయి యనగా మొదలు సర్వశరీరమును వ్యాపించి తరువాత పాకము చెందునదియని అర్థము. త్రాగటము అభ్యాసము చేయుటవల్ల త్వక్కును దూషించును. అట్లుకాని యెడల త్వగ్దోషమును భేదించునని (కృతిభేదన ఇత్యస్య ధాతోః ప్రయోగః) సూక్ష్మస్రోతస్సులను ప్రవేశించునది. దైత్యాధిపతులు గూడ తైల ప్రయోగమువలననే అజరామరులుగా నుండిరి.

వి. వ్యా. తైలము పాకమువలన కటువుగానుండి వాతమును హరింప జేయును. కఫ పిత్తములను వృద్ధి పరచునని ఆయుర్వేదావతారమను గ్రంథమున గలదు. నువ్వులనుండి ఉత్పన్నమైనదికాక స్నేహప్రాధాన్యము వలన తైలముఅనిచెప్పబడుననిచరకమునందుకలదు.ఏరండతైలము,కుసుమతైలముఅను పేర్లనుబట్టి వాటి కాడలు ఆకులు మొదలగునవియనికూడ అర్థమువచ్చును.ద్రవ్య నామముతోకూడ తైలశబ్దము చేర్చియే చెప్పవలయును. తైలము తిలతైలపర ముగా ముఖ్యము. ఇతరతైలములయందు గౌణముగా ప్రయోగింతురు. కృశించిన శరీరముగల పురుషునియొక్క స్రోతో మార్గములు మిక్కిలి సంకోచమును చెందియుండుటచేత వానిలో బృంహణద్రవ్యములు లోపల ప్రవేశించుట కష్టము గాన అట్టిస్థితిలో తైలము సంకోచముచెందిన స్రోతస్సులలో తీక్ష్ణాది గుణములచే శీఘ్రముగ ప్రవేశించి వానిని శుద్ధి చేయగలదు. స్రోతస్సులు బాగుగాశుద్ధి చెందినయెడల వెంటనే శరీర పుష్టికలుగును. "స్రోతస్సుతత్ర శుద్ధేషు రసోధాతూనుపైతియః, తేన తుష్టిర్బలం వర్ణః పరం పుష్టిశ్చజాయతే" స్రోతస్సులు బాగుగా శుద్ధి చెందియుండునపుడు రసములు ధాతువులలో బాగుగాప్రవేశించి శరీరమునకుతుష్టినిపుష్టిని వర్ణమును ప్రసాదించును.ఇట్లే స్థూలశరీరులయొక్క సూక్ష్మమైన స్రోతస్సులలో తైలముప్రవేశించి,తీక్ష్ణ ఉష్ణగుణములతో మేదస్సును క్షయింపజేసి స్థూల శరీరమును కృశింపజేయును. తీక్ష్ణాదిగుణ ద్రవ్యములు పై రెండు కార్యములను జేయుటకు సమర్థములని భావము.

శ్లో॥ సతిక్తోష్ణమైరండం తైలం స్వాదు సరం గురు।
వర్ధ్మగుల్మానిల కఫానుదరం విషమజ్వరమ్॥
రుక్శోఫౌచ కటీగుహ్య కోష్ఠపృష్ఠాశ్రయా జయేత్।

ప్రతిపదార్థము : ఏరండతైలం = ఆముదము; సతిక్తోష్ణం = తిక్తముగా, కారముగా; స్వాదు = మధురముగా నుండును; సరం = సర్వశరీరవ్యాప్తి; గురు =

గురుగుణముకలది; వర్ధ్మ=వర్ధ్మరోగము; గుల్మ=గుల్మరోగము; అనిల కఫాన్ = వాత కఫరోగములను; ఉదరం = ఉదరరోగమును, విషమ జ్వరం = విషమజ్వరమును పోగొట్టును; కటీ = నడుము; గుహ్యా = గుహ్యాస్థలము; కోష్ఠ = కోష్ఠము; పృష్ఠాశ్రయా =వీపును ఆశ్రయించిన, రుక్ఛోఫౌ = శూలలను వాపును; జయేత్ =జయించును.

తాత్పర్యము : ఆముదము తిక్తకటు స్వాదురసములు గలది. శరీరము నందు వ్యాపించును. వర్ధ్మ రోగములను, కట్యాదులయందలి శూలవాపులను పోగొట్టును.

**శశిలేఖ :** తాత్పర్యాంశమే.

మూ॥ తీక్ష్ణోష్ణం పిచ్ఛిలం విస్రం రక్తైరండోద్భవంత్వతి।

*ప్రతిపదార్థము :* రక్తైరండోద్భవం=ఎఱ్ఱాముదం;తీక్ష్ణోష్ణం=తీక్ష్ణగుణము ఉష్ణగుణము గలది; పిచ్ఛిలం=పిచ్ఛిలముగ నుండును; అతివిస్రం=ఎక్కువ దుర్గంధముగలది.

**తాత్పర్యము :** ఎఱ్ఱాముదము తీక్ష్ణ ఉష్ణగుణములు గలది. పిచ్ఛిలముగ నుండును. ఎక్కువ దుర్గంధమును కూడ గలిగియుండును.

**శశిలేఖ :** తాత్పర్యాంశము.

మూ॥ ఉమాకుసంభజం చోష్ణంత్వగ్దోష కఫపిత్తకృత్

*ప్రతిపదార్థము :* ఉమాకుసుంభజం = అగసినూనె కుసుమనూనెలు; ఉష్ణం=ఉష్ణవీర్యముగలవి; త్వగ్దోష=చర్మ దోషములను; కఫ=కఫవికారము లను; పిత్తకృత్ =పిత్తవికారములను చేయును.

**శశిలేఖ :** తాత్పర్యాంశము.

మూ॥ దంతీమూలక రక్షోఘ్న కరంజారిష్ట శిగ్రుజమ్
సువర్చ లేంగుదీపీలు శంఖనాదీప సంభవమ్
సరళాగురు దేవాహ్వాశింశుపాసార జన్మచ
తువరాష్కరోత్థంచ తీక్ష్ణం కటమ్లపిత్తకృత్
అర్శః కుష్ఠ కృమి శ్లేష్మ శుక్రమేదో నిలాపహమ్"

*ప్రతిపదార్థము :* దంతీ=నేపాళము; మూలక =ముల్లంగి; రక్షోఘ్న= ఆవాలు; కరంజ = కానుగ; అరిష్ట = వేప; శిగ్రుజము = మునగనుండి పుట్టిన; సువర్చల = పొద్దుతిరుగుడు చెట్టు; ఇంగుదీః =గారచెట్టు; పీలుశంఖదా =కట్లచెట్లు; నీపసంభవం = నీరుకడిమి నుండి పుట్టిన; సరళ = సరళ = సరళదేవదారులు;అగరు = అగరు; దేవాహ్వా=

దేవదారు; శింశుపా పారజన్మేచ=ఇరుగుడు సంబరేణువిట్లనుండి పుట్టిన;తువర= కందులు; అరుష్కరోత్థంచ=నల్లజీడిగింజలలోనుండి తీయబడిన తైలములు; తీక్షణము=తీక్షణగుణముకలవి; కట్వలంపిత్తకృత్=కారముగా,వుల్లగా నుండి పిత్తమును వృద్ధిచేయును; అర్శః=అర్శస్సును; కుష్ఠ=కుష్ఠమును; క్రిమి= క్రిములను; శ్లేష్మ=శ్లేష్మ=కఫవికారములను; మేద=మేదస్సును; అనిలాప హం=వాతమును పోగొట్టును.

**తాత్పర్యము :** నేపాళం, ముల్లంగి, ఆవాలు, క్రానుగ, వేప, మునగ, ప్రొద్దుతిరుగుడుచెట్టు, గారచెట్టు, వరగోగు, సరళదేవదారు, ఇరుగుడు,సంబరేణు, కందులు, నల్లజీడి వీని గింజలలోనుండి తీయబడిన తైలములు తక్షణ గుణము కలిగి కారముగా, వుల్లగనుండి, పిత్తమును వృద్ధిచేయును, అర్శస్సు మొదలగు రోగములను పోగొట్టును.

**శశిలేఖ :** "సరళాగురు దేవాస్వాశింశుపా" వరకు సార శబ్దముతో సంబంధము కలగవలెను. అనగా వీటి యొక్క చేవనుండి తీయబడిన తైలమని అర్థము.

**వి. వ్యా :** నేపాళగింజలనుండి తీయబడిన తైలము మిక్కిలి తీవ్రమైన విరేచనకారిగా నుండును. క్రానుగ గింజలనుండి తీయబడిన తైలముతో అభ్యంగనము చేసుకొన్న, పామ, దురదలు మొదలగు క్షుద్ర కుష్ఠములు శాంతించును. వేపతైలముతో అభ్యంగనము చేసిన చర్మరోగములు శాంతించును మరియు తలయందలి పేలుచచ్చును.ఈ తైలమును స్వల్పప్రమాణము బెల్లముతో కలిపి తినిన యెడల ఉదరమునందలి క్రిములు నశించును. దేవదారు తైలము వ్రణ శోధకముగా నుండును.దీనిని లోనికి సేవించిన యడల పూయమేహమును శాంతింప జేయును. సామాన్యముగా ఈ తైలము లన్నియు కటు రసము కలిగి పిత్తమును రక్తము వృద్ధి చేయును.

**మూ॥** కరంజనింబజౌ తిక్తే నాత్యుష్ణే తత్ర, నిర్దిశేత్

**ప్రతిపదార్థము :** కరంజ=క్రానుగ; నింబజౌ=వేప, వీనిలోనుండి తీయ బడిన తైలము; తిక్తేః=తిక్తరసముగలది; నాత్యుష్ణే=స్వల్పముగా వుష్ణము గలదిగా; తత్ర=అక్కడ; నిర్దిశేత్=చెప్పబడెను.

**తాత్పర్యము :** క్రానుగవేప వీటిలోనుండి తీయబడిన తైలము తిక్తముగా నుండి స్వల్పోష్ణము గలది.

**మూ।** కషాయ తిక్తకటుకం సారళం వ్రణ శోధనం

**ప్రతిపదార్థము :** సారళం=దేవదారు కట్టెయొక్క చేవనుండి తీయ బడిన తైలము; కషాయ తిక్తకటుకం=వగరుచేరు కారమును కలిగియుండును; వ్రణశోధనం=వ్రణములను శోధించును.

**తాత్పర్యము** : సరళకాష్ఠ సారమునుండి తీయబడిన తైలము, కషాయ క్తకటు రసములను కలిగి దుష్టమైన వ్రణములను శుద్ధిచేయును.

మూ॥ భృశోష్ణతీక్ష్ణ కటుకే వరారుష్కరోద్భవే
విశేషాత్ క్రిమికుష్ఠఘ్నే తథోర్ధ్వాధో విరేచనే ॥

**ప్రతిపదార్థము** : తువరారుష్కరోద్భవే=కందులు, నల్లజీడి వానినుండి చేయబడిన తైలము; భృశోష్ణ తీక్ష్ణకటుకే=అధికముగా వుష్ణము తీక్ష్ణ గుణములు కలిగి కారముగా నుండును; క్రిమికుష్ఠఘ్నే=క్రిమి రోగములను కుష్ఠములను పోగొట్టును; తథా=అట్లే; విశేషాత్=విశేషముగా, ఉర్ధ్వాధోవిరేచనే=వమన విరేచనముల చేత దోషములను బయటికి నెట్టును.

**తాత్పర్యము** : కందులు నల్లజీడి వీటినుంచి గ్రహించిన తైలము ఎక్కువ ఉష్ణమును చేయును, తీక్ష్ణ గుణము కలిగి కారముగా నుండును. విశేషముగా క్రిమిరోగమును కుష్ఠమును పోగొట్టును. వమన విరేచనములచేత దోషములను బయటికి పంపును.

మూ॥ అక్షాతిముక్త కాక్షోట నారికేళ మధూకజం
త్రపు శైర్వారు కూష్మాండ శ్లేష్మాతక ప్రియాళజం
వాతపిత్త హరం కేశ్యం శ్లేష్మళం గురు శీతళం

**ప్రతిపదార్థము** : అక్ష=తానికాయ; అతిముక్తక=నెమ్మి; ఆక్షోట=గిరకతాడి; నారికేళ=టెంకాయ; మధూకజం=ఇప్పచెట్టునుండి పుట్టిన తైలము; త్రిపుస=ఇములుదోస; ఉర్వాయ=నక్కదోస; కూష్మాండ=గుమ్మడి; శ్లేష్మాతక=విరిగి ప్రయాళజం=మొదలగు వానిగింజల తైలములు; వాతపిత్త హరం=వాతపిత్తములను శమింపజేయును; వృష్యం=శుక్రమును వృద్ధి పరచును; శ్లేష్మళం=కఫమును వృద్ధిచేయును; గురు=గురుగుణముగలది; శీతలం=శీత వీర్యమైనది; కేశ్యం=వెంట్రుకలకు మంచిది.

**తాత్పర్యము** : తానికాయ, నెమ్మి, గిరుకతాడి, టెంకాయ, ఇప్పములు దోస,నక్కదోస, గుమ్మడి,విరిగి, మురళి,వాటి గింజలనుండి దీయబడిన తైలములు వాతపిత్తములను హరించును, శుక్రమును వృద్ధిచేయును. కేశములకు మంచి చేయును. శ్లేష్మమును వృద్ధిపరచి, గురుగుణము కలిగి, శీతలముగా నుండును.

మూ॥ పిత్తశ్లేష్మ ప్రశమనం శ్రీపర్ణే కింశుకోద్భవం

**ప్రతిపదార్థము** : శ్రీపర్ణేకింశుకోద్భవం=పెద్దగుమ్మడి, మోదుగ వీటి గింంలనుండి తీయబడిన తైలము; పిత్తశ్లేష్మ ప్రశమనం=పిత్తమును శ్లేష్మమును శమింపజేయును.

**తాత్పర్యము** : పెద్దగుమ్మడి, మోదుగ, వీని గింజలనుండి తీయబడిన

తైలము పిత్తమును శ్లేష్మమును శమింపజేయును.

మూ॥ తిలతైలం వరం తేషు కే సుంభం వరంపరం

ప్రతిపదార్థము : తేషు=ఈ తైలములలో; తిలతైలం=నువ్వులనూనె; వరం=శ్రేష్ఠమైనది; కౌశుంభం=కుసుమనూనె; పరం=మిక్కిలి;అవరం=శ్రేష్ఠమైనదికాదు.

తాత్పర్యము : పై నుదాహరించిన తైలము లన్నిటిలో నువ్వులనూనె మిగుల శ్రేష్ఠమైనది. కుసుమనూనె అంత శ్రేష్ఠమైనదికాదు.

మూ॥ వసామద్యా చ వాతఘ్నా బలపిత్త కఫప్రదా
మాంసాను గస్వ రూపేచ విద్యాన్ మేదో ఽ పితానివి॥

ప్రతిపదార్థము : వస=శుద్ధమాంసము యొక్క స్నేహము; మజ్జ=మూలగ; ఈ రెండును, వాతఘ్నే=వాతమును పోగొట్టును; బల=బలము; పిత్త=పిత్తము; కఫప్రదౌ=కఫమును కలుగజేయును; చ=మరియు; మాంసాను గతస్వరూపే=ఏ ప్రాణియొక్క మాంసములో నుండి వసా, మజ్జాదులు దీయబడునో ఆస్వరూపముగల; తానివ=అవసామజ్జాదులవలె, మేదోఽపి=మేదోధాతువునకు కూడా; విద్యాత్=తెలుసుకొనవలయును.

తాత్పర్యము : వసామజ్జా ఇవి రెండును వాతమును పోగొట్టును. బలమును పిత్త కఫములను వృద్ధిచేయును. ఏ ప్రాణి యొక్క మాంసములోనుండి వసామజ్జాదులు గ్రహింపబడునో అట్టి ప్రాణియొక్క మాంసగుణమే ఆ వసామజ్జాదులకును కలిగియుండును. మరియును వసా మజ్జాదుల యొక్క గుణమే మేదో ధాతువునకును కలిగియుండును.

శశిలేఖ :- వసయనగా శుద్ధమాంసము యొక్క స్నేహమని యర్థము. ఏ జంతువుకు సంబంధించిన మాంసమునుండి లభించిన వసామజ్జలకు ఆమాంసము యొక్క గుణములే ఉండును. గుణములే మేదస్సుకు కలిగియుండును.

మూ॥ బౌలూకే సౌకరేపాక హంసజాతుకుక్కుటోద్భవ
వసా శ్రేష్ఠ స్వవర్గేషు కుంభీరను హిషోద్భవ
కాక మద్గు వసా తద్వతు కారండో ధాచనిందిత

ప్రతిపదార్థము : బౌలూకా=కప్ప, సౌకరే = పంది; పాతుహంసజా=రాజహంసలనుండి పుట్టిన; కుక్కుటోద్భవ=కోడినుండి తీయబడిన; వస=వస; స్వవర్గేషు=ఈ వర్గమునందు; శ్రేష్ఠా=శ్రేష్ఠము;కుంభీరమహిషోద్భవ=కారు మొసలి, దున్నపోతులనుండి తీయబడినది. కాక=కాకి; మద్గు=నీరుకోడి; తద్వత్=అట్లే; కారండోత్థ=నీరుకాకినుండి తీయబడిన; వసా=వస; నిందిత=గర్హింపబడినది.

**తాత్పర్యము :** అనేక పశులకు సంబంధించిన వసలో కప్పసుండి తీయ బడిన వస, అనూపదేశమునకు సంబంధించిన జంతువులలో పంది యొక్క వస,నీటి యందు సంచరించు ప్రాణులలో, రాజహంసయొక్క వస విష్కిరవర్గ యందలి ప్రాణులలో, కోడియొక్క వస ఉత్తమమైనదిగా భావింపబడుచున్నది. ఇట్లే కారు మొసలి, దున్నపోతు,కాకి, నీరుకాకి, నీరుకోడి అనువాని వస నిందితము.

మూ॥ శాఖాధమేదసాం ఛాగం హాస్తినంచవరావరం

**ప్రతిపదార్థము :** శాఖాదమేదసాం = ఆకులను మేసెడి జంతువులలో; ఛాగం = మేకను; చ = మరియు; హాస్తినాం = ఏనుగును,వరావరం = క్రమముగా శ్రేష్ఠమైనదిగా, నిందితమైనదిగా చెప్పబడినది.

**తాత్పర్యము :** ఆకులను మేసెడి జంతువులతో మేకయొక్క మేధస్సు, శ్రేష్ఠము, ఏనుగు యొక్క మేదస్సు గర్హ్యము.

## మద్య వర్గము

మూ॥ దీపనం రోచనం మద్యం తీక్ష్ణోష్ణం తుష్టి పుష్టిదమ్।
స్వాదు తిక్తకటుక మమ్ల పాకరసం సరమ్॥
సకషాయం స్వరారోగ్య ప్రతిభావర్ణ కృల్లఘు।
నష్టనిద్రాతి నిద్రేభ్యో హితం పిత్తాస్రి దూషణమ్॥
కృశస్థూల హితం రూక్షం సూక్ష్మం స్రోతోవిశోధనమ్।
వాతశ్లేష్మహరం యుక్త్యా పేతం విషవదన్యథా॥
గురుతద్దోష జననం నవం జీర్ణమతో ఽన్యథా
పేయం నోష్ణోపచారేణ నవిరక్తక్షుధాతురైః॥
నాతి తీక్ష్ణమృదు స్వచ్ఛ ఘనం వ్యాపన్నమేవచ।

**ప్రతిపదార్థము :** మద్యం = మద్యము; దీపనం = అగ్నిదీప్తిని కలుగ జేయును; రోచనం = రుచిని పుట్టించును; తీక్ష్ణోష్ణం = తీక్ష్ణగుణమును ఉష్ణగుణమును గలది; తుష్టి = మనస్సునకు సంతోషమును; పుష్టిదం = శరీరమునకు బలమును ఇచ్చును: సస్వాదుతిక్త కటుకం = మధురంచేదు, వగరు రసములతో కూడినది; అమ్లపాకరసం = అమ్లరసమును అమ్లవిపాకము గలది; సరం = సర్వశరీరమును వ్యాపించునది; సకషాయం = కషాయ రసముకలది; స్వర = కంఠస్వరమును; ఆరోగ్య = శరీరారోగ్యమును; ప్రతిభ = నవనవోన్మేష శాలిత్వమును;కృత్ = చేయును; లఘు = లఘుగుణముకలది; నష్టనిద్రాతి నిద్రేభ్యః = నిద్రపట్టని వారికి ఎక్కువ నిద్రపోవువారికి,హితం = మంచిది;పిత్తాస్ర దూషణం = పిత్తరక్తమును పోగొట్టును; కృశస్థూలహితం = కృశించిన వారికి బలిసిన వారికి మంచిది; రూక్షం = రూక్ష గుణము కలది; సూక్ష్మం = సూక్ష్మ మైన; స్రోతోవిశోధనం = స్రోతస్సులను శుద్ధి పరచును; యుక్త్యా = విధిపూర్వక

ముగా; పీతం=త్రాగబడినది; వాతశ్లేష్మహరం = వాతశ్లేష్మ వికారమును పోగొట్టునది; అన్యథా=విధిపూర్వకముగా సేవింపని మద్యము; విషవత్=విషము వలె; భవేత్ = అగుచున్నది.

**తాత్పర్యము :** మద్యములన్నియు విధిపూర్వకముగా సేవింపబడిన యెడల అగ్నిదీప్తిని, రుచిని; మానసికానందమును—శరీరమునకు బలమును ఇచ్చును. తీక్ష్ణ ఉష్ణగుణములను గల మధురతిక్త కటుకషాయ అమ్లరసములు గల అమ్లవిపాకముగల మద్యము విధిపూర్వకముగా పానము చేయబడినయెడల సర్వశరీరమును వ్యాపించును. కంఠస్వరమును శరీర ఆరోగ్యమును శరీరమునకు వర్ణమును నవనవోన్మేష శాలిత్వమును చేయును. నిద్రలేని వారికి నిద్రను పట్టించును. ఎక్కువనిద్ర పోవువారికి నిద్రను తగ్గించును. పిత్తమును రక్తమును దూషించును. కృశించిన వారికి బలమును స్థూలురకు కార్శ్యమును కలిగించును. లఘు రూక్ష గుణములను కలిగియుండుట వలన సూక్ష్మములైన స్రోతస్సులను శుద్ధిచేయును. వాతశ్లేష్మ వికారములను శాంతపరచును.

విధి పూర్వకముగా సేవింపబడని మద్యము (మదాత్యయ చికిత్సలో చెప్పిన విధులు పాటించవలయును) విషముగా మారును.

**శశిలేఖ :** తుష్టి యనగా మనస్సునకు సంతోషము యని యర్థము. పుష్టియనగా శరీర పోషకమని యర్థము. నష్టనిద్రితులకు అతి నిద్రులకు జీర్ణము కాని ఆహార శేషము మిగులుట వలన వైపరీత్యమును కలిగించును. ఒక సంవత్సరమునకంటే ఎక్కువగానున్న మద్యము గురుగుణము గలిగి త్రిదోషములను వృద్ధిచేయును.

**వి. వ్యా:** మద్యము ఇతర ఆహారముల కంటే సర్వ శ్రేష్ఠమైనది. అందువల్లనే మూలకారుడు "ఆరోగ్యం" అని ప్రత్యేకముగ నిర్దేశించినాడు. నిద్రలేని వారికి సురాది మద్యములు శ్లేష్మాదులను హరించునుగాన శ్రేష్ఠమైనవి. అతి నిద్రాళువులకు కూడ మాధవాది మద్యములు శ్రేష్ఠములుగా చెప్పబడినవి.

ప్రతిపదార్థము : నవమ్=అప్పుడే తయారు చేయబడిన మద్యము; గురు=గురుగుణము గలది; దోష జననం=త్రిదోషములను వృద్ధి చేయును, జీర్ణం = పది, ఇరవై దినములు పాతబడిన మద్యము; అతాఽన్యథథా=దానికి విపరీతముగా లఘు గుణము త్రిదోష శామకముగా నుండును; ఉష్ణోపచారేణ= ఉష్ణ, ఆహార విహారములతో కూడ; మద్యం=మద్యము; న పేయం=త్రాగరాదు; విరిక్తతుధాతురైః = వమన విరేచనముల తరువాత ఆకలిగొన్న వ్యాధుల చేత బంధింపబడు వారిచేత; మద్యమ్ = మద్యము; న పేయం = త్రాగరాదు; అతి

తీక్ష్ణ=ఎక్కువ తీక్షణమైనది; మృదు=మద్యసారము చాల తక్కువగా నున్నది; స్వచ్ఛ=మిక్కిలి పలుచగా నున్నది; ఘనమ్=మిక్కిలి చిక్కగానున్నది; చ= మరియు; వ్యాపన్నమేవ=చెడిపోయిన; మద్యమ్=మద్యము; నపేయమ్= త్రాగదగినది కాదు.

**తాత్పర్యము :** కొన్ని రోజులు పాతబడిన మద్యము గురుగుణము కలిగి త్రిదోషములను వృద్ధి పరచును. అట్లు కాని మద్యము లఘు గుణము కలిగి త్రిదోషములను శమింప జేయును. వేడియైన ఆహారముతో, ఉష్ణవిహారముతో కూడ మద్యపానమును సేవించరాదు. వమన విరేచనములు అయిన తరువాత వట్టి కడుపునందు మద్యము సేవించరాదు. తీక్షణ, మృదు మద్యములను సాంద్ర తరళ మద్యములను, చెడిన మద్యమును సేవింపరాదు.

**మూ॥ గుల్మోదరార్శోగ్రహణీ శోష హృత్ స్నేహనీ గురుః॥**
**సురా ఽ నిలఘ్ని మేదో ఽ సృక్ స్తన్య మూత్రకఫావహా।**

**ప్రతిపదార్థము :** సురా=సురయను మద్యము; గుల్మ=గుల్మము; ఉదర= ఉదరరోగము; అర్శ=అర్శస్సు; గ్రహణి=గ్రహణి; శోషహృత్=శోష రోగములను పోగొట్టును; స్నేహనా=శరీరమునందు జిడ్డును కలుగజేయును; గురుః=గురుగుణము కలది; అనిలఘ్ని=వాతమును హరించును; మేద= మేదస్సు; అసృక్=రక్తము; స్తన్య=చనుబాలు; మూత్ర=మూత్రము; కఫావహా=కఫమును వృద్ధి చేయును.

**తాత్పర్యము :** సురయను మద్యము గుల్మము ఉదరరోగము అర్శస్సు గ్రహణి శోష మొదలగు వ్యాధులను నివారించును. శరీరమునందు జిడ్డును కలుగజేయును. గురుగుణము కలది. వాత దోషమును హరించును. మేదస్సు రక్తము చనుబాలు మూత్రము కఫములను వృద్ధి చేయును.

**శశిలేఖ :** "సురా పిష్ట కృతా ఘనా శ్వేతా" అని చెప్పబడినది.

**మూ॥ తద్గుణా వారుణీ హృద్యా లఘు తీక్ష్ణా నిహంతిచ**
**శూల కాసవమిశ్వాస విబంధా ధ్మాన పీనసాన్ ।**

**ప్రతిపదార్థము :** వారుణీ=వారుణియను మద్యము; తద్గుణా=సురతో సన గుణములు గలది; హృద్యా=హృదయమునకు మంచిది; లఘుతీక్ష్ణా= లఘువుగ తీక్ష్ణముగనుండును; శూల=శూలను; కాస=దగ్గును; వమి=వాంతిని, శ్వాస=ఉబ్బసమును; నిబంధా=దోషాదుల యొక్క అసంచారము; అధ్మాన= కడుపుబ్బరమును; పీనసాన్ = పీనసాదులను; నిహంతి=పోగొట్టును.

**తాత్పర్యము :** వారుణియను మద్యము పై నుదాహరించిన సురామద్యముతో సమానమైన గుణములు గలిగియుండును. హృదయమునకు మంచిది. లఘు తీక్ష్ణ గుణములు గలది. శూలను దగ్గును వాంతిని ఉబ్బసమును విబంధమును (స్రోతోమార్గములయందు మురికి చేరి స్రోతస్సులలో దోషాదులు

సంచరింపకుండుట) ఆధ్మానమును పీనసమును పోగొట్టును.

శశిలేఖ : విబంధః యనగ స్రోతస ఉపలేపేన దోషాదీనాం వహానం = స్రోతస్సు మాలిన్యాదులచే పూయబడిన వగుటవలన దోషాదులు సంచరింప కుండుట యని అర్థము.

వి. వ్యా : "పరిపక్వాన్న సంధానసముత్పన్నాం సురాంజనః, యతతాల ఖర్జూరర రసైః సన్ధితా సాహివాణీ" శార్ఙధర. యే చ బియ్యము మొదలగువాటి యొక్క అన్నముతో సంధానము చేయబడి తయారుచేయబడినది. సురయనియు తాళఖర్జూర రసములతో సంధానముచేసి తయారుచేయబడినది వారుణియనియు చెప్పబడినది.

చరక చికిత్స 24వ అధ్యాయము 6వ శ్లోకములో ఈ విషయమే స్పష్టీక రింపబడినది.

మూ॥ శూల ప్రవాహిక తృష్ణా ఒఒటో పార్శ్వం హితః॥
జగలః పాచనో గ్రాహీ రూక్షస్త ద్వచ్చమేదకః।
వక్క సోహ్నత సారత్వాద్విష్టం భీదోషకోపనః॥

ప్రతిపదార్థము : జగలః = జగలమద్యము; శూల = శూలకు; ప్రవాహిక = ప్రవాహికకు, తృష్ణా = దప్పికి; ఆటోపః = ఆటోపమునకు; అర్శసాం = అర్శస్సులకు, హితః = మంచిది; చ = మరియు; పాచనః = ఆమమును పచించును; గ్రాహీ = గ్రాహీ; రూక్షః = రూక్షగుణముగలది; తద్వత = అట్లే, మేదకః = మేదకమను మద్యము; వక్కసః = వక్కసమను మద్యము; హృత సారత్వాత్ = సురాసారంబహిర్గతమైనందువలన; విష్టంభీ = విష్టంభకారకము, దోషకోపనః = దోషములను వృద్ధిచేయును.

తాత్పర్యము : జగలమద్య శూల ప్రవాహిక శోధ దప్పి ఆటోపము అర్శో రోగములకు మిక్కిలి శ్రేష్ఠమైనది. మరియు ఆమ రసమును పచింపజేసి గ్రాహీ రూక్ష గుణములను కలిగియుండును.

మేదకము జగలమద్యముయొక్క గుణములనే కలిగియుండును. సురా సారము బహిర్గతమైన కారణము వలన వక్కసము విష్టంభకారకము మరియు దోష ప్రకోపమును చేయును.

శశిలేఖ : వారుణీ సురా మద్యముల యొక్క క్రింది భాగమున నిలచి యున్న ఘన భాగము జగల మద్యము. "ఆటోప"మనగ కుక్షియందు నిశ్చల మైన వాయువుతో శబ్దముతో కూడ నింపబడుట యని అర్థము "మేదక" మనగ జగలమద్యము యొక్క క్రింది భాగము నందలి ఘనపదార్థము.

వి.వ్యా : పై నుదాహరించిన మద్యములు యంత్రము ద్వారా స్రవింప చేయబడినవి ప్రసన్నా, కాదంబరీ, జగలం, మేదకము, వీటిలో అధికాంశము

జలముండును, సారమెక్కువగా నుండును. అందువలన మత్తుకూడ ఎక్కువగా నుండదు.

మూ॥ నాతి తీవ్ర మదాలఘ్వీ పథ్యా వై భీతకీసురా
వ్రణే పాండ్వామయే కుష్ఠే న చాత్యర్థం విరుధ్యతే॥
విష్టంభినీయవ సురా గుర్వీరూక్షా త్రిదోషలా।
కౌహాళీ బృంహణీ గుర్వీ శ్లేష్మలస్తు మధూలకః॥

ప్రతిపదార్థము : వై భీతకీసురా=తాని కాయచే చేయబడిన మద్యము; నాతితీవ్రమదా=మిక్కిలి తీవ్రమైన మదమును చేయదు; లఘ్వీ=లఘువుగ నుండును; పథ్యా=పథ్యకారి; చ=మరియు; వ్రణే=వ్రణములందు; పాండ్వామయే=పాండు రోగమునందు; కుష్ఠే=కుష్ఠమునందు; నాత్యర్థంవిరుధ్యతే= ఇతరమద్యములవలె నిషిద్ధమైనదికాదు. యవసురా=యవలచేత తయారు చేయబడిన యవసుర; విష్టంభినా=మలబంధమును చేయును; గుర్వీ=గురువుగ; రూక్షా=రూక్షముగ నుండును; త్రిదోషలా=త్రిదోషములను వృద్ధిచేయును; కౌహాళి=కౌహాళియను పేరుగల మద్యము; బృంహణీ=బృంహణకారి; గుర్వీ= గురువుగనుండును; మధూలకః = మధూలకమను మద్యము; శ్లేష్మలః = శ్లేష్మమును వృద్ధిచేయును.

తాత్పర్యము : తాని కాయలచేత చేయబడిన మద్యము వ్రణములయందు పాండు రోగమునందు కుష్ఠమునందు ఇతర మద్యములవలె నిషేధింపబడలేదు. లఘు గుణముగలది. యవలచేత చేయబడిన మద్యము మలబంధమును చేయును గురువుగ రూక్షముగ నుండును. త్రిదోషములను వృద్ధిచేయును. కౌహాళీయను మద్యము బృంహణమునుచేసి గురువుగా నుండును. మధూలకము (అన్ని మద్యములు సరిగా సంధానము కాకున్న యెడల మధూలకమని పేరు) శ్లేష్మమును వృద్ధిచేయును.

శశిలేఖ : "సర్వం మద్యం అసంజాతం మధూలక ఇతి స్మృతః" అని కలదు.

మూ॥ గ్రహణీ పాండు కుష్ఠార్శ శ్శోఫ శోషోదర జ్వరాన్ ॥
హంతి గుల్మకృమి ప్లీహాన్కషాయ కటువాతలః

ప్రతిపదార్థము : అరిష్ట=అరిష్టమను మద్యము; యథాద్రవ్యగుణః=తన యుత్పత్తికి కారణమైన ద్రవ్యములయొక్క గుణము కలదై యుండును; సర్వ మద్య గుణాధికం=మద్యములన్నింటికంటె ఎక్కువ గుణము కలది; గ్రహణీ= గ్రహణీ రోగమును; పాండు=పాండువు; కుష్ఠ=కుష్ఠము; అర్శ=అర్శస్సు; శోఫ=వాపు; శోష=శోషము; ఉదర=ఉదర రోగము; జ్వరాన్=జ్వరములను; గుల్మక్రిమి ప్లీహాన్=గుల్మ క్రిమి ప్లీహ రోగములను; హంతి=

పోగొట్టును; కషాయ కటు వాతలః=కషాయముగ కటువుగ నుండును; వాతమును వృద్ధి పొందించును.

**శశిలేఖ :** అరిష్టము యేయే ద్రవ్యములతో సిద్ధము చేయబడుచున్నదో ఆ ద్రవ్యముల యొక్క గుణములనే కలిగియుండును. సమస్తమైన దీపనత్వాది గుణములుగల మద్యముల కంటె అధిక గుణము గలది కషాయ కటు రసములు గలది అని చెప్పబడుచున్నది.

**ప్రతిపదార్థము :** మార్ద్వీకం=ద్రాక్షరసములో నుండి ఉత్పన్నమైన మద్యము. లేఖనం = లేఖనకారి, హృద్యం = హృదయమునకు మంచిది. నాత్యుష్ణం=ఎక్కువకా నుష్ణముచేయదు. మధురం = మధురముగనుండును. సరం=శరీరమునందు త్వరగ వ్యాపించును, అల్ప పిత్తానిలం=పిత్తవాతములను స్వల్పముగ ప్రకోపింపచేయును, పాండు=పాండు రోగమునకు, అర్శః=అర్శస్సునకు, వరః=శ్రేష్ఠమైనది.

**తాత్పర్యము :** శర్కరా సంబంధమయిన మద్యము సుగంధముగ నుండును. హృదయమునకు మంచి చేయును. స్వల్పముగ మత్తును కలిగించును. లఘుగుణముకలది.

బెల్లముతో చేయబడిన మద్యము మలమూత్రఅపానవాతములనుసుఖముగ వెలిపరచును. తృప్తిని కలిగించి జఠరాగ్నిని వృద్ధిపరచును.

శీధు అను మద్యము (కాచిన చెఱుకు రసమువలన చేయబడినది) వాత పిత్తములను వృద్ధిచేయును. స్నేహం వ్యాపత్తులను శ్లేష్మ వికారములను పోగొట్టును. కాచిన చెఱుకు రసము వలన చేయబడిన శీధు మద్యము మేదస్సు శోఫ ఉదర రోగము అర్శస్సు వీనిని హరించును.

**శశిలేఖ :** శీధుః అపక్వేక్షురసకృతః పక్వేక్షురసకృత అని కలదు. శీధుషు మద్యే పక్వరసః వరః మేదః ప్రభృతీనాం నాశనః అనియును కలదు.

మూ॥ భేది మధ్వా సవ స్తీక్ష్ణో మేహపీనస కాసజిత్
సురాసవ స్తీక్ష్ణ మదఃస్వాదు స్తీక్ష్ణోఽ నిలాపహః॥
మైరేయో మధురో హృద్యః సరః సంతర్పణో గురుః।
ధాత క్యభిషుతో జీర్ణో రూక్షో రోచన దీపనః
ద్రాక్షాసవో మధు సమః పరమం సతు దీపనః॥
మార్ద్వీక సదృశః ప్రోక్తా మృద్వీ కేక్షురసాసవః।

**ప్రతిపదార్థము :** మధ్వాసవః = తేనెవలన చేయబడిన మాధవమని మద్యము; భేదీ = గడ్డ కట్టి యుండు పదార్థములను విభజించును; తీక్ష్ణంనిపి తీక్ష్ణముగ నుండును; మేహ పీనస కాసజిత్ = మేహము,పీనసము, కాసము =

బోగొట్టును; సురాసవః=(సురయను మద్యములో తేనెను చేర్చి చేయబడినది) సురాసవము; తీక్ష్ణమదః=ఎక్కువగా మత్తును కలిగించును; స్వాదు=మధుర మైనది; క్రిమినాశనం=క్రిములను నశింపజేయును; ఖర్జూరం=ఖర్జూరమను మద్యము; అస్మాత్=ద్రాక్షా మద్యమున కంటె; అల్పాంతర గుణం=స్వల్ప మయిన గుణము కలది; వాతలం=వాతమును వృద్ధి చేయును; గురు=గురువుగ నుండును.

**తాత్పర్యము :** ద్రాక్షా రసములో నుండి పుట్టిన మద్యము లేఖనకారి (లేఖనమన విలిఖత్యతి "తైక్ష్ణ్యాద్యద్ధాతూన్ తల్లేఖనంస్మృతమ్" అను వచన మును బట్టి తీక్ష్ణ గుణమువలన మాంసాది ధాతువులను శుద్ధిచేయునని యర్థము. హృదయమునకు మేలుచేయును. ఎక్కువ వేడిని బుట్టించదు. మధురమైనది. ఇతర మద్యముల కంటె స్వల్పముగ పిత్తవాతములను వృద్ధిచేయును. పాండ్వాది రోగములను పోగొట్టును. ఖర్జూరమను మద్యము ద్రాక్షామద్యమునకంటె స్వల్ప గుణము కలది. వాతమును వృద్ధి నొందించును. గురువుగ నుండును.

**శశిలేఖ :** ఇతర మద్యముల కంటె పిత్తవాతములను స్వల్పముగ వృద్ధిచేయును.

మూ॥ **శార్కర స్సురభి స్వాదుర్హృద్యో నాతి మదో** లఘుః
సృష్ట మూత్రశకృద్వాతో గౌడ స్తర్పణ మేదనః ॥
వాత పిత్త కరః శీధుః స్నేహ శ్లేష్మ వికారహా ॥
మేదః శోఫోదరార్శోఘ్న స్తత్ర పక్వ రసోవరః

**ప్రతిపదార్థము :** శార్కరః=శర్కర సంబంధమైన మద్యము; సురభి= మంచివాసన గలది; స్వాదు=మధురమైనది: హృద్యః=హృదయంగమమైనది; లఘుః=లఘువుగా నుండును; నాతి మదః=స్వల్పముగా మత్తును కలిగించును; గౌడః=గౌడ మద్యము, సృష్ట మూత్ర శకృద్వాతః=మూత్రము మలము అపాన వాతమును వెడలించును; తర్పణః=తృప్తిని కలిగించును; దీపనః= అగ్ని దీప్తిని చేయును; శీధుః=శీధు అను మద్యము; వాత, పిత్త కరః=వాత పిత్తములను వృద్ధిచేయును; స్నేహ శ్లేష్మవికారహా=స్నేహశ్లేష్మ వికారములను పోగొట్టును; పక్వ రసః=కాచిన చెఱుకు రసము వలన చేయబడిన శీధుమద్యము; మేదశ్శోఫోదరార్శోఘ్నః=మేదస్సును వాపును ఉదరమును అర్శ రోగమును పోగొట్టును; తీక్ష్ణః=తీక్ష్ణముగ నుండును అనిలాపహః=వాతమును హరించును; మైరేయః=మైరేయము అను మద్యము; మధురః=మధురముగ నుండును; వృష్యః=శుక్రమును వృద్ధిచేయును; సరః=శరీరమున వ్యాపించునట్టి స్వభావము గలది; తర్పణః=తృప్తినిచ్చును; గురుః=గురువుగ నుండును; ధాతకీ=ఆరె పువ్వులతో తయారు చేయబడిన మద్యము; అభిషుత=అడవి మినుముల చేత ఊర బెట్టినది; జీర్ణ=జీర్ణకారి; రూక్షః=రూక్షగుణము కలది; రోచన

దీపనః=రుచిని జఠర దీప్తిని కలిగించును; ద్రాక్షాసవః = ద్రాక్షాసవము; మధు సను=తేనెతో సమానగుణములు గలది; దీపనః = అగ్ని దీపనమును చేయును; మృద్వీకేక్షురసాసవః=ధూప ద్రాక్ష ఇక్షు రసము రెండు చేర్చి తయారుచేయ బడిన మద్యము; మృద్వీకా సదృశః=మృద్వీక మద్యముతో (126 శ్లో) సమాన మైన గుణములు; ప్రోక్తః=చెప్పబడినవి.

తాత్పర్యము : తేనెతో సంధించి చేయబడినది మధ్వాసవము. శరీరమున గడ్డ కట్టి యుండు పదార్థములను విభజించును. తీక్ష్ణముగ నుండును. మేహోదు లను పోగొట్టును.

కల్లును సంధించి తేనెను చేర్చి చేయబడిన సురాసవము ఎక్కువ మత్తును కలిగించును. మధురముగ తీక్ష్ణముగ నుండి వాతమును హరింపజేయును. అసర ద్రవ్యములగు నారె పూవు గుడము మొదలగు వానిని కలుపుచు నొకటిగా చేర్చి సంధాన మొనర్చి సిద్ధపరచినది మైరేయమనబడును. ఇది మధురముగ నుండును. శుక్రమును వృద్ధిచేయును. శరీరమున వెంటనే వ్యాపించును. తృప్తిని కలిగించి గురువుగా నుండును.

ఆరెపుష్పములతో తయారయిన మద్యము అడవి మినువులచేత నూరబెట్ట బడిన మద్యము జీర్ణకారి. రూక్షగుణము గలది. రుచిని జాఠర దీప్తిని కలిగించును. ద్రాక్షాసవము తేనెతో సమాన గుణములు గలిగియుండును. అగ్ని దీపనమును చేయును. ద్రాక్ష చెఱకు రసము వీనిని రెంటిని చేర్చి సంబంధించిన యాసవము బలమును చేకూర్చును. మృద్వీక ద్రవ్యముతో సమానమైన గుణములు చెప్ప బడినవి.

శశిలేఖ : మైరేయః కోద్రవై సహాజీయతౌ. మైరేయము కొఱ్ఱల చేత గూడ పుట్టింపబడును.

**మూ॥ సమాసాదాసవో హృద్యో వాతళః సౌషధాను గహః ॥**

ప్రతిపదార్థము : సమాసాత్ = సంక్షేపముగా; ఆసవః = ఆసవము, హృద్యః=హృదయమునకు మంచిది; వాతళః=వాతమును వృద్ధి చేయును; సౌషధాను గహః = యేఔషధముల యొక్క సంయోగముతో చేయబడు చున్నదో ఆ ఓషధుల గుణమును కలిగియుండును.

తాత్పర్యము : సంక్షేపముగా ఆసవ గుణములు చెప్పబడుచున్నవి. ఆసవములన్నియు ఏ ద్రవ్యములతో సంధానము చేయబడి తయారు చేయబడు చున్నవో ఆ ద్రవ్యము యొక్క గుణములనే కలిగియుండును. మరియు హృద యమునకు శక్తిని పెంపొందించి వాతమును వృద్ధి చేయును,

మూ॥ ద్రాక్షేక్షు మాక్షికం శాలిరుత్త మా వ్రీహి పంచమః ॥
యద్యా కరాయతైభ్యో న్యత్రన్ మద్య ప్రతిరూపకం ॥
గుణైర్యథోల్బణైః సాన్నద్యమాకర సంకరాత్

ప్రతిపదార్థము : ద్రాక్ష=ద్రాక్ష (ద్రాక్ష, అంగూరు, ధూప ద్రాక్ష) ఇక్షు=చెరుకు రసముతో చేయబడిన బెల్లము శర్కర మొదలగు పదార్థములు; మాక్షికం=అన్ని విధములైన తేనెలను; ఉత్తమా=శ్రేష్ఠమైన; శాలి=శాలి ధాన్యము; వ్రీహి పంచమః=వ్రీహిధాన్యము మొదలగునవి ఐదును; మద్యాకరాః=మద్యమును వుత్పత్తి చేయుటలో శ్రేష్ఠమైనవి; తేభ్యః=వాటికంటే, యతు=యేదైతే కలదో; తతు=అందె; మద్య ప్రతిరూపకం=ప్రతినిధి ద్రవ్యములు మాత్రమే; గుణైః=గుణములతో; యథోల్బణైః=ఒక దానికన్న నొకటి శ్రేష్ఠములగుట చేత; ఆకరసంకరాత్=మద్యమును పుట్టించువాటి మిశ్రణముతో చేయబడుట వలన; ఉత్తమా=ఉత్తమమైనదిగా; విద్యాత్=తెలుసుకొనవలెను.

తాత్పర్యము : మద్యము అనేక ద్రవ్యములతో తయారు చేయబడుచున్నది. కాని మదకారకములైన పైనుదాహరించిన అయిదు విధములైన ద్రవ్యముల యొక్క సంయోగముతో తయారు చేయబడిన మద్యము సర్వ శ్రేష్ఠమైనది. చరక సూత్రస్థానమునందు ఆసవయో అని తొమ్మిదిపేర్కొనబడినవి - కాని ద్రవ్యములయొక్క సంయోగభేదములతో సంఖ్యాతి తాసవములు, కలవు- అనేక ద్రవ్యములతో సంధానము చేసిన తరువాత మత్తు సురాసారము యొక్క వుత్పత్తియేర్పడునో అప్పుడు దానిని ఆసవముగా చెప్పుచున్నారు. సంధాన ద్రవ్యమువలన మత్తును కలిగించని ద్రవ్యములతో కూడఅది మాదకమగు చున్నది. ఆసవములన్నియు తీక్ష్ణ గుణమును కలిగియుండుట వలన వెంటనే సర్వ శరీరమును వ్యాపించు శక్తిని కలిగి యున్నవి.

శశిలేఖ : రెండు మత్తును కలిగించు ద్రవ్యముల యొక్క మిశ్రీభావము చేత ఉత్పన్నమైన మద్యము ఎక్కువగా సంధాన ద్రవ్యముతో సమానమైన గుణమును కలిగియుండును.

మూ॥ రక్త పిత్త కఫో త్క్లేదే శుక్తం వాతానులోమనమ్
భృ శోష్ణ తీక్ష్ణ రూక్షామ్ల హృద్య రుచికరం వరం
దీపనం శిశిర స్పర్శం పాండు దృక్క్రిమి నాశనమ్ ॥

ప్రతిపదార్థము : శుక్రం=పులిసిన కల్లు; రక్త పిత్త కఫోత్క్లేదౌ=రక్త పిత్తమును కఫమును పోగొట్టును; వాతానులోమనం=వాతమునకు అనులోమ గతిని కలుగజేయును; భృశోష్ణ=మిగుల ఉష్ణముగా; తీక్ష్ణ=తీక్షణముగా; రూక్ష=రూక్షముగా; అమ్ల=పుల్లగా నుండును; హృద్యం=హృదయమునకు మంచిది; రుచికరం=రుచిని పుట్టించును; సరం=శీఘ్రముగా శరీరమంతటిని

వ్యాపించును; దీపనం=అగ్ని దీపనమును చేయును; శిశిర స్పర్శం=శీతలమైన స్పర్శకలది; పాండు దృక్క్రిమినాశనం=పాండువు నేత్ర రోగము క్రిమి రోగములను పోగొట్టును.

**తాత్పర్యము :** పులిసిన కల్లు రక్తపిత్తమును కఫమును శమింపజేయును. స్వస్థానమును వదలి వేరు మార్గములయందు సంచరించుచుండు వాతమును స్వస్థానమునందు చేర్చును. విదాహకరము=మిక్కిలి తీక్ష్ణ ఉష్ణగుణములను కలిగి యుండును. హృదయంగమమైనది. రుచిని పుట్టించును. సేవించిన వెంటనే సర్వ శరీరమును వ్యాపించును. అగ్నిని వృద్ధిపరచును. చల్లని స్పర్శగలది, పాండువు, నేత్రరోగములు, క్రిమిరోగములను పోగొట్టును.

**మూ॥** గుడేక్షు మద్య మార్ద్వీక శుక్తం లఘు యథోత్తరం
కందమూల ఫలాద్యాం చ్ఛుక్తద్విద్యా త్తదాసుతాన్
చాండాకౌచా ఽ సుతం చాన్య తకాలామ్లం రోచనంలఘు

వైద్యక శబ్దసింధు.

ఆసుతం-చిరకాలస్థితామ్లం కందాదియుక్తం ఆసుత ముచ్యతే తదుక్తం కందమూలఫలాద్యంచలవ ణోదక సంయుతమ్ సంధానా చ్చిరకా కాలాచ్చిర కాలార్లమాసుతం పరికీర్తితం. వా. టీ. హీ.

**ప్రతిపదార్థము :** గుడ=బెల్లము; ఇక్షు=చెఱకు; మద్య=మద్యము; మార్ద్వీక=ద్రాక్ష వీటియొక్క; శుక్తం=పులిసిన కల్లు, యథోత్తరం=ఒక దానికంటె నొకటి; లఘు=లఘువుగా నుండును; కంద= ఆలూ మొదలగు కందములు; మూల=ముల్లంగి మొదలగునవి, ఫలాద్యం=మామిడి మొదలగు ఫలములయొక్క సంయోగముతోచేయబడిన; ఆసుతం=ఆసుతము; తద్వదు= కల్లువలెనే; విద్యాత్=తెలుకొనవలెను; చాండాకౌ=చాండాకౌ,చ=మరియు; ఆసుతం=అన్యత్; కాలామ్లం=ఇతరమైన ద్రవ్యము కాలమువలన పుల్లనగు చున్నదో అది; రోచనం=రుచిని పుట్టించుమ; లఘు=లఘు గుణము కలది.

**తాత్పర్యము :** గడ్డలు, వేళ్ళు, పండ్లు మొదలగు గండ శుక్తాదిఆసుతము నకు గుడశుక్తాదులయొక్క గుణమే కలిగియుండును. ముల్లంగి ఆవకూర వీటిని చేర్చి పక్వముచేసిన తరువాత నల్లజీలకర్ర నల్లఆవాలచేత భావనచేయబడిన దానిని చాండాకీ అని చెప్పుదురు, ఈ చాండాకియును కాలవిశేషమున పులిసిన కల్లును రుచిగా లఘువుగా నుండును.

**శశిలేఖ :** బెల్లముచేత చేయబడిన కల్లుకంటె చెరకురసముతో చేయబడిన కల్లు లఘువుగా నుండును. అన్ని శుక్తములకంటె ద్రాక్షతో చేయబడిన కల్లు ఎక్కువ లఘువుగా నుండును,

మూ॥ ధాన్యామ్లంభేది తీక్ష్ణోష్ణం పిత్తకృత్ స్పర్శ శీతలం
శ్రమక్లమహరం రుచ్యం దీపనం వస్తి శూలనుతు
శస్త మాస్థాపనే హృద్యం లఘువాత కఫాపహం.

ప్రతిపదార్థము : ధాన్యామ్లం=కలి; భేది=మలాదులను భేదించును. తీక్ష్ణోష్ణం=తీక్షణ గుణము ఉష్ణ గుణము గలది; పిత్త కృత్ =పిత్తమును వృద్ధి చేయును; స్పర్శ శీతలం=శీతలమైన స్పర్శ గలది; శ్రమక్లమ హరం=శ్రమమును క్లమమును పోగొట్టును;రుచ్యం=రుచిని పుట్టించును; దీపనం=అగ్ని దీపనమును చేయును;వస్తి శూలనుతు=పొత్తి కడుపునందలిశూలనుపోగొట్టును;ఆస్థాపనే= నిరూహవస్తి యందు; శస్తం=ప్రశస్తమైనది; హృద్యం=హృదయమునకు మేలు చేయును; లఘు=లఘు గుణము గలది; వాత కఫాపహం=వాతమును కఫమును పోగొట్టును.

తాత్పర్యము : ధాన్యామ్లము గడ్డ కట్టియుండు మలాదులను భేదించును తీక్ష్ణగుణము ఉష్ణ వీర్యము గలది. పిత్తమును వృద్ధి చేయును. వ్యాయామాదుల వలన శరీరమునందు కలుగునట్టి ఆయాసమును, వ్యాయామము చేయకయే శరీరమునందు కలుగు బడలికయగు పొత్తి కడుపునందు శూలను పోగొట్టును. రుచిని పుట్టించి అగ్ని దీపనమును చేయును. నిరూహ వస్తి యందు ప్రశస్తమైనది. హృదయమునకు మేలు చేయును. లఘువుగా నుండును. వాత కఫములను పోగొట్టును.

శశిలేఖ : ఆస్థాపనం అనగా వస్తినే ద్రవముతో ద్రవ్యమును గుదమునందు ప్రవేశింపజేయుట అని అర్థము.

మూ॥ ఏభిరేవ గుణైర్యుక్తా సౌవీరక తుషోదకే ॥
క్రిమి హృద్రోగ గుల్మార్శః పాండురోగ నిబర్హణౌ ।
తే క్రమాద్వితుషైరి ర్విద్యాత్సతుషైశ్చయవైః కృతే॥

ప్రతిపదార్థము : సౌవీరకతుషోదకే=సౌవీరక తుషోదకములు; ఏభిరేవ గుణైః యుక్తే=వీటి గుణములతోనె పడియున్నవి; క్రిమి=క్రిమి రోగమును; హృద్రోగ=హృద్రోగమును; గుల్మ=గుల్మమును; అర్శః=అర్శస్సును; పాండురోగం=పాండు రోగమును; నిబర్హణే=పోగొట్టుటయందు శ్రేష్ఠము; తే=అవి; క్రమాత్=వరుసగ; గతుషై యవైః కృతే =పొట్టుతీయని యవల చేత చేయబడినది సౌవీరకము; సతుషైః యవైః కృతా=పొట్టుతో కూడి యవలచే చేయబడినది తుషోదకముగా, విద్యాత్=తెలుసుకొనవలెను.

తాత్పర్యము : పొట్టుతో గూడ పచ్చి యవలను దంచి నీరుబోసి సంధానము చేసిన దానికి తుషోదకమనియును, పొట్టు లేక పండిన యవలకు నీటితో సంధానము చేసిన దానికి సౌవీరకమనియును పేర్లు. పైనుదాహరించిన రెండును పై ధాన్యామ్లాదుల గుణములను గలిగి క్రిమిహృద్రోగాదులను శమింపచేయును,

*శశిలేఖ*: సౌవీరకం యన్నిస్తుషైర్యవైః క్రియతే, తుషోదకం యత్సతుషైః క్రియతే అని కలదు.

**మూ॥** మూత్రం గోజావి మహిషీ గజాశ్వోష్ట్రఖరోద్భవమ్।
పిత్తళం రూక్ష తీక్ష్ణోష్ణం లవణాను రసం కటు॥
క్రిమి శోఫోదరానాహ శూల పాండు కఫానిళున్॥
గుల్మా రుచి విష శ్విత్ర కుష్ఠార్శాంసి జయేల్లఘు॥
విరేకాస్థాపనాలేపస్వేదాది షుచపూజితమ్।
దీపనం పాచనం భేదితేషు గోమూత్రమ్ ఉత్తమమ్॥

*ప్రతిపదార్థము*: గో = ఆవు, అజా = ఆడుమేక, అవి = మేక, మహిషీ=గేదె, గజ=ఏనుగు, అశ్వ=గుర్రము, ఉష్ట్రి=ఒంటె, ఖరోద్భవం= గాడిదయందుత్పన్నమైన, మూత్రం=మూత్రము, పిత్తళం=పిత్తమును వృద్ధి చేయును, రూక్ష=రూక్షగుణము, తీక్ష=తీక్షగుణము గలది, ఉష్ణం=ఉష్ణవీర్యం లవణానుసారం, కటు=లవణమును రసముగాగల కటురసము గలది, క్రిమి= క్రిములను, శోఫ=నంజును, ఉదర=ఉదరరోగమును, కఫ=కఫమును, అని లాన్=వాతవికారములను, గుల్మ=గుల్మమును, అరుచి=అరుచిని, విష=విష మును, శ్విత్ర= బొల్లిని, కుష్ఠ = కుష్ఠమును, అర్శాంసి = అర్శస్సులను, జయేత్=జయించును; లఘు=లఘుగుణము కలది; విరేక = విరేకమునందు; ఆస్థాపన=ఆస్థాపనమునందు; ఆలేప = లేపములయందు; స్వేదాదిషు=స్వేదాది కర్మలయందు; పూజితం = శ్రేష్ఠమైనది, దీపనం=అగ్నిదీపనమును చేయును; పాచనం = ఆమమునుపచింపజేయును; భేది=మలాదులను భేదించును; తేషు= ఆ మూత్రములలో; గోమూత్రం=గోమూత్రం; ఉత్తమం=ఉత్తమమైనది.

*తాత్పర్యము*: గోవు, ఆడమేక, మేక, గేదె, ఏనుగు, గుఱ్ఱము, ఒంటె, గాడిద మొదలగు జంతువులయొక్క మూత్రము పిత్తమును వృద్ధి చేయును. రూక్ష తీక్ష్ణగుణములు కలిగియుండును. ఉష్ణవీర్యము గలది. కొంచము లవణ రసముతో కూడిన కటురసముగలది. క్రిమిశోఫాదులను జయించును. లఘు గుణముకలది. విరేక ఆస్థాపన వస్తువులయందు లేపనాదులకు స్వేదాది కర్మల యందు శ్రేష్ఠమైనది. అగ్నిదీపనమును చేయును. ఆమమునుపచించును, మలాదు లను భేదించును. మూత్రములన్నింటిలో గోమూత్రము శ్రేష్ఠమైనది.

*శశిలేఖ*: కటురసము, కొంచము లవణ రసముగలది. మూత్రము లన్నింటికంటె గోమూత్రము శ్రేష్ఠము.

**మూ॥** శ్వాసకాసహరం ఛాగం పూరణాత్ కర్ణశూలజిత్॥
దద్యాత్ తారేకిలాసే చ గజ వాజి సముద్భవమ్।
హన్త్యున్మాద మపస్మారం క్రిమీన్ మేహంచ రాసభమ్॥

**ప్రతిపదార్థము :** ఛాగం=మేకపోతు మూత్రము; శ్వాసకాసహరం=శ్వాసకాసలను హరింపజేయును; పూరణాత్ = చెవిని నింపినయెడల; కర్ణశూలజిత్=చెవినొప్పులను పోగొట్టును; గజవాజిసముద్భవమ్ = గజ=ఏనుగు; వాజిసముద్భవమ్=గుర్రములనుండి పుట్టిన మూత్రము; క్షయే=క్షయరోగమునందును; చ=మరియు; కిలాసే=కిలాసమునందును, దద్యాత్=ఉపయోగించవచ్చును; రాసభం=గాడిదమూత్రం; ఉన్మాదం = ఉన్మాదరోగమును; అపస్మారం=అపస్మార రోగమును; క్రిమీన్=క్రిములను; చ=మరియు; మేహం=ప్రమేహమును; హంతి=నశింపజేయును.

**తాత్పర్యము :** మేకపోతు మూత్రము శ్వాసకాసలను హరింపజేయును. కర్ణశూలలయందు ఈ మూత్రమును చెవిలో పోసినయెడల కర్ణశూలలను హరింపజేయును. ఏనుగు, గుర్రము వీని మూత్రములను క్షయ, కిలాసమునందు ఉపయోగింపతగును. గాడిదమూత్రము ఉన్మాదము, అపస్మారము, క్రిమిరోగము, మేహము వీనిని పోగొట్టును.

*శశిలేఖ* : ఏనుగు, గుర్రము, మూత్రములు బొల్లి కుష్ఠమునందుపయోగించుటకు ఇవ్వవచ్చును. గాడిదమూత్రము కాచినది ఉన్మాదాదులను పోగొట్టును.

**మూ॥** కషాయతిక్తమేతేషాం హిధ్మాశ్వాస హరం శకృత్।
మార్గయోజః క్షయహరం వైష్కరం వాతరోగనుత్॥
ప్రసహానామపస్మార మున్మాదంచ నియచ్ఛతి।
మహాసృగసముద్భూతం కృష్ఠహృజ్జల చారిణాం॥
నేత్ర రోగహరం పిత్తం ప్రవృద్ధంచ నియచ్ఛతి।
పిత్తం తిక్తం కృమిహరం రోచనం కఫవాతజిత్॥
తిక్తాపాప్మాహదా మూత్రం మానుషంతు విషాపహం।

ఇతి తోయ వర్గః

**ప్రతిపదార్థము :** యేతేషాం = ఈ జంతువులయొక్క; శకృత్ = పురీషము; కషాయతిక్తం = వగరుగా చేదుగానుండును; హిధ్మాశ్వాసహరం = ఎక్కిళ్ళను, ఉబ్బసమును పోగొట్టును; వైష్కరం=లేడి మొదలగు జంతువులయొక్క పురీషము; ఓజక్షయహరం=ఓజస్సును వృద్ధి చేయును; వాతరోగనుత్=వాతరోగములను పోగొట్టును; ప్రసహానాం=ప్రసహవర్గమందలి మృగములు, పక్షులయొక్క పురీషము; అపస్మారం=అపస్మార రోగమును; చ=మరియు; ఉన్మాదం=ఉన్మాద రోగమును; నియచ్ఛతి=పోగొట్టును; మహాసృగ=మహామృగ వర్గమందలి ప్రాణులయొక్క; సముద్భూతం=పురీషం; కృష్ఠహృత్=కుష్ఠ రోగమును పోగొట్టును; జలచారిణాం=జలమునందు సంచరించు ప్రాణులయొక్క పురీషము; నేత్రరోగ హరం=నేత్ర రోగములను పోగొట్టును; చ=

మరియు; ప్రవృద్ధం పిత్తం=మిక్కిలి ప్రకోపించిన పిత్తమును; నియచ్ఛతి= శాంతి పరచును; రోచన=నాభి ప్రదేశమునుండి పుట్టిన గోరోచనము; తిక్తం= తిక్త రసముగలది; విషహరం=విషమును పోగొట్టును; పిత్తం=పిత్తమును; కఫ వాత జిత్=కఫ వాతములను జయించును; తిక్త=తిక్త రసము గలది; పాప్మహారా=పాపపు పనులు చేయుటయందలి ప్రవృత్తిని మరల్చును; మాను షంతు మూత్రం=నరమూత్రమయితే; విషాపహం=విషమును పోగొట్టును,

తాత్పర్యము: ఆవు, ఆడమేక, మేక మొదలగు జంతువుల యొక్క పురీషము వగరుగా చేదుగానుండి ఎక్కిళ్ళను ఉబ్బస రోగమును పోగొట్టును. విష్కిరవర్గము నందలి కోడి, నెమలి, కముజు, మొదలగు పక్షుల యొక్క పురీ షము ఓజస్సును వృద్ధి చేయును. వాత రోగములను నశింపజేయును. బలాత్క రించి జంతువులను తిను జంతువుల యొక్క పురీషము నేత్ర రోగమును పోగొట్టును. మరియు మిక్కిలి ప్రకోపించిన పిత్తమును శమింప జేయును. గోరోచనము తిక్త రసము గలది.విష హరము, కఫ వాతములను జయించును. నర మూత్రము విషమును పోగొట్టును.

మూ॥ తోయక్షీరేక్షు తైలానాం వర్గైః మద్యస్యచ క్రమాత్
ఇతి ద్రవైక దేశోఽయం యథా స్థూల ముదాహృతః ।

ప్రతిపదార్థము: తోయక్షీరేక్షు తైలానాం=జల, క్షీర, తైలముల యొక్క వర్గైః=వర్గములచేత; చ=మరియు; మద్యస్య=మద్యము యొక్క; క్రమాత్=వరుసగా; యథాస్థూలం=ఎక్కువ కాకుండా; ఇతి=అని, ద్రవైక దేశోఽయం=ఇది ద్రవములలో ఏక దేశముగా; ఉదాహృతః=చెప్పబడినది.

తాత్పర్యము: ఈ ప్రకరణమునందు తోయాది వర్గములచేత మిక్కిలి ప్రధానములైన వాటిని అతిక్రమింపక ద్రవములతో ఏక దేశము ఉదాహరింప బడినది.

## ఏడవ అధ్యాయము

"ద్రవస్య పానాన్న సంస్కారాద్యుపయోగ్యత్వా దన్నముచ్యతే"

మూ॥ అథాత అన్న స్వరూప విజ్ఞానీయం నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః ।
ఇతిహస్మాఽహు రాత్రే యాదయో మహర్షయః ॥
రక్తో మహాన్ సకల మస్తూర్ణకః శకునాహృతః ।
శారాముఖో దీర్ఘ శూక్ లోధ్ర శూకః సుగన్ధికః ॥
పుండ్రః పాండుః పుండరీకః ప్రమోదో గౌరశారివౌ ।
కాంచనో మహిషః శూకో దూషకః కుసుమాండకః ॥
లాంగలా లోహ వాలాఖ్యాః కర్దమాః శీతభీరుకాః ।
పతంగా స్తపనీయాశ్చ యే చాన్యేశాలయః శుభాః ॥
స్వాదు పాక రసాః స్నిగ్ధా వృష్యా బద్ధాల్ప వర్చసః ।
కషాయాను రసాః పథ్యా లఘవో మూత్రలా హిమాః ॥

*ప్రతిపదార్థము* : అథ=అనంతరము (ద్రవ ద్రవ్య విజ్ఞానీయాధ్యాయ నిరూపణానంతరము, అతః=ఇందువలన ద్రవ ద్రవ్య పానము ప్రాయశః అన్నము తోడిదగుట వలన); అన్న స్వరూప విజ్ఞానీయం = అన్న స్వరూప విజ్ఞానీయము (అన్న స్వరూప విజ్ఞానమునకు సంబంధించిన); నామ=(అను) పేరుగల; అధ్యాయం = అధ్యాయమును; వ్యాఖ్యాస్యామః = వివరింపగలము; ఇతి = ఈ విధముగ; హ=కదా; ఆత్రేయాదయః=ఆత్రేయుడు మొదలుగా గల; మహర్షయః=మహర్షులు; ఆహుః స్మ=పలికిరి.

రక్తః=ఎఱ్ఱని రాజనములు, మహాన్=లావుగ నుండు పెద్ద వరి ధాన్యము; సకలమః = ఎఱ్ఱ బుడమ వడ్లు; తూర్ణకః=రాజనాల ధాన్యము (కాశ్మీర దేశమున ప్రసిద్ధము); శకునా హృతః =(ఇది ఉత్తర కురు దేశమునుండి హంసలచే తేబడినది); శారాముఖః = శారాముఖము; దీర్ఘ శూకః = పొడవుగా నుండు ముండ్లు కల నెమలి వరి ధాన్యము; లోధ్ర శూకః = లోధ్ర శూకము; సుగన్ధికః=కరి వడ్లు (బాసుమతి); పుండ్రః=పుండ్ర శాలి; పాండు=పాండు శాలి; పుండరీకః=పుండరీక శాలి; ప్రమోదః=ప్రమోదము; గౌర=వరి ధాన్య విశేషము; శారివః=శారిబము; కాంచనః=బంగారు తీగెలు; మహిషః=మహిష శాలి; శూకః=శూక ధాన్యము; దూషకః=ధూషకశాలి; కుసుమాండకః =

కుసుమాండక శాలి; కర్దమాః=కర్దమమను పేరుగల శాలి; శీత భీరుకాః=శీత భీరుకమను పేరుగల శాలులు; పతంగాః=పతంగశాలులు; తపనీయాః=తపనీయ శాలులు; యే అన్యే=మరియు ఇతరములైన; శాలయః=శాలి ధాన్యములు; శుభాః=అత్యుత్తమమైనవిగా; భవంతి=అగుచున్నవి; ఏతేసర్వేశాలయః=ఈ వరి ధాన్యములన్నియు; స్వాదు పాక రసాః=రసవిపాకములచే మధురములు; స్నిగ్ధాః=స్నిగ్ధ గుణములు గలవి; వృష్యాః=సంభోగ శక్తిని వృద్ధి పరుచునవి; బద్ధాల్ప వర్చసః=మలమును స్వల్పముగ బంధించును; కషాయానురసాః= కషాయమును అనురసముగా గల్గి యుండును; పథ్యాః=పథ్యకరములు; లఘవః =లఘు గుణము గలవి; మూత్రలాః=మూత్రమును వృద్ధి పరుచును; హిమాః= శీతవీర్యములైనవి.

తాత్పర్యము : ఎఱ్ఱని రాజనములు, లావుగనుండు పెద్ద వరి ధాన్యము, ఎఱ్ఱ బుడమ వడ్లు, శకునాహృతము, తూర్ణకము, సారాముఖము, దీర్ఘ శూకము, లోధ్ర శూకము, సుగంధకశాలి, పుండ్రశాలిపాండుశాలి, పుండరీకశాలి, ప్రమోద, గౌర, శారివ, కాంచన, మహిష, శూకశాలి, దూషక శాలి, కుసు మాండకశాలి, లాంగల శాలి, లోహవాలమను పేరు గల శాలి, కర్దమమను పేరు గల శాలి, శీత భీరుకమను పేరుగల శాలి, పతంగ, తపనీయమను పేర్లుగల శాలులు, ఇవి గాక ఇతరములైన వరి ధాన్య విశేషములు, అసంఖ్యాకములు గలవు. అవన్నియు అత్యుత్తమములై యున్నవి. ఈ శూక ధాన్యములన్నియు రసవిపాకములయందు మధురములై యుండును. స్నిగ్ధ గుణము గల్గి సంభోగ శక్తిని ఇనుమడింప జేయును. మలమును స్వల్పముగ బంధించును. మూత్రమును వృద్ధి పరచును. శీత వీర్యము గలవిగ నుండును.

*శశిలేఖ* : శూక ధాన్యములకు అధిక ప్రాధాన్యత కలదు గాన ముందుగా జెప్పబడినవి. రక్తశాలి మొదలుకొని తపనీయ శాలుల వరకు మరియు ఇతర శాలి ధాన్యములకు దేశమును, కాలమును, వాటియందున్న మధురాది రసాదు లను బట్టి రక్తాది వర్ణములు గల్గును. ఈ శాలి ధాన్యములన్నియు మధురరసము, మధుర విపాకమును గలిగియుండును. ఈ శాలి ధాన్యముల నామములు ఆయా దేశములను బట్టి వ్యవహారమునందున్నవి. ఆయా ప్రదేశములయందీనామములు ప్రసిద్ధములు. ఈ ధాన్యములు స్వల్పముగా మలబద్ధకమును చేయును. ఈ శాలులు స్వభావముగనే శరీరమునకు హితమును గలిగించును.

వి.వ్యా. : ఈ అధ్యాయమునకు సంబంధించిన విషయములు చరక సూత్రస్థానమునందలి 27 వ అధ్యాయమున, సుశ్రుత సూత్రస్థానమునందలి 46 వ అధ్యాయమున, అష్టాంగ హృదయ సూత్రస్థానములో 6 వ అధ్యాయ మున వివరణ కలదు.

మానవులచేత భుజింపబడు దానిని అన్నమని చెప్పుదురు. ఇది రెండు

విధములు: 1. స్థావరము- ఎట్లనగా బియ్యము, గోధుమలు మొదలగునవి. 2. జంగమము- ఎట్లనగా మాంసములు మొదలగునవి. స్థావర ధాన్యములు కూడ రెండు విధములు. 1. శూకధాన్యములు- ముండ్లు కలిగిన ధాన్యముల వర్గము. 2. శమీ ధాన్యములు- పెసలు మున్నగు కాయధాన్యములు. మొత్తము ఈ శూక ధాన్యాదులను వర్గరూపములుగ సంగ్రహముగ పరిగణించిరి. ఇవి పండ్రెండు వర్గములు. ఈ పండ్రెండు వర్గములలో శూకధాన్యములు శ్రేష్ఠములుగా చెప్పబడినవి.

మూ॥ శూ జేషు వర స్తత్ర రక్తస్తృష్ణా త్రిదోషనుత్।
మహాం స్తచ్చాను కలమ స్తంచాప్యను తతః పరే.

**ప్రతిపదార్థము:** తత్ర = శూక ధాన్యములలో; రక్తః = ఎఱ్ఱని రాజనములు; వరః = శ్రేష్ఠము; తృష్ణా = దప్పిని బోగొట్టును; త్రిదోషనుత్ = మూడు దోషములను నశింప జేయును; తతః = వాటిలో; రక్తాదూనః = రక్తశాలి కంటె తక్కువ గుణము గలది; మహాన్ = మహాశాలి; తతోఽపి = దానికంటెను; కలమః = కలమ ధాన్యము; తంచాప్యను = వీటిని అనుసరించి; పరే = తరువాత చెప్పిన ధాన్యములు (గుణహీనములుగ నుండును).

**తాత్పర్యము:** శూక ధాన్యములలో ఎఱ్ఱని రాజనములు సర్వశ్రేష్ఠమైనవి. దప్పిని శమింపజేయును. కఫ పిత్త వాత దోషముల నదుపులోనుంచును. క్రమప్రాప్తముగ చెప్పబడిన శూక ధాన్యములలో రక్తశాలికన్న మహాశాలి, మహాశాలికన్న కలమ శాలి గుణహీనముగ నుండునని తెలియవలయును.

*శశిలేఖ:* శూక ధాన్యములలో ఎఱ్ఱని రాజనములు సర్వశ్రేష్ఠమైనవి. తక్కిన వివరములు తాత్పర్యాంశములు-

**మూ॥** యవకా హాయనాః పాంసు బాష్ప నైషధకాదయః
స్వాదూష్ణ గురవః స్నిగ్ధాః పాకేఽమ్లాః శ్లేష్మ పిత్తలాః
సృష్ట మూత్ర పురీషాశ్చ పూర్వం పూర్వం చ నిందితాః॥

**ప్రతిపదార్థము:** యవకాః = యవకములు; హాయనాం = హాయనములు; పాంసు = పాంసు; బాష్పా = బాష్పము; నైషధకాదయః = నైషధము మొ॥ శాలి ధ్యానములు, స్వాదు = మధురముగా; ఉష్ణా = ఉష్ణముగా; గురవః = గురుగుణము గలవిగా; స్నిగ్ధాః = స్నిగ్ధ గుణము కలవిగా నుండును; పాకే = విపాకము నందు; అమ్లాః = పుల్లగా ఉండును; శ్లేష్మ పిత్తలాః = కఫ పిత్తములను కల్గచేయును; చ = మరియు; సృష్ట మూత్ర పురీషాః = మూత్ర పురీషములను వెడలించును; పూర్వ పూర్వం నిందితాః = పూర్వ పూర్వమందు ఉండునవి ఒకదానికంటె నొకటి సారహీనముగా నుండును.

**తాత్పర్యము:** యవకములు, హాయనకములు, పాంసు, బాష్పము, నైషధకము మొదలగు అనేకవిధములైన ధాన్యములు, మధురరసమును, ఉష్ణవీర్యము

గురు, స్నిగ్ధ గుణములును, విపాకమునందు అమ్లత్వమును కల్గి యుండును. కఫ పిత్తములను వృద్ధి జేయును. మూత్ర పురీషములను వెడలించును. ఈ ధాన్యము లన్నియు పూర్వ పూర్వ మందుండునవి ఒకదానికంటె నొకటి సారహీనముగా నుండును. అనగా యావక మనునది శాలి ధాన్యము లన్నింటిలో మిక్కిలి నింది తము. దానికంటె ఇతరములైనవి యథా క్రమముగా స్వల్పముగా నిందిత ములు. ఇచట ఆది శబ్దము వలన యవక ప్రతకాది శాలి ధాన్యములను గూడ గ్రహింప వలయును.

*శశిలేఖ :* విశేషము లేదు.

మూ॥ స్నిగ్ధో గ్రాహీ లఘుః స్వాదుః త్రిదోషఘ్నః స్థిరో హిమః।
పష్టిక వ్రీహిషు శ్రేష్ఠో గౌరశ్చాసిత గౌరతః॥
తతః క్రమాన్ మహావ్రీహి కృష్ణవ్రీహి జతూముఖాః।
కుక్కుటాండక లావాఖ్య పారావతక సూకరాః।
వరకోద్దాలకోజ్జ్వాల చీన శారద దర్దురాః।
గన్ధనాః కురువిందాశ్చ గుణైరల్పాంతరా స్మృతాః॥

**ప్రతిపదార్థము :** వ్రీహిషు=సర్వధాన్యములలోను; షష్ఠికః=షష్ఠిక ధాన్యము; శ్రేష్ఠః=శ్రేష్ఠము; అయం=ఇది; స్నిగ్ధః=స్నిగ్ధము; గ్రాహీ=మల బంధము చేయును; లఘుః=లఘు గుణము గలది; స్వాదుః=మధుర రసము; త్రిదోషఘ్నః=త్రిదోష శామకము; స్థిరః=శరీరమునకు దార్ఢ్యము నిచ్చును; హిమః=శీతలముగా నుండును; షష్ఠికః=షష్ఠిక ధాన్యము; గౌరః=గౌరము; అశితగౌరతః=కృష్ణగౌరము; తతః=తరువాత; క్రమాత్=వరుసగా; మహా వ్రీహిః=మహావ్రీహి; కృష్ణవ్రీహిః=కృష్ణవ్రీహి; జతూముఖాః=జతుముఖము; కుక్కుటాండకః=కుక్కుటాండకము; లావాఖ్య=లావాఖ్యము; పారావతక= పారావతకము; సూకరాః=సూకరములు; వరక=వరకములు; ఉద్దాలక= ఉద్దాలకము; ఉజ్జ్వాల=ఉజ్జ్వాలము; చీన=చీనము; శారద=శారదము; దర్దురాః=దుర్దురము; గంధనాః=గంధనము; కురువిందాశ్చ=కురువిందమను పేరు గల ధాన్యములు; గుణైః=గుణముల చేత; అల్పాంతరాః=తక్కువైన గుణములు గలవిగా; స్మృతాః=చెప్పబడినవి.

**తాత్పర్యము :** వ్రీహి ధాన్యములలో షష్ఠిక ధాన్యము స్నిగ్ధ లఘు గుణములు గలది. మల బంధమును చేయును. మధుర రసము గలది. త్రిదోషము లను శమింపజేయును. ఆహారమును చాలసేపటికి జీర్ణము జేయును. శీత వీర్య మైనది. ఈ షష్ఠిక ధాన్యము 2 విధములు. 1. గౌరము, 2. అసితగౌరము. ఈ రెంటిలో అసిత గౌరమునకంటె గౌరము శ్రేష్ఠమైనది. మరియు షష్ఠికధాన్యము కంటె మహా వ్రీహి, కృష్ణ వ్రీహి, జతుముఖము, కుక్కుటాండకము, లావా ఖుము, పారావతకము, సూకరము, వరకము, ఉద్దాలకము, ఉజ్జ్వాలము, చీనము,

శారదము, దుర్దురము, గంధనము, కురువిందము ఈ ధాన్యములు గుణములలో హీన గుణములు కల్గి యుండును. వీటికంటె భిన్నమైన అనేక వ్రీహి ధాన్యములు కలవు. ఈధాన్యములు మధుర రసమును, ఆమ్ల విపాకము కల్గిఉండును. గురుగుణము కల్గి పిత్తమును వృద్ధి చేయును. ఈ ధాన్యములలో అధిక భాగము మూత్ర రూపముగా, పురీషరూపముగా పరిణామము చెందుచుండును. ఈ ధాన్యములలో ఆగ్నేయ భాగము అధికముగా కన్పట్టుచుండును. వ్రీహి ధాన్యమనగా వర్షర్తువులో విత్తనము వేయబడి, శరదృతువులో పంట చేతికి వచ్చును. ఇవి 60 దినములలో తయారగునవి కాన ఈ ధాన్యమును షష్ఠిక ధాన్యమని పిల్చుచున్నారు. యవధాన్యమున కంటె షష్ఠిక ధాన్యము చాల శ్రేష్ఠమైనదని వైద్య శాస్త్రములో చెప్పబడినది.

*శశిలేఖ* : షష్ఠికమను పేరుగల వ్రీహి ధాన్యము స్నిగ్ధత్వాది గుణములతో కూడుకొని యుండును. శరీరమునందు శీఘ్రముగా వ్యాపించదు. ఈ షష్ఠిక ధాన్యము సమస్త వ్రీహి ధాన్యములలో శ్రేష్ఠమైనది. ఇది 2 విధములు, గౌరము కృష్ణగౌరము. కృష్ణగౌరమునకంటె గౌరము శ్రేష్టమైనది. షష్ఠిక ధాన్యము కంటె గుణములచేత మహావ్రీహి మొ॥ ధాన్యములు క్రమముగాం హీనగుణము కలవి.

మూ॥ స్వాదురమ్ల విపాకఽన్యో వ్రీహిః పిత్తకరో గురుః॥

ప్రతిపదార్థము : అన్యః=షష్ఠిక యవక ధాన్యాదులకంటె వేరైన; వ్రీహిః = వ్రీహిధాన్యము; స్వాదుః = మధుర రసము; ఆమ్లవిపాకః=ఆమ్ల విపాకము గల్గియుండును; పిత్తకరః=పిత్తమును చేయును; గురుః =గురుగుణము కలది.

**తాత్పర్యము** : పైజెప్పిన షష్ఠికాది ధాన్యముల కంటె నితర ధాన్యములు మధురముగా, ఆమ్లపాకము కలవిగా నుండును. పిత్తమును చేయును. గురుత్వముగలవి.

మూ॥ **బహుమూత్ర పురీషోష్మ త్రిదోషస్త్వేవ పాటలః॥**

**ప్రతిపదార్థము** : పాటలః = పాటలి పుష్పము వలె నుండు ధాన్యము విశేషముగా త్రిదోషములను ప్రకోపింప చేయును. మూత్ర పురీషములను విశేషముగా విసర్జింప చేయును. అత్యుష్ణకరమైనది. కావుననే ఈ తంత్రకారుడు పాటల ధాన్యమును నిషేధించెను.

*శశిలేఖ* : పాటలమను పేరుగల వ్రీహి ధాన్యము త్రిదోషములను వృద్ధిపరచును.

మూ॥ కంగు కోద్రవ జూర్ణాహ్వా గదీ వరణ పాదికాః।
శ్యామక తోయశ్యామక హస్తిశ్యామక శిబ్బికాః॥
శిశిరోద్దాలః నీవార వరూక వరకోత్కటాః।
మధూలికాంత నిర్గుండీ వేణుపర్ణి ప్రశాంతికాః॥
గవేధుకాండ లౌహిత్య తోయపర్ణీ ముకుందరాః।
కఫపిత్త హరా రూక్షాః కషాయ మధురా హిమాః॥
వాతలా బద్ధ విణ్మూత్రా లఘవో లేఖనాత్మకాః।

ప్రతిపదార్థము : కంగు=కొర్రలు; కోద్రవ=వరిగలు; జూర్ణాహ్వా=జొన్నలు; గర్మ్యాటి=గర్మ్యాటి; చూర్ణపాదికాః=చూర్ణపాదిక; గదీ=గది ధాన్యము; వరణ=వరణ ధాన్యము; పాదికాః=పాదిక ధాన్యములు; శ్యామక=చామలు; తోయశ్యామాక = నీటిలో బుట్టు చామలు; హస్తిశ్యామక=పెద్ద చామలు; శిబ్బికాః = శిబికములు; శిశిర = శిశిర ఋతువు నందలి ధాన్యము; ఉద్దాల=ఉద్దాలములు; నీవార = నివ్వరి ధాన్యము; వరూక వరక=వరూక వరకములు; ఉత్కటాః = ఉత్కటములు; మధూలీ=మధూలికము; నిర్గుండీ=వావిలి; వేణుపర్ణి = వేణుపర్ణి; ప్రశాన్తికా=ప్రశాన్తిక; గవేధుక=అడవి గోధుమలు; అండలౌహిత్య = అండలౌహిత్యము; తోయపర్ణి=తోయపర్ణి; ముకుందరాః = కుందురుష్కము గంధ ద్రవ్యము మొదలగునవి. కఫపిత్త హరాః=కఫపిత్తములను హరింప చేయునవి; రూక్షాః = రూక్ష గుణము కలవి; కషాయమధురాః=కషాయ మధుర రసములు గలవి; హిమాః=శీతవీర్యమైనవి, వాతలాః=వాతకారకములు; బద్ధ విణ్మూత్రాః=మల మూత్రములను బంధింప చేయును; లఘవః=లఘుగుణము కలవి; లేఖనాత్మకాః=లేఖనమును చేయునవి.

తాత్పర్యము : కొఱ్ఱలు, వరిగలు, నివ్వరి వడ్లు, చామలు, అడవి గోధుమలు మొదలగు నీధాన్యములు తృణ ధాన్యములనబడును. ఇవి శీతలముగ, లఘువుగ నుండును, వాతమును ప్రకోపింప చేయును. అతి తీక్ష్ణతవలన రసాది ధాతువులను భేదించును. కఫపిత్తములను హరింప చేయును వగరుగ మధురముగ నుండును. (లేఖన మనగా విలిఖ్యత్యతి తైక్ష్ణ్యాద్యద్ధాతూన్ తల్లేఖనం మతమ్)

శశిలేఖ : కొఱ్ఱలు మొదలగు తృణ ధాన్యములు కఫ పిత్తములను హరింప జేయును. వ్రీహి ధాన్యములలో శూక ధాన్యములు విశిష్టమైనవి.

మూ॥ భగ్న సంధాన కృత్తత్ర ప్రియంగుర్బృంహణీ గురుః।
కోరదూషః పరం గ్రాహీ స్పర్శే శీతో విషాపహః॥
ఉద్దాలకస్తు వీర్యోష్ణో నీవారః శ్లేష్మవర్ధనః।
శీతవీర్యో విశేషేణ స్నిగ్ధా వృష్యా మధూలికా॥

ప్రతిపదార్థము : తత్ర=తృణ ధాన్యములలో; ప్రియంగుః=కొఱ్ఱలు;

భగ్నసంధానకృత్ = విరిగిపోయిన అంగముల నొకటిగా చేయును, బృంహణీ = శరీరమునకు పుష్టినిచ్చును; గురుః = గురుత్వమును చేయును, కరదూషః = ఆళ్ళు, శీఆరకలు), పరంగ్రాహీ = మిక్కుటముగ మలమును బంధించును; స్పర్శశీతః = శీతలమయిన స్పర్శము గలది; విషాపహః = విషమును హరింప చేయును; ఉద్దాలకస్తు = ఉద్దాలకమయితే; వీర్యోష్ణః = ఉష్ణమైన వీర్యము గలది; నీవారః = నివ్వరి వడ్లు; శ్లేష్మవర్ధనః = శ్లేష్మమును వృద్ధిచేయును; మధూలికా = మధూలిక; విశేషేణ = మిక్కిలి; శీతవీర్యః = శీతవీర్యము; స్నిగ్ధా = స్నిగ్ధ గుణము గలది; వృష్యా = వాజీకరము.

తాత్పర్యము : తృణ ధాన్యములలో కొఱ్ఱలు విరిగిపోయిన అంగముల నొకటిగ జేయును. శరీరమునకు పుష్టినిచ్చును, గురుత్వమును చేయును. ఆళ్ళు మిక్కుటముగ మలమును బంధించును. శీతలమైన స్పర్శము గలవి విషహరము, ఉద్దాలకము ఉష్ణమైన వీర్యము గలది. నివ్వరి వడ్లు శ్లేష్మమును వృద్ధిచేయును. మధూలికములు విశేషముగ శీతవీర్యమైనవి. స్నిగ్ధగుణముకలవి. వాజీకరణమును చేయును.

శశిలేఖ : తాత్పర్యాంశమే గలదు.

మూ॥ **రూక్షః శీతో** గురుః **స్వాదుః** సరో విడ్వాత కృద్యవః।
వృష్యః స్థైర్యకరో మూత్ర మేదః పిత్తకఫాన్ జయేత్॥
పీనస శ్వాస కాసోరు స్తంభ కంఠ త్వగామయాన్।
గుణైర్న్యూనతరా జ్ఞేయా యవాదన్య యవాహ్వయాః॥
ఉష్ణాః సరా వేణు యవాః కషాయా వాతపిత్తలాః।

ప్రతిపదార్థము : యవః = యవధాన్యము; రూక్షః = రూక్షము; శీతః = శీతలము; గురుః = గురువు; స్వాదుః = మధురము; సరః = శరీరమునందు శీఘ్రముగ వ్యాపించును; విడ్వాతకృత్ = మలమును వాతమును వృద్ధిజేయును; వృష్యః = శుక్రవృద్ధిని జేయును; స్థైర్యకరః = దార్ఢ్యమును గలుగజేయును; మూత్ర మేదః పిత్తకఫాన్ = మూత్ర రోగము, మేదస్సు, పిత్తకఫములు; పీనసశ్వాసకాసోరు స్తంభ కంఠత్వగామయాన్ = పీనసము శ్వాస కాసములు ఊరు స్తంభము, గళ రోగము, చర్మరోగము వీనిని; జయేత్ = జయించును. యవాత్ = యవధాన్యమునకంటె; అన్యయవాహ్వయాః = ఇతరములైన యవధాన్యములు; గుణైః = గుణములచేత; న్యూనతరాః = స్వల్పమైన గుణములు గలవిగా; జ్ఞేయాః = తెలుసుకొనవలయును. వేణుయవాః = వెదురు ధాన్యములు, ఉష్ణాః = ఉష్ణగుణముగలవి; సరాః = శీఘ్రముగ శరీరమందంతట వ్యాపించును; కషాయాః = కషాయ రసముగలవి; వాతపిత్తలాః = వాతపిత్తములను చేయును.

తాత్పర్యము : యవ ధాన్యము రూక్షగుణము, శీతలము, గురువుగా

నుండి, మధుర రసము గలది. శరీరమునందు శీఘ్రముగా వ్యాపించును. మల వాతములను వృద్ధి జేయును. శుక్రమును వృద్ధి పరచును. శరీరమునకు దార్ఢ్యమును గల్గించును. మూత్రరోగమును మేదోరోగము, పిత్తకఫములు, పీనసాది రోగములను జయించును.

యవ ధాన్యమున కంటె ఇతరములైన యవ ధాన్యములు స్వల్పమైన గుణములను గలిగి యుండును.

వెదురు ధాన్యము రూక్షగుణమును ఉష్ణగుణమును కలిగి యుండును.

*శశిలేఖ* : యవలు రూక్షత్వాది గుణములు గలిగి యుండును. అను యవ అను పేరుగల యవలు గుణములలో స్వల్ప గుణములు గలిగి యుండును. ఆ అనుయవలు గూడ లోకమునందు యవాకృతి గలిగి ప్రసిద్ధములై యున్నవి. వెదురు వృక్షములు గల ప్రాంతములందలి యవలు ఉష్ణవీర్యము గలవిగా నుండును. శరీరమంతట శీఘ్రముగ వ్యాపించును. కషాయ రసముగలవి. వాత పిత్తములను చేయును.

మూ॥ వృష్యః శీతో గురుః స్నిగ్ధో జీవనో వాత పిత్తహా।
సన్ధానకారీ మధురో గోధూమః స్థైర్యకృత్సరః॥
పథ్యా నందీ ముఖీ శీతా కషాయా మధురా లఘుః॥
॥ఇతి శూకధాన్య వర్గః॥

ప్రతిపదార్థము : గోధూమః=గోధుమలు; వృష్యః = శుక్రమును వృద్ధి చేయును; శీతః=శీతలముగ నుండును; గురుః=గురుత్వమును చేయును; స్నిగ్ధః=జిగటగ నుండును; జీవనః=బలమును కలుగజేయును; వాతపిత్తహా= వాతపిత్తములను హరింపచేయును; సంధానకారీ=విరిగిన యంగముల నొకటిగ జేర్చును; మధురః=మధురముగ నుండును; స్థైర్యకృత్=శరీరదార్ఢ్యమును కలుగజేయును; సరః=శరీరములో శీఘ్రముగ వ్యాపించును; నందీముఖీ = నందీముఖీ యను ధాన్యము (నిడుపుగ సన్నముగ నుండు గోధుమలు);పథ్యా= శరీరమునకు హితకరమైనది; శీతా=శీత వీర్యము గలది; కషాయ మధురా= వగరుగ మధురముగ నుండును; లఘుః=లఘువుగ నుండును; ఇతి=అని; శూక ధాన్య వర్గః=శూకధాన్య వర్గము.

తాత్పర్యము : గోధుమలు శుక్రమును వృద్ధి జేయును. శీతలముగ నుండును. గురుత్వమును చేయును. జిగటగ నుండును. బలమును చేకూర్చును. వాతపిత్తములను హరింపజేయును. విరిగిన యంగముల నొకటిగ జేర్చును. మధురముగ నుండును. శరీర దార్ఢ్యమును కలుగజేయును. శరీరములో శీఘ్రముగ వ్యాపించును. నందీముఖీ యను ధాన్యము (గోధుమలు) శరీరమునకు హితకరమైనది. వగరుగ మధురముగ లఘువుగ నుండును. శీత వీర్యము గలది.

*శశిలేఖ* : గోధుమలు వృష్యత్వాదులను గలిగించును. సౌమ్య ధాతువులను వృద్ధి పరచును. విరిగిన తొడలు మొదలగు అంగముల నొకటిగ జేర్చును. నందీముఖి యను పేరు గల గోధుమలు శరీరమునకు హితకరములు. కషాయ మధుర రసములు గలవి. లఘువుగ నుండును. అని శూకధాన్య వర్గము ముగింప బడినది.

మూ॥ శింబిజా ముద్గ మంగల్య వన ముద్గకకుష్ఠకాః
మసూర కఫలాధక్య శ్చణకాశ్చ పృధగ్విధాః॥
కషాయ స్వాదు లఘవో విబంధాధ్మానకారిణః
రూక్షబద్ధ మలాః శీత విపాకే కటుకాహితాః॥
పిత్తాసృక్కఫ మేదస్సు సూపాలేపాది యోజనాత్ - 25

ప్రతిపదార్థము ; ముద్గ=పెసలు; మంగల్యా = చిరు శెనగభేదము, వనముద్గ=అడవి పెసలు; కకుష్ఠకాః=కకుష్ఠకము మొదలగునవి; మసూర= మసూరకము (ఎర్రకందులు); కఫలా=బొబ్బర్లు; ఆఢకీ=కందులు ; చణకాః= శెనగలు; చ=మరియు; పృధగ్విధాః =అనేక విధములైన; శింబిజాః=శింబీ ధాన్యములు; కషాయస్వాదులఘవః=కషాయ మధుర రసములు గల్గి లఘువుగ నుండును; విబంధ=మలబంధమును; ఆధ్మాన=కడుపుబ్బరమును; కారిణః= చేయును; రూక్ష=రూక్షముగ; బద్ధమలాః=మలమును బంధించును; విపాకే= విపాకము నందు కటుకాః=కటురసము గలవి; శీత=శీతలము; హితాః = పథ్యాకరమైనవి.

సూపాలేపన యోజనాత్=పప్పు; లేపనములో ఉపయోగించుట వలన పిత్తాసృక్కఫ మేదస్సు=పిత్తము, రక్తము, కఫము, మేదస్సు వీటి యందు హితకరమైనవి.

**తాత్పర్యము** : పెసలు, అడవి పెసలు, కందులు; చిరు శెనగలు, రాజ మాషములు, శెనగలు మొదలగు శింబీ ధాన్యములు (విదళములు గుండ్రముగా నుండునవి) కషాయ మధుర రసములు గలిగి యుండును. లఘువుగా యుండి, విబంధమును, ఆధ్మానమును కలిగించును. మలబంధమును చేయును. రూక్ష గుణము కలవి. శీతలము, విపాకమునందు కటు రసమును చెందును. పప్పుచేసు కొనుటకును, లేపన క్రియలో నుపయోగించుట వలన పిత్తము, రక్తము, కఫము, మేదస్సు వీటిలో మిక్కిలి హితకరమైనవి.

ఈ శింబీ వర్గము నందలి ధాన్యములు పప్పు చేయుటకును, ఆలేపనము చేయుటకును ఉపయోగించుచున్నారు. ఈ ధాన్యములను మొట్టమొదట ఎఱ్ఱ మట్టి నీటిలో వేసి దానియందలి పొట్టు మొదలగునవి పోవునట్లు శుభ్రపరచి తరువాత నీటిలో పోసి పప్పు చేయుదురు. ఈ పప్పులో ఉప్పు, పసుపు, అల్లము, ఆకుకూరలు మొదలగునవి వేసి వంట చేసిన యెడల చాల రుచిగా నుండును.

ఆలేపనము 3 విధములు. 1. ప్రదేహము 2. ప్రలేపము 3. ఆలేపము. వీటిలో ఆలేపనము వాపు వ్రణము మొదలగు వాటిలో శాస్త్రమునందు వాటిని ఉపశమింప చేయుటకొరకు చెప్పిన ఓషధులలో ప్రతిలోమముగా లేపనము చేయవలెను. ఈ విషయము చరకమునందు కూడ చెప్పబడినది.

"పిత్తశ్లేష్మణి శస్యన్తే సూపేష్వాలేపనేషుచ" –చరక. సూ॥ అ–27; మూ–2.

*శశిలేఖ* : శింబీధాన్యమును గూర్చి చెప్పబడుచున్నది. పెసలు మొదలగునవి నానా విధములుగా నున్నవి. కషాయ మధుర రసములు గలిగి లఘువులుగా నుండును. దోషములయొక్క విబంధమును, ఆధ్మానమును చేయుచున్నవి. శీత వీర్యమును, కటు విపాకమును గలిగి యుండును. భోజనాదుల యందు ఆలేపముల యందు పరిషేకాదులలో చేర్చుట వలన రక్త పిత్త శ్లేష్మ మేదో వికారములయందును హితకరముగా నుండును.

మూ॥ **సూప్యానా ముత్తమా ముద్గా లఘీయాం సోఽల్పమారుతాః**
**హరితా స్తేష్వపి వరా మకుష్ఠాః క్రిమికారిణః**
**వర్ణ్యాః పరం ప్రలేపాద్యై ర్మసూరా గ్రాహిణో భృశమ్॥**

ప్రతిపదార్థము : సూప్యానా=పప్పు ధాన్యములలో; ముద్గా=పెసలు; ఉత్తమా=శ్రేష్ఠమైనవి; లఘీయాంసః=మిక్కిలి లఘు గుణము కలవి; అల్పమారుతాః=స్వల్పముగా వాతమును చేయును; తేష్వపి=వాటిలో కూడ; హరితాః=పచ్చ పెసలు; వరా=ఉత్తమమైనవి; మకుష్ఠాః=అడవి పెసలు; కృమికారిణః=కృములను పుట్టించును, మసూరః=ఎఱ్ఱకందులు; ప్రలేపాద్యైః=ప్రలేపము మొదలగు లేపములచేత; పరం=మిక్కిలి; వర్ణ్యాః = వర్ణమును చేయును; భృశం=మిక్కిలి; గ్రాహిణః=సంగ్రాహిగా నుండును.

**తాత్పర్యము** : పెసలు ద్విదళ ధాన్యము లన్నింటిలో ఉత్తమమైనవి లఘు గుణము కలవి. స్వల్పముగా వాతమును చేయును. ఈ ద్విదళధాన్యములో గూడ పచ్చ పెసలు అత్యుత్తమమైనవి. తరచుగా ఈ పెసలు నల్లగా పచ్చగ యుండును. కాని పచ్చగ నుండు పెసలు మిక్కిలి శ్రేష్ఠమైనవి. అడవి పెసలు క్రిములను బుట్టించును. ఎఱ్ఱకందులు ప్రలేపము మొదలగు వాటిలో కలిపి ప్రయోగించుటచేత శరీరమునకు మంచి వర్ణము (కాంతి) వచ్చును. లోపలికి ప్రయోగించుట వలన సంగ్రాహిగా నుండి వాతకారకముగా నుండును. ఇందుకొఱకే పెసలను తరుణావస్థలోనున్న పిడికలలో ప్రయోగము చేయుదురు.

*శశిలేఖ* : సూపే సాధుః సూప్యః : పెసలు సూప్య ధాన్యములలో ఉత్తమమైనవి. స్వల్పమైన లఘుగుణము కలవి. స్వల్పముగా వాతమునుచేయును. పెసలలో పచ్చపెసలు శ్రేష్ఠమైనవి. నల్లపెసలు అంత మంచివి కాదు. అడవి పెసలు క్రిములను ఉత్పత్తి చేయును. ఎఱ్ఱ కందులు ప్రలేపాదులలో ఉపయో

గించుట చేత వర్ణమును ప్రసాదించును.

మూ॥ రాజ మాషో గురుర్భూరి శకృద్రూక్షోఽతి వాతలః
కషాయ స్వాదు రూక్షోష్ణాః కులత్థా రక్త పిత్తలాః
పీనస శ్వాస కాసార్శో హిధ్మానాహ కఫానిలాన్ ।
ఘ్నన్తి శుక్రాశ్మరీం శుక్రం దృష్టిం శోఫం తథోదరమ్॥
గ్రాహిణో లఘవ స్తీక్ష్ణా విపాకేమ్లావిదాహినః ।

ప్రతిపదార్థము : రాజమాషః = అలసందలు; గురుః = గురుగుణముకలవి; అతివాతలః = ఎక్కువగా వాతమును వృద్ధిచేయును; కులత్థాః = ఉలవలు, కషాయ స్వాదు రూక్షోష్ణాః = వగరు, మధుర రసము గలవి. రూక్ష = రూక్ష గుణముకలవి. ఉష్ణాః = ఉష్ణ వీర్యము కలవి, రక్తపిత్తలః = రక్తపిత్తమును చేయును. పీనస శ్వాస కాసార్శోహిధ్మానాహ కఫానిలాన్ = పడిశము, ఉబ్బసము, అర్శస్సు, ఎక్కిళ్ళు, కడుపుబ్బరము, కఫము, వాయువు, ఈ వ్యాధులను; శుక్రాశ్మరీం = శుక్రాశ్మరిని; శుక్రం = శుక్రమును, దృష్టిం = చూపును; శోఫం = వాపును; తథా = అట్లే; ఉదరం = ఉదరమును; ఘ్నంతి = నశింపజేయుచున్నవి. గ్రాహిణః = మలమూత్రమును బంధించుచున్నవి. లఘవః = లఘుగుణముకలవి, తీక్ష్ణాః = తీక్ష్ణ గుణము కలవి. విపాకే = విపాకమునందు; అమ్లః = అమ్లరసమును చెందునవి; విదాహినః = విశేషముగా మంటను కలిగించును.

తాత్పర్యము : అలసందలు గురు గుణము కలవి. విశేషముగా మలమును వృద్ధిపరచును. రూక్షగుణము కల్గి ఎక్కువగా వాయువును వృద్ధిపరచును. ఉలవలు కషాయ రసము, మధుర రసము కలవి, రూక్షగుణము, ఉష్ణ వీర్యము కలవగుట వలన రక్తపిత్తమును చేయును. పడిసెము, ఉబ్బసము, దగ్గు, అర్శస్సు, ఎక్కిళ్ళు, కడుపుబ్బరము, కఫ, వాత దోషములను, శుక్రాశ్మరిని, శుక్రమును, చూపును. వాపును, ఉదరరోగమును నశింపచేయును, మలమూత్రమును బంధించును. లఘు గుణము కలవి, తీక్షగుణము కలవి, విపాకమునందు అమ్ల రసమును చెంది విదాహకరముగా నుండును.

శశిలేఖ ; అలసందలు గురుగుణము కల్గి ఎక్కువగా మలమును వృద్ధిపరచును. రూక్ష గుణమును కలిగి వాతమును వృద్ధిచేయును.

ఉలవలు కషాయ మధుర రసము కలవి. రూక్షగుణము కలవి, ఉష్ణ వీర్యము, రక్తపిత్తకరము. పీనసాదులను శమింపజేయును. శుక్రాశ్మరిని నశింపజేయును. దర్శనశక్తిని నశింపజేయును. మలమూత్రమును బంధించును. లఘుగుణము కలవి. అమ్ల విపాకమును చెందును. విదాహమును కలిగించును.

మూ॥ నిష్పావస్తు సరోరూక్షః కషాయ మధురో గురుః ।
పాకేఽమ్లో వాత విష్టంభీ స్తన్య మూత్రాస్ర పిత్తకృత్ ।
ఉష్ణో విదాహీ దృక్ శుక్ర కఫ శోఫ విషాపహః ।

ప్రతిపదార్థము : నిష్పావస్తు=అనుములైతే,సరః=వేగముగ శరీరము నందు వ్యాపించును,రూక్షః=రూక్షము,కషాయమధురః=కషాయమధురరసము గలవి. గురుః=గురువు; పాకే=పాకమునందు, అమ్లః=పులుపు రసమును చెందును. వాతః=వాతమును,విష్టంభీ=మలమూత్ర బంధమును, స్తన్య=చను బాలను, మూత్ర=మూత్రమును, అస్రపిత్త=రక్తమును, వీటిని, కృత్= చేయును, ఉష్ణః=ఉష్ణవీర్యము, విదాహీ=తాపమును బుట్టించును; దృక్= నేత్ర రోగము, శుక్ర=శుక్రదోషము, కఫ=కఫము, శోఫ=వాపు, విషాపహః=విషమును, వీటిని హరింపజేయును.

తాత్పర్యము : అనుములు శీఘ్రముగ శరీరమంతట వ్యాపించును. రూక్షగుణము కలవి. కషాయ మధుర రసములు గలవి. అమ్ల విపాకమును కలిగి యుండును, వాతము నడ్డగించును. స్తన్యమును, మూత్రమును,రక్త పిత్తమును వృద్ధిపరచును. ఉష్ణవీర్యము; తాపమును బట్టించును. నేత్రరోగ మును, శుక్రదోషమును, కఫమును, వాపును, విషమును తొలగించును.

శశిలేఖ : అనుములైతే సరత్వాది గుణములతో కూడి యుండును. వాతమును చేయును. ఉష్ణవీర్యము తాపమును పుట్టించును. దృష్టిని, రేత స్సును, కఫమును, వాపును, మరియు విషమును నశింపజేయును. "నిష్పావః రాజశిమ్బిః" అని కలదు.

మూ॥ మాషః స్నిగ్ధో బల శ్లేష్మ మల పిత్తకరః సరః
గురూష్ణో ఽ నిలహా స్వాదు శ్శుక్ర వృద్ధి విరేకకృత్॥
ఫలాని గుణవద్విద్యాత్ కాకాణ్డోలాత్మ గుప్తయోః
కుశామ్ర శింబీ మధురా వాత పిత్త హారాహిమా॥

ప్రతిపదార్థము : మాషః=మినుములు; స్నిగ్ధః=స్నిగ్ధముగ నుండును; బల=బలకరము; శ్లేష్మ=కఫమును; మల=మలమును; పిత్తకరః=పిత్తమును వృద్ధిపొందించును; సరః=శరీరమంతటను శీఘ్రముగ వ్యాపించును; గురు= గురుత్వమును చేయును; ఉష్ణః=ఉష్ణముగ నుండును; అనిలహా=వాతమును హరింపజేయును; స్వాదుః=మధురముగ నుండును; శుక్రవృద్ధి=శుక్రమును వృద్ధి పరచును; విరేకకృత్=శుక్రస్రావమును చేయును; కాకాణ్డోలాత్మ గుప్తయోః=కాకాణ్డోల అను తృణ ధాన్యము లేక గినియ, దూలగోవెల వీనియొక్క; ఫలాని=విత్తులను; మాషవత్=మినుములతో సమానమైన గుణము గలవిగా; విద్యాత్=తెలుసుకొనవలెను; కుశామ్రశింబీ=కుశామ్ర శింబీధాన్యము; మధురా=మధుర రసము గలది; వాతపిత్తహరా=వాతపిత్తములను నశింప జేయును; హిమా=శీతలమైనది.

తాత్పర్యము : మినుములు స్నిగ్ధ గుణము గలిగి యుండును. శరీరమునకు బలమును చేకూర్చును. కఫమును మలమును పిత్తమును వృద్ధి పొందించును.

శరీరమంతట శీఘ్రముగా వ్యాపించును. గురుత్వమును చేయును. ఉష్ణమును చేయును. వాతమును హరింపచేయును. మధురముగ నుండును. శుక్రమును వృద్ధి పరచును. శుక్రస్రావమును కూడ కలిగించును. కాకొండలాయను తృణ ధాన్యము, దూలగోవెల వీని బీజములు మినుములతో సమానమైన గుణము గలవిగా నుండును. కుశామ్రశింబీ ధాన్యము మధుర రసము గలది. వాత పిత్తములను నశింపచేయును. శీతలమైనది.

*శశిలేఖ* : మినుములు స్నిగ్ధత్వాది గుణములను గలిగి యుండును. మలం=పురీషమని యర్థము. శుక్ర వృద్ధిని శుక్రస్రావమును కలిగించును. కాకాణ్డోలా=కటభిరి యని యర్థము. కుశామ్ర శింబీ యనగ శింబీ ధాన్యము.

మూ॥ మధురాశ్శీతలా గుర్వ్యో బలఘ్న్యో రూక్షణాత్మికాః।
స్నేహాఢ్యా బలభిర్భోజ్యా వివిధాశ్శింబి జాతయః॥

*ప్రతిపదార్థము* : వివిధాః=పలువిధములైన; శింబిజాతయః=శింబిధాన్య జాతులు; మధురాః=మధుర రసము గలవి; శీతలాః=శీతలమైనవి; గుర్వ్యః=గురుగుణము గలవి; బలఘ్న్యః=బలమును క్షీణింప జేయునవి; రూక్షణాత్మికాః=రూక్షగుణము గలవి; స్నేహాఢ్యాః=అధికమైన స్నేహగుణము గలవి; బలభిః=బలవంతులచేత; భోజ్యాః=భుజింపదగినవి.

*తాత్పర్యము* : పలు విధములైన శింబీ జాతికి చెందిన ధాన్య విశేషములు ప్రాయికముగ మధుర రసముగలిగి శీతలముగా నుండును. గురుత్వమును, రూక్షత్వమును కలిగియుండును. స్నిగ్ధగుణమధికముగా కలిగియుండును. కాన ఈ శింబీ ధాన్యములకు సంబంధించిన శాక పాకములను బలవంతులైన మానవులే భుజింపవలెను.

*శశిలేఖ* : ఈ ప్రకరణమున చెప్పబడని శింబీ ధాన్యములను గురించి సామాన్యముగ చెప్పబడుచున్నది. పలువిధములైన శింబీధాన్య జాతులు మధుర రసమును గలిగియుండును. శీతలమైనవి. గురుత్వమును గలిగియుండును. బలమును హరించును. ఆశింబీ ధాన్యములు మిక్కిలి స్నేహమును గలిగియుండుట వలన బలవంతులైన మానవుల చేతనే భుజింపబడవలెను కాని దుర్బలులు ఈ పప్పు ధాన్యమును అతిగా భుజింపరాదు.

మూ॥ స్నిగ్ధోష్ణ తిక్త కటుకః కషాయ మధురస్తిలః।
మేధ్యః కేశ్యో గురుర్వర్ణ్యః స్పర్శ శీతోఽనిలాపహః॥
అల్ప మూత్రః కటు పాకే మేధాగ్ని కఫ పిత్తకృత్।
కృష్ణః ప్రశస్తస్తమను శుక్లస్తమను చారుణః।

*ప్రతిపదార్థము* : తిలః=నువ్వులు, స్నిగ్ధోష్ణః=స్నిగ్ధగుణము, ఉష్ణ వీర్యము గలవి; తిక్తకటుకః=తిక్తరసము, కటురసము గలవి; కషాయమధురః=

కషాయ. మధుర రసము గలవి; మేధ్యాః = బుద్ధిబలమును పెంపొందించును; కేశ్యాః = వెంట్రుకలకు మంచివి; గురుః = గురుత్వమును గలిగించును; వర్ణ్యాః = వర్ణమును ప్రసాదించును; స్పర్శశీతః = తాకిన యెడల చల్లగా నుండును; అనిలాపహాః = వాతమును హరించును; అల్పమూత్రః = స్వల్పముగ మూత్రమును వెడలించును; పాకేకటుః = పాకమువలన కారముగా నుండును; మేధాగ్నికఫపిత్తకృత్ = బుద్ధిని, జాఠరాగ్నిని కఫమును, పిత్తమును, వృద్ధి పొందించును; కృష్ణః = నల్లనువ్వులు; ప్రశస్తః = మిక్కిలి ప్రశస్తమైనవి; తమను = వానికంటె; శుక్లః = తెల్లనువ్వులు కొంచెము నికృష్టమైనవి; తమను అరుణః = దానికంటే ఎఱ్ఱనువ్వులు నికృష్టమైనవి.

తాత్పర్యము : నువ్వులు స్నిగ్ధముగ, ఉష్ణముగ, చేదుగ, కటువుగ, వగరుగ, మధురముగ నుండును. చర్మము, కేశములు, శుక్రము వీనికి హితము చేయును. గురువుగ నుండును. శీతలమైన స్పర్శ గలవి. వాతమును హరింప జేయును. స్వల్పముగ మూత్రమును వెడలించును. పాకము వలన కటువుగ నుండును. బుద్ధి, అగ్నిదీపనము, కఫము, పిత్తము వీనిని గలుగ జేయును. నల్ల నువ్వులు మిగుల ప్రశస్తమైనవి. వానికంటె తెల్ల నువ్వులు కొంచెము నికృష్ట మైనవి. వానికంటె ఎఱ్ఱనువ్వులు నికృష్టమైనవి. నువ్వులు ప్రధానముగ నూనెకు ముఖ్యకారణము. నువ్వులలో జిగటగుణమును, శింబీ ధాన్యమునకు స్వభావ మయిన స్వాదుగుణములున్నవి.

శశిలేఖ : నువ్వులు స్నిగ్ధత్వాది గుణములను గలిగి యుండును. తిక్తాది రసములు వాటిలో నుండును. కటు విపాకముగలవి. స్వల్పమూత్రమును చేయును. బుద్ధిని పెంపొందించును. జాఠరాగ్నివృద్ధిపరచును. కఫ పిత్తములను చేయును. మేధా = ప్రజ్ఞా, నువ్వులలో నల్లనువ్వులు శ్రేష్ఠమైనవి. వాటికంటె తెల్లనువ్వులు కొంచెము గుణ హీనములుగా నుండును. తెల్లనువ్వుల కంటె ఎఱ్ఱ నువ్వులు మరికొంచెము గుణహీనములుగా చెప్పబడినవి.

మూ॥ స్నిగ్ధోమా స్వాదు తిక్తోష్ణా కఫ పిత్త కరీగురుః।
దృక్ శుక్రహృత్ కటుః పాకే తద్వత్ బీజం కుసుంభజమ్॥

ప్రతిపదార్థము : ఉమా = అగసి విత్తులు; స్నిగ్ధః = జిగటగ నుండును; స్వాదుః = మధురముగ; తిక్తోష్ణా = చేదుగ. ఉష్ణముగ నుండును; కఫపిత్తకరీ = కఫమును, పిత్తమును చేయును; గురుః = గురుత్వమును కలుగచేయును; దృక్ = నేత్రదృష్టిని; శుక్రహృత్ = శుక్రమును నశింపచేయును; పాకేకటుః = పాకమువలన కటువుగ నుండును; కుసుంభజం బీజం = కుసుమ విత్తులు; తద్వత్ = అగసితో తుల్యమైన గుణము గలవి.

తాత్పర్యము : అగసి విత్తులు జిగటగ మధురముగ చేదుగ ఉష్ణముగ నుండును. కఫము, పిత్తము, గురుత్వము వీనిని కలుగచేయును, నేత్రదృష్టిని,

శుక్రమును వీనిని నశింపజేయును. పాకమువలన కటువుగా నుండును. కుసుమ విత్తులు అగసితో తుల్యమైన గుణము గలవి.

*శశిలేఖ :* అగసి విత్తులు జిగటగ నుండును. ఉష్ణవీర్యము గలవి. కటు విపాకమును జెందును. అగసి విత్తుల వలెనే కుసుంభ బీజములకు కూడ గుణము లుండును.

మూ॥ మాషోఽత్ర సర్వేష్వవరో యవక శ్శూకజేషుచ।
నవం ధాన్య మభిష్యంది సేక్యం కేదారజం చ యత్॥
లఘు వర్షోషితం దగ్ధ భూమిజం స్థలసంభవమ్।
శీఘ్ర జన్మ తథా సూప్యం నిస్తుషం యుక్తి భర్జితమ్॥
ఇతి శింబి ధాన్య వర్గః॥

*ప్రతిపదార్థము :* అత్రసర్వేషు=శింబి ధాన్యములన్నింటిలో; మాషః= మినుములు; అవరః=శ్రేష్ఠమైనవికావు; చ=మరియు; శూకజేషు=శూక ధాన్యముల యందు; యవకః=యవలును; అవరః=శ్రేష్ఠమైనవి కావు; నవం= నూతనమైన; ధాన్యం= ధాన్యము; సేక్యం =ఎక్కువ నీళ్ళుగల; కేధారజం= కేదారములలో పుట్టిన ధాన్యము; అభిష్యంది=కఫమును వృద్ధిచేయును; వర్షోషితం=సంవత్సరము పాతబడిన ధాన్యము; దగ్ధభూమిజం=దగ్ధభూమి యందు జనించినయు; స్థలసంభవమ్=మెట్ట భూములలో పండు ధాన్యము; శీఘ్రజన్మ=త్వరగా పాకమునకు వచ్చు ధాన్యము; తథా=అట్లే; నిస్తూషం= పొట్టులేని, యుక్తిభర్జితమ్=యుక్తిపూర్వకముగ భర్జనము చేయబడిన; సూప్యం= పప్పు దాన్యము; లఘు=లఘువుగా నుండును.

*తాత్పర్యము :* శింబీ ధాన్యము లన్నింటిలో మినుములును, శూక దాన్యముల యందు యవలును శ్రేష్ఠమైనవికావు. క్రొత్త ధాన్యములు కఫమును వృద్ధి వొందించును. సంవత్సరమువకు పైబడిన ధాన్యములు లఘువులుగ నుండును. దగ్ధ భూమియందు జనించిన ధాన్యములు లఘువుగ నుండును.

అని శింబీ ధాన్య వర్గము ముగింపబడినది.

*శశిలేఖ :* శింబీ ధాన్య వర్గమునందు మినుములు మాత్రము శ్రేష్ఠమైనవి కావు. శూక ధాన్యములందు యవలును శ్రేష్ఠమైనవికావు. సంవత్సరమునకు లోబడిన క్రొత్త ధాన్యము కఫమును వృద్ధిచేయును అనగా స్రోతస్సులలో ద్రవమును పుట్టించును. అట్లే ఎక్కువ నీళ్ళు నిల్వగల కుల్యాల యందు పుట్టిన ధాన్యము గూడ స్రోతస్సులలో ద్రవమును పుట్టించును. ఉదక రహితమైన కేదారముల యందు పుట్టిన ధాన్యము, కాల్చిన భూమియందు పుట్టిన ధాన్యము 1సం॥ పాతబడిన ధాన్యము, లఘుగుణము గల్గి యుండును. అట్లే పొట్టులేని పెసలు మొదలగు ధాన్యములు, త్వరగా పచనమగు ధాన్యములు లఘుగుణము గలిగియుండును, అని శింబీ ధాన్యవర్గము సమాప్తము చేయబడినది.

మూ॥ మండ పేయా విలేపనా మోదనస్యచ లాఘవమ్।
యథాపూర్వం శివ స్తత్ర మండో వాతా ను లోమనః॥
తృడ్గ్లాని దోష శేషఘ్నః పాచనో ధాతుసామ్యకృత్।
స్రోతో మార్దవ కృత్ స్వేదీ సంధు క్షయ తి చానలమ్॥

ప్రతిపదార్థము : మండపేయా విలేపీనాం=మండమును, పేయము, విలేపియును: చ=మరియు; ఓదనస్య=అన్నమును; యథాపూర్వం=పూర్వ పూర్వము, (అనగా అన్నముకంటె విలేపి, దానికంటె పేయము, దానికంటె మండము), లాఘవం=లఘువుగ నుండును; తత్ర=వాటిలో; మండః= మండము; శివః=హితకరమైనది; వాతానులోమనః=వాతమునకు అనులోమ గతిని గలిగించును; తృట్=దప్పి; గ్లాని=బడలిక; దోష శేషఘ్నః=దోష శేషము వీనిని బోగొట్టును. (వమన విరేచన కర్మలను జేసికొనిన వానికి శేషించి యుండు దోషము), పాచనః=జీర్ణకారి; ధాతుసామ్యకృత్=వాతాది ధాతువు లకు సమత్వమును కలుగజేయును; స్వేదీ=చెమటను బుట్టించును, అనలం సంధుక్షయతి=అగ్నిదీపనమును చేయును.

తాత్పర్యము : మండము, పేయా, విలేపి, అన్నము, ఇవి యథా పూర్వముగా లఘువుగ నుండును. వానిలో మండము హితకరమైనది. వాతము నకు అనులోమ గతిని గలిగించును. దప్పి, బడలిక దోష శేషము వీనిని బోగొట్టును. జీర్ణకారి, వాతాది ధాతువులకు సమత్వమునిచ్చును. స్రోతస్సులకు మృదుత్వ మును కలుగ జేయును. చెమటను బుట్టించును. అగ్నిదీపనమును చేయును.

"సిక్థై ర్విరహితో మండః పేయాసిక్థసమన్వితా
ఘనసిక్థా విలేపీస్యా ద్యవాగూర్విరళ ద్రవా"

అన్న కణములు లేకుండా కాచబడినది మండమనియు, కొంచెము మెతుకు లుండునటుల కాచబడినది పేయ మనియు, విశేషముగ మెతుకులుండు నటుల కాచబడినది విలేపి యనియు, తేటగా కాచబడినది యవాగువనియును చెప్పబడినది.

శొంఠి, పిప్పలి, దానిమ్మ, వరిపేలాలు వీనిలో నుదకము చేర్చి చక్కగా కాచిన నది మండము.

½ పలము ద్రవ్యము, ప్రస్థముజలము, అర్ధశేషముగాకాచితరువాత అందులో దానిమ్మ పండు రసము రెండు కర్షములు, సైంధవ లవణము, శొంఠి, ధనియాలు, ఇవి దినుసు కొకటింటికి గౌణప్రమాణము, వరిపేలాలు రెండు కర్షములు, ఈ ప్రకారము చేర్చి మరల కాచి, దానిలో పిప్పళ్ళు, జీలకఱ్ఱ, వీని చూర్ణమును దినుసు కొకటింటికి గౌణప్రమాణము చొప్పున గలిపిన పేయ మనబడును.

*శశిలేఖ :* ధాన్యముల యొక్క స్వరూపము చెప్పబడినది. సంయోగ, సంస్కార, ప్రమాణాది విశేషములచేత, గుణాంతరాధానము చెప్పబడినది. అందువలన ఆ విజ్ఞానము నాకళించుకొనుటకు కృతాన్న వర్గ మారంభించుచున్నారు. తక్కిన విషయములు తాత్పర్యాంశములు.

మూ॥ క్షుత్తృష్ణా గ్లాని దౌర్బల్య కుక్షిరోగ జ్వరాపహా।
మలానులోమనీ పథ్యా పేయా దీపన పాచనీ॥
విలేపీ గ్రాహిణీ హృద్యా తృష్ణాఘ్నీ దీపనీ హితా।
వ్రణాక్షి రోగ సంశుద్ధ దుర్బల స్నేహ పాయినామ్॥

*ప్రతిపదార్థము :* పేయా = పేయ (గంజి), క్షుత్ = ఆకలి; తృష్ణా = దప్పి; గ్లాని = ఆకలి దప్పుల వలన గలిగిన బడలిక: దౌర్బల్య = దుర్బలత్వము; కుక్షిరోగ = కడుపు నొప్పి; జ్వరాపహా = జ్వరము వీనిని హరింపచేయును; మలానులోమనీ = వాతాదులను తమ తమ మార్గములందు సంచరించునటుల చేయును; పథ్యా = శరీరమునకు హితకరమైనది; దీపన పాచనీ = దీపన పాచనములను చేయును.

విలేపీ = విలేపి యనునది; గ్రాహిణీ = మలమును గట్టిపరచును; హృద్యా = హృదయమునకు మంచిది; తృష్ణాఘ్నీ = దప్పిని హరింపచేయును; దీపనీ = అగ్నిదీపనమును చేయును; హితా = పథ్యమైనది; వ్రణ = వ్రణము; అక్షిరోగ = నేత్ర రోగములు గలవారికి; సంశుద్ధ = దేహశుద్ధి చేసికొనినవారికి; దుర్బల = బలములేనివారికి; స్నేహపాయినామ్ = స్నేహపానము చేసిన వారలకున్నూ; హితా = హితకరమైనది.

*తాత్పర్యము :* పేయ యనునది ఆకలి దప్పి బడలిక దౌర్బల్యము, కడుపునొప్పి, జ్వరము వీనిని పోగొట్టును. వాతాదులకు అనులోమ గతిని కలిగించును. శరీరమునకు హితమును. అగ్నిదీపనమును, జీర్ణమును గలుగ జేయును.

విలేపి యనునది మలమును గట్టిపరచును. హృదయమునకు మంచిది. అగ్నిదీపనమును కలిగించును. వ్రణములు గల వారికి, నేత్ర రోగములు గల వారికి, దేహశుద్ధి జేసికొనిన వారికి దుర్బలమైన శరీరము గలవారికి, హితమును కలిగించును.

*శశిలేఖ :* పేయ, క్షుధాదులను హరించును. విలేపిక, సంగ్రాహిణీ, దీపనీ, వ్రణాదులకు హితకరమైనట్టిది. సంశుద్ధః = కృతవమన విరేచనః.

మూ॥ సుధౌతః ప్రస్రుతః స్విన్నస్త్యక్తోష్మా చేదనో లఘుః।
యశ్చాగ్నేయౌషధ క్వాథ సాధితో భృష్ట తండులః॥
విపరీత గురుః క్షీర మాంసాద్యైర్యశ్చ సాధితః।
ఇతి ద్రవ్య క్రియా యోగమానాద్యైస్సర్వమాదిశేత్॥

**ప్రతిపదార్థము :** సుధౌతః = చక్కగా బియ్యము కడగబడినదియు; స్విన్నః = చక్కగా వండినదియు; ప్రస్రుతః = గంజి వార్చబడినదియు; త్యక్తోష్మా = సుఖోష్ణముగ నుండునదియునగు; ఓదనః = అన్నము; లఘుః = లఘువుగ నుండును,(తేలికగ నుండును); యః = యే అన్నము; ఆగ్నేయౌషధ-క్వాథ సాధితః = ఆగ్నేయ ద్రవ్యములైన శుంఠి, చిత్రమూలము మొదలగు వాటితో సిద్ధము చేయబడిన కషాయముతో సిద్ధము చేయబడినది; లఘుః = మిక్కిలి తేలికగ నుండును; భృష్టతండులః = వేయించిన బియ్యముతో చేయబడిన యన్నము; విపరీతః = విపరీతమైన; లఘుః = లఘువుగ నుండును; క్షీరమాంసాద్యైః = క్షీరము, మాంసము మొదలగు వాటితో; సాధితః = తయారుచేయబడిన; ఓదనః = అన్నము; గురుః = గురుత్వమును చేయును; ఇతి = అని; ద్రవ్యక్రియా యోగ మానాద్యైః = ద్రవ్యము, క్రియ, సంయోగము, పరిణామము మొదలగు వాటితో; సర్వం = సమస్తము; ఆదిశేత్ = తెలుసుకొనవలయును.

**తాత్పర్యము :** చక్కగా బియ్యమును కడిగి పాకము చేసి గంజి వంచి గోరువెచ్చగ నుండు అన్నము లఘువుగ నుండును. ఆగ్నేయ ద్రవ్యములైన శొంఠి, చిత్రమూలము మొదలగు ఓషధులతో కషాయము తయారుచేసి, ఆ కషాయముతో వండిన అన్నము మిక్కిలి లఘువుగ నుండును. వేయించిన బియ్యముతో వండిన అన్నము చాలా తేలికగ నుండును. ఇట్టుల ద్రవ్యము, క్రియ, సంయోగము, పరిణామము, జాంగలాది దేశ భేదము వీనిచే సమస్తమైన అన్న పేయాదుల యొక్కయు, గురులాఘవములను తెలుసుకొనవలయును. రక్త శాల్యాది ధాన్యములచే చేయబడిన అన్నము లఘుతరమైనది. యావకాదులచే సిద్ధము చేయబడిన అన్నము గురుత్వమున కలిగి యుండును. ఇది ద్రవ్యముచేత సంభవించును,

శూల్య మాంసాదులు లఘువులు. ఇది సంస్కారముచేత సంభవించును. చిత్రకాది కషాయములతో సిద్ధము చేయబడిన అన్నము అతి లఘువుగా నుండును. ఇది సంయోగము చేత ఏర్పడును, జాంగల దేశమున ఫలించిన బియ్యము లఘువు. ఇది దేశభేదమున కుదాహరణము.

లఘు గురు పదార్థముల యొక్క వైపరీత్యమైన సంయోగము వలన ధాన్యాది పాకములలో విశిష్టత ఏర్పడును. ఇది పరిణామముచేత తెలియవలయును,

**శశిలేఖ :** అన్నము ఊష్మా = బాష్పః (జలభాగః) గురుత్వమునకు కారణము, ఎక్కువ వేడి, మిక్కిలి శీతము రెండును నిషేధములు. అనేక విధ వికల్పములచేత కల్పించిన అన్నము యొక్క గురులాఘవములను తెలుసుకొనవలయును,

మూ॥ శుష్యతాం వ్యాధిముక్తానాం శుద్ధానాం శుద్ధి కాంక్షిణామ్।
కృశ క్షామ క్షతోరస్క క్షీణ ధాత్వింద్రియౌజసామ్॥
దృష్టి శ్రవణ వహ్న్యాయుర్బల వర్ణ స్వరార్థినామ్।
భగ్నవిశ్లిష్ట సంధీనాం వ్రణినాం వాత రోగిణామ్॥
హృద్యః పథ్యః పరం వృష్యో బృంహణః ప్రీణనో రసః॥

ప్రతిపదార్థము :- శుష్యతాం=శుష్కించిన వారికి, వ్యాధి ముక్తానామ్=వ్యాధుల నుండి విడువబడిన వారికి, శుద్ధానామ్=వమనాది కర్మలచే శుద్ధులైన వారికి, శుద్ధికాంక్షిణామ్=వమనాది కర్మలచే శుద్ధిని కాంక్షించు వారికి, కృశ=కృశులు, క్షామ=బలహీనులు, క్షతోరస్క=ఉరక్షత రోగులు, క్షీణధాత్వింద్రియౌజసామ్=ధాతువులు, ఇంద్రియములు, ఓజస్సు ఇవి క్షీణించిన వారికి, దృష్టి=చూపు, శ్రవణ=వినుట, వహ్ని=అగ్ని, ఆయు=జీవనము, బల=బలము, వర్ణ=వర్ణము, స్వరార్థినామ్=స్వరము వీనిని కోరువారికి, భగ్నవిశ్లిష్ట సంధీనామ్=విరిగిన, వేరైన సంధులు గలవారికి, వ్రణినామ్=వ్రణ రోగులకు, వాత రోగిణామ్ = వాతరోగులకు, రసః=మాంసము, వరః=శ్రేష్ఠమైనది. హృద్యః = హృదయంగమమైనది. పథ్యః=పథ్యమైనది. పరం = మిక్కిలి, వృష్యః=వాజీకరమైనది. బృంహణః=బలియ చేయును. ప్రీణనః=తృప్తిని కలుగచేయును.

తాత్పర్యము :- శుష్కించిన వారికి, వ్యాధుల నుండి విడువబడిన వారికి, వమనాది కర్మలచే శుద్ధులైన వారికి, వమనాది కర్మలచే శుద్ధిని కాంక్షించు వారికి, కృశులు, బలహీనులు, ఉరక్షత రోగులు, ధాతువులు, ఇంద్రియములు, ఓజస్సు క్షీణించినవారికి, చూపును శ్రవణమును, జాఠరాగ్నిని, జీవనమును, బలమును, వర్ణమును, స్వరమును విశుద్ధముగ నుండునట్లు కోరుకొను వారికిని, విరిగిన వేరయిన సంధులుగలవారును, వ్రణములచే బాధపడు రోగులును, వాతరోగులకును, మాంస రసము మిక్కిలి శ్రేష్ఠమైనది. ఈ మాంస రసము హృదయమునకు చాల మంచిది. పథ్యకరమైనది. మిక్కిలి వాజీకరమును చేయును. శరీరమునకు బలమును ప్రసాదించును. మనస్సునకు తృప్తిని కలిగించును.

శశిలేఖ :- రసమనగా మాంసరసము శుష్యాదులకు పథ్యకరమైనది. వ్యాధి ముక్తులకు బలమును చేకూర్చును. వమన విరేచనములు చేయించుకొనిన వారికి హితమైనది. దేహదోష మార్దవము కొఱకు సంశోధనమును కాంక్షించు వారికి గూడ మాంస రసము శ్రేష్ఠమయినది.

మూ॥ మౌద్గస్తు పథ్యః సంశుద్ధ వ్రణ కంఠాక్షి రోగిణామ్॥
వాతానులోమీ కాలత్థో గుల్మ తూని ప్రతూనిజిత్।
ప్రభూతాత్యన్తరమలో మాష సూపః పరం స్మృతః॥

ప్రతిపదార్థము : మౌద్గస్తు=పెసర కట్టు అయితే, సంశుద్ధ వ్రణ

కంఠాక్షి రోగిణామ్ = విరేచనములకు తీసుకొనిన వారికి, వ్రణము, గళరోగము, నేత్రరోగముకలవారలకు, పథ్యః=హితకరమైనది.

కాలత్థః = ఉలవకట్టు, వాతానులోమీ = వాతమున కనులోమగతిని గలుగ జేయును. గుల్మతూని ప్రతూనిజిత్=గుల్మము, తూని, ప్రతూని యను రోగములను హరించును. (తూని, ప్రతూని లక్షణము గుల్మరోగ నిదానమునందు జెప్పబడును); మాషసూపః=మినపపప్పు; పరం=మిక్కిలి; ప్రభూతాభ్యన్తర మలః=అభ్యంతర మలమును మిక్కిలి ఎక్కువగా వృద్ధి పరచునని; స్మృతః= చెప్పబడినది.

తాత్పర్యము ; పెసర కట్టు వమన విరేచనములకు తీసుకొనిన వారికి, వ్రణము, గళరోగము, నేత్ర రోగము గలవారికి మిక్కిలి హితకరమైనది. [అర్ధాధిక ప్రమాణము గల జలములో రెండు పలములు పెసర పప్పును వేసి నాల్గవ పాలు మిగులునట్లు కాచి కవ్వముతో చిలికి వడియగట్టి దానిలో దానిమ్మ పండు, సైంధవ లవణము శొంఠీ, ధనియాలు, వీని చూర్ణము దినుసొకటింటికి కర్షము ప్రమాణము చొప్పునను పిప్పళ్ళు, జీలకర్ర, వీని చూర్ణము ప్రత్యేకము శాణ ప్రమాణము చొప్పునను గలిపి సిద్ధము చేయబడినది పెసర కట్టు అనబడును.] ఉలవకట్టు వాతమునకు అనులోమ గతిని గలుగ జేయును. గుల్మము, తూని, ప్రతూని అను రోగములను శాంతింప జేయును, మినపప్పు ఆభ్యంతర మలమును ఎక్కువగా వృద్ధిచేయును.

శశిలేఖ : పెసల కట్టు రసము నిర్మాంస యూషమనబడును. సంశుద్ధు లకు పథ్యకరమైనది. ఉలవకట్టు వాతమున కనులోమ గతిని కలిగించును. తూని, ప్రతూని అను వ్యాధులు గుల్మ నిదానము నందు చెప్పబడును. మాష సూపము మలమును వృద్ధి పరచును.

మూ॥ ఖల కాంబళికౌ హృద్యే ఛేదినే స్వౌషధానుగౌ।
పిశితేన రసస్తత్ర యూషో ధాన్యైః ఖళః ఫలైః॥
మూలైశ్చ తిలకల్కామ్ల ప్రాయః పాంబళికః స్మృతః।
జ్ఞేయాః కృతాకృతాస్తేతు స్నేహాదియుత వర్జితాః॥
అల్ప మాంసాదయః స్వచ్ఛా దకలా వణికాః స్మృతాః।

ప్రతిపదార్థము : స్వౌషధానుగౌ =ఔషధములతో జేర్చి సిద్ధము చేయ బడిన, ఖల కుంబళికే=ఖలము, కాంబళికము అను నీ రెండును, హృద్యే= హృదయమునకు హితకరమైనవి. ఛేదినే=ఛేదకములు. తత్ర=వీటిలో, పిశి తేన=మాంసముతో జేర్చి సిద్ధము జేయబడినది. రసః=రసము. ధాన్యైః= ముద్గాది ధాన్యములతో సిద్ధము జేయబడినది; యూషః=యూషము ఫలైః= ఫలముల చేత, మూలైశ్చ=వేళ్ళ చేతను సిద్ధము చేయబడినది. ఖలః=ఖలము. తిలకల్కామ్ల పాయః=నువ్వుల కల్కము,పులిచింత వీనిచే సిద్ధము చేయబడినది,

కాంబళికః = కాంబళికమని, స్మృతః = చెప్పబడినది. కృతాకృతాః = కృతము అకృతము తేతు = ఈ రెండయు తే, స్నేహాది యుత వర్జితాః = క్రమముగా స్నేహాదులను జేర్చి సిద్ధము చేయబడినది (కృతము), స్నేహాదులను జేర్పకుండా సిద్ధము చేయబడినది (అకృతము), జ్ఞేయాః = తెలుసుకొనదగినవి. అల్ప మాంసాదయః = స్వల్ప మాంసాదులతో సిద్ధము చేయబడినది, స్వచ్ఛాః = స్వచ్ఛమైన దానిని, దకలా వణికాః = దకలా వణికముగా, స్మృతాః = చెప్పబడినది.

**తాత్పర్యము** : ఔషధములతో జేర్చి సిద్ధము చేయబడిన ఖలము, కాంబళికము అను నీరెండును హృదయమునకు హితకరమైనవి. మాంసముతో జేర్చి సిద్ధము జేయబడినది రసమనబడును. ముద్గాది ధాన్యములతో సిద్ధము చేయబడినది యూషమనబడును. ఫలములు, వేళ్ళు వీనితో సిద్ధము చేయబడినది ఖలమనబడును. నువ్వుల కల్కము, పులిచింత వీనిచే సిద్ధము చేయబడినది కాంబళిక మనబడును. వీనిలో స్నేహాదులను జేర్చి సిద్ధము చేయబడినది కృత మనబడును. స్నేహాదులను జేర్పకుండా సిద్ధము జేయబడినది అకృత మన బడును. స్వల్పముగ మాంసమును, స్వల్పముగ శుంఠీ, మొదలగు ద్రవ్యములను జేర్చి పిసికి తేటగ సిద్ధము చేయబడినదిదకాలవణికా యనబడును. ఇటులనే యూషము నందుగాని, లేక ఖలాదుల యందుగాని స్వల్పముగ ధాన్యమును లేకమూలాదులను జేర్చి సిద్ధము జేయబడినదిగూడ దకలా వణికాయని జెప్ప బడును.

**శశిలేఖ** : ఖల, కాంబళికము రెండును, హృదయమునకు పథ్యకరములు సంస్కరింప బడుట చేత ఔషధ గుణములతో కూడి యుండును. మాంసముతో సిద్ధము చేయబడినది రసమని వ్యవహరింప బడుచున్నది. ముద్గాది ధాన్యములచేత సిద్ధము చేయబడినది యూషము. రేగుపండ్లు మొదలగు ఫలములచేత సిద్ధము చేయబడినది ఖలము వేళ్ళచేత, తిలకల్కాదుల చేతసిద్ధము చేయబడిది, మరియు దానిమ్మ మొదలగు పండ్లవలె పుల్లగ నుండునది. కాంబళికము స్నేహాదుల చేత భర్జనము చేయబడినది (వేంచినది) శుంఠ్యాదుల చేత సంస్కరింప బడినది కృతము.

స్నేహ సంబంధము లేనిది అకృతము.

స్వల్పమైన మాంసము చేత స్వల్ప ప్రమాణముగల శుంఠ్యాదుల చేత చేయబడినది, నిర్మలమైనది దకలావణికమని చెప్పబడుచున్నది.

మూ॥ విద్యాద్యూషే రసే సూపే శాకే చైవోత్తరోత్తరమ్॥
గౌరవం తను సాంస్త్రామ్ల స్వాదుష్వేషు పృథక్ తథా।
తిల పిణ్యాక వికృతిః శుష్కశాకం విరూఢకమ్॥
శాండాకీ వటకం దృష్టఘ్నం దోషలం గ్లపనం గురు।
పర్పటా లఘవో రుచ్యా లఘీయాన్ క్షారపర్పటః॥

ప్రతిపదార్థము: యూషే=యూషము,రసే=రసము,సూపే=సూపము శాకే=శాకము,ఉత్తరమ్=ఉత్తరోత్తరముగా,గౌరవం=గురువుగా, విద్యాత్= తెలుసుకొన వలయును, తథా=అట్లే, పృథక్=వేరువేరుగ, తను=పలుచన కంటె, సాంద్ర=గట్టియు, అమ్ల=పులుపుకంటె, స్వాదుషు=తీపి, ఏషు= వీటిలో, గౌరవమ్=గురుత్వమును, విద్యాత్=తెలుసుకొన వలయును.

తిల పిణ్యాక వికృతిః = తెలకపిండి, నువ్వుల వికారములు, శుష్క శాకం=ఎండిన, కూరకాయలు, విరూఢకమ్=చిగురించే కూరలు, శాండాకీ= శాండాకీ, వటకం=వటకములు, దృష్టిని చెరచును. దోషలం=వాతాది దోషము లను ప్రకోపింపచేయును. గ్లపనం=బడలిక నిచ్చును. గురు=గురుత్వమును చేయును. పర్పటా=పర్పటమనునది, లఘవః=లఘువుగ నుండును, రుచ్యాః= రుచికరముగా నుండును. క్షారపర్పటః=క్షారపర్పట మనునది, లఘీయాన్= లఘువుగ నుండును.

తాత్పర్యము : యూషమున కంటె రసము, రసమున కంటే, సూపము సూపమున కంటె శాకము గురుత్వమును కలిగియుండును. అట్లే పల్చగా నుండు పదార్థమునకంటె గట్టి పదార్థము, పులుపు వస్తువుల కంటె మధుర పదార్థములు గురువుగ నుండును.

తెలకపిండి, నువ్వుల వికారములు, ఎండిన కూరకాయలు, చిగురించే కూరలు, శాండాకీ, వటకములు ఇవి ఉష్ణములను ప్రకోపింప చేయును. దృష్టిని చెరచును. బడలిక నిచ్చును. గురుత్వమును చేయును. పర్పట మనునది లఘువుగ రుచికరముగ నుండును.

క్షార పర్పట మనునది మిగుల లఘువుగ నుండును.

శశిలేఖ : యూష రస సూప శాకములు, ఉత్తరోత్తరము ఒక దాని కన్నొకటిగురువుగ తెలుసుకొనవలయును. ద్రవ్యగుణ సామ్యతకలిగ యున్నప్పటికిని, సంస్కారాది విశేషము, అచట ప్రధానములుగా పరిగణింప వలెను. తను సాంద్ర అమ్ల మధుర విషయములలో గూడ ఉత్తరోత్తరము వేరుగా గౌరవమును గ్రహింప వలయును. పలుచుగానున్న రసములకంటె గట్టిగానున్న రసములు గురువులు. పులుపు ద్రవ్యముల కంటె మధుర ద్రవ్యములు గురువులు.

మూ॥ హృద్యా దృష్ట్యా రుచికరా గుర రాగషాడవాః।
ప్రీణనా శ్రమ తృట్ ఛర్ది మద మూర్ఛా శ్రమచ్ఛిదః॥
తృట్ ఛర్ది శ్రమ నుమ్మంథః, శీతస్సద్యోబల ప్రదః।
ప్రమేహ క్షయ కుష్ఠాని నచ న్యుర్మంథ పాయినః।
రసాలా బృంహణీ వృష్యా స్నిగ్ధా బల్యా రుచిప్రదా।
శ్రమ క్షుత్ క్లమ తృట్ హారం పానకం ప్రీణనంగురు।
విష్టంభి మూత్రలం హృద్యం యథాద్రవ్య గుణంచతత్॥

ప్రతిపదార్థము :- రాగషాడవాః = రాగషాడవములు, హృదయమునకు తృప్తినిచ్చును, వృష్యాః = శుక్రమును వృద్ధి చేయును, రుచికరాః=రుచిని బుట్టించును, గురవః=గురువుగ నుండును. ప్రీణనాః = తృప్తినిచ్చును, భ్రమ, తృట్ ఛర్ది మద మూర్ఛా శ్రమచ్ఛిదః=భ్రమ, దప్పి, వాంతి, మదము, మూర్ఛ, శ్రమ వీనిని హరింప జేయును.

మంథపాయినామ్ = పిండిని నీళ్ళలో కలిపి త్రాగిన వారికి, తృట్ఛర్ది శ్రమనుత్=దప్పిని, శ్రమను, వాంతిని బోగొట్టును; శీతః =చల్లగా నుండును. సద్యోబల ప్రదః=వెంటనే బలమును చేకూర్చును. ప్రమేహ, క్షయ, కుష్ఠాని= ప్రమేహము, క్షయము, కుష్ఠము అనునవి;నస్యుః =ఉండవు (నశింప చేయును.) రసాలా=రసాల, బృంహణీ=శరీరపుష్టి, వృష్యా=శుక్రవృద్ధి, స్నిగ్ధా=స్నిగ్ధము, బల్యా=బలము, రుచిప్రదా=రుచి, వీనిని పుట్టించును.

పానకం=పానకము,శ్రమ=శ్రమను,క్షుత్ =ఆకలి,తృట్ =దప్పి, క్లమ హారమ్=బడలిక, వీనిని హరించును. ప్రీణనం=తృప్తినిచ్చును. గురు =గురుత్వమును చేయును. విష్టంభి=మలమును బంధించును. మూత్రలం=మూత్రము నధికముగ వెడలించును. హృద్యం=హృదయమునకు హితమైనది.

యథా ద్రవ్యగుణం=వస్తు గుణానుగుణముగా, తత్ =దానిని, జ్ఞాతవ్యమ్ = తెలుసుకొన దగినది.

**తాత్పర్యము** : రాగ షాడవములు శుక్రమును వృద్ధిచేయును, రుచిని కలిగించును. గురువుగ నుండును. తృప్తి నిచ్చును. భ్రమ, దప్పి, వాంతి, మదము, మూర్ఛ, శ్రమము వీనిని హరింప జేయును.

నీళ్ళలో కలిపి సత్తుపిండిని తాగిన యెడల దప్పి, వాంతి, శ్రమ, వీనిని నశింప జేయును, చల్లగా నుండును. వెంటనే బలమును ప్రసాదించును. మంథమును పానముచేయు వారికి ప్రమేహము క్షయ, కుష్ఠురోగము నశించి పోవును. ఈ విషయము చ॥ సూ॥ 25వ అధ్యాయమునందు మరియొక విధముగ చెప్పబడినది.

రసాలా (శ్రీఖండము) బలమును, వాజీకరముగను, జిగటను గలిగించును. రుచిని బుట్టించును.

రసాలా చేయు పద్ధతి

వస్త్రే బద్ధ్వాఽథ గలితం దధి ద్విప్రస్థమానకమ్॥
తస్మిన్ ఘృతం మాక్షికంచ ప్రత్యేకంచ పలం పలం।
నిక్షిప్య శర్కరాం తస్మిన్నాఢకాద్వితయం తథా।
నాగకేసర మేలా త్వక్ పత్రం తాను సంజ్ఞకమ్।

అర్ధకర్షం శుభేద్వాభ్యాం మరీచం ద్విపలం తథా॥
సర్వమేకీకృతం తత్తు భాండే కర్పూరవాసితే
గృహీత్వా చైవ వస్త్రేణ ముఖం బధ్వాఽథ గాలయేత్।
హస్తే నాలోడ్య యత్నేన సా రసాలాభిధా స్మృతా॥
భృష్టంసుపుష్పితం ధాన్యం లాజేతి కథ్యతే॥

తాత్పర్యము : పెరుగును చేతితో రుద్ది, గుడ్డలో వడియ గట్టి దానిలో మిశ్రీ (కలకండ), కుంకుమ పువ్వు, ఏలకులు, మొదలగు సుగంధ ద్రవ్యములను కలిపి తయారు చేయుదురు. పానకము శ్రమను, ఆకలిని, దప్పిని, బడలికను పోగొట్టును. మనస్సుకు ఆహ్లాదమును కలిగించును. గురువు. మలమును గట్టి పరచును. మూత్రమును అధికముగ చేయును. హృదయమునకు మంచిది. వస్తు గుణములను బట్టి గుణములు మారును.

శశిలేఖ : రాగములు, కలకండ, తేనె మొదలగు వాటితో చేయబడినవి, షాడబములు. పులు పదార్థములతో చేయబడినవి శాకములు. శర్కరా మొ॥ వాటితో చేయబడినవి హృదయంగమములు,రుచికరములు గురువులు.అల్పతృప్తిని కలిగించునవి. మనస్సునకు తృప్తిని కలిగించును. భ్రమాదులను నశింపజేయును. రసాలా యను పదార్థము చేతితో చిలికి, మిరియములు, శర్కరా మొ॥ ద్రవ్యములు చేర్చబడిన పెఱుగుతో చేయబడినది. శరీరమును పుష్టిగాచేయును, వాజీకరమును కలిగించును.

సమస్త పానకములు శ్రమాదులను పోగొట్టును. మనస్సునకు ప్రీతిని కలిగించును. గురువు. మలమును గట్టిపరచును. మూత్రమును వృద్ధిచేయును. హృదయమునకు మంచిది. ద్రవ్య గుణమును బట్టిపానకముయొక్క గుణముగూడ మారుచుండుది. ఇచట సంస్కారము వలన గుణాంతరాధానమును చెప్ప వచ్చును.

మూ॥ లాజాస్తృట్ ఛర్ద్యతీ సార మేహ మేదః కఫచ్ఛిదః॥
కాస పిత్తోపశమనా దీపనా లఘవో హిమాః।
పృథుకా గురవో బల్యాః కఫ విష్టంభకారిణః॥
ధానా విష్టంభినీ రూక్షా తర్పణీ లేఖనీ గురుః॥
కంఠ నేత్రామయ క్షుత్తృట్ శ్రమ ఛర్ది వ్రణాపహాః।
సక్తవో లఘవః పానాత్ సద్య ఏవ బలప్రదాః।
నిచయాత్కఠినా గుర్వీ ప్రోక్తా పిండీ మృదుర్లఘుః॥
సక్తూనాం ద్రవతా యోగాల్లఘీయస్య వలేహికా,
శష్కులీ మోదకాదీనాం వ్యాఖ్యాత్రైవం చ కల్పనా.
నోదకాన్తరితాన్న ద్విర్న నిశాయాం న కేవలాన్।
నభుక్త్వా నద్విజైశ్ఛిత్వా సక్తూ నద్యాన్నవా బహూన్॥

కర్కంధు బదరాదీనాం శ్రమతృష్ణా క్లమచ్ఛిదః।
సక్తవోఽమ్ల రసాహృద్యా యథా ద్రవ్య గుణాశ్చతే॥

**ప్రతిపదార్థము :** లాజా = వరి పేలాలు; తృట్ = దప్పిని; ఛర్ది = వాంతిని; అతీసార = అతిసారమును; మేహ = ప్రమేహమును; మేదః = మేదో రోగమును; కఫచ్ఛిదః = కఫము, వీనిని హరించును; కాసపిత్తోపశమనా = దగ్గును, పిత్తమును శమింపజేయును; దీపనా = అగ్నిదీపనమును చేయును; లఘవః = లఘువుగ; హిమాః = శీతవీర్యము గలదిగ, నుండును; పృథుకాః = అటుకులు; గురవః = గురుత్వమును చేయును; బల్యాః = బలకరముగ నుండును; కఫవిష్టంభ కారిణః = కఫము, మలబంధము వీనిని గలుగ జేయును.

ధానా = వేపుడు బియ్యము; విష్టంభినీ = మలబంధమును చేయును; రూక్షా = రూక్షమును చేయును; తర్పణీ = తృప్తిని కలిగించును; లేఖనీ = వాతాదులను భేదించును; గురుః = గురుత్వమును చేయును; కంఠ నేత్రా మయక్షుత్తృట్ శ్రమచ్ఛర్ది వ్రణాపహా = కంఠ రోగములు, నేత్ర రోగములను, ఆకలిని, దప్పిని, బడలికను, వాంతిని, వ్రణాదులను పోగొట్టును.

సక్తవః = వేపుడు బియ్యపు పిండ్లు, లఘవః = తేలికగ నుండును; పానాత్ = ఉదకముతో చేర్చి త్రాగిన యెడల; సద్యఏవ = వెంటనే; బల ప్రదాః = బలమును ప్రసాదించును; పిండీ = ముద్ద (సత్తుపిండిలో నేయికలిపి చేతితో పిసికి చేసినముద్ద), నిచయాత్ = ఒకటిగా చేర్చుట వలన; కఠినా = గట్టిగా నుండును; గుర్వీ = బరువుగా నుండును; మృదుః = మెత్తగా నుండును; లఘువః = తేలికగానుండును; సక్తూనాం = సత్తుపిండ్లలో; ద్రవతా యోగాత్ = నీళ్ళు కలుపుటవలన ఏర్పడు; అవలేహికా = లేహము; లఘీయసీ = తేలికగా నుండును; శష్కులీ మోదకాదీనాం = చక్కిలము, లడ్డు మొదలగు వానియొక్క కల్పనా = కల్పన; ఏవం = ఇట్లే; వ్యాఖ్యాతా = వ్యాఖ్యానము చేయబడినది.

సక్తవః = వేపుడు బియ్యపు పిండ్లు; ఉదకాన్తరితా = మధ్యకాలమునందు జలమును; నపాతవ్యమ్ = త్రాగరాదు; ద్విః = రెండు పూటలా; నఅద్యాత్ = తినరాదు; నిశాయాః = రాత్రికాలమునందు; న = తినరాదు: కేవలాన్ = నీటి సంబంధము లేకుండా కేవలము పిండి; న = తినరాదు; న భుక్త్వా = తరువాత తినరాదు; సక్తూన్ = పిండ్లను; ద్విజైశ్ఛిత్వా = పండ్లతో నమలి; నాద్యాత్ = తినరాదు; వా = లేక; నబహూన్ = అధికముగ భుజింపరాదు; కర్కంధు = ఎఱ్ఱని రేగుపండ్లు; బదరాదీనాం = రేగుపండ్లయొక్క; సక్తవః = సక్తువులు, శ్రమ తృష్ణా క్లమచ్ఛిదః = బడలికను, దప్పిని, క్లమమును నశింపచేయును; అమ్ల రసాః = పులుపురసము గలవి; తే = అవి; యథా ద్రవ్య గుణాః = ద్రవ్య గుణమును బట్టి గుణమును గల్గి యుండును.

**తాత్పర్యము :** వరి పేలాలు దప్పిని, వాంతిని, అతిసారమును ప్రమే

హాము, మేదోరోగమును కఫము హరింప జేయును. దగ్గును పిత్తమును శమింపజేయును. అగ్ని దీప్తిని గలిగించును. తేలికగ నుండును. శీత వీర్యము గలది.

అటుకులు గురుత్వమునుచేసి బలకరముగ నుండును. రూక్షమును చేయును. తృప్తిని గలిగించును. వాతాదులను ఛేదించును. గురుత్వమును చేయును కంఠ రోగములను, నేత్రరోగములను, ఆకలిని, దప్పిని, బడలికను, వాంతిని, వ్రణాదులను పోగొట్టును. వేపుడు బియ్యముతో చేసిన పిండి తేలికగ నుండును. ఈ పిండిని నీటిలో కలిపి త్రాగిన యెడల వెంటనే బలమును ప్రసాదించును. సత్తు పిండిని నేతితో పిసికి చేసిన ముద్ద కఠినముగ నుండును. బరువుగా నుండి మెత్తగా నుండును. సత్తు పిండిలో నీళ్ళను కలుపుట వలన లేహ్యా పాకము వచ్చును. ఇది తేలికగ నుండును.

చక్కిలము, లడ్డు మొదలగు వాటి యొక్క కల్పన గూడ ఇట్లే వ్యాఖ్యానము చేయబడినది.

వేపుడు బియ్యపు పిండి తినునపుడు మధ్యన నీళ్ళు తాగరాదు. రెండు పూటలా సత్తుపిండి తినరాదు. కేవలము సత్తు పిండిని తినరాదు. భుజించిన తరువాత తినరాదు, సక్తువులను పండ్లతో నమిలి తినరాదు. అధికముగ భుజింప రాదు. చిన్న రేగు పండ్లతో, పెద్ద రేగు పండ్లతో కలిపిచేసిన సక్తువులు పులుపు రసముతో కూడి యుండును, బడలికను, దప్పిని, క్లమమును నశింపచేయును? ఆ సక్తువులన్నియు ఆయా ద్రవ్య గుణములను బట్టి గుణములు గలిగియుండును.

*శశిలేఖ* : పేలాలు దప్పి మొ॥ వాటిని నశింపజేయు చున్నవి. దగ్గును, పిత్తమును ఉపశమింప జేయు చున్నవి. అగ్నిదీప్తిని కల్గించు చున్నవి. లఘు గుణముకలవి. శీత వీర్యములు.

అటుకులు గురు గుణముతో కూడుకొని యుండును. పచ్చని ధాన్యములు, పొట్టుగలవి రోకలితో దంచిన యెడల తయారగు వాటిని అటుకులని చెప్పుదురు. ఇవి మల బంధమును చేయును. రూక్షము మొదలగు గుణములతో కూడుకొని యుండును.

సక్తువులు కంఠ రోగములను నేత్రరోగములను నశింపజేయును. లఘు గుణము కలవి. ఈ సక్తువులు నీటితో కలిపి త్రాగినయెడల వెంటనే బలమును చేకూర్చు చున్నవి. ఈ సక్తువులు ఒకటిగ చేర్చబడి నేతితో కలిపి పిసికి ముద్దగా చేయబడినవి కఠినముగా ఉండి బరువుగా ఉండును. ఏసక్తువులు నేతితో కలిపిన తరువాత మెత్తగ ఉండునో అవి లఘువుగ ఉండును. చక్కిలాలు, లడ్డులు మొద లగు భక్ష్యవిశేషములు సంయోగ, సంస్కార, కాఠిన్యాదుల వలన వాటి గుణములు వ్యాఖ్యానము చేయబడినవి. సక్తువులను భుజించు నపుడు మధ్యన

నీళ్ళనుతాగరాదు. ఉదయ, సాయంకాలములయందు సక్తువులను భుజింపరాదు. పండ్లతో నమిలి సక్తులవులను తినరాదు. ఎక్కువ సక్తువులను తినరాదు. పెద్దరేగు పండ్లు మొ॥ పండ్ల సక్తువులు క్లమాదులను పోగొట్టును. అమ్లరసము కలిగి హృదయంగమముగ ఉండును. ఆ సక్తువు లన్నియు ద్రవ్య గుణములనుబట్టి గుణ ములను గలిగి యుండును.

మూ॥ పిణ్యాకో గ్లపనో రూక్షో విష్టంభీ దృష్టిదూషణః
వేశవారో గురుః స్నిగ్ధో బలోపచయ వర్ధనః॥
ముద్గాదిజాస్తు గురవో యథా ద్రవ్యగుణానుగాః॥

ప్రతిపదార్థము : పిణ్యాకః = నువ్వులు మొ॥ వాని గానుగ పిండి, గ్లపనః=బడలిక నిచ్చును, రూక్షః=రూక్షత జేయును విష్టంభీ=మలమును బంధించును, దృష్టిదూషణః = దృష్టిని చెరచును, వేశవారః=వేశవారము, గురుః=గురువుగ నుండును, బలోపచయ వర్ధనః = బలమును శరీర పుష్టిని గలుగ జేయును.

ముద్గాది జాస్తు=పెసర పప్పు, మినపపప్పు, మొ॥ వానిచే చేయబడిన వేసవారము, గురవః = గురుత్వమును జేయును, యథాద్రవ్య గుణాను గాః = వేసవారమునకు దానియందు జేరునట్టి ద్రవ్యముల గుణమేగలిగి యుండును.

తాత్పర్యము : నువ్వులు మొ॥ వాని గానుగపిండి బడలిక నిచ్చును. రూక్షమును చేయును. మలబంధమును చేయును. చూపును చెరచును శొంఠి, ధనియాలు, జీలకఱ్ఱ, ఇంగువ, నెయ్యి మొ॥ వస్తువులను జేర్చి కలియగొట్టి పక్వము చేయబడిన మాంసము వేసవార మనబడును. ఇది గురువుగ, జిగటగ నుండును. బలమును శరీరపుష్టిని గలుగజేయును.

పెసరపప్పు, మినపప్పు మొ॥ వాటితో చేయబడిన వేసవారము గురుత్వ మును గలిగించును. వేసవారమునకు దానియందు జేరునట్టి ద్రవ్యములగుణమే గలిగి యుండును.

శశిలేఖ : తెలక పిండి శ్రమను గలిగించును. మలబంధమును జేయును. చూపును చెరచును.

వేశవారము అనగా శొంఠి, ధనియాలు, జీలకఱ్ఱ మొ॥ ద్రవ్యములను సూక్ష్మచూర్ణములుగచేసి సంస్కరింప బడిన మాంసము. ఇది బలమును ప్రసా దించును. శరీరాంగములను బలిష్ఠముగ చేయును.

పెసరపప్పు మొ॥ వాటితో చేయబడిన వేశవారము (పూర్ణమని లోకము నందు ప్రసిద్ధము) గురుగుణము గల్గి యుండును.

మూ॥ కుకూల కర్పర (భ్రాష్ట్రి) కద్వంగార విపాచితాన్।
ఏక యోనీన్ లఘూన్విద్యా దపూపా నుత్తరోత్తరమ్॥

"ఇతి కృతాన్న వర్గః"

*ప్రతిపదార్థము :* కుకూల=పిడకల నిప్పు; కర్పర=చిల్ల పెంకు; భ్రాష్ట్రిం=మంగలము (బాణలి); కందు=పెన్నము; అంగార=కట్టె నిప్పులు వీనియందు; విపాచితాన్=పక్వము చేయబడిన; ఏకయోనీన్=ఒకే ద్రవ్యముచే చేయబడిన; అపూపాన్=భక్ష్యములను; ఉత్తరోత్తరమ్=ఒకదానికంటె నొకటి; లఘూన్=లఘువులుగా; విద్యాత్ = తెలుసుకొనవలయును, ఇతి = అని; కృతాన్నవర్గః=కృతాన్నవర్గము; ఉక్తః=చెప్పబడినది.

*తాత్పర్యము :* పిడకల నిప్పు, చిల్ల పెంకు, మంగలము, పెన్నము కట్టెనిప్పులు, వీనిలో పక్వము జేయబడినట్టియు, ఒకే ద్రవ్యముతో చేయబడినట్టి భక్ష్యములు ఒక దానికంటె నొకటి ఉత్తరోత్తరముగ లఘువుగ నుండునని గ్రహింపవలయును.

*శశిలేఖ :* కుకూలాదులచేత సిద్ధము చేయబడిన భక్ష్యములు ఒకే ద్రవ్యముతో చేయబడిన యెడల లఘువుగ నుండునని గ్రహింప వలయును. అని కృతాన్న వర్గము చెప్పబడినది.

మూ॥ హారిణైణ కురంగర్క్ష గోకర్ణ మృగ మాతృకాః।
కాల పుచ్ఛక చారుష్క వరపోత శశోరణాః॥
శ్వదంష్ట్రి రామ శరభ కోహ కారక శంబరాః।
కరాళకృత మాలాచ పృషతశ్చ మృగాః స్మృతాః॥
లావ వాతిక వర్తీర రక్త వర్త్మక కర్కరాః।
కపింజలోపి చక్రాఖ్య చకోర కురు బాహవః॥
వర్తకో వర్తికాచైవ తిత్తిరిః కృకరశ్శిఖీ।
తామ్రచూడాఖ్య వరక గోనర్దగిరి వర్తికాః
తథాశార పదేంద్రాభ వారటాశ్చేతి విష్కిరాః॥

*ప్రతిపదార్థము :* హరిణ=ఇఱ్ఱి; ఏణ=ఆడు లేడి; కురంగ=నల్ల నిఇఱ్ఱి ఋక్ష=ఎలుగుబంటి; గోకర్ణ=కణితి; మృగమాతృకాః=జింక; కాల పుచ్ఛక=కాలపుచ్ఛకము; చారుష్క=చారుష్కము; వరపోత=వరపోతము; శశ=కుందేలు; శరభ=శరభము; కోహకారక=కోహకారకము; శంబరాః=శంబరము; కరాల=కస్తూరి మృగము; కృతమాలే=కృత మాలములు; చ= మరియు; పృషతః=దుప్పి; మృగాః=మృగములుగా; స్మృతాః=చెప్ప బడినవి; లావ=లావుకపిట్ట; వాతిక=వర్తికపిట్ట; వర్తీర=వర్తీరపక్షి; రక్త వర్త్మక=రక్తవర్త్మకము; కర్కరాః=గంపపులుగు; కపింజల=కపింజలము

(అనగా రెక్కలయందు చిత్ర వర్ణముగల బట్ట వన్నెపక్షి); ఉపచక్రాఖ్య=ఉప చక్రము; చకోర=చకోర పక్షి; కురుబాహవః=కురుబాహువు; వర్తకః = వెలిచె పిట్ట;వర్తికా=మీనవల్లంకి పిట్ట, తిత్తిరిః=తీతువు పిట్ట, కృకర=కృకరము, శిఖి=నెమలి, తామ్ర చూడాఖ్య = కోడి, బకర = వాలుకొంగ, గోనర్ద= బెగ్గురు పిట్ట, గిరివర్తికాః=గిరివర్తికపక్షి, తథా=అట్లే, శారపద=శారపదము, ఇంద్రాభ = ఇంద్రాభము, వారటాశ్చేతి=ఆడు హంస యని, విష్కిరాః= విష్కిరములు.

తాత్పర్యము : హరిణము, ఏణము, కురంగము, ఋశ్యము, గోకర్ణము, మృగమాతృకా, కాలపుచ్ఛక, చారుష్క, వరపోత, శశ, ఉరణ, శ్వదంష్ట్రి, రామ,శరభ, కోహకారక, శమ్బర, కరాల, కృతమాల, మరియు పృషతములు ఈ 20 మృగ విశేషములుగా చెప్పబడినవి.వటీర, వార్తిక, వార్తీరర క్తవర్త్మక, కక్కుభ, కపింజల, ఉపచక్ర, చకోర, కురుబాహూ, వర్తక, వర్తికా, తీతువు పిట్ట, క్రకర, నెమలి, కోడి, వరక, గోనర్ద, గిరివర్తక, సారపద, ఇంద్రాభము, మరియు వరటము. ఈ 21 విష్కిరములు. విష్కిరములనగా చిందిన ధాన్యాదులనుభక్షించు పక్షులని యర్థము.

*శశిలేఖ :* తరువాత మాంసము చెప్పబడుచున్నది. హరిణము మొదలు కొని, పృషతమువరకు 21 మృగవిశేషములు చెప్పబడినవి. లావము మొదలు కొని వరాటము వరకు 20 విష్కిరజాతిపక్షులను గురించి చెప్పబడినది. ఏరుకొని తిను పక్షులను విష్కిరములని చెప్పుదురు.

మూ॥ శతపత్రో భృంగరాజః కోయష్టి జీవజీవకః।
ఖంజరీటక హారీత దుర్నామారి కృశాగ్రహాః॥
లట్వాలడుషో వటహో గోక్ష్వేళో డిండిమాణవః।
జటీ దుందుభి పాకారి లోహ పృష్ఠ కులింగకాః।
సారికా శుక శార్ఙ్గాఖ్య చిరిటీ కకుయష్టికాం।
మంజరీయక దాత్యూహ గోధాపుత్ర ప్రియాత్మజాః।
కలపంకః వరభృతః కపోతోఽంగార చూడకః।
పారావతః పాణవిక ఇత్యుక్తాః ప్రతుదాద్విజాః

ప్రతిపదార్థము :శతపత్రః=బెగ్గురు పక్షి, భృంగరాజః=గండుతుమ్మెద, కోయష్టి=చీకు గొక్కెర, జీవజీవకః=వెన్నెలపులుగు, ఖంజరీటక=కాటుక పిట్ట(మంద పిచ్చుక), హారీత=పచ్చపిట్ట,దుర్నామారి=జలగ,కృశా=కృశము, గృహాః=గృహములు, లట్వా=ఊరపిచ్చుక, లడూష=లడూషము, వటహో= వటహము, గోక్ష్వేళః=గోక్ష్వేడము, డిండిమాణవ=డిండి మాణవము, జటీ= నేత్రపోతు, దుందుభి = దుందుభి, పార్కార = ప్రార్కారము,లోహపృష్ఠ=

రాపులుగు, కులింగక = అడవిపిచ్చుక, సారికా = గోరువంకపిట్ట, శుక = చిలుక, శార్ఙ్గాఖ్యా = శార్ఙ్గాఖ్యము, చిరీటీ = చిరీటీ, కకుయష్టికా = కకుయష్టిక, మంజరీయక = మంజరీయకము, దాత్యూహ = దాత్యూహము, గోపా = గోపపక్షి, పుత్రప్రియా = పుత్రప్రియ యను పక్షి, ఆత్మజా = ఆత్మజ యను పక్షి, కలవింకః = ఊరబిచ్చుక, పరభృతః = కోయిల, కపోత = పావురము (గువ్వ), అంగార చూడక = అంగారచూడకమను పక్షి, పారావతః = పావురము, పాణవిక = పాణవికపక్షి, ఇతి = అని, ప్రతుదాద్విజాః = ప్రతుద పక్షులు, ఉక్తాః = చెప్పబడినవి.

**తాత్పర్యము :** ఈ 35 పక్షులు ప్రతుదములని చెప్పబడినవి. ప్రతుదములనగా ముక్కుచే ధాన్యములయొక్క పొట్టును వేరుపరచిపిపీలికాది జంతువులను జంపి భక్షించుటవలన ప్రతుదములని చెప్పుచున్నారు.

*శశిలేఖ :* లేదు.

**మూ॥** శ్వేతః శ్యామ శ్విత్ర పృష్ఠః కాలకః కాకులీ మృగః॥
భేక చిల్లట కూచీకా గోధా శల్యక శాండకాః।
వృషాహికదలీ శ్వావిన్న కులాద్యా విలేశయాః॥

*ప్రతిపదార్థము :* శ్వేతః = తెల్లపాము, శ్యామ = నల్లత్రాచుపాము, శ్విత్రపృష్ఠః = తెల్లమచ్చలపాము, కాలకః = కోడెనాగు, కుకాలీమృగ = కాకులీ మృగము, భేక = కప్ప, చిల్లట = చిల్లటము, కూచికా = కూచీకము, గోధా = ఉడుము, శల్యక = ఏదుపంది, శాండకాః = శాండకము, వృష = ఎలుక, (ఎద్దు) అహి = పాము, కదలీ = కదలీ, శ్వావిత్ = ఏదుపంది, నకులాద్యాః = ముంగిస మొదలననవి, విలేశయాః = విలేశయములు.

తాత్పర్యము : పై నుదాహరించిన వన్నియు విలేశయములు. తఱుచుగా బొక్కలయందు వసింపుచుండుట చేత బిలేశయము లనబడును.

*శశిలేఖ :* లేదు.

**మూ॥** గోఖరాశ్వతరోష్ట్రాశ్వద్వీపి సింహర్క్ష వానరాః
మార్జార మూషిక వ్యాఘ్ర వృక బభ్రుతరక్షవః॥
లోపాక జంబుక శ్యేన చాషోలూక శ్వవాయసాః
శశఘ్ని భాస కురర గృధ్ర వేశ్య కులంగకాః॥
ధూమికా మధుహా చేతి ప్రసహా మృగ పక్షిణః॥

*ప్రతిపదార్థము :* గో = ఆవు, ఖర = గాడిద, అశ్వతర = కంచరగాడిద, ఉష్ట్రి = ఒంటె, అశ్వ = గుఱ్ఱము, ద్వీపి = చిఱుతపులి, సింహ = సింహము, ఋక్ష = ఎలుగుబంటి, వానరాః = కోతులు, మార్జార = పిల్లి, మూషిక = ఎలుక, వ్యాఘ్ర = పెద్దపులి, వృక = తోడేలు, బభ్రు = ముంగిస, తరక్షవః = సివంగి

అను మృగములు, చాష = పాలపిట్ట, ఉలూక = గుడ్లగూబ, శ్వా = కుక్క, వాయసాః = కాకి మొ॥. శశఘ్ని = డేగజాతి, భాస = భాసపక్షి, కురర = కలహంస, గృధ్ర = గద్ద, వేశ్యా = వేశ్య, కులింగకాః = నల్లఊరపిచ్చుక, ధూమికా = ధూమిక, మధుహా = మధుహా, ఇతి = అని, మృగపక్షిణః = మృగములు, పక్షులు, ప్రసహాః = ప్రసహములనబడును.

**తాత్పర్యము** :- ఆవు, గాడిద, కంచరగాడిద, ఒంటె, గుఱ్ఱము, చిఱుత పులి, సింహము, ఎలుగు బంటి, కోతి, ఎలుక, పెద్దపులి, తోడేలు, ముంగిస, సివంగి, అను నీమృగములును, వరడునక్క, నక్క డేగ, పాలపిట్ట, గుడ్లగూబ, కుక్క, కాకి మొ॥, డేగ, భాస పక్షి, కలహంస గద్ద, నల్లఊరపిచ్చుక, ధూమిక, మధుహా అను నీజంతువులును, ప్రసహములనబడును. ప్రసహములనగా బలాత్కారముగా నాహార పదార్థములను లాగికొనిపోయి తినునవి అని అర్థము. ఈ జంతువులలో మృగములు, పక్షులును కలిసి ఉన్నవి.

*శశిలేఖ* : ఆవు మొదలుకొని మధుహాంతము వరకు కొన్ని పక్షులు కొన్ని మృగములు ఉన్నవి. వీటిని ప్రసహములు అందురు.

**మూ॥** మహిషన్యంకురోహిత వరాహరుడు వారణాః
స్సృమరశ్చమరః ఖడ్గో గవయశ్చ మహామృగాః॥

*ప్రతిపదార్థము* : మహిష = దున్నపోతు, న్యంకు = జింక పోతు, రోహిత = ఖేచరి మృగము, వరాహ = పంది, రురు = రురు మృగము, వారణాః = ఏనుగు సృమర = పెద్దచమరీ మృగము, చమరః = చమరి మృగము, ఖడ్గః = ఖడ్గమృగము, గవయః = అడవి ఆవు, మహామృగాః = మహా మృగములనబడును.

**తాత్పర్యము** : దున్నపోతు, జింకపోతు, ఖేచరి మృగము, పంది, రురు మృగము, ఏనుగు, పెద్ద చమరి మృగము, చమరిమృగము, ఖడ్గమృగము, అడవి ఆవు, ఈపదియున్న మహామృగము లనబడును.

*శశిలేఖ* : లేదు.

మూ॥ హంస సారస కాదంబ బక కారండవ ప్లవాః॥
మృణాళకంఠ చక్రాహ్వ బలాకార క్త శీర్షకాః।
ఉత్క్రోశ పుండరీకాక్ష శరారి మణితుండకాః॥
కాక తుండ ఘనరావ మద్గు క్రౌంచాంబు కుక్కుటాః
నద్యాశ్యో మల్లికాద్యాస్య పక్షిణో జలచారిణః॥

*ప్రతిపదార్థము* : హంసః = హంస, సారస = బెగ్గురుపక్షి, కాదంబ = కలహంస, బక = వాలుకొంగ, కారండవ = నీరుకోడి, ప్లవాః = కప్ప మొదలగు నవి, మృణాల కంఠ = మృణాళ కంఠము, చక్రాహ్వ = చక్ర వాకపక్షి, బలాకా = తెల్లకొక్కెర, రక్తశీర్షకాః = రక్తశీర్షకము, ఉత్క్రోశ = లకుముకి పిట్ట,

పుండరీకాక్ష=పుండరీకాక్షపురుగు, శరారి=ఆడేలు, మణితుండకాః=మణితుండకము,కాకితుండ=తిగరువు,ఘనరావ=ఘనరావము, మద్గు=నీటికాకి, క్రౌంచ=క్రౌంచపక్షి, అంబు=కప్ప, కుక్కుటాః=కోడి మొదలగునవి,నద్యాళః=నంది ముఖము, మల్లికాద్యాస్య= మాసిన ముక్కు, కాళ్ళుగల తెల్లహంస మొదలగునవి,జలచారిణః=నీటియందు సంచరించు, పక్షిణః=పక్షులు.

తాత్పర్యము: హంస, బెగ్గురు పక్షి, కలహంస, నీరు కోడి, కప్ప మొదలగునవి, మృణాళ కంఠము, చక్రవాక పక్షి, తెల్లకొక్కెర, రక్తశీర్షకము, లకుముకి పిట్ట, పుండరీకాక్ష పురుగు, ఆడేలు, మణి తుండకము, అగరువు, ఘనరావము, నీటికాకి, క్రౌంచపక్షి,కప్ప, కోడి మొ॥ వి, నందిముఖము, మాసిన ముక్కు, కాళ్ళుగల తెల్లహంస, మొదలగునవి నీటియందు సంచరించు పక్షులు.

శశిలేఖ: హంసము మొదలు మల్లిక వరకుగల పక్షులు నీటిలో సంచరించు జంతువులుగా పేర్కొనబడినవి.

మూ॥ మత్స్యా రోహిత పాఠీన కూర్మ కుంభీర కర్కటాః।
శుక్తి శంఖో ద్రుశంబూక శఫరీ వర్మిచంద్రికాః॥
బులూకీ నక్ర మకర శింశుమార తిమింగిలాః।
రాజీ చిలచిమాద్యాశ్చ మాంస మిత్యాహు రష్టధా॥

ప్రతిపదార్థము: మత్స్యారోహిత=రోహిత మను మత్స్యము, పాఠీన= అనేక దంతములు గల చేప; కూర్మ = తాబేలు, కుంభీర = కాలుమొసలి, కర్కటాః=ఎండ్రకాయ, శుక్తి=ముత్తెపుచిప్ప, శంఖ=శంఖము (నత్తగుల్ల), ఉద్రు=కప్పచిప్ప, శఫరి=ఎగిరి పడే స్వభావముగల చేప, వర్మి=వర్మి యను మత్స్యము, చంద్రికాః=చంద్రిక యను మత్స్యము, బులూకీ =బులూకీయను మత్స్యము, నక్ర=కారు మొసలి, మకర=మొసలి, శింశుమార=పిడక మొసలి, తిమింగిలాః = తిమింగిలమను చేప, రాజి=రాజి, చిలచిమాద్యాః=చిలిచి మమను చేప మొదలగునవి.

తాత్పర్యము: రోహితమను మత్స్యము మొదలు చిలిచిమమను చేప వరకు మత్స్యములనబడును.

శశిలేఖ: రోహితాదులు చిలిచిమాంతములు నీటిలో బుట్టిన చేపలు, అని ఎనిమిది విధముల మాంసములు ఆచార్యులు పరిగణించిరి.

మూ॥ యోనిష్వ జాపీ వ్యా మిశ్ర గోచరత్వాదనిశ్చితే।

ప్రతిపదార్థము: యోనిషుమధ్యే=ఈ యెనిమిది విధములయిన మాంస యోనుల మధ్య యందు; వ్యామిశ్రగోచరత్వాత్=కలిసియుండుట వలన;

అజావి = మేక, గొఱ్ఱె, ఈ రెంటిని; అనిశ్చితే = ఇవి జాంగములు, ఇవి ఆనూపములని చెప్పవీలుకాదు.

**తాత్పర్యము :** పైనుదాహరించిన ఎనిమిది విధములయిన మాంసములలో మేక, గొఱ్ఱె, అను నీ రెండును జాంగలానూపదేశములందుండుట వలన జాంగలా నూపభేద పురస్సరముగ విభజింప వలను పడదు.

*శశిలేఖ :* ఈ ఎనిమిది విధములయిన మాంస యోనుల మధ్యలో మిశ్ర యోనులుగా నుండుటవలన మేకలు, గొఱ్ఱెలు నిశ్చయముగ అనూప జాంగల దేశములలో నేదియో నొకదానికి చెందినవని చెప్పుటకు వీలుపడదు.

మూ॥ **ఆద్యాంత్యా జాంగలానూపా మధ్యేసాధారణే స్మృతా।**
**వికీర్యాది క్రియా యోగై ర్భక్షణా ద్విష్కిరాదయః॥**

*ప్రతిపదార్థము :* ఆద్యాంత్యాః = ఆది అంతములు; జాంగలానుపాః = జాంగల, అనూప దేశములకు చెందినవిగా; మధ్యే = మధ్యనున్నవి; సాధారణే = సాధారణ దేశమునకు చెందినవిగా; స్మృతా = తలచబడుచున్నవి; వికీర్యాదిక్రియాయోగైః = పర్వరచుకొని తిను క్రియలచేత; భక్షణాత్ = తినుటవలన; విష్కిరాదయః = విష్కిరాదులు; స్మృతాః = చెప్పబడినవి.

**తాత్పర్యము :** పైనుదాహరించిన యెనిమిది భేదములలో మొదటనుండు మృగములు, విష్కిరములు, ప్రతుదములు నని మూడు విధములైన జంతువులు జాంగల (మెట్ట) దేశమునందు సంచరించుచుండుటచే జాంగలములనబడును. కడపట చెప్పబడిన మహామృగములు, అప్చరములు, మత్స్యములు, అను నీ మూడు విధములగు అనూప దేశమునందు సంచరించుచుండుటచేత అనూపములనబడును. నడుమనుండు బిలేశయములు, ప్రసహములు అను నీ రెండు విధములగు జంతువులును, జాంగలముననూ, అనూప దేశమునందును సంచరించుచుండుటచే సాధారణము లనబడును. పర్వరచుకొని అవి తినుటచేత విష్కిరములని చెప్పబడినవి.

*శశిలేఖ :* ఈ వర్గముల యొక్క మధ్యలో మొదటి మూడున్నూ మృగములు, విష్కిరములు, ప్రతుదములు జాంగల శబ్దముచేత చెప్పబడును. చివరి మూడున్నూ మహామృగములు, జలచరములు, మత్స్యములు అనూపములని చెప్పబడుచున్నవి. మధ్యనుండు రెండునూ బిలేశయ ప్రసహములు, సాధారణ దేశజములుగా పేర్కొనబడినవి. మేతకు యోగ్యమైన పదార్థములను జల్లునవి విష్కిరములని వీటి పేర్లు ఉదాహరింపబడినవి.

మూ॥ తత్రబద్ధ మలారుచ్యా మాంసానా ముత్తమాహిమాః॥
కషాయ స్వాదు విశదా లఘవో జాంగలాహితాః॥
పిత్తోత్తరే వాత మధ్యే సన్నిపాతే కఫానుగే॥

ప్రతిపదార్థము : తత్ర మాంసానాం = పై జెప్పిన జాంగల, ఆనూప సాధారణ జంతువుల మాంసములలో; జాంగలాః = జాంగల మాంసములు; బద్ధమలాః = మలమును బంధించును; రుచ్యాః = రుచికరములుగా నుండును; హిమాః = శీతవీర్యమైనవి; ఉత్తమాః = శ్రేష్ఠములైనవి; కషాయస్వాదు = వగరు, మధుర రసము గలవి, విశదాః = విశదములైనవి; లఘవః = తేలికగా నుండును; హితాః = పథ్యకరములైనవి; పిత్తోత్తరే = పిత్తము అధికముగ ప్రకోపించి; వాత మధ్యే = వాతము మధ్యమముగ నుండి; కఫానుగే = కఫము స్వల్పముగ నుండి; సన్నిపాతే = సన్నిపాత రోగము నందు; హితాః = హితముగ నుండును.

తాత్పర్యము : పై జెప్పిన జాంగల ఆనూప సాధారణ జంతువుల మాంసములలో జాంగల మాంసము మలమును బంధించును. శీత వీర్యము గలది. లఘువుగ నుండును. కషాయ మధుర రసములు గలది విశదములు. పిత్తము అధికముగ ప్రకోపించి, వాతము మధ్యమముగ నుండి, కఫము స్వల్పముగా గల సన్నిపాత రోగము నందు హితముగ నుండును.

శశిలేఖ : అక్కడ జాంగల మాంసములు పురీషమును బంధించును. రుచికరములుగ నుండును. మాంసము లన్నింటిలో ఉత్తమములైనవి. శీత వీర్యములు కషాయ మధుర రసములను గలిగి యుండును. సన్నిపాతమునందు హితకరములు.

మూ॥ తామ్రోఽత్ర హరిణః కృష్ణ స్త్వేణో హృద్య స్త్రిదోషజిత్.
లఘీయాన్ షడ్రసశ్చాసౌ గ్రాహీ రూక్షో హిమశ్శశః॥
కటు పాకోఽగ్నికృత్ పథ్య సన్నిపాతేఽనిలావరే॥

ప్రతిపదార్థము : అత్ర = ఇక్కడ, తామ్రః = ఎఱ్ఱని వర్ణముగల, హరిణః = ఇఱ్ఱి, కృష్ణఃఏణః = కృష్ణసారము (యజ్ఞమునకు దగినటువంటి చిత్ర వర్ణపు లేడి) వీటి మాంసము, హృద్యః = హృదయమునకు హితకరమైనవి, త్రిదోషజిత్ = త్రిదోషములను హరింపజేయును; శశః = కుందేలు (చెవుల పిల్లి) మాంసము, లఘీయాన్ = మిగుల లఘువుగ నుండును, అసౌ = ఇది, షడ్రసః = మధురాది షడ్రస యుక్తముగ నుండును. గ్రాహీ = మలబంధమును చేయును. రూక్షః = రూక్షముగ నుండును, హిమః = శీతలమైన వీర్యము గలది, కటు విపాకః = పాకము వలన కటువుగ నుండును. అగ్నికృత్ = అగ్ని దీపనమును కలుగ చేయును. అనిలావరే సన్నిపాతే = వాతము స్వల్పముగ నుండు సన్నిపాతము నందు, పథ్యః = హితకరమైనది (చెవుల పిల్లి మాంసము జాంగల మాంసములలో చేరినది) కాన కషాయ మధుర రసములు గలది.

తాత్పర్యము : ఇఱ్ఱి, కృష్ణ సారము, వీని మాంసము హృదయమునకు హితకరమైనది. త్రిదోషములను హరింప చేయును, చెవుల పిల్లి మాంసము

మిగుల లఘువుగ నుండును. మధురాది షడ్రస యుక్తముగ నుండును మలమును బంధించును. రూక్షముగ నుండును. శీత వీర్యము గలది. కటు విపాకమును చెందును. అగ్ని దీపనమును కలుగ చేయును. వాతము స్వల్పముగ నుండు సన్నిపాతమునందు హితకరమైనది.

*శశిలేఖ* : ఏణ హరిణములు ఆకృతిలో సమానమైనవి. (ఒకే ఆకారము గలవి) తామ్ర వర్ణము గలది హరిణము, కృష్ణ వర్ణముగలది ఏణము. ఈ ఏణము హృదయమునకు మంచిది. త్రిదోషములను హరించును. మిక్కిలి లఘువుగ నుండును. షడ్రస యుక్తముగ నుండును. చెవ్వపిల్లి రూక్ష గుణము గలది. శీత వీర్యము, కటు విపాకము, జాఠరాగ్నిని వృద్ధి పరచును. స్వల్పమైన వాతము గల సన్నిపాతము నందుపథ్యకరమైనది.

మూ॥ తద్వల్లావోఽప్యరూక్షస్తూ కించిద్రూక్షః కపింజలః ।
పారావతాః కపోతాశ్చతద్వద్వన్యాః సుపూజితాః॥
ఈషదుష్ణ గురుస్నిగ్ధా బృంహణావర్తకాదయః
తిత్తిరిస్తేష్వపి వరో మేధాగ్ని బలశుక్రకృత్।
గ్రాహీ వర్ణ్యోఽనిలోద్రిక్తసన్నిపాత హరః పరమ్॥
ధన్వానూప విచారిత్వా త్స్నిగ్ధోష్ణ గురుబృంహణః॥

ప్రతిపదార్థము : లావః=లావుక పిట్ట; తద్వత్ =కుందేలు గుణములతో సమానమైనది; అపి =కూడ; అరూక్షః=రూక్ష గుణము కలది కాదు; కపింజలః=కపింజలము; కించిద్రూక్షః=కొంచెము రూక్షము గలది: పారావతః=గువ్వ; చ=మరియు; కపోతాః=పావురములు; తద్వత్ =కుందేలు గుణములతో సమానమైనవి; వన్యాః=అడవి యందున్నవి; సుపూజితాః=మిక్కిలి ప్రశస్తమైనవి (ఇండ్లలో నివసించుచునవి. అపథ్యములు); వర్తకాదయః=వర్తకము మొదలగు జాంగల మాంసములన్నియు; ఈషదుష్ణగురుస్నిగ్ధాః=స్వల్పముగ నుష్ణమును చేయును; గురువుగ, జిగటగ నుండును; బృంహణాః=శరీర పుష్టినిచ్చును; తేష్వపి=ఆ వర్తకాదులలో గూడ; తిత్తిరిః=తిత్తిరి పక్షి మాంసము; వరః=శ్రేష్ఠము; మేధాగ్ని బలశుక్రకృత్=బుద్ధి బలమును, అగ్ని బలమును, శుక్ర మును వృద్ధి చేయును; గ్రాహి=మలబంధమును చేయును; వర్ణ్యః=వర్ణమునువృద్ధి చేయును; పరం=మిక్కిలి; అనిలోద్రిక్త సన్నిపాత హరః=వాతముయొక్క ఉద్రేకముతో కూడిన సన్నిపాతమును పోగొట్టును; ధన్వానూప విచారిత్వాత్ =జాంగల, ఆనూపదేశములందు సంచరించుట వలన; స్నిగ్ధోష్ణ గురుబృంహణః=జిగట, ఉష్ణము, గురువుగ నుండి బలమును చేకూర్చును.

తాత్పర్యము : లావుక పిట్ట మాంసము కుందేలు మాంసము యొక్క గుణములతో సమానమైనది. రూక్ష గుణము గలది గాదు. కపింజలము కొంచెము

రూక్షత గలిగించును. గువ్వ, పావురము గూడ వెనుకటి గుణములనే కలిగి యుండును. అడవిలో సంచరించునవి మిక్కిలి ప్రశస్తములుగా ఉండును. ఇండ్లలో మచ్చిక చేసి సాకుచున్నవి ప్రశస్తములు కావు. వర్తకము మొదలగు జాంగల మాంసములన్నియు స్వల్పముగ ఉష్ణమును చేయును. గురువుగ నుండి జిగటగ నుండును. శరీర పుష్టినిచ్చును. ఆ వర్తకాది పక్షులలో గూడ తిత్తిరి పక్షి మాంసము శ్రేష్ఠమైనది. బుద్ధి బలమును, అగ్ని బలమును, శుక్రమును వృద్ధి జేయును. మలబంధమును చేయును. శరీర కాంతిని వృద్ధి పరచును. వాతిక సన్నిపాతము నందు మిక్కిలి పథ్యకరమైనది. జాంగల ఆనూపదేశములందు సంచరించుచుండుట వలన జిగటగ నుండును. గురువుగ నుండును. ఉష్ణవీర్యము బలమును చేకూర్చును.

*శశిలేఖ :* లావుక పిట్ట మాంసము కుందేలు మాంసమువలె గుణము గలిగి యుండును. రూక్షము గాదు. కపింజలము కొంచెము రూక్షము గలది. పారావత, కపోతములు రెండును వన్యములైనచో పథ్యములు. గృహముల యందున్న యెడల అపథ్యములు. వర్తకాదులలో తిత్తిరి పక్షి మాంసము శ్రేష్ఠము. మేధాదులను వృద్ధిచేయును. శరీరమునకు కాంతిని ప్రసాదించును. ఆ తిత్తిరి పక్షి జాంగల ఆనూప దేశములలో సంచరించును గాన స్నిగ్ధముగ నుండును. ఉష్ణ వీర్యము గలది గురుగుణము, శరీరమునకు బలమును కలిగించును.

**మూ॥ నాతిపథ్యః శిఖీపథ్యః శ్రోత్ర స్వర వయోదృశామ్।**
**తద్వచ్చ కుక్కుటో వృష్యో గ్రామ్యస్తు శ్లేష్మలో గురుః।**
**మేధాల కరా హృద్యాః కృకరాః సోపచక్రకాః॥**
**గురుః సలవణః కాణకపోతః సర్వదోషకృత్।**

**ప్రతిపదార్థము :** శిఖీ = నెమలి మాంసము, నాతి పథ్యః = స్వల్పముగ పథ్యకరమైనది; శ్రోత్ర, స్వర వయోదృశామ్ = చెవులు, స్వరము వయస్సు, నేత్రములు వీనికి. పథ్యః = హితకరమైనది, కుక్కుటః = అడవి కోడి మాంసము, తద్వచ్చ = నెమలి మాంసముతో తుల్యమైన గుణము కలది. వృష్యః = శుక్రమును వృద్ధిచేయును. గ్రామ్యస్తు = గ్రామములయందు సంచరించెడి కోడి మాంసము, శ్లేష్మలః = శ్లేష్మమును, గురుః = గురుత్వమును చేయును. కృకరాః = పిన్న కక్కెరపిట్ట, సోపచక్రకాః = ఉపక్రికము అను వాని మాంసము, మేధానలకరః = బుద్ధిని, అగ్ని దీపనమును గలుగ జేయును, హృద్యాః = హృదయమునకు హితకరమైనవి. కాణకపోతః = కాణ కపోత మాంసము, సలవణః = కొంచెము ఉప్పుగ నుండును, గురుః = గురుత్వమును చేయును, సర్వదోషకృత్ = సర్వదోషములను ప్రకోపింప చేయును.

**తాత్పర్యము :** నెమలి మాంసము స్వల్పముగ పథ్యకరమైనది. చెవులు,

స్వరము, వయస్సు, నేత్రములు వీనికి హితవును చేకూర్చును. వయస్సునకు హితకరమనగా వయస్సును స్తంభింప చేయును.

అడవికోడి మాంసము నెమలి మాంసముతో సమానమైన గుణముగలది. శుక్రమును వృద్ధి చేయును. గ్రామముల యందు సంచరించెడు కోడి మాంసము శ్లేష్మమును, గురుత్వమును కలుగ చేయును.

పిన్నకక్కెర పిట్ట, ఉపచక్రము అనువాని మాంసము బుద్ధిని, అగ్ని దీపనమును గలుగ జేయును. హృదయమునకు మంచిది. కాణకపోత మాంసము కొంచెము ఉప్పగ నుండును. గురువుగ నుండును. సర్వదోషము లను వృద్ధిపరచును.

**శశిలేఖ :** నెమలి స్వల్పముగ హితకరమైనది. శ్రోత్రాదులకు పథ్యమైనది. వయస్సునకు గూడ మంచిది, త్వరగా వృద్ధాప్యమును రానీయదు. అడవి కోడి మాంసము గూడ నెమలి మాంస గుణములను గలిగి యుండును. గ్రామ్యమైన కోడి మాంసము (జనపద సంచారి యైన) శ్లేష్మమును చేయును. తక్కినవి తాత్పర్యాంశములు.

**మూ॥** గురూష్ణ స్నిగ్ధ మధురా వర్గాశ్చాతో యథోత్తరమ్॥
మూత్ర శుక్ర కృతో బల్యా వాతఘ్నాః కఫపిత్తలాః ॥

**ప్రతిపదార్థము :** అతో వర్గాః = ఇకమీద చెప్పబడుబిలేశయాది వర్గములు, యథోత్తరమ్ = ఒకదానికంటె నొకటి విశేషముగ, గురూష్ణస్నిగ్ధ మధురాః = గురువుగ, స్నిగ్ధముగ, మధురముగ నుండును. మూత్రశుక్ర కృతః = మూత్రము, శుక్రము వీని నధికముగ వృద్ధి చేయును. బల్యాః = బలకరమైనవి, వాతఘ్నాః = వాతమును హరింప జేయును. కఫ పిత్తలాః = కఫ పిత్తముల వృద్ధి నొందించును.

**తాత్పర్యము :** పిమ్మట చెప్పబడు బిలేశయాది వర్గములు ఒకదాని కంటె నొకటి విశేషముగ గురువుగ, స్నిగ్ధముగ మధురముగ నుండును. మూత్రమును, శుక్రమును అధికముగ వృద్ధి చేయును. బలమును చేకూర్చును, వాతమును పోగొట్టును. కఫపిత్తములను వృద్ధి పరచును.

**శశిలేఖ :** తరువాత చెప్పబడు బిలేశయాది వర్గములు యథోత్తరము గురుత్వము, ఉష్ణత్వములను అధికముగ చేయును. ఏవర్గము, యేవర్గమున కంటె ఉత్తర వర్గముగ నుండునో ఆవర్గము, ఉత్తరవర్గమునకంటెగురుత్వాదుల చేత అధికముగ నుండును. అట్లే సమస్తము మూత్రమును, శుక్రమును వృద్ధిపరచును. బలకరములుగ నుండును. వాతమును నశింపజేయును. పిత్తశ్లేష్మములను వృద్ధిపరచును.

**మూ॥ శీతా మహామృగాస్తేషు క్రవ్యాదాః ప్రసహాః పునః**
**చక్షుష్యాః సృష్ట విణ్మూత్రా మాంసలాః కటుపాకినః**
**జీర్ణార్శో గ్రహణీ దోష శోషార్తానాం పరం హితాః ॥**
**గోధా నియచ్ఛతి విషంమూషకః శుక్ర వర్ధనః**

ప్రతిపదార్థము : తేషు = ఈ వర్గములలో, మహామృగాః = మహా మృగములు, శీతాః = శీత వీర్యముగలవి, పునః = మరియు, క్రవ్యాదాః = మాంసమును భుజించునట్టి, ప్రసహాః = ప్రసహములు (పిల్లి, గద్ద, గుడ్లగూబ మొదలగునవి), చక్షుష్యాః = నేత్రములకు మంచిచేయును. సృష్టవిణ్మూత్రాః = మల మూత్రములను సక్రమముగ వెడలింప జేయును. మాంసలాః = మాంసమును వృద్ధి పరచును; కటుపాకినః = కటు విపాకమును జెందును జీర్ణార్శః = పురాణార్శస్సు, గ్రహణీదోష శోషార్తానాం = గ్రహణీ రోగము, శోషరోగము గలవారికి, పరం = మిక్కిలి = హితాః = పథ్యకరమైనవి, గోధా = ఉడుము, (నీరుడుము), విషం = విషమునునియచ్ఛతి = నశింప చేయును. మూషకః = ఎలుక; శుక్ర వర్ధనం = శుక్రమును, వృద్ధిచేయును.

తాత్పర్యము : ఈ వర్గములలో మహా మృగములు శీత వీర్యము గలవి. మరియు మాంసమును తినునట్టి ప్రసహములు అనగ పిల్లి, గద్ద, గూబ మొ॥ నేత్రహితములు. మల మూత్రములను సక్రమముగ వెడలింప చేయును. మాంసమును వృద్ధి పరచును. కటు విపాకమును చెందును. పురాణార్శస్సు, గ్రహణీ, శోష రోగ పీడితులకు మిక్కిలి పథ్యకరమైనవి. ఉడుము మాంసము విషమును నశింపచేయును. ఎలుక మాంసము శుక్రమును వృద్ధి చేయును.

శశిలేఖ : ఆ వర్గములలో మహా మృగములు శీత వీర్యములు క్రవ్యాదాః అనగా క్రవ్యం = మాంసమ్, భుంజతే తీ ప్రసహాః. ఈ ప్రసహ ములు చక్షుష్యములు. మూత్రమును, మలమును వృద్ధి పరచుచున్నవి. మాంస మును గూడ వృద్ధి పరచును. ఉడుము విషహరము. ఎలుక శుక్ర వర్ధకము.

**మూ॥ శుష్క కాస శ్రమాత్యగ్ని విషమ జ్వర పీనసాన్**
**కార్శ్యం కేవల వాతాంశ్చ గో మాంసం సన్నియచ్ఛతి**
**చటకాః శ్లేష్మలా స్నిగ్ధా వాతఘ్నాః శుక్రలాః పరమ్ ॥**
**గురూష్ణో మహిషః స్నిగ్ధ స్వప్న దార్ఢ్య బృహత్వకృత్**
**తద్వద్వరాహః శ్రమహా రుచి శుక్ర బలప్రదః ॥**

ప్రతిపదార్థము : గో మాంసం = గో మాంసము; శుష్క కాస శ్రమా త్యగ్ని విషమ జ్వర పీనసాన్ = శుష్క కాసము (పొడిదగ్గు), శ్రమ = శ్రమము; అత్యగ్ని = అధిక దీపనము; విషమ జ్వరము, పీనసము వీటిని, కార్శ్యం = కృశ త్వమును; చ = మరియు; కేవల వాతాన్ = వాతములను; సన్నియచ్ఛతి = నశింప

జేయును; చటకాః = ఊర పిచ్చుకల మాంసము; శ్లేష్మలాః = శ్లేష్మమును చేయును; స్నిగ్ధాః=స్నిగ్ధముగ నుండును; వాతఘ్నాః=వాతమును హరింప జేయును; కఫ పిత్తలాః=కఫ, పిత్తముల వృద్ధి నొందించును; మహిషః = దున్నపోతు మాంసము, గురూష్ణః=గురువుగ, ఉష్ణముగ నుండును; స్నిగ్ధః= స్నిగ్ధముగ నుండును; స్వప్న, దార్ఢ్య బృహత్వకృత్=నిద్ర, శరీర దార్ఢ్యము, పుష్టి వీనిని కలుగ చేయును; వరాహః=పంది మాంసము; తద్వత్=దున్నపోతు మాంసముతో సమానమైన గుణము గలది; శ్రమహో=శ్రమను బోగొట్టును; రుచి శుక్ర బలప్రదః=రుచి, శుక్రము, బలము వీనిని వృద్ధి పరచును.

**తాత్పర్యము** : గో మాంసము, శుష్క కాసమును, శ్రమను. అధిక దీపనమును, విషమ జ్వరమును, పీనసమును, కృశత్వమును, కేవల వాతమును హరింప జేయును. ఊర పిచ్చుక మాంసము శ్లేష్మమును వృద్ధి చేయును. స్నిగ్ధ ముగ ఉండును. వాతమును హరింప జేయును. విశేషముగ శుక్రమును వృద్ధి పరచును. దున్నపోతు మాంసము ఉష్ణముగ, మిగుల గురువుగ నుండును. నిద్రను, శరీర దార్ఢ్యమును, పుష్టిని గలుగ జేయును. పంది మాంసము, దున్న పోతు మాంసముతో సమానమైన గుణములు గలిగి యుండును. మరియు శ్రమను బోగొట్టును. రుచిని, శుక్రమును, బలమును అధికముగ గలుగ జేయును.

*శశిలేఖ* : గో మాంసము పొడిదగ్గు మొదలగు వాటిని బోగొట్టును. సతతకాది విషమ జ్వరములను హరించును. తక్కినవి తాత్పర్యాంశములు.

మూ॥ హంసః స్వరకరః పిత్తరక్త జిన్మేదురో హిమః।

*ప్రతిపదార్థము* : హంసః = హంసమాంసము; స్వరకరః=స్వరమును వద్ధి పరచును; పిత్త రక్తజిత్ = పిత్త రక్తమును జయించును; మేదురః = మేదస్సులకు; హిమః=చల్లనిది.

**తాత్పర్యము** : హంసమాంసము స్వరమును బాగుపరచును. రక్తపిత్త మును నశింపజేయును.

*శశిలేఖ* : హంసమాంసము స్వరకరము. రక్తపిత్త వినాశమును చేయును. ఎవరు అతి మేదస్సు కలవారో వారికి శీతముగ నుండును. కొందరు చరక పాఠము ననుసరించి 'మధురః అహిమః' అని చదువుచున్నారు.

మూ॥ కఫ పిత్త కరా మత్స్యాః పరం పవన నాశనాః॥
ప్రతి స్రోతో విచారిత్వా దాకాశ ప్లవనేనచ।
రోహితః ప్రవరస్తేషాం చిలిచిమోఽవరః॥
అగోచర విచారిత్వాత్ సర్వ దోషకరోహినః।
కులీరః పరమం వృష్యో బృంహణః ప్రీణనో గురుః॥

ప్రతిపదార్థము : మత్స్యాః=చేపలు; కఫమును పిత్తమును వృద్ధిపరచును; పరం=మిక్కిలి; పవన నాశనాః=విశేషముగ వాతమును నశింపజేయును; తేషాం=ఆ చేపలలో; రోహితః=రోహితమను చేప; ప్రతి స్రోతో విచారిత్వాత్=ప్రవాహమున కెదురుగ సంచరించుచుండుట వలన; చ=మరియు; ఆకాశ ప్లవనే=ఆకాశమున కెగురుట చేత; పరం=మిక్కిలి; ప్రవరః=శ్రేష్ఠమైనది; (ఉడుము బిలేశయ వర్గములలో శ్రేష్ఠము. నల్ల యిఱ్ఱి మృగ వర్గములో శ్రేష్ఠము.) చిలి చిమః=చిలి చిమ మను చేప; అవరః=నికృష్టమైనది; అగోచర విచారిత్వాత్=అయోగ్య స్థానములలో సంచరించుట వలన: సః=ఆ చిలిచిమము; సర్వదోషకరః=త్రిదోషములనువృద్ధి పరచును; కులీరః=ఎండ్రకాయ మాంసము; పరమమ్=ఎక్కువ; వృష్యః=వాజీకరము; బృంహణః=బృంహణము; ప్రీణనః=తృప్తినిచ్చును; గురుః=గురువు.

తాత్పర్యము : చేపలు కఫమును, పిత్తమును వృద్ధి పరచును. విశేషముగ వాతమును నశింప జేయును. ఆ చేపలలో రోహితమను చేప ప్రవాహమున కెదురుగ సంచరించుట వలనను, ఆకాశమున కెగురుట చేతను మిక్కిలి శ్రేష్ఠమైనది. చిలిచిమమను చేప నికృష్టమైనది. అయోగ్య స్థానములలో సంచరించుట వలన చిలిచిమము త్రిదోషములను వృద్ధి పరచును. ఎండ్రకాయ మాంసము ఎక్కువ వాజీకరము. బృంహణము. తృప్తి నిచ్చును. గురుత్వమును చేయును.

శశిలేఖ : చేపలు పిత్తశ్లేష్మ కరములు. వాతమును నశింప జేయును. ఆ చేపలలో రోహితమను చేప చాల శ్రేష్ఠమైనది. నీటికి ఎదురుగ సంచరించుట వలన, మరియు నీళ్ళ మధ్య నుండి ఒక్కతూరి స్వభావము వలన ఆకాశమున కెగురును. అందువలన మిక్కిలి శ్రేష్ఠమైనది. చిలిచిమమను చేప నికృష్టమైనది. ఇది బురద మొదలగు వాటిలో సంచరించును. ఎండ్రకాయ మిక్కిలి వాజీకరము.

మూ॥ **నాతి శీత** గురు స్నిగ్ధం **మాంస మాజ మదోషలమ్,**
శరీర ధాతు సామాన్యా దనభిష్యంది బృంహణమ్॥
**విపరీత మతో** జ్ఞేయ **మావికం బృంహణంతు తత్।**

ప్రతిపదార్థము : ఆజం మాంసం=మేక **మాంసము, నాతిశీత** గురు స్నిగ్ధం=స్వల్పశీతలము, గురుత్వము, స్నిగ్ధముగ నుండును. అదోషలమ్=స్వల్ప దోషమును చేయును. శరీర ధాతుసామాన్యాత్=పురుష శరీరములోని మాంస ధాతువునకు తుల్యమైన గుణముగలది యగుట వలన కొంచెమువాతమును వృద్ధిచేయును. అనభిష్యంది=అభిష్యందముకాదు. బృంహణమ్=శరీర పుష్టిని గలుగ జేయును.

**తాత్పర్యము :** మేక మాంసము స్వల్ప శీతలముగ నుండును. గురుత్వ

మును. స్నిగ్ధత్వమును కలిగించును. మేకశరీరములోని ధాతువులుగూడ మనుష్య శరీర ధాతువులతో తుల్యములుగ నుండుట వలన స్వల్పముగ శ్లేష్మమును, శరీర పుష్టిని గలుగజేయును.

ప్రతిపదార్థము : ఆవికం=గొఱ్ఱె మాంసము, అతో విపరీతం=మేక మాంసమునకంటె విపరీతముగ (అనగా అత్యుష్ణముగ, స్నిగ్ధముగ, దోషయుక్తముగ, శ్లేష్మకారిగ), తత్=అది, బృంహణం=శరీర పుష్టి కారిగ నుండును.

తాత్పర్యము : గొఱ్ఱె మాంసము మేక మాంసమున కంటె విపరీత గుణముగలదిగ నుండును. శరీర పుష్టికారిగా నుండును.

శశిలేఖ : మేక మాంసము స్వల్పమైన శీతవీర్యము గలది. స్వల్పగురువు' స్వల్పస్నిగ్ధము గలది. దోష సామ్యతకు భంగము వాటిల్లునట్లు చేయదు' పథ్యముగ నుండును. స్వసామర్థ్యము వలన, పురుష శరీరమందలి సమస్త ధాతువులతో సామ్యత నుండుట వలన అనభిష్యంది. శారీరే వక్ష్యతి ఆహారశ్చ విహారశ్చ యః స్యాద్దోషగుణైః సమః ధాతుభిర్విగుణూ యశ్చ స్రోతసాం సప్రదూషకః" ఇతి.

మూ॥ అతి మేధ్యం త్యజేన్మాంసం హతం వ్యాధి విషోదకైః॥
స్వయం మృతం ధూమ పూర్ణ మగోచర మృతంకృశమ్।
సద్యోహతం వయస్థంచ శుద్ధం సురభిశస్యతే॥

ప్రతిపదార్థము : అతిమేధ్యం=మిక్కిలి మేదస్సుకలెన వారికి సంబంధించిన, మాంసం=మాంసమును, వ్యాధి విషోదకైః=వ్యాధుల చేత, విషముల చేత, హతం=చంపబడిన వారికి సంబంధించిన, మాంసం=మాంసమును, వా=లేక, స్వయం మృతం=స్వయముగ చచ్చిన వారికి సంబంధించిన మాంసం=మాంసమును, ధూమ పూర్ణం=పొగచే చచ్చిన వాని మాంసమును, అగోచర మృతం=అజ్ఞాతముగ చచ్చిన వాని మాంసమును, {భృశం=అనూప దేశమందలి జంతువు, జాంగల దేశములో పుష్టి చెందిన దాని మాంసము, కృశం=జాంగల దేశమందలి జంతువు, అనూపదేశమందు కృశించిన దాని మాంసమును త్యజేత్=వదలి పెట్ట వలయును. సద్యోహతం = అప్పుడే చంపబడినదాని యొక్క మాంసము, చ=మరియు, వయస్థం = వయస్సులోనున్న జంతువు యొక్క మాంసము, సురభి=మంచివాసనగల మాంసము, శస్యతే=ప్రశస్తమైనది.

తాత్పర్యము : మేదోరోగి మాంసము, వ్యాధులచేత, విషముచేత, ఉదకముచేత చంపబడిన వాటియొక్క మాంసము, స్వయముగ చచ్చిన వాటి యొక్క మాంసము, పొగచే చచ్చినవాని మాంసము, దేశవైపరీత్యమువలన పుష్టి చెందిన లేక కృశించిన జంతువులయొక్క మాంసము గర్హింపబడినది.

అపుడే చంపబడిన జంతువుయొక్క మాంసము, వయస్సులోనున్న జంతువులయొక్క మాంసము, మంచి వాసనలు వెదజల్లు మాంసము ప్రశస్తమైనది.

*శశిలేఖ :* మేదస్వి యొక్క మాంసమును పరిత్యజింపవలెను. వ్యాధ్యాదుల చేత నష్టమైన మాంసమును త్యజింపవలెను. కారణము తెలియకనే చచ్చినవియును, దుర్బలమైనవియును, మిగుల బలిసిన శరీరము గలవియును, వ్యాధి. జలము, విషము వీనిచే మృతిజెందినవియునునగు జంతువుల యొక్క మాంసమును వర్జింపవలెను. అపుడే చంపబడినవియు, మంచి యౌవనము నందుండు జంతువుల యొక్క మాంసమును, స్నాయువులు, అస్థులు మొ॥ తీసివేయబడిన మాంసమును భుజింపవలెను.

మూ॥ ఏణః కురంగో హరిణః శశో లావః కపింజలః ।
తిత్తిరిః కృకరో గోధా శ్వావిద్ గృధ్రో మృగాధిపః॥
బర్హిణః సారికా న్యంకుర్హంసో రోహిత కచ్ఛపౌ।
వర్త్మిచాగ్ర్యాః స్వవర్గేషు ప్రవరా స్తేష్వపి స్మృతాః ।
లావైణ గోధాః సింహాశ్చ, నిందితో గౌరి సదర్దురః ।
ఋశ్యః కాణ కపోతశ్చ శేషముక్తం యథాతథమ్॥

*ప్రతిపదార్థము :* ఏణః=నల్లనై పెద్దకండ్లుగల జింక, కురంగః=ఇఱ్ఱి జాతిలో చేరిన మృగవిశేషము, హరిణః=ఎఱ్ఱని జింక, శశః=కుందేలు లావః=లావుక పిట్ట, కపింజలః=ఱెక్కలయందు చిత్రవర్ణముగల బట్ట వన్నె పక్షి, తిత్తిరిః=తీతువుపిట్ట, కృకరః=కృకరము, గోధా=ఉడుము, శ్వావిత్=నల్లని ఏదుపంది, గృధ్రః=గద్ద, మృగాధిపః=సింహము, బర్హిణః=నెమళ్ళు, సారికాః=గోరువంక పక్షులు, న్యంకు=జింకపోతు, హంసః=హంసము, రోహిత=రోహితమనుచేప, కచ్ఛప=తాబేలు, వర్త్మి=వర్త్మియను చేప, స్వవర్గేషు=తమ తమవర్గల యందు, అగ్ర్యాః=శ్రేష్ఠములైనవి, తేష్వపి=వాటిలోగూడ, లావఏణగోధాఃసింహాశ్చ=లావుకపిట్ట, నల్లనై పెద్దకండ్లు గల జింక, ఉడుము మరియు సింహము, ప్రవరాః=మిక్కిలి శ్రేష్ఠములుగా, స్మృతాః=చెప్పబడినవి; గౌః=ఎద్దు, దర్దురః=కప్ప, ఋశ్యః=మనుబోతు. చ=మరియు, కాణకపోతః=కాణకపోతము, నిందితః=గర్హింపబడినది, శేషం=మిగిలినవి, యథాతథమ్=ఉన్నదున్నట్లుగా, ఉక్తం=చెప్పబడినది.

*తాత్పర్యము :* నల్లనై పెద్దకండ్లుగల జింక, కురంగము, ఎఱ్ఱని జింక కుందేలు ఇవి మృగవర్గములో శ్రేష్ఠమైనవి. లావుకపిట్ట, బట్టవన్నె పక్షి, తీతువు పిట్ట, కృకరము ఇవి విష్కిరవర్గములో శ్రేష్ఠమైనవి. నల్లని ఏదుపంది, ఉడుము ఇవి బిలేశయవర్గములో శ్రేష్ఠమైనవి. గద్ద, సింహము ఇవి ప్రసహావర్గములో

శ్రేష్ఠమైనవి. గోరువంక పక్షి ప్రతుద వర్గములో శ్రేష్ఠమైనది. జింకపోతు మహామృగ వర్గములోను, హంసము జలచారీ వర్గమునందు, రోహితమత్స్యము, తాబేలు, వర్త్మియను మత్స్యము జలజవర్గము నందును శ్రేష్ఠమైనవి. ఈ అన్నింటిలో గూడ ఏణాదులలో ఏణము, లావాదులలో లావుకపిట్ట, నల్లని ఏదు పంది, ఉడుము ఈ రెంటిలో ఉడుము, గద్ద, సింహము ఈ రెంటిలో సింహము శ్రేష్ఠమైనవి. ఎద్దు, కప్ప, మనుబోతు, కాణకపోతము ఈ నాలుగు తమ వర్గములలో నింద్యములు. మిగిలిన వాటిని, వాటి వాటి గుణములను బట్టి తెలుసుకొనవలయును.

*శశిలేఖ :* ఏణాదులు తమ వర్గములలో శ్రేష్ఠమైనవి. తక్కినవి తాత్పర్యాంశములు.

మూ॥ గురూణ్యండాని బాలానాం కషాయ మధురంఫలమ్
వృద్ధానాం స్నాయుభూయిష్ఠం అబల్యం గురు దోషలం॥
పుంస్త్రియోః పూర్వపశ్చార్ధే గురుణీ గర్భిణీగురుః ।
లఘుర్యోషిచ్చతుష్పాత్సు విహంగేషు పునః పుమాన్॥
శిరస్కంధోరు పృష్ఠస్య కట్యాః సక్థ్నోశ్చ గౌరవమ్।
తథాఽఽమ పక్వాశయయోర్యథా పూర్వం వినిర్దిశేత్॥
శోణిత ప్రభృతీనాంచ ధాతూనా ముత్తరోత్తరమ్।
మాంసాత్ గరీయో వృషణ మేఢ్ర వృక్క యకృత్ గుదమ్॥

ఇతి మాంసవర్గః

*ప్రతిపదార్థము :* అండాని=గుడ్లు, గురూణి=గురుత్వమును చేయును. బాలానాం=లేత వయస్సుగల జంతువులయొక్క, పలమ్=మాంసము, కషాయ మధురమ్=కషాయముగ, మధురముగ నుండును. వృద్ధానాం=ముసలితనము గల జంతువులయొక్క, పలం=మాంసము, స్నాయుభూయిష్ఠమ్=మిక్కుటముగ స్నాయువులతో కూడి యుండును. అబల్యం=బలకరమైనదికాదు. గురు=గురువు, దోషలమ్= దోషకరమైనది. పుంస్త్రియో=పురుష స్త్రీజాతిజంతువులయొక్క, పూర్వ పశ్చార్ధే=పూర్వ పశ్చార్ధభాగముల యందలి మాంసము, గురుణీ=గురువుగ నుండును. చతుష్పాత్సు=నాలుగు కాళ్ళుగల జంతువులలో; యోషిత్ =స్త్రీజాతి మాంసము, లఘుః =లఘువుగ నుండును, పునః= మరల, విహంగేషు=పక్షి జాతులలో, పుమాన్ =పురుష పక్షి మాంసము, లఘుః=లఘువుగ నుండును,శిరస్కంధోరుపృష్ఠస్య=శిరము, భుజశిరస్సులు, వీపు, పిరుదులు, తొడలు, వెనుకభాగము వీనియొక్క, కట్యాసక్థ్నః = నడుము, తొడలయొక్క, తథా= అట్లే, ఆమ పక్వాశయయోః=ఆమాశయ, పక్వాశయములయొక్క మాంసము, యథా పూర్వ=యథాపూర్వముగ, గౌరవమే= గురుత్వముగలదియని, వినిర్దిశేత్ = నిర్దేశింపబడినది. శోణిత ప్రభృతీనాం ధాతూనాం=రక్తాది ధాతువులకు, మాంసాత్=మాంసమునకంటె, వృషణ, మేఢ్ర, వృక్క యకృద్గుదం=వృషణములయందలిమాంసము, మేఢ్రమునందలి మాంసము,

వృక్కములయందలి మాంసము, యకృత్తునందలి మాంసము, గుదము నందలి మాంసము, గరీయః = గురుత్వము గలది. ఇతి = అని; మాంసవర్గః = మాంస వర్గము, ఉక్తః = చెప్పబడినది.

**తాత్పర్యము :** పశులయొక్క గుడ్లు గురువుగా నుండును. లేత వయస్సులో నుండు పశులయొక్క మాంసము, కషాయ లవణ రసములు గలిగి యుండును. ముసలి పశులయొక్క మాంసము మిక్కుటముగ స్నాయువులతో కూడుకొని యుండును. బలకరమైనది కాదు. గురువు. త్రిదోషములను వృద్ధి పరచును. పురుష మృగములయొక్క మాంసము బొడ్డునుండి పైభాగము శిరోభాగము) .గురువు, స్త్రీ మృగముయొక్క మాంసము బొడ్డునుండి క్రింది భాగము గురువు. గర్భవతియైన జంతువుయొక్క సమస్త శరీరము నందలి మాంసము గురువు. చతుష్పాద జంతువులలో స్త్రీజాతి మాంసము లఘువు. మరియుపశులలో,పురుషపక్షియొక్క మాంసము లఘువు.సక్థియందుండు మాంస మున కంటె కటి మాంసము గురువు. కటికంటె పృష్ఠము గురువు. పృష్ఠమున కంటె తొడలు గురువు. తొడల కంటె భుజశిరస్సులు గురువు. భుజశిరస్సుల కంటె శిరస్సు గురువు. ఈ విధముగనే పక్వాశయము కంటె ఆమాశయము గురువు. రక్తాదిధాతువులలో ఉత్తరోత్తరము గురువుగా తెలుసుకొనవలయును. ఎట్లులనగా?రక్తమున కంటె మాంసము, మాంసమునకంటె మేదస్సు, మేదస్సు కంటె అస్థి, అస్థికంటె మజ్జ, మజ్జకంటె శుక్రసారము గురువు. మాంసమున కంటె వృషణములు,వృషణముల కంటె మేఢ్రము,మేఢ్రమున కంటె వృక్కలు, వృక్కలకంటె యకృత్తు, యకృత్తు కంటె గుదము గురువుగా నుండును అని మాంసవర్గము ముగింపబడినది.

**శశిలేఖ :** పశులయొక్క గుడ్లు గురువులు. పిల్ల పశులయొక్క మాంసము, కషాయ మధుర రసము గలది. ముసలి పశులయొక్క మాంసము మిక్కుటముగ స్నాయువులు కలిగి యుండును. బలకరముగాదు. గురువు. త్రిదోషములను చేయును. గర్భవతియైన పశుమాంసము గురువు. తక్కినవి తాత్పర్యాంశములు. అని మాంస వర్గము.

## -శాకవర్గము-

మూ॥ శాకం పాఠా శఠీ శూషా సునిషండ సతీనజమ్।
త్రిదోషఘ్నం లఘు గ్రాహి సరాజక్షవ వాస్తుకమ్-
సునిషండోఽగ్నికృద్వృష్యస్తేషు రాజక్షవః పరమ్।
గ్రహణ్యర్శోవికారఘ్నో వర్చో భేదీతు వాస్తుకః॥
హన్తి దోషత్రయం కుష్ఠం వృష్యాసోష్ణారసాయనీ।
శాక మాచీ సరాస్వర్యాచాంగేర్యమ్లాగ్ని దీపనీ।
గ్రహణ్యర్శోఽనిలశ్లేష్మ హితోష్ణా గ్రాహిణీ లఘుః॥

*ప్రతిపదార్థము :* పాఠా=చిరుబొద్ది, శఠీ=కచోరము, శ్రూషా=కసివింద, సునిషండ=చెంచలి, సతీనజమ్=సతీనజము, రాజక్షవః=చిలుకకూర వాస్తుకం=చక్రవర్తి కూర వీటియొక్క, శాకం=కూర, త్రిదోషఘ్నం=త్రిదోషములను హరింపజేయును. లఘు=లఘువుగ నుండును, గ్రాహి=మల బంధమును చేయును. తేషు=పై జెప్పిన పాఠాదిశాకములలో, సునిషండః=చెంచలికూర, అగ్నికృత్=విశేషముగ అగ్నిదీపనమును గలుగజేయును, వృష్యః=శుక్రమును వృద్ధిపరచును, పరం=విశేషముగా, రాజక్షవః=చిలుక కూర, గ్రహణ్యర్శోఘ్న్య వికారఘ్నః=గ్రహణి, అర్శస్సు వీనిని బోగొట్టును, వాస్తుకం=చక్రవర్తికూర, వర్చోభేది=మలమును భేదించును, కాకమాచీ=కాచికూర, దోషత్రయం=త్రిదోషములను, కుష్ఠం=కుష్ఠమును, హంతి=పోగొట్టును, వృష్యా=శుక్రకరము, షోష్ణా=కించిదుష్ణముగ నుండును, రసాయనీ=రసాయనము, సరా=శరీరములో గడ్డకట్టియుండు వస్తువులను ఛేదించును, స్వర్యా=కంఠస్వరమునకు హితకరమైనది, చాంగేరి=పులిచింత, అమ్లా=పుల్లగనుండును, అగ్నిదీపనీ=అగ్నిదీపనమునుచేయును, గ్రహణ్యర్శోఽనిలశ్లేష్మ హితోష్ణా=గ్రహణి, అర్శస్సు, వాతము, శ్లేష్మము, వీనియందు పథ్యకరము, ఉష్ణవీర్యముగలది, గ్రాహిణీ=మలమును గట్టిపరచును, లఘుః = లఘువుగ నుండును.

*తాత్పర్యము :* చిరుబొద్ది, కచోరపుకూర, కసివిందకూర, చెంచలి కూర, సతీనజము, చిలుకకూర, చక్రవర్తికూర ఈ శాకములు త్రిదోషములను హరింపజేయును. లఘువుగ నుండును. మలబంధమును జేయును.

సామాన్యగుణములను పైనుదహరించిన వాటికి చెప్పి విశేషగుణములను చెప్పుచున్నారు. పైనుదహరించిన, పాఠాదిశాకములలో చెంచలి కూర విశేషముగ, అగ్నిదీపనమును గలుగజేయును. శుక్రకరము. ఇది జలమధ్యములో మొలచును. దీని యాకులు పులిచింతయాకులవలె నుండును.

చిలుకకూర విశేషముగ గ్రహణి, అర్శస్సు వీనిని పోగొట్టును.

చక్రవర్తికూర మలమును భేదించును.

కాచికూర త్రిదోషములను, కుష్ఠమును బోగొట్టును. శుక్రకరము. కొంచెము ఉష్ణమునుచేయును. శరీరమునందు వేగముగ వ్యాపించును. శరీరములో గడ్డకట్టియుండువస్తువులను భేదించును. కంఠస్వరకరము. రసాయనము.

పులిచింత పులుపుగా నుండును. గ్రహణి, అర్శస్సు, వాతము, శ్లేష్మము వీనియందు పథ్యకరమైనది. ఉష్ణవీర్యము. మలమును గట్టి పరచును. లఘువుగ నుండును.

*శశిలేఖ :* కాచికూర శరీరము నందు స్వస్థతను గలుగజేయుటచేత

రసాయన తుల్యముగ నుండును. చాంగేరి=క్షుద్రాబ్మికే యని యర్థము. పులిచింత యని తెలుగు.

మూ॥ పటోల స_ప్తలారిష్ట శార్ఙ్గేష్టా వల్గుజామృతాః ॥
వేత్రాగ్ర బృహతీ వాసా కుంతలీ తిల పర్ణికాః ।
మండూక పర్ణీ కర్కోట కారవేల్లక పర్పటాః ॥
నాడీ కలాయ గోజిహ్వా వార్తాకం వనతి క్తమ్ ॥
కరీరం కులకం నన్దీ కుచేలా శకులాదనీ॥
కటిల్లకం కేంబుకం శీతం సరో శాతక కర్కశమ్॥
తి క్తం పాకే కటుఃగ్రాహి వాతలం కఫపి త్తజిత్॥

ప్రతిపదార్థము : (1) పటోల=పొట్ల, (2) స_ప్తలా=సంబరేణు, (3) అరిష్ట=వేము, (4) శార్ఙ్గేష్టా=గురుజా, (5) అవల్గుజా=బావంచి, (6) అమృతాః=తిప్పతీగె, (7) వేత్రాగ్ర=వెదురుగొమ్మ, (8) బృహతీ=ములక' (9) వాసా=అడ్డసరము, (10) కుంతలీ=సూక్ష్మ తిలజాతి; (11) తిలపర్ణికా =బదరము, (12) మండూక పర్ణీ=మండూకబ్రహ్మి లేక సరస్వతి ఆకు, (13) కర్కోట=డావరడంగి, (14) కారవేల్లక=కాకర, (15) పర్పటాః=పర్పాట కము, (16) నాడీకలాయ=శకులాక్షము (ఇది సువర్చలా భేదము) (17) గోజిహ్వ=బరివెంక, (18) వార్తాకమ్=క త్తిరివంగ,(19) వనతి క్తకమ్=కొడిశ పాల, (20) కరీరం=వెదురుమొలక లేక చేటకొమ్మ, (21) కులకం=చిట్టి తుమికి, (22) నంది=నందివృక్షము, (23) కుచేల=చిరుబొద్ది, (24) శకులాదనీ =కటుక రోహిణీ, (25) కటిల్లకం=ఎఱ్ఱగలిజేరు, (26) కేంబుకం=కేంబు కము, (27) కోశాంతక=బీర, (28) కర్కశమ్=కంపిల్లము, శీతం=శీత వీర్య ముగ,తి క్తం=తి క్తరసము, పాకేకటు=పాకము వలన కటురసము, గ్రాహి= మలమును బంధించును. వాతలం=వాతకారి. కఫపి త్త జిత్=కఫ పి త్తములను బోగొట్టును.

తాత్పర్యము ; పొట్ల, సంబరేణు, వేము, గురజ, బావంచి, తిప్పతీగె, వెదురుగొమ్మ, ములక, అడ్డసరము, కుంతలీ, బదరము, సరస్వతి యాకు, డావరడంగి, కాకర, పర్పాటకము, నాడీకలాయము, బరివెంక, క త్తిరి వంగ, కొడిశెపాల, కరీరము, చిట్టితుమికి, నంది వృక్షము, చిరుబొద్ది, కటుక రోహిణి, ఎఱ్ఱ పునర్నవ, కేంబుకము,బీర, కంపిల్లము అను నీ యిరువది యెని మిది శాకములు శీత వీర్యములు.తి క్తరసము, కటు విపాకమును గలిగియుండును. మలమును బంధించును. వాతకారి, పి త్త కఫములను శమింప జేయును.

శశిలేఖ : స_ప్తలా=సాతలా; అరిష్టః=నిమ్బః; శార్ఙ్గేష్టా=అంగార వల్లికా; అవల్గుజః=సోమరాజీ; అమృతా=గుడూచీ; వేత్రః=వంశసదృశః;

మండూకపర్ణీ=మండూకీ (సైవ ఆదిత్య వల్లీ); నాడీకలాయః=బ్రాహ్మీ (సైవ శకులాక్షః); కుచేలా=పాఠా; శకులాదనీ=కటుకా; కరిల్లః=వర్ష భూ భేదః; కశాతకం=దధిత్థమ్.

మూ॥ హృద్యం పటోలం క్రిమి నుత్ స్వాదుపాకం రుచిప్రదమ్
పిత్తలం దీపనం భేది వాతఘ్నం బృహతీ ద్వయమ్ ॥
వృషంతు వమి కాసఘ్నం రక్త పిత్త హారం పరమ్ ।
కారవేల్లం సకటుకం దీపనం కఫపిత్త జిత్ ॥
వార్తాకం కటు తిక్తోష్ణం మధురం కఫవాతజిత్ ।
సక్షార మగ్ని జననం హృద్యం రుచ్య మపిత్తలమ్ ॥
కరీర మాధ్మానకరం కషాయం స్వాదు తిక్తకమ్ ।
కోశాతకా వల్గుజకా భేది నా వగ్ని దీపనౌ ॥
శ్యామా శాల్మలికాశ్మర్యఫంజీకర్ణక యూధికాః ।
వృక్షాదనీ క్షీరి వృక్ష బింబీ తనిక వృక్షకాః ॥
లోధ్రః శాణః కర్బుదారః పశేలు ర్వృషమూషికా
భల్లాతకః కోవిదారః కమలోత్పల కింశుకమ్ ॥
పటోలాది గుణం స్వాదు కషాయం పిత్తజిత్ పరమ్ ॥

ప్రతిపదార్థము : పటోలం=పొట్ల; హృద్యం = హృదయమునకు మంచిది; క్రిమినుత్=క్రిములను బోగొట్టును; స్వాదుపాకం=పాకము వలన మధురముగ నుండును; రుచిప్రదమ్=రుచిని బుట్టించును; బృహతీ ద్వయం= ములక, వాకుడు, ఈ రెండును; పిత్తలం=పిత్తమును వృద్ధి చేయును; దీపనం= అగ్ని దీపనకారి; భెది=మలాదులను భేదించును; వాతఘ్నం=వాతమును హరించును; వృషంతు=అడ్డసరము; వమికాసఘ్నం=వమనమును, కాసమును పోగొట్టును; పరం=విశేషముగ; రక్తపిత్తహారం=రక్తపిత్తమును బోగొట్టును.

కారవేల్లం=కాకర; సకటుకం=కొంచెము కటువుగా నుండును; దీపనం =అగ్నిదీపనకారి; పరం=విశేషముగ; కఫజిత్=కఫమును జయించును.

వార్తాకం=వంకాయ; కటు=కటు రసము గలది; తిక్త=తిక్తముగ నుండును; ఉష్ణం=ఉష్ణవీర్యము గలది; మధురం=తియ్యగ నుండును; కఫ వాత జిత్=కఫవాతములను బోగొట్టును; సక్షారం=కొంచెము ఉప్పగ నుండును; అగ్నిజననం=జఠరాగ్నిని బుట్టించును; హృద్యం=హృదయమునకు హితకర మైనది; రుచ్యం=రుచిని బుట్టించును; అపిత్తలం=కొంచెము పిత్తమును కలుగ జేయును.

కరీరం=వెదురుమోవు; ఆధ్మానకరం=కడుపు నుబ్బరించును; కషాయ స్వాదుతిక్తం=రసమునందు మధురముగ తిక్తముగా నుండును.

కోశాతకావల్గుజకౌ=బీర, బావంచి ఈ రెండును, భేదకౌ=వాతాదులను భేదించును; అగ్నిదీపనౌ=అగ్ని దీపనమును కలుగజేయును.

శ్యామా=నల్లతెగడ, శాల్మలి=బూరుగ; కాశ్మర్య = గుమ్ముడు; ఫంజీ=బారంగి; కర్ణిక=చేమంతి; యూధికా=అడవిమొల్ల; వృక్షాదనీ=బదనిక; క్షీరవృక్షా = క్షీరవృక్షము (చిన్నవిప్ప); బింబీ=దొండ; తనిక=తనికము; వృశ్చికా=వృశ్చిక; లోధ్ర=లొద్దుగ; శాణః =శాణము; కర్బుదారః =కాంచనము; సశేలుః=విరిగి; వృష=అడ్డసరము; మూషికా = ఎలుక చెవి; భల్లాతకః=జీడి;కోవిదారః = ఎఱ్ఱకాంచనము; కమల =కమలము; ఉత్పల=కలువ; కింశుకమ్= మోదుగ-ఇవి; పటోలాది గుణం=పొట్ల మొదలగువానితో తుల్యమైన గుణము గలవి; స్వాదు కషాయం=మధుర కషాయముగ నుండును; పరం=విశేషముగ; పిత్తజిత్ =పిత్తమును బోగొట్టును.

తాత్పర్యము : పొట్ల హృదయమునకు మంచిది. క్రిములను బోగొట్టును. మధుర విపాకమును చెందును. నోటికి రుచిని బుట్టించు ములక, వాకుడు (బృహతీద్వయము) అను నీ రెండు శాకములును పిత్తకారి, అగ్నిదీపనమును చేయును. మలాదులను భేదించును. వాతమును హరించును. అడ్డసరము వమనమును, కాసమును హరింపజేయును. విశేషముగ రక్తపిత్తమును బోగొట్టును. కాకర కొంచెము కటు రసము గలది. అగ్నిదీపనకారి. విశేషముగ కఫపిత్తములను బోగొట్టును.

వంకాయ కటు రసము గలది. కొంచెము చేదుగనుండును. ఉష్ణవీర్యము. మధురముగ నుండును. కఫవాతములను జయించును. కొంచెము ఉప్పగనుండును. హృదయమునకు మంచిది. నోటికి రుచిని బుట్టించును. కొంచెము పిత్తకారి. వెదురు మొలక కడుపు నుబ్బరించును. కషాయ మధుర తిక్త రసములను గలిగి యుండును.

బీర, బావంచి ఈ రెండు శాకములు వాతాదులను భేదించును. అగ్నిదీపనమును గలిగించును. రూక్షముగ నుండును.

నల్లతెగడ, బూరుగ, గుమ్ముడు, బారంగి, చేమంతి, అడవిమొల్ల, బదనిక' చిన్నవిప్ప, దొండ, తనికము, వృశ్చిక, లొద్దుగ, శాణము, కాంచనము, విరిగి' అడ్డసరము, ఎలుక చెవియాకు, జీడి, ఎఱ్ఱకాంచనము, కమలము, కలువ' మోదుగ ఇవి పైజెప్పిన పొట్ల మొదలగు వానితో తుల్యగుణములుగలవి' మధురముగ, కషాయముగ నుండును. విశేషముగ పిత్తమును పోగొట్టును'

**శశిలేఖ :** శ్యామాదులు మొదలుకొని కింశుకము వరకు పటోలాదుల గుణములతో కూడియుండును. మధుర కషాయరసములను గలిగి విశేషముగా పిత్తమును జయించును. శ్యామా=త్రివృత్, ఫంజీ=భారంగి,

వృశ్చాదనీ=వన్దాకః, క్షీరవృక్షః=పతికః (సైవ కశేరుకః), బింబీ=రక్తఫలా, శేలుః=శ్లేష్మాతకః; కింశుకః=పలాశః (తస్య కుసుమ ఏవ శాకత్వం)—

మూ॥ బద్ధ మూత్రా సరా ఫంజీ కరీరం స్యాదభీరుకమ్॥
సతిక్తం లఘు చక్షుష్యం వృష్యం దోషత్రయప్రణుత్।
తండులీయో హిమో రూక్షః స్వాదు పాకరసో లఘుః॥
మదపిత్త విషాసృఘ్నో ముంజాతం వాతపిత్తజిత్।
స్నిగ్ధం శీతం గురుస్వాదు బృంహణంశుక్రకృత్పరమ్॥
పాలంక్యా పిచ్ఛిలా గుర్వీ శ్లేష్మలా భేదినీ హిమా।
మదఘ్న్యుపోదకా చంచుర్గ్రాహిణీ పూర్వవత్తథా॥
విదారీ వాతపిత్తఘ్నీ మూత్రలా స్వాదు శీతలా।
జీవనీ బృంహణీ కంఠ్యా గుర్వీ వృష్యా రసాయనీ॥
చక్షుష్యా సర్వ దోషఘ్నీ జీవన్తీ మధురా హిమా।
శాకానాం ప్రవరా న్యూనా ద్వితీయా కించిదేవతు॥
వాతపిత్త హరా ఫంజీ పర్వణీ పర్వ పుష్పికా।

*ప్రతిపదార్థము :* ఫంజీ=బ్రాహ్మణయష్టిక (గంటు భారంగి) శాకము, బద్ధమూత్రా = మూత్రమును బంధించును. సరా=(విరేచకము) శీఘ్రముగ శరీరమందంతట వ్యాపించును. అభీరుజం=శతావరీ, కరీరం=వెణుతురు పువ్వు, సతిక్తం=కొంచెము చేదుగనుండును, లఘు=లఘువుగ నుండును, చక్షుష్యం=వాజీకరము.

తండులీయః=చిర్రికూర, హిమః = చల్లనిది, రూక్షః=రూక్షము. స్వాదు పాకరసః=మధుర విపాకము, మధుర రసముగలది. లఘుః=లఘువు. మదపిత్త విషాసృఘ్నః=మదము, పిత్తం,విషము,రక్తదోషము వీనిని నశింప జేయును. ముంజాతం = ముంజాతము, వాతపిత్తజిత్ = వాతపిత్తముల నుహరింపజేయును. స్నిగ్ధం=స్నిగ్ధముగ, శీతం=శీతలముగ, గురు=గురువుగ, స్వాదు=మధురముగనుండును. బృంహణం=శరీరమునకు పుష్టినిచ్చును. పరం=విశేషముగ, శుక్రకృత్=శుక్రమును వృద్ధిచేయును.పాలంక్యా=మట్టు బచ్చలి కూర, పిచ్ఛిలా=జిగటగ నుండును. గుర్వీ=గురువుగ నుండును. శ్లేష్మలా=శ్లేష్మకారి; భేదినీ=మలాదులను భేదించును, హిమా=శీతలముగ నుండును. ఉపోదకా=దుంప బచ్చలి, మదఘ్నీ=మదమును హరించును. చంచుః=పొలముబచ్చలి, గ్రాహీ=మలమును బంధించును.

తౌ = దుంప బచ్చలి, పొలము బచ్చలి ఈ రెండును, తథా = అట్లే, పూర్వవత్=మట్టు బచ్చలితో తుల్యమైన గుణము గలవి. విదారీ=నేల గుమ్ముడు, వాతపిత్తఘ్నీ = వాతపిత్తమును హరింప జేయును. మూత్రలా = మూత్రము నధికము జేయును; స్వాదుశీతలా =

మధురముగ, శీతలముగ నుండును, జీవనీ = బలమును, బృంహణీ = శరీర పుష్టిని గలుగ జేయును. కంఠ్యా=కంఠ స్వరమునకు హితకరమైనది. గుర్వీ=గురుత్వమును జేయును. వృష్యా=శుక్రమును వృద్ధి జేయును. రసాయనీ = రసాయనముతో తుల్యమైనది. జీవంతీ=పాలకూర, చక్షుష్యా= నేత్రములకు హితమును చేయును. సర్వ దోషఘ్నీ=త్రిదోషములను హరింప జేయును. మధురా = మధురముగనుండును, హిమా=శీత వీర్యము గలది. శాకానాం=అన్ని విధములయిన శాకములలో, ప్రవరా=మిక్కిలి శ్రేష్ఠమయినది. ద్వితీయా = రెండవ పాలకూర, న్యూనా=తక్కువ గుణము గలది పంతు కించిత్=కాని తక్కువ గుణములు కలది. ఖండీ=దిరిసెనము, పర్వణీ = పర్వణీశాకము, పర్వపుష్టికా=పర్వపుష్పికాశాకము, వాతపిత్తహరా=వాతపిత్తములను హరించును.

తాత్పర్యము : గంటు భారంగి శాకము అల్ప మూత్రమును చేయును విరేచనకారి; శతావరీ, వెణుతురు పువ్వు కొంచెము చేదుగా నుండును. లఘువు నేత్రములకు మంచిది; వాజీకరము. త్రిదోషహరము. చిట్టికూర చల్లగనుండును, రూక్షము, మధుర రస, మధుర విపాకమును జెందును. లఘువు, మదము. పిత్తము, విషము. రక్తదోషములను పోగొట్టును.

ముంజాతము వాతపిత్తమును జయించును. స్నిగ్ధముగ, శీతముగ,. గురువుగ, మధురముగ నుండును. శరీరమునకు పుష్టినిచ్చును. విశేషముగ శుక్రమును వృద్ధి పరచును. మట్టు బచ్చలి కూర జిగటగ నుండును. గురువుగ నుండును. శ్లేష్మకారి. మలాదులను భేదించును, శీతలముగ నుండును.

దుంప బచ్చలి కూర మదమును హరించును.

పొలము బచ్చలి మలమును బంధించును.

దుంపబచ్చలి, పొలము బచ్చలి ఈ రెండును మట్టు బచ్చలితో తుల్య గుణము గలవి. నేల గుమ్మడు వాతపిత్తమును హరింపజేయును. మూత్రము నధికముగ జేయును, మధురముగ, శీతలముగ నుండును. బలమును, శరీరపుష్టిని గలుగజేయును. కంఠ స్వరమును బాగుపరచును. గురుత్వమును చేయును. శుక్రకరము, రసాయనముతో తుల్యమైనది.

పాలకూర నేత్రములకు మంచిది. త్రిదోషములను హరించును. మధురముగ నుండును, శీత వీర్యము గలది, అన్ని విధములయిన శాకములలో శ్రేష్ఠమైనది. తక్కిన పాలకూరలు తక్కువ గుణము గలవి.

దిరిసెనము, పర్వణీ, పర్వపుష్పికా, శాకములు, వాతపిత్తములను, హరించును.

*శశిలేఖ* : గంటు భారంగి శాకము మూత్రము నధికముగ చేయును. విరేచన కారి, శతావరీ శాకము, వెణుతు ఏ పువ్వు చేదుగా నుండును. త్రిదోష ములను నశింప జేయును.

ముంజాతః అనునది కాశ్మీర దేశముల యందు "సహోయకః" అని అందురు. భండీ = మంజిష్ఠా, పర్వపుష్పీ = నాగదంతీ అని యర్థము.

మూ॥ కూష్మాండ తుంబ కాలింగ కర్కారూర్వారు తిండిశమ్॥
తథా త్రపుస చీనాక చిర్భటం కఫ వాతకృత్।
భేదీ విష్టంభ్యభిష్యంది స్వాదుపాకరసం గురు॥

*ప్రతిపదార్థము* : కూష్మాండ = గుమ్మడు; తుంబా = సొర; కాలింగ = పుచ్చ; కర్కారు = ములుదోస; ఉర్వారు = దోస; తిండిశమ్ = తిండిశము; తథా = అట్లే; త్రపుస = దోసలో భేదము; చీనాక = చీనాకము; చిర్భటం = బుడమ (అనువాని శాకములు) కఫవాతకృత్ = కఫవాతములను చేయును; భేదీ = వాతాదులను భేదించును. విష్టంభి = మలమును గట్టిపరచును; అభిష్యంది = శ్లేష్మమును చేయును; స్వాదుపాకరసం = మధుర రసమును, మధుర విపాకమును జెందును. గురుత్వమును జేయును.

**తాత్పర్యము** : గుమ్మడు, సొర, పుచ్చ, ములుదోస, దోస, తిండిశము, త్రపుసము, చీనాకము, బుడమ అనువాని శాకములు కఫవాతములను చేయును. వాతాదులను భేదించును. మలమును గట్టిపరచును. శ్లేష్మమును జేయును. మధుర రసము, మధుర విపాకమును చెందును. గురుత్వమును చేయును.

*శశిలేఖ* : కూష్మాండాదులు, వాతశ్లేష్మములను వృద్ధిపరచును. మలాదులను భేదించును. మల బంధమును చేయును. స్రోతస్సులను స్రవింప చేయును. మధుర రసము, మధుర విపాకమును చెందును. ఉర్వారుః = కర్కటికా అని అర్థము.

**మూ॥ వల్లీ ఫలానాం ప్రవరం కూష్మాండం వాత పిత్తజిత్।**
**వస్తి శుద్ధి కరం వృష్యం త్రపుసం త్వతి మూత్రలమ్॥**
**తుంబం రూక్షతరం గ్రాహి కాలింగోర్వారు చిర్భటమ్।**
**బాలం పిత్తహరం శీతం విద్యాత్ పక్వమతోఽన్యథా॥**

*ప్రతిపదార్థము* : వల్లీ ఫలానాం = తీగెలయందు కాచెడి ఫలములలో; కూష్మాండం = గుమ్మడు; ప్రవరం = శ్రేష్ఠమైనది; వాతపిత్తజిత్ = వాతపిత్తములను జయించును; వస్తిశుద్ధికరం = వస్తిని శుద్ధిపరచును; వృష్యం = శుక్రమును వృద్ధిచేయును.

త్రపుసం = దోస; అతిమూత్రలం = విశేషముగ మూత్రమును వెడలింప జేయును; తుంబం = సొరకాయ; రూక్షతరం = మిగులరూక్షమును జేయును; గ్రాహి

= మలమును బంధించును; కాలింగ=పుచ్ఛ (కలంగిరికాయ); ఉర్వారు=దోస భేదము; చిర్భటం=బుడమ, ఇవి; బాలం=లేతవి; పిత్తహరం=పిత్తమును హరింప జేయును; శీతం=శీత వీర్యము గలవి; పక్వం=పండినవి; అతోన్యథా= విరుద్ధముగ నుండునని; విద్యాత్=తెలిసికొనవలయును.

తాత్పర్యము : తీగెల యందు కాచెడి ఫలములలో గుమ్మడు శ్రేష్ఠ మైనది. వాతపిత్తములను హరింపజేయును. వస్తిని శుద్ధి చేయును. శుక్రమును వృద్ధి పరచును. దోస విశేషముగ మూత్రమును వెడలింప జేయును.

సొరకాయ మిగుల రూక్షముగ నుండును. మలమును బంధించును. పుచ్ఛ, ఉర్వారు, బుడమ ఇవి లేతగ నుండునపుడు పిత్తమును హరింపజేయును. శీత వీర్యము గలవిగ నుండును. ఈ గుణములకంటె ముదిరినవి విరుద్ధముగ నుండును.

*శశిలేఖ* : తీగెలకు కాయు ఫలములలో కూష్మాండము శ్రేష్ఠమైనది. వాత పిత్త నాశకము. వస్తిని శోధించును, వృష్యము.

త్రపుసము అతి మూత్రలము. సొర మిక్కిలి రూక్షము. మల బంధ మునుచేయును. బాలం=అపూర్ణరసం, పక్వం=బాలాద్విపరీతం అని యర్థము.

మూ॥ శీర్ణవృంతంతు సక్షారం పిత్తలం కఫవాతజిత్।
రోచనం దీపనం హృద్య మష్ఠీలాఽఽనాహనుల్లఘుః॥

ప్రతిపదార్థము : శీర్ణవృంతం=నక్కదోస. సక్షారం=కొంచెము ఉప్పగ నుండును. పిత్తలం=పిత్తమును చేయును. కఫవాతజిత్ = కఫ వాతము లను జయించును. రోచనం=నోటికి రుచిని బుట్టించును. దీపనం=అగ్ని దీపన కారి. హృద్యం=హృదయమునకు మంచిది. అష్ఠీలానాహనుత్ = అష్ఠీలా, ఆనాహ రోగములను బోగొట్టును. లఘు=లఘువుగ నుండును.

తాత్పర్యము: నక్కదోప కొంచెము ఉప్పగనుండును.పిత్తమునుచేయును. కఫవాతములను జయించును. నోటికి రుచిని బుట్టించును. అగ్ని దీపనమును చేయును. హృదయమునకు మంచిది. అష్ఠీలా యను వాత వ్యాధిని, ఆనాహ రోగమును పోగొట్టును. లఘువుగ నుండును.

*శశిలేఖ* : శీర్ణవృన్తం -శీర్ణంవృన్తం వల్లీ బంధనస్థానం శుష్కంయస్య యత్ పాక మతిక్రమ్య వర్తతే తత్ ఈషత్ క్షారం. కొంచెము ఉప్పగానుండును. పిత్తకరము. వాతశ్లేష్మనాశకము. రుచికరము.హృద్యము.అష్ఠీలను,ఆనాహమును నశింపజేయును. లఘువు, అష్ఠీల పై ప్రకరణములలో చెప్పబడును.

మూ॥ మృణాళ బిస శాలూక శృంగాటక కశేరుకాః॥
నందీ మాషక కేలూట క్రౌంచాదన కలోద్యకమ్॥
సతరూథం కదంబంచ రూక్షం గ్రాహి హిమంగురు"—138.

*ప్రతిపదార్థము* : మృణాళ=తామర తూడు, బిస=తామర దంటు, శాలూక=తామరదుంప, శృంగాటక=పరికెగెడ్డ, కశేరుకాః = నమ్మదుంప, నందీ=నంది వర్ధనము, మాషక=మాషకము, కేలూట=అత్తిలో నొక విధము. క్రౌంచాదన=క్రౌంచాదనము. కలోద్యకమ్=తామరపూస, సతరూఢం= సతరూఢము, చ=మరియు, కదంబం=కదంబము, రూక్షం=రూక్షముగ నుండును. గ్రాహీ=మలమును బంధించును. హిమం=శీతమైన వీర్యము గలది. గురు=గురుత్వమును జేయును.

*తాత్పర్యము* : తామర తూడు, తామర దంటు, తామర దుంప, పరికె గెడ్డ, నమ్మదుంప, నందివర్ధనము, మాషకము, అత్తిలో భేదము, క్రౌంచాదనము, తామరపూస, సతరూఢము, కదంబము రూక్షముగలవి. మలమును బంధించును. శీతవీర్యముగలవి. గురుత్వకారులు.

*శశిలేఖ* : మృణాళాదులు రూక్ష గుణము గలవి. మలమును బంధించును. శీత వీర్యము. గురుత్వమును చేయును. మృణాళం=బిసాంకురము, శాలూకం= పద్మకము. కదంబః=కందవిశేషః—

మూ॥ కదంబ నాలికా కుటింజర కుతుంబకమ్॥
చిల్లీ లట్వాక నిష్పావ కురూటక గవేధుకాః।
యాతుకా సాల కల్యాణీ శ్రీపర్ణీ పీలుపర్ణికా॥
కుమారజీవ లోణీకా యవశాక సువర్చలాః
కూష్మాండ నీలినీ స్వర్సా వృకధూమక లక్ష్మణాః॥
ఆలు కానిచ సర్వాణి తథాసూ...న్యని లక్ష్మణా।
జీవన్తిక శ్చుంచుక పర్ణీ ప్రపున్నాట కుబేరకమ్॥
స్వాదురూక్షం సలవణం వాతశ్లేష్మకరం గురు।
శీతలం సృష్ట విణ్మూత్రం ప్రాయో విష్టభ్యజీర్యతి॥
స్విన్నం నిష్పీడిత రసం స్నేహాఢ్యం నాతి దోషలమ్।—143

*ప్రతిపదార్థము* : కదంబ=కడిమి; నాలికా=తూడి; కుటింజర=ఎఱ్ఱని ముల్లంగి; కుతుంబకం=తుమ్మియాకు; చిల్లీ=పెద్దాకులు కల యవశాకము (చిలుక కూర); లట్వాక=గుగ్గులుకమను శాకము; నిష్పావ=అనపాకు; కురూటక=స్థితి వారకమను శాకము; గవేధుకాః=అడవి గోధూమ శాకము; యాతుకా=ముయ్యాకు పొన్న (తెల్లనిది), సాలకల్యాణీ=సీమ పొన్నగంటి; శ్రీపర్ణి=పెగ్గుమ్మడు: పీలుపర్ణికా=హంసపాదియాకు; కుమారజీవ=పుత్ర జీవికూర; లోణీకా = తోటకూరలో భేదము; యవశాక = యవశాకము; సువర్చలాః=ప్రొద్దు తిరుగుడు చెట్టాకు; కూష్మాండ=పెద్ద గుమ్మడి; నీలినీ= నీలినీయాకు; స్వర్సా=స్వర్స; వృకధూమకాః=నేలదిరిసెనము; లక్ష్మణా= లక్ష్మణ శాకము; సర్వాది ఆలుకాని=ఉర్లగడ్డలు, పెండలము, కర్ర పెండలము

చిరుగడ దుంపలు మున్నగునవి; తథా=అల్లే; సూప్యాని=సూప్య శాకములు (పెసర, మినప మున్నగు వాని యాకు కూరలు), లక్ష్మణా=అతిమధురపు ఆకుకూర, ఇవి యన్నియు; స్వాదు = మధురములు; రూక్షః= రూక్ష గుణములు గలవి; సలవణం = ఉప్పగ నుండును; వాతశ్లేష్మ-కరం=వాతశ్లేష్మమును చేయును; గురు=గురుత్వము గలవి; శీతలం=శీత వీర్యము గలవి; సృష్టవిణ్మూత్రం=మలమూత్రముల నధికముగ వెడలించును; ప్రాయః = తరచుగా; విష్టభ్యజీర్యతి=ఉదరమునందు ఉండకట్టి; పిదప జీర్ణమగును; స్విన్నం=వీని నన్నింటిని పాకముచేసి; నిష్పీడితరసం=యందలి రసమును దీసివేసి; స్నేహాఢ్యం=దండిగ నూనెను జేర్చి, సంస్కారము చేసినచో (తిరగమాత బెట్టినచో), నాతి దోషలమ్=పథ్యకరము (దోషములను సమ స్థితిలో నుంచును).

తాత్పర్యము : కడిమి, తూడి, ఎఱ్ఱని ముల్లంగి (పసుగు తుమ్మి) ఆకు, పెద్దాకులు గల యవశాకము (చిలుక కూర), గుగ్గులుక మను శాకము, ఆనపాకు, స్థితివారకమను శాకము, అడవి గోధుమ శాకము, ముయ్యాకుపొన్న (తెల్లనిది), సీమ పొన్నగంటి, పెగ్గుమ్మడు, హంసపాది యాకు, పుత్రజీవికూర, తోటకూరలో భేదము, యవశాకము, ప్రొద్దుతిరుగుడు చెట్టాకు, పెద్దగుమ్మడి, నీలినీ యాకు, స్వర్ణ, నేలదిరిసెనము, లక్ష్మణశాకము, ఉర్లగడ్డలు, పెండలము, క్రపెండలము, చిరుగడ రుంపలు మొ॥ అల్లే సూప్యశాకములు (పెసర, మినుము మున్నగువాని శాకములు), అతి మధురపు ఆకుకూర, ఇవి యన్నియు మధురములు, రూక్ష గుణములు గలవి. కొంచెము ఉప్పగ నుండును. వాత శ్లేష్మమును వృద్ధి చేయును. గురుత్వము గలవి. శీతవీర్యము మల మూత్రముల నధికముగ వెడలించును. తరచుగా ఉదరమునందు ఉండకట్టి పిదప జీర్ణమగును. ఈ శాకములను మొదట పాకము చేసిఉడికిన తరువాత, దాని యందలి నీరును, రసమును బాగుగా పిండి తరువాత పోపు పెట్టి తినిన యెడల దోషములను సమస్థితిలో నుంచును.

**శశిలేఖ :** కదంబాది శాకములు మధుర రసము గలవి. కొంచెము ఉప్పగ నుండును. రూక్షతను గలిగించును, వాత శ్లేష్మములను వృద్ధి చేయును. గురువు శీతవీర్యము. మూత్రమును పురీషమును వెలుపలికి నెట్టును ఈ శాకములు అన్న నాళికద్వారా లోనికి ప్రవేశించి జఠరము నందు ఒక. భాగములో పిండాకృతిని దాల్చి తరువాత జీర్ణమగును. ఈ చెప్పిన శాకములు నిఘంటుజ్ఞానము వలన, దేశభాషల వలన, సంస్కారాది విశేషముల చేత తెలుసుకొన వలయును.

**మూ॥** లఘు పత్రాతు యా చిల్లీ సా వాస్తుకసమా మతా।
తర్కారీ వరణం స్వాదు సతిక్తం కఫవాతజిత్॥

వర్షాభ్వే కారశాకంచ సక్షారం కటుతిక్తకమ్।
దీపనం భేదనం హన్తి గరశోఫ కఫానిలాన్॥
దీపనాః కఫ వాతఘ్నాశ్చిరి బిల్వాంకురాస్సరాః॥

ప్రతిపదార్థము : లఘు పత్రా = లఘు పత్రములుగల, యాచిల్లీ = పైజెప్పిన చిల్లియను శాకవిశేషము, వాస్తుక సమా=చక్రవర్తి కూరతో తుల్యమైన గుణములు గలదిగా, మతా = తెలియ దగినది. తర్కారి = తక్కలి, వరణం=ఉలిమిరి (ఈ రెండు శాకములును), స్వాదు = మధుర రసము గలవి. సతిక్తం=కొంచెము చేదుగ నుండును. కఫ వాతజిత్=కఫ వాతములను హరింప జేయును. వర్షాభ్వే=కలిజేరు (తెల్లని, ఎఱ్ఱని కలిజేరు), కారశాకం=కరివేప, సక్షారం=కొంచెముగ చేదుగ నుండును. దీపనం=అగ్ని దీపనకారి, భేదనం= మలాదులను భేదించును. గరశోఫ కఫానిలాన్ = విషము, శోఫ, కఫము, వాతములను, హంతి=నశింప చేయును. చిరిబిల్వాంకురాః = కానుగు చిగుళ్ళు, దీపనాః = అగ్ని దీపనమును చేయును. కఫ వాతఘ్నాః = కఫ వాతములను బోగొట్టును. సరాః=మలాదులను సడలించును.

తాత్పర్యము : లఘు పత్రములు గల పైజెప్పిన చిల్లి యను యవ శాక విశేషము చక్రవర్తి కూరతో సమానమైన గుణములు గలదిగ నుండును. తక్కలి, ఉలిమిరి, ఈ రెండు శాకములును మధురముగ నుండును. కొంచెము చేదుగ నుండి కఫవాతములను హరించును. రెండు విధములయిన గలిజేరు (తెల్లనిది, ఎఱ్ఱనిది), కరివేప కొంచెము ఉప్పగ, కారముగ, చేదుగ నుండును. అగ్ని దీపనమును గలుగ జేయును. మలాదులను భేదించును. విషము, శోఫ, కఫము, వాతము వీనిని హరింప జేయును. కానుగ చిగుళ్ళు అగ్ని దీపనమును గలుగ జేయును. కఫవాతములను బోగొట్టును. మలాదులను భేదించును.

శశిలేఖ : తర్కారీ=అగ్ని మన్థః, చిరిబిల్వాంకురములు అగ్ని దీపనములు, వాత శ్లేష్మములను నశింప జేయును; మలాదులను సడలించును.

మూ॥ లఘురుష్ణా సరా తిక్తా సోరు పూకా చలాంగలీ।
వాతలా కటు తిక్తామ్లా భే.నా తిలవేతసా॥
తద్వత్ వంచాంగులో వంశకరీరాస్తు విదాహినః।
వాత పిత్తకరా రూక్షాః కటు పాకాః కఫాపహాః॥

ప్రతిపదార్థము : ఊరు పూకా=ఎఱ్ఱాముదపు ఆకు, లాంగలీ=లాంగలి, లఘుః=లఘు గుణము గలవి, ఉష్ణా = ఉష్ణ వీర్యము గలవి. సరా=మలాదులను బయటికి నెట్టును. తిక్తా = చేదు రసముగలవి. తిలవేతసా=నువ్వు, నీరుప్రబ్బలి, ఈ రెండు శాకములును, వాతలా = వాతమును వృద్ధి చేయును. కటు తిక్తామ్లా=కారము, చేదు, పులుపు రసములను గల్గియుండును, భేదినే=మలాదు

లను భేదించును, పంచాంగులః=చిట్టాముదపాకు (శుక్లైరండము), తద్వత్=తిల వేతస గుణములనే కలిగి యుండును. వంశ కరీరాస్తు=వెదురు మొలకలు, విదాహినః=విదాహమును చేయును. వాతపిత్తకరాః=వాత పిత్తములను వృద్ధి నందించును. రూక్షాః=రూక్షములు, కటు పాకాః=కటు విపాకమునుచెందును. కఫాపహాః=కఫమును నశింప చేయును.

తాత్పర్యము : ఎఱ్ఱాముదపాకు, లాంగలి, లఘు గుణము గలవి. ఉష్ణ వీర్యములు. మలాదులను బహిర్గతము చేయును. చేదు రసము గలవి. నువ్వు, నీరుప్రబ్బలి ఈ రెండు శాకములును వాతమును వృద్ధి చేయును. కారము, చేదు, పులుపు రసములను గలిగి యుండును. మలాదులను భేదించును. శుక్లై. రండము తిల వేతస గుణములనే గలిగి యుండును. వెదురు మొలకలు విదాహమును చేయును. వాత పిత్తములను వృద్ధి నందించును. రూక్ష గుణము గలది. కటు విపాకమును జెందును. కఫమును నశింప జేయును.

శశిలేఖ : ఊరు పూకం = రక్తైరండః, లాంగలీ = ఇన్ద్రపుష్పికా, పంచాంగులః=శుక్లైరండః, వంశకరీరాః=వంశాంకురాః,

మూ॥ బిల్వ రాస్నా బలాశాకం వాతఘ్న మతిసార జిత్।
వాయుం వత్సాదనీ హన్యాత్ కఫం గండీర చిత్రకౌ॥
పత్తూరో దీపన స్తిక్తః ప్లీహార్శః కఫవాతజిత్।

ప్రతిపదార్థము : బిల్వ=మారేడు దళములు, రాస్నా = రాస్నా, బలాశాకం=చిట్టాముట్టి ఆకులు, వాతఘ్నం = వాతమును నశింప జేయును, అతిసారజిత్=అతిసారమును జయించును, వత్సాదనీ = తిప్ప తీగె ఆకుకూర, వాయుం=వాతమును, హన్యాత్=హరించును. గండీర చిత్రకౌ=గండీర (ఏటి వంగ, గురుజ) కూర, చిత్ర మూలవు కూర, ఈ రెండును, కఫం=కఫమును, హన్యాత్ =హరించును, పత్తూరః=పొన్నగంటికూర, దీపనః=అగ్ని దీపనమును చేయును, తిక్తః=తిక్త రసము గలది, ప్లీహార్శః కఫవాతజిత్ = ప్లీహము, అర్శస్సు, కఫవాతములు వీనిని హరించును.

తాత్పర్యము : మారేడు దళములు, రాస్నా, చిట్టా ముట్టి ఆకులు, వాతమును నశింపజేయును. అతిసారమును బోగొట్టును. గండీర శాకము, చిత్రమూల శాకము ఈ రెండును కఫమును హరించును. పొన్నగంటి కూర అగ్ని దీపనమును చేయును. తిక్తరసము గలది. ప్లీహము, అర్శస్సు కఫవాతములు వీనిని హరించును.

శశిలేఖ : బిల్వాది శాక త్రయము, వాతమును నశింప జేయును. అతిసారమును బోగొట్టును. తిప్ప తీగె ఆకుకూర వాతమును నశింప జేయును, వత్సాదనీ=కచేయకః,

మూ॥ క్రిమి కాస కఫోత్క్లేదాన్ కాసమర్దో జయేత్ సరః।
రూక్షోష్ణమమ్లం కౌసుమ్భం గురుపిత్తకరం సరం।
సక్షారం మధురం స్నిగ్ధ ముష్ణం గురుచ సార్షపం॥
శాకానా మవరం బద్ధ విణ్మూత్రం సర్వదోషకృత్॥ -151.

*ప్రతిపదార్థము* : కాసమర్దః=కసివెంద, సరః = శరీరము నందు శీఘ్రముగ వ్యాపించును. క్రిమికాస కఫోత్క్లేదాన్ = క్రిములు, కాసము, కఫము, ఉత్క్లేదము, వీనిని, జయేత్=హరించును. (ఉత్క్లేదమనగా స్రోతస్సులు మాలిన్యముచే తడిసి యుండుట), కౌసుమ్భః=కుసుమకూర,రూక్షోష్ణం=రూక్షముగ, ఉష్ణవీర్యము గలదిగ, అమ్లం=పుల్లగ, గురు=గురువుగ నుండును,పిత్తకరం= పి**త్తమును** జేయును. సరమ్=మలాదులను భేదించును. సార్షపం = ఆవకూర, సక్షారం=కొంచము ఉప్పగ, మధురం=తియ్యగ, స్నిగ్ధం=జిగటగ, ఉష్ణం=ఉష్ణముగ, గురు=గురువుగ నుండును. శాకానాం=ఆకుకూరలలో అవరం=శ్రేష్ఠమైనది కాదు. బద్ధ విణ్మూత్రం = మూత్రమును, మలమును బంధించును. సర్వదోషకృత్=త్రిదోషములను వృద్ధి చేయును.

*ప్రతిపదార్థము* : కసివెంద, శరీర మంతట శీఘ్రముగ వ్యాపించును. క్రిములు, కాసము, ఉత్క్లేశము, వీనిని హరింప జేయును. కుసుమ కూర రూక్షముగ నుండును. ఉష్ణవీర్యము. పుల్లగ, గురువుగ నుండును. పిత్తమును చేయును. మలాదులను భేదించును.

*శశిలేఖ* : కసివెంద ఆకుకూర సరగుణము కలది. క్రిమ్యాదులను నశింప జేయును. ఉత్క్లేశః = స్రోతసామాలిన్యే నార్ద్రీత్వమ్ (అనగా స్రోతస్సులు మాలిన్యముచేత తడిసి యుండుట). కుసుమకూర రూక్షముగ నుండును. ఉష్ణవీర్యము. గురువు, పిత్తమును వృద్ధి చేయును. మలాదులను భేదించును.

మూ॥ యద్బాల మవ్యక్త రసం కించిత్ క్షారం సతిక్తకమ్ ।
తన్మూలకం దోషహరం లఘుసోష్ణం నియచ్ఛతి॥
గుల్మ కాస క్షయ శ్వాస వ్రణనేత్ర గళామయాన్ ।
స్వరాగ్ని సాదో దావర్త పీనసాంశ్చ

*ప్రతిపదార్థము* : అవ్యక్త రసం=రసము తెలియని; కించిత్ క్షారం= కొంచెముప్పుగానున్న; సతిక్తకమ్=కొంచెము చేదుగా నున్న; యత్=ఏ; బాలం మూలకం=లేత వయస్సుగల ముల్లంగియో; తన్మూలకం=ఆ లేత ముల్లంగి; దోషహరం=త్రిదోషములను హరించును; లఘు=లఘువుగ; సోష్ణమ్= కొంచెము ఉష్ణముగ నుండును; గుల్మ—పీనసాన్ = గుల్మ=గుల్మము; కాస= దగ్గు; క్షయ = ధాతు క్షయము; శ్వాస=ఉబ్బసము; వ్రణ=వ్రణము; నేత్ర గళామయాన్ = నేత్ర రోగము, గళ రోగములను; స్వర=స్వరహీనత; అగ్ని

సాద=అగ్ని మాంద్యము; ఉదావర్త=ఉదావర్తము; పీనసాన్=పీనసములను; నియచ్ఛతి=హరించును.

తాత్పర్యము : రసము దెలియక కొంచెము ఉప్పగ చేదుగ నుండు లేత ముల్లంగి, దోషములను హరింప జేయును. లఘువుగ, కించిదుష్ణముగ నుండును. గుల్మము, కాసము, ధాతుక్షయము, శ్వాసము, వ్రణము, నేత్రరోగము, గళ రోగము, స్వరహీనత, అగ్నిమాంద్యత, ఉదావర్తము, పీనసము మున్నగు రోగములను హరించును.

శశిలేఖ : లేత ముల్లంగి త్రిదోష నాశకము. లఘువు. కొంచెము ఉష్ణ వీర్యము. గుల్మాదులను నశింపజేయును. తథాచ బాల మూలకస్య కంద మూలక, బీజ, దేశకాల సంస్థాన పరిణతి విశేషాద్భిన్నజాతీయత్వం ప్రసిద్ధః మేవ కాశ్మీరేషు.

మూ॥ మహత్పునః
గురూష్ణ కటుకం స్వాదు విపాకం సర్వదోష కృత్ ।
గుర్వభిష్యందిచ స్నిగ్ధ సిద్ధం తదపివాతజిత్ ॥
వాతశ్లేష్మ హరం శుష్కం సర్వ మామంతు దోషలమ్ ।

ప్రతిపదార్థము : పునః=మరల; మహత్=ముదిరిన ముల్లంగి; గురు=గురుత్వమును చేయును; ఉష్ణ=ఉష్ణవీర్యము; కటుకం=కారము; స్వాదు విపాకం=మధుర విపాకమును చెందును; సర్వదోషకృత్=త్రిదోషములను జేయును; స్నిగ్ధస్విన్నం తదపి=ఉడక బెట్టివార్చి,పోపువేసిన ముల్లంగిగూడ; గురు=గురువు; అభిష్యంది=అభిష్యందము; శుష్కం=కొంచెము ముదిరినది; వాతశ్లేష్మహరం=వాతశ్లేష్మములను హరించును; సర్వమామంతు=అనగ్ని దగ్ధమైన సమస్తమైన ముల్లంగియయితే; దోషలం=త్రిదోషములను వృద్ధినొందించును.

తాత్పర్యము : పెద్ద ముల్లంగి రూక్షము. ఉష్ణ వీర్యము కటురసము. మధుర విపాకము. త్రిదోషములను వృద్ధి చేయును. గురువు అభిష్యందము. ఈ పెద్ద ముల్లంగియే నెయ్యి, మాంసరసము మొ॥ వాటితో బాగుగా శాకము చేసిన యెడల వాతమును జయించును. చిన్న పెద్ద ఎండిన ముల్లంగి వాత కఫ ములను చేయును. పచ్చగా సున్నదాని ఆకులతో కలిపి భుజించిన మూడు దోషములను వృద్ధిచేయును.

శశిలేఖ : ఆమం=అనగ్ని పక్వం అని యర్థము.

మూ॥ కటూష్ణో వాత కఫహా పిండాలుః పిత్తవర్ధనః ।
కుఠేర శిగ్రు సురస సుముఖా సురి భూస్తృణాః ॥
ధాన్య తుంబురు శైలేయ యవానీ శృంగి బేరకాః ।
పర్ణాసో గృంజనోఽ జాజీ జీరకం గజపిప్పలీ ॥

ఫణిజ్ఝార్జక జంబీర ఖరాశ్వా కాలమాలికాః ।
దీప్యకః క్షవకృద్ద్వీపి బస్తగంధాది బద్ధ విట్ ॥
రసే పాకేచ కటుకం దోషోత్క్లేశకరం లఘు ।
విదాహి రూక్ష తీక్ష్ణోష్ణం దృక్ శుక్ల క్రిమినాశనమ్ ॥
వర్గో హారిత కాఖ్యోఽయ ముపదంశేషు యుజ్యతే ॥
వాసనో వ్యంజనానాంచ హృద్యో దీపన రోచనః ॥

ప్రతిపదార్థము : పిండాలుః = పెండలము, కటు = కటువైన రసము ఉష్ణః = ఉష్ణవీర్యము గలదిగ నుండును. వాతకఫహా = వాత కఫములను హరించును. పిత్తవర్ధనః = పిత్తమును వృద్ధి చేయును. కుతేర నల్ల గగ్గెర, శిగ్రు = మునగ, సురస = నల్లతులసి, సుముఖా = అడవిగగ్గెర, ఆసురి = నల్లావాల కూర, భూస్తృణాః = కామంచి పూరి, ధాన్యా = ధనియాలు, తుంబురు = తుంబురులు, శైలేయ = పిన్నిసదాప, యవానీ = అజామోదము, శృంగిబేరకాః = అల్లము, పర్ణాసః = గగ్గెర, గృంజనః = వెల్లుల్లి, అజాజీ = నల్ల జీలకర్ర, జీరకం = జిలకర, గజపిప్పలీ = ఏనుగుపిప్పళ్ళు, ఫణిజ్జ = ఫణిజ్జము, అర్జక = తులసీ భేదము, జంబీర = జంబీరము. ఖరాశ్వా = పెగ్గుమ్ముడు, కాలమాలికాః = నల్ల గగ్గెర, దీప్యకః = ఓమము, క్షమకృత్ = పోకపండు, ద్వీపీ = చిత్ర మూలము, బస్తగంధాది = కుక్కవాయింట మొ॥. బద్ధవిట్ = మలమును బంధించును, రసేపాకేచకటుకం = కటురసము, కటుపాకము గలది, దోషోత్క్లేశకరం = దోషముల చేత స్రోతస్సులు తడిసి యుండుట, లఘు = లఘువుగ నుడుంను, విదాహి = విదాహకరము, రూక్ష = రూక్షము. తీక్ష్ణ = తీక్ష్ణము, ఉష్ణం = ఉష్ణవీర్యముగలది, దృక్ = దృష్టి, శుక్ల = శుక్రము, క్రిమినాశనమ్ = క్రిములను నశింపజేయును, అయం హారితకాఖ్య వర్గః = ఈహారితక మను పేరుగల వర్గము, ఉపదంశేషు = ఉపదంశములలో (పొడికూరలలో), యుజ్యతే = ఉపయోగింప బడుచున్నది, వ్యంజనానాం = వ్యంజనములలో, వాసనః = పరిమళమైనది, హృద్యః = హృదయమునకు మంచిది, దీపనః = అగ్ని దీపనమును చేయును, రోచనః = నోటికి రుచిని బుట్టించును.

తాత్పర్యము : పెండలము కటురసము గలది. ఉష్ణవీర్యము. వాతకఫములను హరించును. పిత్తమును వృద్ధిచేయును.

నల్లగగ్గెర, మునగ, నల్లతులసి, అడవి గగ్గెర, నల్లావాలకూర, కామంచిపూరి, ధనియాలు, తుంబురులు, పిన్నసదాప, అజామోదము, అల్లము, గగ్గెర, వెల్లుల్లి, నల్లజీలకఱ్ఱ, జీలకఱ్ఱ, ఏనుగు పిప్పళ్ళు, ఫణిజ్జము, తులసీ భేదము, జంబీరము, పెగ్గుమ్ముడు, నల్ల గగ్గెర, ఓమము, పోకపండు, చిత్రమూలము, కుక్కవాయింట మొదలగునవి-ఇట్టివే ఇతరములైన పచ్చని ద్రవ్యములు మల బంధమును చేయును. కటురసము, కటు విపాకము. వాతాది దోషములను స్వస్థానము

నుండి కదల్చి ప్రకోపింప జేయును. లఘువు. రూక్షము. తీక్ష్ణము. ఉష్ణము దృష్టిని, శుక్రమును, కృములను నశింపజేయును. ఈ హరిత వర్గము ఉపదంశములలో ఉపయోగింపబడుచున్నది. భోజనములో ఈకూరలను వ్యంజన రూపముగా గాని, పచ్చడి రూపముగాగాని తయారు చేసుకొన వచ్చును. మరియు ఈ కూరలు హృద్యములు. జాఠరాగ్నిని వృద్ధి చేయును. నోటికి రుచిని కలిగించును.

*శశిలేఖ* : కుఠేరకః=వైకుంఠకః, (నల్లగగ్గెర, శిగ్రుః=సౌభాంజనమ్; సుముఖః = మరువము, ఆసురీ=రాజికా, ఫణిర్జకం = ఫణీ, అర్జకః = జాత్యా సూక్ష్మపత్రకః, జమ్బీరః=ఖరపత్రః, కాశ్మీరేషు తుంబురుః, ఖరాహ్వా =హస్తిమయూరః, కాలమాలః=కృష్ణకుఠేరకమ్, దీప్యకః=అజమోదః.

మూ॥ హిధ్మా కాస విషశ్వాస పార్శ్వరుక్పూతి గన్ధహా,
సురసః సుముఖః శోఫగన్ధహా ధానకాపునః।
కషాయ తిక్త మధురా మూత్రలానచ పిత్తకృత్
ఖరాహ్వా బస్తిశూలఘ్నీ చిత్రకో దీపనఃపరమ్॥

*ప్రతిపదార్థము* : సురసః=నల్ల తులసి, హిధ్మా=ఎక్కిళ్ళను, కాస= దగ్గును, శ్రమ=బడలికను, శ్వాస = ఉబ్బసమును, పార్శ్వరుక = పార్శ్వ శూలను, పూతి గన్ధహా=దుర్గంధమును హరింప జేయును.

సుముఖః=అడవి గగ్గెర, శోఫగన్ధహా=వాపును, దుర్గంధమును నశింప జేయును, పునః=మరియు,, ధానికా = ధనియాలు,కషాయ తిక్తమధురా= వగరు, చేదు, తీపి రసములు కలది. మూత్రలా=మూత్రమును వృద్ధిచేయును. నచపిత్తకృత్=కాని పిత్తమును వృద్ధిచేయదు; ఖరాహ్వా = ఓమము, బస్తి శూలఘ్ని, పొత్తికడుపు నొప్పిని పోగొట్టును. చిత్రకః=చిత్రమూలము, పరః=మిక్కుటముగా, దీపనః=జాఠరాగ్నిని వృద్ధిపరచును.

తాత్పర్యము : నల్లతులసి ఎక్కిళ్ళను, కాసమును, శ్రమను, శ్వాసమును, పార్శ్వశూలను, దుర్గంధమును హరింపజేయును. అడవి గగ్గెర, శోఫమును, గన్ధమును నశింపజేయును. ధనియాలు కషాయ తిక్త మధుర రసములు కలవి. మూత్రము నధికముగా వెడల నిచ్చును. పిత్తమును వృద్ధిచేయదు. ఓమము పొత్తి కడుపు నొప్పిని పోగొట్టును. చిత్రమూలము మిక్కుటముగా అగ్ని దీపనమును చేయును.

*శశిలేఖ* : విశేషములేదు.

మూ॥ పత్రే సక్షార మధురో మధ్యే మధుర పిచ్ఛిలః।
తీక్ష్ణోష్ణో లశునః కన్దే కటుపాకరసః సరః॥
హృద్యః కేశ్యోగురుర్వృష్యః స్నిగ్ధో రోచన దీపనః।

భగసంధానకృత్ బల్యో రక్తపిత్తప్రదూషణః ॥
కిలాసకుష్ఠ గుల్మార్శో మేహక్రిమి కఫానిలాన్ ।
సహిధ్మాపీనస శ్వాస కాసాన్ హన్తి రసాయనమ్ ॥

ప్రతిపదార్థము : లశునఃపత్రే=వెల్లుల్లి యొక్క ఆకు; సక్షార మధురః= కొంచెము ఉప్పగా, మధురముగా నుండును; మధ్యే=దాని మధ్య భాగము; మధుర పిచ్ఛిలః=మధురముగా, పిచ్ఛిలముగా నుండును; కన్దే=దానిగడ్డ; కటుకపాకరసః=కటు రసమును, కటువిపాకమును జెందును; తీక్ష్ణోష్ణః=తీక్ష్ణము, ఉష్ణ వీర్యమైనది; సరః=మలమును ప్రవర్తింపచేయును; హృద్యః=హృదయ మునకు మంచిది; కేశ్యః=వెంట్రుకలకు మంచిది; గురుః=గురువు; వృష్యః= వాజీకరము; స్నిగ్ధః=జిగట గలది; దీపనః=అగ్ని దీపకము; పాచనః=ఆహార మును పచింప చేయును; భగ్న సంధాన కృత్=విరిగిన ఎముకలను ఒకటిగ జేర్చును; బల్యః=బలకరము; రక్తపిత్త ప్రదూషకః=రక్తపిత్తమును మిక్కిలి దూషించును; కిలాసకుష్ఠః=శ్విత్ర కుష్ఠమును; గుల్మ=గుల్మమును; అర్శ= మొలలను, మేహ=ప్రమేహమును; క్రిమి=కృములను; కఫానిలాన్=కఫ మును, వాతమును; సహిధ్మా=కొంచెము ఎక్కిళ్ళను; పీనస=పడిశమును; శ్వాస=ఉబ్బసమును; కాసాన్=దగ్గులను; హంతి=హరింప జేయుచున్నది; రసాయనమ్=రసాయనము.

తాత్పర్యము : వెల్లుల్లి యొక్క ఆకులు కొంచెము ఉప్పగా, మధుర ముగా నుండును. వెల్లుల్లి యొక్క మధ్యభాగము మధురరసముగా మరియు పిచ్ఛిలముగా నుండును. వెల్లుల్లియొక్క గడ్డ తీక్ష్ణమును, ఉష్ణవీర్యము గలది, కటురసమును, కటువిపాకమును చెందును, సరము, హృద్యము, కేశ్యము, వృష్యము, స్నిగ్ధము, దీపనము, పాచనము, విరిగిన ఎముకల నొకటి చేయును. బలకారకము. రక్తపిత్తప్రదూషకము. శ్విత్రము, కుష్ఠము, గుల్మము, అర్శస్సు, ప్రమేహము, క్రిమి, కఫము, వాతము, ఎక్కిళ్ళు, పడిశము, ఉబ్బసము, దగ్గు ఈ వ్యాధులను పోగొట్టును. మరియు రసాయనముగా నుండును.

శశిలేఖ : ఇది రసాయనమువలె శరీరమునకు హితకరమైనది.

మూ॥ పలాండు స్తద్గుణైర్న్యూనో విపాకే మధురస్తుసః ।
కఫం కరోతి నో పిత్తం కేవలానిల నాశనః ॥

ప్రతిపదార్థము : పలాండుః=నీరుల్లి; తద్గుణైః=వెల్లుల్లి యొక్క గుణ ములతో; న్యూనః=హీన గుణము కలది; విపాకే=విపాకమునందు; మధురః= మధురముగా మారును; సః=ఆనీరుల్లి; కఫం కరోతి=శ్లేష్మమును జేయును; నోపిత్తం=పిత్తమును స్వల్పముగ జేయును; కేవలానిల నాశనః=కేవల వాత మును నశింప జేయును.

**తాత్పర్యము :** నీరుల్లి, వెల్లుల్లి కంటె కొంచెము హీన గుణము కలదిగా నుండును. శ్లేష్మమును చేయును. స్వల్పముగ పిత్తమును చేయును. కేవల వాతమును నశింపచేయును.

**శశిలేఖ :** సంసర్గ, సన్నిపాతములు కాని కేవల వాతమును నశింప జేయును.

**మూ॥** దీపనః సూరణో రుచ్యః కఫఘ్నో విశదో లఘుః ।
విశేషాదర్శసాం పథ్యః భూకన్ద స్వతి దోషలః ॥

*ప్రతిపదార్థము :* సూరణః=కంద; దీపనః=అగ్ని దీపనమును చేయును: రుచ్యః=రుచికరమైనది; కఫఘ్నః=శ్లేష్మమును బోగొట్టును; విశదః=శరీర మును శుద్ధి పరచును; లఘుః=లఘువుగ నుండును; విశేషాత్=విశేషముగ; అర్శసాం=అర్శస్సులకు; పథ్యః=పథ్యకరమైనది: భూకన్దః=పుట్ట గొడుగు; అతి దోషలః=మిగుల దోషకరమైనది.

**తాత్పర్యము :** కంద అగ్ని దీపనమును చేయును. రుచికరమైనది. శ్లేష్మమును బోగొట్టును. శరీరమును శుద్ధిపరచును. లఘువుగ నుండును. విశేషముగ అర్శస్సులకు పథ్యమైనది. పుట్టగొడుగు మిగుల దోషకరమైనది.

**శశిలేఖ :** కంద జాఠరాగ్నిని వృద్ధి చేయును. నోటికి రుచిని పుట్టించును. భూకన్దః=ప్రసిద్ధః_

**మూ॥** పత్రే పుష్పే, ఫలేనాళే కన్దేచ గురుతాక్రమాత్।
వరాశాకే షు జీవన్తీ సార్షపా స్త్వవరాః పరమ్॥

## ఇతిశాక వర్గః

*ప్రతిపదార్థము :* పత్రే=పత్ర శాకములు (ఆకు కూరలు), పుష్పే= పుష్పశాకము, (పూలలో నుండి పుట్టిన కూరలు), ఫలే=ఫలశాకము (కాయ కూరలు) నాళే=నాళశాకము (కాడ కూరలు), చ=మరియు, కన్దే = కన్దశాకము (గడ్డలు కలకూరలు), ఇతిక్రమాత్ = క్రమముగ ఒక దాని కంటె నొకటి, గురుతా=గురువుగనుండును, శాకేషు=శాకములలో. జీవన్తీ= పాలకూర, వరా =శ్రేష్ఠమైనది. సార్షపాః=ఆవ కూర, పరం=మిక్కుటముగ, అవరాః =నింద్యమైనది. ఇతి=అని; శాకవర్గః=శాకవర్గము.

**తాత్పర్యము :** ఆకు కూరలు, పూలలో నుండి పుట్టిన కూరలు, కాయ కూరలు, గడ్డలు, గల కూరలు, ఇవి క్రమముగ నొకదాని కంటె నొకటి మిగుల గురువుగ నుండును.

**శశిలేఖ :** పత్ర శాకము కంటె పుష్పశాకము, దాని కంటె ఫలశాకము, దాని కంటె నాళశాకము, దాని కంటె కందశాకము, మిగుల గురువుగ

సుండును. హరితక శాకముల పేర్లు చెప్పక పోయిననూ, అజ్ఞాతముగ నున్నను దేశ, భాషా, పండితుల చేత గ్రహింపవలెను. అని శాక వర్గము

మూ॥ ద్రాక్షా ఫలోత్తమా వృష్యా చక్షుష్యా సృష్ట మూత్రవిట్
స్వాదు పాక రసా స్నిగ్ధా సకషాయా హిమాగురుః॥
నిహన్త్యనిల పిత్తాస్ర తిక్తాస్య త్వమదాత్యయాన్।
తృష్ణా కాస జ్వర శ్వాసస్వర భేదక్షతక్షయాన్॥
ఉద్రిక్తపిత్తాన్ జయంతి త్రిదోషాన్ స్వాదు దాడి మమ్।
పిత్తా విరోధి నాత్యుష్ణ మమ్లం వాత కఫా పహమ్॥

ప్రతిపదార్థము :- ద్రాక్షా=ద్రాక్ష; ఫలోత్తమా = అన్ని ఫలములలో శ్రేష్ఠమైనది, వృష్యా=శుక్రమును వృద్ధి చేయును, చక్షుష్యా = నేత్రములకు హితకరమైనది. సృష్ట మూత్రవిట్ =మూత్రమును, మలమును వెడలించును; స్వాదుపాక రసా = మధుర రసము, మధుర విపాకము గలది; స్నిగ్ధా = స్నిగ్ధముగను; సకషాయ=కొంచెము వగరుగ నుండును; హిమా=శీతవీర్యము; గురుః = గురుత్వముగ నుండును; అనిల క్షతక్షయాన్ - అనిల = వాతమును; పిత్తాస్ర=రక్త పిత్తమును, తిక్తాస్యత్వ = నోటి చేదును; మదాత్యయాన్ = మదాత్యయములను; తృష్ణా=దప్పిని; కాస=దగ్గును; జ్వర = జ్వరమును; శ్వాస=ఉబ్బసమును; స్వరభేద=స్వర భేదమును; క్షతక్షయమ్ = క్షతక్షయ మును; (ఈ వ్యాధులను) నిహన్తి=నశింప జేయును.

స్వాదు దాడిమమ్=తియ్య దానిమ్మ పండు; ఉద్రిక్త పిత్తాన్ = పిత్త ప్రకోపముతో గూడియుండు; త్రిదోషాన్=త్రిదోషములను; జయతి=జయిం చును; అమ్లందాడిమమ్=పుల్ల దానిమ్మ పండు; నపిత్తావిరోధి = పిత్తమునకు విరోధముచేయకుండును; నాత్యుష్ణం=స్వల్పముగఉష్ణమును చేయును;వాత కఫా పహామ్=కఫ వాతములను బోగొట్టును; సర్వం = మధురముగ పుల్లగ నుండు సమస్త మయిన దానిమ్మ పండు; హృద్యం = హృదయమునకు మంచిది; లఘుః=లఘువుగ నుండును; స్నిగ్ధం = స్నిగ్ధముగ నుండును; గ్రాహి = మల బంధమును చేయును; రోచన దీపనమ్ = రుచిని గలిగించి అగ్ని దీపనమును చేయును.

తాత్పర్యము : ద్రాక్ష పండు అన్ని ఫలములలో శ్రేష్ఠమైనది. శుక్రమును వృద్ధిచేయును. నేత్రములకు హితకరమైనది. మల మూత్రములను వెడలించును. మధుర రసమును, మధుర విపాకమును గలది. స్నిగ్ధముగను, కొంచెము వగరుగను ఉండును. శీతవీర్యము గలది. గురుత్వమును చేయును. వాతము, పిత్త రక్తము, నోటి చేదు, మదాత్యయము, దప్పి, శ్వాసము,

కాసము, శ్రమ, స్వర భేదము, క్షతక్షయము వీనిని బోగొట్టును. మధురముగ పుల్లగ నుండు సమస్తమయిన దానిమ్మపండు లఘువుగ, స్నిగ్ధముగ నుండును. మలమును బంధించును. రుచిని, అగ్ని దీప్తిని గలిగించును.

*శశిలేఖ* : ఫలములు చెప్పబడు చున్నవి. ఆ ఫలము లన్నింటిలో ద్రాక్ష మిక్కిలి శ్రేష్ఠమైనది. వృష్యత్వాది గుణములతో కూడి యుండును. లఘువు. అనిల పిత్తాదులను నశింప జేయును. తక్కినవి తాత్పర్యాంశములు.

మూ॥ మోచ ఖర్జూర పనస నారికేళ పరూషకమ్॥
ఆమ్రాత తాల కాశ్మర్య రాజాదన మధూకజమ్।
సౌవీర బదరాంకోల ఫల్గు శ్లేష్మాతకోద్భవమ్॥
వాతామాభిషుకాక్షోటముకూలక నిలోచకమ్।
ఊరుమాణం ప్రియాళంచ బృంహణం గురు శీతలమ్॥
దాహక్షత క్షయ హరం రక్త పిత్త ప్రసాదనం।
స్వాదుపాకరసం స్నిగ్ధం విష్టంభి కఫశుక్రకృత్॥

**ప్రతిపదార్థము** : మోచ=అరటి; ఖర్జూర=ఖర్జూరము; పనస=పనస; నారికేళ=నారికేళము; పరూషకమ్=ఈత; ఆమ్రాత=నల్ల మామిడి; తాల=తాటి; కాశ్మర్య=గుమ్మడు; రాజాదన=పాల చెట్టు (మోరటి చెట్టు); మధూకజమ్=ఇప్ప; సౌవీరబదర = రేగు పండు; అంకోల = బిల్వ ఫలము; ఫల్గు=కుక్క మేడి; శ్లేష్మాతకోద్భవం=విరిగి; వాతామా = బాదము; అభిషుక=స్వారాటము; అక్షోట=కొండ గోలుగు; ముకుళకః = ముకూలకము; నిలోచకమ్=ఊడుగు; ఊరుమాణం=స్నిగ్ధ ఫలము; ప్రియాళం = మొరళి, (వీని ఫలములు); బృంహణం=శరీరమునకు పుష్టి నిచ్చును; గురు=గురువుగ; శీతలం=శీతలముగ నుండును; దాహ = దాహమును; క్షతక్షయహారం = క్షత క్షయమును హరించును; రక్తపిత్త ప్రసాదనమ్=రక్తపిత్తమును శుద్ధి పరచును; స్వాదు పాకరసం=మధుర రసము, మధుర విపాకముగలది; స్నిగ్ధం=స్నిగ్ధముగ నుండును; విష్టంభి=మలమును గట్టి పరచును; కఫశుక్ర కృత్=కఫమును శుక్రమును వృద్ధి జేయును.

**తాత్పర్యము** : అరటి, ఖర్జూరము, పనస, నారికేళము, ఈత, నల్ల మామిడి, తాటి, గుమ్మడు, పాలచెట్టు, ఇప్ప, రేగు పండు, బిల్వఫలము, కుక్కమేడి, యిరిగి, బాదము, స్వారాటము, కొండగోలుగు, ముకూలము, ఊడుగు, స్నిగ్ధఫలము, మొరళి, వీనిఫలములు శరీరమునకు పుష్టినిచ్చును. గురువుగ శీతలముగ నుండును. దాహమును, ఉరఃక్షతమును, ధాతుక్షయమును హరించును. మధుర రసము, మధుర విపాకము గలవి. స్నిగ్ధముగ నుండును. మలమును గట్టి పరచును, కఫమును, శుక్రమును వృద్ధి జేయును.

శశిలేఖ : క్షతః = ఉరఃక్షతః, క్షయః = ధాతుక్షయః।

మూ॥ నారికేళం గురుస్నిగ్ధం పిత్తఘ్నం స్వాదు శీతలమ్।
బల మాంస కరం హృద్యం బృంహణం వస్తిశోధనమ్।
మోచం స్వాదురసం ప్రోక్తం కషాయం నాతిశీతలమ్।
రక్తపిత్త హరం వృష్యం రుచ్యం శ్లేష్మకరంగురు।
స్నిగ్ధం స్వాదు కషాయంచ రాజాదన ఫలంగురు।

ప్రతిపదార్థము : నారికేళం = టెంకాయ, గురు = గురువుగ, స్నిగ్ధం = స్నిగ్ధముగ నుండును, పిత్తఘ్నం = పిత్తమును పోగొట్టును, స్వాదు = మధురముగ, శీతలమ్ = చల్లగ నుండును, బలమాంసకరం = బలమును వృద్ధిచేయును, హృద్యం = హృదయమునకు మంచిది, బృంహణం = శరీరమును బలియచేయును, వస్తిశోధనమ్ = పొత్తికడుపును శుద్ధి చేయును.

మోచం = అరటి, స్వాదురసం = మధుర రసము గలదిగా, ప్రోక్తం = చెప్పబడినది. కషాయం = కషాయ రసము, నాతిశీతలమ్ = ఎక్కువ శీతలముగ నుండదు. రక్తపిత్తహరం = రక్తపిత్తమును బోగొట్టును. వృష్యం = శుక్రమును వృద్ధిపరచును. రుచ్యం = రుచికరము, శ్లేష్మకరం = శ్లేష్మమును వృద్ధి పరచును, గురు = గురువుగ నుండును, రాజాదన ఫలం = మోరటి పండు, స్నిగ్ధం = స్నిగ్ధముగను, స్వాదు = మధురముగను, కషాయం = వగరుగను, గురు = గురువుగను ఉండును.

తాత్పర్యము : టెంకాయ గురువుగ, స్నిగ్ధముగ నుండును, పిత్తమును నశింపచేయును. మధురముగ, శీతలముగ నుండును. బలమును, మాంసమును వృద్ధిపరచును. హృదయమునకు మంచిది. శరీరమునకు పుష్టి, పొత్తికడుపును శోధించును.

అరటిపండు, మధుర రసము కషాయ రసము గలది. మిక్కిలి శీతలము గాదు. రక్తపిత్త నాశకము. వాజీకరము. రుచికారకము. కఫకారకము మరియు గురువుగ నుండును.

మూ॥ ఫలంతు పిత్తలం తాలం సరం కాశ్మర్యజం హిమమ్।
శకృన్మూత్ర విబంధఘ్నం కేశ్యం మేధ్యం రసాయనమ్।
మధూకజ మహృద్యంతు బదరం సరణాత్మకమ్॥
వాతామా ద్యుష్ణ వీర్యంతు కఫపిత్తకరం సరమ్।
సరం వాత హరం స్నిగ్ధమనుష్ణంతు ప్రియాలజమ్॥
ప్రియాల మజ్జా మధురో వృష్యః పిత్తానిలాపహః। — 180
లోలమజ్జా గురైస్తద్వ త్తృట్ ఛర్దిః కాసజిచ్ఛసః॥

ప్రతిపదార్థము : తాళం ఫలంతు = తాటి పండు; పిత్తలం = పిత్తమును

చేయును; కాశ్మర్యజం ఫలం=గుమ్మడు పండు; సరం=శీఘ్రముగ శరీర మంతటా వ్యాపించును; హిమమ్=శీత వీర్యము గలది; శకృన్మూత్ర విబంధ ఘ్నం=మల మూత్ర బంధమును బోగొట్టును; కేశ్యం=కేశములకు మంచిది; మేధ్యం=బుద్ధికి మంచిది; రసాయనమ్=రసాయనము; మధూకజం ఫలం=ఇప్ప పండు; అహృద్యం=హృదయమునకు మంచిది కాదు; బదరం ఫలం=రేగుపండు; సరణ్మాతకం=మలాదులను భేదించును; వాతామాది=బాదము మొ॥. ఉష్ణ వీర్యం=ఉష్ణ వీర్యము; కఫపిత్తకరమ్=కఫపిత్తములను వృద్ధి చేయును; సరమ్= శరీరమంతట శీఘ్రముగ వ్యాపించును; పరం=మిక్కిలి; వాతహరం=వాతమును బోగొట్టును; స్నిగ్ధం=స్నిగ్ధముగ నుండును; ప్రియాలజంఫలం=మొరళి పండు; అనుష్ణం=శీతవీర్యము గలది; ప్రియాలమజ్జా=చారపప్పు; మధురః=మధుర ముగ నుండును; వృష్యః=శుక్రమును వృద్ధి చేయును; పిత్తానిలాపహః=పిత్త వాతములను హరింపచేయును; కలమజ్జా=రేగుమజ్జ (రేగువిత్తనములోని పప్పు), గుణైః తద్వత్=చారపప్పుతో సమానమైన గుణములు గలిగియుండును; సః= అది; తృట్=దప్పిని; ఛర్ది=వాంతిని; కాసజిత్=కాసమును జయించును.

ప్రతిపదార్థము: తాటిపండు పిత్తమును వృద్ధిపరచును. గుమ్మడు పండు శీఘ్రముగ శరీరమందంతట వ్యాపించును. శీతవీర్యముగలది. మల మూత్ర బంధమును పోగొట్టును. కేశములకు బుద్ధికి మంచిది. రసాయనము.

ఇప్పపండు హృదయమునకు మంచిది కాదు.

రేగుపండు మలాదులను భేదించును.

బాదము మొదలగునవి ఉష్ణవీర్యము, కఫపిత్తములను వృద్ధిచేయును. శరీరమంతట శీఘ్రముగ వ్యాపించును. ఎక్కువగా వాతమును బోగొట్టును. స్నిగ్ధముగ నుండును. మొరలిపండు శీతవీర్యము గలది.

చారపప్పు మధురముగ నుండును. శుక్రమును వృద్ధిచేయును. పిత్త వాతహరము. రేగువిత్తనములోని పప్పు చారపప్పుతో సమానమైన గుణములు గలిగియుండును. అది దప్పిని, వాంతిని, దగ్గును హరింపజేయును.

శశిలేఖ: వాతామాదీనాం గుణవిశేష ప్రదర్శనపరం నిర్ధారణమ్ ।

మూ॥ తిందుకాశ్మన్తకాసీన ఫలినీ బింబితోదనమ్ ।
టంకాశ్వకర్ణ బకుళ గాంగేరు ధవధన్వనమ్ ॥
క్షీరి వృక్షభవం బీజం పౌష్కరం కఫపిత్తజిత్ ।
కషాయ మధురం రూక్షం శీతలం గురులేఖనమ్ ॥
విబ ధాధ్మాన జననం స్తంభనం వాతకోపనమ్ ॥

ప్రతిపదార్థము: తిన్దుక=తుమికి; అశ్మన్తక=పాషాణభేది; ఆసీన= ఆసీన; ఫలినీ=ప్రేంఖణము; బింబ=దొండపండు; తోదనమ్=కాశ్మీర దేశము

నందలి ఒక చింతపండు; టంక = నల్లని వెలగపండు; అశ్వకర్ణ = మద్ది; వకుళ = పొగడ; గాంగేరు = నాగబలా; ధవ = ఉమ్మెత్త (చంద్ర). ధన్వనమ్ = ధన్వనము; శ్వేతపాక = శ్వేతపాకము; కపిత్థాని = వెలగపండ్లు; సించతీ = రేగుపండు; భవ్య = భవ్యము, క్షీరివృక్షభవం = క్షీరివృక్షముల వలన పుట్టినవి, జాంబవమ్ = నేరేడు పండు; పౌష్కరం = పుష్కరమూలము; ఈ ఫలములు; కషాయ మధురం = వగరు తీపిగలవి; రూక్షం = రూక్షముగను; శీతలం = శీతలముగను; గురు = గురువుగను, లేఖనమ్ = లేఖనముగను ఉండును. విబంధాధ్మాన జననం = విబంధము; ఆధ్మానమును పుట్టించును; స్తంభనమ్ = స్తంభనము; వాత కోపనమ్ = వాతప్రకోపమును చేయును.

**తాత్పర్యము :** తుమికి, పాషాణ భేది, ఆసీన, ప్రేంఖణము, దొండ పండు, కాశ్మీరమునందలి చింతపండు, క్షీరివృక్షములు, పుష్కర మూలము, నేరేడుపండు ఈ ఫలములు వగరు తీపిగలవి. శీతలముగ నుండును. లేఖనముగ నుండును. విబంధము, ఆధ్మానమును చేయును. వాతప్రకోపమును చేయును.

*శశిలేఖ :* తిందుకము మొదలు పుష్కరబీజము వరకు కఫ పిత్తములను జయించుగుణములను గలిగియుండును. సించతీ = వృక్షబదరీ, అది మధురముగ నుండును. పుష్కర బీజమునకు అగ్నితో పక్వముచేయని తండల ఫలములకు చెప్పిన గుణములు సంక్రమించును. శస్త్రాదులతో గాట్లు వేసిన ఏవృక్షములకు పాలు బయటికి వచ్చునో అవి క్షీరివృక్షములు. అవి పాలను స్రవించును. విబంధమనగ "స్రోతభిః దోషాదీనాం అవహననమ్".

సూ॥ కపిత్థ మామం కంఠఘ్నం కషాయామ్లం త్రిదోషకృత్।
పక్వం రుచ్యం కషాయామ్లం స్వాదుహిధ్మావమిప్రణుత్॥
దోషఘ్నం పాదవారిష్ట రాగయుక్తిషు పూజితమ్।
విషఘ్న ముభయం గ్రాహి, కపిత్థాన్యేవమాదిశేత్॥

*ప్రతిపదార్థము :* ఆమం కపిత్థం = పక్వముకాని వెలగకాయ, కంఠఘ్నం = కంఠమునకు చెరుపు చేయును. కషాయామ్లం = వగరు, పులుపు రసములు గలిగియుండును, త్రిదోషకృత్ = త్రిదోషములను చేయును; పక్వం = పక్వమైన వెలగపండు; రుచ్యం = రుచికరముగ నుండును; కషాయామ్లం = వగరుగ పుల్లగ నుండును; స్వాదు = మధురముగ నుండును; హిధ్మావమి ప్రణుత్ = ఎక్కిళ్ళను; వాంతులను పోగొట్టును; దోషఘ్నం = త్రిదోషములను నశింపచేయును; పాడవారిష్టరాగయుక్తిషు = పాడవములు, అరిష్టములు, రాగములు వీటియందు చేర్చుటలో; పూజితమ్ = పూజనీయమైనది; ఉభయం = పక్వఅపక్వము లైన వెలగ కాయ; గ్రాహి = మలమును బంధించును; విషఘ్నం = విష నాశక ముగా నుండును; ఏవం = ఇట్లు; కపిత్థాని = వెలగ పండ్లను గూర్చి; ఆదిశేత్ = చెప్పబడెను.

**తాత్పర్యము :** పైనుదాహరించిన వాటిలో పక్వము కాని వెలగ కాయ కంఠమునకు చెఱుపు చేయును. త్రిదోషకారి. వగరు, పులుపు రసములు కలది. పండిన వెలగ పండు రుచికరముగ నుండును. వగరు, పులుపు, తీపి రసములు కలిగియుండును. ఎక్కిళ్ళను, వాంతులను పోగొట్టును, త్రిదోషములను నశింప చేయును. షాడవము, అరిష్టము, రాగము మొ॥ తయారు చేయుటలో వెలగ పండు ప్రశస్తమైనది. ఆమముగా నున్న, పక్వముగా నున్న రెండు విధములయిన వెలగ పండు, మల బంధమును చేయుననియు, ఇట్లే తక్కిన వెలగ పండ్లను కూడ తెలిసికొనవలెనని ఆదేశింపబడెను.

*శశిలేఖ :* అపక్వమయిన కపిత్థము స్వరనాశకము. రసశేవిషము చేత పలు విధములయిన వెలగ పండ్లు దొరకుచున్నవి. వీటిని ఈ విధముగ కల్పన చేయవలెను. ఎట్లనగా, ఆమకపిత్థ గుణము కషాయామ్లము, పక్వకపిత్థ గుణము మాధుర్యము అని తెలుసుకొనవలెను. రాగము, షాడవము ఇవి రెండును, పానకము యొక్క భేదములు. షాడవమనగా మురబ్బా, రాగమనగా పానకము.

మూ॥ బృంహణం వాతపిత్తఘ్నం స్నిగ్ధం సించితి కాఫలమ్ ।
భవ్యం విశద మమ్లంచ జాంబవం త్వతి వాతలమ్ ॥
విష్టంభకృదకంఠ్యంచ సామ్లంతు క్షీరి వృక్షజమ్ ।
పిత్త శ్లేష్మఘ్నమమ్లంచ వాతలం చాతుకీ ఫలమ్ ॥
బాలం కషాయ కట్వమ్లం రూక్షం వాతాస్రపిత్తకృత్ ।
సంపూర్ణ మామ్ర మమ్లంతు రక్త పిత్త కఫప్రదమ్ ॥
స్వాదుసామ్లం గురుస్నిగ్ధం మారుతఘ్న మపిత్తలం ।
హృద్యం పర్యాగతం శ్లేష్మ మాంస శుక్ల బలప్రదమ్ ।
సహకార రసో హృద్యః సురభి స్నిగ్ధ రోచనః ॥
దీపనః పిత్త వాత ఘ్నః శుక్ల శోణిత శుద్ధికృత్ ॥

**ప్రతిపదార్థము :** సించతి కాఫలమ్ = సించతికా ఫలము (ఇది రేగులో భేదము. దీనినే ఆపిల్ అందురు), బృంహణం = శరీరమును బలియ జేయును; వాతపిత్తములను పోగొట్టును; స్నిగ్ధం = జిగటగ నుండును; భవ్యం = భవ్య ఫలము; విశదం = శరీరమును శుద్ధి పరచును; అమ్లం = పుల్లగా నుండును; జాంబవం = నేరేడు పండు; అతి వాతలమ్ = ఎక్కువగా వాతమును వృద్ధి చేయును; విష్టంభకృత్ = మలమును బంధించును; అకంఠ్యమ్ = కంఠమునకు మంచిది కాదు; క్షీరి వృక్షజమ్ = మఱ్ఱి, జువ్వి మొ॥ క్షీరివృక్షముల నుండి పుట్టినపండ్లు; అమ్లం = పుల్లగానుండును; ఆతుకీఫలమ్ = ఆతుకీఫలము; పిత్తశ్లేష్మఘ్నం = పిత్త శ్లేష్మములను నశింపచేయును; చ = మరియు; వాతలమ్ = వాతమునువృద్ధిచేయును; బాలం ఆమ్రం = లేత మామిడి కాయ; కషాయ కట్వమ్లం = వగరు, కారము, పులుపు రసములు గలది; రూక్షం = రూక్షముగ నుండును; వాతాస్ర పిత్తకృత్ =

వాతమును, రక్తమును, పిత్తమును వృద్ధి చేయును; సంపూర్ణం ఆమ్లఫలం = బాగుగా పండిన మామిడిపండు; రక్తపిత్త కఫప్రదమ్ = రక్తమును, పిత్తమును, కఫమును వృద్ధి చేయును; పర్యాగతం = పరిపక్వమయిన పండు; స్వాదు = మధురముగ నుండును; సామ్లం = కొంచెము పుల్లగ నుండును; గురు = గురుత్వ మును చేయును; స్నిగ్ధం = జిగటగా నుండును; మారుతఘ్నం = వాతమును నశింప చేయును; అపిత్తలమ్ = పిత్తమును వృద్ధి చేయదు; హృద్యం = హృదయ మునకు మంచిది; శ్లేష్మ మాంస, శుక్ల, బలప్రదమ్ = కఫమును, మాంసమును, శుక్రమును, బలమును, శరీరమునకు ప్రసాదించును; సహకార రసః = మామిడి పండు రసము; హృద్యం = హృదయమునకు మంచిది; సురభిః = పరిమళ భరిత మైనది; స్నిగ్ధరోచనః = స్నిగ్ధ గుణము గలిగి రుచికరముగా నుండును; దీపనః = అగ్ని దీపనమును చేయును; పిత్తవాతఘ్నః = పిత్తమును, వాతమును పోగొట్టును; శుక్రశోణిత, శుద్ధి కృత్ = శుక్రమును, రక్తమును శుద్ధి చేయును;

**తాత్పర్యము :** సించతికా ఫలము వాతపిత్తములను నశింప జేయును. స్నిగ్ధముగ నుండును. భవ్య ఫలము, శరీరమును శుభ్రపరచును. పుల్లగా నుండును. నేరేడు పళ్ళు మిక్కిలి వాతమును చేయును. మలమును బంధించును. కంఠమునకు మంచిదికాదు. క్షీరి వృక్షముల యొక్క పండ్లు కొంచెము పుల్లగ నుండును. అక్షుకీ ఫలము పిత్త శ్లేష్మములను నశింపచేయును. పుల్లగ నుండును. వాతమును వృద్ధిచేయును. బాగుగా వృద్ధిచెందిన మామిడికాయ తీయగా నుండును. కొంచెము పుల్లగ నుండును. గురుత్వమును చేయును. స్నిగ్ధముగ నుండి వాతమును నశింప జేయును. పిత్తమును వృద్ధిపరచదు. హృదయమునకు మంచిది. శ్లేష్మమును, మాంసమును, శుక్రమును, బలమును ఇచ్చును. మామిడి పండు రసము హృదయమునకు మంచిది. మంచి వాసనతో కూడి యుండును. స్నిగ్ధముగ నుండును. రుచికరము, అగ్నిదీపకము.పిత్తవాతములను పోగొట్టును. శుక్రమును, రక్తమును శుద్ధి పరచును.

*శశిలేఖ :* సించతి కాఫలము బృంహణత్వాది గుణములను కలిగి యుండును. భవ్యఫలము శరీరమును శుద్ధిచేయును. జాంబవము ఎక్కువ వాత మును చేయును. మలమును బంధించును. స్వరమును నశింప జేయును. క్షీరి వృక్ష ఫలము కొంచెము పుల్లగా నుండును. మామిడికాయ, కషాయ, కటుక, అమ్ల రసములు గలిగి యుండును. రూక్షమును గలిగించును. వాతమును రక్త పిత్తమును చేయును. మామిడిపండు హృదయమునకు మంచిది. శ్లేష్మమును చేయును.

మూ॥ కషాయం రోచనం హృద్యం వాతలం లవలీఫలమ్।
గుర్వగ్ని సాదకృద్బిల్వం దోషలం పూతిమారుతమ్॥
పక్వం బాలం పునస్తీక్ష్ణం పిత్తలం లఘుదీపనమ్।
వాతశ్లేష్మఘ్న ముష్ణంచ స్నిగ్ధం గ్రాహ్యు భయంపరమ్॥

వృక్షామ్లం గ్రాహి రూక్షోష్ణం లఘు దీపన రోచనమ్।
వాతశ్లేష్మ హరం కించిదూనం కోశామ్రజం తతః॥
ఫలం కరంజ విష్టంభి పిత్తశ్లేష్మా విరోధిచ।
గుర్వూష్ణ మధురం రూక్షం కేశఘ్నంచ శమీఫలమ్॥

ప్రతిపదార్థము : లవలీఫలః = రస ఉసిరిక పండు (సుగంధ మూలా, పాండుః, కోమలవల్కలా) కషాయం = కషాయ రసమును గలిగి యుండును; రోచనం = రుచికరము; హృద్యం = హృదయమునకు మంచిది; వాతలం = వాతమును వృద్ధిచేయును; పక్వంబిల్వం = పండినమారేడు పండు; అగ్ని-సాదకృత్ = అగ్ని మాంద్యమును చేయును; దోషలం = త్రిదోషములను వృద్ధి చేయును; పూతి మారుతమ్ = దుర్గంధముతో కూడిన అపాన వాయువుల గలుగ జేయును; బాలం బిల్వం = కాయగా నుండు మారేడు కాయ; పునః = మరల; తీక్ష్ణం = తీక్ష్ణము; పిత్తలం = పిత్తమును వృద్ధి చేయును; లఘు = లఘువుగ నుండును; దీపనమ్ = అగ్ని దీపకము; ఉభయం = పక్వమైన, పక్వముగాని మారేడుకాయ; పరం = మిక్కుటముగ; వాతశ్లేష్మఘ్నం = వాతమును, శ్లేష్మ-మును నశింపజేయును; చ = మరియు; ఉష్ణం = ఉష్ణవీర్యము; స్నిగ్ధం = జిగటగ నుండును; వృక్షామ్లం = చింతపండు; గ్రాహి = మలమూత్రాదులను బంధించును; రూక్షోష్ణమ్ = రూక్షముగ నుండి ఉష్ణమును చేయును; లఘు = లఘువు దీపన-రోచనమ్ = రుచికరముగ, దీపన కారిగ కూడ నుండును; కోశామ్రజం = కొండ-మామిడి; కించిదూనం = వృక్షామ్లమున కంటె కొంచెము హీనమైన గుణము గలదిగ నుండును; కరంజం ఫలం = కానుగ పండు; విష్టంభి = విష్టంభమును చేయును; చ = మరియు; పిత్తశ్లేష్మా విరోధి = కఫ పిత్తములకు విరుద్ధముకాదు; శమీఫలం = జమ్మిపండు, గుర్వూష్ణ మధురం = గురువు, ఉష్ణవీర్యము, మధుర రసము గలది; రూక్షం = రూక్షమును చేయును; కేశఘ్నం = వెంద్రుకలను నశింపజేయును.

తాత్పర్యము : రస ఉసిరిక పండు, కషాయ రసమును గలిగి యుండును. రుచిని బుట్టించును. హృదయమునకు మంచిది. వాతమును వృద్ధి చేయును. పండిన మారేడు పండు, అగ్ని మాంద్యమును చేయును. త్రిదోషములను వృద్ధి పరచును. అపాన వాతమును చెడ్డ కంపుతో కూడుకొని యుండునట్లు చేయును. లేత మారేడు కాయ తీక్ష్ణ గుణము గలది. పిత్తమును వృద్ధి జేయును. లఘువుగ నుండును. అగ్ని దీపనమును చేయును. మారేడు కాయ, పండు రెండును వాతశ్లేష్మములను నశింప జేయును. ఉష్ణవీర్యము జిగటగ నుండును. చింతపండు మలమూత్రములను బంధించును. రూక్షముగ నుండి ఉష్ణమును చేయును. లఘువు. రుచికరముగ నుండి దీపన కారిగ గూడ నుండును. కొండ మామిడి వృక్షామ్లమున కంటె కొంచెము హీనమైన గుణము గలదిగ నుండును. కానుగ పండు విష్టంభ మును చేయును. కఫ పిత్తములను సమానముగ నుంచును. జమ్మిపండు గురువు.

ఉష్ణవీర్యము. మధురరసము గలది. రూక్షమును చేయును. వెం|్రుకలను నశింప చేయును.

*శశిలేఖ :* విశేషము లేదు.

మూ॥ కటు పాకరసం పీలు తీక్ష్ణోష్ణం భేది పిత్తలమ్।
క్రిమి గుల్మోదర గరప్లీహార్శః కఫవాతజిత్॥
సతిక్తం స్వాదు యత్ పీలు నాత్యుష్ణం త్రితద్రోషజిత్।
నీపం శతాహ్వకం ప్రాచీనాగరం తృణ శూల్యకమ్॥
అస్మాదల్పాన్తర గుణమైంగుదం సవికం కతమ్॥
త్వక్తిక్త కటుకా స్నిగ్ధా మాతులుంగస్య వాతజిత్।
బృంహణం మధురం మాంసం వాతపిత్తహరం గురు।
లఘు తత్కేసరం కాస శ్వాస హిధ్మా మదాత్యయాన్॥
ఆస్య శోషానిలశ్లేష్మవిబంధ ఛర్ద్యరోచకాన్।
గుల్మోదరార్శః శూలాని మందాగ్ని త్వంచనాశయేత్।

*ప్రతిపదార్థము :* పీలు=గోగు; కటుపాకరసము=కటురసము, కటు విపాకముగలది; తీక్ష్ణోష్ణం=తీక్ష్ణ, ఉష్ణ గుణములు గలది; భేది=మలములను భేదించును; పిత్తలమ్=పిత్తమునువృద్ధి చేయును; క్రిమి గుల్మోదర గర ప్లీహార్శః కఫవాతజిత్ =క్రిములను, గుల్మములను, ఉదరములను, గరవిషమును, ప్లీహమును,అర్శస్సును,కఫవాతములను జయించును;యత్ =యే;పీలు=గోగు; సతిక్తమ్=కొంచెము చేదుగను, స్వాదు = మధురముగను, నాత్యుష్ణం = కొంచెము ఉష్ణముగను ఉండునో; తత్ = అది; త్రిదోషజిత్ = మూడు దోషములను జయించును; నీపం=కడిమి చెట్టు (ధారాకదమ్బము); శతాహ్వకం= సోయిపండు; ప్రాచీనాగరం=ప్రాచీనాగరము; తృణశూల్యకమ్=కేతకి ఫలము; ఐంగుదం=గారపండు; సవికంకతమ్=వికంకతము; అస్మాత్=వీటి కంటె; అల్పాన్తర గుణము=పీలుగుణముల కంటె తక్కువ గుణములు గలిగి యుండును; మాతులుంగస్య = మాదీఫలముయొక్క; త్వక్=చర్మము; తిక్తకటుకా=చేదుగా, కారముగా నుండును; స్నిగ్ధా=స్నిగ్ధముగ నుండును; వాతజిత్=వాతమును హరింపజేయును; మాతులుంగస్య మాంసం=మాదీ ఫలము యొక్క మాంసము; బృంహణమ్ = శరీరమునకు పుష్టిని గలుగ చేయును; మధురం=మధురముగ నుండును; వాతపిత్తహరం=వాతపిత్తములను హరింపజేయును; గురు=గురువుగ నుండును; తత్కేసరం=మాదీఫలముల యొక్క కేసరములు; లఘు=లఘువుగ నుండును; కాస శ్వాస హిధ్మామదాత్యయాన్=కాసము, శ్వాసము, ఎక్కిళ్ళు, మదాత్యయములను, ఆస్యశోషానిల శ్లేష్మ విబంధఛర్ద్యరోచకాన్=ముఖశోష, వాత శ్లేష్మములను, విబంధమును, వాంతులను, అరోచకములను; గుల్మోదరార్శ శూలాని=గుల్మము, ఉదర

రోగము, అర్శస్సు, శూలములను; చ = మరియు, మందాగ్నిత్వం = అగ్ని మాంద్యమును; నాశయేత్ = నశింపజేయును; భల్లాతకస్య = జీడిపండు యొక్క; త్వఙ్మాంసం = చర్మము, మాంసమును, (గిజరు); బృంహణం = శరీరమును బలియ జేయును; స్వాదు = మధురము; శీతలమ్ = చల్లగ నుండును; తదస్థి = జీడి విత్తులు, అగ్ని సమం.

తాత్పర్యము : గోగు కటురసము, కటువిపాకము గలది. తీక్ష్ణ ఉష్ణ గుణములు గలది. మలమును భేదించును. పిత్తమును వృద్ధి చేయును. క్రిములను, గుల్మమును, ఉదరమును, గరవిషమును, ప్లీహను, అర్శస్సును, కఫ వాతములను జయించును. కొంచెము చేదుగ, మధురముగ యేగోగు ఉండునో అది త్రిదోష ములను జయించును. కడిమి చెట్టు పండు, సోయిపండు, ప్రాచీనాగరము పండు, గారపండు, కేతకీ ఫలము, వికంకత ఫలము, పీలు గుణములకంటె తక్కువ గుణములు గలిగి యుండును.

శశిలేఖ : పీలు ఫలము పాకమునందు రసమునందు కటువుగానుండును. తీక్ష్ణత్వాది గుణములు గలిగియుండును. క్రిమ్యాదులను నశింపజేయును. మాతులుంగ ఫలము యొక్క చర్మము తిక్తకటురసములు గలది. స్నిగ్ధము, వాతనాశకము. చర్మములో నుండు గుజ్జు బృంహణము, మధురము, వాతపిత్త హరము. గురువు. ఆమాతులుంగముయొక్క కేసరములు (మాంసముతోనుండు నవి) లఘువు. కాసాదులను నశింపజేయును.

మూ॥ భల్లాతకస్య తఙ్మాంసం బృంహణం స్వాదు శీతలమ్।
తదస్థ్యగ్ని సమం మేధ్యం కఫవాతహరం పరం ॥
స్వాద్వమ్లం శీతముష్ణంచ ద్విధా పారావతం గురు।
రుచ్య మత్యగ్ని శమనం రుచ్యం మధుర మారుతమ్ ॥
పక్వ మాశు జరాం యాతి నాత్యుష్ణం గురుదోషలమ్ ।
ద్రాక్షా పరూషకం చార్ద్రమమ్లం పిత్తకఫప్రదమ్ ॥
గుర్వూష్ణ వీర్యం వాతఘ్నం పరం సకర మర్దకమ్ ।
తథామ్లం కోలకర్కంధు లికుచామ్రాత కారుకమ్ ॥
ఐరావతం దంతశఠం సత్రుదం మృగలండికమ్ ।
నాతి పిత్తకరం పక్వం శుష్కంచకర మర్దకమ్ ॥
దీపనం భేదనం శుష్కమమ్లికాకోలయోః ఫలమ్ ।
తృష్ణాశ్రమక్లమచ్ఛేది లఘ్వీష్టం కఫపిత్తయోః॥

ప్రతిపదార్థము : భల్లాతకస్య = జీడిపండుయొక్క, త్వఙ్మాంసం = చర్మమును, మాంసమును (గుజ్జు), బృంహణం = శరీరమును బలియచేయును. స్వాదు = మధురముగ నుండును, శీతలం = చల్లగ నుండును, తదస్థి = జీడి విత్తులు, అగ్నిసమం = చిత్రమూలముల సమానమధునగుణముగలవి, మేధ్యం = మేధ్యం;

పరం = మిక్కుటముగ, కఫవాతహారం = కఫవాతములను నశింపచేయును; పారావతం = ఈడ పండు, స్వాద్వ మ్లంద్విధా = మధురము, అమ్లము అని రెండు విధములు, శీతం = శీతలము, చ = మరియు, ఉష్ణం = ఉష్ణము; గురు = గురుత్వము; ఆరుకం = గజనిమ్మపండు, మధురం = మధురముగ, రుచ్యం = రుచిగ నుండును, అత్యగ్ని శమనం = ప్రబలమైన జాఠరాగ్నిని శమింప జేయును. పక్వ ఆరుకం = పక్వమయిన గజనిమ్మ, మధురం = మధురముగ, రుచ్యం = రుచికరముగ నుండును, ఆశు = శీఘ్రముగ, జరాం యాతి = జీర్ణమగును. నాత్యుష్ణం = కొంచెము ఉష్ణముగ నుండును. గురు = గురుత్వమును చేయును, దోషలమ్ = త్రిదోషము లను వృద్ధి చేయును, ద్రాక్షా = పచ్చిద్రాక్షపండు, పరూషకం = చిట్టీత పండు, కరమర్దకమ్ = కలిమి పండ్లు, అమ్లం = అమ్ల రసము గలిగి యుండును, పిత్త కఫ ప్రదమ్ = పిత్త కఫముల వృద్ధినొందించును, గురు = గురుత్వమును, ఉష్ణవీర్యం = ఉష్ణవీర్యమును గలిగి యుండును, వాతఘ్నం = వాతమును హరించును, చ = మరియు, సరం = శరీరమున శీఘ్రముగ వ్యాపించును, (మృదు విరేచకము) తథా = అట్లే, అమ్లం = పుల్లగ నుండు, రేగు:కోల = గంగరేగు, కర్కంధూ = కమ్మరేగు, లికుచ = గజనిమ్మ, ఆమ్రాతం = మామిడి, ఆరుకం = గంగరావి (ఆల్ బుఖార), ఐరావతం = నారింజ, దన్తశఠం = కలిమిపండ్లు, మృగలిండికమ్ = మృగలిండీకము, నాతిపిత్తకరం = కొంచెము పిత్తమును చేయును; అమ్లికాకోలయో ఫలమ్ = చింతపండు, రేగుపండు ఈ రెండును, శుష్కం = ఎండినచో, దీపనం = అగ్ని దీపనమును చేయును, భేదనం = మలాదులను భేదించును, తృష్ణా = దప్పిని, శ్రమ = బడలికను, క్లమ = గ్లానిని; ఛేది = నశింప జేయును, లఘు = లఘువుగ నుండును, కఫవాతయో: = కఫవాతములకు, ఇష్టం = పథ్యకరమైనది.

తాత్పర్యము : జీడిపండుయొక్క చర్మము, మాంసము (గుజ్జు) ఇవి శరీరమునకు పుష్టినిచ్చును, మధుర రసము శీత వీర్యము గలవి. జీడివిత్తులు నిప్పువలె బహుతీక్ష్ణముగ నుండును. అగ్నితో సమానమైనవి. బుద్ధికి మంచివి. కఫవాతములను బోగొట్టును. చిత్రమూలముతో తుల్యమైన గుణము గలవి. ఈడ పండు మధురము, అమ్లము అని రెండు విధములు. ఆ రెండును క్రమముగ శీతలము, ఉష్ణము, గురుత్వము రుచిగలవిగ నుండును. అధికమయిన అగ్ని దీపనమును శమింప జేయును. గజనిమ్మపండు మధుర రసము గలది. రుచికరము, పక్వమయిన గజనిమ్మ శీఘ్రముగ జీర్ణమగును. స్వల్పముగ ఉష్ణమైన వీర్యము గలది. కొంచెము గురువుగ నుండి, కొంచెము అపథ్యకరముగ నుండును. పచ్చి ద్రాక్ష పండు, చిట్టీత పండు, కలిమిపండ్లు ఇవి అమ్ల రసము గలిగి యుండును. పిత్త కఫములను వృద్ధినొందించును. గురుత్వమును, ఉష్ణవీర్యమును కలిగి యుండును. వాతమును హరించును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును, రేగు, గంగరేగు, కమ్మరేగు, గజనిమ్మ, మామిడి, నారింజ, గంగరావి, మృగలిండికము, పక్వమై శుష్కించి యుండు కలమి పండ్లు ఇవి పుల్లగ నుండును. స్వల్పముగ

పిత్తమును చేయును. పైజెప్పిన ద్రాక్షాదులతో తుల్యమైన గుణముగలవిగ నుండును. చింతపండు, రేగుపండు, ఈ రెండును ఎండినచో అగ్ని దీపనమును చేయును. మలాదులను భేదించును. లఘువుగ నుండును. దప్పి, శ్రమము, క్లమము, వీనిని బోగొట్టును. కఫవాతములకు పథ్యకరమైనవి.

శశిలేఖ : భల్లాతకము యొక్క చర్మము, మాంసము బృంహణత్వాది గుణములు గలిగి యుండును. భల్లాతకాస్థి తీక్ష్ణగుణము గలదగుట వలన అగ్నితో సమానమైనది. బుద్ధి కొఱకు హితమైనది. మిక్కిలి వాతశ్లేష్మములను హరించును. ఈడ పండు రెండు విధములు, మధురము, అమ్లము. మధురముగ నుండు ఈడెపండు, శీతవీర్యము. అమ్లముగ నుండు ఈడెపండు ఉష్ణవీర్యము. రెండు కూడ గురువు. రుచికరములు, అత్యగ్నిశామకములు, ఐరావతం=నాగరంగం, దన్తశఠం=జంబీరం, కర్కంధూ = హ్రస్వబదరీ.

మూ॥ ఫలానామవరం తత్రలికుచం సర్వదోషకృత్।
హిమానిలోష్ణ దుర్వాత వ్యాళ లాలాది దూషితమ్॥
జన్తుజుష్టం జలేమగ్న మభూమిజ మనార్తవమ్।
అన్యధాన్యయుతం హీనవీర్యం జీర్ణతయాపిచ॥
ధాన్యం త్యజేత్తథా శాకం రూక్షసిద్ధమ కోమలమ్।
అసంజాత రసం తద్వచ్ఛుష్కం చాన్యత్ర మూలకాత్॥
ప్రాయేణ ఫలమ ప్యేవం తథామం బిల్వ వర్జితమ్।

—ఇతి ఫలవర్గః॥.

ప్రతిపదార్థము : తత్రఫలానాం=సమస్తమయిన ఫలములలో; లికుచం= కమ్మరేగు పండు; అవరం = నికృష్టమైనది, సర్వదోషకృత్=సమస్త దోషములను వృద్ధిచేయును, హిమ-దూషితం-హిమ = మంచుచేతను; అనల=నిప్పు చేతను; ఉష్ణ=ఎండ మొ॥ వాని యుష్ణము చేతను; దుర్వాత=తూర్పుగాలి మొ॥ దుష్టమైనగాలిచేత; వ్యాల=సర్పము మొ॥ దుష్ట జంతువుల యొక్క; లాలాది = నోటి జొల్లు మొ॥ వానితో; దూషితం = దూషింపబడినవియు; జలేమగ్నం=జలములోమునిగినవియును;అభూమిజమ్=విరుద్ధమయిన భూమిలో జనించినవియును; అనార్తవమ్=విరుద్ధమైన ఋతువునందు జనించినవియును; అన్యధాన్యయుతం = విజాతీయ ధాన్యములతో గూడినవియును;హీనవీర్యం = నిర్వీర్యమైనవియునగు ధాన్యమును; జీర్ణతయాపి=ఊదుపు మడిలోనే జీర్ణమై నీరసముగా నుండిన; ధాన్యం=ధాన్యమును; చ=మరియు; తథా=అట్లే; శాకం=శాకమును; త్యజేత్ = వదలిపెట్టవలయును; తత్=ఆశాకము; రూక్షం= స్నేహ రహితముగ గాని, సిద్ధం=కాంజికాదులచేత సిద్ధము చేయబడినదిగాని; అసంజాతరసం =పరిపూర్ణమైన రసము లేనివియును; అకోమలం=కోమలముగా లేనివియును, తద్వచ్ఛుష్కం = అట్లే పండినవియునగు శాకం = శాకమును;

త్యజేత్ = వదలి పెట్టవలయును; మూలకా దన్యత్ర శుష్కం = ఎండిన ముల్లంగిని మాత్రము భుజింప వచ్చును; ప్రాయేణ = తరచుగా; ఏవం = ఇట్లే; ఫలమపి = పండ్లను గూడ; త్యజేత్ = వదలిపెట్టవలయును; తథా = అట్లే; బిల్వవర్జితమ్ = బిల్వఫలమును విడిచి; ఆమం = అపక్వఫలములను, త్యజేత్ = వదలి పెట్టవలయును; ఇతి = అని; ఫలవర్గః = ఫలవర్గము

తాత్పర్యము : సమస్తమైన ఫలములలో కమ్మరేగుపండు అప్రధానము, త్రిదోషకారిగ నుండును, మంచు చేతను, నిప్పు, ఎండ మొ॥వాని యుష్ణము చేతను, తూర్పు గాలి మొ॥ దుష్టమైన గాలి చేతను, సర్పము మొ॥ దుష్ట జంతువుల యొక్క నోటిజొల్లు మొ॥ వాని చేత దూషింపబడినవియును, క్రిములు మొ॥ జంతువులతో గూడినవియును, జలములో మునిగినవియును, విరుద్ధమైన భూమిలో జనించినవియును, విరుద్ధమైన ఋతువునందు జనించినవి యును, విజాతీయ ధాన్యములతో కూడినవియును, నిర్వీర్యమైనవియును నగు ధాన్యములును, అటులే స్నేహ రహితముగ గాని, లేక కాంజికాదులచే సిద్ధము చేయబడినవియు, పరిపూర్ణమైన రసము లేనివియును, ఎండినవియును అగు శాకములను వదలిపెట్టవలయును. శుష్కించిన ముల్లంగినిమాత్రము భుజింప వచ్చును. పై జెప్పిన శాకగుణములతో గూడియుండు ఫలములను తరచుగా విడిచి పెట్ట వలయును. బిల్వఫలము తప్ప నితరములైన ఫలములు అపక్వములుగ నుండినచో వానిని వర్జింపవలయును. ధాన్యములు, ఘృతము, తేనె, వాయు విడంగ ములు, బెల్లము, పిప్పలి, ఇవి తప్ప, నితర ద్రవ్యములన్నియు నొక సంవత్సర మునకు పైబడనివిగ నుండిన యెడల శ్రేష్ఠములుగా పరిగణింపవలయును అని ఫల వర్గము ముగిసినది.

*శశిలేఖ* : ఫలము లన్నింటిలో అప్రధానమైనది లికుచము. త్రిదోష ములను వృద్ధిచేయును. హిమాదుల చేత దూషింపబడినది. కేదారములయందున్న ధాన్యములు, ఈదురు గాలుల చేత దూషింపబడినవియును, ఎక్కువ ఎండల చేత దూషింపబడినవియును, పురోవాతాదులచేత దూషింపబడినవియును, అట్లే, సర్పాదుల యొక్క జొల్లు చేత దూషింపబడినవియును, (ఆదిగ్రహణముచేత శవ, కథ, మూత్ర, పురీషాదులను గ్రహింపవలయును). అట్లే క్రిమ్యాదుల చేత, జుష్టమైన, నీటిలో మునిగిన, విపరీత భూమిలో బుట్టిన, ఋతు వైపరీత్యమున బుట్టిన, ధాన్యములను విడిచి పెట్టవలయును. తక్కిన విషయములు తాత్పర్యాంశములు.

మూ॥ శూకశింబిజ పక్వాన్న మాంస శాకఫలాశ్రయైః।
వర్గైరనైకశ్ దేశోఽయం భూయిష్ఠముప యోగవాన్॥
నిర్దిష్టో రసవీర్యాద్యైర్యథా స్వం కర్మ సాధనే।
నశక్యం విస్తరేణాపి వక్తుం సర్వంతుసర్వథా

హితాహితత్వేఽప్యేకాన్త నియమోఽస్మాదనిశ్చితః।
మాత్రాయోగ క్రియాదేశ కాలావస్థాది భేదతః॥
తత స్తతో యతో దృష్టాస్తేతే భావాస్తథా తథా।

**ప్రతిపదార్థము :** శూకశింబిజ పక్వాన్న మాంసశాకఫలాశ్రయైః = శూక వర్గము, పక్వాన్నవర్గము, మాంసవర్గము, శాకవర్గము, ఫలవర్గములను ఆశ్రయించిన, వర్గైః = వర్గములచేత, అయం = ఇది, అన్నైకదేశః = అన్నపానములయొక్క ఏకదేశము, భూయిష్ఠం = మిక్కిలి, ఉపయోగవాన్ = మిక్కిలి యుపయోగమైనది. యథాస్వం = ఉన్నదున్నట్లుగా, రసవీర్యాద్యైః = రసము, వీర్యము మొ॥ వాటి ద్వారా, కర్మసాధనే = పనులను సాధించుటలో నిర్దిష్టః = చెప్పబడినది, సరథాఽపి = అన్ని విధములను, సర్వం = సమస్తమును, విస్తరేణ = విపులముగ, వక్తుం = చెప్పుటకు, నశక్యం = సాధ్యముగాదు, హితాహితత్వేఽపి = శరీరముయొక్క హిత, అహిత విషయములో కూడ, ఏకాన్త నియమః = నిర్దుష్టమైన నియమము, అనిశ్చితః = నిశ్చయముగ లేదు, యతః = ఎందువల్లననగ, తేభావాః = ఆ నానావిధ భావములు, మాత్రాయోగక్రియా దేశకాలావస్థాది భేదతః = ఆహార మాత్ర, యోగము, క్రియా, దేశము, అవస్థాది భేదములు వీటివలన, దృష్టాః = చూడబడినవి.

**తాత్పర్యము :** శూకవర్గము, శింబీ వర్గము, పక్వాన్న వర్గము, మాంస వర్గము, శాక వర్గము, ఫలవర్గము, ఈ ఆరు వర్గములలో అన్నపానముయొక్క విభాగము మిక్కిలి యుపయుక్తమైనది. ఈ అన్నపాన వర్గమందలి రసవీర్య విపాకాదులు వాటివాటి కార్యనిర్వహణలో సమర్థవంతములై యుండును. చరకమునందు అన్నమును గురించి ఇట్లు చెప్పబడినది. ప్రాణధారులైన మానవులయొక్క ప్రాణము అన్నమునందే ప్రతిష్ఠితమై యున్నది. ఆ అన్నము కొఱకే మానవ జీవితమునందు మానవులు పలువిధములైన యాతనలకు గురియగు చుందురు. అన్నమునందే మానవ శరీరవర్ణము, సువాక్కు, జీవనము, ప్రతిభ, సుఖము, తుష్టి, పుష్టి, బలము, లౌకిక, అలౌకికములైన కర్మలు అన్నమునందే ప్రతిష్ఠితములై యున్నవి. ఈ కలికాలమునందు ఈ అన్నమునకే ప్రథమ స్థానము లభించుచున్నది.

అన్ని వస్తువులను గురించి విస్తారముగా చెప్పవలయునన్న సాధ్యము కాదు. ఎందువలన ననగా! పదార్థములు, వాటియొక్క మాత్ర, సంయోగము, సంస్కారము, దేశము, కాలము, అవస్థ, మొ॥ భేదములతో భిన్న భిన్నములుగా నున్నందున ఇది హితము, ఇది అహితము అని చెప్పుటకు వీలుకాదు. అందువలన నిర్దుష్టముగా చెప్పుటకు సాధ్యపడదు. ఎందుకనగా! పథ్యకరమైన పదార్థము కూడ మాత్ర, సంయోగము మొ। కారణములచేత అపథ్యకారకముగా నగును. ఇట్లే అపథ్యకారక వస్తువు కూడ మాత్ర, దేశము, మొ॥ వాటిని బట్టి అపథ్య

కారకము కూడ కావచ్చును. ఏఏ పదార్థములు ఆరోగ్యవంతుని యొక్క ఆరోగ్యమును పరిరక్షించుచు శరీరమందలి అసమాన ధాతువులను సమానముగ చేయుచున్నవో అవి హితకర పదార్థములుగా చెప్పబడుచున్నవి.

**శశిలేఖ :** సమస్తమైన భావములను బట్టి ఈ శరీరము హితమైనది అహితమైనది అని చెప్పుటకు వీలుకాలేదు. మాత్రా సంయోగాదులను బట్టి ఆహారాదులు అనేక విధములుగా నగుచున్నవి. పథ్యమైన ఆహారమైనప్పటికిని, మాత్రాది విశేషమువలన అపథ్యమును పొందుచున్నవి. పై కారణముల వలననే పథ్యము కూడ నగుచున్నవి.

మూ॥ మాత్రయా సేవితం మద్యం హంతి రోగాను స్తదుద్భవాన్॥
నిషేవ్యమాణం తిలశో విషమప్యమృతాయతే।
హీనాతి మాత్ర మశనం మరున్ని చయ కోపనమ్॥
భజతో విషరూపత్వం తుల్యాంశే మధుసర్పిషీ।
క్షారోఽమ్ల రస సంయోగే మధురీభవతి క్షణాత్॥
ఉత్తుండ క్యాస్తిందుకేన తిక్తతా మధురాయతే।
హింగు గైరిక సిన్ధూత్థం గన్ధ వర్ణ రసాధికమ్॥
పూగ తాంబూల శంఖేభ్యో వర్ణ గన్ధ రసోద్భవః।
కోద్రవో హన్త్య సృక్పిత్తం కరోత్యేవ విదాహిభిః –

ప్రతిపదార్థము : మద్యమ్ = మద్యము; తదుద్భవాన్ = మద్యము వలన యేర్పడిన; రోగాన్ = రోగములను; మాత్రయా = మాత్రా ప్రమాణముతో, సేవితమ్ = సేవింపబడినది; హంతి = నశింప జేయుచున్నది; తిలశః = తిల ప్రమాణము; నిషేవ్యమాణం = సేవింపబడిన; విషమపి = విషముగూడ; అమృతాయతే = అమృతమువలె నగుచున్నది; హీనాతి మాత్రమశనం - హీనమాత్రం = హీన మాత్రలో సేవించబడిన; అశనం = ఆహారము; మరుత్ = వాతమును; అతి మాత్రమ్ అశనమ్ = ఎక్కువ మాత్రలో సేవింపబడిన ఆహారము; నిచయకోపనమ్ = సన్నిపాతమును ప్రకోపింప జేయుచున్నది; తుల్యాంశే = సమాన భాగ ములుగ తీసుకొన్న; మధు సర్పిషీ = తేనె, నెయ్యి; విషరూపత్వం = విషరూపత్వ మును; భజతః = పొందుచున్నది; క్షారః = క్షారము; అమ్లరస సంయోగే = ఆమ్లరసముతో సంయోగము అయిన తరువాత; క్షణాత్ = వెంటనే; మధురీ భవతి = మధురముగా నగుచున్నది; ఉత్తుండక్యాః = కానుగు యొక్క; తిక్తతా = చేదు; తిందుకేన = తుమికి చెట్టు సంపర్కముచేత; మధురాయతే = తియ్యగ నగు చున్నది; (తీపితో నమానముగ నగుచున్నది); హింగు = ఇంగువతో; గైరిక సింధూత్థం = గైరికము, సైంధవ లవణముతో గూడ; వర్ణగన్ధ రసోద్భవః = వర్ణము, గన్ధము, రసము పుట్టును; పూగ తాంబూలశంఖేభ్యః = వక్కలు ఆకు సున్నము వీటి కలయిక వలన; వర్ణగన్ధరసోద్భవః = విలక్షణమైన వర్ణము, గన్ధము

రసము పుట్టుచున్నవి; కోద్రవః = కొర్రలు; అసృక్పిత్తం=రక్తపిత్తమును; హన్తి=నశింపజేయుచున్నవి; విదాహిభిః=విదాహకర వస్తువులతో కూడి; అసృక్పిత్తం=రక్తపిత్తమును; కరోత్యేవ=చేయుచున్నవి.

**తాత్పర్యము :** శాస్త్రమునందు విధింపబడిన, సరియగు ప్రమాణములో సేవింపబడిన మద్యము, మద్యము అతిగా సేవించుటచేత సంభవించిన వికారములను గూడ నశింపజేయును. నువ్వుగింజ ప్రమాణములో తినిన విషము గూడ అమృతముతో సమానముగ నగును. హీన మాత్రలో భుజింపబడిన ఆహారము వాతమును, అతి మాత్రలో సేవింపబడిన ఆహారము సన్నిపాతమును ప్రకోపింపజేయును. సమాన మాత్రలో కలిపి భుజింపబడిన తేనె, నెయ్యి విషరూపమును చెందును.

క్షారము ఆమ్లము ఈ రెండు రసముల కలయిక వలన వెంటనే మధుర రసముత్పన్నమగును. కానుగ యందలి చేదు, తుమికి చెట్టు కలయిక చేత తీపికి సమానముగ నగుచున్నది.

ఇంగువ, గైరికము, సైంధవలవణముతో కలిపినయెడల సైంధవమునందు గైరికమునందు కూడా గంధము వచ్చును. గైరికము వలన ఇంగువ సైంధవ లవణములలో కూడ రంగు వచ్చును. సైంధవలవణమువలన ఇంగువ, గైరికముల యందు గూడ రసప్రతీతి ఏర్పడు చున్నది. వక్కలు, తమలపాకులు, సున్నము, వీటి నన్నింటిని కలిపిన అసంభవమైన, విలక్షణమైన వర్ణము, గంధము, రసము పుట్టును. కొర్రలు రక్త పిత్తమును నశింపజేయును. కాని విదాహకరమైన వస్తు సంయోగము చేత రక్తపిత్తమును కలిగించును.

**శశిలేఖ :** మద్యము వలన జనించిన రోగములను మద్యమే విశిష్టమైన మాత్రలో సేవించిన యెడల నశింపజేయుచున్నది.

విషము మరణము గలిగించునదైనప్పటికిని, తిల ప్రమాణము ప్రతి దినము అభ్యాసము చేసిన యెడల అమృతోపమానముగా పని చేయును. స్వల్ప భోజనము వాయువును ప్రకోపింప జేయుచున్నది. ఎక్కువ మాత్రతో కూడిన భోజనము సన్నిపాతము యొక్క ప్రకోపమునకు కారణమగుచున్నది. ఆరోగ్య వంతుడైనప్పటికిని, తేనె, నెయ్యి ఈ రెండు ద్రవ్యములను సమాన పరిమాణములో సేవించిన యెడల విషతుల్యములగుచున్నవి. కరంజము యొక్క చేదు తిందుకముతో కలియుటచేత మధురత్వమును పొందుచున్నది. ఇంగువ, గైరికము, సైంధవ లవణము, ఈ మూడును కలిసిన యెడల వాటియందు, గంధము, వర్ణము, రసము అధికమగుచున్నవి. ఇంగువ యొక్క సంయోగము చేత గైరికము నందు, సైంధవ లవణము నందు రసము, వర్ణము విశేషముగా అభివ్యక్తమగు చున్నవి. సైంధవ లవణము యొక్క సంయోగము వలన ఇంగువ సైంధవ లవణముల యందు రసము విశేషముగా ద్యోతకమగుచున్నది. వక్కలు,

తమలపాకులు, సున్నము ఈ మూడింటి యొక్క కలయిక చేత ప్రత్యేకమైన, విలక్షణమైన, వర్ణము మొదలగునవి ఉత్పన్నమగు చున్నవి. కొఱ్ఱలు రక్త పిత్త నాశకములు. కాని ఆ కొఱ్ఱలే విదాహకరములైన ఇతర ద్రవ్యముల యొక్క సంయోగము చేత రక్త పిత్తమును కల్గించుచున్నవి.

మూ॥ కుష్ఠం తత్కార్యపి తిలో హన్తి భల్లాతకైః సహ।
గుడః కర్తాగ్నిసాదస్య సహిన స్త్వభయాదిభిః॥
తృప్త్యత్యగ్నేః సమదనం సర్పిరప్యుపదిశ్యతే।
జీవనీయ మపి క్షీరం విషలేశేన మృత్యవే॥
తుల్యేఽపిహతో ఽన్యోఽన్యం విషేస్థావర జంగమే।
సక్తవో వాతలా రూక్షాః పీతాస్తే తర్పయన్తితు॥
వినాపి చోపయోగేన మణిమన్త్రాది కార్యకృత్।
ఆర్ద్రికాజ్జాయతే శుంఠీ, సంస్కారేణ లఘీయసీ॥
లఘుభ్యోపిహి సక్తుభ్యో గురవః సిద్ధ పిండికాః।
భృష్టః తుణ్ణోఽపి పృథుకో రక్తశాలేర్ల ఘోర్గురుః॥
శాలిః పిష్టో గరీయస్త్వం గోధూమాదపి గచ్ఛతి।

(దాగియున్న దోషములను వెలిపరచు స్వభావమును గలిగి యుండుట చేత)

ప్రతిపదార్థము : తత్కార్యపి = కుష్ఠమును కలిగించునదై నప్పటికిని, తిలః = నువ్వులు, భల్లాతకైః సహ = జీడిగింజలలో కూడి, కుష్ఠం = కుష్ఠమును, హన్తి = నశింప జేయుచున్నది, గుడః = బెల్లము, అగ్నిసాదస్య = అగ్నిమాంద్యమును, కర్తా = కల్గించునదై నప్పటికిని, సః = ఆ అగ్ని మాంద్యము, అభయాదిభిః = హారీతకీ, శుంఠీ మొ॥ వాటితో, హన్తి = చంపబడుచున్నది. తృప్తి = (తృప్తి) దప్పియందు, అత్యగ్నేః = అగ్నిదీపనకారి యయినప్పటికిని, సర్పిః = నెయ్యి, సమదనం = మైనముతో కూడిన యెడల, పథ్యం = పథ్యమని, ఉపదిశ్యతే = చెప్పబడుచున్నది, క్షీరం = పాలు, జీవనీయమపి = జీవనమున కాధారమైనప్పటికిన్ని, విషలేశేన = లేశమాత్రను విషము కలసిన, మృత్యవే = మరణము కొరకు, భవతి = అగుచున్నవి, స్థావరజంగమే = స్థావర జంగమాత్మకములైన, విషే = విషములు, అన్యోన్యః = ఒకదానితో నొకటి, తుల్యేఽపి = సమానములైనప్పటికిని గూడ, హతః = చంపును, సక్తవః = సక్తువులు, వాతలాః = వాత వర్ధకములు, రూక్షాస్తు = రూక్షకరములయి నప్పటికిని, తే = అవి, పీతాః = నీటిలో కలిపిత్రాగ బడిన యెడల, తర్పయన్తి = తర్పణమునుచేయు చున్నవి.

ఉపయోగేన వినాఽపి = గుడూచీ మొ॥ ద్రవ్యములవలె యుపయోగము లేకున్నప్పటికి, మణిమన్త్రాది = మణులు, మన్త్రములు మొ॥ కార్యకృత్ = తమతమ కార్యములు చేయుచున్నవి, ఆర్ద్రికాత్ = అల్లమునుండి, శుంఠీ = శొంఠి, జాయతే = ఏర్పడుచున్నది, సంస్కారేణ = సంస్కారము చేత, లఘీయసీ =

మిక్కిలి లఘుగుణము గలది. లఘుభ్యోఽపిహి=లఘుగుణము గలవై నప్పటికిని గూడ, సక్తుభ్యః=సక్తువుల వలన (తయారు చేయబడిన) సిద్ధపిండకాః=సిద్ధము చేయబడిన ముద్దలు,గురవః=గురుగుణముగలవి. లఘోః = లఘుగుణము గల, రక్తశాలేః=ఎఱ్ఱ రాజనాల వడ్లనుండి, క్షుణ్ణః=రోకలితో దంచబడినవైన, పృథుకః=అటుకులు, గురుః=గురువులు, గోధుమాదపి=గోధుమల కంటె గూడ, పిష్టః=పిష్టము చేయబడిన, శాలిః=రాజనాలు, గరీయస్త్వం=శ్రేష్ఠత్వ మును. గచ్ఛతి=పొందుచున్నవి.

**తాత్పర్యము :** నువ్వులు కుష్ఠ రోగమును పుట్టించును. కాని జీడిగింజ లతో కూడ కలిపి సేవించిన యెడల, కుష్ఠము నశింపజేయును. బెల్లము అగ్ని మాంద్యమును కల్గించును. కాని, కరక్కాయ, శొంఠి మొ॥ కలిపి సేవించిన యెడల అగ్నిమాంద్యమును పోగొట్టును. జాఠరాగ్ని తీక్ష్ణముగ నున్నప్పుడు కూడ, అగ్నిని వృద్ధిపరచుచున్న నెయ్యి కూడ మైనముతో కూడిన యెడల పథ్యకరమైనదిగా ఉపదేశింపబడినది. జీవనీయ గణ ద్రవ్యములతో సిద్ధము చేయ బడిన పాలు కూడ, స్వల్ప ప్రమాణము విషము కలిసిన యెడల మరణమునకు కారణమగుచున్నవి. స్థావర, జంగమ విషమును, సమానముగా మరణమును కల్గించునవై నప్పటికిని, ఒక వస్తువునకు ఒక వస్తువు, మరియొక వస్తువు నష్టపరచు చున్నది. సక్తువులు వాయువును వృద్ధి పరచునవైనప్పటికిని, నీళ్ళలో కలిపి త్రాగిన యెడల శరీరమునకు తర్పణము చేయుచున్నవి.

శరీరము లోనికి ఔషధ రూపకముగా ఉపయోగించనప్పటికిని మంత్ర ములు, మణులు మొ॥ శరీరముపై తమ తమ కార్యములను చేయుచున్నవి. ఇది వీటికి స్వభావము.

అల్లము నుండి శొంఠి తయారగుచున్నది. ఈ శొంఠి, సంస్కారమును కారణమును బట్టి, లఘువుగా యున్నది. మరియు లఘు గుణములుగల సక్తువుల నుండి గురుగుణము గల పిండి ముద్దలు గూడ తయారగుచున్నవి. ఎర్రరాజ నాలతో తయారు చేయుచున్న అటుకులు కూడ గురువుగ నున్నవి, తేలికగా నున్న రాజనాలు గూడ పిండిగా చేసిన తరువాత, గోధుమల కంటె గూడ ఎక్కువగా గురువుగా నున్నవి.

***శశిలేఖ :*** స్రోతస్సులలో దాగియున్న దోషములను వెలిపరచుట చేత కుష్ఠము బహిర్గతముగా చేయునవై నప్పటికిని, నువ్వులు జీడి గింజలతో చేర్చి సేవించిన యెడల, కుష్ఠమును, నశింప జేయుచున్నవి. అగ్నిమాంద్యమును చేయునదై నప్పటికిని, బెల్లము, హరీతకి, శుంఠి మొ॥ వానితో కలిపి సేవించిన యెడల, అగ్నిమాంద్యమును చేయదు. దప్పిలో అగ్నిదీపన కార్యమైనప్పటికిని ఘృతము, మైనముతో కలిపిన యెడల, పథ్యము. జీవనీయ క్షీరము ప్రాణ ధారకమైనప్పటికిని స్వల్ప విషము కలిపిన యెడల, మానవుని చంపును.

స్థావర, జంగమములు రెండును విషములైనప్పటికిని, పరస్పర నాశకారకములు. ఎటులనగా స్థావర విషము జంగమ విషముతో నశించుచున్నది. జంగమ విషము స్థావర విషముతో నశించుచున్నది. అల్లము వలన శొంఠి పుట్టుచున్నది. శొంఠికి లఘు గుణము చెప్పబడుచున్నది. ఇది సంస్కార విశేషము. స్వభావము చేత లఘుగుణము గలది రక్తశాలి, దానితోనే తయారు చేయబడిన అటుకులు గురు గుణము గలవి. ఇది క్రియా స్వభావకృత విశేషము.

మూ॥ లఘు పిత్తహరా లాజా వ్రీహితో గురు పిత్తలాత్॥
సంగ్రాహిణో లఘోర్ముద్గాత్ కుల్మాషో భేదనో గురుః।
ఆమం గ్రాహితరం తక్రం నగరీ కృత మార్దివమ్॥
గుడాత్తో యాచ్చ సుతరాం మూత్రలం గురుపానకమ్।
గరీయో గుడ దధ్యుత్థా రసాలా చాతి శుక్రలా॥
దండాభి మదనాద్దధ్ని గురుణశ్చాతి శోఫదాత్।
అనుద్ధృత స్నేహమపి తక్రం శోఫహరం లఘు॥
సర్పిః స్నిగ్ధతరం హన్తి న్యార్దితం నవనీతవత్।

ప్రతిపదార్థము : గురుపిత్తలాత్ = గురుగుణము, పిత్తవర్ధకములైన వ్రీహితః = వడ్లనుండి తయారు చేయబడిన, లాజా = పేలాలు, లఘుపిత్త హరా = లఘువుగా పిత్త హరములుగా నుండును, సంగ్రాహిణః = మల బంధమును చేయునట్టి, లఘోః = లఘుగుణము గల, ముద్గాత్ = పెసల నుండి, భేదనః = మలమును భేదించునట్టి, గురుః = గురుగుణముగల, కుల్మాషః = పులియబెట్టిన కడుగు నీరు తయారగుచున్నది. ఆమం తక్రం = కాచని మజ్జిగ, గ్రాహితరం = ఎక్కువ మలబంధమును చేయును, ఖలీకృతమ్ = కాచబడిన, తత్ = ఆమజ్జిగ, అన్యథా భవతి = సంగ్రాహకముగాదు.

గుడాత్ = బెల్లము వలన, తోయాత్ = నీటివలన, పానకమ్ = పానకము, సుతరాం = మిక్కిలి, మూత్రలం = మూత్రమును చేయును, గురు = గురుగుణ ములుగల, గుడదధ్యుత్థా = బెల్లము, పెరుగు ఈ రెంటితో తయారు చేయ బడిన, రసాలా = రసాలము, గరీయః = మిక్కిలి శ్రేష్ఠమైనది, చ = మరియు, అతిశుక్రలా = మిక్కిలి శుక్రమును వృద్ధిచేయును, గురుణః = గురు గుణము గల, అతిశోఫదాత్ = మిక్కిలి వాపును గల్గించుచున్న, దధ్నః = పెరుగునుండి, దండాభిమథనాత్ = కవ్వముతో చిలుకుట వలన తయారైన, తక్రం = మజ్జిగ, అనుద్ధృతస్నేహమపి = వెన్న తీయకపోయినప్పటికి కూడ, శోఫహరం = వాపునుపోగొట్టును (శోధను); లఘు = లఘుగుణముగల్గి యుండును, స్నిగ్ధతరం = మిక్కిలి స్నేహముతో కూడిన, సర్పిః = నెయ్యి, అర్దితం = అర్దిత వాతమును, హన్తి = నశింప జేయుచున్నది; నవనీతవత్ = వెన్నవలె, న = కాదు.

తాత్పర్యము ; గురుగుణముగల్గి, పిత్తవర్ధకములైన, వడ్లవలన తయారు

చేయబడిన, పేలాలు, లఘుగుణము గలవి. మరియు పిత్తమును నశింప జేయును. మలబంధమునుచేయు, మరియు లఘుగుణముగల పెసలతో మలమును భేదించు గురుగుణముగల కుల్మాషము తయారగు చున్నది. కాచని మజ్జిగ ఎక్కువ మల బంధమును చేయును. కాచిన మజ్జిగ అంతమలబద్ధమును చేయదు, బెల్లము, నీళ్ళు ఈ రెంటియొక్క కలయికచే తయారు చేయబడిన పానకము మిక్కిలి మూత్రలముగా నుండును. బెల్లము, పెరుగు గురుగుణము గలవి. వీటితో తయారు చేయబడిన, తక్రము, వెన్నతీయక పోయినప్పటికిని, శోఫను పోగొట్టును. మరియు లఘుగుణము గలది. అర్దిత వాతరోగమును, మిక్కిలి జిడ్డుతో గూడిననెయ్యి, ఎట్లు నాశనముచేయు చున్నదో అట్లే వెన్న నశింపజేయుటలేదు.

*శశిలేఖ* : పిత్తమును వృద్ధిచేయు గురుగుణముగల వడ్లనుండి తయారు చేయబడిన పేలాలు, లఘుగుణము గలవి. పిత్తహరములు. ఇది సంస్కార విశేషము. మలబంధమును చేయు స్వభావముగల, లఘుగుణముగల పెసలనుండి పుట్టిన కుల్మాషము మలమును భేదించును. గురుత్వమును పొందించును. ఇదియును, సంస్కార విశేషమే. కుల్మాషమనగా (అల్పస్విన్నాని సస్యాని అని యర్థము, పెసలను నానబెట్టిన మరుసటి దినము, వాటిపై మొలకెత్తును. వీటినే కుల్మాషములందురు.) కాచని మజ్జిగ ఎక్కువ మలబంధమును చేయును. కాచబడిన మజ్జిగ స్వల్పముగా మలబంధమును చేయును. బెల్లముచేత, నీటిచేత తయారుచేయబడిన పానకము మిక్కిలి మూత్రమునుచేయును. ఇచటగుడము మూత్రలము, జలము మూత్రలము కానపానకము అతి మూత్రలము. బెల్లము, పెరుగు అతి గురువు. వీటి రెంటిచేత తయారు చేయబడిన రసాలము అతి గురు తరము, అతి శుక్రలము. ఇది క్రియాసంయోగ విశేషము, గురు గుణము గలిగి శోఫను గలిగించు పెరుగు; దండమథనాది విశేషముల చేత తయారైన తక్రము, వెన్న తీయకపోయినను లఘుగుణము గలిగి శోఫనుహరించును. అర్దితవాతమును పోగొట్టునది నెయ్యి. నవనీతము అర్దిత వాతమును పోగొట్టును. ఇది స్వభావ విశేషము.

మూ॥ చక్షుష్యోఽపిహి గోధూమ స్తైలపక్వస్తు నృష్టిహా॥
మూలకం దోష జననం స్నిగ్ధ సిద్ధంత్వ దోషలమ్।
ఉష్ణం విషీభవత్యేవ విషఘ్నమపి మాక్షికమ్॥
దుర్భాజనస్థా ద్రాక్షామ్లా దోషలా చ ప్రజాయతే।
శ్లక్ష్ణ శుష్క ఘనో లేప శ్చందన స్యాపి దాహకృత్॥
త్వగ్గత స్యోష్మణో రోధా చ్ఛీతకృత్త్వన్యథా గురోః।
మేధ్యా స్తిలాః స్పర్శశీతో మేధ్యం తైలం ఖలో హిమః॥
తస్యైవ శ్లేష్మకారిత్వం నతైలస్య ఖలస్య వా॥

ప్రతిపదార్థము : గోధూమాః = గోధుమలు, చక్షుష్యం = నేత్రములకు

మంచివి,అపి=అయినాకూడ, తైలపక్వస్తు=నూనెలో వండినయెడల,దృష్టిహా=చూపును నశింపజేయును. మూలకం=ముల్లంగి, దోషజననమ్=దోషకారము. పరంతు=కాని, స్నిగ్ధసిద్ధం=నూనెలో వండిన యెడల, అదోషలమ్=దోషమును చేయదు. విషఘ్నమపి=విషమును హరించునదైనప్పటికి గూడ, మాక్షికమ్=తేనె, ఉష్ణం=వేడి చేసిన యెడల, విషీభవత్యేవ=విషముగనే యగుచున్నది, దురాభాజనస్థా=దుష్టమైన పాత్రలో నుంచిన (అపరిశుద్ధమైన), ద్రాక్షా=ద్రాక్ష, అమ్లా=పుల్లనిదిగా, చ=మరియు, దోషలా = దోషములను ప్రకోపించునదిగా, ప్రజాయతే = అగు చున్నది. చందనసా = చందనము, దాహకృతోపి=మిక్కిలిదాహమునునశింపజేయునదైనప్పటికిని, లేపః=లేపము, శ్లక్ష్ణః=పొడిగా చేయబడిన, శుష్కః = ఎండిన, ఘనస్యా = గట్టిగా నుండునట్టిది, త్వగ్గతస్య = చర్మముతోనున్న, ఊష్మణః=వేడియొక్క, లోహాత్=అడ్డగించుట వలన, దాహనాశనే=మంటను పోగొట్టుటలో, నసమర్థః = సమర్థముగాదు. అగురోః = అగురు, శీతకృత్=శీతమును చేయును. తిలః=నువ్వులు, మేధ్యః = బుద్ధికి మంచివి. స్పర్శశీతః = తాకినయెడల, చల్లగానుండును, తైలం=తైలము, మేధ్యం=బుద్ధికి మంచిది, ఖలః=తెలకపిండి, హిమః=శీతలముగా నుండును, తస్యైవ=ఆ నవ్వులకే, శ్లేష్మకారిత్వం = శ్లేష్మమును వృద్ధి చేయు గుణము ఉన్నది, తైలస్య=తైలములకు, వా = లేక, ఖలస్య=తెలక పిండికిని, న=లేదు.

తాత్పర్యము : కన్నులకు చాల మంచివైనప్పటికి గూడ గోధుమలు తైలములో వండిన యెడల చూపును నశింప జేయునవిగా నున్నవి. ముల్లంగి దోషములను వృద్ధిచేయునదైనప్పటికిని, పక్వము చేసిన దోషకరముగాదు. విషమును నశింప జేయునదైనప్పటికిని, తేనె వేడిచేసిన యెడల విషముగా మారుచున్నది. అపరిశుద్ధమైన పాత్రలో నుంచిన, ద్రాక్ష పుల్లగా దోషముల యొక్క వృద్ధిని చేయునదిగా అగు చున్నది చందన లేపము మంటలను నశింప చేయును. కాని, మెత్తగా చూర్ణించినది, ఎండినది, గట్టిబడిపోయినది, చర్మము నందలి వేడిని లోపలనే బంధించి దాహమును వృద్ధి జేయుచున్నది.అగరుఉష్ణస్పర్శ గల్గిన దైనప్పటికిని, పలుచగా తడిగా నున్న లేపము శీతకారముగా నగు చున్నది. నువ్వులు బుద్ధికి మంచివి. శీతస్పర్శ గలవి. తైలము బుద్ధికి మంచిది. తెలకపిండి శీతలము. ఈ మూడును కఫమునకు సమాన గుణము కలవైనవై నప్పటికిని, నువ్వులే కఫమును వృద్ధి చేయును. ఖలము, తైలము ఈ రెండును కఫమును వృద్ధి చేయవు.

శశిలేఖ : తాత్పర్యాంశమే.

మూ॥ దధ్నిశ్వయథు కారిత్వం నతక్ర నవనీతయోః॥
భూమిసాత్మ్యం దధిక్షీర కరీరం మరు వాసిషు।
క్షారః ప్రాచ్యేషు మత్స్యాస్తు సైంధవేష్వశ్మకేషుతు॥

తైలామ్లః కన్దమూలాది మలయే కోంకణే పునః।
పేయా మన్థ ఉదీచ్యేషు గోధూమోఽవన్తి భూమిషు॥
బాహ్లీకా బాహ్లవా శ్చీనాః శూలికా యవనాః శకాః
మాంస గోధూమ మార్ద్వీక శస్త్ర వైశ్వానరోచితాః॥
దేహసాత్మ్యం ఘృతంక్షీరం మద్యం మాంసంచ కస్యచిత్।
పేయా యూషో రసోఽన్యస్య గోధూమోఽన్యస్యశాలయః॥
అహితైరపి తేషాంచ తైరేవోపహితంహితమ్॥

**ప్రతిపదార్థము** : దధ్నః = పెరుగు వలన, శ్వయధుకారిత్వం=వాపు వచ్చును, తక్రనవనీతయోః=మజ్జిగ, వెన్నవలన, న=రాదు; మరు వాసిషు= మార్వాడీలకు, దధి=పెరుగు క్షీరం=పాలు, కరీరం=కరీరము, భూమిసాత్మ్యం= భూమిసాత్మ్యమువలన, ప్రాచ్యేషు=ప్రాచ్య దేశవాసులకు, క్షారః=క్షారము, సైంధవేషు=సింధు ప్రాంతము నందలి జనులకు, మత్స్యాః=చేపలు, అశ్మకేషు= పఠానుదేశ వాసులకు, తైలామ్లం=తైలము మరియు, ఆమ్లము, మలయే= నీలగిరి పర్వత ప్రాంత వాసులకు, కన్దమూలాది = కందములు, మూలములు మొ॥, పునః=మరియు, కోంకణే=కోంకణ దేశవాసులకు, పేయా=గంజి, ఉదీచ్యేషు=ఉత్తర ప్రాంతీయులకు, మన్థః=మంథము, అవయిన్తి భూమిషు= అవంతీ దేశవాసులకు, గోధూమః = గోధుమలు, బాహ్లీకాః=బాహ్లీకులు, బాహ్లవాః = బాహ్లవులు, చీనాః=చైనీయులు, యవనాః=యవనులు, శకులు, మాంస, గోధూమ, మార్ద్వీకా శస్త్ర వైశ్వానరోచితాః=మాంసము, గోధుమలు, ద్రాక్ష, చేకులు (మాంసమును కడ్డీకిపెట్టి కాల్చి తినుట) మరియు తగిన అన్నపానౌషధములు, భూమి సాత్మ్యం = ఆయాభూములకు సాత్మ్యములు, దేహసాత్మ్యం=శరీరమునకు సాత్మ్యములు, ఘృతం=నెయ్యి, క్షీరం= పాలు, మద్యం=మద్యము, మాంసము, కస్యచిత్=ఎవనికో, పేయా=గంజి, యూషః=యూషము, రసః=మాంసరసము, అన్యస్య=ఇతరునికి, గోధూమః= గోధుమలు, అన్యస్య=మరియొకనికి, శాలయః=బియ్యము, దేహసాత్మ్యం= శరీరమునకు సాత్మ్యములుగా అగుచున్నవి, తేషాం=వారికి, అహితైరపి= హితముకాని పదార్థములైనప్పటికిని, తైరేవ=వాటి చేతనే, ఉపహితం= ఉపయోగింపబడినవి, హితం=పథ్యములుగా అగు చున్నవి.

**తాత్పర్యము** : పెరుగు స్నిగ్ధ గుణయుత మగుటవలన శోథకారకముగా నగుచున్నది. పరంతు మజ్జిగ, వెన్న ఈ రెండును. స్నిగ్ధ గుణము కలవైనప్ప టికిని, శోథకారకములు కావు. ఈ క్రిందనుదాహరించు ద్రవ్యములు, ఆయా ప్రదేశములందు నివసించు మానవులను నిత్యాభ్యాసము వలన సాత్మ్యము లగు చున్నవి. ఎట్లనగా: మరుదేశ వాసులైన మార్వాడీలకు, పెరుగు, పాలు, కరీరము ఇవి సాత్మ్యములు, ప్రాచ్యదేశవాసులకు క్షారము, సింధు ప్రాంతీయు లకు చేపలు, పఠాను దేశవాసులకు, తైలము మరియు పులుపును, నీలగిరి పర్వత

ప్రాంత వాసులకు కంద మూలాదులు, కోంకణ దేశవాసులకు గోధుమలు, బాహ్లిక, బాహ్లవ, చీనా దేశీయులకు మాంసము మొ॥ సాత్మ్యములు.యవన, శకులకు మాంసము గోధుమలు, ద్రాక్ష మొ॥ సాత్మ్యములు. నిత్యాభ్యాసము వలన కొన్ని వస్తువులు శరీర సాత్మ్యములగును. ఎవరికైననూ నిత్యమభ్యసించుటవలన, ఘృతము, పాలు మద్యము, కొందరికి పేయా, యూషము మాంసరసము, మరికొందరికి గోధుమలు, కొందరికి బియ్యము, శరీరమునకు సాత్మ్యములు, ఈ మానవులకు అపథ్యాకర పదార్థములతో కూడకలిపి భుజింపబడు అన్నపాన, ఔషధములు గూడ, హితకరములుగా నగును.

*శశిలేఖ :* పెరుగు స్నిగ్ధమైన దగుట వలన, వాపునుకలిగించును. అస్నిగ్ధ గుణముగల నవనీతము, తక్రము వాపునుకలిగించుటలేదు. ఇది ప్రత్యక్ష సిద్ధము. ఇది స్వభావ విశేషము. తక్కిన విషయము సువిదితము.

**మూ॥** అన్న పానౌషధం దోష మాత్రా కాలా ద్యపేక్షయా।
సాత్మ్యం హ్యాశు బలంధత్తే నాతి దోషంచ బహ్వపి।
స్రంసనం సత్పయో గవ్యం భవతి గ్రాహి కస్యచిత్॥
మన్దోఽగ్నిర్భవతి ప్రాయః కఫ వాతోత్తరే హిమే।
విషఘ్నేనాపి పయసా దేహేఽహేర్వర్ధతే విషమ్॥
స్థూల స్థవిర బాలాదౌ వమనాది నిషిధ్యతే।
తక్రమామం కఫం కోష్ఠే। హన్తి కంఠే కరోతితు॥
వాతహ్యృతీఽపి మృద్వీకాఖర్జూరం కోష్ఠ వాతకృత్।

*ప్రతిపదార్థము :* దోషమాత్రాకాద్యపేక్షయా = దోషము, మాత్ర కాలము మొ॥ వాటి యొక్క నిర్ణయానుసారముగ; అన్నపానౌషధం = అన్నము, పానము, ఔషధము ఈ మూడును; సాత్మ్యం = సాత్మ్యముగా; భవతి = అగుచున్నవి; ఆశు = త్వరగా; బలం = బలమును; ధత్తే = ఇచ్చుచున్నవి; బహ్వపి = మాత్ర అధికమైనప్పటికి గూడ; అతిదోషం = మిక్కుటముగ దోషమును; నకరోతి = చేయదు; గవ్యంపయః = ఆవుపాలు; = సంస్రనంసత్ = స్రంసనమైననుగూడ; కస్యచిత్ = ఒకనికి; గ్రాహి = మలబంధమును చేయునదిగా; భవతి = అగుచున్నది; ప్రాయః = తరచుగా; కఫవాతోత్తరే = కఫవాత ప్రధాన వ్యక్తుల విషయములో; హిమే = శీతకాలమునందు; అగ్నిః = జాఠరాగ్ని; మన్దః భవతి = మన్దమగుచున్నది; విషఘ్నేనాపి = విషమును హరించునదైనప్పటికిని; పయసా = పాలతో; అహేః = పాముయొక్క; దేహే = శరీరము నందు; విషం = విషమును; వర్ధతే = వృద్ధి చెందుచున్నది; స్థూల స్థవిర బలాదౌ = స్థూలురు, బాలురు; వృద్ధులు మొ॥ వారి విషయములో; వమనాది = వమనము మొ॥; నిషిధ్యతే = నిషేధింపబడుచున్నది; ఆమం తక్రం = కాచనిమజ్జిగ; కోష్ఠే = కోష్ఠము నందలి; కఫం = కఫమును; హన్తి = నశింపజేయుచున్నది; మృద్వీకా = ద్రాక్ష;

ఖర్జూరం = ఖర్జూరమును; వాతహృత్వేఽపి = వాత నాశకరములైనప్పటికిని; కోష్ఠవాతకృత్ = కోష్ఠములోనుండు వాతమును వృద్ధి చేయును.

తాత్పర్యము : దోషముల యొక్క సామ్యావస్థలను, విధిప్రకారము, ఆహారమాత్రాపరికల్పనము, దిన, వార. మాస, ఋతు విభాగములను బట్టి కాల నిర్ణయమును, శాస్త్ర ప్రకారము నిర్ణయించి, ఆహారము, ఔషధము, పానము ఈ మూడును, సమస్త ప్రాణికోట్లకు, సాత్మ్యములుగా నగుచున్నవి. మరియు వెంటనే పైనుదాహరించిన మూడును బలమును గూడ శరీరమునకు ప్రసాదించుచున్నవి. ఒకవేళ ఆహార మాత్ర అధికమైనప్పటికి గూడ, మిక్కుటముగ దోషములను వృద్ధి చేయజాలదు. ఆవుపాలు సంస్రసనమైనను అవి కొందరికి మల బంధమును చేయును.

తరచుగా శీతకాలమునందు కఫవాత ప్రధానులైన వ్యక్తుల విషయములో జాఠరాగ్ని మందగించును.

విషఘ్నమైన పాలవలన, పాము యొక్క శరీరములో వృద్ధి చెందును. మేదస్వులు, బాలురు, వృద్ధులు వీరి విషయములో వమనము మొ॥ కఠిన చికిత్సలు నిషేధింప బడుచున్నవి.

కాంచని మజ్జిగ కోష్ఠము నందలి కఫమును హరించును. వాతనాశకరములైన ద్రాక్ష, ఖర్జూరము, కోష్ఠములో నుండు వాతమును వృద్ధి చేయును.

*శశిలేఖ* : దోషాదులకు అపేక్షించి కొందరి విషయములో దోషాద్యవస్థావిశేషములను బట్టి సాత్మ్యములైనవైనప్పటికి అహితములగును. అహితములైనను, సాత్మ్యము వలన హితములగును అను విషయము కొన్ని ఉదాహరణల చేత సిద్ధాన్తీకరించుచున్నారు. సాత్మ్యము వెంటనే బలమును ప్రసాదించును. మాత్రాదుల నెక్కువగా చేసినప్పటికిని, అది దోష ప్రకోపకరముగాదు తక్కిన

మూ॥ నాతిపథ్యః శిఖీ పథ్యః శ్రోత్ర స్స్వరవయోదృశామ్
దృష్టైః స్పర్శ హిమం ద్రవ్యం శ్రోత్రస్యోష్ణం తుపూజితమ్॥
పయస్స్వాదు సరం శీతం విపరీతంతతో దధి॥
కాలేన జాయతే తస్మాత్ క్షీర వచ్చ పునర్ఘృతమ్।
పయోదధిచ వాతఘ్నమజాతం వాతలంతుతత్:
తక్రంగ్రాహి కషాయామ్ల మమ్లమే వతు భేదనమ్।
ధాతకీగుణతోయాని కారణం మద్య శుక్తయోః॥
శీతేనతు తదాద్యన్తే స్నిగ్ధామ్లంవణాః। (తా)
ఉదమన్థ దివాస్వప్నౌ గ్రీష్మాదన్యత్ర గర్హితే॥
సమయోగేఽపి ఘర్మాద్యా వాతాదిచ యహేతవః।

ప్రతిపదార్థము : శిఖా = నెమలి, నాతి పథ్యః = స్వస్థుల కొఱకు

మిక్కిలి పథ్యకరమైనది గాదు. శ్రోత్ర స్వరవయోదృశామ్ = వృద్ధావస్థలో నున్నవారికి, దృష్టికి, పథ్యః = పథ్యకరమైనది. దృష్టేః = చూపుకు, స్పర్శహిమం = శీతలస్పర్శగల, ద్రవ్యం = ద్రవ్యము, పథ్యం = ప్రశస్తమైనది. తు = అయితే, శ్రోత్రస్య = చెవికి, ఉష్ణంద్రవ్యం = వేడి స్పర్శగలద్రవ్యము, పూజితమ్ = పూజనీయమైనది; పయః = పాలు, స్వాదు = తీయనైనవి, సరం = విరేచనకారి, శీతం = శీతలమైనవి; తతః = ఆవు పాలకంటె, దధి = పెరుగు, విపరీతం = విపరీతమైనది. క్షీరవత్ = పాలవలె, తస్మాత్ = ఆ పెరుగునుండి, పునః = మరల, కాలేన = కాలాంతరమందు, ఘృతం = నెయ్యి, జాయతే = ఏర్పడుచున్నది, పయః = పాలు, చ = మరియు, దధి = పెరుగు, వాతఘ్నం = వాతమును నశింపజేయుచున్నది. అజాతం = పాలకు, పెరుగుకు మధ్యనున్న పెరుగు, వాతం = వాతకారకము. తక్రం = తక్రము, కషాయామ్లం = వగరుగా, పుల్లగనున్నది, గ్రాహి = మల బంధమును చేయును. తు = అయితే, అమ్లమేవ = పుల్లగానున్న, తక్రం = తక్రము, భేదనం = మలమును భేదించును. ధాతకీ, గుడతోయాని = ఆరెపువ్వులు, బెల్లము, నీళ్ళు, మద్యశుక్తయోః = మద్యమునకు, శుక్తికి, కారణం = కారణముగా నున్నవి. శీతే = శీతాకాలమునందు, స్నిగ్ధామ్ల లవణాః = స్నిగ్ధము, ఆమ్లరసము, లవణరసములు, హితాః = హితకరములు, తు = అయితే, తదాద్యన్తే = శీతకాలముయొక్క ప్రారంభము నందు, లేక అంతమందు, న = ప్రశస్తముకాదు, గ్రీష్మాత్ = గ్రీష్మర్తువును వదలి, అన్యత్ర = మిగిలిన ఋతువులలో, ఉదమన్థః = ఉదమంథము (నీళ్ళలో కలిపిన సక్తువు), దివాస్వప్నౌ = పగటియందు నిద్రించుట, గర్హితే = నిందింపబడినది. సమయోగేపి = సమయోగము ఉన్నప్పటికిని, ఘర్మాద్యాః = గ్రీష్మము మొ॥ ఋతువులు, వాతాది చయ కేతవః = వాతాదులయొక్క సంచయములకు కారణములగుచున్నవి.

**తాత్పర్యము :** నెమలి ఆరోగ్యవంతులకు మిక్కిలి పథ్యకరమైనదికాదు. కాని ఈ నెమలి, వృద్ధావస్థయందు నేత్రముల కొఱకు మిక్కిలి ప్రశస్తమైనది. నేత్రములకు శీతల ద్రవ్యము ప్రశస్తమైనది. మరియు చెవులకొఱకు ఉష్ణద్రవ్యము ప్రశస్తమైనది. పాలు మధురముగా ఉండును. విరేచనకారి. శీతలము. పెరుగు అమ్ల రసము కలది. మలబంధమును చేయును, ఉష్ణవీర్యము. కాలాంతరమందు పెరుగు నుండి, నెయ్యి పుట్టుచున్నది. ఈ నెయ్యి పాలతో సమానమైనది. పాలు వాతమును నశింప జేయును. పాలు పెరుగుగా మారుటకు ముందు తయారైన పెరుగు వాతమును చేయును. వగరుగా, పుల్లగా, నున్న మజ్జిగ, మలబంధమును చేయును. కేవల అమ్లరసముతో కూడిన తక్రము మలమును భేదించును.

ఆరెపూలు, బెల్లము, నీళ్ళు ఈ మూడును మద్యము, శుక్తము తయారగుటకు కారణములుగా నున్నవి. కాని ఈ మూడును స్వయముగా శుక్తములు,

మద్యములు కావు. శీతకాలమునందు స్నిగ్ధ, ఆమ్ల, లవణరసములు హితకారకములు, శీతకాలము యొక్క ప్రారంభమునందు లేక అంతకాలమునందు ప్రశస్తములు కావు. గ్రీష్మ ఋతువును వదలి పెట్టి మిగిలిన ఋతువులయందు ఉదమంథము, మఱియు పగటి నిద్ర ఇవి రెండును ప్రశస్తములు కావు. గ్రీష్మ ఋతువు మొదలుకొని, తక్కిన ఋతువులకు సమయోగము ఉన్నప్పటికిని, వాతాది దోషముల యొక్క సంచయమునకు కారణములగుచున్నవి.

శశిలేఖ : తాత్పర్యాంశమే.

మూ। ఋతుష్వన్యో రసేష్వన్యో రౌక్ష్యే, స్నేహే బలేక్రమః ।
రసాయనీ కాకమాచీ సద్యః పర్యుషితావిషం ।
మూలకం దోషజిద్బాలం విపరీతంతు కన్దవత్ ।
జ్వరే పేయాః కషాయాశ్చ సర్పిః క్షీరం విరేచనమ్ ।
షడహం షడహం యుంజ్యాద్వీక్ష్య దోషబలాబలమ్ ॥
ఛర్ది, హృద్రోగ గుల్మార్తే వమనంచ చికిత్సితే ।
నిషిద్ధమపి నిర్దిష్టం బస్తిరర్శసకుష్ఠినోః ॥
జ్వరే తుల్యర్తు దోషత్వం ప్రమేహే తుల్య దూష్యతా ।
రక్త గుల్మే పురాణత్వం సుఖ సాధ్యత్వ హేతవః ॥
ఆశ్చ్యోతన మభిష్యందే యుంజీతోర్ధ్వం దినత్రయాత్ ।

ప్రతిపదార్థము : ఋతుషు=శిశిరాది ఋతువులయందు; రూక్ష స్నేహ బలక్రమః=రూక్షము, స్నేహము, బలము, వీటియొక్క; క్రమః=క్రమము; అన్యః=వేరైనది; రసేషు=మధురాది రసముల యందు; అన్యః = వేరుగ యున్నది; కాకమాచీ=కాకమాచి; సద్యః= వెంటనే; రసాయనీ=రసాయనమును చేయును; పర్యుషితా=ఒకరాత్రి గడచిన కాకమాచి; విషం=విషముగా నగును; బాలం మూలకం=లేత ముల్లంగి; దోషజిత్=త్రిదోషములను జయించును; కన్దవత్=కందమువలె ముదిరిన తరువాత; విపరీతం=దోషకారకముగ నున్నది; జ్వరే=జ్వరమునందు; దోషబలాబలం=దోషముల యొక్క బలాబలమును; వీక్ష్య=పరామర్శించి; షడహం, షడహం=ఆరారు దినముల తరువాత, పేయాః=పేయలు (గంజి); కషాయాః=కషాయములు; సర్పిః= నెయ్యి; క్షీరం=పాలు; విరేచనమ్=విరేచనమును; యుంజ్యాత్=ఇవ్వవలయును.

ఛర్ది హృద్రోగ గుల్మార్తే=వాంతులు, హృదయ రోగము, గుల్మము వీటితో పీడితులైన వాని విషయమున; వమనం=వమనము; నిషిద్ధమపి=నిషిద్ధమైనప్పటికిని; చికిత్సితమ్=చికిత్సతో విధేయమైనది; అర్శసకుష్ఠనోః=అర్శస్సు; కుష్ఠముగల వారికి; బస్తిః=వస్తి; నిషిద్ధమపి=నిషేధింబబడినదైనప్పటికిని; చికిత్సితమ్=చికిత్సలో; నిర్దిష్టమ్=చెప్పబడినది.

జ్వరే = జ్వరమునందు; తుల్యర్తు దోషిత్వం = ఋతువు దోషము సమానముగ నుండవలయును; ప్రమేహే = ప్రమేహామునందు; తుల్యదూష్యతా = దోష దూష్యములు సమానముగ నుండవలెను; రక్త గుల్మే = రక్త గుల్మము నందు, పురాణత్వం = పురాణత్వము, సుఖసాధ్యత్వ హేతవః = సుఖముగ చికిత్సా సిద్ధిని బడయుటకు కారణములుగా నున్నవి; అభిష్యందే = అభిష్యందమునందు; ఆశ్చ్యోతనం = ఆశ్చ్యోతనము; దినత్రయాత్ ఊర్ధ్వం = మూడు దినముల తరువాత; యుంజీత = ఉపయోగించవలెను.

తాత్పర్యము: శిశిరాది ఋతువులలో రూక్షత, స్నేహనము, బలము కొఱకు ఒక క్రమమున్నది. మధురాది రసముల కొరకు కూడ మరొక క్రమ మున్నది. ఎట్లనగా, శిశిర ఋతువులలో స్వల్పముగా రూక్షత యుండును. స్నేహాంశము, తక్కువగా యుండును. బలమధికము. మధురరసమును అతి బలముగా నుండును.

వసంత ఋతువులో శిశిర ఋతువున కంటె రూక్షత అధికముగా నుండును. స్నేహము కొంచెము తక్కువ. బలము మరింత ఎక్కువగా యుండును. రసము అమ్లము, స్నేహము, స్నిగ్ధత, బలము మధ్యము. గ్రీష్మ ర్తువు నందు రూక్షత అన్ని ఋతువుల కంటె అధికము. స్నేహము అన్నింటి కంటె తక్కువ. బలమును తక్కువగా నుండును. రసము లవణ రసము. సాధారణ బలము కలిగి యుండును. వర్షర్తువునందు రూక్షత కొంచెము తక్కువ. బలము మధ్యమము. రసము కటువు. హేమంత ర్తువు నందు రూక్షత అధికము. స్నేహము అధికము. బలము అధికము. రసము కషాయము.

మధుర రసము స్నిగ్ధగుణము, హేమంత ఋతువునందు అనుకూలనముగా నుండును. వసంత ఋతువునందు మానవులు మిక్కిలి బలవంతులుగా నుందురు. ఇది కాలస్వభావము. కాకమాచి వెంటనే రసాయనమును చేయును. ఈ కాక మాచియే ఒక దినముండిన యెడల విషముగా మారును. లేతముల్లంగి, త్రిదో షములను నశింప జేయును. ఈ ముల్లంగియే కందమువలె లావుగా నున్న యెడల త్రిదోషములను ప్రకోపింప జేయును. జ్వరము నందు దోషముల యొక్క బలాబలములను సమీక్షించి 6 దినముల తరువాత పేయ కషాయము, నెయ్యి, పాలు, విరేచనము మొ॥ ఇవ్వ వలయును.

ఎట్లనగా మొదట లంకణము చేయించిన తరువాత గంజి ఇవ్వవలయును. ఏడుదినముల తరువాత కషాయమును, పదునాలుగు దినముల తరువాత పాలను, ఇరవై యెనిమిదవ రోజు విరేచనమునకును ఇవ్వవలయును. ఇది మానవుల కందరికి సామాన్య విధిగా చెప్పబడినది. బలాబలములను వైద్యుడు సమీక్షించిన తరువాత ఈ క్రమములు న్యూనాధికములుగా మార్చుకొనవచ్చును.

వాంతులు, హృదయ రోగము, గుల్మరోగముల యందు, వమన కర్మ నిషిద్ధమైనప్పటికికూడ, చికిత్సలో చేయదగి యున్నది. ఇట్లే అర్శస్సు, కుష్ఠము ఈ రోగములతో బాధపడువారికి వస్తి నిషిద్ధము. అయినప్పటికి చికిత్సలో చేయ దగినది. ఎట్లనగా! దోషములు ఊర్ధ్వగాములైనపుడు వమనము నిషేధింపబడి నది. కాని వాంతులు ఎక్కువ దోషములతో కూడి యుండిన యెడల, వమ నము పథ్యము. హృదయరోగము, గుల్మరోగముల యందు వాత దోషము ఎక్కువగా, యుండుట వలన వమనకర్మ నిషేధింపబడినది. కాని కఫము ద్వారా వాయువునకు అవరోధము ఏర్పడుట చేత, వమనము ప్రశస్తమైనదిగా అంగీక రింపబడినది. ఇట్లే అర్శస్సునందు వాతము అధికముగా నున్నప్పటికి, వస్తి ప్రశస్తము. కుష్ఠరోగమునందు రూక్షత అధికముగా నున్నప్పటికి గూడ వస్తి పథ్యము.

జ్వరమునందు ఋతువు,దోషము సమానముగనుండుట, ప్రమేహమునందు దోష దూష్యములు సమానముగ నుండుట, రక్త గుల్మమునందు పురాణత్వము (పాతబడి పోవుట) ఉండుట ఇవన్నియు ఈ రోగములకు త్వరగా శాంతి ఏర్పడు టకు కారణములుగా చెప్పబడినవి.

అభిష్యందము నందు ఆశ్చ్యోతనము పథ్యకరమైనదైనప్పటికిని, మూడు దినముల తరువాతనే చేయవలయును.

***శశిలేఖ :*** వాంతులు మొ॥ వాటియందు వమనము నిషేధింప బడినప్ప టికిని, చికిత్సలో చెప్పబడినది. ఊర్ధ్వ భాగమునందు దోషములు సంచరించు చున్నపుడు వమనము మంచిది కాదు. అభిష్యందమునందు ఆశ్చ్యోతనము పథ్యమైనదైనప్పటికిని మూడు దినముల వరకు అది అపథ్యముగనే భావింప వచ్చును. ఇది అవస్థా విశేషము.

మూ॥ అంజనం పక్వదోషస్య ప్రతిశ్యాయేచ నావనమ్॥
నాతి ప్రవృద్ధే తిమిరే సిరామోక్షో విధీయతే।
దుష్టాస్ర సంభవేఽపిష్టో నాస్రపిత్తే సిరావ్యధః॥
అపథ్యం పథ్యమప్యన్నం నిశాయాం నేత్రరోగిణామ్।
అహితాః సక్తవః కుష్ఠే హితా స్తేతు ప్రమేహిణః॥
గుల్మినః క్షీర దధ్యాది హవుషాద్యైర్యుతం హిమమ్।
వాతలం వాత కోపేఽపి వర్షాసు మధు శస్యతే।
తదేవ మద్యం మద్యస్య విషస్యతు విషాన్తరమ్।
ఘృతమానూప దేశోత్థం హేమన్తేచ బలాధికమ్॥
ఆలస్య గౌరవే రూపం వాతజేఽపిజ్వరే పురః।
స్వేదైర్యాతి శమం దాహః ప్రాయోలశునపానజః॥

**ప్రతిపదార్థము :** పక్వదోషస్య=ఈ విధముగా దోషములు పక్వము చేసిన తరువాత; అంజనం=కాటుక; ప్రతిశ్యాయేచ=మరియు పడిశము నందు; నావనం=నశ్యము; నాతి ప్రవృద్ధే తిమిరే=తిమిరము మిక్కిలి వృద్ధి చెందక ముందే; సిరామోక్షః=సిరా మోక్షము; విధీయతే=విధింపబడుచున్నవి; నేత్ర రోగిణాం=నేత్రరోగము గల వారలకు; పథ్యమపి = పథ్యమైనదైనప్పటికిని; అన్నం=అన్నము; నిశాయాం=రాత్రియందు; అపథ్యం=అపథ్యమగు చున్నది; శుష్కాః=శుష్కములైన; సక్తవః = పేలాలు మొ॥ సక్తువులు; అహితాః=హితకరములుకావు; తేతు=ఆసక్తువులయితే; ప్రమేహిణః=ప్రమేహ రోగులకు; హితాః=హితములు; గుల్మినః=గుల్మరోగికి; క్షీరదధ్యాది=పాలు, పెరుగు మొ॥, అహితః=హితకరము కాదు; హపుషాద్యైః=హపుషాదుల చేత, యుతం=చేర్పబడినది; హితం=పథ్యమైనది; వర్షాసు=వర్షర్తువులయందు; వాతకోపేఽపి=వాత ప్రకోపమైనప్పటికి కూడ; వాతలం=వాతకారకమైన; మధు=తేనె; శస్యతే=ప్రశస్తమైనది; మద్యస్య=మద్యము వలన ఉత్పన్నమైన రోగమునకు; తదేవ మద్యమ్=ఆ మద్యమే ఔషధము; విషస్య = విషమునకు; విషాన్తరమ్=విజాతీయ విషమే; పథ్యః=పథ్యము; ఆనూపదేశోత్తం=ఆనూప దేశమునందు తయారు చేయబడిన; ఘృతం=నెయ్యి; హేమంతే=హేమంత ఋతువునందు; బలాధికం=బలమధిక మగుచున్నది; వాతజే=వాతము చేత కలిగిన; జ్వరే అపి=జ్వరములో కూడ; పురః=ముందు; ఆలస్య గౌరవే=ఆల స్యము, శరీర గురుత్వము; రూపం = రూపముగా నున్నది; లశున పాకజః= వెల్లుల్లినియుపయోగించుట చేత పుట్టిన; దాహః=దాహము; ప్రాయః = తరచుగా; స్వేదైః=స్వేదముల చేత; శమం యాతి=శాంతిని పొందుచున్నది.

**తాత్పర్యము :** ఈ విధముగ ఆమ దోషములు, పరిపాకమును చెందిన తరువాత అంజనము, ప్రతిశ్యాయమునందు నస్యము, మిక్కిలి వృద్ధి చెందనట్టి వంటి తిమిర రోగమునందు సిరా మోక్షము విధింపబడుచున్నవి. దుష్ట రక్తము వలన ఉత్పన్నమయిన రక్తపిత్తము నందు కూడ సిరా మోక్షణము ప్రశస్త మైనది కాదు. నేత్ర వ్యాధి పీడితులకు పథ్యకరమైన అన్నము కూడ రాత్రి యందు అపథ్యమగుచున్నది. శుష్క సత్తువులు అపథ్యకరములైనప్పటికిని, ప్రమేహ రోగులకు పథ్యములు. గుల్మ రోగికి పాలు, పెరుగు మొ॥ అపథ్య కరములైనప్పటికిని, బోడతరము మొ॥ వాటి చేత చేర్చినవి హితకరములు. వర్షర్తువునందు వాతము ప్రకోపము చెందినదైనప్పటికి కూడ వాత కారకమైన తేనె ప్రశస్తమైనది. మద్యముతో ఉత్పన్నమయిన రోగమునకు మద్యమే ఔష ధముగా నున్నది. విషమునకు విజాతీయమైన విషమే పథ్యము. ఆనూప దేశము నందు తయారు చేయబడిన నెయ్యి హేమంత ఋతువునందు మిక్కిలి బలమును ప్రసాదించుచున్నది. వాతమువలన కలిగిన జ్వరమునందు కూడ, ఆలస్యము, శరీర గౌరవము (కఫము యొక్క లక్షణము) లక్షణముగా నగుచున్నవి. వెల్లు

ల్లిని యెక్కువగా యుపయోగించుట వలన పుట్టిన దాహము, తరచుగా స్వేదముల చేత శాంతించుచున్నది.

*శశిలేఖ* : ఇక్లే పక్వమైన దోషమునకు అంజనము, ప్రతిశ్యాయమునందు నస్యము, మొదట పుట్టిన తిమిరమునందు సిరా మోక్షము విధింపబడినది. దుష్ట రక్తము వలన సంభవించినప్పటికిని గూడ, రక్తపిత్తమందు సిరావ్యధనము నిషేధింపబడినది. లశునము వల్ల పుట్టిన దాహము తరచుగా సమానమైన అగ్ని మొ॥ వాటి యొక్క స్వేదనము చేత శాంతించుచున్నది.

మూ॥ దివా స్వప్నాజ్జరాం యాతి భుక్తమన్యేద్యురద్య న।
కోష్ఠే రుద్ధోఽగ్నికృద్వాయు ర్మేదసాఽర్శోభి రగ్నిహృత్।
దుష్పానం దుర్జరం సర్పిర్దీపనం చపయోఽన్యథా
సర్పాది శవకోథేభ్యో వృశ్చికానాం సముద్భవః।
తే తైరేవ పునర్దష్టాః సద్యో ముంచతి జీవితమ్।
స్వయమేవ విషం తీవ్రం తాన్పునర్నాతి బాధ్యతే॥
సర్వాంగ వ్యాపి తేషాంచ శుక్రవత్సంస్మృతం విషమ్।
తన్మాంస ముపయోగాయ మాంస వర్గేచ పఠ్యతే।
ఛర్దిఘ్నీ మాక్షికా విట్ చ మాక్షికైవతు వామయేత్॥

**ప్రతిపదార్థము** : అన్యేద్యుః = ఒక దినము ముందుగా, భుక్తం = భుజింప బడిన అన్నము, దివాస్వప్నాత్ = పగలు నిద్రించుట వలన, జరాం = జీర్ణ మును, యాతి = పొందుచున్నది. అద్య = ఈరోజు భుజించిన ఆహారము, న = జీర్ణ ము కాదు. మేదసా = మేదస్సుతో, కోష్ఠే = కోష్ఠము నందు, రుద్ధః = అడ్డగింప బడిన, వాయుః = వాయువు, అగ్నికృత్ = జాఠరాగ్నిని వృద్ధి చేయుచున్నది. అయం వాయుః = ఈ వాయువే, అర్శోభిః = అర్శస్సుల చేత, అగ్నిహృత్ = అగ్నిని నశింప జేయుచున్నది. దుష్పానం = తాగుటకు కఠినమైన, దురర్జ = అలస్య ముగా జీర్ణమగుచున్న, సర్పిః = నెయ్యి, దీపనం = అగ్నినివృద్ధిచేయు చున్నది, చ = మరియు, అన్యథా = వేరుగా, పయః = పాలు, అస్తి = ఉన్నవి. సర్పాది శవ కోథేభ్యః = సర్పాదులయొక్క కుళ్ళిన శవముల నుండి, వృశ్చికానాం = తేళ్ళ యొక్క, సముద్భవః = పుట్టుక జరుగు చున్నది, తైరేవ = ఆ తేళ్ళ చేతనే, పునః = మరల, దష్టాః = కాటు వేయబడినవై, తే = అపాములు, సద్యః = వెంటనే, జీవితమ్ముంచతి = ప్రాణములను విడుచు చున్నవి. స్వయమేవ = తమకు తామే, తీవ్రం = తీవ్రమైన, విషం = విషము కల్గిన వైనప్పటికిగూడ (సర్పాదులు), తాన్ = ఆ తేళ్ళను, పునః = మరల, నాతి బాధతే = (ఎక్కువగా) బాధించవు, శుక్రవత్ = శుక్రము వలె, విషం = విషము, తేషాం = ఆ పాము లకు, సర్వాంగ వ్యాపి = సంపూర్ణమైన అంగములు యందు వ్యాపించి యున్న ప్పటికిగూడ, తన్మాంసమ్ = వాటియొక్క మాంసమును, మాంసవర్గే = మాంస

వర్గమునందు, ఉపయోగాయ=ఉపయోగించుట కొఱకు, పఠ్యతే=చెప్పబడినది. చ=మరియు, మక్షికావిట్ = తేనెటీగయొక్క మలము, ఛర్దిఘ్నీ=వాంతిని నశింపజేయుచున్నది, మక్షికైవతు=తేనెటీగను మాత్రమే, వామయేత్= వాంతిని చేయుచున్నది.

**తాత్పర్యము :** ముందు దినమున భుజించిన ఆహారము పగటి నిద్ర వలన జీర్ణమగును. ఈ దినము భుజించిన ఆహారము జీర్ణముకాదు. మేదస్సుతో కోష్ఠమునందు అడ్డగింపబడిన వాయువు,అగ్నిని వృద్ధిజేయుచున్నది. ఈ వాయువే అర్శరోగమునందు అగ్నిని నశింపజేయుచున్నది. ఎట్లనగా వాయువు వలననే దీపము వెలుగు చున్నది. అదే వాయువుతోనే దీపము చల్లార్పబడు చున్నది. ఈ విధముగనే శరీరములోకూడ, వాయువుతో అగ్ని వృద్ధి చేయబడుచున్నది. మరియు వాయువుతోనే అగ్ని చల్లార్పబడు చున్నది. మిక్కిలి కష్టముగా తాగ బడుచున్న, ఆలస్యముగా జీర్ణమగుచున్న నెయ్యిగూడ అగ్నిని వృద్ధి జేయు చున్నది. కష్టము లేకుండా పానయోగ్యమైన, త్వరగా జీర్ణమగుచున్న పాలు జాఠరాగ్నిని వృద్ధి పరచుట లేదు. ఇచట విశేషమేమనగా! పాలు నెయ్యి ఈ రెండును రసాదులలో సమాన గుణము కల్గియున్నవి. సర్పాదులయొక్క కుళ్ళిన మృత శరీరము నుండి తేళ్ళు పుట్టుచున్నవి. ఈ తేళ్ళు కుట్టుట వలన, సర్పా దులు వెంటనే మరణించుచున్నవి. తీవ్రవిషము కలిగి నటువంటి సర్పాదులు తేళ్ళు మొ॥ ప్రాణులను చంపుట లేదు. మరియు సర్పము మొ॥ జంతువుల యొక్క విషము, శుక్రముతో సమానము, సంపూర్ణ శరీరాంగముల యందు వ్యాపించి యున్నప్పటికి గూడ, ఈ జంతువుల యొక్క మాంసమును ఉపయో గించుటకు, ఉపయోగ విధానము, మాంస వర్గమునందు నిర్దేశింబడినది. ఈగ నోటిలోనికి వెళ్ళిన యెడల వమన మగును, మరియు ఈగ యొక్క మలమును తినిన యెడల ఆ ఈగయే వాంతి యగును. ఇదియే విశేషము.

*శశిలేఖ :* లేదు.

మూ॥ కఫే లంఘన సాధ్యేఽపి కర్తరి జ్వర గుల్మయోః
తుల్యేఽపి దేశ కాలాదే లంఘనంనసమం మతమ్॥
సర్వథా దోషజిత్త్రికం గ్రహణ్యాం దోషకృద్ద్రవః।
పీనస శ్వాస కాసాదౌ సిద్ధమేవ ప్రశస్యతే॥
ఇత్యేతేఽన్యేచ బహవః సూక్ష్మా దర్లభ హేతుకాః।
ధర్మా విచిత్రా శాఖేషు కించిత్తేషాం నిదర్శితమ్।
దిశానయా శేషమపి, స్వయమూహేత బుద్ధిమాన్।
నశాస్త్ర మాత్ర శరణో నచానాలోచితాగమః॥

ఇతి మాత్రాది ప్రకరణమ్।

ఇత్యన్న స్వరూప విజ్ఞానీయోనామసప్తమోధ్యాయః

ప్రతిపదార్థము: తుల్యే=సమానములైన; దేశకాలాదౌ = దేశము మరియు కాలాదుల యందుత్పన్నమైన; కఫే=కఫము వలన బుట్టిన; జ్వర గుల్మయోః= జ్వరము, గుల్మము ఈ రెంటియందు; లంఘన సాధ్యేఽపి=లంఘనము ద్వారా సాధ్యమైనప్పటికి గూడ; లంఘనం=లంఘనము; నసమంజసమ్=తగినది కాదు; గ్రహణ్యాం=గ్రహణీ రోగమందు; తక్రం=మజ్జిగ; సరథా=అన్ని విధముల, దోషజిత్=మూడు దోషములను జయించును; వ్రణే=వ్రణమునందు; ఇదం తక్రం=ఈ మజ్జిగయే; దోషకృత్=మూడుదోషములను ప్రకోపింప జేయును; పీనస శ్వాసకాసాదే=పీనసము, శ్వాసము, కాసము మొ॥ వాటి యందు సిద్ధమేవ=సిద్ధముచేయబడిన మజ్జిగయే; ప్రశస్యతే = ప్రశస్తమగుచున్నది; ఇతి=అని; ఏతే=ఇవి; చ = మరియు; అన్యే=మరికొన్ని; బహవః=అనేకములు; సూక్ష్మాః=సూక్ష్మములైన; దుర్లభ హేతుకాః=లభ్యము కాని హేతు జన్యములు; కర్మ=కర్మ; వైచిత్ర్య భావేషు=విచిత్రములైన ధర్మ పదార్థములలో; తేషాం = వాటి యొక్క; కించిత్=కొంచెము; నిదర్శితమ్ = చూపెట్టబడినది; అనయాదిశా=ఈ పద్ధతితో; బుద్ధిమాన్=బుద్ధిగలవాడు; శేషమపి= మిగిలిన విషయమును గూడ; స్వయం=తనకు తానే; ఊహేత=ఊహించుకొనవలయును; శాస్త్ర మాత్ర శరణః=శాస్త్రమును మాత్రము శరణు జొచ్చిన వాడుగ; నభవేత్=ఉండకూడదు; చ=మరియు; నలనాలోచితాగమః= కాని శాస్త్రాధారములతో ఊహాపోహ పూర్వకముగ, ఆలోచింప వలయును.

ఇతి=అని; మాత్రాది ప్రకరణమ్=మాత్రాది ప్రకరణము. ఇతి = అని; అన్న స్వరూప విజ్ఞానీయోనామ=అన్న స్వరూప విజ్ఞానీయమను పేరుగల; సప్తమః=ఏడవదైన; అధ్యాయః=అధ్యాయము.

**తాత్పర్యము :** సమాన దేశము, సమాన కాలమందు పుట్టిన కఫ జ్వరము, మరియు గుల్మమునందు, లంఘనము ద్వారా కఫమును శాంతింప జేయుటకు సాధ్యమైనప్పటికిని, సమానత్వము లేదు. కఫ జ్వరము నందు లంఘనము సరైనది. కాని కఫజ గుల్మమునందు లంఘనము వలన, వాతము వృదిౚెందును. అందుకొరకు మంచిది కాదు.

గ్రహణియందు మజ్జిగ మూడు దోషములను నశింపజేయును.

వ్రణములో ఈ తక్రమే దోషకారకమగుచున్నది. పీనసము, శ్వాసము, కాసము మొ॥ వ్యాధులలో సిద్ధతక్రము (అగ్నివలన సంస్కరింపబడినది) ప్రశస్తమైనది.

ఈ విధముగ అనేక పదార్థముల యందు విచిత్రము చూడబడుచున్నది. సృష్టిలోని పదార్థములన్నియు విచిత్రాతి విచిత్రములైన భావములతో పరిపుష్టములై యున్నవి. వాటి నన్నింటిని పద్ధతిపై చెప్పుటకెవ్వరికిని శక్యము గాదు. అందువలన కొన్ని ఉదాహరణ పూర్వకముగా, మార్గదర్శకములుగా

నిరూపింపబడినవి. బుద్ధిమంతుడైన వాడు పై పద్ధతుల ననుసరించి స్వయముగ విషయములను నిర్ణయింపవలెను. కేవలం శాస్త్రముపైననే ఆధార పడరాదు. కాని శాస్త్రమునందు సంపూర్ణముగా కృషి చేసి, ఆ కృషి వలన కల్గిన బుద్ధి బలముతో, ఊహాపోహ కుశలుడై సమస్త విషయముల నాలోచనా పూర్వకముగ నిర్ణయింపవలెను. ఇట్లు అన్నపాన స్వరూప విజ్ఞానీయమను పేరుగల ఏడవ అధ్యాయము ముగింపబడినది.

*శశిలేఖ :* కఫము లంఘన సాధ్యము. కాని జ్వరమునకు కారణభూతమైన కఫము, గుల్మమునకు కారణభూతమైన కఫమునకు లంఘనము సమమైనది కాదు. ఇచట సంప్రాప్తి విశేషముగా నున్నది. గ్రహణిలో దోషత్రయ నాశకమైన మజ్జిగ, వ్రణమునందు దోషత్రయమును వృద్ధి చేయునదిగా నున్నది. పీనసాదుల యందు అగ్ని సిద్ధమైన మజ్జిగ ప్రశస్తము.

లోకమునందే వ్యక్తియును శాస్త్రమునందలి వాక్యములను చదివి శాస్త్రమే శరణ్యమని, శాస్త్రమునే నమ్ముకొని యుండకూడదు. ఎందుకనగా అచట జిజ్ఞాస ఉండదు. సాధారణముగా శాస్త్రమునందు అకుంఠిత జ్ఞాన పూర్ణుడైన మంచి గురూపదేశము చేత సమస్తమును గ్రహించి, తన స్వబుద్ధిని కూడ ప్రవేశపెట్టి, అన్ని విషయములందును, తన ఊహాపోహ జ్ఞానము చేత, కార్యసిద్ధిని పొందవలెను. అని మాత్రాది ప్రకరణము సమాప్తము.

ఇందు అను వాఖ్యానకారునిచేత చేయబడిన సూత్రస్థానమందలి ఏడవ అధ్యాయమునందలి శశిలేఖ ముగింపబడినది.

# అష్టాంగసంగ్రహ వ్యాఖ్యానము

## ఎనిమిదో అధ్యాయము

సూ॥ అథాతోఽన్న రక్షావిధి మధ్యాయం వ్యాఖ్యాస్యామః। ఇతి హాస్మాహురాత్రేయాదయో మహర్షయః। ఈశ్వరాణాం వసుమతాం విశేషేణ తు భూభుజాం ప్రాయేణ మిత్రేభ్యోఽప్యమిత్రా భూయాంసో భవన్తి. తత స్తత్ప్రయుక్తాః సమాసన్న వర్తినోఽన్నపానాదిషు, విషం ప్రయచ్ఛంతి. స్త్రియశ్చ తత్ప్రణిధి ప్రయుక్తాః సౌభాగ్య లోభేన. తస్మాద్రాజా కులీనం స్నిగ్ధ మాప్త మాస్తిక మార్య మార్యపరిగ్రహం, దక్షిణం, నిభృతం శుచి మనుద్ధత మనల సమవ్యసనిన మనహంకృత మకోపనమసాహసికం వాక్యార్థావ బోధకుశలం నిష్ణాత మష్టాంగే యథామ్నాయ మాయుర్వేదే సువిహిత యోగ క్షేమం సన్నిహితాగదాది యోగం సాత్మ్యజ్ఞంచ ప్రాణాచార్యం పరిగృహ్ణీయాత్। తమర్థ మానాభ్యాం యథాకాలం గురుమివ శిష్యః, పితరమివ పుత్రః పూజయేత్। ప్రతికూలమపి తద్వచః సామ్ప్రీతం మతమితి, ప్రతి మన్యేత। నహి భద్రోఽపి గజపతి ర్నిరంకుశః శ్లాఘనీయో జనస్య. తస్మాత్తదాయత్త మాహార విహారం ప్రతి చాత్మానం కుర్యాత్। ఉపాత్త మపి ఖలు జీవిత ముపాయ బలేన స్వాయ మధి తిష్ఠతి.

ప్రతిపదార్థము : అథ=అటు తరువాత, అతః=ఇందువలన, అన్నరక్షా విధిం=అన్నరక్షావిధియను పేరుగల, అధ్యాయం=అధ్యాయమును, వ్యాఖ్యాస్యామః=వ్యాఖ్యానింప గలము, ఇతి=అని, ఆత్రేయాదయః=ఆత్రేయుడు మొదలు గాగల, మహర్షయః=మహర్షులు, ఆహుస్మ=చెప్పిరి, ఈశ్వరాణాం=ఐశ్వర్యవంతులకు, వసుమతాం=ధనవంతులకు, విశేషేణతు=విశేషముగ నయితే, భూభుజామ్=రాజులకు, ప్రాయేణ=తరచుగ, మిత్రేభ్యోపి=మిత్రుల కంటె కూడ, అమిత్రాః=శత్రువులు, భూయాంసః=అధికులుగా, భవంతి=అగుచున్నారు, (ఉన్నారు.) తతః=అందువలన, తత్ప్రయుక్తాః=శత్రువులచే నియమింప బడిన, సమాసన్న వర్తినః=పరిచారకులు, (రాజగృహమున సంచరించు, దగ్గరగా మున్న) అన్న, పానాదిషు=భోజనములు, శయనముల యందు, విషం=విష మును, ప్రయచ్ఛంతి = ఇచ్చుచున్నారు. చ=మరియు, స్త్రియః=స్త్రీలు, తత్ప్రణిధి ప్రయుక్తాః=శత్రువుల చేత, చారుల చేత ప్రేరేపింప బడిన వారై, సౌభాగ్య లోభేన= సుభగత్వమును పొందు నాకాంక్ష చేత, విషం=విషమును, ప్రయచ్ఛంతి=ఇచ్చుచున్నారు, తస్మాత్=ఆకారణమ్ము వలన, రాజా=రాజైన

వాడు, కులీనం=అగ్రజాతి యందు బుట్టిన, స్నిగ్ధం=రాజునకు స్నేహితుడైన వానిని, ఆప్తం=సత్యముగ మాటలాడు వాడును, ఆస్తికమ్=దైవమున్నాడని తలచువానిని, ఆర్యం=సాధువులయొక్క నడవడికగల వానిని, ఆర్యపరిగ్రహామ్=మంచి నడవడికగల భార్యా పుత్రులు గల వానిని, దక్షం=చతురునిని, (సమర్థుణ్ణి), దక్షిణమ్=రాజునకు మరియు ఇతరులకు మిత్రభావముతో నుండు వానిని, నిభృతం = రాజకార్యములయందు నిశ్చల బుద్ధితో నుండు వానిని శుచిమ్=అంతశ్శుద్ధి, బహిశ్శుద్ధిగలవానిని,అనుద్ధతం=నమ్రతగలవానిని,అనలసం చురుకైన వానిని, అవ్యసనినమ్=సంతోషముగ నుండు వానిని, అసాహసికం= సాహస కార్యములను చేయనివానిని, వాక్యార్థావబోధ కుశలమ్ = వాక్యముల యొక్క అర్థములను గ్రహించుటయందు సమర్థుడైన వానిని, అష్టాంగే=ఆయుర్వేదము నందలి అష్టాంగములయందు. నిష్ణాతం = ఆరి తేరిన వానిని, యథాఽమ్నాయం = శాస్త్రానుసారము, ఆయుర్వేదే=ఆయుర్వేదము నందలి, సువిహిత యోగక్షేమం = యోగక్షేమములను పొందిన వానిని, సన్నిహితాగదాదియోగం=ఎవని వద్ద ఎల్లప్పుడు, విషూచికా మొ॥ రోగములను నశింప చేయునట్టి, అగదములు ఉండునో అట్టివానిని, చ=మరియు, సాత్మ్యజ్ఞమ్= సాత్మ్యమును తెలిసిన, ప్రాణాచార్యమ్ = ప్రాణములకు ఆచార్యుడైన వైద్యుణ్ణి, పరిగృహీత=స్వీకరింపవలయును. (నియమింప వలెను,) తం=అట్టి ప్రాణాచార్యుని, అర్థమానాభ్యాం = ద్రవ్యసత్కారములచేత, గురు=గురువును, శిష్య ఇవ=శిష్యుడు వలె, పితరం=తండ్రిని, పుత్రఇవ=పుత్రుడు వలె. యథాకాలం=కాలమును బట్టి, పూజయేత్ = పూజింప వలెను, తద్వచః= ప్రాణాచార్యుని యొక్కమాట, ప్రతికూలమపి = విరుద్ధమైనదైనప్పటికి, సామ్ప్రతమితి = యుక్తమైనదని, ప్రతిమన్యేత = అంగీకరింప వలయును. యస్మాత్=ఎందు వల్లననగా, భద్రోఽపి = మంచి నడవడిక గలదైనప్పటికి, గజపతిః=యేనుగు, నిరంకుశః = అంకుశము లేనిదే, జనస్య=ప్రజకు, శ్లాఘనీయో నభవతి=కొనియాడ దగినది కాదు, తస్మాత్=ఆ కారణము వలన, ఆహార విహారం ప్రతి=ఆహార విహార విషయములను గూర్చి, ఆత్మానం=తనను తదాయత్తం = ప్రాణాచార్యునికి స్వాధీనముగ, కుర్యాత్ = చేయవలెను. (ప్రాణాచార్యునికి తన శరీరము నప్పగింప వలెనని భావము), ఉపాత్తమపి= అదృష్టము వలన వచ్చినప్పటికి, జీవితమ్ = జీవితము, ఉపాయ బలేన= ఉపాయబలముతో, స్వయం=(అనాయాసముగ) తనకు తానుగ, అధితిష్ఠతి= శరీరము నాశ్రయించును. (శరీరము నందు ఆశ్రితమగును,)

**తాత్పర్యము :** అన్న రక్షమును బోధించునట్టి అన్న రక్షాధ్యాయమును వివరించుచున్నామని, ఆత్రేయాది మహర్షులు చెప్పిరి. సర్వ కాలముల యందు రాజగృహ సమీపము నందుండు వైద్యుడు, రాజు యొక్క అన్నపాన శయనాద్యుల యందు జాగరూకుడై యుండవలయును, కాబట్టి రాజు తన గృహ

సమీపము నందు, ఈ లక్షణములతో కూడిన ప్రాణాచార్యుని నివసింప జేయ వలయును. ఎందువల్ల ననగ, ఐశ్వర్యవంతులకు, ధనవంతులకు, విశేషించి రాజులకు, మిత్రవర్గమునకంటె, శత్రు వర్గము అధికముగ నుండును, మరియు శత్రు వర్గము చేత నియమింపబడిన పరిచారకులు అన్న పాన శయనాదుల యందు విష ప్రయోగమును చేయుటకు ఎల్లప్పుడు సిద్ధముగ నుందురు. అట్లే స్త్రీలు తమ సౌభాగ్యమును వృద్ధిపరచు కొనుటకు, రాజులకు గరాది విషములు పెట్టుటకు, సమయము కొరకు వేచియుందురు. ఈ రెండు వర్గముల వలన సంభవించు ఆపదల నుండి రక్షింపబడుటకు, రాజుకు, ప్రాణాచార్యుని యోగము, అత్యంతావశ్యకముగాన ఇట్టి లక్షణ లక్షితుడైన ప్రాణాచార్యుని తన దేహరక్షణమునకు నియోగించ వలెను. అగ్రజాతి యందు బుట్టిన రాజుకు మిక్కిలి ప్రాణ స్నేహితుడైన, సత్యమునే మాటలాడు వాడైన, ఆస్తికుడైన, ఆఢ్యుడైన, మంచి నడవడిక గల దారా పుత్రులు గల, కార్యాచరణ యందు సమర్థతగల, రాజ కార్యములను దృఢబుద్ధితో నాచరించు, అంతశ్శుద్ధి, బహిశ్శుద్ధి గల, చురుకుదనము గల, ఎల్లప్పుడు సంతోషముగ నుండు, అహంకారము లేని, సాహస కార్యముల నాచరింపని, ఆయుర్వేదోపదేశములను అక్షరశః గ్రహింప సమర్థత గలవానిని, ఆయుర్వేద మందు విభక్తమైన అష్టాంగముల యొక్క జ్ఞానము పూర్తిగ కలవానిని, ఆయుర్వేద శాస్త్రానుసారము, యోగ క్షేమములను తాను పొందిన వానిని, విషూచికా మొ॥ జనపదోధ్వంసకరములగు భయంకరమగు వ్యాధులను పరిమార్చు అగదములతో కూడియున్న వానిని, ఆహారము యొక్క సాత్మ్యజ్ఞానము పూర్తిగ నుండు వానిని, ధర్మములను ఆచరించు ప్రాణాచార్యుని, తన ప్రాణరక్షణకు రాజు నియోగింప వలెను, మరియు అట్టి ప్రాణాచార్యుని, రాజు, గురువును శిష్యుడు గౌరవించి పూజించునట్లు, ధనముతో సత్కార్యములతో పూజింప వలయును. ఎట్టి సమయమందైనను వైద్యుడు చెప్పు మాటలు తనకు విరుద్ధములుగ నున్నప్పటికి, అవి సరియయినవిగనే యంగీకరింప వలయును. ఎందు వలన ననగ, మంచి నడవడికగ మచ్చికయైన ఏనుగు అంకుశము లేని దగుట వలన ఆ ఏనుగును ప్రజలు కొనియాడరు. అందు వలన తనకు సంబంధించిన, ఆహార విహార విషయములో తాను ఆచార్యునికి ఎల్లపుడు స్వాధీనుడై యుండవలెను. అదృష్టము వలన లభ్యమైన ఈ శరీరము, వైద్యుని యొక్క, ఉపాయ బలముతో అనాయాసముగ, శరీరమును ఆశ్రయించి క్షేమముగ నుండును.

*శశిలేఖ* : సంపూర్ణముగ స్వరూప స్వభావములను గుర్తించిన, అన్న పానాదులు విషపూరితములైన యెడల, రోగములను కల్గించటము, మరణము నాపాదించుటయు చేయును. అన్నపాన రక్షణము ఇతరుని కప్పగించి నందు వలన ప్రయోజనముండదు. రాజు అనేక అపాయములకు మూలము. మరియు భిన్న భిన్నమనస్కులైన పరిజనములతో పరివేష్టించి యుండును, కాన కులీనుడైన

వైద్యునొకనిని. తన ప్రాణ రక్షణము కొరకు నియోగింప వలయును. వైద్య లక్షణము లన్నియు తాత్పర్యములో విశదీకరింపబడినవి. అట్టి లక్షణములతో కూడిన రాజు తన ప్రాణములను అపథ్యాహారముల నుండి రక్షించుకొనుటకు, వైద్యుని స్వాధీనము చేయవలెను. ఆదృష్టమువలన పొందిన ఈ జీవితము వైద్యుని పర్యవేక్షణలో సుఖముగ శరీరమునధిష్టించి యుండును. వైద్యుని యొక్క స్వాధీనమైన గొప్ప ఉపాయమిదియేనని తెలిసికొన వలయును.

మూ॥ అపిచ బహుపరిగ్రహో నరపతయః సంతి చాశుకారిఃశూల సన్యాసాదయః। ప్రతిక్షణం ప్రత్యవేక్షణీయావసాస్థాశ్చ రోగిణో విశేషణ రాజానః। తేహి ప్రమాద పరిగతా దుఃఖా సహిష్ణవశ్చ స్వయమప్యపథ్య రుచయః। సన్నిహిత హిత ప్రియవచన ప్రియవచన ప్రాయ పరిచారకాశ్చ తస్మోద్భిషజ రాజా రాజగృహాసన్నే నివేశనం కారయేత్। తథాహి సర్వోప కరణేషు నృపతి శరీరోప యోగి ష్వపరోక్ష వృత్తిర్భవతి॥

**ప్రతిపదార్థము** : అపిచ = మరియును;; నరపతయః = రాజులు; బహు పరిగ్రహాః = ఎక్కువ మంది భార్యలు, పరివారము గలవారు; శూల సన్యాసాదయః = శూలసన్యాసము మొ॥ వ్యాధులు; ఆశుకారిణః = మరణమును వెంటనే కల్గించునవిగా; సంతి = ఉన్నవి; రోగిణః = రోగులందరు; ప్రతిక్షణం = ప్రతిక్షణమును; ప్రత్యవేక్షణీయావస్థాః = పరామర్శింపదగిన అవస్థా విశేషము గలవారు; చ = మరియు; విశేషేణ = విశేషముగ; రాజానః = రాజులు; తథాహి = అది యుక్తమే గదా; తే = ఆ రాజులు; ప్రమాద పరిగతాః = ఏమఱుపాటుచేత చుట్టబడినవారు; దుఃఖా సహిష్ణవః = కష్టములను ఓర్వజాలని వారు; చ = మరియు; స్వయం = తాము (స్వభావము చేతనే); అపథ్యరుచయః = అపథ్యాభిలాషులు; సన్నిహిత హితవచన ప్రాయ పరిచారకాశ్చ = మరియు సమీపమునందు సంచరించు పరిచారకులు, హితమైన, ఇష్టమైన మాటలను చెప్పువారు; సంతి = ఉన్నారు; తస్మాత్ = ఆకారణమువలన; రాజా = రాజు; రాజగృహాసన్నే = రాజగృహ సమీపమునందు; భిషజః = వైద్యులను; నివేశనం కారయేత్ = ఉంచవలయును; తథాహి = అది యుక్తమే గదా! నృపతి శరీరోపయోగిషు = రాజుల యొక్క శరీరమునందుపయోగించు; సర్వోపకరణేషు = సమస్త సాధనములయందు; అపరోక్ష వృత్తిః = ప్రత్యక్షముగ తెలిసి కొనుట; భవతి = అగుచున్నది.

**తాత్పర్యము** : అదృష్టము వలన పొందిన జీవాత్మ పరిశ్రమ లేకుండా తాను శరీరమునకు ఆశ్రితుడుగా అగుచున్నాడు. మరియును రాజులకు భార్యలు, బంధువులు, పరిజనులు అధిక సంఖ్యలో ఉందురు. మరియు శూలము, సన్యాసము మొ॥ వ్యాధులు గల రోగులను ప్రతిక్షణమును వ్యాధ్యవస్థలను బట్టి, పర్యవేక్షణ చేయవలసి యుండును. మరియు దేశాధిపతులైన రాజులు విశేషముగ పర్యవేక్షణ చేయదగిన వారు. ఎందుకనగ ఆ రాజులు సర్వదా ప్రమాదములతో కూడుకొని యుందురు. వీరు స్వతంత్ర వ్యక్తులు. రోగాదులతో

యేర్పడు దుఃఖములను భరింపలేనివారు. తాము స్వయముగనే అపథ్యాభి లాషులు. సన్నిహితులైన పరిచారకులు గూడ ఎల్లప్పుడు రాజు సమీపము నుండి రాజునకిష్టమైన హితమైన మాటలను చెప్పి అతనిని సంతోష పరచి, కష్టముల కాకరముగ అతనిని మలచుదురు. అందువలన రాజులు తమ ప్రాసాద సమీపమునందు వైద్యులు నివసించు యేర్పాట్లు చేయించవలయును. ఎందువల్ల ననగ రాజు శరీరమునకు ఉపయోగకరములైన సమస్త ఉపకరణముల పైన వైద్యుడు ఎల్లప్పుడూ తన దృష్టిని కేంద్రీకరింప చేయవచ్చును.

*శశిలేఖ* : రాజులు తమ గృహ సమీపమున అనగ పాకగృహ సమీప మున వైద్యుని నివాసము ఏర్పాటు చేయవలయును. ప్రతిక్షణము సన్యాసము మొ॥ వ్యాధిగ్రస్తులను వైద్యుడు పర్యవేక్షణ చేయవలెను. ఆ వ్యాధులు వెంటనే మరణమును కలిగించును. రాజులు గొప్ప పరివారమును కలిగియుందురు. (స్వమర్థం మరణం ఆశు శీఘ్రం కుర్వంతీతి ఆశు కారణః) మరియు రాజులు స్వతంత్ర ప్రతిపత్తి గలవారు కాన సలహాదారులు లేని యెడల స్వయముగ ఆపదలను కొనితెచ్చుకొనగలరు, రాజులు ప్రధానముగ దురభ్యాసములను అభ్యాసము చేసికొందురు. ఈ దురభ్యాసములను అనుష్ఠింప చేయుట కొఱకు శత్రువులు ఇంటా బయట చేరి, సమయము కొఱకు వేచియుందురు. మరియు కపటవర్తులైన పరిచారకులు ప్రియమైన మాటల చేత రాజుల యొక్క హృదయమును మార్చుటకు సర్వదా ప్రయత్నించుచుందురు, కాన వైద్య రక్షణ రాజులకు ప్రధానమైనది. రాజుల ప్రాణములు వైద్యుల స్వాధీనము చేసిన యెడల సుఖమైన జీవనమును గడుపుటకు రాజులకు వైద్యులు సహకరిం తురు. ఇంతియే గాక ప్రాణాచార్యత్వమను బిరుదమునకు వైద్యులు గతులు కల్గించిన వారగుదురు. సమీపవర్తులైన వైద్యులు, రాజులు భుజించు ఆహార ములను స్వయముగ పరీక్షించి, రాజులను రక్షించుటకు సరియైన అవకాశమును కల్గియుందురు. కాన వైద్యులు రాజ గృహ సమీపమునని వసించుటకు రాజుల చేత యేర్పాటు చేయించవలయును,

మూ॥ సనమ్యక్సంపన్న మన్నం సుపరీక్షితం విశుద్ధమగ్న్యాదిషు ప్రాగు పనీతం శిఖినా దృష్ట మభి ప్రోక్షితం ప్రోక్షణైః పురస్థితో రాజానం హస్త బద్ధౌషధి రత్నం భోజయేత్॥

*ప్రతిపదార్థము* : సః=వైద్యుడు, సమ్యక్=బాగుగ, సంపన్నం=వండి నది, సుపరీక్షితం=బాగుగా పరీక్ష చేయబడిన, అగ్న్యాదిషు=అగ్ని మొ॥ వాటి యందు, విశుద్ధం=శుద్ధి చేయబడినట్టి, ప్రాక్=మొదట, అగ్న్యాదిషు = అగ్ని మొ॥ వాటి కొరకు, ఉపనీతం=ఇవ్వబడినది, శిఖినా= నెమలి చేత, దృష్టం= చూడబడినది, ప్రోక్షణైః=ప్రోక్షణ మంత్రములతో, అభి ప్రోక్షితమ్=మంత్ర పూతము చేయబడిన (తడుపబడిన), అన్నం = అన్నము, రాజానం = రాజు

సమక్షమున, పురస్థితః=ఎదురుగా కూర్చుండినవాడైన వైద్యుడు, హస్తబద్ధౌషధి రత్నం = చేతుల యందు కట్టబడిన ఓషధులు, రత్నములు గల రాజును, భోజయేత్=భుజింప చేయ వలయును.

**తాత్పర్యము** : వైద్యుడు (వెనుక చెప్పిన గుణములు కల) రాజున కెదురుగ కూర్చుండి అన్నమును తినిపించ వలెను, ఆ అన్నము పక్వముగా వండినదై సువాసన గల ఆవిరి మొ॥ వాటితో సంపన్నమై యుండ వలెను. మంచి నడవడిక గల పతివ్రతలైన స్త్రీలతో తయారు చేయబడినదై యుండ వలెను. ముందు చెప్పబోవు పరీక్షలను చేసి దోషరహితమైనదని నిర్ణయింపబడి యుండ వలెను. సంపూర్ణ కుంభములో నున్న ఆ అన్నము తొలుత అగ్నికిని, తరువాత మక్షికాదులకును సమర్పించినదై యుండ వలెను. నెమలి చేత చూడబడినదిగా నుండవలెను. సువర్ణ మంత్రోదకాదులతో ప్రోక్షింపబడినదై యుండ వలెను. ఈ మంత్ర ప్రోక్షణ వలన విషపూరితమైన అన్నము గూడ నిర్విషమగును. మరియు రాజు యొక్క హస్తములకు అన్నము తినుటకు ముందు రత్నాదులచేత, ఓషధులచేత కట్ట వలెను. వీటి ప్రభావము వలన విషవేగము శమించును. ఇట్లు వైద్యుడు రాజునకు అన్నము తినిపించ వలయును.

**శశిలేఖ** : అట్టి వైద్యుడు రాజున కెదురుగా కూర్చుండి, అన్నమును రాజుచేత తినిపించ వలయును. తక్కిన విషయములు తాత్పర్యాంశములు.

సూ। భుంజానస్యాస్య దుందుభీ నగద ప్రతిప్తాన్ వాదయేత్।

**ప్రతిపదార్థము** : భుంజానస్య = భుజించుచున్న, అస్య=ఈ రాజునకు, ఆగద ప్రలిప్తాన్=విషహరములైన అగదములచే పూయబడిన, దుందుభీన్= నగారాలను, వాదయేత్=ప్రమోగింప వలెను.

**తాత్పర్యము** : రాజు భుజించు సమయమున విషహరములైన అగదములచే పూయబడిన నగారాలను ప్రమోగింపవలెను,

**శశిలేఖ** : విశేషము లేదు.

మూ॥ తత్ర సవిషమన్నం స్రావ్యమాణ మవిస్రావ్యం భవతి। చిరేణ పచ్యతే। పక్వంచ సద్యః పర్యుషితమివ నిరూష్మ స్తబ్ధంచ జాయతే, యథాస్వవర్ణ గన్ధ రసైర్వ్యాపద్యతే ప్రక్లిద్యతే, చన్ద్రికాచితంచ భవతి.

**ప్రతిపదార్థము** : తత్ర=ఆహారాదులలో, అన్నం=అన్నము, స్రావ్యమాణం=ఒక్కొక్క కణము విభజించుటకు వీలుగా, భవతి = అగుచున్నది. సవిషం=విషముతో కూడిన, అన్నం=అన్నము, అవిస్రావ్యం = ఒక్కొక్క కణముగ విభజించుటకు వలను పడనిదిగా, భవతి=అగుచున్నది, చిరేణ=చాల కాలము చేత, పచ్యతే=పాకము చేయబడుచున్నది. పక్వంచ=మరియు పక్వ మయినను, సద్యః = వెంటనే, పర్యుషితమివ=చద్ది యన్నము వలె, నిరూష్మ=

(వేడిలేనిదిగా) ఆవిరి లేనిదిగా, చ=మరియు, స్తబ్ధమ్=కఠినత్వము,జాయతే= పొందుచున్నది. యథా స్వవర్ణగన్ధరసైః=ఏ విధమైన తనకు ప్రకృతిసిద్ధమైన వర్ణగన్ధ రసములతో, వ్యాపద్యతే=నశింప చేయబడుచున్నది. ప్రక్లిద్యతే= ఆర్ద్రిముగ చేయబడుచున్నది, చ = మరియు; చన్ద్రికాచితత్=దీనిలో పలువిధ ములైన రంగులు గలరేఖలు నాలుగు వైపుల నావరించి నట్లుగా, భవతి= అగుచున్నది,

**తాత్పర్యము :** విష సంబంధము లేని యన్నము, పొడి పొడిగా నుండును. విషము కలిపిన యన్నము, విడదీయుటకు వీలుగల్గి యుండదు. ఈ అన్నము చాల కాలమునకు పాకమగుగు. పాకము సరిగ నయినను వేడిగా నుండదు. గట్టిపడి పోవును. ప్రాకృతికమైన, సహజమైన వర్ణగంధ రసములు, ఆ అన్నము నందు నశించిపోవును. ఆ అన్నమునందు తేమ బయలుదేరును. నానావర్ణములతో కూడిన రేఖలు నాలుగు వైపులా ఆవరించును. అనగా ఆ అన్నము పాశిపోవునని భావార్థము.

**శశిలేఖ :** తాత్పర్యాంశమే కలదు.

మూ॥ వ్యంజనానాం ఆశు శుష్కత్వం భవతిక్వాథః ధ్యామతా । హీనాతి రక్త వికృతానాంచాత్ర చ్ఛాయానాం దర్శన మదర్శన మేవవా । ఫేన పటల సీమంతోర్ధ్వ వివిధ రాజీ తన్తు బుద్బుద ప్రాదుర్భావః. విశేషేణ లవణాల్బ ణేషు ఫేనమాలా. రసస్య మధ్యే నీలారాజీ, పయసస్తామ్రా । మద్య తోయయోః కాలీ । దధ్నః శ్యావా తక్రస్యాఽఽ నీల పీతా । మస్తునః కపోతాఽభా । ధాన్యామ్లస్య కృష్ణా । ద్రవౌషధస్య కపిలా । ఘృతస్య సలిలాభా । క్షౌద్రస్య హరితా । తైలస్యారుణా వసాగన్ధశ్చ॥.

**ప్రతిపదార్థము :** వ్యంజనానాం=విష సంబంధము వలన పెఱుగు, చల్ల, దానిమ్మపండు మొ॥ వానిచే సంస్కారము చేయబడిన సూపము మొ॥వ్యంజనములు, ఆశు=శీఘ్రముగ; శుష్కత్వం=శుష్కములుగ (శుష్కముగా); భవతి=అగు చున్నవి; క్వాథః=క్వాథము; ధ్యామతా=నల్లగనగును; అత్రచ=వ్యంజనముల యందు; ఛాయానాం=ముఖము మొ॥ ప్రతిబింబముల యొక్క; హీనాతి రిక్త వికృతానాం=హీనమైన, అధికమైన వికృతమైన రూపముల యొక్కయే; దర్శనం=చూచుట; అథవా=అట్లు కానియెడల; ఛాయానాం=ప్రతిబింబముల యొక్క; అదర్శనం=కనిపించక పోవుటను; లవణోల్బణేషు=అధికమైన లవణాదులతో గూడి యులడునట్టి ద్రవమైన వ్యంజనములలో: ఫేన=నురుగు యొక్క; పటల=సమూహము; సీమంత=పాపటవలె నుండు రేఖ; ఊర్ధ్వ= ఊర్ధ్వ రేఖ; వివిధ రాజీ=పలు విధములైన రేఖలు; తంతు=తంతువులు; బుద్బుద ప్రాదుర్భావః=బుడగలు మొ॥ కల్గును; విశేషేణ=విశేషముగ; ఫేన మాల=మాలాకారమైన నురుగు; రసస్య=మాంసరసము యొక్క;

మధ్యే=మధ్యయందు; నీలా రాజిః=నీలరేఖ; పయసః=పాలలో; తామ్ర= ఎఱ్ఱని రేఖ, మద్య తోయయోః=మద్యము నందు, నీటియందు; కాళీ=కృష్ణ వర్ణముగల రేఖ; దధ్నః=పెరుగు యందు; శ్యావ=కపిళ వర్ణముగల రేఖ; తక్రస్య=తక్రములో; నీల పీత=పసుపు వర్ణముగ నల్లగనుండు రేఖ; ధాన్యామ్లస్య=ధాన్యామ్లములో; కృష్ణా=నల్లని రేఖ; ద్రవౌషధస్య=ద్రవముగా నుండు ఔషధములో; కపిల=పుల్లావు రేఖ; ఘృతస్య=నేతిలో; కపిలాభా=కపిళవర్ణము గల కాంతి; క్షౌద్రస్య=తేనెలో; హరిత=పచ్చనివర్ణము గలక రేఖ; తైలస్య= తైలములో; అరుణా=ఎఱ్ఱని రేఖ; చ=మరియు; వసా గంధః=వసా గంధము; భవతి=యుండును.

**తాత్పర్యము :** విష సంబంధము వలన, ఈక్రిందనుదాహరింపబడు వస్తువులలో విశిష్టమైన రేఖలు, కాంతి, దుర్వాసన మొ॥ సంభవించును. ఎట్టులనగా పెరుగు, మజ్జిగ మొ॥ వాటితో వండిన శాకములుశీఘ్రముగా శుష్కములగును. కషాయముతో గూడి యుండు వ్యంజనములు నల్లగా నగును. మరియు క్వాథములో తన యొక్క ప్రతిబింబము తల మొ॥ అంగములు లేనిదిగ గొప్పయంగములతో గూడినదిగ గాని, లేక వికార రూపము గలదిగ గాని గనుపించును. లేక ప్రతిబింబమే కనపడదు. ఎక్కువ లవణాదులతో కూడి యుండినట్టి ద్రవమైన వ్యంజనములలో నురుగు, ఊర్ధ్వరేఖ, పాపట వలె నుండు రేఖ, తంతువులు, బుడగలు మొ॥ యేర్పడును. విష సంబంధము వలన మాంస రసములో నీలరేఖ, క్షీరములో యెఱ్ఱని రేఖ, మద్యము, ఉదకము వీనిలో కృష్ణవర్ణము గల రేఖ, పెరుగులో నల్లని రేఖ, తక్రములో పసుపు వర్ణముగా నల్లగా నుండు రేఖ, పెరుగులో నల్లని రేఖ, తక్రవములో పసుపు వర్ణము నల్లగా నుండు రేఖ, పెరుగు మీది మీగడలో పాపుర పిట్టతో తుల్యమైన వర్ణము గల రేఖ, పులి కలుగులో కృష్ణ వర్ణము గలరేఖ, ద్రవౌషధములలో కపిలవర్ణము గల రేఖ కనిపించును. నేతి యందు జలతుల్యమైన రేఖ, తేనెలో పచ్చని వర్ణము గల రేఖ, తైలములో యెఱ్ఱ వర్ణము గల రేఖ, వసా గంధము కన్పట్టును.

**శశిరేఖ :** విషముతో కూడిన వ్యంజనములను, మాంస రసాదులను పాకము చేయునపుడు, అది క్వాథమగును. ఆ క్వాథము కాగునపుడు, ఊర్ధ్వ భాగము నందు నురుగుతో కూడినదిగా, మలినముగా నగుచున్నది. ఈ క్వాథములో ప్రతిబింబము వికృతలక్షణములతో కన్పడును. అట్లు కాని యెడల ప్రతిబింబమే కన్పడదు. ఇచట కొద్ది మంది ఛాయా శబ్దమునకు కాంతి యను అర్థమును చెప్పుచున్నారు. ఆ వ్యంజనముల దు ఎక్కువగా ఆవిరి వచ్చును. నురుగు ముద్దలు పైభాగమునందు పలువిధములైన రేఖలు కన్పడును. ఉప్పు అధికముగా గల విషముతో కూడిన వ్యంజనములలో నురుగు బుడగలు మాలాకారముగా నుండును. మాంసరసము నందు నల్లని రేఖ యుండును. ద్రవౌషధ

ముల క్వాథములో కపిల వర్ణము గల రేఖలు కన్పడును.

మూ॥ ఫలానా మామానాం పాకః, పక్వానాం ప్రకోథః ద్రవ్యాణాం అర్ద్రాణాం సహసా మ్లానత్వ మన్యత్వ భావః శుష్కాణాం శ్యావతా వైవర్ణ్యంవా, కఠినానాం మృదుతా, మృదూనాం కఠినత్వం, మాల్యస్యమ్లానతా, గంధనాశః స్ఫురితాగ్రత్వం, ఆస్తరణ ప్రావరణానాం ధ్యామ మండలతా తంతు రోమ, పక్ష్మ శాతనంచ, లోహామణి మయానాం, పంక మలోపదేహః, స్నేహ రాగ గౌరవ ప్రభా వర్ణ స్పర్శనాశశ్చ.

ప్రతిపదార్థము : ఆమానాం=పచ్చివిగా నుండు, ఫలానాం=పండ్లకు, పాకః = పాకము, పక్వానాం = పండిన పండ్లకు, ప్రకోథః = కుళ్ళుట, జాయతే=కలుగు చున్నవి. ఆర్ద్రాణాం=తడిగా నున్న, ద్రవ్యాణాం=ద్రవ్యములకు, సహసా=వెంటనే, మ్లానత్వం=వాడిపోవుట, ఉత్పక్వభావః=పండిన పండ్లవలె మృదుత్వము, జాయతే=కల్గుచున్నది,శుష్కాణాం=ఎండిన ద్రవ్యములలో, శ్యావతా = నలుపుదనము, వా=లేక; వైవర్ణ్యం=వైవర్ణ్యమును; కఠినానాం=కఠినముగ నుండు వస్తువులకు;మృదుతా=మృదుత్వము; మృదూనాం=మృదువుగా నుండు వస్తువులకు; కఠినత్వమ్=కఠినత్వము; మాల్యస్య=పుష్పమాలలకు; మ్లానతా=వాడుట; గంధనాశః=స్వగంధ నాశము; స్ఫురితాగ్రతమ్=కొనయందు చీలుటయు; ఆస్తరణ ప్రావరణానాం=దుప్పటి మొ॥ వస్త్రములలో; ధ్యామ మండలతా=నల్లని బొట్లు: తంతు రోమ పక్ష్మశాంతనంచ=దారములు, రోమములు మరియు రెక్కలు రాలిపోవుటయు; లోహమణిమయానాం=లోహాది ధాతువులు, ముత్యములు, మణులు మొ॥ వాటిలో, పంక మలోపదేహః=బురద పూయబడినటులుండుటయు; స్నేహ రాగ గౌరవ, ప్రభావర్ణ,స్పర్శ నాశశ్చ=స్నేహము, రాగము, గురుత్వము, కాంతి, వర్ణము, స్పర్శము వీటన్నింటికి నాశము; జాయతే=కలుగుచున్నవి.

తాత్పర్యము : పై జెప్పిన విధముననే విష సంబంధము వలన అపక్వముగ నుండు ఫలములకు పరిపాకము, పక్వముగ నుండు ఫలములకు, మురిగి పోవుటయు, తడిగనుండు వస్తువులకు మ్లాని, ఎండి యుండు వస్తువులకు వైవర్ణ్యము, మృదువుగా నుండు వస్తువులకు కాఠిన్యము,కఠినముగానుండు వస్తువులకుమృదుత్వము,పుష్పాదులకు వాడిపోవుట,స్వగంధనాశము,కొనచీలుటయు, దుప్పటి మొ॥ వస్త్రములలో నల్లని బొట్లు, వస్త్రము యొక్క నూలు స్వయముగ చీకుట, కంబళి మొ॥ వాని యందలి రోమము లూడుట, లోహాది ధాతువులు, ముత్యములు మొ॥ వాటిలో బురద పూయబడినటు లుండుట, స్నేహము, స్పర్శము, కాంతి లేకుండుట మొ॥ అన్నియు విష సంబంధము వలన కలుగును.

శశిలేఖ : తడిగా నున్న ముల్లంగి, తామర తూండ్లు మొ॥ ద్రవ్యములు విష సంబంధము వలన వాడి పోవుటయు, మిక్కిలి మృదుత్వమును పొందుటయు జరుగును. ఎండిన శుంఠి, పసుపు మొ॥ ద్రవ్యములలో శ్యావత్వము, వైవర్ణ్యము

గాని, నల్లనైన రేఖలుగాని యేర్పడును. దుప్పట్లు, కంబళ్ళు మొ॥ వాటిలో నల్లని, మలినములైన మచ్చలు ఏర్పడును. వాటి యందలి దారములు, రోమములు మొ॥ ఊడిపోవును. లోహాది ధాతువులలో, మణులలో విష సంబంధము వలన బురద పూసినట్లు ఉండును. మరియు స్నేహాదులును నశించును.

మూ॥ విషదస్తు స్వదోష శంకయా త్రస్తో, భీతః స్వేద వేపథుమాన్, శుక్ల, శ్యావ వక్త్రః, సమన్తాత్ సోద్వేగం విలక్షోఽభివీక్షతే। యత్రచానేన విషం ప్రయుక్తం తద్విశేషేణ, తథాస్రస్తోత్తరీయః, స్తంభ కుడ్యాదిభిరాత్మాన మన్తర్ధత్తే! స్ఖలిత గతిర్దీనో లజ్జా వానస్థాన హాసీ పృష్టోఽసంబద్ధ ముత్తరం దదాతి, నైవవా వివక్షుర్ముహ్యతి! అంగులీః స్ఫోటయతి, గ్రీవామాలభతే। శిరః కండూయతి ఓష్ఠౌ పరిలేఢి, జృంభతే, భువం విలిఖతి, క్రియాసు త్వరతే। విపరీత మాచరతి. స్వభూమౌచనావ తిష్ఠతే॥-18

ప్రతిపదార్థము : విషదస్తు=విషము నొసంగు మనుషుడైతే, స్వదోష శంకయా = తనను దోషిగా శంకించుట చేత, త్రస్తః = పిరికి వాడై, భీతః= వెఱచినవాడై, స్వేద వేపథుమాన్=చెమటతో కంపము గలవాడై, శుక్లశ్యావ వక్త్రః=తెల్లనైన, నల్లనైన ముఖము గలవాడై, సమన్తాత్=అంతట, సోద్వేగమ్ = అవ్యవస్థిత చిత్తతతో కూడుకొన్నవాడై, విలక్షః= అస్పష్ట దృష్టి గల వాడై, అభివీక్షతే = చుట్టూ చూచు చున్నాడు, యత్ర=ఎక్కడ, అనేన= వీనితో, విషం=విషము, విశేషేణ=విశేషముగ, ప్రయుక్తమ్ = ప్రయోగింప బడినదో, తథా=అట్లే, స్రస్తోత్తరీయం = జారిన పై పంచ గలవాడై, స్తంభ కుడ్యాదిభిః = స్తంభములు, గోడలు మొ॥ వాటితో, ఆత్మానం= తనను, అన్తర్ధత్తే=మరుగు పరుచు కొనును, స్ఖలిత గతిః = జారిన నడక గలవాడై, దీనః=దీనుడై, లజ్జావాన్=సిగ్గు పడుచున్నవాడై, అస్థాన హాసీ = అకారణముగ నవ్వుచూ, స్యాత్=ఉండును, పృష్టః=అడుగ బడిన వాడై, అసంబద్ధ ముత్తరం = అసంగతమైన ప్రత్యుత్తరమును, దదాతి=చెప్పును. నైవవా వివక్షుర్ముహ్యతి= ఒక సంగతి చెప్పబోయి మోహమును చెందును. అంగులీః స్ఫోటయతి=వేళ్ళ యందు మెటికలను విరచును. గ్రీవామాలభతే=కంఠమును పట్టుకొనును. శిరః కండూయతి = తలను గోకి కొనును. ఓష్ఠౌ పరిలేఢి= పెదవులు నాకును. జృంభతే=ఆవలించును. భువం విలిఖతి = కాలితో భూమి యందు గీరును. క్రియాసు=కార్యముల యందు, త్వరతే=త్వరపడును. విపరీతం=విరుద్ధమైన పనులను, ఆచరతి=ఆచరించును. స్వభూమౌచనావతిష్ఠతే= ఒక చోటను స్థిరముగ నిలువ కుండును.

తాత్పర్యము : స్వలాభాపేక్షచేత విషము నిచ్చు మానవుడు, తన దోషము ఇతరులకు తెలియునను సందేహముతో, పిఱికి వాని వలె, భయ గ్రస్తుని వలె లోకమున సంచరించును. శరీరమంతయు చెమటలు గ్రమ్మి శరీర

మంతయు వణకు చున్నట్లు చూపరులకు గన్పట్టును. శరీరమంతయు తెల్లగా గాని, నల్లగాని యుండును. స్థిర చిత్తత లేని వాడై పక్కల చూచుచూ దృష్టి గూడ మామూలుగ లేక, విమార్గ దృష్టిగలవాడై సంచరించుచుండును. విష ప్రయోగమెచట చేసెనో ఆ ప్రదేశమునందే ఎల్లప్పుడు అతనిదృష్టి కేంద్రీకృతమై యుండును. పై పంచ ఎప్పుడునూ జారుచుండును. ఎవరైనకనిపించినయెడల, స్తంభ ములచాటున, గోడల దాపున దాగుకొని ఇటునటు చూచుచుండును. తడ బడు నడకలు గలిగియుండును. దీనాతి దీనుడుగా నుండును. సిగ్గుపడు చుండును. అకారణముగ నవ్వుచుండును. ఎవరైన ఏదియోనొక ప్రశ్నవేసిన, అసంబద్ధముగ ప్రత్యుత్తర మిచ్చును. ఏదియో నొక విషయము చెప్పబోయి వెంటచే మోహితుడగును. వేళ్ళయందలి మెటికలను విరచుచుండును. కంఠ మును పట్టుకొనును. తలను గోకికొనును. పెదవులను చప్పరించును. ఆవలిం చును. కాలితో భూమిపై గీచును. ప్రతి కార్యము నందును త్వరపడును. విరుద్ధమైన కార్యముల నాచరించును. ఒకచోట స్థిరత్వము లేక అటునిటు తిరుగు చుండును. ఈ లక్షణములతో కూడుకొని యున్నవానిని విషదాతగా తెలిసి కొన వలయును.

*శశిలేఖ* : విషం దదాతీతి - విషదః అనగా విషము ఇచ్చువాడని యర్థము. వాడు తనను దోషిగా తలంచి భయాదులతో కూడుకొన్నవాడై యుండును. ఇవియే విషదాత లక్షణములు. భీతః అనగ భయముతో కూడిన వాడని యర్థము. వేపథుః = అనగ వణుకుచున్నవాడని అర్థము. పిడచ కట్టుకొని పోయిన నోరు నల్లనిముఖముగల్గి యుండును. అన్ని దిక్కులను ఉద్వేగముతో, అస్పష్ట దృక్కులతో చూచుచుండును. ఏ ద్రవ్యమునందు వాని చేత విషము ప్రయోగింపబడినదో దానివైపు అతను విశేషముగ చూచు చుండును. తన పై పంచ భుజముపై నుండి జారును. మరియు క్రిందపడును. ఎవరైనను కన్పడిన, స్తంభాదుల చాటున దాగుకొనును. కుడ్యం అనగ గోడ యని అర్థము. అప్రయత్నముగ వికటాట్టహాసము చేయును. ఎవరిచేతనో ఏదో నొక విషయము నడుగబడిన వాడై అసంబద్ధముగ ఉత్తరమిచ్చును. గ్రీవాదు లను పట్టుకొనుట మొ॥ వికార చేష్టలను చేయును.

మూ॥ నృపాజ్ఞత్వరయాపి కేచిదపరాధాన్తరాద్వానవస్థిత సత్వాః సమాచరన్త్యేవమ్. తస్మాదగ్న్యాదిష్వపి పరీక్షేత। వహ్నిస్తు స విషమన్నం ప్రాప్యైకావర్తో రూక్ష మందార్చిరింద్రాయుధ వదనేక వర్ణజ్వాలో భృశం చటచటాయతే। కుణపగన్ధీ ధూమశ్చాస్య, మూర్ఛా ప్రసేక, రోమహర్ష శిరో వేదనా పీనస దృష్ట్యా కులతాంజనయతి. -21

*ప్రతిపదార్థము* : నృపాజ్ఞ **త్వర**యాపి = రాజుల చేత చేయబడిన ఉత్తర్వుయొక్క తొందర చేతకూడ, కేచిత్ = కొద్దిమంది పరిచారకులు, అప రాధాన్తరాద్వా = ఇతర తప్పుల వలనగాని, అనవస్థిత సత్వాః సంతః = నిలకడ

లేని మనస్సుగలవారై, ఏవమ్ = ఇట్లు, సమాచరంతి = చేయుచున్నారు. తస్మాత్ = ఆ కారణము వలన, అగ్న్యాదిష్వపి = అగ్ని మొ॥ వాటియందు కూడ, పరీక్షేత = పరీక్షింపవలెను. వహ్నిస్తు = అగ్ని యయితే, సవిషమన్నం = విషము కలిసిన అన్నమును, ప్రాప్య = పొంది, ఏకావర్తః = ఒకటే జ్వాలగలదై, రూక్ష = తీక్ష్ణమైన, మన్ద = మన్దమైన, అర్చి = జ్యోతి, ఇన్ద్రాయుధ దత్ = ఇన్ద్రధనుస్సువలె, అనేకవర్ణజ్వాలః = పలు విధములైన జ్యోతులు (కాంతులు) గలదై, భృశం = మిక్కిలి, చటచటాయతే = చటచటమను ధ్వనులు గలిగి యుండును. అస్య = ఈ అగ్నియొక్క, ధూమశ్చ = పొగయయితే, కుణపగన్ధి = దుర్గంధము గలదిగా నుండును. తథా = అట్లే, మూర్ఛా = మూర్ఛ, ప్రసేక = లాలా స్రావము, రోమహర్ష = రోమాంచము, శిరోవేదన = తలనొప్పి, పీనస = పడిశెము, దృష్ట్యాకులతాం = చూపు చెదరినట్లుండుట, వీటిని, జనయతి = పుట్టించు చున్నది.

తాత్పర్యము : రాజుల వద్ద సేవకులు, అతి జాగరూకులై వారి ఆజ్ఞలను క్షణములలో నిర్వర్తించుచుందురు. రాజాజ్ఞ, చాల తీవ్రమైనదిగ నుండును. అందువలన పరిచారకులు రాజాజ్ఞను నిర్వర్తించుటలో విలకడలేని మనస్సు గలవారై, తొందరపాటు వలన కొన్ని తప్పులను చేయుదురు గాన విషమును కలిపిన అన్నమును అగ్నియందు వైచిన యెడల, ఒకే జ్వాలగా మండును. ఒకతూరి తీక్ష్ణమైన మరియొక పర్యాయము మన్దవేగము గలదై జ్యోతులతో ప్రకాశించును. ఇన్ద్ర ధనుస్సువలె అనేక చిత్ర విచిత్రమైన కాంతులు గలదిగ నుండును. మిక్కిలి చటచట యను శబ్దముగల్గి యుండును. ఈ అగ్ని నుండి బయలుదేరుపొగ దుర్గంధముగ నుండును. మరియు ఆ పొగ తగిలిన వారికి మూర్ఛ, లాలాస్రావము, రోమాంచము, తలనొప్పి, పడిశెము, చూపు చెదరిపోవుట మొ॥ బాధలు ఏర్పడును.

శశిలేఖ : ఇట్లు విషముతో గూడిన అన్నము, అగ్ని మొ॥ వాటియందు గూడ పరీక్షింపవలయును. ఎందువల్ల ననగ విషదాత లక్షణములను బట్టి విషాన్నమును నిశ్చయించుటకు వీలు పడదు గాన పై విధముగ గూడ పరీక్షింపవలెను. ఎందువల్ల ననగ పరిచారకులు అధైర్యవంతులుగా నుండి, రాజుయొక్క ఉత్తర్వును, నెరవేర్చుటలో తొందరపాటు గలవారై కొన్ని దోషములను గూడ చేయుదురు. అగ్నియందు విషాన్నమును వేసినయెడల ఒకే జ్వాలగా వెలుగును. (ముసలాకృతిగా వెల్గును) స్నేహ రహితముగ, మృదు వేగము గల్గిన (క్రమలాగ్ని) జ్వాల యుండును. ఆ అగ్నినుండి వెలువడు విషాన్నముతో కూడిన, ధూమము ప్రసేకరోమహర్షాదులను కల్గించును.

సూ॥ తత్ర నలద కుష్ఠలామజ్జకైః క్షౌద్రదదృతైః నస్యమంజనంచ కుర్యాత్। ధూమమేవ పాపామార్గ విడంగ ఖలాద్వయ చిత్రక, మేషశృంగి,

పుష్పసుమనః క్షారక ద్రాక్షా ఘృత గుడకృతం పిబేత్॥

ప్రతిపదార్థము : తత్ర=అక్కడ, నలద=జటామాంసి, కుష్ఠ=చెంగల్వ కోష్టు, లామజ్జకైః = తెల్లవట్టివేళ్ళు పీటిచేత, క్షౌద్ర ద్రుతైః=తేనె కలిపి పలుచగా చేసిన వాటిచేత, నస్యం = నస్యమును, చ = మరియు, అంజనం= కాటుకను, కుర్యాత్=చేయ వలయును, ధూమమేవ=పొగనుకాని వేయవల యును. (ఇందులో తేనె జేర్చరాదు), అథవా = అట్లుకాని యెడల, అపా మార్గ=ఉత్తరేణి, విడంగ = వాయువిడంగములు, బలద్వయ=చిట్టాముట్టి, పేరాముట్టి, చిత్రక=చిత్రమూలము, మేషశృంగీపుష్ప=దుష్టుపుతీగె పువ్వులు, సుమనః=జాజితీగెయొక్క, క్షారక=మొగ్గ, ద్రాక్షా=ద్రాక్ష, ఘృత=నెయ్యి, గుడ = బెల్లము, వీటితో కృతం=చేయబడిన, ధూమం=ధూమమును, పిబేత్= త్రాగవలెను.

తాత్పర్యము : విషాన్నముతో కూడిన అగ్నినుండి వెలువడుపొగ సోకిన యెడల, సంభవించు మూర్ఛాదులకిట్లు చికిత్స చేయవలయునని సూచించు చున్నారు. జటామాంసి, చంగల్వ కోష్టు, తెల్ల వట్టివేళ్ళు, ఈ మూడింటిని, రోటిలో వేసి, దంచి, వస్త్రగాలనము చేసిన చూర్ణములో తేనె కలిపి పదునుగా చేసి, నస్యకర్మను మరియు, అంజనమును(ముక్కులద్వారా నస్యకర్మ, కన్నుల కంజనము) చేయవలెను. మరియు తేనె కలుపని చూర్ణముతో పొగవేయవలెను. అట్లుపై చూర్ణముతోనేకాక, ఉత్తరేణి, వాయువిడంగములు, చిట్టాముట్టి, పేరా ముట్టి,చిత్ర మూలము, దుష్టుపుతీగె పువ్వులు, జాజి మొగ్గలు, ద్రాక్ష,బెల్లము పీటినన్నింటిని ముద్దగా దంచి,దానిలో నెయ్యివేసి కలిపి,నిప్పులలో వేసిన పొగ వచ్చును. ఆ పొగను పట్టవలయును. ఈ పొగపట్టుట వలనమూర్ఛాదులు గతించి పోవును.

శశిలేఖ : విషాన్న ధూమమువలన సంభవించిన, ప్రసేకాదులలో సమ భాగముగ గ్రహించిన, తేనె కలిపిన నలాదుల చేత, నస్యమును, అంజనమును చేయవలెను. (నలదం=జటామాంసీ) అపామార్గాదుల చేత చేయబడిన పొగను వేయవలెను. (సుమనః క్షారకం=సుమ సాంక్షారకం — జాజి తీగెల యందలి మొగ్గలు) అపామార్గము మొదలు ద్రాక్ష వరకు సమభాగములు, ఘృత గుడ ములు ముద్దయగుటకు, హేతు సాదృశ్యము వలన ఏవకార ప్రయోగము.

మూ॥ స్నేహలవణ యోగాదపి చాగ్నిరిత్థం స్యాత్। అతో వయోభిః పరీక్షేత. తత్ర విషజుష్టాహారాభ్యవహారా త్కాకాః క్షామ స్వరా భవంతి, మక్షికాః సవిషమన్నే ననితాయన్తే। నితినాశ్చ వ్యాపద్యన్తే. దృష్ట ఏవ చాస్మింస్తు చకోరస్యాక్షిణీ విరజ్యేతే। కోకిలస్య స్వరో వికృతిమేతి। హంసస్య గతిః స్ఖలతి। కూజతిభృంగరాజః, మాద్యతి క్రౌంచః। విరౌతి కుకుహాకుః। విక్రోశతిశుకః శారికాచ। ఛర్దయతి చామీకరః। అన్యతో యాతి కారండవః।

మ్రియతే జీవం జీవకః। గ్లాయతి వా హృష్ట రోమా భవతి నకులః। శకృద్వి సర్జయతి వానరః। రోదితి పృషతః హృష్యతి మయూరః। దర్శనాదేవ చాస్య విషం మన్దతా ముపైతి.

ప్రతిపదార్థము : స్నేహ లవణ యోగాదపి=నూనె, ఉప్పు మొ॥ వాటి సంయోగము వలన కూడ,అగ్నిః=అగ్ని, ఇత్థంస్యాత్ = ఇట్లగును, అతః= ఇందువలన, వయోభిః = పక్షుల చేత, పరీక్షేత = పరీక్షింప వలయును. తత్ర = వాటిలో, విషజుష్టాహారాభ్యవహారాత్ = విషసంబంధము గల అన్నము తినుటవలన, కాకాః= కాకులు,క్షామస్వరాః = హీనస్వరూపము గలవిగా, భవంతి = అగుచున్నవి. మక్షికాః = ఈగలు, సవిషమన్నే=విషజుష్టమైన అన్నము నందున, ననిలీయన్తే = వాలవు (పడవు), నిలీనావా=వాలినవై, విపద్యన్తే = మరణించుచున్నవి, అస్మిన్= దీనియందు, దృష్టఏవ=చూడ బడుట తోడనే, చకోరస్య=వెలుగు పులుగు యొక్క, అక్షిణీ=నేత్రములు, విరజ్యాతే = రంగుకు కోల్పోవు చున్నవి. కోకిలస్య=కోయిలయొక్క, స్వరః=స్వరము, వికృతి=వికృతిని, ఏతి=పొందు చున్నవి. హంసస్య = హంసయొక్క, గతిః=నడక, స్ఖలతి=జారుచున్నది (తడబడు చున్నది.), భృంగరాజః=గొప్పతుమ్మెద, కూజః=కూయుచున్నది. క్రౌంచ=క్రౌంచపక్షి,మాద్యతి=పరవశించిపోవును, కృకవాకుః=కోడి,విరౌతి= బిగ్గరగ కూయును, శారికా = గోరువంకపిట్ట, చ=మరియు, శుకః=చిలుక, విక్రోశతి=అరచును, చామీకరః=చామీకరము(బంగారపు పక్షి), ఛర్దయతి= వాంతిచేసుకొనును, కారండవః=కన్నెలేడి యను పక్షి, అన్యతో యాతి= మరియొక ప్రదేశమునకు వెళ్ళును, (విషాన్నము దగ్గర నుండదు), జీవంజీవకః= వెన్నెల పులుగు, మ్రియతే=చంపబడుచున్నది, అథవా = అట్లు కాని యెడల, గ్లాయతి=గ్లానిని పొందుచుచున్నది నకులః=ముంగిస, హృష్టరోమా=వెంట్రు కలు నిక్కబొడుచుకున్నదిగా, భవతి=అగుచున్నది, వానరః=కోతి, శకృత్= మలమును, విసర్జతి=విడుచుచున్నది, పృషతః = దుప్పి, రోదితి =ఏడ్చును, మయూరః = నెమలి, హృష్యత = రోమహర్షము గల్గిన దగును, (సంతోషించుచున్నది), చ=మరియు, అస్య=ఈ నెమలియొక్క, దర్శనాదేవ= చూపువలననే, విషం=విషము, మన్దతాం=మన్దతను, ఉపైతి=పొందుచున్నది.

తాత్పర్యము : పక్షులతో విషాన్న పరీక్ష।

అగ్నిలో విషముతో కూడిన అన్నమును వేసిన యెడల, ఎట్లు చిటచిట యను శబ్దము వచ్చునో, అట్లే, తైలము, ఉప్పు వేసినను, చిటచిటయను శబ్దము వచ్చును. ఇందువలన ఆహారము కొఱకు నుపయోగించు నన్నము యొక్క పరీక్ష పక్షుల ద్వారా కూడ చేయవలయును. విషమును కలిసిన అన్నమును తినుటచేత కాకి హీన స్వరము గలదగును. విషముతో కూడియుండు నన్నము

నందు ఈగలు చేరవు. చేరినచో అక్కడి కక్కడనే మృతి జెందును. విషదుష్ట మైన అన్నమును చూడగనే చిలుక, కోడి, గోరువంక పిట్ట, తుమ్మెదలు గట్టిగ అరచును. కోతి మలమును విడిచిపెట్టును. ముంగిస వెంట్రుకలు నిక్కబొడుచు కొనును. దుప్పి యేడ్చును, చకోర పక్షియొక్క నేత్రములు తెల్లనగును, క్రౌంచ పక్షికి మదముగల్గును, నెమలికి రోమహర్ష మేర్పడును, నెమలి దర్శనము వలన విషమునకు తేజస్సు తగ్గి పోవును, ఇట్టి పరీక్ష వలన, అన్నాదు లకు విష సంబంధము గలదని తెలిసికొని,పై నుదాహరించినజంతువులు మరణించు టకు పూర్వమే ప్రయత్న పూర్వకముగ వాటిని దూరముగ వదలిపెట్ట వల యును.

*శశిలేఖ* : వయోభిః = పక్షుల చేత గూడ, పరీక్షింప వలయును. విష సంబంధముగల అన్నముపై దోమలు (ఈగలు) వాలవు. వాలిన యెడల చచ్చును. విక్రోశనం = చాలసేపు దీర్ఘముగ నరచుటయని యర్థము.

తక్కిన విషయము వ్యాఖ్యానాంశము.

సూ॥ విషదూషితస్య పునరాహారస్యోష్మా మయూరకంఠాభోఽభ్యేతి। తద్బాష్పేణాపి ధూమవత్ మూర్ఛాదయః। తేషాం తద్వదేవ సాధనమ్। హస్తేన స్పృష్ట మన్నం విషవద్దాహశోఫస్వాప నఖశాతాన్ కరోతి। తస్యశ్యామేన్ద్రగోప సోమోత్పలై ర్లేపః।

*ప్రతిపదార్థము* : విషదూషితస్య పునః = మరల విషముచే దూషింప బడిన; ఆహారస్య = ఆహారము యొక్క; ఊష్మా = బాష్పము; మయూరకంఠాభః = నెమలి కంఠముతో సమానమైన కాంతి గలదిగ; అభ్యేతి = అగును (పొందును); తద్బాష్పేణ = ఆ ఆవిరిచేత; ధూమవత్ = పొగవలె; మూర్ఛాదయః = మూర్ఛాదులు కల్గును, తేషాం = ఆ మూర్ఛాదులకు; తద్వదేవ = ధూమమునకు చికిత్స చేయునట్లే చేయుట; సాధనం = సాధనమగును; హస్తేన = చేతితో; స్పృష్టం = తాక బడిన; అన్నం = అన్నము; విషవత్ = విషముతో సమానముగ; దాహ = దాహము; శోఫ = వాపు; స్వాప = సంజ్ఞా నాశము; నఖశాతాన్ = గోళ్ళు రాలిపోవుటలను; కరోతి = చేయుచున్నది; తత్ర = అక్కడ; శ్యామా = గన్ధప్రియంగు (అనన్త మూలము); ఇంద్రగోప = ఇంద్రగోపపురుగులు; సోమ = బ్రాహ్మి, ఉత్పలైః = నల్లకలువ వీటితో; లేపః = లేపము; కుర్యాత్ = చేయవలయును.

తాత్పర్యము : విష సహితమైన అన్నము నుండియే, వేడియైన ఆవిరి బయటకువచ్చిన, ఆ ఆవిరి, నెమలి కంఠమువలె కాంతి గలదిగా నుండును. ఈ వేడి ఆవిరిలో విషము కలసిన పొగతో సమానముగ మూర్ఛాదులు సంభవించును. ఈ మూర్ఛాది రోగములకు పూర్వము చెప్పిన చికిత్సలనే చేయు

వలెను. చేతితో స్పృశింపబడిన అన్నము విషమువలె దాహాదులను కల్గించును. ఆదాహాదులకు గన్ధ పిరోజా, ఇంద్రగోవ పురుగులు, సరస్వతి ఆకులు ఈ మూడింటిని, బాగుగ రుబ్బి, కల్కముచేసి, ఆకల్కమును లేపము చేయవలెను.

శశిలేఖ : విషము కలిసిన అన్నమునుండి వచ్చు బాష్పము వలన వ్యాధులు సంభవించును. ధూమవిధిలో చెప్పబడిన, మూర్ఛ, రక్తపిత్తము, అర్దితము మొ॥ ధూమ విధిలో చెప్పబోవు ఘృతములు, నస్యములు మొ॥ వాటితో చికిత్స చేయవలయును. విషాన్నమును తాకిన యెడల, దాహాదులు కల్గును. స్వాపః అనగ అచేతనత్వమని అర్థము. విష స్పర్శ వలన కలిగిన దాహాదులలో పైనుదాహరించిన కల్కమును లేపము చేయవలయును, శ్యామా=గన్ధ ప్రియంగుః, ఇన్ద్రగోపః = భాస్వరః, క్రిమి విశేషః, సోమో=బ్రాహ్మీ అని కలదు.

మూ॥ అభ్యవహ్రియమాణం త్వోష్ఠ చిమిచిమా న్తర్వక్త్ర దాహ జిహ్వామూల గౌరవ హనుస్తంభ దన్తహర్ష లాలాః కరోతి రసాపరిజ్ఞానంచ, తత్ర ధూమోక్తం దన్తకాష్ఠోక్తం కర్మ। ఆమాశయ గతం స్వేదమద మూర్ఛా ఛర్దిః వైవర్ణ్యాధ్మాన రోమహర్ష దాహారుచి దృష్టి హృదయోపరోధాన్ బిందుభిశ్చాచయ మంగానాం కరోతి ॥27॥

ప్రతిపదార్థము : అభ్యవహ్రియమాణంతు = విషముతో కూడిన అన్నము భుజింపబడినదయితే; ఓష్ఠ చిమిచిమ=పెదవుల యందు చిమిచిమము; అన్తర్వక్త్ర దాహ=నోటిలో దాహము; జిహ్వామూలగౌరవ = నాలుక యొక్క మొదట యందు గౌరవము; హనుస్తంభ=అంకిళ్ళు స్తంభించుట; దన్తహర్ష =దన్తహర్షను; లాలాః =జొల్లు కారుట; చ=మరియు; రసాపరిజ్ఞానం=నాలుక యందు రస జ్ఞానము లేకుండుట, కరోతి = చేయుచున్నది; తత్ర=అక్కడ; ధూమోక్తం = విష ధూమమువలన సంభవించిన వ్యాధులకు చెప్పబడిన; దన్తకాష్ఠోక్తం = దన్తకాష్ఠ ప్రకరణమున చెప్పబోవు; కర్మ = చికిత్స, చేయవలయును; ఆమాశయ గతం = విషముచే దుష్టమయిన అన్నము ఆమాశయమును జెందినచో; స్వేద=చెమట; మద = మదము; మూర్ఛా = మూర్ఛ; ఛర్ది =వాంతి; వైవర్ణ్య=వివర్ణత్వము; ఆధ్మాన=ఆధ్మానము; రోమహర్ష =రోమ హర్షణము; దాహ=తాపము; అరుచి= నోటికి రుచి లేకుండుట; దృష్టి హృదయోపరోధాన్ = నేత్రములు తెలియకుండుట, గుండె మ్రాడుచుట అను నీ యుపద్రవములను; బిందుభిః=అనేక వర్ణములతో కూడిన మచ్చలతో; అంగానాం=శరీరావయవములలో; ఆచయం=వృద్ధిని; (వ్యాప్తిని); కరోతి= చేయుచున్నది.

తాత్పర్యము : విషము కలసిన ఆహారము వలన సంభవించు వికారములకు చికిత్స. విషముకలసిన ఆహారమును నోటిలో పెట్టుకొనుటవలన, పెదవులలో

చిమచిమయను మంట; ముఖమునందు తాపము, జిహ్వామూలమునందు జడత్వము, హనుస్తంభము, దన్తహర్షము, లాలాజలముయొక్క స్రావము, నాలుకకు రసజ్ఞానము లేకుండుట, ఈ వికారలు కల్గును. వీటిశమనము కొఱకు ధూమవిధిని చెప్పబోవు దన్తకాష్ఠ చికిత్సలు చేయవలయును. విషయుక్త దన్త కాష్ఠమునకు చికిత్స తరువాత చెప్పబడును.

ఆమాశయ గతమైన విషాన్నమువలన కల్గు నుపద్రవములు. విషములో కలసిన అహారము, ఆమాశయమును పొందిన వెంటనే. శరీరమునందు చెమట, మదము, మూర్ఛ, వమనము, వివర్ణత, కడుపుబ్బరము, రోమహర్షము, తాపము, నోటికి రుచిలేకుండుట, నేత్రములకు, మనస్సునకు, వాటి క్రియలలో ప్రతిబంధకము, శరీరములో నీటి బిందువులవలె పొడలు వ్యాపించుట సంభవించును.

*శశిలేఖ* : విషముతో కూడిన అన్నమును తినుట వలన, పెదవులపై చిమచిమమని మంట బయలు దేరును. లవణ రసము నాలుకకు తెలియకుండును. అక్కడ ధూమమునందు చెప్పబడిన చికిత్స చేయవలయును. విషాన్నమునందు ధూమప్రకరణములో చెప్పబడిన, నలదకుష్ఠాదులచేత నస్యాది చికిత్సలను, విష సహితమైన దన్తకాష్ఠముతో కల్గిన వికారములకు తరువాత చెప్పబోవు చికిత్సలనుగూడ, ఇచట చేయవలయును. విషాన్నము ఆమాశయమును పొంది, స్వేదాదులను గలిగించును. దృష్టికి, మనస్సుకు అవరోధమును కల్గించును. జల బిందువులవలె మచ్చలను శరీరమంతయు వ్యాపింప జేయును.

సూ॥ తత్ర మదన ఫలాలాబూ బింబీ కోశాతకీ ఫలైః దధి మధుయుక్తమాశు వమనం దద్యాత్। నిష్పావాంబుభిర్వా, తతః స్నిగ్ధ శరీరం విరేచయేం, త్రిఫలా, త్రికటు, నాగపుష్ప, మధుక, బర్హిణపర్ణి, బృహతీ ద్వయచూర్ణత్ సింహ, వ్యాఘ్ర, వృకతరక్షుద్వీపి మార్జార సృగాల మృగగోధానా మన్యతమ పిత్త సంయుక్తం సక్షేద్రం పానమేష జీవనో నామాగదః పరం సర్వ విషాపహమ్, తస్మిన్ జీర్ణే శ్యామా వ్యోషాతి విషాసిద్ధేన పయసా ఘృతేన వోపస్తంభితాం యవాగూం పాయయేత్। పరిణతాయాంచ తస్యాం త్రికటుక సిద్ధేనముద్గయూషేణ, కించిల్లవణేన, ససర్పిష్కేణ। మృద్వోదనం భోజయేత్। మధుక శిరీష చందనైశ్చైనమాలిమ్పేత్ ॥31॥

*ప్రతిపదార్థము* : తత్ర = దాని కొఱకు; మదన ఫల = మంగకాయ; అలాబు = సొరకాయ; బింబీ = దొండ; కోశాతకీ = చేదుబీర; ఫలైః = వీటి పండ్లతో; దధి మధు యుక్తం = పెరుగు తేనె జేర్చి; ఆశు = వెంటనే; వమనం = వమనౌషధమును; దద్యాత్ = ఇవ్వవలయును: అథవా = అట్లు కాని యెడల; నిష్పావాంబుభిః = అనుముల నీళ్ళతో (ధాన్యముల పొట్టుతో కూడిన నీళ్ళతో); వమనం దద్యాత్ = వమనౌషధము నివ్వవలయును; తతః = అటు పిమ్మట; స్నిగ్ధ శరీరం = స్నిగ్ధ శరీరుణ్ణి; విరేచయేత్ = విరేచనమును చేయించవలెను; త్రిఫలా =

త్రిఫలములు(కరక, తాని, ఉసిరికలు); త్రికటు=శుంఠి, పిప్పళ్ళు, మిరియాలు; నాగపుష్ప=నాగకేసర పుష్పములు; మధుక=అతి మధురము (ఇప్ప), బర్హిణ =గ్రంధితగరము; పర్ణీద్వయ=ముయ్యాకుపొన్న, కోలపొన్న; బృహతీ ద్వయ చూర్ణం=పెద్ద ములక, వాకుడు వీటి యొక్క చూర్ణమును; సింహ=సింహము యొక్క; వ్యాఘ్ర=పులియొక్క; వృక=తోడేలుయొక్క; తరక్షు=సివంగియొక్క; ఋక్ష=ఎలుగు గొడ్డు యొక్క; ద్వీపి=చిఱుత పులి యొక్క; మార్జార=పిల్లి యొక్క; సృగాల=నక్క యొక్క; మృగ=జింక యొక్క; గోధానాం= ఉడుము మొ॥ వాటి యొక్క; అన్యతమ పిత్తయుక్తం=ఏదియో నొక జంతువు యొక్క పిత్తముతో కలిపి, సక్షౌద్రం=తేనెతో గూడ; పానం=త్రాగవల యును; ఏషః=ఇది; జీవనో నామ=జీవనమను పేరుగల; అగదః = అగదము; పరం=మిక్కిలి; సర్వవిషౌషధమ్=సమస్త విషములకిది యౌషధము (పరం= ఉత్కృష్టము); తస్మిన్ జీర్ణే సతి=ఈ జీవనాగదము జీర్ణమైన తరువాత; శ్యామా=ప్రియంగు (అనన్త మూలము); వ్యోష=శుంఠి, పిప్పళ్ళు, మిరియ ములు; అతివిషా=అతివిష, వీటితో; సిద్ధాం=సిద్ధము చేయబడిన; పయసా= పాలతో; ఘృతేన=ఘృతముతో; ఉపస్తంభితాం=కలుపబడిన; యవాగూం= యవాగువును; పాయయేత్=త్రాగించవలయును; చ = మరియు; తస్యాం పరిణతాయాం=ఆ యవాగువు జీర్ణమైన తదుపరి; త్రికటుక సిద్ధేన=త్రికటు ములో సిద్ధము చేయబడిన; ముద్గయూషేణ=పెసర కట్టుతో; కించిల్లవణేన= కొంచెము ఉప్పుతో; ససర్పిష్కేణ = నేతితో కూడిన; మృదుం=మెత్తగా నున్న; అన్నం అన్నమును; భోజయేత్=భుజింపచేయవలయును; చ=మరియు; మధుక=అతి మధురము; శిరీష=దిరిసెన; చన్దనైః=చన్దనము వీటితో; ఏనం= వీనియొక్క శరీరమును; ఆలిమ్పేత్ = లేపము చేయవలెను, పూయవలెను.

**తాత్పర్యము :** అవి శాంతించుటకు మ్రంగకాయ, చేదుసొర, దొండ కాయ, అడవి చేదుబీర, వీటియొక్క ఫలముల చేత, తేనె, నెయ్యి కలిపి త్రాగించి వెంటనే వమనము చేయించవలయును. ఇట్లు వమనము చేయించిన తరువాత, స్నేహకర్మ ద్వారా శరీరమును స్నిగ్ధముగ చేయించవలెను. తరు వాత విరేచనమును చేయించవలెను. త్రిఫలములు (కరక, తాని, ఉసిరికలు), త్రికటుకములు (శుంఠి, పిప్పళ్ళు, మిరియములు), అతి మధురము, నాగ కేస రములు, గ్రంధి తగరము, ముయ్యాకు పొన్న. కోలపొన్న, పెద్ద ములక, వాకుడు, ఈ ద్రవ్యముల నన్నింటిని, సమభాగములు గ్రహించి, బాగుగా చూర్ణించి, ఆ చూర్ణమును, సింహము, పులి, తోడేలు, సివంగి, ఎలుగు గొడ్డు, చిత పులి, పిల్లి, నక్క, జింక, ఉడుము, ఈఱు జంతువులలో నేదియో నొక జంతువు యొక్క పిత్తమున గాని, పిత్త రసమున గాని, కలిపి, అందులో తేనె జేర్చి సేవించవలయును. ఇది "జీవన" మను పేరుగల అగదము... ఈ అగదము సమస్త విషములను నశింపజేయుటలో మిక్కిలి శ్రేష్ఠమైన ఔషధమని చెప్పబడినది.

ఈ అగదము శరీరములో జీర్ణమైన తరువాత, ప్రేంఖణము, శుంఠి, పిప్పళ్ళు, మిరియములు, అతివిష, ఈ ద్రవ్యములలో సిద్ధము గావించి, పాలు, తేనె ఈ రెంటితో మిశ్రమము చేసిన యవాగువును త్రాగించవలయును. ఈ యవాగువు జీర్ణమైన తరువాత, శుంఠి, పిప్పళ్ళు, మిరియములు, ఈ మూడును కలిపి పాకము చేయబడిన కొంచెము ఉప్పు, కొంచెము నెయ్యి చేర్చబడిన పెసల కట్టుతో కూడిన, మెత్తగా సున్న అన్నమును తినిపించవలయును. ఆ విషముతో కూడిన మనుష్య శరీరము పైన యష్టిమధుకము, దిరిశెనపు విత్తులు, చన్దనము వీటిని మృదువుగా చూర్ణించి, నీళ్ళు కలిపి, కల్కము చేసి, ఆకల్కముతో లేపము చేయవలెను.

*శిరోభేద*: అవి శాంతించుటకు, మదనఫలాదులచేత వమనౌషధము నివ్వవలెను.

అలాబు, కటుకాలబు ఫలమ్ (చేదుసొర) యని అర్థము.

కోశాతక్యాః = జాలిన్యాః ఫలమ్ (అడవి చేదుబీర), నిష్పావః = శింబీ ధాన్య విశేషః (అనుములు). దానిని మథించి తీసిన జలము (ఆసవము), శ్యామా = గన్ధప్రియంగు, తక్కినవి తాత్పర్యాంశములు.

**మూ॥** పక్వాశయగతం తృడ్దాహ మూర్ఛా తీసారాటోప తంద్రేంద్రియ వికృతి బలభ్రంశ, కార్శ్య పాండుత్వోదరాగి జనయతి। తత్ర నీలినీ ఫలయుక్తేన సర్పిషా విరేచనం సమాక్షికంచ దూషీ విషారిం దధ్నాపాయయేత్। దన్తకాష ప్రయుక్తేతు, విషేకూర్చక విశరణ మౌషధ గన్ధో రూక్షతా తాల్వు దన్త జిహ్వోష్ఠ మాంస శోఫశ్చ, తత్ర ప్రచ్ఛాయ ధాతకీ పుష్ప జాంబవాస్థి హారీతకీ చూర్ణైః సక్షౌద్రైః సప్తచ్ఛదకల్కేనవాప్రతిసారణంకుర్యాత్। దాడిమ కరమర్ద భవ్యామ్రాతక కోలబదర రసక్షౌద్ర యుక్తం గండూషమ్।అనేన జిహ్వో నిర్లేఖన కబళ గండూషా వ్యాఖ్యాతాః।

ప్రతిపదార్థము : పక్వాశయ గతం = విషము పక్వాశయమును చేరి, తృట్ = దప్పిని, దాహ = తాపమును, మద = మదమును, మూర్ఛా = మూర్ఛను, అతీసార = నీళ్ళ విరేచనమును, ఆటోప = ఆధ్మానమును, తంద్రా = జాడ్యమును, ఇంద్రియ వికృతి = ఇంద్రియములయందువికారమును,బలభ్రంశ = బల నాశమును,కార్శ్య = కృశత్వమును, పాండుత్వ = పాండుభావమును, ఉదరాణి = ఉదరములను, జనయతి = కల్గించుచున్నది.తత్ర = అక్కడ.నీలినీ ఫల యుక్తేన = నీలి పండ్లతో కూడిన, సర్పిషా = నేతితో, విరేచనం = విరేచనము (చేయించవలెను.) చ = మరియు, దూషీవిషారిః = దూషీ విష చికిత్సలో చెప్పబడిన, దూషీ విషారియను పేరుగల అగదమును, సమాక్షికం = తేనెకలిపిన దానిని దధ్నా = పెరుగుతో, పాయయేత్ = త్రాగించ వలెను. దన్తకాష్ఠ ప్రయుక్తే = పండ్లుతోముపుల్లలలో ప్రయోగించిన, విషేతు = విషమునందైతే, కూర్చకవిశర

ణం=కుంచిక రాలిపోవుటను, ఔషధ గన్ధః = విష ఔషధముయొక్క-వాసనను, రూక్షతా=రూక్షత్వము, తాలు=దవడలు, దన్త=దన్తములు, జిహ్వా=నాలుక, ఓష్ఠ=పెదవి, మాంస=దన్తమూల మాంసము వీటియందు, శోఫశ్చ=వాపునూ వచ్చును, తత్ర=దానిని శాంతింప జేయుటకు, ప్రచ్ఛాయ=కత్తితో కాట్లు వేసి, ధాతకీపుష్ప=ఆరెపువ్వు, జాంబవాస్థి = అల్ల నేరేడుతొక్క, హారీతకీ= హారీతకి వీటియొక్క, చూర్ణైః = చూర్ణములతో, సక్షౌద్రైః = తేనెకలిపి, అథవా=అట్లుకాని యెడల, సప్తచ్ఛద కల్కేన=ఏడాకుల పొన్నకల్కముతో, ప్రతిసారణం కుర్యాత్ = తోమవలెను, దాడిమ = దానిమ్మ, కరమర్ద= వాక్కాయ, భవ్యా=భవ్యము, ఆమ్ర=మామిడి, ఆమ్రాతక=అంబాళపు చెట్లు, కోలః=రేగు, బదర=గంగరేగు, వీట్లయొక్క,రసం=రసమును, క్షౌద్ర యుతమ్=తేనెకలిపి, గండూషమ్=పుక్కిలి బట్టుటను, కుర్యాత్=చేయవలెను, అనేన=ఈ చెప్పబడిన దీనితో, జిహ్వానిర్లేఖన=నాలుకగీచుట, కవల=పుక్కిలి బట్టి ఇటునటు కదుల్చుటను, గండూష = పుక్కిలిపట్టుట, వ్యాఖ్యాతాః = వ్యాఖ్యానము చేయబడినవి (వివరింపబడినవి).

**తాత్పర్యము** : విషమయమైన ఆహారము పక్వాశయములో జేరి, దప్పిని, తాపమును, మదమును, మూర్ఛను, అతిసారమును, కడుపుబ్బరమును, జాడ్యమును, జ్ఞానేంద్రియములలో వికారమును, బలనాశమును, శరీరమునకు, పాండువును, కృశత్వమును ఉదరరోగములను కల్గించును. ఈ వికారముల నుప శమింప జేయుటకు నీలిపండ్ల కషాయములో ఘృతమును చేర్చి త్రాగింపవలెను, విషారియను, అగదమును, తేనెకలిసి పెరుగుతోకూడి త్రాగింప వలయును. (పిప్పల్యోధ్యామకం మాంసీలోధ్రమేలా సువర్చికా। కుటం నటంనతం కుష్ఠం యష్టీ చందనగైరికమ్। దూషీ విషారిర్నామాఽయం నచాన్యత్రాపి వార్యతే॥) ఇదియేదూషారి అగదమని చెప్పబడుచున్నది.

పండ్లు తోముకొను పుల్ల విషలిప్తమైన యెడల కూర్చకము నందలి భాగములు విడివిడిగా రాలిపోవును. ఔషధముయొక్క వాసన ఆ పుల్లనుండి వచ్చును.ఆపుల్ల రూక్షముగలదిగనగును.అట్టిదన్తకాష్ఠములతోదన్తములెనుతోమిన యెడలతాలువులలో,దన్తములలో నాలుకలో, పెదవులపై, దంతమాంసములలో వాపువచ్చును. ఈ వికారములను శమింప జేయుటకు, దన్తమాంసముపై శస్త్రముతో గాట్లు వేయవలెను. ధాతకీ పుష్పములు, నేరేడు గింజలు, హారీ తకీ వీట్లతో గాని, ఏడాకులచెట్ల కల్కముతోగాని దన్తములను తోమవలెను, తరువాత దాడిమము, వాక్కాయ, భవ్యము, రేగు, గంగరేగు పండ్లయొక్క రసమును, తేనెతో కలిపి, గండూషమును, చేయింపవలయును. ఈ చెప్పబడిన ప్రకరణముతో జిహ్వా-నిర్లేఖనము, కవలము, గండూషము వ్యాఖ్యానింప బడినది.

*గండూషము :* నోటిలో నుంచిన ద్రవము అటు నిటు కదుల్చుటకు వీలు పడదు. దీనిని గండూషమందురు. (నోటినిండా కషాయముండును).

*కవలము :* నోటిలో నుంచిన కషాయమును ఇటు నటు కదల్ప వచ్చును.

*శశిలేఖ :* పక్వాశయగతమైన విషాన్నము దప్పి మొ॥ వానిని కల్గించును; తచ్ఛాంతి కొఱకు నీలి పండ్లను కషాయము చేసి, నెయ్యి కలిపి, విరేచనము చేయింప వలెను. దూషీ విష చికిత్సలో చెప్పబడు దూషీ విషారియను పేరుగల అగదమును తేనె కలిపి, పెరుగుతో చేర్చి త్రాగింపవలయును. ప్రతిసారణం అనగా నోటిలో నుండు శ్లేష్మ నిశ్శేషముగ నశించిపోవు వరకు నీటిలో ఔషధము నుంచుకొనుట అని యర్థము, కరమర్దమ్ = కరామ్లమ్, వాక్కాయ, ఆమ్రాతకం = పీతనకమ్, అంబాళపు చెట్టు, నాలుక గీచుకొను పుల్లకు విషమును పూసిన, దన్త కాష్ఠమునకు చెప్పిన లక్షణము లేర్పడును. వాటి చికిత్సలు, దన్త కాష్ఠమునకు చెప్పినట్లే చేయవలెను. తాంబూలాదులను మాత్రము నోటిలో నుంచుకొన వచ్చును.

మూ॥ అంజన ప్రయుక్తే ఽశ్రుదూషికోప దేహ రాగ వేదనా దృష్టి విభ్రమా భవన్త్యా న్ధ్యంచ। తత్ర సర్పిష్పానం యోజ్యం। శృతేన పయసా సప్తకృత్వః పిప్పలీర్భావయేత్. తత స్తత్కల్కేన। సర్పిర్విపక్వం నేత్ర తర్పణమ్. కపిత్థ మేష శృంగీ భల్లాతకానాం పుష్పైర్వరణ నిర్యాసేన వాంజనం బృహతీ, శిరీషబీజ ప్రపౌండరీక నాగబలా చూర్ణం సప్తకృత్వో మధునా భావయేత్। తచ్చ స్రోతో ఽంజన సువర్ణ చూర్ణ యుక్త మంజనం దేయమ్। నస్యధూమ ప్రయుక్తే, శిరోరుక్కఫ స్రావః ఖేభ్యో రుధిరాగమన మింద్రియ వైకృతం చ। తత్రాతి విషా శ్వేతా కాకమాచీ మదయన్తికా కల్కే క్షీర సిద్ధం। సర్పిర్నస్యే పానేచ విదధ్యాత్ ॥40॥

*ప్రతిపదార్థము :* అంజన ప్రయుక్తే = విషము కలిసిన అంజనము (కాటుక); అశ్రు = కన్నీటిని; దూషికా = కంటికి పుశిని; ఉపదేహ = కాటుక కంటిలో పూసినట్లుండును: రాగ = ఎఱుపును; వేదనా = బాధను, దృష్టి విభ్రమాః = చూచుటలో భ్రాంతి, మిథ్యాదృష్టిని, చ = మరియు, ఆన్ధ్యం = గ్రుడ్డితనమును, భవన్తి = కల్గుచున్న, తత్ర = అదిశాంతించుటకు, సర్పిష్పానం యోజ్యమ్ = నేతిని త్రాగింపవలెను, శృతేన పయసా = కాచినపాలతో, పిప్పలీః = పిప్పళ్ళు, సప్తకృత్వః = యేడు పర్యాయములు, భావయేత్ = భావన చేయవలయును, తతః = అటు తరువాత, తత్కల్కేన = ఆ యేడుమార్లు భావన చేసిన పిప్పళ్ళను కల్కముచేసి, ఆకల్కముతో, సర్పిః = నెయ్యి, విపక్వం = పక్వము చేయబడిన దానిని, నేత్రతర్పణమ్ = నేత్రములకు తర్పణము చేయవలెను. కపిత్థ మేషశృంగీ భల్లాతకానాం = వెలగ, మేషశృంగి, జీడి, ఈ మూడింటి యొక్క, పుష్పైః = పువ్వులతో, అథవా = అట్లు కాని యెడల,

వరణనిర్యాసేన = ఉలిమిరి చెట్టుయొక్క బంకతో, అంజనం=అంజనమును వేయ వలెను, బృహతీ=ములక చెట్టు, (వాకుడుచెట్టు) శిరీషబీజ = దిరిశెనవిత్తులు, ప్రపౌండ రీక = ప్రపౌండరీకము (సుగంధిద్రవ్యము), నాగబలా = నాగబల వీటియొక్క, చూర్ణం=చూర్ణమును, మధునా = తేనెతో, సప్తకృత్వః=ఏడుమారులు, భావ యేత్ = భావనచేయవలెను. తచ్చ = దానిని, స్రోతోఒంజన = తెలుపు సుర్మా, సువర్ణ చూర్ణయుక్తమ్=సువర్ణ చూర్ణమును కలిపిన దానిని, అంజనం = అంజన మును, దేయమ్=ఇవ్వవలెను (వేయవలెను), నస్యధూమ ప్రయుక్తే = నస్యము సందు, ధూమమునందు విషము కలపిన యెడల, శిరోరుక = తలనొప్పి, కఫా స్రావః=కఫముయొక్క స్రావము, ఖేభ్యః = నోరు, ముక్కు, కండ్లు, చెవులు మొ॥ స్రోతో మార్గముల నుండి, రుధిరాగమనం = రక్తస్రావము, చ= మరియు, ఇంద్రియవైకృతం = ఇంద్రియ వికృతి యేర్పడును, తత్ర=అట్టి పరిస్థితిలో (తచ్ఛాంతి కొఱకు), అతివిషా = అతివిష, శ్వేతా=విష్ణుక్రాంత యొక్క తెల్ల నిపువ్వులు, కాకమాచీ మదయన్తికా =మల్లెవీటియొక్క, కల్క= కల్కము వేసిన, క్షీరసిద్ధం = పాలనుండి సిద్ధము చేయబడిన, సర్పిః = నెయ్యి, నస్యే=నస్యమునందు, చ= మరియు, పానే = పానమునందు, విదధ్యాత్ = ఇవ్వవలయును.

తాత్పర్యము : కండ్లలో పెట్టు కాటుకలో విషము కలిపిన యెడల, కంటికి నీరు వచ్చును. పుశి వచ్చును. కాటుక కండ్లకు పూసినట్లుండి, రెప్పలు తెరచుటకు కష్టముగా నుండును. మంట యుండును. కన్నులు ఎఱ్ఱగా నగును. మిథ్యాదృష్టి, లేకున్న గుడ్డితనము సంభవించును. ఈ ఉపద్రవములు శాంతించు టకు ఘృతపానము చేయించవలయును. వేడి పాలలో పిప్పళ్ళను భావన చేసి, ఒక దినమైన తరువాత వాటిని యెండించి, మరల వేడి పాలలో భావన చేయ వలెను. ఇట్లు ఏడు పర్యాయములు భావన చేసి, ఆ పిప్పళ్ళను కల్కము చేసి, నేతిలో ఆ కల్కమును పాకముచేసి, దానితో కండ్లకు తర్పణము చేయవలెను. వెలగపండు, మేషశృంగి, జీడి ఈ చెట్ల యొక్క పూలచేత, లేక ఉలిమిరి చెట్టు యొక్క బంకచేత గాని, కన్నుల కంజనమునిడవలెను. వాకుడు, దిరిశెన గింజలు, ప్రపౌండరీకము సుగంధ ద్రవ్యము, నాగబలా వీటియొక్క చూర్ణమును, తేనెలో ఏడు పర్యాయములు భావన చేసి, అటు పిమ్మట ఆ భావన చేసిన చూర్ణములో తెల్ల సుర్మాను, సువర్ణ చూర్ణమును కలిపి, అంజన మిడవలెను. నస్యమున కుపయోగించు ఔషధములో గాని, ధూమము వేయు ద్రవ్యములో గాని కలిపిన విషము వలన తలనొప్పి, నోటినుండి కఫము స్రవించుట, స్రోతో మార్గములైన నోరు, చెవులు, ముక్కులు, కండ్లు వీటినుండి రక్తము కారును. ఇంద్రియములకు వికృతి ఏర్పడును. వీటిని శాంతింప జేయుటకు, అతివిషా, విష్ణుక్రాంతము యొక్క తెల్లని పువ్వులు, కాకమాచీ పత్రములు, మల్లె ఆకులు వీటిని కల్కము చేసి, ఆ కల్కమును పాలతో తయారు చేసిన నేతితో సిద్ధము

చేసి, నస్యమునందు, పాకము నందునూ ఉపయోగింపవలెను.

"క్షీరసిద్ధం సర్పిః" ఇట్లు గూడ అర్థమును చెప్పవచ్చును. కల్కమును చేసి, పాలలో ఘృతమును సిద్ధము చేయవలెను. అట్లు కాని పక్షమున, పాల నుండి క్రమముగా ఘృతమును సిద్ధము చేసికొని ఆ ఘృతములో ఉపర్యుక్త కల్కమును జేర్చి పక్వము చేయవలెను.

*శశిలేఖ* : అంజనములో కలిపిన విషము వలన కంటికి నీరు పుశి వచ్చును. ఉపదేహ మనగా దూషికా "పుసి" యని అర్థము. మూలకారుడు ఉపదేహ, దూషిక అను రెండు పదముల నుపయోగించెను. వ్యాఖ్యానమునకు, మూలమునకు, ఇచట ద్వైవిధ్యముగా నున్నది. దృష్టి విషమః = దర్శన భ్రాంతిః అసత్య దర్శనమ్. అందుకే మిథ్యా దృష్టియని అర్థము చెప్పితిని.

మూ॥ అభ్యంగ ప్రయుక్తేత్వగ్దాహ స్వేద పాక స్ఫోటా వదరణాని తత్ర శీతాంబు పరిషిక్తస్యచన్దన తగరోశీర, కుష్ఠ, వేణు, పత్రికామృత, సోమ వల్లీ శ్వేతా పద్మకాలేయకైరను లేపనమ్. ఏతాన్యేవచ సకత్థరసగోమూత్రాణి పానం, గిరికర్ణికా, శ్వేతమూల, ప్రియంగు శారివా మధుక సర్పసుగంధా మృగోర్వారుకతక మూలానీ శేలుక్వాథ భిష్టాని ప్రలేపః। అనే నోద్వర్తన ఘర్షణ పరిషేకాను లేపన భూషణ, యానశయ్యా స్తరణ వస్త్ర కవచ పాద కోశాద్వ పీఠా వ్యాఖ్యాతాః ॥43॥

ప్రతిపదార్థము : అభ్యంగ ప్రయుక్తే = తైలాభ్యంగమునకు, విషము ప్రయోగించిన యెడల, త్వగ్దాహ = చర్మము మండును; స్ఫోట = మచ్చలు (పొక్కును) వచ్చును; అవదరణాని = చర్మమునందు పగుళ్ళను; కుర్యాత్ = చేయును; తత్ర = పైనుదాహరించిన వ్యాధుల కుపశమనము; శీతాంబు పరిషిక్తస్య = చల్ల నీటితో తడిసిన వానికి; చన్దన = చన్దనము; తగర = తగరము; ఉశీర = వట్టివేళ్ళు; కుష్ఠ = చెంగల్వ కోష్ఠు; వేణు పత్రికా = వెదురాకు; అమృతా = తిప్పతీగె; సోమవల్లీ = సోమలత; శ్వేత = అపరాజిత; పద్మ = కమలము (పద్మపు చెట్టు); కాలేయకైః = గోపీచన్దనములచేత (పచ్చ చందనము); అను లేపనం = మెయిపూత పూయవలెను; ఏతాన్యేవచ = మరియు ఈ ద్రవ్యములచే; సకపిత్థ రస = వెలగ పండు రసముతో కూడ; గో మూత్రాణి = గోమూత్రములను; పానం = పానము చేయవలెను; గిరికర్ణికా = విష్ణుక్రాంతా (శ్వేతా); శ్వేత మూల = శ్వేత మూలము (పునర్నవ); ప్రియంగు = ప్రేంఖణము; శారివా = సుగంధిపాల; మధుక = అతిమధురము; సర్పసుగంధా = సర్పగంధ; మృగైర్వా రుక = పినపామర (బుడమ); కతక = చిల్లగింజ (ఇండుపు కాయ); మూలాని = మొదళ్ళను (వేళ్ళను); శేలు క్వాథ పిష్టాని = విరిగి చెట్టు యొక్క క్వాథములో నూరి; ప్రలేపః = లేపము; కుర్యాత్ = చేయవలయును; అనేన = పైనుదహరించిన లేపములో; ఉద్వర్తన = నలుగు పెట్టుట;

ఘర్షణ=పూసికొనుట (రుద్దుట,) పరిషేక=స్నానము, అనులేపన = లేపము, భూషణ=అలంకారములు (ఆభరణములు), యాన=యానము, శయ్యా=పడక, ఆస్తరణవస్త్ర=కంబళి, కవచ=దుస్తులు, రథ=రథము, పాదుక=పావుకోళ్ళు ఉపానహ=చెప్పులు, పాదపీఠాః=పాదపీఠములు (ఆసనము), వ్యాఖ్యాతాః= వ్యాఖ్యానింపబడినవి. (విపులీకరింపబడినవి)

తాత్పర్యము : అభ్యంగమునకు ఉపయోగించు తైలములో విషము కలిపిన యెడల చర్మములో మంట వచ్చును. చెమటలు పోయును. చర్మము నందు పాకమేర్పడును. మరియు చర్మమునందంటత మచ్చలు, పగుళ్ళు బారుట యేర్పడును. ఈ ఉపద్రవములు శాంతించుటకు చల్లనీటిలో స్నానము చేసి చందనము, గ్రంథి తగరము, వట్టివేళ్ళు, చెంగల్వ కోష్ఠు, వెదురాకులు, తిప్పతీగె, సోమలత, విష్ణుక్రాంతయొక్క తెల్లని పూలు, పద్మము, గోపీ చందనము, ఈ ద్రవ్యములను దంచి చూర్ణించి నీళ్ళతోనూరి లేపముగా చేసి శరీరమునకు పూయవలెను. పైవ ఉదాహరించిన ద్రవ్యములనే చూర్ణించి ఆ చూర్ణమును వెలగపండురసములోగాని, గోమూత్రములోగాని కలిపి త్రాగింప వలెను. విష్ణుక్రాంతయొక్క తెల్లని పూలు (పునర్నవా), శ్వేతమూలమ్ము, ప్రేంఖణము, సుగంధిపాల, అతిమధురము, సర్పగంధ, పిన్నపాపర, చిల్లగింజ, వీనియొక్క వేళ్ళను చూర్ణించి విరిగిచెట్టుయొక్క కషాయ ముతో నూరి, ముద్దచేసి, శరీరముపైన లేపనము చేయవలెను. ఈ విధముగా నలుగు పెట్టుకొనుట, శరీరముపై రుద్దుట, స్నానము, మైపూత, ఆభరణ ములు, యానములు, పడకలు, పరచుకొను వస్త్రములు, ధరించు దుస్తులు, ధరించు పావుకోళ్ళు మరియు పాద రక్షలు, కూర్చుండు ఆసనములు వీటన్నిం టిని గురించి విపులముగా వాఖ్యానించడమైనది.

*శశిలేఖ* : అభ్యంగమునందు విషము కలిసినయెడల చర్మమునందు మంట, చర్మము పగులుట మొ॥ నుపద్రవములు సంభవించును. వీటిని శాంతి పరచుటకు చల్లనీటి స్నానము చేసిన తరువాత, చందనాదులచేత శరీరమునకు లేపము చేయవలెను. వేణుపత్రికా యనగా హింగు పత్రికా యని అర్థము. సోమవల్లీ యనగ బ్రాహ్మీ యని అర్థము. కాలేయక మనగ గోపీ చందనమని అర్థము. శ్వేతమూలం అనగా పునర్నవాయని అర్థము (తెల్లగలిజేరు). సర్ప సుగంధా యనగ నాగద (నాగజెముడు) మని అర్థము. పాదుకా యనగా కర్రచే చేయబడినవి యని అర్థము. ఉపానహౌ అనగా చర్మముతో చేయబడిన చెప్పులు అని అర్థము. యానం అనగ రథాదుల యందు చేయు ప్రయాణము అని అర్థము.

మూ॥ విశేషత స్త్వాభరణ కృతే వికారేఽశ్వగంధాపామార్గ కిణహీ ఖదిర శిరీషకల్కైర్గోపిత్త యుక్తైః ప్రదేహః పాదపీఠ కృతే శ్లేష్మాతకా సర్పసుగంధా.

క్రమకల్కో మధు యుక్తః ఛత్ర ప్రయుక్తే వేదనా స్ఫోటనాం క్షిప్రపాకానాం పక్వ జాంబవ ప్రకాశానాం ప్రాదుర్భావః. తత్ర మధుక పాటలా కశేరుక లోధ్రాంజన, కుష్ఠ సర్పసుగంధా ఖదిర, శిరీష కల్కైః సర్వగాత్ర ప్రదేహః అనేన చామర వ్యజనే వ్యాఖ్యాతే.

ప్రతిపదార్థము : విశేషతస్తు = విశేషముగనైతే, ఆభరణకృతే=విష ములో కలిపిన ఆభరణముల వలన కలిగిన, వికారే=వికారమునందు, అశ్వ గంధా=పెన్నేరు గడ్డలు, అపామార్గ = ఉత్తరేణు, కిణహీ=కొడిశెపాల, ఖదిరా=చంద్ర, శిరీషా = దిరిసెన వీటియొక్క, కల్కైః=కల్కములతో, గోపిత్తయుక్తైః=గోరోచనము కలిపి వీటితో, ప్రదేహః=లేపనముచేయ వలెను. పాదపీఠకృతే=కూర్చుండు ఆసనమువిషముతోగూడి సంభవించు,వికారే=వికా రమునందు,శ్లేష్మాతకా=విరుగుడు, సర్పసుగంధా=సర్పగంధా వీటియొక్క, కల్కః=కల్కము, మధు యుక్తః=తేనె కలిపినది, ప్రదేహః= లేపము చేయ వలెను;ఛత్రప్రయుక్తే=గొడుగు విషసంబంధముకల్గియున్న యెడ,క్షిప్రపాకానాం =త్వరగా పక్వమగునట్టి,పక్వజాంబవ ప్రకాశనాం=పండిన నేరేడు పండుయొక్క సమానమైన రంగుగల, స్ఫోటానాం=మచ్చలయొక్క, ప్రాదుర్భావః=ప్రాదు ర్భావము, జాయతే=కల్గుచున్నది, తత్ర=ఆ యుపద్రవములో,మధుకా=మధు యష్ఠి, పాటలా=పాదిరి, కశేరుకా = భద్రముస్తలు, లోధ్ర = లొద్దుగ, అంజన=దారుహారిద్రా, కుష్ఠ=చెంగల్వకోష్ఠు, సర్పసుగంధా = సర్పగంధ, ఖదిర=చంద్ర, శిరీష=దిరిశెన వీటియొక్క, కల్కైః = కల్కములతో, సర్వ గాత్ర ప్రదేహః=సమస్త శరీరము నందు లేపము చేయవలెను, అనేన=ఇట్లు చెప్పుట చేత, చామర వ్యజనే=గొడుగు, విసనకర్ర ఈ రెండును,వ్యాఖ్యాతే= చెప్పబడినవి.

తాత్పర్యము : విశేషముగ విషముచేత తాపిన ఆభరణముల వలన సంభవించు ఉపద్రవమునందు పెన్నేరు గడ్డలు, ఉత్తరేణు, కొడిశెపాల, చంద్ర, దిరిశెనపు గింజలు, వీటిని సమభాగములుగ గ్రహించి, దంచి, చూర్ణించి, దానిలో గోరోచనము, నీళ్ళను కలిపి, లేపముగా తయారుచేసి, శరీరము నందు లేపము చేయవలెను.

కూర్చుండు ఆసనములందు విషము చేర్చిన యెడల విరిగి, సర్పగంధ వీటియొక్క పట్టను తీసికొని ఎండబెట్టి, చూర్ణించి, నీటితో నూరి, లేపము చేసి, ఆ లేపమునందు తేనె కలిపి పూయవలెను. గొడుగు విషలిప్తమైన యెడల పండిన నేరేడుపండువలె సమానమైన రంగుగల వెంటనే పాకమునకు వచ్చు మచ్చలు శరీరమునందు పుట్టును. ఆ మచ్చలు నశించిపోవుటకు మధుయష్ఠి, పాదిరి, భద్రముస్తలు, లొద్దుగ, దారుహారిద్రా, సర్పగంధా, చంద్ర, శిరీషము వీటిని సమానములుగా గ్రహించి చూర్ణించి, నీటిలో కల్కముచేసి, శరీరమందం

తటను లేపము చేయవలెను. గొడుగును గురించి చెప్పినందున విసనకర్రలను గురించి గూడా చెప్పినట్లైనది.

***కిలిలేఖ*** : ఆభరణములలో తాపిన విషము వలన సంభవించు యుపద్రవము నందు విశేషముగా గోరోచనము కలుపబడిన అశ్వగంధాది కల్కముతో లేపము చేయవలెను. కిణిహీ యనగా కోడిసెపాల అని అర్థము. విషలిప్తమైన పాద పీఠము వలన యేర్పడిన వికారమునందు త్వచె కలిపిన విరిగి చెట్టు యొక్క మొ॥ వాని కల్కముతో లేపము చేయవలెను. వ్యజనం అనగా విసనకర్ర యని అర్థము.

మూ॥ శిరోభ్యంగ ప్రయుక్తే శిరోవేదనా గ్రంథి జన్మకేశచ్యవనంచ॥ తత్రశ్యామాపాలిందీ తండులీయక చూర్ణఘృతర్ణ పిత్తైః సుభావితయా కృష్ణ మృదాప్రలేపః । గోమయ మాలతీ మూషిక కర్ణన్య తమ రసో వాగార ధూమోవా శ్లేష్మాతక త్వక్పాటలా శిరీష మధుక హరిద్రా ద్వయై రజాక్షీరా లోడితైః పరిషేకః । అనేన శిరఃస్నానోదక కంకతస్రగుష్ణీషా వ్యాఖ్యాతాః॥49।

***ప్రతిపదార్థము*** : శిరోభ్యంగ ప్రయుక్తే=అభ్యంగ కాలమందు తలకు పూసికొను తైలమునందు విషము కలిపిన యెడల, వేదనా=తలలో బాధ, గన్థిజన్మ=గ్రంథులు పుట్టుట, చ=మరియు, కేశచ్యవనం=వెంట్రుకలూడి పోవుట (జరుగును), తత్ర=పైనుదాహరించిన యుపద్రవమునందు, శ్యామా= తెగడ, పాలిన్దీ=తెల్ల తెగడ, తండులీయక=చిర్రివేళ్ళు, (వీటి చూర్ణమును) ఘృత=నేతితో, ఋక్షకపిత్తైః=ఎలుగుగొడ్డు పిత్తములతో, సుభావిత=పదు పర్యాయములు, భావన చేసి, ప్రలేపః=లేపము చేయవలెను, గోమయ= ఆవుపేడ, మాలతీ=మాలతీ (జాజి) పుష్పములు, మూషికర్ణీ=ఎలుకచెవి యాకు, వీటిలో, అన్యతమకల్కః=ఏదియో నొకదాని కల్కము, వా=లేక, రసః=స్వరసమో, వా=లేక, అగారధూమః=గృహధూమము (కరిధూపము తో, ప్రలేపః=లేపముచేయవలెను. అథవా=అట్లుకానియెడల, శ్లేష్మాతకత్వక్) =విరిగి చెట్టు పట్ట, పాటలా=కలిగొట్టు, శిరీష=దిరిశెన, మధుక=అతిమధు రము, హరిద్రా ద్వయైః=పసుపు, మ్రాని పసుపు వీటిచేత, అజాక్షీరాలో డితైః=మేక పాలచేత చిలుకబడి తయారు గావింపబడిన వాటిచేత, పరిషేకః =స్నానము, అనేన=ఈ ప్రకరణముచేత, శిరాస్నాన స్నపనోదక=శిరా స్నానము యొక్క జలము, కంకతక=దువ్వెన, స్రక=మాలలు, ఉష్ణీషా= తలపాగ (ఉత్తరీయము) కూడ, వ్యాఖ్యాతాః=వివరింపబడినవి.

***తాత్పర్యము*** : అభ్యంగకాలమునందు తలకు పూసికొను తైలములో విషము కలిసిన యెడల తలనొప్పి, తలలో గ్రన్థులు పుట్టుట, తలలోని వెంట్రుక- లూడిపోవుటయు సంభవించును. ఈ యుపద్రవములందు తెగడ, తెల్ల తెగడ, చిర్రివేళ్లు వీటిని చూర్ణించి, ఆ చూర్ణమును, నేతితో ఎలుగుగొడ్డు పిత్తముతో

ఏడు పర్యాయములు భావన చేసి, తలకు పట్టు వేయవలయును. లేనియెడల నల్లమట్టితో పట్టు వేయవలయును. ఆవుపేడ, జాతీ పత్రములు, ఎలుకచెవి ఆకు, వీటిలో ఏ ఒక దాని కల్కముతోగాని, స్వరసముతోగాని, కరిధూపముతో గాని లేపము చేయవలెను. అట్లు వీలుగాని పక్షమున విరిగి చెట్టుపట్ట, కలిగొట్టు, అతిమధురము, హరిద్రాద్వయము, దిరిశెన ఈ ద్రవ్యములను చూర్ణించి, మేక పాలలో వేసి చిలికి, వడియగట్టి, ఆ పాలతో స్నానము చేయించవలెను. ఈ శిరోభ్యంగ ప్రకరణముచేత, శిరస్నానమున కుపయోగించు జలము, దువ్వెన, మాలలు, ఉత్తరీయములు, తలపాగలు గూడ వివరింపబడినవి.

*శశిలేఖ* : శిరోభ్యంగములో నుపయోగించు తైలము నందు విషము కలిపినయెడల శిరస్సునందు వేదనాదులు పుట్టును. తచ్ఛాంతికై తెగడ మొ॥ వాటియొక్క చూర్ణము చేత నేయి, ఎలుగుబంటి పిత్తమును చేర్చి, ఏడు పర్యాయములు భావనచేసిన నల్లమట్టిని శిరస్సులో పూయవలెను, శ్యామా= ప్రియంగుః, పాలిన్దీ=త్రివృతా అని అర్థము, శిరోభ్యంగ విషముతో కలిపి శిరస్నానోదకము మొ॥ విషములుగూడ వివరింప బడినవి, కంకతం కాష్టాది మయం బహుదన్తం కేశకేశ సంయమనమ్=దువ్వెన అని అర్థము; ఉష్ణీషః= కేశబన్ధ పట్టకః=రుమాలు అని అర్థము.

సూ॥ కర్ణపూరణ ప్రయుక్తే శోఫశూల పాకాః శ్రోత్రవైగుణ్యంచ తత్ర బహుపత్రా స్వరసో ఘృత క్షౌద్ర సంయుక్తః ప్రతిపూరణం సోమ వల్కా రసోవా సుశీతః, ముఖాలేప ప్రయుక్తే ముఖశ్యావతా పద్మకంటకాభవన్త్య భ్యంగజాశ్చ వికారాః తత్ర మధుక పయస్యా బంధు జీవక భంజీ పునర్నవ చన్దనైః సఘృతైర్లేపో, మధు సర్పిషీ పానమ్, సవిష పుష్పాఘ్రాణాచ్ఛిరో వ్యథా సాశ్రునేత్రత్వం గన్ధాజ్ఞానంచ, తత్రానన్తరోక్తో విధిర్నా ష్పోదిత శ్చేతి॥ 54॥

*ప్రతిపదార్థము* : కర్ణపూరణ ప్రయుక్తే=చెవిలో వేయు నూనెలో విషము కలిపిన యెడల, శోఫశూల పాకాః=వాపు, శూల, కర్ణపాకములు, శ్రోత్రవైగుణ్యంచ=మరియు చెవులలో వినబడకపోవుటయుజరుగును, తత్ర= ఇందుకొఱకు, బహుపత్ర స్వరసః=బిల్వము, పెద్దములక, నేలములక,సుదర్శ నము వీటియొక్క స్వరసము, నెయ్యి, తేనె వీటితో కలిపి చెవులలో వేసి నింప వలెను, అథవా=అట్లు కాని పక్షమున, సోమవల్కరసః=గుమ్మడి టేకుయొక్క రసము, సుశీతః = మిక్కిలి చల్లనైనది, ప్రతి పూరణం = చెవిలో వేయ వలయును. ముఖా లేప ప్రయుక్తే = ముఖముపైన లేపములు చేయుట కుప యోగించు ద్రవ్యములలో విషము కలిపిన యెడల, ముఖశ్యావతా=ముఖము పైన నలుపురంగు వచ్చును. (ముఖము నల్లగ నగును). చ=మరియు, పద్మ కంటకాః=ముఖముపై కురుపులు పుట్టును, చ=మరియు, అభ్యంగజాః=

విషాభ్యంగము వలన సంభవించిన,వికారాః=వికారములుగూడ ఉత్పన్నమగును. తత్ర=దీనికొరకు, మధుక=యష్టి మధుకము, పయస్యా=నేలగుమ్మడు, బన్ధుజీవక=మంకెన, భంజీ=గంటుభారంగి, పునర్నవ=తెల్లగలిజేరు, చన్దనైః=చన్దనము మొ॥ వాటితో, సఘృతైః=నేతితో కలిపి, లేపః=లేపము చేయవలెను, చ=మరియు, మధు=తేనె, సర్పిషీపానమ్=నేతిని కలిపి త్రాగింపవలెను, సవిష పుష్పాఘ్రాణాత్=విషము చల్లిన పుష్పములను వాసనచూచుట వలన, శిరోవ్యధా=తలనొప్పి. సాశ్రునేత్రత్వం=నీటితో కూడిన కన్నులు (కండ్లలో నీళ్లు తిరుగుట),చ=మరియు, గన్ధాజ్ఞానం=వాసన తెలియకపోవుటయు జరుగును. తత్ర=దీనికొరకు, అనన్తరోక్తః=తరువాత చెప్పబడిన ముఖాలేప విష వికారము యొక్క, విధిః=క్రియాక్రమము, చ=మరియు, బాష్పోదితః=చెప్పబడిన విషాన్న బాష్ప చికిత్స, కుర్యాత్=చేయవలయును, ఇతి=అని.

**తాత్పర్యము :** చెవిలో వేయు నూనెలు ద్రవపదార్థములు మొ॥వాటిలో విషము కలిపిన యెడల చెవులలో వాపు, పోటు, పాకము యేర్పడును. చెవుడుగూడ వచ్చును. ఈ బాధలను నివారించుటకు బిల్వము, పెద్ద ములక, నేలములక, సుదర్శనము మొ॥ వాటిని, పచ్చిగా నున్నపుడు విధి ప్రకారము సంగ్రహించి వీటిలో ఏదేని ఒక ద్రవ్యముయొక్క స్వరసములో అసమాన భాగముగా తేనె నెయ్యి కలిపి కర్ణమును నింప వలయును. లేక చల్లగా నున్న గుమ్మడి ఆకుయొక్క స్వరసముతో కర్ణపూరణమును చేయవలయును.

ముఖముపైన వేసుకొను పౌడర్లు మలాములు మొ॥విషజుష్టములైనపుడు ముఖము నల్లబడును.ముఖముపై కురుపులువచ్చును.విషాభ్యంగనమునందు సంభవించు వికారములన్నియు ఏర్పడును. ఇవి శాంతించుటకు,యష్టిమధుకము నేలగుమ్మడు, మంకెన, గంట భారంగి, తెల్లగలిజేరు, చన్దనము, వీటిని చూర్ణించి, చక్కగా మర్దనముచేసి, నేయిని కలిపి లేపము చేయవలయును. తేనె, నెయ్యి, అసమభాగములుగ నుండు రెండును కలిపి త్రాగించవలయును. విషము చల్లిన పుష్పములను వాసన చూచిన యెడల, తలనొప్పి, కన్నులలో నీరు తిరుగుట, ముక్కులకు వాసనను గ్రహించు శక్తి లేకపోవుట సంభవించును. ఇవిశాంతింప చేయుటకు చెప్పబడిన ముఖాలేప విష వికారములలో చెప్పిన విధిని, విషాన్న బాష్ప చికిత్సలను చేయవలయును.

**శశిలేఖ :** కర్ణ పూరణ ద్రవ్యములలో విషము కలిసిన యెడల, శోఫాదులు సంభవించును. చెవులు వినపడక పోవుటయు జరుగును. అట్టి స్థితిలో పెద్ద ములక స్వరసము ఘృత మాక్షికములతో కలిపి కర్ణ పూరణము చేయవలెను. బహుపత్రా=బృహతీ యని అర్థము, మిక్కిలి చల్లనైన సోమవల్క స్వరసముతో కర్ణపూరణము చేయవలయును. దీనినే ఏకమూలికా ప్రయోగ మందురు, సోమవల్కః=కట్ఫలః, ముఖాలేపములలో విషము కలిపిన యెడల

ముఖము నల్లబడును. పద్మ కంటకములను గురించి క్షుద్రరోగముల యందు చెప్పబడును. అభ్యంగ ప్రయుక్త విష వికారములు త్వగ్దాహ స్వేదాదులు అక్కడ మధుకాదులతో కలిపిన నేతితో లేపము చేయవలయును. బన్ధు జీవః= పుత్రతమః అని అర్థము, ఫంజీ=గంటుభారంగి, అల్లే నెయ్యి తేనెకలిపి పానము చేయుటకు ప్రయోగింప వలయును, విష పుష్పాఘ్రాణము వలన శిరోవ్యాధాదు లేర్పడును. అక్కడ అనన్తరోక్త ముఖాలేప విష వికారములో చెప్పిన విధిని విషాన్న బాష్పచికిత్సలను చేయవలెను.

మూ॥ భవంతి చాత్ర ।

ఫలమూలచ్ఛదాదీనాం దద్యా త్ప్రక్షాళనోదకమ్।
భాజన వ్యజనానాంచ తథాకుర్యా దతంద్రితః॥
ఘ్రేయాణి ఘ్రాప యిత్వాతు స్పృశాన్ సంస్పృశ్యతానపి।
ప్రతీవాపం తతోదత్వా ప్రతీక్ష్యైవైక నాడికామ్।
తతో విజ్ఞాయ శుద్ధించ భాజనస్యోదకస్యోచ।
ఆహార ముపభుంజీత యథావద్వసుధాధిపః।
మన్దం తీక్ష్ణ విషాభ్యాసాత్విషముత్క్షీయతే భృశమ్।
తస్మా తీక్ష్ణ విషం హన్తే బధ్నీయా త్కుశలో భిషక్।
విష సంధారణం ధన్యం రక్షోఘ్నం ప్రీతి వర్ధనమ్। 68.
అపిచ॥

ప్రతిపదార్థము : ఫలమూలచ్ఛదాదీనాం=పండ్లు, వేళ్ళు, ఆకులు వీటిని, చ=మరియు, భాజన వ్యజనానాం = పాత్రలను, విసనకర్రలను, ప్రక్షాలనోదకం=నీళ్ళతో కడుగ వలెను, తథా = అల్లే, అతంద్రతః = జాగరూకుడై, కుర్యాత్=చేయవలయును, ఘ్రేయాణి=వాసన చూడదగిన వాటిని, ఘ్రాపయిత్వాతు=వాసనచూపించి, స్పృశన్=తాకుటకు యోగ్యమైన, తానపి=ఆవస్తువులనుగూడ, సంస్పృశ్యా=తాకి, తతః=అటు తరువాత, ప్రతీవాపం=ప్రతివాపమును, దత్వా=ఇచ్చి, ఏకనాడికాం=ఒక గంటవరకు, ప్రతీక్ష్య=చూచి, తతః=తరువాత, చ=మరియు, శుద్ధిం=శుద్ధి చేయనిదియని, విజ్ఞాయా=తెలుసుకొని, యథావత్=విధిపూర్వకముగ, వసుధాధిపః=రాజు, ఆహారం=ఆహారమును, ఉపభుంజీత=భుజింప వలెను.

తాత్పర్యము : నిదానముగా బజారు నుండి తెచ్చు పండ్లను, వేళ్ళను, ఆకులను, పాత్రలను, విసనకర్రలను, మొదట పరిశుభ్రముగ నీళ్ళతో కడుగ వలెను. వీటినిగూడ చక్కగా నీళ్ళతో ప్రతివాసము చేసి ఒకగంట వరకు నిరీక్షించి, ఈ పాత్రలకు, ఈ నీళ్ళకు పరిశుభ్ర తయేర్పడినదని నిశ్చయించుకొనిన తరువాత, రాజు, శాస్త్రము నందు చెప్పబడిన నియమములను పాటించుచు ఆహారమును భుజింపవలెను,

ప్రతీవాపము, ఆవాపము, ప్రక్షేపము ఇవి ఒకే అర్థమునందు చెప్పబడు పర్యాయ పదములు. ప్రతీవాప మనగా తైలము అగ్నిపైన సిద్ధమైన తరువాత, దానియందు విశేషగుణము లేర్పడుటకు ఏ వస్తువులు కలుపబడుచున్నవో, అది ఆకర్మగా పేర్కొనబడినది. లేక ఇట్లు కానియెడల, ఆ వస్తువులను నీళ్ళలో కడిగినను, ప్రతీవాపమని చెప్పుచున్నారు.

ప్రతిపదార్థము : తీక్ష్ణవిషాభ్యాసాత్ = తీక్ష్ణమైన విషముయొక్క నిత్యాభ్యాసమువలన, మన్దంవిషం=మందవిషము, భృశం=మిక్కిలి,ఉత్క్షియతే=నష్టమగుచున్నది. తస్మాత్=ఆకారణము వలన, కుశలః=సమర్థుడైన, భిషక్=వైద్యుడు, హస్తే=చేతిలో, తీక్ష్ణవిషం = తీక్ష్ణవిషమును, బధ్నీయాత్ = బంధింపవలెను, అనగా, విషసంధారణం=విషమును ధరించుట, ధన్యం= ధన్యమైనది, రక్షోఘ్నం = రాక్షసులను నశింపచేయును, ప్రీతి వర్ధనం=ప్రీతి వర్ధకమైనది, అపిచ =మరియును.

తాత్పర్యము : తీక్ష్ణవిషమును నిరంతరము, అభ్యసించుట వలన, మంద విషములు ఎక్కువగా నశించి పోవును. అందుకొఱకు సమర్థుడైన వైద్యుడు తీక్ష్ణ విషమును మణికట్టుపై రక్షాబంధనమువలె కట్టవలెను. ఈ విధముగ విషము శరీరముపై ధరించుటవలన ధన్యముగను, రాక్షస నాశముగను, ప్రీతి వర్ధనముగను యుండును.

శశిలేఖ : భవంతి చాత్ర. ఇది సుబోధము· అపిచ అని చెప్పుట చేత విషముతో గూడిన ఉపకరణ ద్రవ్యములయొక్క, లక్షణములను, చికిత్సనుచెప్పి వాటికి ఉపయోగించు ఔషధ సంభార లక్షణముల కొరకు వివరించుచున్నాడు

శ్లో॥ సపిధాన ఘటీమూషా ఫలక స్థాపితౌషధమ్।
ప్రాగుదీచ్యో ర్దిశోర్గుప్తం భైషజ్యాగార మిష్యతే।
ఉచ్చైః ప్రశస్త దిగ్దేశం బహు వాతాయనం మహత్।
మహానసం సుశంమృష్టం విశ్వాస్య జన సేవితమ్।
సద్వాస్థాధిష్ఠిత ద్వారం కక్ష్యావత్సవితానకం।
సుధౌత దృఢ కుంభాది పరిశుద్ధ జలేంధనం॥
స్వకర్మ కుశలా దక్షాః సూదా స్నాతా ప్రమాదినః।
కృత్త కేశనఖాః పిత్ర్యారాజ్ఞః కృతైర్య రసం గతాః।
తేషా మధిపతిర్విప్రః కులజః సుపరీక్షితః।
సంవిభక్తశ్చ భక్తశ్చ శుచిర్వైద్య వశానుగః।
సర్వేఽపి భూభృ దాసన్నాః స్నాతాఃసదత మీదృశాః॥
మిథో విగ్రహ సంఘాత రహితా భూభృతేహితాః॥
తాన్ వైద్యో గుణవానేకో మనసా ప్రతి జాగృయాత్॥
భూభృత్ దేహోపకరణ సంరక్షణ సముద్యతః॥

ప్రతిపదార్థము : సపిధాన ఘటీ మూషాఫలక స్థాపితౌషధమ్-సపిధాన=మూతతోగూడిన, ఘటీ=కుండలు, మూషా=మూసలు, ఫలక=కర్రచే చేసిన సందూకలు, వీటియందు, స్థాపిత=యుంచబడిన, ఔషధం=ఔషధమును, స్థాపయేత్=యుంచవలెను, ప్రాగుదీచ్యాః = తూర్పుయొక్క, ఉత్తరముయొక్క, దిశోః=దిక్కులయందు, గుప్తం = సురక్షితమైన, భైషజ్యాగారం = భేషజగృహము, ఇష్యతే = కోరబడుచున్నది. ఉచ్చైః=ఉన్నత స్థానము నందలి, ప్రశస్త దిగ్దేశం=అనుకూలమైన తూర్పు లేక ఉత్తరదిక్కుల యందలి ప్రదేశమును, మహత్=గొప్పదైన, బహువాతాయనం = ఎక్కువ కిటికీలను, సుసంమృష్టం=మిక్కిలి స్వచ్ఛమైన, విశ్వాసజన సేవితం=నమ్మకమైన పరిజనముతో గూడిన, మహానసం=వంట ఇంటిని, సద్వాస్థాధిష్ఠితద్వారం = ద్వారమువద్ద యుక్తముడైన ద్వారపాలుని తెరలచేత అరలుగా విభజింప బడినది, సుధౌత దృఢ కుంభాది పరిశుద్ధ జలేంధనం—సుధౌత = బాగుగా శుభ్రపరచిన, దృఢ = దృఢమైన, కుంభాది = కుండలు మొ॥ పరిశుద్ధజలా = పరిశుద్ధ జలములు, ఇంధనం = కట్టెలు గలదిగా నుండ వలెను, తత్ర = ఆ మహానసమందు, స్వకర్మకుశలాః=తాము చేయు పని యందు సమర్థులైనట్టి, దక్షాః = చతురులైనట్టి, అప్రమాదినః = ప్రమాద రహితులైనట్టి, కృత్తకేశనఖాః=కత్తిరింపబడినవెంట్రుకలు, గోళ్ళు కలిగినట్టియు, రాజ్ఞః=రాజుయొక్క, పిత్ర్యా=తండ్రితో, కృచ్ఛైః=క్రోధ లోభ మద మాత్సర్యములతో గూడిన కృత్యములచేత, అసంగతాః = కలువనివారై, సుదాహ = వంటవారు, స్యు =యుండవలయును, తేషాం = ఆ వంటవారికి, అధిపతిః = అధ్యక్షుడుగా. విప్రః=బ్రాహ్మణుడు, కులజః = కులీనుడైన, సుపరీక్షితః=బాగుగా పరీక్షింప శక్తిగలవాడైన, సంవిభక్తః = భుజించు వస్తువులను చక్కగా విభాగము చేయువాడైన, భక్తః=ఒక తినుబండారము నుండి, పలువిధములైన భక్ష్యములను తయారుచేయగల సామర్థ్యము గలవాడైన, శుచిః = పవిత్రమైన, వైద్యవశానుగః = వైద్యునియొక్క ఆజ్ఞకు అధీనుడుగా, స్యాత్=యుండవలెను, భూభృత్ = రాజుయొక్క, ఆసన్నాః = సమీపవర్తులైన, సర్వేఽపి=అందరుగూడ, మిథః = పరస్పరము, విగ్రహసంఘాతరహితః = కొట్లాటలు లేనివారు, భూభృతే=రాజు విషయమై, హితాః=హితము కోరువారు, స్యస్తాః=తగియున్నారు, గుణవాన్=అనేక సద్గుణములుగల,వైద్యః=వైద్యుడు, ఏకః=ఒక్కడే, మనసా=మనస్సుతో, తాన్=ఆ పరిచారకులను, ప్రతిజాగృయాత్=మెలకువగా నుండవలెను, భూభృత్ దేహోపకరణ సంరక్షణ సముద్యతః=రాజుయొక్క శరీరమును, ఉపకరణములు, వీటిని రక్షించుటలో ఎల్లప్పుడు మెలకువగలిగి యుండవలెను.

తాత్పర్యము : మూతలు గల కుండలయందు, మూసలయందు, కర్రలతో చేసిన సందూకములయందు ఔషధములను భద్రపరచవలెను. పట్టణము

నకు తూర్పుదిశయందుగాని, ఉత్తర దిక్కుయందుగాని, సురక్షితమైన భేషజ గృహమును కట్టవలెను. ఎత్తైన ప్రదేశమునందు తూర్పు లేక ఉత్తర దిక్కునందు హెచ్చుతగ్గులులేని పరిశుభ్రమైన ప్రదేశమునందు, పెద్దపెద్ద కిటికీలుగల్గి, చాలినంత పెద్దదిగానున్న పరిశుభ్రముగానున్న, నమ్మదగిన జనులతో కూడి యున్నదిగా, వంటయిల్లు యుండవలెను. వంటయింటి ముఖద్వారము వద్ద, సురక్షితుడైన ద్వారపాలకుడు యుండవలెను. ఆ వంట ఇంటిలో దేనికి తగిన విభాగము దానికి విభజింపబడి యుండవలెను. ప్రతియొక్క భాగమునకు తెరలు కట్టబడి యుండవలెను. ఆ వంటఇంటిలో నుపయోగించు నీరునింపు పాత్రలు; వాటియందు గల నీరు వాటిని పానముచేయు పాత్రలు,వంటచెరుకు ఇవన్నియు, ఆ వంటఇంటిలో తయారుగా నుంచవలెను. వీటన్నింటిని వేర్వేరుగా నుంచుటకు ప్రత్యేకమైన గదులనుగూడా నిర్మించవలెను.

తాము చేయు పనిలో పాండిత్యము కలిగి, అనుభవపూర్వకమైన, చతురత గలిగిన, ప్రమాదరహితులైన పాచకులు ఆ వంటఇంటిలో నుండవలెను. ఈ పాచకులు వెండ్రుకలను, గోళ్ళను కత్తిరించుకొని యుండవలెను. రాజుయొక్క తండ్రితో క్రమముగా వచ్చు వాద వివాదములందు సంబంధము లేని వారుగా యుండవలెను. ఈ వంటవారికి అధ్యక్షుడుగా బ్రాహ్మణుడు యుండవలెను. ఈ బ్రాహ్మణుడును, సత్కుల సంజాతుడుగా, చక్కగా అన్నిటిని పరీక్షించువాడుగా, తినుబండారములను మంచి పద్ధతితో విభజించుటకు శక్తిగల్గియున్నవాడును, ఒక తిను వస్తువువలన, అనేకవిధములైన, వేర్వేరైన తినుబండారములను తయారుచేయుటయందు సమర్థత కల్గియున్నవాడును, మనోవాక్కాయములచేత పవిత్రుడును, మరియు వైద్యునియొక్క ఆజ్ఞకు అధీనుడునునై యుండవలెను.

రాజు సమీపమున నున్న సమస్త పరివారము, ఒకరితోనొకరు కలహించగూడదు. మరియు ఎల్లవేళల రాజునకు హితమునే కాంక్షింపవలెను. ఇట్టి పరిచారకులు రాజువద్ద నుండవలయును.

వీటిలో గుణవంతుడైన ఒకే వైద్యుడు మనస్సులోగూడ సులకువతో నుండవలెను. ఎల్లవేళల ఏమరుపాటులేక, మెలకువగానున్న వైద్యుడు రాజుయొక్క శరీరమును, ఉపకరణములను రక్షించుటలో నుద్యుక్తుడుగ నుండవలెను.

*శశిలేఖ :* ఇట్టి ఔషధ గృహమును నిర్మింపవలెను. ఆ భేషజాగారమునందలి కుండలు, మూసలు. మూతకల్గి వాటియందు ఔషధములు సురక్షములై యుండవలెను. కర్రతో తయారుచేసిన సందూకలు అందులో యుండవలయును. రాజధానీ నగరముయొక్క తూర్పుదిక్కుయందుగాని, ఉత్తరదిక్కుయందుగాని సురక్షితమైన భేషజ గృహమును నిర్మింపవలెను. సూదాహాయనగా

అన్నమును సంస్కరించువారు యని అర్థము. ఈ రాజసేవలకులనుద్దేశించి కౌటిల్యుడు తన అర్థశాస్త్రములో ఎక్కువగా విపులీకరించెను. అందువలన ఈ పరిచారకాదులపైన, అనగా పాచకులపైన బ్రాహ్మణుడు అనగా, బ్రాహ్మణత్వ రూపమైన జాతికి సంబంధించిన అనేక సద్గుణములతో గూడియున్నవాడు అధ్యక్షుడుగా యుండవలెను. మరియు పాచకులుగాని, రాజసేవకులుగాని, పరస్పరము కలహించు కొనరాదు. వారందరూ రాజునకు హితులుగా నుండవలెను. ఎల్లప్పుడు తమలో తాము కలహించుటచేత రాజు యందలి హితము సన్నగిల్లును. ఈ పరిచారకు లందరినీ, ఒకే గుణముతో కూడిన వైద్యగుణములుగల వైద్యుడు, జాగరూకుడై వీటన్నింటిని మెలకువతో కనిపెట్టుకొని యుండ వలయును. రాజుయొక్క శరీరము, ఉపకరణములు వీటి యందలి దోషములనుండి రక్షించుట యందు సర్వదా సంసిద్ధుడై అతిమెలకువతో నుండవలెను.

మూ॥ అథాభ్య మిత్రం వ్రజతో జిగీషో।
వైద్యః సుసజ్జౌషధ శస్త్ర యన్త్రః॥
తుంగ ధ్వజా ఖ్యాత నివాస భూమి।
ర్యుద్ధాగతం యోధజనం చికిత్సేత్॥ 66॥

**ప్రతిపదార్థము:** అథ = తరువాత, అభ్యమిత్రం = శత్రువుమీదికి, వ్రజతః = దాడివెడలుచున్న, జిగీషోః = జయేచ్ఛగల్గినరాజుయొక్క, వైద్యః = వైద్యుడు, యుద్ధాగతమ్ = యుద్ధము కొఱకు వచ్చిన, యోధజనం = సైనిక జనమును, కిచిత్సేత్ = చికిత్స చేయవలయును, కింభూతః వైద్యః = వైద్యుడెట్టి వాడనగా, సుసజ్జౌషధ శస్త్రయన్త్రః = చక్కగా తయారు చేయబడిన, ఔషధములు, యన్త్రములు గల్గినవాడుగా నుండవలయును. తుంగ ధ్వజాఖ్యాత నివాస భూమిః = ఎత్తైన ధ్వజముచేత (పతాకము) గుర్తింపబడు వాస స్థానము గలవాడుగా నుండ వలయును.

**తాత్పర్యము :** శత్రువులను నిర్జించుటకు బయలు దేరిన రాజు సన్నిధిలోనున్న వైద్యుడు యుద్ధము చేయుటకు వచ్చిన సైన్యమునకు చికిత్సచేయవలయును. ఆ వైద్యుడు చక్కగా తయారు కావింపబడిన ఔషధములను, శస్త్రములను, యన్త్రములను గలిగి యుండవలెను. మరియు వైద్యుడు నివసించు సౌధము పైన చాలా ఎత్తుగా పతాకమును ఎగుర వేయవలెను. దీనిని వైద్య భవనముగా గుర్తించుట కట్లు చేయబడినది.

**శశిలేఖ :** యుద్ధమునకు శత్రువులను నిర్జించుటకు బయలు దేరు రాజుయొక్క వైద్యుడు సమస్తోపకరణములతో కూడిన వాడై ఉన్నత ప్రదేశమున నెత్తబడిన, పతాకముతో గూడిన, సౌధము గలవాడై, యుద్ధము చేయుటకు వచ్చిన సైనిక జనమును చికిత్స చేయవలెను. తుంగేన = ఉన్నతేన, ధ్వజేనా

ఖ్యాతాః, నివాస భూమిః=నివాస భవనమని అర్థము.

మూ॥ పస్థాన ముదకం ఛాయాం భక్తం యవస మిన్ధనమ్।
దూష యన్త్యరయో యస్మాత్తాన్ విద్యాచ్ఛోధయేతచ॥
ప్రస్థాంవా నివేశంవా నావిజ్ఞాయ ప్రయోజయేత్।
భూ వారి తృణ కాష్ఠాశ్మ మార్గోన్మార్గ వనస్పతీన్॥
విషేణోపహతా భూమిః క్వచిద్దగ్ధేవ లక్ష్యతే।
ప్రమ్లాన తృణ గుల్మాది మృతకీట సరీసృపాః॥
విశీర్యన్తే ఖుర నఖా దాహ కండూరు జాన్వితాః
ఛర్ద్యూర్మార్చా జ్వరో మోహః శిరోదుఃఖంచ జాయతే॥
తత్ర సౌభాంజనాన్మూలం సోమవల్లీ ముశీరకమ్।
మాతులుంగ రసం హి గు పాయయేద్దధి మాత్రయా॥
మూత్రాణ్యజావి హస్తిభ్యో మాంసాని రుధిరాణి చ।
సర్వగన్ధైః సమం యోజ్య పచేత్పక్వేచ నిక్షిపేత్॥
సోమరాజీం సునన్దాఖ్యాం సరళం గన్ధనాకులీమ్॥
చారటీం త్రాయ మాణాంచ ప్రోక్షయేత్తేన తాం భువమ్।

ప్రతిపదార్థము : యస్మాత్=ఎందువలన ననగా, పస్థానం=రాజు పయనించు త్రోవను, ఉదకం=త్రాగుట కుపయోగించు, నీరుగల జలాశయమును, ఛాయాం=సేద దీర్చుకొను చెట్లు మొ॥ వీటి నీడగల ప్రదేశమును, భక్తం= రాజులు, సేవకులు మొ॥ వారు భుజించు భోజన పదార్థములు, యవసం= గుర్రములు మొ॥ వాహనోపయోగములైన జంతువులు తిను గడ్డి, మొ॥ వాటిని, ఇన్ధనం=వంట చెరకును, అరయః=శత్రువులు, దూషయన్తి=విషాదులతో దూషింప చేయుదురో, తస్మాత్ = అందువలన, తాన్ = వాటిని, విద్యాత్=తెలుసుకొనవలయును, చ = మరియు, శోధయేత్=శుద్ధి పరచ వలయును, ప్రస్థానమ్ = గెలువ నిచ్ఛయించిన రాజు పయనించుటను (కదలిపోవుట), నివేశం=నివేశ ప్రదేశమును, భూ=భూమి, వారి=జలము, తృణ= గడ్డి, కాష్ఠ=కర్ర, అశ్మ=రాయి;, మార్గ=మార్గము, ఉన్మార్గ=డొంక దారులు, వనస్పతీన్ = వనస్పతులను, అవిజ్ఞాయ = తెలియక, న ప్రయోజయేత్=ప్రయోగించకూడదు (ఉపయోగింపకూడదు),

విషేణ=విషముతో, ఉపహతా=ఆక్రమింపబడిన, భూమిః=ప్రదేశము, క్వచిత్=కొంత, దగ్ధేవ=కాలినదివలె, లక్ష్యతే=చూడబడుచున్నది, ప్రమ్లాన తృణగుల్మాది=వాడిన గడ్డి, వృక్ష, గుల్మములు మొ॥,మృతకీట సరీసృపాః=కీటకములు, సర్పములు మొ॥ చచ్చును.

ఖురనఖాః=గుర్రములయొక్క గిట్ట, గోళ్లు, విశీర్యన్తే=రాల్పబడును, దాహకండూర జాన్వితాః = తాపము, దురద, నొప్పి వీటితోకూడుకొని

యుండును, ఛర్ది = వాంతి, మూర్ఛా = మూర్ఛ, జ్వరః = జ్వరము, మోహః = మోహము, చ = మరియు, శిరోదుఃఖః = శిరస్సులో బాధ, జాయతే = కల్గును.

తత్ర = అక్కడ (వీటిని శాంతింప జేయుటకు), శోభాంజనామ్నాలం = మునగచెట్టుయొక్క మొదలు, సోమవల్లీం = సోమలతను, ఉశీరకమ్ = వట్టివేళ్ళను, **మాతులుంగ** రసం = మాదీఫలరసమును, హింగు = ఇంగువను, మాత్రయా = పరి**మాణముతో** దధి = పెరుగును, పాయయేత్ = త్రాగింపవలెను, **అజావిహస్తే** భ్యోః = మేక, గొఱ్ఱె, హస్తిభ్యః = ఏనుగు యొక్క, **మూత్రాణి** = మూత్రములు, మాంసాని = మాంసములు, చ = మరియు, రుధి**రాణి** = రక్తములు, సర్వగన్ధైః = ఏలాది గణములో చెప్పబడిన గన్ధ ద్రవ్యములను, సమయోజ్య = సమముగ కలిపి, పచేత్ = వండవలయును, చ = **మరియు**, పక్వే = పాకమయిన తరువాత, సోమరాజీం = సోమరాజిని (కారుగచ్చ), సునన్దాఖ్యాం = సన్నరాస్నము, సరలాం = తెల్ల తెగడను, గన్ధనాకులీం = సర్పాక్షిని, చారటీం = మెట్టతామరను, త్రాయమాణాం = కలుగానుగును, (వీటిచూర్ణమును), తేన = ఆ చూర్ణము చేత, తాంభువం = ఆ ప్రదేశమును, ప్రోక్షయేత్ = చల్ల వలయును.

**తాత్పర్యము** : శత్రువులు సంచార యోగ్యములైన మార్గములు, త్రాగుజలములు, చెట్లు మొ॥ ఛాయలు (నీడలు), భోజన పదార్థములు, జంతువులు తినుగడ్డి మొ॥ వాటిని, వంట చెఱుకులు వీటిని విషలిప్తములుగ చేయుదురు. రాజు యుద్ధమునకు పయనించు భూములు, గడ్డి మొ॥ జంతువులు తిను గ్రాసములు, వంటచెరుకులు, రాళ్ళు, మార్గములు, డొంకలు, వనస్పతులు మొ॥ వాటిని విషముతో దూషింప చేయుదురు. వైద్యుడు పైనుదాహరించిన వస్తుజాలమంతటిని బాగుగ తెలిసికొని శుద్ధి చేయవలయును. రాజు వైద్యుని యొక్క సలహాను బట్టియే, యుద్ధమునకు సేనలను నడిపింప వలయును. వైద్యునియొక్క సలహా మేరకే సేనలను నడిపించుటయు, వారికి విడుదుల యేర్పాటు చేయుటయు చేయవలెను. విషముచేత దూషింప బడిన మార్గము నందు గుఱ్ఱములు నడుచుట వలన వాటియొక్క గిట్టలు, ఎద్దులయొక్క కాళ్ళతో ఎగురుచున్న ధూళి ముక్కులలోనికి వెళ్ళి వాటియొక్క గిట్టలను రాల్చును. మరియు పై నుదాహరించినవారి శరీరమును కూడ విష దూషితముగా చేయును. విషముచేత దూషితమైన నీడకూడా విషమును పుట్టించును. ఈ నీడను నివసించిన ప్రాణులకు శరీరమంతయూ వాచును. కౌటిల్యుని యొక్క, అర్థశాస్త్రములో 14 వ అధికరణములో 46వ అధ్యాయములో ఈ విషయము విపులీకరింప బడినది. విషము చేత ఆక్రమింప బడిన భూమి నీటి సంబంధముగల భూమివలె తోచును. గడ్డి, పొదలు మొ॥ వాడి పోవును. కీటకములు, సర్పములు మొ॥ చచ్చిపోవును. దూషింప బడిన భూమిపై నడు

చుట వలన గుఱ్ఱము మొ॥ జంతువులయొక్క గిట్టలు, గోళ్ళు రాలి పోవును. మరియు ఆ ప్రదేశములందు మంట, దురద, నొప్పి ఏర్పడును. మరియు ఆ భూమిపై సన్న విషము జంతువులకుగాని, మనుష్యులకు గాని సోకిన యెడల వాంతులు, మూర్ఛపోవుట, జ్వరము మోహము, శిరస్సునందు బాధ గల్గును. వమనము, మూర్ఛ మొ॥ లక్షణములు మనుష్యుల యందును, మంట, దురద మొ॥ లక్షణములు గుఱ్ఱముల యందును సంభవించును. లేక రెంటి యందునూ సంభవింప వచ్చును. ఇట్లు సంభవించిన ఉపద్రవములను శాంతింప జేయుటకు మునగ చెట్టుయొక్క మూలము, సోమలత, వట్టివేళ్ళు, మాదీఫలరసము, ఇంగువ వీటిని సమభాగములుగా గ్రహించి, కొద్ది పెరుగులో కలిపి త్రాగుట కివ్వవలెను. మేక, గొఱ్ఱె, పసుగు ఈ జంతువులయొక్క మూత్రములు, మాంసము, రక్తము, ఏలాది గణమునందు చెప్పిన అన్నిగంధ ద్రవ్యములను సమాన భాగములుగా గ్రహించి పాకము చేయవలయును. ఇదంతయు విధి ప్రకారము పాకమైన తరువాత దీనిలో బావంచాలు, సన్న దుంప రాస్నము, తెల్లతెగడ, సర్పాక్షి, మెట్టతామర, కలుగానుగ, వీటిని చూర్ణించి కలుప వలయును. (దీనితో ఈ చూర్ణముతో భూమిమీద చల్లవలయును).

*శశిలేఖ* : రాజు యుద్ధము చేయుటకు సైన్యముతో కలిసి పయనించు మార్గాదులను, శత్రువులు విషముతో దూషింప చేయుదురు. ఇందువలన వాట న్నింటిని వైద్యుడైన వాడు, గ్రహించి ప్రయత్నమువలన వీటిని శుద్ధి చేయ వలెను. దేవతా వృక్షములకు విషము తాపిన యెడల వాటినీడ దూషిత మగును. యవసహా యనగా గుఱ్ఱము మొ॥ జంతువుల భోజనమైన దూర్వాదులని యర్థము. రాజు తాను పయనించు మార్గములను కంటకరహితముగాచేసి పయ నించవలయును. విషముచేత పూయబడిన ప్రదేశము కాల్చబడినదివలె నుండును. ఆ ప్రదేశము నందు నడుచుట వలన పాదముల యందలి గోళ్ళు రాలిపోవును. మరియు దాహాదులు కూడ సంభవించును. సునంద యనగ రాస్నా యని అర్థము. సరళ యనగా త్రివృత్ యని అర్థము. గంధనాకులీ యనగా సర్పాక్షి యని అర్థము. చారటీయనగా పద్మచారిణి యని అర్థము.

మూ॥ సవిషం విరసం తోయం కవోష్ణం రాజిభిశ్చితం
ఫేనిలం గురు విచ్ఛిన్నం ఖగై రనభి నందితం॥
మృతాకులిత మత్స్యం చ స్పర్శాద్రుక్శోప కండుకృత్ ।
ఓదనః సాధిత స్తేన ధుక్తమాత్రోఽపి దహ్యతే॥
విదగ్ధః పచ్యతే కృచ్ఛ్రాత్ పక్వ మూర్ఛా జ్వరప్రదః।
దర్శయే త్సర్వతో నీల పీత కర్బురలోహితం॥
తత్ర శిగ్రవాది మగదం భూమి ఉషోదితం పిబేత్।
అజశృంగీమ్ విశాలాఖ్యాం విషఘ్ని ముత్తమారణీమ్॥
ఫణిజ్ఞకం ప్రతివిషాం దగ్ధ్వా తద్భస్మ గాలయేత్।

బహుశో గాలితం తచ్చ పాచయే త్తత్ర చ క్షిపేత్॥
కల్కయిత్వా ప్రతీవాపం సరళం రజనీ ద్వయమ్।
ఏలా ముదీచ్యం మంజిష్ఠాం సునందాం వాకుచీమపి॥
పాత్యంతే బిందవ స్తస్మాద్యత్ర తన్నిర్విషీ భవేత్।
పాటలా పారిభద్రాశ్వ కర్ణ శమ్యాక సిగ్రుకాన్॥
క్షులంతర్గతాన్ శాంగ్వా ప్రక్షిపేత్ సివిషేఒమ్భసి।

**ప్రతిపదార్థము** : సవిషం=విషముతో కూడిన, తోయం = జలము, విరసం=రసహీనమగును. కవోష్ణం=గోరువెచ్చగను, రాజిభిశ్చితం=పలు విధములైన రేఖలతో కూడుకొన్నదిగాను, గురు=గౌరవము కలదిగను, విచ్ఛిన్నం= ఒక దానితో నొకటి సమానముగా లేనిదియు, ఖగైః=పక్షులతో, అనభినందితం=ఇష్టపడనట్టిదియు, చ=మరియు, మృయకులత మత్స్యాం=చేపలు మొ॥ చచ్చినట్టు పడి యుండుటను ఏర్పడును, స్పర్శాత్=ఈ నీటిని తాకుట వలన, బుకోఫ్మఫకండుకృత్=నొప్పి, వాపు, దురద వీటిని చేయును, తేన=విషముచేత దూషితమైన ఆనీటితో,సాధితః=వండబడిన,ఓదనః=అన్నము,భుక్తమాత్రః= భుజించు చుండగనే, విదహ్యతే = విదాహమును కల్గించుచున్నది, విదగ్ధః= విదగ్ధా వస్థను చెందినదై (పచ్యమానావస్థ యందు) కృచ్ఛ్రాత్=కష్టముగా (కొంచెము సేపటికి), పచ్యతే=పచింపజేయ బడుచున్నది (జీర్ణింప జేయ బడుచున్నది), పక్వః=జీర్ణమై, మూర్ఛాజ్వరప్రదః=మూర్ఛను, జ్వరమును కల్గించుచున్నది, సర్వతః=శరీరమంతటా, నీల=నలుపు, పీత=పచ్చ, లోహిత= ఎరుపు, కర్బుర=నానావర్ణములు కలిసిన వర్ణమును, దర్శయేత్ = చూపించును, తత్ర=ఈ ఉపద్రవములు శాంతించుటకు, భూమిదోషోదితం=భూమిదోషము వలన ఏర్పడిన ఉపద్రవమును శాంతింప చేయుటకు చెప్పబడిన, శిగ్ర్వాదిమ గదం=మునగ చెట్టుయొక్క మూలము మొ॥ వానిచే తయారు చేయబడిన అగదమును, పిబేత్=త్రాగవలయును, అజశృంగీం=మేషశృంగిని, విశాలాఖ్యాం= వెఱ్ఱిపుచ్చను, విషఘ్నీం = పొత్తిదుంప, ఉత్తమారణీం = మరువము, ప్రతివిషాం=అతి విషమును, వీటన్నింటిని, దగ్ధ్వా=కాల్చి, తద్భస్మ=ఆ భస్మమును, గాలయేత్=నీళ్ళలో చిలక వలయును, తత్=దానిని, ఇత్థం=ఇట్లు, బహుశః=పలుమార్లు, గాలితం = కడిగి, పాచయేత్ = వండవలయును, తత్రచ=వండు సమయమునందు, కల్కయిత్వా = కల్కముచేసి, సరలాం= తెల్లతెగడను, రజనీద్వయం=పసుపు, మాని పసుపును, ఏలాం=ఏలక్కాయను, ఉదీచ్యం=కురు వేరును, మంజిష్ఠాం=మంజిష్ఠను, సునందాం=సన్నదుంపరాస్నను, వాకుచీమపి=బావంచాలను కూడ, ప్రతివాపం=ప్రక్షేప ద్రవ్యముగా వేయ వలయును, యత్ర=ఎక్కడ, బిందవః=ఈ అగదముయొక్క బిందవులు, పాత్యంతే = పడుచున్నవో, తస్మాత్=ఆ కారణము వలన, తన్నిర్విషే=ఆ జలము విషరహితముగా, భవేత్=అగును, పాటలా=కలిగొట్టు,

పారిభద్ర=పారిజాత, అశ్వకర్ణం, అశ్వకర్ణము, శమ్యాక=శేలచెట్టు, శిగ్రుకాన్=మునగ, ఈ వృక్షములను, కలశాంతర్గతాన్ కుండలో ఉంచి, దగ్ధ్వా=కాల్చి, సవిషేంభసి=విషముతో కూడిన నీళ్ళలో, ప్రక్షిపేత=చల్ల వలయును.

తాత్పర్యము: విషముతో కూడిన నీటియందు దాని యందలి రసము తగ్గును. కొంచెము గోరువెచ్చగా నుండును. అనేక రంగులతో కూడిన రేఖలతో నిండి యుండును. ఆనీటిపై నురుగుండును. ఆ నీరు బరువుగా నుండును. ఆ నీరం తయూ సమానముగా నుండదు. పక్షులు కూడ, ఆనీటిని త్రాగుట కిష్టపడవు. ఆ నీటిలో నుండు చేపలు మొ॥ చనిపోవును. ఆ నీటిని తాకుట వలన నొప్పి, వాపు, దురద వెంటనే గల్గును. ఈ విషదూషితమైన నీటితో వండిన అన్నమును తినునపుడే కడుపులో మంట ప్రారంభ మగును. ఈ ఆహారము పచ్యమానా వస్థలో ఆలస్యముగా పాకమగును. పాకమైన తరువాత మూర్ఛ, జ్వరమును కల్గించుచున్నది. పాకమైన తర్వాత, నలుపు, పసుపు, ఎరుపు, అన్ని వర్ణములు కలిసిన మరొకరంగు శరీరముపై కన్పట్టును.

ఈ ఉపద్రవములను శాంతింప జేయుటకు భూమి దోషము వలన, ఏర్ప డిన ఉపద్రవములలో చెప్పబడిన శిగ్ర్వాది అగదము నుత్రాగింపవలయును. మేష శృంగి, ఇంద్రవారుణి, విషఘ్ని, ఉత్తమారణి, ఫణిజ్ఝకము, ప్రతివిషము వీటినికాల్చి, వీటి భస్మమును నీటిలో కలిపి, వడబోయ వలెను. ఇట్లు చాలపర్యాయములు చేయవలెను. తరువాత ఇట్లు వడియగట్టిన నీటిని అగ్నిమీద పాకము చేయవలెను. పాకము చేయు సమయము నందు, తెగడను, పసుపు, మాని పసుపును, ఏలకు లను, మంజిష్ఠను, రాస్నను, బావంచాలను, నీటితో నూరి కల్కమైన తరువాత ప్రక్షేప ద్రవ్యముగా వేయవలయును. ఈ అగదముయొక్క బిందువు లెక్కడ పడునో ఆ స్థానము విషరహితముగా నగును. కలిగొట్టు, వేప, మునగ మొ॥ వాటినొక కుండలో ఉంచి వీటిని అంతర్ధూమ పాకముచేసి తర్వాత భస్మమును గ్రహించి, ఆ భస్మమును విషముతో, కూడిన జలాశయమందు చల్లవలయును. ఇట్లు చల్లుట వలన ఆ విషపూరితమైన నీరు విషరహితమై నిర్మలముగ నుండును.

*శశిలేఖ :* మార్గము నందలి జలాశయములలో నుండు నీరు విషము కలిపిన యెడు, కొంచెము గోరువెచ్చగా నుండును. ఆ విషోదకము చేత తయారుచేయ బడిన అన్నము, భోజనము చేయునపుడే విదాహమును పొందును. అనగా కడుపులో మంట ప్రారంభమగును. అతికష్టముగా కడుపులో అనగా పచ్యమానావస్థయందు అది పాకము చేయబడుచున్నది. అది జీర్ణమగుచు, మూర్ఛను, జ్వరమును గల్గించును. మరియు శరీరమునందు అనేక వర్ణము లేర్ప డును. జఠరము నందు పక్వమైన దగుచు కపోత వర్ణమును గల్గించును. అక్కడ శిగ్ర్వాది అగదమును పరిమాణముతో కూడిన పెరుగులో కలిపి త్రాగింప వలెను. శిగ్రు అజశృంగి మొ॥ వాటిని కాల్చి, ఆభస్మము నుదకములో కలిపి,

వస్త్రముతో వడియగట్ట వలెను. ఇట్లు అనేక పర్యాయములు చేయవలెను. ఇట్లు అనేక పర్యాయములు చేయవలెను. అనేక పర్యాయములు చేయవలెనని చెప్పుట వలన ఇదిగట్టి పడువరకు చేయవలెనని భావము. అక్కడ సరళాదులను చూర్ణించి ఉదకముతో కల్కముగా తయారుచేసి ఆ పిష్టమును పై నీటిలో ప్రతీవాపము చేయవలెను. విశాలా యనగా గవాక్షి యని అర్థము. విషఘ్న యనగ గుడూచి యని యర్థము. ఉత్తమారణి యనగ కరంభమని అర్థము. ఫణిజ్జక మనగా మరువకమని అర్థము ప్రతీవాపం అనగ అర్థపాకమునందు వేయవలెను. వేయవలెను. పాటల్యాదులను ఒక కలశములో నుంచి అంతర్ధూమముగా దానిని కాల్చి. విషముతో కూడిన నీటిలో విషనాశనము కొరకు ఆ భస్మమును చల్లవలయును. పారిభద్రమనగా నింబయని అర్థము. సింధుకః యనగా సింధు వారమని అర్థము.

మూ॥ శీతే ఘర్మే హిమశ్చోష్ణే మారుతో విషసంయుతః।
భ్రమ మూర్ఛాదికారీచ శిగ్రవాది స్తత్ర చేష్యతే॥
దేవదారు నతానంతా మధుకార్జున గైరికమ్।
వ్రజకందం లతాం లోధ్రం వికిరేచ్ఛ్లక్ష్ణ చూర్ణితమ్॥
వృక్షాగ్రేసు పతాకా సుదూష్యేషు సుమహాత్సుచ।
సర్వతశ్చూర్ణ సంపర్కా న్నిర్విషో జాయ ఽనిలతేః॥
వికృతా భవతి ఛ్ఛాయా పాదపే విషదూషితే।
నిర్గ ధమతి గంధంవా తత్పుష్పం హృచ్ఛిరోరుజ॥
కుర్యాత్ ఫల ఫలాశాది కంఠూ పాకాతి సారకృత్॥
భూమి ముద్దిశ్య యత్ప్రోక్తం తత్సర్వం తత్ర చేష్యతే॥

ప్రతిపదార్థము : విషసంయుతః = విషమిశ్రితమైన, మారుతః = గాలి, శీతే = శీతర్తువునందు, ఘర్మః = మిక్కిలి వేడిగ, ఉష్ణేచ = గ్రీష్మర్తువునందు, హిమః = చల్లగ (ఉండును), చ = మరియు, భ్రమమూర్ఛా మొ॥ వాటిని కలుగచేయును, తత్ర = ఈ ఉపద్రవములను శాంతింప చేయుటకు, శిగ్ర్యాదిః = మునగ మూలము మొ॥ వాటితో తయారైన అగదము, ఇష్యతే = ప్రయోగింప బడవలయును(కోరబడుచున్నది) దేవదారు, సరళదేవదారు నత = గ్రంథి తగరము, అనన్తా = సుగన్ధిపాల, మధుక = అతి మధురము, అర్జున = మద్ది, గైరికం = కావిరాయి, వజ్రకన్దం = జెముడు, లతాం = గరికెను, లోధ్రం = లొద్దుగను, పిట్లను, శ్లక్ష్ణ చూర్ణితమ్ = మెత్తగా చూర్ణించిన దానిని, వృక్షాగ్రేసు = వృక్షముల యొక్క కొనలయందు, పతాకాసు = జెండాలపైన, సుమహాత్సు = మిక్కిలి పెద్దవైన, దూషింపబడిన డేరాలు మొ॥ వాటిపైన, సర్వతః = అంతట వికిరేత్ = చల్లవలయును, చూర్ణసంపర్కాత్ = ఈచూర్ణముయొక్క సంపర్కము వలన, నిర్విషః = విషరహితమైనదిగా, అనిలః = గాలిజాయతే = అగు.ను

విషముచే దూషింప బడిన, పాదపే = చెట్టుయొక్క, ఛాయా = నీడ, వికృతా = వికృతమైనదిగా, భవతి = అగుచున్నది. తత్పుష్పం = ఆ చెట్టు యొక్క పువ్వు, నిర్గంధం = వాసన లేనిదిగను, వా = లేక, అతిగన్ధం = ఎక్కువ వాసన గలదిగను, భవతి = అగుచున్నది. హృచ్ఛిరోరుజం = హృదయము, శిరస్సు వీనియందు నొప్పిని, కుర్యాత్ = చేయును. ఫలశాకాది = ఈ చెట్టుయొక్క పండ్లు కూరలు మొ॥, కండూ = దురదను, పాక = పాకమును, అతిసారకృత్ అతిసారములను కల్గించును, భూమిముద్దిశ్య = భూమి దోషమును గురించి, యత్ = ఏది, ప్రోక్తం = చెప్పబడినదో, తత్ర = అక్కడ, తత్సర్వం = అది యంతయు, శస్యతే = ప్రశస్త మైనది.

**తాత్పర్యము** : జనపదోధ్వంసకరభావములలో గాలి కూడ నొకటి. ఈ గాలి విషలిప్తములైన వస్తుజాలములపై వచ్చిన యెడల జనపదములకు తీరని వ్యాధులను కలిగించును. విషముతో కూడిన గాలుల వలన, ఋతువులకుగూడ వైపరీత్యము గలిగి శీతర్తువునందు మిక్కిలి వేడి గాడ్పులు వీచుట, గ్రీష్మర్తువు నందు మిక్కిలి శీతల పవనములు వీచుట మొ॥ సంభవించును. ఋతు వైప రీత్యాదుల వలన ప్రజలకు మూర్ఛాదులు గలుగును, ఈ ఉపద్రవములను శాంతింప చేయుటకు మునగ చెట్టుయొక్క మూలము మొ॥ వాటితో తయారు చేయబడిన అగదమును ప్రయోగింప వలయును. దేవదారు, గ్రంథి తగరము, సుగన్ధిపాల, అతి మధురము, మద్ది, కావిరాయి, జెముడు, గరిక, లొద్దుగ, వీటిని మెత్తగ చూర్ణించి ఆ చూర్ణమును వృక్షాగ్రములపైన, పెద్దపెద్ద జండాల పైన, దూషితములైన డేరాలు మొ॥ వాటిపైన, అన్నింటిపైన చల్లవలయును. ఈ చూర్ణముయొక్క సంపర్కము వలన విషలిప్త వస్తువులన్నియు నిర్విషములై ఆరోగ్య ప్రదములుగా నగును. విషముచేత, నింపబడిన చెట్టుయొక్క నీడ వికృతి చెందిన యెడల అచట వాసన లేక పోవుటయు, ఎక్కువ వాసన గలదిగాను ఉండును. ఈ నీడనాశ్రయించిన, ఆశ్రిత వస్తుజాలము, హృద్రోగాదులకు గురి యగుదురు. ఈ చెట్టుయొక్క పండ్లు, కూరలు మొ॥ తినిన యెడల దురద లను, పాకమును, అతిసారములను కలిగించును. భూమి దోషమును గురించి చెప్పబడిన చికిత్సా విధానము నిచట గూడ సంక్రమింప జేయవలయును.

*శశిలేఖ* : విషలిప్తములైన మహావృక్షములు పర్వతాదుల యందలి శిలలపై నుండి వచ్చుగాలులు, ఋతువైపరీత్యము పొంది శీతకాలమునందు వేడి గాలు లను, గ్రీష్మర్తువునందు చల్లని వాయువులును వీచును. ఈ గాలులు భ్రమా దులను కల్గించును. దేవదార్వ్యాది చూర్ణములను వృక్షాగ్రములు మొ॥ వాటిపై చల్లవలయును. నతం అనగా తగరమని యర్థము, అనన్తా = దూర్వాయనియు, వజ్రకన్దం = సుధా యనియు, లతా = ప్రియంగు యని యర్థము. పతాకా యనగా, దేవగృహాది ధ్వజపటః యని అర్థము. ఈ పతాకములు గల గృహముల పైనను పై చూర్ణమును చల్ల వలయును. సమస్త ప్రదేశములయందు గూడ

చల్లినయెడల, భూభాగ మంతయు, నిర్విషమై ఆరోగ్య ప్రదాత యగును. విష దూషితమైన చెట్టుయొక్క పుష్పములు వాసన లేనివియు, అతివాసన గలవియును గూడనగును. దీనిని వాసనచూచిన యెడల, హృద్రోగము, శిరస్సులో బాధ జనించును. ఆ చెట్టుయొక్క పండ్లు ఆకులు కండ్వాదుల కల్గించును. పలాశమనగా పత్రమని అర్థము. ఇచట విషలిప్తమైన భూమికి చెప్పిన చికిత్సా ప్రక్రియల నన్నింటిని ప్రయోగించ వలెను.

శ్లో॥ నచకన్యా మవిదితాం సంస్పృశేద రపరీక్షితామ్।
వివిధాన్కుర్వతే యోగాన్కుశలాః ఖలుమానవాః॥
ఆజన్మ విషసంయోగాత్కన్యా విషమయీ కృతా।
స్పర్శోచ్ఛ్వాసాదిభిర్హన్తి తస్యాస్త్వే తత్పరీక్షణమ్।
తన్మస్తకస్య సంస్పర్శా ద్గ్లాయేతే పుష్ప పల్లవే॥
శయ్యాయాం మత్కుణైర్వస్త్రే యూకాభిః స్నానవారిణా।
జన్తుభిర్మ్రియతే జ్ఞాత్వాతామేవం దూరతస్త్యజేత్॥౪౭॥

ప్రతిపదార్థము : అపరీక్షితాం = పరీక్షింపబడని, అవిదితాం = పరిచితకానటువంటి, కన్యాం = అవివాహితయైన కన్యకను, నసంస్పృశేత్ = తాక కూడదు, కుశలాః = చతురులైన, మానవాః = మానవులు, వివిధాన్ = పలువిధములైన, యోగాన్ = మారక ప్రయోగములను, కుర్వతే = చేయుదురు.

ఆజన్మ విషసంయోగాత్ = పుట్టినది మొదలు విషవస్తువులయొక్క సంయోగము వలన, విషమయీ = విశేష కన్యగా, కృతా = చేయబడినది తస్యాః = ఆ విషకన్యక యొక్క, స్పర్శోచ్ఛ్వాసాదిభిః = తాకుట, నిట్టూర్పు విడుచుట ఈ రెంటిచేత, హన్తి = చంపును, ఏతత్ = ఇది, పరీక్షణమ్ = పరీక్షించదగినది, తన్మస్తకస్య = ఆవిషకన్య శిరముయొక్క, సంస్పర్శాత్ = తాకుటవలన, పుష్పపల్లవే = పుష్పములు, చిగురుటాకులు, గ్లాయతే = వాడుచున్నవి, శయ్యాయాం = పడకలో, మత్కుణైః = నల్లులచేత, వస్త్రే = వస్త్రమునందు, యూకాభిః = పేలచేత, స్నానవారిణా = స్నాన జలముతో, జన్తుభిః = జంతువులలో, మ్రియతే = చంపబడుచున్నది, తాం = ఆవిషకన్యను, ఏవం = ఇట్లు, జ్ఞాత్వా = తెలుసుకొని, దూరతః = దూరమునుండి, త్యజేత్ = వదలి పెట్టవలయును.

తాత్పర్యము : రాజు తనకు సుపరిచితకాని, చక్కగా వైద్యులచే పరీక్షించని, అవివాహితయైన కన్యను స్పృశించరాదు. శత్రువులు మాయోపాయములతో ఎత్తుకు పై ఎత్తులు వేయుటకు జంకరు, కానవారు తమచాతుర్యముతో పలువిధములైన మారక ప్రయోగములను శత్రురాజులపై ప్రయోగింతురు. అట్టి ప్రయోగములలో విషకన్యా ప్రయోగముగూడ నొకటిగాన, పై పరీక్ష అవసరమై యున్నది.

విషకన్యా లక్షణ మిట్లున్నది :- పుట్టినది మొదలు కొద్దికొద్ది పరిమాణ ముతో విషమును తినిపించుచూ మెల్లమెల్లగా క్రమానుసారము, విష పరిమాణ మును, నిత్యాభ్యాసములో పెంచుచూ, ఎక్కువ మాత్రలో విషము నభ్యసింప చేయుదురు. ఈ స్త్రీ యొక్క శరీరము, ఈ మాత్రాధిక్యత వలన విషముతో సమానముగ మారును. అంతవరకు ఈ విషము నభ్యసింప చేతురు. ఈ స్త్రీ యొక్క శరీరమంతయు, విషమయమైనట్లు తెలిసికొని, రాజసమీపమునకు పంపుదురు. రాజులు కళలయందారితేరినవారుగూడ ఆస్త్రీయొక్క ఆంగిక హావభావములకు ముగ్ధులై ఆలింగన చుంబనాదులను చేయుదురు. వీటివలన ఆ రాజులు విగత జీవులగుదురు. మరియు విషకన్య తలపైన హస్తములుంచినను వాడు చచ్చును. కాన తొలుత ఆ స్త్రీని పరీక్షింప వలయును. ఎట్లనగా ఆ విషకన్యతలపై పుష్పములుగాని, చిగురుటాకులను గాని పెట్టిన యెడల వెంటనే అవి వాడిపోవును. ఆ విషకన్యపండుకొను శయ్యలో నున్న నల్లుల చేతను, ఆమె ధరించు వస్త్రములలో నుండు పేసుల చేతను, ఆమెస్నానము చేసిన జలములలోని జంతువులచేత గూడ మానవుడు చంపబడు చున్నాడు. కాన వీటన్నింటిని సంపూర్ణముగ గ్రహించి, ఆ విషకన్యను దూరము నుండియే పరిత్యజింప వలయును.

*శశిలేఖ* : శత్రువులను నిర్జించుటకు బయలు దేరిన రాజు అపరిచి యైన,అపరీక్షిత యైన కన్యను తాకరాదు.ఎందుకనగా నయవంచనమందు సమర్థు లైన గూఢచారులు శత్రురాజులపై మారక, ప్రయోగములను జరిపించుదురు. ఈ మారక ప్రయోగములలో విషకన్యను దాపడమొక ప్రక్రియ యగును. విషకన్య యెట్లగుననగా లక్షణము నిట్లు చెప్పుచున్నాడు. స్త్రీలకు పుట్టుక మొదలు అతిస్వల్పమైన విషమును ప్రతిదినము ఆహారమువలె అభ్యాసను చేయించుట వలన, ఆస్త్రీల యొక్క శరీరమంతయు, విషమయ మగును. అట్టి విషకన్యను తాకుటచేత, ఆమెయొక్క ఉచ్ఛ్వాసము శరీరమునకు తగు లుట చేత, మానవుడు మరణించును. అట్టి విషకన్యను విషకన్యగా గుర్తించు టకుకొన్ని పరీక్షలు చేయవలయును. ఆమెనుచేతితో తాకుటచేత, ఆమె యొక్క తలలో ముడుచుకొన్న పుష్పములు, ఆకులు వాడిపోవును. ఆమె యే పడకపై నిదురించునో, ఆ పడక యందున్న నల్లులుకుట్టుటచేత, మానవుడు చంపబడును. వస్త్రము నందలి పేసులుకుట్టుటచేత, మానవుడు చంపబడుచున్నాడు. ఆమె జలకములాడు నీటిలో నుండు సూక్ష్మ జంతువులచేత అనగా మక్షికాదుల చేత గూడ మానవుడు చంపబడు చున్నాడు. ఇట్టి పరీక్షలచేత, ఆమెను పరీక్షించి, విషకన్యగా నిర్ధారణముచేసి, ఆ విషకన్యను దూరము నుండియే పరిత్యజింప వలెను.

మూ॥ నాప్రోక్షితం నాతవిదితం భిషజానా నవేక్షితమ్।
నాప్రాశితంచ సూదాద్యైః కించిదాహారయే న్నృపమ్॥

ప్రతిపదార్థము : భిషజా=రాజవైద్యునిచేత, నాప్రోక్షితం=ప్రోక్షణ మంత్రములచే ప్రోక్షింప బడని, నా విదితమ్ = తెలుసుకోన బడనిది, నా నవేక్షితమ్=చూడబడనిది, సూదాద్యైః=పాచకులు మొ॥ వారిచేత, నాప్రాశితం=తినబడనటు వంటి, కించిత్ = కొంచెమైన ఆహారముగూడ, నృపం= రాజును, నాహారయేత్=తినిపించకూడదు.

తాత్పర్యము : రాజున కిది యనసరము, ఏమిటనగ. వైద్యునిచేత ప్రోక్షణ మంత్రములచేత ప్రోక్షింపబడని, వైద్యునికి తెలుప బడనిదియు, చూపించ బడనిదియు మరియు, పాచకుడు మొ॥ వారిచేత భుజింపబడని యే కొద్దిపాటి ఆహారమునుగూడ రాజునకు తినిపింపరాదు.

శశిలేఖ : అట్లే రాజవైద్యులచేత మన్త్రప్రోక్షణము గావింపబడిన ఆహారమును భుజింప వలయును. వంట చేయువారు మొదట భుజింపవలెనని నియమము. మిత్రులు బన్ధులు మొ॥ వారినుండి వచ్చు ఆపదలయొక్క భయము వలన ఎప్పుడున్నూ విషమును ఇవ్వడు అని అట్లు నియమము చేయబడినది.

శ్లో॥ ధన్యం సర్వార్థ సిద్ధాఖ్యం పాపరక్షోవిషాపహమ్।
పరం చక్షుష్య మాయుష్యం శత్రుఘ్న వక్ష్యతేఽఞ్జనమ్॥

ప్రతిపదార్థము : ధన్యం=పవిత్రమైనది, సర్వార్థసిద్ధాఖ్యం = సమస్తమైన అర్థములకు గతిని కలిగించుటలో ప్రసిద్ధి చెందినది, పాపరక్షోవిషాపహమ్= దరిద్రమును, రాక్షసులనుండి విషము నుండి రక్షించుటను, పరం = మిక్కిలి చక్షుష్యం = నేత్రములకు హితమైనదియు, ఆయుష్యం = ఆయుర్వర్ధకమై, నదియు, త్రుశఘ్నం=శత్రువులను పరిమార్చునదియునగు, అంజనమ్=నేత్రాంజనము, వక్ష్యతే = చెప్పబడు చున్నది.

తాత్పర్యము : విషాపహరమైన అంజనమును చెప్పుచున్నాడు. ఈ అంజనము పవిత్రమైనది, సమస్త అభిప్రాయములు ఫలవంతములగు నట్లు చేయును. పాపములను, రాక్షసోపద్రవములను, విషోపద్రవములనుండి రక్షణమును చేయును. ఇది కన్నులకు మిక్కిలి హితకరమైనది. ఆయుర్వర్ధకరము. శత్రువులను నశింప చేయును. అట్టి అంజనమును చెప్పబోవు చున్నాడు.

సూ॥ అథ శుక్ల పక్షే పుణ్యేఽహాని పుష్య పునర్వసు హస్త చిత్రా మృగ శిరః శ్రవణ రేవతీ శతభిషక్ ప్రాజాపత్యోత్తరాణాం అన్యతమేన నక్షత్రేణ యోగముపగతే భగవత్యోషధిపతౌ ప్రశస్తే ముహూర్తే సింధుస్రోతః సముత్థం స్నిగ్ధం సప్రభం గన్ధవర్ణచ్ఛేదైః నీలోత్పలాభమంజన మాహరేత్॥

ప్రతిపదార్థము : అథ=తరువాత, శుక్లపక్షే = శుక్లపక్షము నందు, పుణ్యేఽహాని=పవిత్ర దినమునందు, పుష్యపునర్వసు హస్తచిత్రా మృగశిరః శ్రవణ రేవతీ శతభిషక్ ప్రాజాపత్యోత్తరాణామన్యతమేన=పుష్యమి, పున

ర్వసు, హస్త, చిత్త, మృగశిర, శ్రవణ, రేవతీ, శతభిష, రోహిణీ నక్షత్రములలో అన్యతమేన=ఏదియో నొకటైన, నక్షత్రేణ=నక్షత్రముతో, భగవతి=భగవంతుడైన, ఓషధిపతే=ఓషధుల కధిపతియైన చంద్రుడు, యోగం=యోగమును, ఉపగతేసతి=పొందిన వాడగుచుండగా, ప్రశస్తేముహూర్తే=ప్రశస్తమైన ముహూర్తమునందు, సింధు స్రోతః సముత్థం=సింధునది యొక్క ప్రవాహములో పుట్టినట్టి, స్నిగ్ధం=స్నిగ్ధమైనట్టి, సప్రభం = కాంతితో కూడుకొన్నట్టి, గన్ధ వర్ణచ్ఛేదైః=గన్ధ వర్ణములయొక్క కూడికతో, నీలోత్పలాభం = నల్లకలువతో సమానమైన, అంజనం = సౌవీరాంజనమును, ఆహరేత్ =తీసుకొని రావలయును.

తాత్పర్యము : తరువాత శుక్లపక్షమునందు, పవిత్ర దినమందు, పుష్యమి, రోహిణీ మొ॥ నక్షత్రములలో యేదియో నొక నక్షత్రముతో భగవంతుడైన, ఓషధుల కధిపతియైన చంద్రుడు యోగమును పొందుచుండగా, ప్రశస్తమైన ముహూర్తమందు సింధునదియొక్క ప్రవాహములో పుట్టినట్టి, స్నిగ్ధమైన కాంతిలో కూడుకొన్నట్టి, నల్లకలవతో సమానమైన గన్ధ వర్ణములు గల సౌవీరాంజనమును తీసుకొని రావలయును.

మూ॥ తస్యాష్టౌ భాగాః కనక రజతోదుంబరాణా మేకైకో భాగ స్తత్సర్వం మూషాయాం ప్రక్షిప్య బలిమంగల పూర్వక మగ్ని ముపసమాధాయ ఖదిర కదర ధవస్యందనాన్యతమ దారుభి ర్గోమయైర్వా ప్రజ్వాలయేత్।

ప్రతిపదార్థము : అస్య = సౌవీరాంజనముయొక్క, అష్టౌభాగాః= 8 భాగములు, కనక=బంగారము, రజత=వెండి, ఉదుమ్బరాణాం=రాగి, ఈ మూడింటియొక్క, ఏకైకోభాగః = ప్రత్యేకముగ ఒక్కొక్కభాగము, తత్సర్వం=వీటంతటిని, మూషాయాం = మూషలో, ప్రక్షిప్య=ఉంచి, బలిమంగల పూర్వకమ్=బలులు, స్వస్తివాచనము ముందుగాచేసి, అగ్నిం = అగ్నిని, ఉపసమాధాయ=గ్రహించి, ఖదిర=చండ్ర, కదర=వెలిచంద్ర, ధవ=ధవము (ధవవృక్షము), స్యందన=నెమ్మి ఈ వృక్షములయొక్క, అన్యతమదారుభిః= ఏదియో నొక చెట్టుచేత, వా=లేక, గోమయైః=ఆవు పిడకలతో, ప్రజ్వాలయేత్=కాల్చ వలయును.

తాత్పర్యము : ఆ సౌవీరాంజనము 8 భాగములు, బంగారము వెండి, రాగి ఈ మూడు లోహములు ఒక్కొక్క భాగము విధి ప్రకారము, కలిపి ఒక మూసలో పోసి, బలిమంగళ స్వస్తివాచకములచే, అగ్నిని ఆహ్వానించి, ఖదిరాదులలో నేదియో నొక చెట్టు యొక్క కట్టెలతో కాల్చ వలయును.

మూ॥ తతశ్చాచార్యావలోకితేశ్వరమార్యతారాం బ్రహ్మా దక్షాశ్విరుద్రేంద్రాదిత్య, సోమవరుణ వైశ్వానర వాయు విష్ణు జనక భరద్వాజ ధన్వంతరి సుశ్రుత భవ్యసుకన్యా స్కంధ చవన వైనతేయానన్యాంశ్చ యథా విధ్యుక్త

దేవతాః సుమనోక్షత లాజస్వస్తిక సంయావనిస్తుష యవ సంస్కృత గుడ ఘృత మిశ్ర పాయసై రర్చయిత్వా వృద్ధ వైద్య బ్రాహ్మణాంశ్చ శుక్లవాససో మహతీభిర్దక్షిణాభిః పూజయిత్వా తస్మిన్నగ్నౌ తదంజనంధ్మాతం ధ్మాతమావర్చ పృథక్ పృథక్ నిషేచయేత్—గోశకృద్రస మూత్రఘృత దధిక్షౌద్ర వసామజ్జా తైల మద్య సర్వగంధాంబు శర్కరోదకేక్షురసేషు తథా హరీతక్యామలకరవి తక కాశ్మర్య మృద్వీకశృంగాటకశేరుకోత్పల నళిన సౌగంధిక మృణాళికా క్వాథేషు తథాలావ కపింజలైణ శశహరిణ కులీరరసేషు తథా మధుక చందన, కాలానుసార్యనలదపద్మ కోశీర మంజిష్ఠా అనంతా గైరిక కుంకుమోదకేషు.

ప్రతిపదార్థము: సుమనః = మంచి మనస్సుగలవాడై, తతః = తరువాత, ఆర్యావలోకితేశ్వరం; ఆర్యతారాంశ్చ=చంద్రుణ్ణి, ధ్రువనక్షత్రమును చూచి; బ్రహ్మ = బ్రహ్మ; దక్ష = దక్షప్రజాపతి; అశ్వి = అశ్వినీ దేవతలు, రుద్ర = ఈశ్వరుడు; ఇంద్ర=ఇంద్రుడు; ఆదిత్య=సూర్యుడు; వరుణ=వరుణుడు; వైశ్వానర=అగ్ని; వాయు = వాయువు; విష్ణు=విష్ణువు; జనక = జనక మహారాజు; భరద్వాజ=భరద్వాజుడు; ధన్వంతరి=ధన్వంతరి; సుశ్రుత = సుశ్రుతుడు; భవ్య=భవ్యుడు; సుకన్యా = సుకన్య; స్కంద=సుబ్రహ్మణ్యస్వామి; చ్యవన=చ్యవనుడు; వైనతేయాన్ = గరుత్మంతుడు మొ॥ వారిని; అన్యాంశ్చ=మరియు ఇతర దేవతలను; ఉక్తదేవతాః = చెప్పబడిన దేవతలను; యథావిధి = శాస్త్ర ప్రకారము; అక్షత=అక్షింతలను; లాజా= పేలాలను; స్వస్తికా=మంగళకరములైన నెయ్యిపాలు తేనె మొ॥ వాట్లను; సంయావ= సంయావము; నిస్తుషయవ=పొట్టు తీసిన యవలు, వీటిచేత; సంస్కృత= తయారు చేయబడిన పదార్థములను; గుడ=బెల్లము; ఘృత=నెయ్యి వీటితో; మిశ్రపాయసైః=కలిపి తయారుచేసిన పాయసములచేత; అర్చయిత్వా = నైవేద్యాదులతో పూజించి; వృద్ధవైద్యబ్రాహ్మణాన్ = జ్ఞాన వైద్యులయిన వృద్ధ బ్రాహ్మణులను; శుక్లవాసః= తెల్లనివస్త్రములచేత; మహతీభిర్దక్షిణాభిః= అధిక ధనములచేత; పూజయిత్వా=పూజించి; తస్మిన్నగ్నౌ= ఆ అగ్నియందు; తదంజనం=ఆ మూసలో నుంచిన సౌవీరాంజనమును; ధ్మాతం=కాల్చవలయును; ధ్మాతమావర్చ=కాలుచున్న దానిని శలాకలతో ఇటునటు కదల్చి; పృథక్ పృథక్ =వేర్వేరుగా; నిషేచయేత్ = ముంచవలయును; గోశకృద్రస = ఆవుపేడ రసము; మూత్ర = మూత్రము; ఘృత=నెయ్యి; దధి=పెరుగు; క్షౌద్ర = తేనె; వస=వస; మజ్జ = మజ్జ; తైల = నువ్వులనూనె; మద్య=సారాయము; సర్వగంధాంబు = సమస్తగంధములతో కూడిన నీరు; శర్కరోదక = చక్కెర కలిపిన నీళ్ళు; ఇక్షురసేషు = చెరుకు రసములందు; తథా=అట్లే; హరీతకీ=కరక్కాయ; ఆమలకీ=ఉసిరిక్కాయ; విభీతకి = తానిక్కాయ; కాశ్మర్య = పెగ్గుమ్మడు; మృద్వీక=ద్రాక్ష; శృంగాటక =శృంగాటకములు; కశేరుక =భద్రముస్తలు; ఉత్పల = తెల్లకలువలు; నళిన=నల్లకలువ; సౌగంధిక =

కామంచిపూలు; మృణాళిక = తామరతూడు; ఈ ద్రవ్యములయొక్క; క్వాథేషు = కషాయములందు; లావా = లావుకపిట్ట; కపింజల = కపింజలము; ఏణా = లేడి; శశ = కుందేలు; హారిణ = హారిణము; కులీర = కులీరమను పక్షి; వీటియొక్క; రసేషు = మాంస రసముల యందు; తథా = అట్లే; మధుక = మధుయష్టి; చందన = చందనము; కాలానుసార్య = జాతి పువ్వు; నలద = అవురు వేరు; పద్మక = తామరపువ్వు; ఉశీర = వట్టివేళ్ళు; మంజిష్ఠ = మంజిష్ఠ; అనంతా = సుంగధిపాల; గైరిక = కావిరాయి; కుంకుమ = కుంకుమ పువ్వు వీటియొక్క; ఉదకేషు = ఉదకముల యందు; పృథక్ పృథక్ = వేర్వేరుగా; నిషేచయేత్ = ముంచవలయును.

తాత్పర్యము : ఈ సౌవీరాంజనమును మూసలో నుంచి అగ్నిలో పెట్టుటకు ముందు ఓషధులకు అధిపతియైన చంద్రుణ్ణి, ధ్రువనక్షత్రమును చూచి బ్రహ్మాది దేవతలను శాస్త్రమునందు చెప్పబడినట్లుగా పుష్పములు, పేలాలు, అక్షతలు వీటితో సమంత్రముగ పూజించి, మంగళకరములైన నెయ్యి, పాలు, తేనె, పొట్టు తీసిన యవలు, గోధుమలు మొ॥ వాటితో సిద్ధము చేయబడిన పదార్థములను నివేదనముచేసి, జ్ఞానముచేత వృద్ధులైన వైద్య బ్రాహ్మణులను తెల్లని వస్త్రములచేత, ఎక్కువ వెలగల బంగారు మొ॥ దక్షిణలచేత పూజ్య భావముతో గౌరవించి అగ్నియందలి మూసలో నుంచిన ఈ అంజనమును శస్త్ర శలాకలచేత అటునిటుకదల్చుచూ, ఈ క్రింద నుదాహరింపబడు ద్రవ్యములచేత, తయారుచేయబడిన క్వాథములో వేర్వేరుగా ముంచవలయును.

ఆ ద్రవ్యములేవి యనగా గోవుపేడ యొక్క రసము, గో మూత్రము, గో ఘృతము, పెరుగు, తేనె, వస, మజ్జ, తైలము, మద్యము, సర్వగంధములతో కూడుకొన్న జలము, శర్కరకలిపిననీరు, చెరుకురసము, కరక్కాయ, ఉసిరికాయ, తానిక్కాయ, పెగ్గుమ్మడు, ద్రాక్ష, శృంగాటకములు, భద్రముస్తలు, తెల్ల కలువలు, నల్లకలువలు, తామరతూండ్లు, వీటియొక్క కషాయములో, అట్లే లావుక పిట్ట, కపింజలపిట్ట, లేడి, కుందేలు, జింక, కురీరము, వీటియొక్క మాంసరసము లందు, అట్లే మధుయష్టి, చందనము, జాతిపువ్వు, అవురువేరు, తామర పువ్వులు, వట్టివేళ్ళు, మంజిష్ఠ, సుగంధిపాల, కావిరాయి, కుంకుమ పువ్వు వీటిని చూర్ణించి, నీళ్ళలో కలిపి, తయారు చేసిన కడుగులో మంచి మనస్సు గలవాడై వేర్వేరుగా ముంచవలయును.

సూ॥ తతః శుక్లవాససి బద్ధ్వా ద్వాదశ రాత్ర మాంతరిక్షేఽమ్భసి వాసయేత్.

ప్రతిపదార్థము : తతః = తరువాత, శుక్లవాససి = తెల్లని వస్త్రములో, బద్ధ్వా = బంధించి, ద్వాదశ రాత్రం = పండ్రెండు రాత్రులు, అంతరిక్షే = అంభసి = వర్షజలములో ముంచి, వాసయేత్ = యుంచ వలయును.

మూ॥ తతశ్ఛాయాయాం విశోష్య స్ఫటిక, ముక్తా, ప్రవాల కాలాను సార్య, ప్రతీవాపం, పునరపి, బలిమంగల పూర్వకం మహాద్వాససా కన్యయా దృషధి పేషయిత్వా సువర్ణ, రజత, తామ్ర శంఖశైల ద్విరద రదనగవల వైఢూర్య, స్ఫటిక మేషశృంగాసన సారాన్యతమ ఘటితాయా మంజని కాయాం నిధాపయేత్।

ప్రతిపదార్థము : తతః=తర్వాత, ఛాయాయాం=నీడలో, విశోష్య= యెండించి, స్ఫటిక=పటిక, ముక్తా=ముత్యము, ప్రవాల=పగడము, కాలాను సార్య=జాతిపువ్వు,వీటిని, ప్రతీవాపం=చేర్చి, పునరపి=మరలకూడ,బలిమంగళ పూర్వకం=బలిమంగళపూర్వకముగా,మహద్వాసస=బాగుగాపొట్టుతీయబడిన, కన్యయా =కలబందతో, దృషధి=జాతిపైన, పేషయిత్వా=నూరి, సువర్ణ= బంగారము, రజత=వెండి, తామ్ర=రాగి, శంఖ=శంఖము, శైల=రాయి, ద్విరదరద=ఏనుగుదంతము, నగవల=ఆవుకొమ్ము, వైఢూర్య=వైఢూర్యము, స్ఫటిక=పటిక, మేషశృంగి=మేకకొమ్ము, ఆసవసార=ఆసవసారము, అన్యతమ ఘటితాయా =ఏదియో ఒక దానితో కలిపిన, అంజనికాయాం=భరణిలో, నిధాపయేత్ =ఉంచవలయును.

తాత్పర్యము : తరువాత శ్వేత వస్త్రములో 12 రాత్రులు వర్ష జల ములో ముంచి ఉంచిన ఆ సౌవీరాంజనమును నీడలో నెండించి, దానిలో పటిక, పగడములు, ముత్యములు, జాతిపువ్వు వీటిని చూర్ణించి, కలిపి, మరల బలి మంగళ పూర్వకములైనట్టి పూజావిధానములను సలిపి పైతోలు నంతయు వలిచివేసిన కలబందతో కలిపి జాతిపైన మర్దించి బంగారు భరిణలోగాని, వెండి భరిణలోగాని, రాగి భరిణలోగాని, శంఖములోగాని, ఏనుగు దంతపు భరిణలో గాని, జాతి భరిణలోగాని, ఆవు కొమ్ములో గాని ఏదియో భరిణలో దీనిని ఉంచవలయును.

మూ॥ అథ పునరపి పూర్వవత్ కృతస్వస్త్యయనం సావిత్రేణ కర్మణా సర్వ విద్విజన్మా విదవత్తదభి సంస్కుర్యాత్।

ప్రతిపదార్థము : అథ=దీని తరువాత, పునరపి=మరల, పూర్వవత్ కృతస్వస్త్యయనం = వెనుకటివలె చేయబడిన స్వస్తి వాచనము, సావిత్రేణ కర్మణా=సౌరమార్గముద్వారా, సర్వవిద్విజన్మా=సమస్త జ్ఞానము లయందారి తేరిన అథర్వవేద పండితులైన బ్రాహ్మణులు, విధివత్=శాస్త్ర ప్రకారముగా, తత్=ఆ అంజనమును, అభిసంస్కుర్యాత్=సిద్ధి చేయవలయును.

తాత్పర్యము : భరణి యందుంచబడిన అంజనమును మరల వెనుకటివలె సౌరమార్గము ద్వారా స్వస్తి వాచనాదులను చేసి, అథర్వ వేదమునందు పండితు లైన బ్రాహ్మణుడు మరల శాస్త్ర ప్రకారము ఈ అంజనమును శుద్ధిపరచ వలెను.

మూ॥ తతోగజస్కంధ మారోప్య పాండురచ్ఛత్ర చామరవాలవ్యజనైః అనుగతం తథా శంఖ దుందిభి స్వనైః ద్విజాతివర ప్రయుక్తైశ్చ వేదవాద మిశ్రైః పుణ్యాహఘోషైః కృత పుష్పోపహారం వైద్య గృహాన్నాయక గృహం అనుప్రవేశయేత్।

ప్రతిపదార్థము : తతః=అటు తరువాత, వైద్య గృహాత్ = రాజ వైద్యుని యొక్క గృహమునుండి, గజస్కంధం=ఏనుగు యొక్క మూపు రము పైన, ఆరోప్య=ఉంచి, పాండురచ్ఛత్ర చామర వాలవ్యజనైః= తెల్లని రంగు గల గొడుగు, వింజామరలు, విసనకర్రలుచేత, అనుగతం=అనుసరించి వెళ్ళుచున్నట్టి, తథా=అట్లే, శంఖ=శంఖములు, దుందుభి=దుందుభులు, వీటి యొక్క, స్వనైః=శబ్దములచేత, ద్విజాతివర ప్రయుక్తైః=బ్రాహ్మణులయొక్క ముఖము నుండి వెడలుచున్న, వేదవాదమిశ్రైః = వేదవాక్యములతో కలిసిన, పుణ్యాఃఘోషైః=స్వస్తి వాచనముల యొక్క శబ్దములచేత, కృతపుష్పోపహారం =వేయబడిన మాలలు మొ॥ ఉపహారములను వేసి, నాయక గృహం=రాజు యొక్క ఇంటిలోనికి, అను ప్రవేశయేత్=ప్రవేశింపచేయవలయును.

తాత్పర్యము : తరువాత రాజవైద్య గృహమునుండి యేనుగు అంబారి పైన ఈ అంజనమును పెట్టి, తెల్లని వింజామరల చేత వీచుచూ, తెల్లని గొడు గుల చేత ఎండ, గాలి మొ॥ తగులకుండా పట్టుకొని, శంఖములను పూరించుచూ, ఢప్పులను వాయించుచూ, ఉత్తములైన బ్రాహ్మణులచేత, వేద వాక్యములతో గూడిన స్వస్త్యయనాది ఘోషములచేత వేయబడిన పుష్పమాలలు, ఉపహార ములను వేసి, రాజ సౌధములోనికి ప్రవేశింపజేయవలయును.

మూ॥ అనంతరంచ తేన విదేహాధిపోపధిష్టేన సర్వార్థేషు సిద్ధేనాంజనేన యథోక్తానామే వాంజన భాజన ద్రవ్యాణా మన్యతమయా, శలాకయా గోబ్రాహ్మణ పూజా పూర్వకం శుచిః సన్యమః భూత్వాధారణీమిమాం విద్యా మధీయ మానః పూతః పూర్వ మక్షి దక్షిణం అంజయేత్।

ప్రతిపదార్థము : అనంతరమ్=అనంతరము; విదేహాధిపోధిష్టేన=విదేహ రాజు చేత చెప్పబడిన, సర్వార్థేషు=సమస్త ప్రయోజనములలో సిద్ధేన= సిద్ధము చేయబడిన, తేన అంజనేన=ఆ అంజనముచేత, యథోక్తోనామేవ= పూర్వము చెప్పబడిన, అంజన భాజన ద్రవ్యాణాం=అంజనమునుంచు భరణిని తయారు చేయుట కుపయోగించిన ద్రవ్యములలో, అన్యతమః=ఏదియో నొక, శలాకయా=శలాకచేత, శుచిః=అంతఃశుద్ధి, బహిశ్శుద్ధి కలిగిన, సన్యమః= నియమములతో కూడిన వాడుగ, భూత్వా = అయి, గోబ్రాహ్మణ పూజా పూర్వకం=గోవులను, బ్రాహ్మణులను పూజించి, ఇమాం = ఈ చెప్పబోవు, ధారణీం విద్యామ్ = ధారణీ యను విద్యను, అధీయానః=జపించుచున్నవాడై, పూతః=పవిత్ర మనస్కుడై, పూర్వం= మొదట, దక్షిణం అక్షి=కుడికంటిలో,

అంజయేత్ = అంజనము వేయవలెను.

**తాత్పర్యము :** తరువాత విదేహ మహారాజు చేత ఉపదేశింపబడిన సర్వార్థ సిద్ధితమైన ఈ అంజనము చేత పూర్వపు భాగములలో చెప్పిన అంజన ధరణిని తయారుచేయుట కుపయోగించిన ద్రవ్యములలో ఏదియో నొక ద్రవ్యముతో తయారు చేయబడిన శలాకతో గోబ్రాహ్మణులను పూజించి పవిత్రుడై నియమవంతుడై ఈ చెప్పబోవు ధారణీ విద్యను జపించుచున్నవాడై పవిత్రమైన మనస్సుతో గూడినవాడై మొదట కుడికంటిలో అంజనమును వేయవలయును.

మంత్రము :

నమశ్చక్షుః పరిశోధన రాజాయ తథాగతా యార్హాతే సమ్యక్ సంబుద్ధాయ। తద్యథా.

ఓం చక్షుః ప్రజ్ఞా చక్షుః విజ్ఞాన చక్షుః విశోధయ స్వాహా॥

**తాత్పర్యము :** ఈ కన్నులను పరిశోధించు రాజునకు నమస్కారము. అట్లే బుద్ధునకు నమస్కారము. ఎట్లనగా ఈ కన్నులు, ప్రజ్ఞా చక్షువు, జ్ఞాన చక్షువులను చక్కగా శోధనచేయును.

ఇచట వాగ్భటుడు బౌద్ధుడు గాన ముందుగా బుద్ధునికి నమస్కారము చేసెను. కాన ఈ అంజనము చేయునపుడు ఎవరైననూ వారివారి ఇష్టదేవతలకు నమస్కారముచేసి ఈ అంజనము నిడవలెను. ఇట్లుచేసినయెడల వారికిష్టసిద్ధిగల్గును,

**మూ॥** తతహోత్పరం తామేవ ధారణీం అనుసంస్మరణ్ సాయంప్రాతః ప్రత్యహాం, ఏతత్పరం పవిత్ర మారోగ్యకర మూర్జస్కరం సర్వ విఘ్నహార మంజన మశ్విభ్యామింద్రస్య వృత్రవధాభ్యుది తస్య పాక ప్రకల్పితం. తస్మాదేత ద్రాజ్ఞామ్ రాజమహా మాత్రాణాంచ మహీం విజిగీషమాణానాం బ్రాహ్మణానాంచ వేదాధ్యయన మన్యద్వా మహచ్ఛాస్త్ర మవగాహమానానాం ప్రసన్న మనా భిషక ప్రక్ల్పయేదితి!

**ప్రతిపదార్థము :** తతహోత్ = అటు తరువాత, పరం = ఉత్కృష్టమైన తామేవ = దానినే, ధారణీం = ధారణీ మంత్రమును, అనుసంస్మరణ్ = జపించుచు, సాయం = సాయంకాలము, ప్రాతః = ఉదయము, ప్రత్యహాః = ప్రతిదినము, ఏతత్ = ఇది, పరమం = ఉత్కృష్టమైనది, పవిత్రం = పవిత్రమైనది, ఆరోగ్యకరం = ఆరోగ్యమును చేయునది, ఊర్జస్కరం = ఉత్సాహమును వృద్ధి పరచునది, సర్వవిఘ్నహారం = సమస్తమైనవిఘ్నములను పారద్రోలునదియైన, అంజనం = అంజనమును, వృత్ర వధాభ్యుది తస్య = వృత్రాసురుడను రాక్షసుని సంహారించుటకు ఉద్యుక్తుడైన, ఇంద్రస్య = ఇంద్రుని కొఱకు, ప్రాక్ = పూర్వము, అశ్విభ్యాం = అశ్వినీ దేవతలచేత, ప్రకల్పితం = తయారు చేయబడినది, తస్మాత్ = ఆకారణమువలన, ఏతద్ = ఈ అంజనమును, రాజ్ఞాం = రాజులకొఱకు, మహీం =

భూమిని, విజిగీషమాణానాం = భూమినిజయించు కోరిక గలవారలకు, రాజమహా
మాత్రానాం = రాజుతో సమానమైన ఐశ్వర్యవంతులకు, బ్రాహ్మణానాం =
బ్రాహ్మణులకు, వేదాధ్యయనం = వేదమునుచదువుట, అన్యాద్వా = లేక వేరేదైన,
మహత్ = గొప్పదైన, శాస్త్రం = శాస్త్రమును, అవగాహమానానాం = అవగా
హన చేసుకొనెడి వారి కొరకు, ప్రసన్నమనాః = ప్రసన్నమైన
మనస్సు గలవాడై, భిషక్ = వైద్యుడు, ప్రకల్పయేత్ = తయారు చేయ
వలెను, ఇతి = అని.

తాత్పర్యము : ఈ అంజనముయొక్క మహత్వమును గురించి ఇట్లుచెప్పు
చున్నాడు. అటు తరువాత పై సుదాహరించిన ధారణీ మంత్రమును జపించ
వలెను. మరియు ఈ మంత్రమును సాయంకాలమున, ఉదయమున, ప్రతిదినమును
దీనిని జపించుట వలన, మానవులు పవిత్రవంతులుగను, ఆరోగ్యవంతులుగను,
సమస్తవిషముల నుండి విముక్తి పొందిన వారుగను, అగుదురు. ఇట్టి మహత్తర
గుణములు ప్రసాదించు ఈ అంజనమును అశ్వినీ దేవతలు వృత్రాసురుడను
రాక్షసుని సంహరించుట కుద్యుక్తుడైన దేవేంద్రుని కొరకు మొట్టమొదట
తయారు చేసిరి. అప్పటి నుండి రాజుల కొఱకు, రాజుతో సమానమైన ఐశ్వర్య
వంతులకును, భూమిని జయించుటకు కోరికగల పరాక్రమవంతులకు, బ్రాహ్మ
ణుల కొఱకు, వేద పండితులకొఱకు, శాస్త్ర పండితులకొరకు, ప్రసన్నమనస్క
డైన వైద్యుడు తయారు చేయుచున్నాడు (చేయవలెను)

శశిలేఖ : ధన్యం సర్వార్థ సిద్ధాఖ్యం...భిషక్ ప్రకల్పయేదితిఅను సూత్ర
పర్యంతము శశిలేఖ వ్యాఖ్యానము వివరింపబడుచున్నది.

అథ అనునది మంగళ వాచకము. శుక్లపక్షము నందలి ద్వాదశ, నవమి
తిథులందు, పగలు, పుష్యమి మొ॥ నక్షత్రములలో ఏదియో ఒక నక్షత్రముచేత
చంద్రుడు సంయోగమును చెందినవాడగుచుండగా ప్రశస్తమైన ముహూర్తము
నందు, సింధునది యొక్క ప్రవాహములో పుట్టిన ఈ సౌవీరాంజనమును
గ్రహింపవలెను. ఈ సౌవీరాంజనము 8 భాగములు, ఒక భాగము కనకాదులు-
వీటన్నింటిని ముద్దగా చేసి, మూసయొక్క మధ్యలో నుంచి సమంత్రముగా
ప్రోక్షించి బలులు స్వస్తి వాచనములచేత అగ్నిని పూజించి చంద్రడ మొ॥ కట్టెల
చేత, సుగ్గుల చేత మండింపవలెను. ఈ మూసను ఆ అగ్నిలో నుంచవలెను. తరు
వాత అక్షతలు, పుష్పములు మొ॥వాటి చేత వృద్ధ వైద్యులను, బ్రాహ్మణులను
పూజించి తెల్లని వస్త్రములచేత, భూరి సంభావనలచేత వారిని సత్కరించవలెను.
తరువాత ఆ అగ్ని యందలి మూసలో నున్న ఈ అంజనమును శలాకచేత అటు
నిటు కదల్చుచూ గోమయస్వరసము మొ॥ వాటిలో యుంచవలెను. తరువాత
ఆ సౌవీరాంజనమును నీడలో నెండించి పొట్టు దీయబడిన కలబంద రసములో
కలిపి రాతిపై వేసి నూరి బంగారు భరిణెలోగాని, వెండి మొ॥వాని భరణిల్లో -

గాని ఆ అంజనమును జాగ్రత్తగా యుంచవలెను. తరువాత ఆ భరిణెను వైద్య గృహములో నుంచవలెను. తరువాత ఆ భరిణిని మరల స్వస్తివాచనాదులచేత శుద్ధిపరచి ఏనుగు అంబారి పైన యుంచి, పుష్పమాలలు వేసి మంగళతూర్య రావములతో వేద పఠనముతో స్వస్తి వాక్యములతో రాజగృహమును చేర్చవలెను.

మూ॥ అథ యోగాః ప్రవక్ష్యంతే బృహస్పతి కృతాః శివాః।
యాన్ సేవమానో నృపతిః శత్రుభ్యో నైతి వంచనామ్
బిల్వాఢకీ యవక్షార పాటలీ బాహ్లికోషణాః।
శ్రీపర్ణీ శాల్మలీ యుక్తా నిష్క్వాథః ప్రోక్షణం పరమ్॥
సవిషం ప్రోక్షయేత్ తేన సద్యోభవతి నిర్విషమ్।
యవ సైంధవ పానీయ శస్త్ర శయ్యాసనోదనమ్।
కవచాభరణ ఛత్ర బాలవ్యజన వేశ్మచ।
శేలు పాటల్యతి విషా శిగ్రు గోపీపునర్నవమ్।
సమంగా వృషమూల త్వక్కపిత్థ వృషశోణితమ్।
సహా దంతశఠం తద్వత్ ప్రోక్షణం విషనాశనమ్।
లాక్షా ప్రియంగు మంజిష్ఠా సమంగాల హరేణుకాః।
సయష్ట్యాహ్వా మధు సంయుక్తాః బభ్రుపిత్తేన కల్కితాః॥
నిఖనేద్గో విషాణస్థాః సప్తరాత్రం మహీతలే।
తతః కృత్వా మణింహేమ్నా బద్ధం హస్తేన ధారయేత్।
సంస్పృష్టం సవిషం తేన సద్యోభవతి నిర్విషమ్॥
మనోహ్వాల శమీపుష్పంత్వక్షీరశా శ్వేతసర్షపాః।
కపిత్థ కుష్ట మంజిష్ఠాః పిత్తేన సూక్ష్మకల్కితాః।
శునోగోః కపిలాయశ్చ సౌమ్యాభ్యోఽయంవరోఽగదః॥
విషజిత్ పరమం కార్యో మణి రత్నంచ పూర్వవత్
మూషికాజరుహా నాపి హస్తే బద్ధా విషాపహా॥

ప్రతిపదార్థము : అథ = తరువాత, బృహస్పతికృతాః = బృహస్పతి చేత చేయబడిన, శివాః = మంగళకరములైన, యోగాః = యోగములు, ప్రవక్ష్యంతే = చెప్పబడుచున్నవి, యాన్ = ఏ యోగములను, సేవమానః = సేవింపబడిన వాడై, నృపతిః = రాజు, శత్రుభ్యోః = శత్రువులనుండి, వంచనాం = మోసమును, నైతి = పొందడు, బిల్వ = మారేడు, ఆఢకీ = కందులు, యవక్షార = యవక్షారము, పాటలీ = కలిగొట్టు, బాహ్లిక = ఇంగువ లేక కుంకుమ పువ్వు, ఊషణాః = మిరియములు, శ్రీపర్ణీ = పెగ్గుమ్మడు, శాల్మలి = బూరుగ, పీటితో, యుక్తా = కలిపిన, క్వాథః = కషాయము, పరం = మిక్కిలి, ప్రోక్షణమ్ = ప్రోక్షణమునకు తగియున్నది, సవిషం = విషముతో గూడిన ద్రవ్యమును, తేనా = ఈ కషాయముతో, ప్రోక్షయేత్ = ప్రోక్షింపవలెను, తేన = ఈ ప్రోక్షణముతో,

సద్యః = వెంటనే, నిర్విషం = విషరహితమైనదిగా ఆ వస్తువు, భవతి = అగుచున్నది, యవస = యవసము (పశువులు మొ॥ తినునట్టి గడ్డి మొ॥), ఇంధన = కట్టెలు, పానీయ = పానయోగ్యమైన జలమందు, శస్త్ర = శస్త్రము, శయ్యా = పడక, ఆసనా = పీటలు మొ॥ ఓదనమ్ = అన్నము, కవచా = కవచము, ఆభరణా = తొడుగులు, ఛత్రా = గొడుగులు, చాలవ్యజనా = వింజామరలు, చ = మరియు, వేశ్మ = గృహము, సద్యః = వెంటనే, తేన = ఆకషాయముతో ప్రోక్షించుటచేత, నిర్విషం = విషరహితమైనదిగా, భవతి = అగుచున్నది, శేలు = విరిగి చెట్టు, పాటలీ = కలిగొట్టు, అతివిషా = అతివిష, శిగ్రు = మునగ, గోపీ = సుగంధిపాల, పునర్నవమ్ = తెల్లగలిజేరు, సమంగా = మంజిష్ట, వృషమూలత్వక్ = ఎలుక చెవిచెట్టు యొక్క మూలము, బెరడు, కపిత్థ = వెలగ, వృషశోణితం = ఎద్దు యొక్క రక్తము, సహాదంతశఠ = పులిచింతతో గూడ, తద్వత్ = వెనుకటి వలె, ప్రోక్షణమ్ = ప్రోక్షణము, విషనాశనం = విషమును నశింపచేయునదిగా, భవతి = అగుచున్నది.

లాక్షా = లక్క, ప్రియంగు = ప్రేంఖణము, మంజిష్ఠా = మంజిష్ఠా సమంగా = మునుగు దామర, ఆల = తాలకము, మధుయుతా = తేనెతోచేర్చి బభ్రుపిత్తేన = ముంగిస పిత్తముతో కలిపి, కల్కితాః = కల్కము చేయవలెను మహీతలే = భూమియందు, సప్తరాత్రం = ఏడుదినములు, గోవిషాణ స్థాన = ఈ కల్కము ఎద్దుకొమ్ములో యుంచి, నిఖనేత్ = పాతిపెట్టవలయును, తతః = దాని నుండి ఆ కల్కమును తీసికొని ఆ కల్కముతో, మణికృత్వా = మణి వలె గుండ్రముగాచేసి, హేమ్నా = బంగారముతో, బద్ధం = కవచమును చేసి, హస్తేన = హస్తముతో, ధారయేత్ = ధరించవలెను, సవిషం = విషముతోగూడిన పదార్థము, తేన = ఈమణిచేత, సంస్పృష్టం = తాకబడినయెడల, సద్యః = వెంటనే, నిర్విషం = ఆ పదార్థము విషరహితమైనదిగా, భవతి = అగుచున్నది.

మనోహ్వా = మణిశిల, ఆల = తాళకము, శమీపుష్ప = జమ్మి పువ్వులు, త్వక్ = దాల్చిన చెక్క, నిషా = పసుపు, శ్వేతసర్షపా = తెల్ల ఆవాలు, కపిత్థ = వెలగ, కుష్ఠ = చెంగల్వ కోష్ఠు, మంజిష్టాః = మంజిష్ట, ఈ ద్రవ్యముల యొక్క చూర్ణములు, శున = కుక్కయొక్క, కపిలాయాః = కపిలవర్ణముగల, గోః = ఆవుయొక్క, పిత్తేన = పిత్తముతో, శ్లక్ష్ణకల్కితాః = మృదువైన కల్కముగా చేయవలయును, సౌమ్యాఖ్యః = సౌమ్య అను పేరుగల, అయమగదః = ఈ అగదము, వరః = శ్రేష్ఠమైనది, పరమం = మిక్కిలి, విషజిత్ = విషమును జయించును, పూర్వవత్ = వెనుకటివలె, అనేన = దీనితో, అత్ర = ఇక్కడ, మణిః = మణి, కార్యః = చేయదగినది, మూషిక = ఎలుక చెవియాకు, వా = లేక, అజరుః = అజరుహము, ఈ రెంటిని, హస్తబద్ధా = చేతికి కట్టుట వలన, విషాపహా = విషము నశించిపోవును.

తాత్పర్యము : అంజనోపయోగమును చెప్పిన తరువాత బృహస్పతి చేత సిద్ధము చేయబడిన మంగళకరమైన యోగములను చెప్పుచున్నారు. రాజు ఈ యోగములను సేవించినవాడై శత్రువులతో మోసగింపబడడు.

మారేడు, కందులు, యవక్షారము, కలిగొట్టు, ఇంగువ, తెల్లమిరియాలు, పెగ్గుమ్మడు, బూరుగ వీటిని, విధిప్రకారము క్వాథముగా తయారుచేసి, విషముతో కూడిన పదార్థములపై చల్లిన ఎడల, ఆవిషముతో కూడిన పదార్థము లన్నియు వెంటనే విషరహితములగును. ఈ ప్రోక్షణముచాలా ఉత్కృష్ట మైనది. విషముతోకూడిన వంట చెరుకులు, త్రాగునీరు, పశువులుమొ॥ తినునట్టి కసవు, శస్త్రము, పడక, కూర్చుండు పీటలు మొ॥, అన్నము, సైనికులు ధరించు కవచములు, ఆభరణములు, గొడుగులు, వింజామరలు, గృహములు మొ॥ వస్తువులు ఈ క్వాథముతో ప్రోక్షించిన యెడల వెంటనే విషరహితములుగానగును. విరిగి చెట్టు, కలిగొట్టు, అతివిష, మునగ, సుగంధిపాల, తెల్లగలిజేరు, మంజిష్ఠా, ఎలుక చెవిచెట్టుయొక్క వేరు, బెరడు, వెలగ, ఆవుయొక్క రక్తము, పులిచింత వీటిని చూర్ణించి కషాయముపెట్టి ఆకషాయముతో విషముతోకూడిన వస్తువులపై ప్రోక్షించిన యెడల, ఆ వస్తువులు విషరహితములగును. లక్క, సెంఖణము, మంజిష్ఠ, మునుగు దామర, తాళకము, గోరెంట విత్తులు, యష్టి మధుకము వీటిని చూర్ణించి తేనెతో కలిపి ముంగిస పిత్తముతో కలిపి కల్కము చేయవలయును. ఆకల్కమును ఎద్దు కొమ్ములో నింపి భూమిలో 7 దినములు పాతిపెట్ట వలయును. తరువాత ఆ కొమ్మును వెలికి దీసి ఆ కొమ్ములో నుండు ద్రవ్యమును గుళికగాచేసి ఆ గుళికకు అపరంజి రేకుతో కవచమిచ్చి, చేతిలో కట్ట వలయును. ఆ చేతితో విషపదార్థములను తాకిన యెడల అవి వెంటనే నిర్విషములగును.

మణిశిల, తాళకము, జమ్మిపువ్వులు, దాల్చినచెక్క, పసపు, తెల్లమిరియాలు, వెలగ, చెంగల్వ కోష్ఠు, మంజిష్ఠ వీటిని చూర్ణించి, కుక్క లేక ఆవు యొక్క పిత్తముతో మెత్తగా మర్దించి, చిక్కగా చేయవలయును. దీనిని సౌమ్య అను పేరుగల అగదముగా చెప్పబడుచున్నది. ఇది చాల శ్రేష్ఠమైనది. విషమును జయించుటలో ఇది చాల ఉత్కృష్టమైనది. ఇచటకూడ వెనుకటివలె ఈ అగదమును గుళికగాచేసి వెనుకటి వలె యుపయోగింప వచ్చును. ఎలుక చెవియాకు అజరు:, ఈ రెంటిని చేతికి కట్టిన యెడల విషమును నశింప చేయును.

***శశిలేఖ*** : తరువాత, బృహస్పతి చేత సిద్ధము చేయబడిన యోగములు చెప్పబడు చున్నవి. ఈ యోగములను సేవించిన, రాజు శత్రువులనుండి మోసపోడు. బిల్వాది క్వాథముచేత విషముచేత కూడిన గడ్డి మొ॥ వాటిని ప్రోక్షించిన యెడల అవి వెంటనే విషరహితములగును. ఆఢకి యనగ కందులని యర్థము. బాహ్లీక మనగ కుంకుమ పువ్వని అర్థము. గోపి యనగా సుగంధి

పాల, దంతశఠ యనగ పులిచింత యనియు, మాదీఫలమనియు అర్థము. లాక్షాదులు తేనెతో కలిపి, ముంగిస పిత్తముతో కల్కముగా తయారుచేసి, ఆ కల్కమును, ఆవు కొమ్ములో నుంచి 7 దినములు భూమిలో పాతిపెట్ట వలయును. తరువాత ఆ కొమ్ములోని ఔషధము గుళికగా తయారుచేసి, అపరంజి రేకుతో కవచ మియ్యవలెను. తరువాత ఆ మణిని చేతికి కట్టుకొన వలయును. మణి కట్టుకొన్న చేతితో విషముతో కూడిన వస్తువులను తాకిన యెడల విషరహితములుగా నగును. మణిశిల మొ॥ వాటిని, కుక్క పిత్తముతోగాని కపిల గోవుయొక్క పిత్తముతోగాని చక్కగా మర్దించి, పిష్టముగా తయారు చేయవలెను. వెనుకటి అగదమున కంటె, ఈ అగదము విషనాశనము నందుత్కృ ష్టమైనది. ఈ అగదము పేరు సౌమ్యయని పెట్టబడినది. మూషిక యను ఓషధి నేపాళముగా చెప్పబడుచున్నదని కొందరు చెప్పుచున్నారు. అజరుహా యనగా ప్లక్షురుహా అని యర్థము. ఈ రెండు మూలికలను చేతికి కట్టిన యెడల, విష నాశకములుగా నుండును.

మూ॥ హరేణు మాంసీ మంజిష్ఠా రజనీ మధుకం మధు।
అక్షత్వక్సురసం లాక్షా శ్వపిత్తం పూర్వవన్మణిః-111
వాదిత్రాణి పతాకాశ్చ పిష్టైరేభిశ్చ లేఖితాః।
శ్రుత్వా దృష్ట్వా సమాఘ్రాయ సద్యోభవతి నిర్విషః ॥112॥

ప్రతిపదార్థము : హరేణు = తక్కోలము, మాంసీ = జటా మాంసీ మంజిష్ఠా = మంజిష్ఠా, రజనీ = పసుపు, మధుకం = మధుయష్టి, మధు = తేనె, అక్షత్వక్ = తానిక్కాయవలుపు, సురసం = తులసి, లాక్షా = లక్క-ఈ ద్రవ్యము లను, శ్వపిత్త = కుక్కపిత్తమును, పూర్వవత్ = వెనుకటివలెనే, మణిః = గుళిక (చేసి) చేతికి కట్టవలెను, ఏభిః = ఈ ద్రవ్యములతో, వాదిత్రాణి = మద్దెల మొ॥ వాటిని, చ = మరియు, పతాకాః = పతాకములను (జండాలను), లేపితాః = లేపము చేయవలయును, శ్రుత్వా = దుందుభి స్వనములను విని, దృష్ట్వా = దుందుభి మొ॥ వాటిని చూచుట చేత, సమాఘ్రాయ = వాసన చూచి, సద్యః = వెంటనే, నిర్విషః = విషరహితముగా, భవతి = అగుచున్నది.

తాత్పర్యము : తక్కోలములు, జటామాంసి, మంజిష్ఠా, పసుపు, మధు యష్టి, తేనె, తానిక్కాయ వలుపు, తులసి ఆకులు, లక్క, ఈ ద్రవ్యములను చూర్ణించి, కుక్కపిత్తమును వేసి నూరి. వెనుకటివలె గుళికగ చేసి, దానిపై స్వర్ణమును చుట్టి, చేతికి కట్టుకొనవలయును. ఇదిగూడ విషహర అగదముగ పేర్కొనబడినది. మణి, గోలీ, తాయెత్తు మొ॥ పేర్లతో ప్రసిద్ధమైనది. సిద్ధ మైన ఔషధములను ధరించుటచేత, విషమ జ్వరములు మొ॥ శాంతి చెందును. వీటిని మనము ప్రత్యక్షముగ చూచుచున్నాము. పై నుదాహరించిన మణి నిర్మాణమున కుపయోగించిన ఓషధులను చెప్పబడిన ద్రవ్యములతో నూరి,

లేపముగ తయారుచేసి, మద్దెలలకు, పటహాములకు, దుందుభులకు, జండాలకు లేపము చేయవలయును. లేపము చేసిన తరువాత దుందుభులను ప్రయోగించిన యెడల సమస్త విషపూరితములైన స్థావర జంగమాదులు ఆ దుందుభి స్వన మెంతమేరకు జనునో నంతవరకు విషరహితములుగా నగును. పతాకములను చూచి వాటిపై నుండి ఎగురు ఓషధులకు, వాసన చూచిన ప్రాణులకు కూడ తత్కాలమునందు విషబాధలు సంభవించవు.

శశిలేఖ : తక్కోలములు మొ॥ ద్రవ్యములను కుక్కపిత్తముతో కలిపి నూరి ముద్దగా చేసి గుళికగా చేయవలెను. తక్కిన విధి వెనుకటివలె నాచరింప వలెను. ఈ ద్రవ్యముల చేతనే తయారు చేయబడిన కల్కమును దుందుభి మొ॥ వాటిపై పూసిన తరువాత వాటినుండి వచ్చు శబ్దములను వినుటగాని, వాసన చూచుట గాని చేసిన యెడల వెంటనే విషపూరిత వస్తుజాలమంతయు నిర్విష ముగా నగును.

మూ॥ త్ర్యూషణం పంచలవణం మంజిష్ఠాం రజనీ ద్వయమ్।
సూక్ష్మైలాం త్రివృతాం పత్రం విళంగానీం ద్రవారుణీమ్॥
మధుకం చేతి సక్షౌద్రం గోవిషాణే నిధాపయేత్।
తస్మాదుష్ణాంబునా మాత్రాం ప్రాగ్భక్తం వినియోజయేత్॥
విషం భుక్తం జరాం యాతి నిర్విషేఽపినదోషకృత్।
జతుసర్జరసోశీర సర్షపా పత్రవాలకైః॥
సవేల్లా రుష్కరపురైః కుసుమై రర్జునస్యచ॥
ధూపో వాస గృహే హన్తి విషం స్థావరజంగమమ్॥
నతత్ర కీటాః సవిషాః నోన్దురాన సరీసృపాః॥
నకృత్యాః కర్మణాద్యాశ్చ ధూపోఽయం యత్రదహ్యతే ॥-118॥

ప్రతిపదార్థము : త్ర్యూషణం = శుంఠి, పిప్పళ్ళు, మిరియములు, పంచ లవణమ్ = సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, సముద్రలవణము, కాచలవణము, మంజిష్ఠాం = మంజిష్ఠను, రజనీద్వయం = పసుపు, మానీ పసుపు, సూక్ష్మైలాం = చినఏలకులను, త్రివృతాః = తెగడను, పత్రం = ఆకుపత్రిని, విళంగాని = వాయు విడంగములను, ఇంద్రవారుణీం = పెద్దపాపరను, మధుకం = మధుయష్టిని, సక్షౌద్రం = తేనెతోకూడ, గోవిషాణే = ఆవు కొమ్ములో (నింపి), నిధాపయేత్ = ఉంచవలయును, తస్మాత్ = ఆకారణము వలన, తథా = అట్లే, ప్రాగ్భక్తమ్ = భుజించుటకు పూర్వము, మాత్రాం = 8-10 గురిగింజల తూకముగల మాత్రను, ఉష్ణాంబునా = వేడినీటితో, వినియోజయేత్ = ఉపయో గింపవలెను, (తినవలెను), భుక్తం విషం = భుజింపబడిన విషము, జరాంయాతి = జీర్ణమగును, నిర్విషేఽపి = విషము లేకున్నప్పటికిని, నదోషకృత్ = హానిని కలిగించదు. జతు = లక్క, సర్జరస = సర్జరసము, ఉశీర = వట్టివేళ్ళు, సర్షపా =

ఆవాలు, పత్ర=ఆకుపత్రి, బాలవై=కురువేరు, ఈ ద్రవ్యములచేత, వేల్ల=విడంగములు లేక మిరియములు, అరుష్కర = జీడిమాను (జీడి), పురైః=గుగ్గులు, ఈ ద్రవ్యములచేత, అర్జునస్య=మద్దియొక్క, కుసుమైః=పుష్పముల చేత, వాసగృహే=నివాసభవనమునందు, ధూపం=వేయబడిన ధూపము(పొగ), స్థావరజంగమమ్=స్థావర జంగమములకు సంబంధించిన, విషం=విషమును, హన్తి=చంపును (నష్టమైపోవును), తత్ర=ఆ వాసగృహమునందలి, సవిషాః=విషముతో కూడిన, కీటాః=పురుగులు, ఉన్దురాః=ఎలుకలు, సరీసృపాః=పాములు, నతిష్ఠంతి=ఉండవు, యత్ర = ఎక్కడ, అయం=ఈ, ధూమః =పొగ దహ్యతే=వేయబడుచున్నదో (కాల్చబడుచున్నదో), తత్ర=అక్కడ, కృత్యా=మారణ ఉచ్చాటనాది మోహనాది కృత్యములు, కర్మణాద్యాః = కామణ మొ॥ యోగములతో గూడిన కర్మలుగూడ, నభవంతి=ఉండవు.

**తాత్పర్యము :** శుంఠి, పిప్పళ్ళు, మిరియములు, సైంధవ లవణము, సౌవర్చలవణము, బిడాలవణము, కాచలవణము, మంజిష్ఠ, పసుపు, మాని పసుపు, చిన్నఏలకులు, తెగడ, ఆకుపత్రి, వాయు విడంగములు, పెద్ద పాపర, ఈ ద్రవ్యములను బాగుగా చూర్ణించి, అంతయు బాగుగా కలిసిన తరువాత, ఆవు కొమ్ములో నింపి ఉంచవలయును. భోజనము చేయుటకు ముందు 8-10 గురిగింజలఎత్తు అగదమును, వేడినీళ్ళలోకలిపి తాగించవలెను. ఇట్లు ఈ అగదమును సేవించిన యెడల, విషసహిత భోజనమును భుజించి నప్పటికిని, ఆ విషము వెంటనే జీర్ణమగును. భోజనమునందు విషము లేకున్నను ప్రత్యవాయ ముండదు. లక్క, సర్జరసము, వట్టివేళ్ళు, ఆవాలు, ఆకుపత్రి, కురువేరు, వాయు విడంగములు, జీడి (భల్లాతకము), గుగ్గులు, మద్ది పుష్పములు వీటన్నింటిని చూర్ణించి నిప్పులపైన వేసి, నివాస గృహములలో పొగవేసిన యెడల స్థావర జంగమ రూపమైన విషముహరించి పోవును. మరియు ఆ నివాస గృహమందు సంచరించు విషజంతువులైన పురుగులు, ఎలుకలు, పాములు ఉండవు. మరియు, మారక ప్రయోగములు. ఫలించవు. "కామణా" అను పేరుతో అనేకవిధములైన ప్రయోగములు కలవు. అధర్వవేదమునందు చెప్పబడిన శాబరమన్త్రముల చేత మారణాది ప్రయోగములు చెప్పబడినవి. సౌభాగ్యము కొరకుస్త్రీలు, ప్రేమ కొరకు పురుషులు, వశీకరణమంత్రముల చేత వశీకరణము చేయుదురు. ఈ విషయములు ఆయుర్వేదము నందు భూతవిద్య అను పేరుతో ప్రకరణము గలదు. దానియందు విపులీకరించి యున్నారు. వీటినే ఆభిచారిక క్రియలని చెప్పుదురు.

*శశిలేఖ :* త్ర్యూషణాదులను తేనె కలిపి లేపముగా చేసి గోశృంగము నందుంచ వలెను. తరువాత స్వల్ప ప్రమాణమైన మాత్రతో భుజించుటకు ముందు, వేడినీటితో సేవింప వలయును. పై అగదముచేత కోష్ఠము సంస్కరింప బడినదై అందలి విషమును నిర్విషముగ జేయబడును. ఇన్ద్రవారుణీ=గవాక్షీ

యని అర్థము. ఆరోగ్యవంతునికి భోజనమునకు ముందు ఇవ్వబడిన ఔషధము చేత విషము నిర్విష మగును. విషములేకున్నను ప్రత్యవాయ ముండదు. విష జంతువుల కాలవాలమైన నివాస భవనములలో విషహర ధూపము వేసిన యెడల ఆ విష జంతువులు ఆ దరిదాపులకు రావు. మారకాది ప్రయోగములు ఫలింపవు.

మూ॥ శిఖిపిచ్ఛం వలాకాస్థి సర్షపాశ్చందనం ఘృతమ్।
ధూపో విషఘ్నః శయన వసనాసన గేహగః।
విశాలా వ్యోషమంజిష్ఠా యష్టీ లవణపంచకం।
ద్వినిశా పత్ర వేల్లైలా త్రివృచూర్ణం సమాక్షికమ్॥
పూర్వోక్తం త్ర్యూషణాదించ స్నానీయేఽమ్భసి యోజయేత్।

ప్రతిపదార్థము : శిఖిపిచ్ఛం = నెమలి పింఛము, వలాకాస్థి = తెల్ల కొక్కెర పక్షియొక్క ఎముక, సర్షపా = ఆవాలు, చందనం = శ్వేతచందనము (వీటిని చూర్ణించి), ఘృతమ్ = నేతిని(కలిపి), శయన వసనాసన గేహగః = పండు కొను పరుపులపైన, ధరించు వస్త్రములపైన, కూర్చుండు ఆసనములపైన, గృహోపకరణముల పైన వేయబడిన, ధూపః = పొగ, విషఘ్నః = విషము యొక్క ప్రభావమును నశింపజేయును, విశాలా = చేదుపుచ్చ, ఓష = శుంఠి, పిప్పళ్ళు, మిరియాలు, మంజిష్ఠా = మంజిష్ఠ, యష్టి = మధు యష్టి, లవణ పంచకం = పంచ లవణములు, ద్వినిశా = పసుపు, మాని పసుపు, పత్రా = ఆకు పత్రి, వేల్ల = మిరియములు, ఏల = ఏలకులు, త్రివృత్ = తెగడ(వీటిని) చూర్ణం = మెత్తగ చూర్ణించి, సమాక్షికమ్ = తేనె కలిపి, పూర్వోక్తం = వెనుక చెప్ప బడిన, త్ర్యూషణాదించ = త్ర్యూషణాదిచూర్ణమును, స్నానీయే = స్నానమున కుపయోగించు, అమ్భసి = నీటియందు, యోజయేత్ = కలుపవలెను.

తాత్పర్యము : నెమలి పింఛమును, తెల్లకొక్కెర పక్షి యొక్క అస్థు లను, ఆవాలను, చందనమును బాగుగా చూర్ణించి, నేతితో కలిపి, పండుకొను పరుపుల పైన, ధరించువస్త్రములపైన కూర్చుండు పీటలపైన, ఇంటిలో వేయబడిన ధూపము, విషముయొక్క ప్రభావమును నశింపచేయును. చేదుపుచ్చ, శొంఠి, పిప్పళ్ళు. మిరియములు, మంజిష్ఠా, మధుయష్టి, పంచలవణములు పసుపు, మానిపసుపు, ఆకుపత్రి, మిరియములు, ఏలకులు, తెగడ వీటిని సమభాగములుగా గ్రహించి చక్కగా చూర్ణించి, ఆ చూర్ణమునందు తేనె కలిపి, మరియు వెనుక చెప్పబడిన త్ర్యూషణాది చూర్ణమును అందులో చేర్చి స్నానమున కుపయోగించు నీటిలో చల్లవలెను.

మూ॥ శ్వావిథోఽథవాఽర్క కుసుమ శ్వేతాపామార్గ సర్షపైః।
నదధ్యాజ్యైః కృతో యుక్తైః కతకా నాకులీ ద్వయైః।
కలోంగ్రా చన్దన క్షీరి పలాశ ద్రుమ వల్కలైః

మూ॥ ర్వైలవాలు మరస నాంలీ తండులీయ కైః।
క్వాథః సర్వోదక కార్యేషు కాకమాచీ యుతైర్హితః॥

ప్రతిపదార్థము : అథవా=అట్లు కానియెడల, అర్కకుసుమా=జిల్లేడు పూవులు, శ్వేతా=వస (దింసెన), అపామార్గ=ఉత్తరేణి,సర్షపై ః=ఆవాలు, ఈ ద్రవ్యములచేత, కృతకా=కామంచి, నాకులీద్వయైః = రెండు విధములైన రాస్నా భేదములు, ఈ ద్రవ్యములచేత, క్వాథః=కషాయము, కుర్యాత్= చేయవలెను. తస్మిన్ = ఆ కషాయము నందు, సదధ్యాజ్యాః = పెరుగు, నెయ్యి కలిపి, అథవా=అట్లు కాని పక్షమున, చందన=శ్వేత చందనమును, క్షీర= మర్రి, పలాశ=మోదుగ, ద్రుమ=మోదుగ వీటియొక్క, వల్కలైః=పట్టల చేత, కాకమాచీ = కాకమాచి, యుతైః = చేర్చబడినట్టి, మూర్వా=చాగ, ఏలవాలు=ముసాంబ్రము, సురస=తులసి ఆకులు, నాకులీ=రాస్నా భేదము, తండులీయకైః=చిర్రివేళ్ళచేత, క్వాథః=క్వాథము,సర్వోదకార్యేషు=సమస్త మైన నీటిలో చేయుకార్యములందు, హితః=హితకరమైనది,

తాత్పర్యము : అట్లు కానియెడల, జిల్లేడుపూలు, దింసెన, ఉత్తరేణు, ఆవాలు, కామంచి, రాస్నా, మహారాస్నా, వీటిని చక్కగా దంచి, విధి ప్రకారముగా కషాయముకాచి, ఆ కషాయములో పెరుగు, నెయ్యి కలిపిగాని, లేక శ్వేత చందనము, మర్రి, మోదుగ, మేడి వీటియొక్క పట్టల చేత చాగ, ముసాంబ్రము, తులసి ఆకులు, సన్నదుంపరాస్నము, చిర్రి వేళ్ళు, ఈ ద్రవ్య ములచేత గూడిన, కాకమాచిని గలిపి, కషాయముపెట్టి, ఆ కషాయమును గాని, సమస్త కార్యముల కుపయోగించు నీళ్ళలో గలుపవలెను. ఇది చాలా హితకరమైనది.

మూ॥ రోచన పత్ర నైపాళీ కుంకుమైస్తిలకాన్బహూన్।
విషైర్నబాధ్యతేశ్యాళ్ళ నారీ నరనృప ప్రియః॥

ప్రతిపదార్థము : రోచన=గోరోచనము,పత్ర=ఆకుపత్రి,నైపాళీ=మణి శిలా,కుంకుమైః=కుంకుమ పువ్వు.వీటిచేత,తిలకాన బహూన్=ఎక్కువ నువ్వు లను,విషైః=విషముల చేత, నబాధ్యతే=బాధింప బడదు, నారీనరనృప ప్రియః= స్త్రీలకు, పురుషులకు, రాజులకు ప్రియమైనదిగా, శ్యాత్=అగును,

తాత్పర్యము : గోరోచనము, ఆకుపత్రీ, మణిశిల, కుంకుమ పువ్వు, వీటిని చక్కగా చూర్ణించి, ఎక్కువ భాగము నువ్వులను తీసుకొని, వీటిని గూడా చూర్ణించి, రెండు చూర్ణములను, ఒకచోట కలిపి, నీళ్ళుపోసి, మెత్తగ నూరి నుదుపైన తిలకముగా ధరించినయెడల విషముచేత కలుగు బాధలు యుండవు. ఈ తిలకము, స్త్రీలకు, పురుషులకు, రాజులకు గూడ ఇష్టమై నదిగా నుండును.

మూ॥ చూర్ణైర్హరిద్రా మంజిష్ఠా కిణిహీ కణ నింబజైః।
దిగ్ధం నిర్విషతామేతి, గాత్రమిత్యాహ గౌతమః।
నస్యపానాంజ నాలేపై ర్యుంజ్యాత్ సంజీవనాదికాన్॥
అగదా న్విష జగ్ధస్య తీక్ష్ణాని వమనాని చ।
పిప్పలీ మధుక క్షౌద్ర శర్కరేక్షురసైః సహ।
ద్వినిశా పత్ర వేల్లైలా త్రివృచ్చూర్ణం సమాక్షికమ్। 127
విరేచనం సిరామోక్షం ప్రాప్తం విస్రావణం యది।

ప్రతిపదార్థము : హరిద్రా=పసుపు, మంజిష్ఠా=మంజిష్ఠా కిణిహీ=ఉత్తరేణువిత్తులు, నింబజైః=వేపపట్ట వీటిచేత, దిగ్ధం=పట్టించ బడిన, గాత్రం=శరీరమును, నిర్విషతాం=విషరాహిత్యమును, ఏతి = పొందుచున్నది. ఇతి=అని, గౌతమః=గౌతమమహర్షి, ఆహ=పలికెను, సంజీవనాదికాన్ అగదాన్ = విష ప్రతిషేధాధికారమునందు చెప్పబడిన సంజీవనము మొ॥ అగదములను, నస, పానాంజనాలేపైః = నస్యము, పానము, అంజనము, ఆలేపములచేత యుంజ్యాత్ = ప్రయోగింప బడవలెను. విషజగ్ధస్య = విషమును భుజించిన మనుజునికి, పిప్పలీ మధుక క్షౌద్ర శర్కరేక్షురసైః సహ=పిప్పళ్ళు, మధుయష్టి, తేనె, శర్కర, చెరుకురసము, వీటితోగూడ, తీక్ష్ణాని=తీక్ష్ణములైనని వమనాని=వమనములను, దద్యాత్ = ఇయ్యవలయును. ద్వినిశా పత్ర వేల్లైలా, త్రివృచ్చూర్ణం = పసుపు, మాని పసుపు ఆకుపత్రి, మిరియములు, ఏలకులు, తెగడ, వీని యొక్క, చూర్ణమును, సమాక్షికం = తేనెను కలిపి, విరేచనం= విరేచనము కొరకు, దద్యాత్=ఇయ్యవలయును, రక్తసిరామోక్షణం యది= మోక్షణముయొక్క అవసరమున్న యెడల, విస్రావణం=సిరా మోక్షము. రపాప్తం=పొందదగినది (చేయవలెను).

తాత్పర్యము : పసుపు, మంజిష్ఠా, ఉత్తరేణు విత్తులు, వేపపట్ట, వీటి. చూర్ణించి, శరీరము పైన పట్టించిన యెడల, శరీరము విషరహితమైనదిగా నగును ఈ విషయమును గౌతమ ఋషి చెప్పెను. విష ప్రతిషేధాది కార్యమునందు చెప్పబడిన సంజీవనాది అగదములను నశ్యము చేయుట కొరకు, పానము చేయించుటకొఱకు, లేపము చేయుటకు ఉపయోగింప వలెను. విషమును భుజించిన మానవునికి పిప్పళ్ళు, మధుయష్టి, తేనె, శర్కర, చెఱకు రసము ఇవి కలిపి తీక్ష్ణమైన వమనౌషధములను ఇప్పించి వమనములను చేయించ వలెను. పసుపు, మానిపసుపు, ఆకుపత్రి, మిరియములు, పలకులు, తెగడ, వీటిని చక్కగ చూర్ణించి, తేనెలో కలిపి, విరేచనము కొరకు ఇయ్యవలెను. ఒక వేళ వైద్యుడు రక్తమోక్షణముగూడ అవసరమని తోచిన యెడల సిరామోక్షణమును గూడ చేయవలయును.

మూ। హృదయావరణం కార్యం ప్రాగేవ హితమిచ్ఛతా।
పిబేద్ఘృత మజేయాఖ్య మమృతంచాప్య భుక్తవాన్'
సర్పిః క్షౌద్రం దధిక్షీర మంతతః శీతలం జలమ్॥

శితా మధుక పాలిందీ కల్కవన్మాంస మిష్యతే।
గోధాహరిణ బభ్రూణాం సకణా శుంఠీ పార్షతమ్॥
నాగరం సాతివిషం శిఖినః ససితోపలమ్।
సుశీతాః సఘృతాశ్చైషాం యథాస్వం కల్పితారసాః—131
విషపీతాయ దద్యాచ్చశుద్ధాయోర్ధ్వ మథస్తథా।
సూక్ష్మం తామ్ర రజః కాలే సక్షౌద్రం హృద్విశోధనమ్—132

ప్రతిపదార్థము: హితం = క్షేమమును, ఇచ్ఛతా = కోరుచున్న
...డు, ప్రాగేవ = అన్నిటి కన్నముందే, హృదయావరణం =
...ల హృదయ స్థానముయొక్క రక్షణము, కార్యం = చేయదగినది,
...క్తవాన్ = భుజించని వాడైరాజు, అజేయాఖ్యం = అజేయ
పేరుగల; చ = మరియు, అమృతం = అమృతమను పేరుగల,
...ం = ఘృతమును. పిబేత్ = పానము చేయవలెను, సర్పిః = నేయి, క్షౌద్రం =
దధి = పెరుగు, క్షీరం = పాలు, వీటిని, అంతతః = చిట్టచివరన, శీతలం
= చల్లని నీటిని, పిబేత్ = త్రాగ వలయును, గోధా = ఉడుము, హరిణా =
బభ్రూణాం = ముంగిస వీటియొక్క మాంసముతో. సితా = శర్కర,
...కా = మధుయష్టి, పాలిందీ = నల్లతెగడ. వీటి యొక్క, కల్కవత్ =
మువలె, మాంసం = మాంసము. పార్షతమ్ = పృషతమను పేరు జింక
...క మాంసములో. సకణా శుంఠీ = శుంఠి, పిప్పళ్ళు కల్కము, శిఖినః =
...యొక్క మాంసములోను చేర్చియు, ఇష్యతే = కోరబడుచున్నది, ననాగ
శుంఠిని, సాతివిషం = అతివిసను. ససితోపలం = కలకండ చూర్ణమును
... తథా = అట్లే, యథాస్వం = తగినట్లు లభించిన, ఏషాం = ఓషధులతో
...రు చేసిన మాంస రసములతో, సఘృతాః = నేయికలిపి, కల్పితాః = కల్పన
..., రసాః = మాంస రసములను, సుశీతాః = చల్లగాచేసి, పిబేత్ = త్రాగ వల
..., విషపీతాయ = విషమును త్రాగినటువంటి మానవుని కొరకు, ఊర్ధ్వం =
...ముచేతను, తథా = అట్లే, అధః = విరేచనముచేతను, శుద్ధాయా = శోధనము
తరువాత, కాలే = ఔషధోపయుక్త కాలమునందు, హృద్విశోధనం =
...యమును శుద్ధిపరచునట్టి, సూక్ష్మం = మిక్కిలి మెత్తనైన, తామ్రరజః =
...భస్మమును, సక్షౌద్రం = తేనెతో గూడ, దద్యాత్ = ఇవ్వవలయును.

తాత్పర్యము: శత్రుమధ్యమున యుద్ధము చేయుటకు నిల్చున్న రాజు
...క హృదయమునకు బలమును చేకూర్చుటకు అన్నిటికంటె ముందు
...ను కల్పింపవలెను. ఆహారము సంపూర్ణముగా జీర్ణమైన శూన్యకుక్షిగల
...కి, అజేయ ఘృతమును, అమృత ఘృతమును పానము జేయింపవలెను.
ఘృతము ఉత్తరస్థానమున 40వ అధ్యాయములో నున్నది) ఈ ఘృతములు
...ని యెడల నెయ్యి, తేనె, పెరుగు, పాలు త్రాగవలయును. ఇవి కూడా
...ని యెడల చల్లని నీరు త్రాగవలయును. ఉడుము, జింక, ముంగిస వీటి

యొక్క మాంసములో కలకండ, మధుయష్టి, నల్ల తెగడను, కల్కముగా చేసి కలిపిగాని లేక, పృషతమను జింకయొక్క మాంసములో పిప్పళ్ళను, శుంఠిని, కల్కముచేసి, చేర్చియు, నెమలి మాంసములో శుంఠి, అతివిష మరియు కల కండ చూర్ణమును, కలిపియు, అట్లే యోగ్యమైన పరికల్పనకు ఉపయుక్త మైన ఓషధులతో, తయారు గావించిన మాంసరసమునందు ఆ నేతిని కలిపి, కాచి, చల్లార్చి తాగవలెను. విషము త్రాగిన మానవుని కొఱకు, వమన విరేచనము లను చేయించి అతని కోష్ఠమును శుద్ధిపరచిన తరువాత ఔషధ కాలమునందు హృదయమును శోధించి, సుచూర్ణితమైన తామ్ర భస్మమును తేనెతోగూడా ఇవ్వవలెను.

విషమును పానము చేసిన మానవుడు ఇంటిలోని వాయువుతో గూడిన, పొగతో సమానమైన నల్లని మలమును విసర్జించును. మరియు కడుపుబ్బరము, వేడి, వివర్ణత, బాధ వీధ పిట్లతోగూడి యుండును. నురుగుతోగూడిన వమన మును చేయును. ఈ లక్షణములనుబట్టి విషము త్రాగిన వానియొక్క లక్షణము గ్రహించ వలెను.

మూ॥ శుద్ధేహృది తతః శాణం హేమ చూర్ణస్య దాపయేత్।
నసజ్జతే హేమపాంగే పద్మపత్రేఽమ్బు వద్విషమ్।
జాయతే విపులాం చాయుర్గ రేఽప్యేషవిధిః స్మృతః॥
ఇత్థం గర విషాదిభ్యో రక్షేద్వైద్యో నరేశ్వరమ్।
స్యాదుచ్ఛేదస్తదుచ్ఛేదా త్ప్రజానాం సర్వకర్మణామ్।
ఆజ్ఞా ధైర్యక్షమా త్యాగా మానుషత్వేఽప్య మానుషాః—135
యద్రాజ్ఞః కర్మణి స్తస్మాదారాధ్యోఽసావతీన్ద్రియైః॥

ప్రతిపదార్థము : హృది=హృదయము, శుద్ధేసతి=శుద్ధమైనదిగా అగు చుండగా, తతః=తరువాత, హేమచూర్ణస్య = బంగారు చూర్ణముయొక్క, శాణం= రెండుగురిగింజలయెత్తు చూర్ణమును, దాపయేత్=ఇప్పించ వలయును, హేమపా=బంగారమును పానము చేయువాని యొక్క, అంగే=శరీరమునందు, విషం=విషము, నసజ్జతే = అంటుకొనదు. పద్మపత్రే=తామరాకు యందలి, అంబువత్ =నీటివలెన, విపులం = దీర్ఘమై, ఆయుః=జీవితము, జాయతే=కల్గు చున్నది, గరేఽపి=కృత్రిమ విషమునందుగూడ, ఏషవిధిః = ఈ విధియే స్మృతః=స్మరింప దగినది, ఇత్థం = ఇట్లు, వైద్యః=రాజ వైద్యుడు, విషగ రాదిభ్యః = విషం గరవిషము మొ॥ వాటి నుండి, నరేశ్వరం = చక్రవర్తిని, రక్షేత్ =రక్షించవలెను, తదుచ్ఛేదః=రాజు యొక్క నాశము, ప్రజానాం= ప్రజలకు సంబంధించిన, సర్వకర్మణాం= సమస్తమైన పనులకు, ఉచ్ఛేదః=నాశ ముగా, స్యాత్ = అగును, మానుషత్వేపి=రాజు ఇతరమానవులతో సమాను డుగా యుండునప్పటికిని, ఆజ్ఞా=ఉత్తర్వును, ధైర్యా=ధైర్యమును, క్షమా=

ఓర్పును,త్యాగ = త్యాగము మొ॥ కర్మలు,అమానుషాః =అమానుషీయములుగా నున్నవి, తస్మాత్ =ఆ కారణము వలన, అసౌ =ఈ వైద్యుడు, అతీంద్రియైః = మానసిక సంబంధములైన, కర్మభిః = కార్యములతో, రాజ్ఞః=రాజు, ఆరాధ్యః=ఆరాధింప దగిన వాడు.

తాత్పర్యము : రాజ వైద్యుడు ఈ ప్రకారముగా విషగరాది విషముల నుండి రాజును రక్షింప వలెను. ఎందుకనగా రాజు నశించిపోయిన యెడల ప్రజల యొక్క సమస్త కార్యములు చెడిపోవును. రాజు మానవుడు వలెనుండును. అతడు గూడ, మానవ మాత్రుడే. కాని అతనియొక్క ఆదేశములు, ధైర్యము, క్షమా, త్యాగము ఇవన్నియు మానవులకంటె అతనియందు విలక్షణనులుగా నుండును. అందు కొరకు బుద్ధి పూర్వకముగా రాజును ఆరాధింపవలెను. బుద్ధి పూర్వకముగా రాజు సన్నిధిలో యుండవలెను. ఏకాదశేంద్రియములతో బద్ధుడు గాక, వాటి నధిగమించి, రాజును, సర్వదా సంతుష్టి పొందింప వలెను. అనగా జితేంద్రియుడుగా నుండవలెనని భావము. ఎల్లప్పుడును తొట్రుపాటు పడక, వైద్యుని సర్వకాలములయందు రాజును రక్షించుటకు ప్రయత్నశీలుడుగా నుండవలెడు

శశిలేఖ : శిఖి పిచ్ఛం మొదలు అసావతీంద్రియైః అను శ్లోకము వరకు శశిలేఖ వ్రాయుచున్నాను.

నెమలి పింఛము మొ॥ వాటిని చూర్ణించి తేనెలో కలిపి శయనాదుల యందు ధూపము వేసిన విషహారముగా నుండును. అట్లే స్నానమున కుపయోగించు నీటిలో వెనుకచెప్పబడిన త్ర్యూషణాదిచూర్ణమును వేసినయెడ,విషము వలన, సంభవించు యుపద్రవములుండవు. అట్లుకాని పక్షమున ధవవృక్షము మొదలగు వాటితో కామంచి మొ॥ ద్రవ్యములతోను చేయబడిన కషాయములో పెరుగు, నెయ్యి కలిపి స్నానజలములో వేయవలెను. లేక చన్దనము, మర్రి, మోదుగ మొ॥ ద్రవ్యముల యొక్క పట్టలను కషాయము చేసి, ఆ కషాయమును స్నానమున కుపయోగించు నీటిలో కలిపి స్నానమాచరింప వలయును. ఇదియు విషహారముగా చెప్పబడినది. నాకులీయనగా సర్పాక్షీయని అర్థము. పలావాలుకం అనగా వాలుకము అని అర్థము. గోరోచనాదులచేత, ఫాలభాగము నందు తిలకమును దిద్దుకొనవలయును. ఈ తిలకము విషమును హరించును. స్త్రీలకు పురుషులకు మహారాజులకిది ప్రియమైనది. నైపాళ శబ్దముచేత మనశ్శిల యని చెప్పబడుచున్నది. విషపూరితమైన శరీరమును హరిద్రాది చూర్ణము చేత రుద్దినయెడల శరీరము విషరహిత మగునని గౌతమఋషి చెప్పెను. తరువాత చెప్పబడు విష ప్రతిషేధ ప్రకరణము నందలి సంజీవనాదిఅగదములను నస్యాది కర్మలయందు ప్రయోగింప వలయును. విషప్రతిషేధ ప్రకరణమునందు చెప్ప బడిన ప్రకారముగ రక్తమోక్షణము చేయించ వలసినం అవసర మేర్పడిన యెడలసిరామోక్షణమును చేయించవలెను, విషమును భుజి

చిన వానికి తీక్ష్ణమైన వమనములను చేయింపవలెను. శత్రుమధ్యముననున్న రాజునకు మొదలే హృదయ రక్షణమును చేయవలయును. ఈ విషయముగూడ విషప్రతిషేధ ప్రకరణము నందు చెప్పబడును. శత్రుమధ్యము నందున్న రాజునకు భుజించుటకు పూర్వము (శూన్యకుక్షికి) విషప్రతిషేధ ప్రకరణమునందు చెప్పబోవు అజేయమను ఘృతమును తాగింప వలెను. వైద్యునిచేత విషప్రతిషేధ ప్రకరణమందు చెప్పబడిన అమృతం అను పేరుగల ఘృతమును భోజనాత్పూర్వము ఇవ్వవలయును. చివరకు సర్పి మొ॥ లభించక పోయిన యెడల చల్లని నీళ్ళను తాగింప వలెను. సితాది కల్కముతో కూడిన మాంసము విషహారముగా చెప్పబడినది. గోధాదులయొక్క మాంసము విషహారము. అట్లే జింకయొక్క మాంసములో శుంఠి, పిప్పలీ చూర్ణమును కలిపి యుపయోగించిన విషహారమును నెమలి మాంసము శుంఠి, చూర్ణముతో లేక అతి విషాచూర్ణముతో లేక శర్కరతో కలిపియుపయోగించిన విషహారమగును. ఈ గోధాదులయొక్క మాంసముతో అవసరమునుబట్టి యోగ్యమైన కలుపుటలచేత, ఔషధముల కల్పింప బడిన రసములు విషహారములుగా పేర్కొన బడినవి. విషమును భుజించిన వానికి వమన విరేచనములు చేయించి కోష్ఠమును శుద్ధిపరచిన తరువాత ఔషధయోగ్య కాలమందు అవస్థాను సారము సూక్ష్మమైన తామ్ర చూర్ణమును తేనె కలిపి హృదయమును శోధించుట కివ్వవలయును. ఇట్లు హృదయమును శుద్ధి పరచిన తరువాత మాత్రా పూర్వకముగ సువర్ణ చూర్ణము నిప్పించ వలయును. దీని వలన సువర్ణమును పానము చేసిన శరీరమునందు విషము విషము ఇముడదు. ఎట్లనగా తామరాకుపైన నీటి బిందువు నిలువనట్లు. మరియు అట్టి వానికి సుదీర్ఘమైన ఆయువుండును. ఈ విషమున కుపదేశించిన విధులన్నియు, గరవిషము నందుగూడ పాటింప వలయును. తరువాత చెప్పబడు రక్షణోపాయముల చేత, వైద్యుడు రాజును విషగరాదుల నుండి రక్షింప వలయును. ఎందుకనగా రాజుయొక్క నాశమువలన ప్రజలకు సంబంధించిన సర్వకర్మలు చెడిపోవును. వైద్యుని చేత అతీంద్రియములైన మానసాదుల చేత ప్రయత్న పూర్వకముగ ప్రజ్ఞాది కర్మల చేత రాజు ఆరాధింప దగిన వాడు. ఈ ఆరాధనముచే, కుపితుడైన రాజు దోషము నాచరింపడు. ఎందు కనగ రాజు మానవత్వ రూపమై ధర్మమును పొందిన వాడైనప్పటికి తాను ఆచరించు ఆజ్ఞాదులు అమానుషములుగా నగుచున్నవి. అనగా తాను ఆదేశించు ఆదేశాదులు మానవాతీత శక్తిని గలిగి యుండును. మరియు ఆ మానవాతీత శక్తులు గలిగిన రాజు ఇతర వ్యక్తులకంటె అధికశక్తిల వాడని నిరూపించును. అందువలన వైద్యుని చేత రాజు ఎల్లవేళల ఆరాధింప బడవలెను.

మూ॥ యత్ర సాక్షాన్నృప స్తత్ర విజ్ఞాతః । ప్రవిశేద్భిషక్ 1-136
న సమ్మతోఽప్యనుచితం యానస్థానాసనం భజేత్
ఉచితే పురతో రాజ్ఞ స్తిష్ఠే ద్వాక్యంచ నాతిపేత్।

అహీనకాలం రాజార్థం స్వార్థం ప్రియహితైఃసహ॥
దేశే కాలే పరార్థంచ వదేద్ధర్మార్థ సంహితమ్।
నానుశిష్యాదపృచ్ఛన్తం మహ దేతద్ధి సాహసమ్।
నాచరే దహితేనైనం మూలచ్ఛేద కరంహితత్॥
అనుకూలం హితం వాచ్య మహితాద్వారయేన్మిథః॥
ఉదారైః సాన్త్వయన్ వాక్యై ర్దోషశ్చేత్త దుపేక్షయా।
తుష్ణీం వా ప్రతి వాక్యే స్యాద్వర్జయేద్ద్వేష సంకథామ్॥
విషశ్చిదప్యచిత్తజ్ఞః శాలీశోఽపితు భావవిత్।
అతి ప్రియోఽపి ద్వేష్యోఽపి యాత్యాశు విపరీతతామ్
నివేద్యరాజ్ఞే కుర్వీత కార్యాణి సులఘూన్యపి।
నయాయాన్నచిరం తిష్ఠేత్ కోశస్థానావరోధయోః॥
స్వల్పేఽపి దర్శయేత్తుష్టిం లాభేఽనుద్ధత మానసః
మిథః కథన మన్యేన కౌలీనం ద్వాద్వ వాదితాం।
వస్త్రాది రాజ్ఞా సదృశం రాజలీలాంచ వర్జయేత్॥
దత్తం యత్తు నృపేణైవ తద్ధార్యం తుష్టివృద్ధయే॥
హసితవ్యేస్మితం కుర్యాత్ ప్రభోరేహానువృత్తితః।
ఉచ్యమానేఽవలమ్బేత పర మర్మాణి మూకతామ్॥
స్వ మర్మణితు బాధిర్యం ధైర్య మాధుర్య సౌష్ఠవాన్।
అత్యా యాసేన నాత్మానం కుర్యాదతి సముచ్ఛ్రితమ్॥
పాతోయథాహి దుఃఖాయనోచ్ఛ్రాయః సుఖకృత్తథా॥ -147

*ప్రతిపదార్థము* : భిషక్ = వైద్యుడు, యత్ర = ఎక్కడ, సాక్షాత్ = ప్రత్యక్షముగా, నృపః = రాజు, స్యాత్ = ఉండునో, తత్ర = అక్కడకు (అచటికి), విజ్ఞాతః = తెలియపరచినవాడై (తన రాకను), ప్రవిశేత్ = ప్రవేశింపవలెను, సమ్మతోఽపి = అంగీకరించిన వాడైనప్పటికి (రాజు), అనుచితం = తన స్తోమతకు తగని, యాన = వాహనములను. స్థాన = ప్రదేశములను, ఆసనం = ఆసనమును, నభజేత్ = పొందకూడదు, రాజ్ఞః = రాజుయొక్క, పురతః = ముందు, (ఎదురుగా), ఉచితే = ఉచితమైన ఆసనమునందు, తిష్ఠేత్ = కూర్చుండనలయును, వాక్యం = రాజుమాటను, నాక్షిపేత్ = ఆక్షేపించరాదు (విచికిత్స చేయరాదు), రాజార్థం = రాజుయొక్క అర్థమును, అహీనకాలం = ఉచితమైన సమయమున, వదేత్ = చెప్పవలయును, స్వార్థం = తనకు సంబంధించిన విషయమును, ప్రియహితైఃసహ = రాజునకిష్టులైన వారితోగూడ (కలిసి వెళ్ళి), వదేత్ = చెప్పవలయును, చ = మరియు, పరార్థం = పరమార్థమును, ధర్మార్థ సంహితమ్ = ధర్మము, అర్థముతోగలిసి యుండునో (అట్టి విషయమును), దేశే = సరైన ప్రదేశమునందు, కాలే = సరైన కాలమునందు, వదేత్ = చెప్పవలయును, అపృచ్ఛన్తం = అడుగనటువంటి రాజును గురించి, ధర్మార్థ సంహితమ్ = ధ.అ.కూ.

విషయ- నానుశిష్యాత్ = చెప్పకూడదు. (బోధింపకూడదు), ఏతద్ = ఇది, మహత్ = గొప్పనైన, సాహసం = చేయదగినదిగా, భవతి = అగుచున్నది, అహితేన = అహితములాచరించు సేవకునిచేత, ఏనం = వీనిని, నాచరేత్ = సేవింపపడదగదు, తత్ = అది, మూలచ్ఛేదకరమ్ = మూలచ్ఛేదకరముగా, భవతి = అగుచున్నది, తస్మాత్ = ఆ కారణము వలన, అనుకూలమ్ = రాజున కనుకూలమైన, హితమ్ = ఇష్టమైన వాక్యము, వాచ్యమ్ = చెప్పబడదగినది, మిథః = ఏకాంతమునందు, అహితాత్ = మిథ్యాచరణమునుండి, వారయేత్ = అడ్డగింపవలెను, ఉదారైః = ఉదారములైన, వాక్యైః = వాక్యములతో, సాన్త్వయిన్ = నచ్చచెప్పుచూ, దోషశ్చేత్ = దోషమున్న యెడల, ఉపేక్షయా = ఉపేక్షచేతనూ, స్యాత్ = ఉండవలెను, వా = లేక, ప్రతివాక్యే = ప్రత్యుత్తరమునందు, తూష్ణీం = మౌనముగా, స్యాత్ = ఉండవలెను, ద్వేషసంకథామ్ = విరుద్ధమైన మాటలను, వర్జయేత్ = విడిచిపెట్టవలెను, విపశ్చిదపి = పండితుడుగూడ, రాజుయొక్క మనస్సును గుర్తించనటువంటివాడై, బాలిశోపి = మూర్ఖుడున్నూ, భావవిత్ = రాజుయొక్క భావమును తెలిసినవాడై కూడ, అతిప్రియోపి = మిక్కిలి ప్రేమపాత్రుడైనప్పటికిన్నిగూడ, ద్వేష్యోపి = శత్రువైనప్పటికిని, విపరీతతామ్ = విపరీతత్వమును, ఆశు = శీఘ్రముగా, యాతి = పొందుచున్నాడు, సులఘూన్యపి = మిక్కిలి లాఘవములైనప్పటికిన్ని, కార్యాణి = కార్యములను, రాజ్ఞే = రాజుకొఱకు, నివేద్య = విన్నవించి, కుర్వీతా = చేయవలెను. కోశస్థానోవరోధయోః = ధనాగారముల లోనికి, అంతఃపురముల లోనికి, నయాయాత్ = వెళ్ళకూడదు. చిరమ్ = చాలకాలము, నతిష్ఠేత్ = ఉండకూడదు, స్వల్పేపి = స్వల్పమైనదైనప్పటికిని, లాభే = లాభమునందు, అనుద్ధతమానసన్ = ఉప్పొంగని వాడగుచు, తుష్టిమ్ = సంతోషమును, దర్శయేత్ = చూపెట్ట వలెను. మిథః = పరస్పరము, వర్జయేత్ = విడిచిపెట్టవలెను. తథా = అట్లే, కాలినం = జనవాదమును, నకుర్యాత్ = చేయగూడదు, తథా = అట్లే, అన్యేన సహ = ఇతరులతో కూడ, ద్వంద్వవాదితాం = విరుద్ధవాదమును, వర్జయేత్ = విడిచి పెట్టవలయును, రాజ్ఞా = రాజుతో, సదృశం = సమానమైన, వస్త్రాదిః = వస్త్రములు మొ॥ ఆభరణములను, వర్జయేత్ = వదిలిపెట్ట వలెను, నృపేణైవ = రాజు చేతనే, యత్ = ఏదైతే, దత్తం = ఇవ్వబడినదో, తత్ = అది, తుష్టి వృద్ధయే = సంతోషమును వృద్ధిపరచుటకొఱకు, ధార్యమ్ = ధరింపతగినది. ప్రభోః = రాజుయొక్క, హాసితవ్యే = సంతసించువిషయమునందు, అనువృత్తితః = అనుసరించుటవలన, స్మితం = చిరునవ్వును, కుర్యాత్ = చేయవలెను, పరమర్మణి = ఇతరులయొక్క రహస్యములు, ఉచ్యమానేసతి = చెప్పబడినప్పుడు, మూకతాం = మౌనమును, అవలమ్బేత = అవలంబించ వలయును, స్వమర్మణితు = తనదోషము వ్యక్తమై దగుచుండగ, బాధిర్యం = చెవుడును, ధైర్య మాధుర్య సౌష్ఠవమ్ = వికార రహితమైన ప్రవృత్తిని, అవలమ్బేత = అవలంబించ వలయును, ఆత్మానమ్ = తనను

గూర్చి, అతిసముచ్ఛ్రితం=అతి గర్వమును, అత్యాయాసేన=శ్రమ చేతనైనను, నకుర్యాత్ = చేయగూడదు. తథాహి=అది యుక్తమే, యథా = ఎట్లనగా, అత్యాయాసేన ఉచ్ఛ్రాయాత్ = పరవశము చేత, పాతః=పతనము, భవతి= అగుచున్నదో, తథా=అట్లే, నోచ్ఛ్రాయః=గర్వము లేకుండుట, సుఖకృత్= సుఖకరమైనదిగా, భవేత్=అగుచున్నది.

తాత్పర్యము : వైద్యుడు రాజసన్నిధికేగునపుడు. రాజునకు వర్తమానము చేసి, రాజు అజ్ఞను పొంది రాజును దర్శింపవలయును. రాజు తనను గౌరవించినను, తనకు ఉచితమైన ఆసనాదులయందే కూర్చుండవలయును. ఉచితముగాని స్థానమున నిలువరాదు. వాహనముల నధిష్ఠింపరాదు. ఆసనముల యందు కూర్చుండకూడదు. ఉచితాసనముపై రాజునకెదురుగా కూర్చుండ వలయును. రాజు మాటలాడునపుడు విరుద్ధముగ మాటలాడకూడదు. రాజునకను కూలముగ ప్రవర్తింప వలయును. రాజునకనుకూలమైన ప్రయోజనముగల మాటనుగూడ, ఉచిత సమయమున, సందర్భోచితముగ చెప్పవలయును. తన స్వ విషయములను, రాజునకు నివేదించునపుడు, గూడ, రాజునకిష్టులైన తనకు అనుకూలురైన వారితో గూడ వెళ్ళి నివేదింపవలెను. రాజు అడుగ కుండగనే ధర్మములను, ధర్మార్థములను బోధింపరాదు. ఒకవేళ న్యాయ్యమని తాను నిశ్చయించిన విషయములను నివేదించునపుడు, దేశకాల పరిస్థితుల కనుకూలముగ, తత్కాలమున రాజుయొక్క స్థితినిగుర్తించి నివేదింపవలయును. అహితమైన కార్యముల నాచరించు రాజువద్ద సేవ ఎప్పుడును చేయరాదు. ఇది పెద్ద అనుచిత ప్రవృత్తియగును. అనుచిత ప్రవృత్తిగల రాజు, సేవకుడు గలసి సర్వనాశనమునకు, అనుకూలమైన వాతావరణమును సృష్టింప గలరు. అందు వలన రాజు సన్నిధిలో రాజునకు హితమైన ధర్మబద్ధమైన ప్రియమైన విషయము లనే చెప్పవలయును.రాజు అధర్మ ప్రవర్తకుడైన,రాజును అధర్మాచరణమునుండి అడ్డగింపవలెను. రాజు ఒకవేళ దోషమును చేసినను, తత్కాలమున మౌనమును ధరించి తరువాత ఏకాన్తమునందు ఉచితమైన మాటలతో, అతనికి తెలియపర్చ వలెను. రాజువద్ద అతనికి అయిష్టమైన ప్రసంగము చేయరాదు. రాజుయొక్క మనస్సును, భావమును తెలిసికొని రాజువద్ద మెలగ వలయును. రాజుయొక్క చిత్తవృత్తిని గుర్తించని, బాగుగా పరిచితుడైన పండితుడుగూడరాజులకు అయి ష్టుడుగానగును. రాజులయొక్క మనః ప్రవృత్తులనుగుర్తించిన మూర్ఖుడుగూడ మిక్కిలి ఇష్టుడగును. చాల స్వల్ప విషయమును గూడ రాజునకు మొదట తెలిపియే తరువాత చేయ వలయును. రాజసౌధము. లోనికి గాని కోశా గారములోనికిగాని ఎప్పుడునూ వెళ్ళరాదు. ఒకవేళ వెళ్ళవలసివచ్చినను,ఎక్కువ కాలమచట నుండరాదు. రాజుల వలన స్వల్పలాభము గలిగిననూ, శాంతచిత్తుడై ఆస్వల్ప లాభములో తన సంతోషమును చేష్టలద్వారా ప్రకటింప వలయును. రాజులవద్ద వాద వివాదములను చేయరాదు. ఇతరులను నిందింపరాదు. దుష్కా

ర్యముల ప్రసక్తి తేరాదు. ప్రజాసంఘముల యొక్క వాద వివాదములను రాజుతో చెప్పకూడదు. రాజువలె నటించుట కెప్పుడునూ, ప్రయత్నింప రాదు. రాజుచేత సత్కరింప బడిన వస్తువేదైనప్పటికిని సంతోషముతో దానిని గ్రహించిధరింపవలెను. ఇచట ఏవకారమును ప్రయోగించుటచేత, రాజు కాక, రాజ గృహము నందలి రాణులు మొ॥ వారిచ్చిన వస్త్రభూషణాదులను స్వీకరింపరాదని భావము. రాజు వికటాట్టహాసము చేయునపుడు తాను చిరునవ్వు నవ్వ వలెను. రాజుగారు, ఇతరులు గాని రహస్య సమాచార ములు చెప్పునపుడు మౌనము ధరింపవలయును. ఏమియూ చెప్పకూడదు. తాను అతి గర్విగానుండక, శాంత చిత్తుడుగా, ఎక్కువ స్థితికి మురిసిపోక, సమభావము గలవాడై సంచరింపవలెను. తాను ప్రకృతి స్థితి నుండి వికృతి పరవశుడై పతితుడగును, దుఃఖములను పొందును. తాను ప్రకృతి స్థితుడుగా నున్న సుఖములను పొందును. "పతనాన్తాః సముచ్ఛయాః" అను వాక్యమును బట్టి ఎక్కువ గొప్పదనముగూడ పతనమునకు దారితీయును.

*శశిలేఖ* : రాజ గృహము నందలి గృహ విభాగములలో ప్రత్యక్షముగ, రాజు ఎచట నున్ననూ, అనుమతి పొందనిది లోనికి ప్రవేశింపరాదు. తనను మొదట తెలిపికొని లోనికి వెళ్ళవలయును. లోనికి ప్రవేశించి రాజు అనుమతి లభించినప్పటికీ, తన అధికారమునకంటె ఉన్నతమైన ఆసనాదుల యందు కూర్చొన కూడదు. తనకుచితమైన ఆసనము నందే రాజునకెదురుగా కూర్చుండ వలయును. రాజు చేత చెప్పబడిన మాటను, ఇది మంచిది, ఇది చెడ్డది అని ఆక్షే పింపరాదు. రాజునకు ప్రయోజనము కల్గించుమాట ఐనప్పటికిని సకాలమునందే చెప్పవలెను. తనకు లాభసాటియైన మాటను కూడ, రాజునకిష్టమైన, తన మంచిని కోరు రాజోద్యోగులతో కలసి వెళ్ళి చెప్పవలెను. ఇతరులకు లాభము చేకూర్చు మాటను, అనువైన సమయమున, అనువైన ప్రదేశమునందు చెప్ప వలెను. ఈ రాచకార్యవిషయములలో తనను అడగనప్పటికిని ధర్మము,అర్థము, ఈ రెంటితో కూడుకున్న ఉపదేశములను రాజునకు బోధింపరాదు. ఇది గొప్ప సాహసము. అధర్మాచరణము నాచరించు రాజును సేవింపరాదు. ఈ రాజు యొక్క అహితాచరణము, సర్వనాశనమునకు దారి తీయును. రాజుకు రహస్య ముగ నచ్చ చెప్పుచూ, అహితాచరణమునుండి అడ్డగింపవలెను.

గొప్ప అర్థవంతములైన వెలగల వాక్యముల చేత రాజును అనున యింప వలెను. ఒకవేళ రాజు దోషము చేసినప్పటికిన్ని, రాజు సమక్షమున బహిర్గతము చేయరాదు. రాజును అధర్మాచరణమునుండి అడ్డగించుటకు, అయిష్టత కన్పరచిన, మౌనమును వహించవలెను. కాని మరల వత్తిడి చేసి చెప్ప రాదు. అట్లే సమస్త శాస్త్రములయందు ఆరితేరిన వాడైయున్నప్పటికి, రాజు యొక్క చిత్తప్రవృత్తిని గుర్తెరిగి మసలుకోవలెను. అట్లుచేయని యెడల అయిష్టుడగును. అట్లే మూర్ఖుడు కూడ, రాజు యొక్క మానసిక ప్రవృత్తిని

గుర్తెరిగి నడుచుకున్న యెడల, ప్రాణస్నేహితుడగును. అట్లే కారణము లేకుండా రాజుయొక్క ధనాగారమునందు, రాజాంతఃపురములోకి వెళ్ళకూడదు. కారణముతో కూడ అక్కడకి వెళ్ళినప్పటికి ఎక్కువకాల మక్కడయుండరాదు. రాజువలన తనకు స్వల్ప లాభము గల్గినప్పటికి, గర్వరాహిత్యమును చూపెట్టి, రాజునకు సంతోషము గల్గింపవలెను. అట్లే ఇతరునితో ఏర్పడు వాదవివాదములను రాజునకు తెలియపర్చకూడదు. రాజు చేత తన కొఱకే ఇవ్వబడిన వస్త్రాదులను రాజు సంతోషము కొరకు ధరింపవలెను. రాజు వలె తాను నటింపరాదు. రాజు వలె వస్త్రాభరణ. వాహనాదులను వదిలి పెట్టవలెను. రాజు చేత ఆజ్ఞాపింపబడక అంతఃపురస్త్రీలచేత ఇవ్వబడిన వస్త్రాద్యాభరణాదులను తీసుకొనకూడదు. ప్రసంగ వశమున, హాస్యోక్తుల వలన రాజు నవ్వినప్పటికిన్ని రాజు యెదుట ముఖభంగిమల చేత తన హర్షము తెలియ చేయవలెనే కాని వికటాట్టహాసము చేయరాదు. రాజు నవ్వినను, తాను నవ్వకూడదు. రాజు నవ్వని యెడల తానును మౌనము ధరింప వలెను. రాజు కాని ఇతరుడు కాని, ఇతరుల యొక్క మర్మములను గురించి చెప్పునప్పుడు చెవిటి వానిగా నుండవలెను. తనసు తాను ఎక్కువ ధనవంతుడుగాగాను, ఎక్కువ మర్యాదలు మన్ననలు లభించుచున్నవని గాని, తాను అతి గర్వముతో విచ్చలవిడిగా సంచరింపరాదు. అట్టి గర్వము కొద్ది పాటి ధిక్కారము చేత వెంటనే పతనము కల్గించును. ఎక్కువ గర్వము వలన తన యొక్క పతనము జరుగును. ఇది దుఃఖకరము. అట్లే ఆ గర్వము సుఖకరము కూడ కాదు. అనగా రాజప్రాసాదము నందు సంచరించు ప్రతి సేవకుడు నిగర్వియై తన స్థానమును తన శక్తిని తన అధికారమును దుర్వినియోగపర్చక అధికార పరిధులను దాటక జాగ్రత్తగా రాజసేవను చేయవలెను. రాజుల యొక్క ప్రవృత్తి ఎప్పుడే విధముగా మారునో ఎవ్వరును ఊహింపజాలరు. అతను చేయు ప్రతిపనియు శాసనరూపముననుండును. "నావిష్ణుః పృథ్వీపతిః" అను నార్యోక్తి ప్రకారము రాజు విష్ణ్వంశ సంభూతుడు కాన అతడు ఆరాధ్యుడు. అతని చెప్పుచేతలలో జాగ్రత్తగా మెసలుకొనవలయును.

మూ॥ ఆసన్న సేవాన్నృపతిః క్రీడాశస్త్రాహి పావకైః ॥
కాశలేనాతి మహతా వినీతైః సానిరుధ్యతే ।
ప్రాప్యదుష్ప్రాపమైశ్వర్యం బహుమానంచ భూపతేః ।
యథోప భుంజీత చిరం తథా స్యాదప్రమాదవాన్ ॥
విదధ్యాత్పరితః శయ్యాం రక్షామంత్రాభిమన్త్రితామ్ ।
రాత్రౌ సిద్ధార్థకాన్ భూతి మత్సైరన్వితాం శుచిమ్ ।
రక్షాశక్తిం తథోచ్ఛీర్షే సయవాంకురయావకామ్ ।
స దూర్వం పూర్ణకలశం సపుష్ప ఫలపల్లవమ్ ।
ఉపహారంచ సంధ్యాయాం భుక్త్వాచాన్తే నిశాసుచ ॥
ఏతత్స్వస్త్యయనం కర్మ కర్తవ్యం శుచినాఽఽశుచ ।

ఆయుష్యం పౌష్టికం భూత విషకార్మణ పాప్మజిత్ ॥
సంక్షేప ఏష విషపాలన సాధనాయ ।
ప్రోక్తస్తు విస్తర విధిః పునరుత్తరేషు ॥
ఆలోక్య సమ్యగఖిలం మతి పూర్వకారీ ।
యుంజీత తం పరికలయ్య వికార చిహ్నమ్ ॥
ఇతి గరరక్షోరక్షణా యోపదేశమ్ ।
భజతి నరపతిర్యోనిత్యమేవా ప్రమత్తః ।
నిజపుర రిపువృన్దైరప్రధృష్యో మహాత్మా ।
జనయతి సజానానాం క్షేమ యోగాచిరాయ ॥—155
ఇత్యన్నరక్షా నామాష్టమోఽధ్యాయంః —

ప్రతిపదార్థము: నృపతేః=రాజుయొక్క, ఆసన్న సేవా=సమీపమందుండి సేవచేయుట, శస్త్రాగ్నిహి పావకైః=సస్త్రములచేత, సర్పముల చేత, అగ్నిచేత, క్రీడా=ఆడుకొనుట వంటిది, వినీతైః=విధేయత గలవాని చేత, అతిమహాతా కౌశలేన =మిక్కిలి సమర్థవంతమైన యుక్తి ప్రయుక్తులతో, సా=ఆ రాజ సేవ, నియుహ్యాతే=నిర్వహింపబడుచున్నది, భూపతేః దుష్ప్రాపం=రాజు వలన అతి కష్టముచేత పొందినట్టి, ఐశ్వర్యం = ఐశ్వర్యమును, చ=మరియు, బహు మానం=సన్మానమును,(గౌరవమును), అప్రమాదవాన్ =ప్రమాదరహితుడై, చిరం=చిరకాలము,యథా=ఎట్లు.ఉపభుంజీత=ఉపభోగించునో(అనుభవించునో) తథా=అట్లు, స్యాత్ ఉండవలెను, పరితఃరక్షామంత్రాభిమన్త్రితాం = రక్షామంత్ర ములచేత అభిమన్త్రించబడిన, శయ్యాం = శయ్యను, విధధ్యాత్ = చేయవలెను, రాత్రి = రాత్రికాలమునందు, సిద్ధార్థకాన్=తెల్లని యావాలను, భూతిం = విభూతిని, అక్షతైః =అక్షతలచేత, అన్వితాం = కూడినట్టిదియు,శుచిం = పరిశుభ్ర మైనదియు, సయవాంకుర యావకమ్=యవాంకురములను, యవలను, సదూ ర్వాం=గరికతో కూడినదానిని, సపుష్పఫలపల్లవమ్=పుష్పములు, ఫలములు, చిగురుటాకులతో కూడినట్టి, పూర్ణకలశం=పూర్ణపాత్రను, తథా=అట్లే, ఉచ్ఛీర్షే = తలవైపున, రక్షాశక్తిం = పటమునందు వ్రాయబడిన రక్షాశక్తిని, విదధ్యాత్=ఉంచవలయును. సంధ్యాయాం=సంధ్యాకాలమునందు, భుక్త్వా= భుజించి, నిశాసు=రాత్రులయందు, అస్తే = అస్తమునందు, ఉపాహారం =ఫల హారమ్మును, విదధ్యాత్=చేయవలెను,శుచినా=పరిశుద్ధమనస్కుతో, ఆశు=త్వరగా ఏతత్స్వస్త్యయనంకర్మ = ఈ స్వస్త్యయన కర్మను (ఈ పుణ్యాహవాచనము) కర్తవ్యం=చేయదగినది, ఏతత్ = ఈ పుణ్యాహవాచనము, ఆయుష్యం=ఆయు స్సును వృద్ధిపరచును, పౌష్టికమ్.=పుష్టి వర్ధకము, భూత విషకారణపాప్మజిత్= భూత విషము స్వాధీనము లోనికి తెచ్చును, దరిద్రమును నశింపచేయును, అస్మిన్=ఈ అధ్యాయమునందు, విషపాలనసాధనాయ=విషరక్షణ కొఱకు, చికిత్స కొరకు, ఏషః=ఇది, సంక్షేపః=సంగ్రహముగా, ప్రోక్తః = చెప్పబడి

నది, పునః = మరల, ఉత్తరేషు = ఉత్తరస్థానములయందు, విస్తరవిధిః = విస్తారమైన విధి, వక్ష్యతే = చెప్పబడును, మతిపూర్వకారీ = బుద్ధిగలవాడై, సమ్యక్ = బాగుగా, అఖిలం = సమస్తమును, ఆలోక్య = గ్రహించి,వికారచిహ్నం = వికార లక్షణమును, పరివికల్ప్య = పరికల్పనముచేసి, తం = విషపాలనవిధిని, యుంజీత = చేయవలెను. ఇతి = అని, యః = యే, నరపతిః = రాజు, విషగర రక్షః = విషము నుండి, గర విషము నుండి రక్షింపబడినవాడై, రక్షణాయ = ప్రజలను రక్షించుట కొరకు, నిత్యమేవ = అనునిత్యము, అప్రమత్తః = జాగరూకుడై, ఉపదేశం = ఉపదేశమును, భజతి = పొందుచున్నాడో, సః = ఆ రాజు, నిజపురరిపువృన్దైః = తనలో నున్న శత్రుసమూహముల చేత (అరిషడ్వర్గముల చేత), శత్రుసమూహముల చేత గూడ, అప్రధృష్యః = తిరస్కరింపబడిన వాడై, మహాత్మా = మహాత్ముడను బిరుదును పొంది, చిరాయ = చాలా కాలము వరకు, జనానాం = ప్రజల యొక్క, యోగక్షేమౌ = యోగక్షేమములను, జనయతి = కలిగించుచున్నాడు, ఇతి = అని, అన్నరక్షా = అన్నరక్షయనెడి, నామా = పేరుగల,అష్టమా = ఎనిమిదవదియైన, అధ్యాయః = అధ్యాయము, సమాప్తః = ముగిసినది.

తాత్పర్యము : రాజ సమీపమున నుండు సేవకులు, వారు రాజసన్నిధిలో నిర్వహించు సేవలు, కత్తితో సాముచేసినట్లుగా, సర్పముతో ఆడుకొన్నట్లుగా, అగ్నితో చలగాట మాడినట్లుగా నుండును. రాజులవద్ద పని చేయుట చాల కఠినముగా నుండును. సేవకుడు చాల విధేయతతో మిక్కిలి గొప్పయుక్తి ప్రయుక్తులతో రాజుయొక్క సేవ చేయవలయును. రాజు వలన లభించిన ఐశ్వర్యమును, గౌరవమును, ఉదాసీన భావముతో అనుభవింప వలయును. ఇట్లు అనుభవించిననే ఆ ఐశ్వర్యము, ఆ గౌరవము చాల కాలము నిలుచును.

వైద్యుడు నాలుగు వైపుల రక్షోఘ్న మంత్రములతో అభిమంత్రించిన పడకను తయారు చేయ వలయును. రాత్రియందు తెల్ల ఆవాలను, యవలను, అక్షతలను, పవిత్రభస్మమును. ఆ పడకకు నాల్గువైపులా చల్లవలెను. పడకకు తూర్పు దిశ యందు రక్షాశక్తిని ఒక కాగితముపై వ్రాసి దానిని, అక్కడ ఉంచ వలయును. ఆ పటము వద్ద యవాంకురములు యావకములు, గరిక, అనేక ప్రకారములైన పుష్పములు, ఫలములు,చిగురుటాకులతో నిండిన, పూర్ణ పాత్రను అచట యుంచవలెను. సంధ్యాకాలము నందే రాజును భుజింప చేసి, చివరి యామము నందు ఉపహారము నివ్వ వలెను. ఇట్లు పవిత్రమైన పుణ్యాహా వాచన కర్మ వలన పవిత్రుడుగా చేయవలయును. ఇట్లు పుణ్యాహ కర్మ చేయుట వలన ఆయుస్సువృద్ధి యగును. పుష్టి వృద్ధి యగును. భూత విషము తగ్గి పోవును. దరిద్రము నశించి పోవును.

ఈ అధ్యాయమునందు రాజును విషమునుండి రక్షించుట కొరకు, అల్లే ఒక వేళ విషముచేత ఉత్పన్నమైన రోగములను, చికిత్స చేయుట కొరం

సంగ్రహముగా చెప్పబడినవి.

పైనుదాహరించిన విషయములు, విస్తారముగా ఉత్తర స్థానమునందు మరల చెప్పగలము. దీనిని సంపూర్ణముగా విజ్ఞానముతో వివేచనచేసి, తన బుద్ధికి తోచినట్లుగా మరియు అది మంగళ ప్రదముగా యుండునటుల రోగ లక్షణములను చక్కగా పరీక్షించి చికిత్సలో పైన ఉదాహరించిన ప్రయోగము లను ప్రయోగించ వలయును.

ఏ రాజు ఈ ప్రకారముగా విషమునుండి, గరవిషమునుండి రక్షింప బడిన వాడై తన రాజ్యము నందలి సమస్త భూతములను రక్షించుట కొరకు, ప్రతి నిత్యమునూ, జాగరూకతను పొంది వైద్యోపదేశములను అనుసరింప వలెను.

అట్టి రాజు తన శరీరమునందలి శత్రుసమూహమైన కామాదులను, అట్లే ఇతర శత్రువులనుండి తిరస్కరింప బడిన వాడై "మహాత్మా" అను బిరుదము పొంది చాలకాలము ప్రజల యొక్క యోగ క్షేమములను సుసంపన్నము లుగా చేయును.

*శశిలేఖ :* రాజ సన్నిధిలో నుండి, రాజునకు సపర్యలు చేయుట, శస్త్ర ముతో, పాముతో అగ్నితో ఆడుకొనినట్లుండును. రాజువద్ద తానుచేయు సేవా ధర్మము అతి కఠినమైన దైనప్పటికిని, అతి సూత ధర్మమని, గ్రహించి వినయ ముతో విధేయతతో, కౌశలము చేత, దానిని నిర్వహింప వలయును. రాజు వలన అతి కష్టముగా పొందిన ఐశ్వర్యమును, గౌరవమును, ప్రమాద రహిత ముగా చాలకాలము అనుభవించుటకు వీలగును. రాజునకు వైద్యుడు. ఉచిత మైన సమయమునందు పడకను ఏర్పరచ వలెను. పడకయొక్క నాల్గు దిక్కుల, రక్షామంత్రములచేత, మంత్రింప బడిన, విభూతిని, అక్షతల చేత, యవలచేత, కలిపి చల్ల వలయును. పడకయొక్క పూర్వభాగమునందు రాజును రక్షించుట కొఱకు పరాశక్తి యొక్క పటమును ఉంచ వలయును. ఒక కలశమునందు నీరునింపి, ఆ కలశములో గరికను, పలువిధములైన పుష్పములను, చిగురు టాకులను, పండ్లను ఉంచి ఆ పడకయొక్క పూర్వభాగమునందు ఆ కలశమును ఉంచవలెను. సంధ్యాకాలమునందు ఉపహారమును తలవైపు ఉంచవలెను. ఇట్లు రాజునకు పరిశుద్ధుడైనచేత పుణ్యాహవాచనము చేయబడవలెను.

ఈ పుణ్యాహవాచన కర్మ వలన భూతాదుల యొక్క నాశము, ఆయు ర్వృద్ధి, బలవృద్ధి, ఏర్పడును. ఈ అధ్యాయమునందు విషరక్షణకొరకు విషము వలన జనించిన వ్యాధులకు చికిత్సకొరకు సంగ్రహముగా చెప్పబడినది.

విస్తారముగ మరల ఉత్తర స్థానమునందు చెప్పబడును. వైద్యుడు ఈ సంక్షిప్తమైన విషయములను స్వబుద్ధితో ఆలోచించి, మంచి బుద్ధికుశలత గల

వాడై, వికార లక్షణమును బాగుగా గ్రహించి, విషము నుండి రక్షించుటకు, విషమును సాధించుటకు నైన క్రియాక్రమమును కల్పింపవలెను.

ఈ ప్రకారముగా రాజును విషము నుండి, గరవిషమునుండి, వైద్యుడు రక్షింప వలెను. వైద్యుని చేత రక్షింప బడిన రాజు తనసహజ శత్రువులైన కామక్రోధాదుల నుండి ఆంతర శత్రువుల నుండి కలుగు ఆపదలు లేనివాడై "మహాత్ముడు" అను బిరుదుదమును పొంది, ప్రజలయొక్క యోగక్షేమములను చాలకాలము వరకు పరిరక్షించును.

ఇతీన్దు విరచితాయా మష్టాంగ సంగ్రహ వ్యాఖ్యాయాం సూత్రస్థానే అష్టమోఽధ్యాయః.

# అష్టాంగసంగ్రహ వ్యాఖ్యానము

## తొమ్మిదో అధ్యాయము

**మూ॥** అథాతో విరుద్ధాన్న విజ్ఞానీయ మధ్యాయం
వ్యాఖ్యాస్యామః ఇతి హస్మాహు రాత్రేయాదయో మహర్షయః।

*ప్రతిపదార్థము* : **అథ**=తరువాత, అతః=ఇందువలన, విరుద్ధాన్న విజ్ఞానీయం=విరుద్ధాన్న విజ్ఞానమను, అధ్యాయం=అధ్యాయమును, వ్యాఖ్యాస్యామః=వ్యాఖ్యానించగలము, ఇతి=అని, ఆత్రేయాదయోమహర్షయః=ఆత్రేయుడు మొ॥ మహర్షులు, ఆహుస్మ=పలికిరి.

**తాత్పర్యము:** విరుద్ధాన్న విజ్ఞానీయమను అధ్యాయమును వివరించి చెప్పగలమని ఆత్రేయాది మహర్షులు చెప్పిరి.

*శశిలేఖ:* ఆహారమును గురించిన విషయము నడుచుచున్నందున, ప్రసంగ వశమున విరుద్ధాహారము గర శదృసమైనందున ఇచట ఈ విషయము చెప్పబడు చున్నది.

మూ॥ గ్రామ్యానూపౌదక పిశితాని మధు గుడ తిల పయో మాష మూలక బిసైర్విరూఢ ధాన్యైశ్చ నైకధ్యమద్యాత్। విశేషతః పయసా మత్స్యాన్। ఉభయమ్ హ్యేతన్మధుర రస విపాకత్వా దభిష్యంది శీతోష్ణ వీర్యత్వాత్ పరస్పరం విరుద్ధమ్। తేష్వపి విశేషేణ చిలిచిమః। స పునః శకలీ లోహిత నయనః సర్వతో లోహిత రాజర్లోహిత ప్రభాకరః ప్రాయో భూమౌ చరతి సోఽత్యభిష్యంది తమత్వాత్ సుతరాం వ్యాధీ నుపజనయత్యామవిషంచ॥

*ప్రతిపదార్థము* : గ్రామ్యానూపౌదక పిశితాని=గోవు మొ॥ గ్రామ్య జంతువుల మాంసమును, పంది మొ॥ అనూప జంతువుల మాంసమును, చేప మొ॥ ఔదక ప్రాణుల యొక్క మాంసములను, మధు గుడ తిల పయో మాష మూలక బిసైః=తేనె, బెల్లము, నువ్వులు, పాలు, మినుములు, ముల్లంగి, తామరతూండ్లతోనూ, చ=మరియు, విరూఢధాన్యైః=మొలకలెత్తిన ధాన్యములతో, ఏకధ్యం=ఒకేతూరి, నాద్యాత్=తినకూడదు, విశేషతః=విశేష

ముగ, పయసా=పాలతో, మత్స్యాన్=చేపలను, ఏకథ్యం=కలిపి,నాద్యాత్=తినకూడదు, ఏతత్ ఉభయంహి=ఈ రెండున్ను, మధురరస విపాకత్వాత్=మధుర రసము మధుర విపాకము గలవగుట వలన, అత్యభిష్యంది=మిక్కిలి అభిష్యందమును చేయును, శీతోష్ణవీర్యత్వాత్=పాలు శీతవీర్యము, చేపలమాంసము ఉష్ణ వీర్యమగుట వలన, పరస్పరమ్=ఒండొంటికి, విరుద్ధమ్=విరుద్ధమైనవి, తేష్వపి=మత్స్యములలోకూడ,విశేషేణ=విశేషముగ, చిలిచిమః=చిలిచిమమను చేపమాంసము, పయసా=పాలతో, ఏకథ్యమ్=ఒకే సమయములో కలిపి, నాద్యాత్=తినకూడదు, సః=ఆ చిలిచిమమను చేప, శకలీ=శకలి యను పేరు గలది, లోహితనయనః=ఎర్రని నేత్రములు గలది, సర్వతః=శరీరమంతట, లోహితరాజిః=ఎర్రని గీతలు గలది, చ=మరియు, శరీరే=శరీరమందు, లోహిత ప్రభాకరః=ఎర్రని శకలములతో కాంతివంతమైనది, ప్రాయః=తరచుగ, భూమౌ=భూమిపైన, చరతి=సంచరించును,సః=అది, అత్యభిష్యంది తమత్వాత్=మిక్కిలి అభిష్యందమును చేయునది యగుటవలన, సుతరామ్=మిక్కిలిగా, వ్యాధీన్ = వ్యాధులను, ఉపజనయతి = పుట్టించుచున్నది, చ=మరియు, ఆమవిషం=ఆమవిషమును, ఉపజనయతి =పుట్టించుచున్నది.

తాత్పర్యము : గ్రామ్యములైన ఆవు మొ॥ జంతువుల మాంసములను, పంది మొదలగు ఆనూప జంతువుల మాంసములను, చేప మొ॥ ఉదకము నందు సంచరించు జంతువుల మాంసములను, తేనె, బెల్లము, నువ్వులు, పాలు, మినుములు, ముల్లంగి, తామర తూండ్లు, మొలకెత్తిన ధాన్యములను ఒకే సమయములో కలిపి తినరాదు.

విశేషముగ పాలతో కలిపి చేపలను తినరాదు. పాలు, చేపలు రెండును మధుర రసము, మధుర విపాకము గలవి యగుటవలననూ, మిక్కిలి అభిష్యందమును చేయునవగుట వలననూ, పాలు శీతవీర్యము, చేపలు ఉష్ణవీర్యము గలవగుట వలనను పరస్పరము వీర్య విరుద్ధత్వమిచట స్పష్టముగ కనబడుచుండగ, ఒకదానితోనొకటి కలిపి తినరాదు. ఆ చేపలలో గూడ చిలిచిమమను చేపను ముఖ్యముగ పాలతో కలిపి తినరాదు. ఆ చేపపై పెరడు ఉండును. కన్నులు ఎర్రగా నుండును. శరీరమంతటను ఎర్రని గీతలుండును. సూర్యునితో సమానమైన ఎర్రని కాంతి గలిగియుండును. నీటిఒడ్డునగల భూమిపైన సంచరించుచుండును. ఇది మిక్కిలి అభిష్యందనునుచేయును. ఎల్లప్పుడు వ్యాధులను బుట్టించును. ఆమ విషమును ఉత్పన్నము చేయును.

*శశిలేఖ* : ఆనూప జంతువుల, ఔదకజంతువుల, జలచరముల యొక్క మాంసములను తేనె మొ॥ వాటితో ఒకేతూరి కలిపి భుజింపరాదు. ఔదకములు ఆనూపములే యయినప్పటికి కొన్నింటి విషయములో అది పొసగనందున, వేరుగ చెప్పబడినది. మొలకెత్తిన ధాన్యములనుగూడ పాలతో ఒకే పర్యాయము

తినరాదు. చేపలను ముఖ్యముగ పాలతో తినరాదు. ఈ రెండును అభిష్యం దిగానుండును. మరియు వీర్యముచేత విరుద్ధమునైనవి. ఆ చేపలలో గూడ చిలిచిమమను చేపను పాలతో ముఖ్యముగ తినకూడదు. ఆ చిలిచిమము శకల మను పేరుగలది. ఎర్రని నేత్రములు గలది. శరీరమంతట ఎర్రని రేఖలుండును. జల సమీప భూమిపై సంచరించుచుండును. ఇది మిక్కిలి అభిష్యందిగా నుండుట వలన అతికష్టమైన సమస్తవ్యాధులను పుట్టించును. అభిష్యంది యనగా "స్రోతసాం మాలిన్యేన స్రావకమ్" అని అర్థము చెప్పబడినది. ఆమ విషమును గూర్చి "మాత్రాశితీయము" నందు చెప్పబడును.

**వి. వ్యా :** ఏ పదార్థములు తరచుగ కఫమును వృద్ధిపరచునో, ఆ పదార్థములు అభిష్యందిగ నుండును. అభిష్యందికర పదార్థములు ఆలస్యముగ జీర్ణమగును. ఏ వస్తువులు ఆలస్యముగ జీర్ణమగునో ఆ వస్తువులు జాఠరాగ్నిని మందముగ చేయును. అగ్ని మందగించుట వలన ఆహారము పచింపకపోగా శరీరమునందు ఆమవిషము నుత్పన్నము చేయును. ఇది చాలా కష్టసాధ్యము. ఎందుకనగ ఆమమును పచింపచేయుటకు, ఉష్ణ చికిత్స చేయవలయును. ఉష్ణ చికిత్స విషమునందు విరోధియగును. విషమునందు శీతలమైన ఉపచారములు ముఖ్యముగ చేయదగినవి. ఈ శీతలోపచారములు ఆమమునందు విరోధించును. కాన ఆమ విషమునకు చికిత్స చేయుట కష్టసాధ్యము.

మూ॥ సర్వంచామ్లం పయసైకధ్యం విరుద్ధమ్। తత ఉత్తరం వావిరుద్ధం ఫలంచ కంగు వరక మకుష్ఠ వేల్ల కులత్థ మాష నిష్పావాశ్చ। న మూలకాది హరితం భక్షయిత్వా పయః సేవ్యం కుష్ఠాబాధ భయాత్। పౌష్కరం రోహిణీకం జాతుకం వా శాకం సహ మధుపయోభ్యాం నాభ్యవహరేత్। తాభ్యాంచసహ కపోతాన్ సర్షప తైలభృష్టాన్ తథాసర్షపతైల భృష్టానాంమత్స్యబదరాణాంబద రాణిశ్వావిడ్వరాహ మాంసం చైకధ్యం పిత్తేనామమాంసాని,దధ్నా కుక్కుటమ్, పృషతంచ కుసుంభ శాకే నౌరభ్రం, సౌవీరకేణ తిలశష్కులీః। క్షీరేణ లవణం, మూలకేన మాష సూపం, నవనీతేన శాకం, ఉపోదకాం మైరేయ మార్ద్వీ కాభ్యాం, పీలూని కరీరైః, బిసైర్విరూఢకాని. దధ్నామాష సూపేన, గుళేన మధునా ఘృతేనవాలికుచ ఫలం, దధ్నా తక్రేణ తాల ఫలేన వా కదళీ ఫలం, పిప్పలీ మరిచాభ్యాం మధునా గుళేన వా కాకమాచీం, తామేవ మత్స్యపచనే, శృంగిబేర పచనేవా భాజనే సిద్ధామన్యత్ర వాసిద్ధాం రాత్రి ముషితాం, కంస భాజనే, దశరాత్రోషితం సర్పిర్మద్య దధి మధుభల్లాత కేషుచోష్ణమ్ ॥

**ప్రతిపదార్థము :** సర్వం చామ్లం=పుల్లని పదార్థములన్నియూ, పయసా=పాలతో, ఏకధ్యం=ఒకేతూరి, విరుద్ధమ్=విరుద్ధమైనవి, కంగు= కొర్రలు, వరక=ప్రేంఖణము, మకుష్ఠ=అడవి పెసలు, వేల్ల=వాయువిడంగ ములు, కులుత్థ=ఉలవలు, మాష=మినుములు, నిష్పావాశ్చ=అనుములున్నూ,

తతో త్తరమ్=వీటిని సేవించిన తరువాత కూడ, విరుద్ధమ్=విరోధమును చేయును, కుష్ఠాబాధభయాత్=కుష్ఠము బాధించునను భయము వలన, మూల కాది హరితశాకం=ముల్లంగి మొ॥ హరితశాకమును, భక్షయిత్వా=తిని, పయః=పాలు, న సేవ్యం=సేవింపదగదు, పౌష్కరంశాకం=పుష్కరమూల శాకము, రౌహిణీకం శాకం=రౌహిణీకశాకమును, జాతుకం శాకంవా=లేక జాతుక శాకమును, మధుపయోభ్యాంసహ=తేనె పాలతోకూడ, నాభ్యవహ రేత్=తినకూడదు, సర్షపతైలభృష్టాన్ = ఆవాల నూనెలో వేయించిన, కపో తాన్=పావురములను, తాభ్యాం=ఆతేనెపాలతో, నాభ్యవహరేత్=తినకూడదు, తథా=అట్లే, సర్షపతైలభృష్టాం = ఆవాలనూనెలో వేయించిన, మత్స్య బదరాణాం=చేపలు, రేగుపండ్లయొక్క సంబంధమైన విరుద్ధములను, బదరాణి= రేగుపండ్లు, శ్వావిడ్వరాహ మాంసం=శ్వావిణ్మాంసమును, పంది మాంసమును, ఏకధ్యం=ఒకేతూరి, పిత్తేన=పిత్తముతో, ఆమ మాంసాని=ఆమమాంసములు, విరుదాని=విరుద్ధమైనవి, దధ్నాసహ=పెరుగుతో, కుక్కుటః=కోడి, చ= మరియు, పృషతం=పృషతమును, విరుద్ధః=విరోధము, కుసుంభశాకేన=కుసుమ శాకముతో; ఔరభ్రమ్ = మేకల మాంసము, సౌవీరకేణ = కాంజికముతో, తిలశష్కులీః = తిలశష్కులి, నువ్వుల చక్కిలములు, క్షీరేణ = పాలతో, లవణం=ఉప్పును, మూలకేన=ముల్లంగితో, మాషసూపమ్ =మినప పప్పును, నవనీతేన = వెన్నతో, మూలశాకమ్=ముల్లంగిశాకమును, ఉపోదకామ్=దుంప బచ్చలిని, మైరేయ మృద్వీకాభ్యాం = మైరేయ మృద్వీకములతో, పీలూని= తాటిచెక్కలు, గొలుగుచెట్లు, కరీరైః = వెణుతురు, వెదురు మొలకలచేత, విరుద్ధః=విరోధము, బిసైః=తామర తూండ్ల చేత, విరూఢకాని= మొలక లెత్తిన ధాన్యములు, విరుద్ధాని=విరుద్ధములు, దధ్నా=పెరుగుతో, మాష సూపేన=మినపపప్పుతో, గుళేన = బెల్లముతో, మధునా=తేనెతో, ఘృతేనవా= లేక నెయ్యితో, లికుచ ఫలమ్ = నిమ్మపండు, విరుద్ధమ్ = విరోధమైనది, దధ్నా = పెరుగుతో, తక్రేణ=మజ్జిగతో, తాలఫలేన = తాటిపండుతో, కదళీ ఫలమ్=అరటిపండు, విరుద్ధమ్=విరోధము, పిప్పలీమరిచాభ్యాం=పిప్పళ్ళు మిరి యములచేత కలసిన, మధునా=తేనెతో, అథవా=లేక, గుళేన=బెల్లముతో, కాకమాచీం=కాకమాచిని, తామేవ=ఆ కాకమాచినే, మత్స్యపచనే= చేపలు వండిన, శృంగబేర పచనేనా=అల్లము వండిన, భాజనే=పాత్రయందు సిద్ధాం=తయారుచేసిన, రాత్రి ముషితాం=రాత్రి వాసము చేయబడినది (చద్దిది), నాద్యాత్ = తినరాదు, కాంస్యభాజనే=కంచుపాత్రలో, దశరాత్రో షితమ్=పది దినములుంచబడినది, సర్పిః=నెయ్యి, నాద్యాత్ = తినరాదు, మద్య=మద్యము, మధు=తేనె, దధి=పెరుగు, భల్లాతకేషు=జీడిగింజలయందు, ఉష్ణమ్=వేడి పదార్థాలను, నాద్యాత్ = తినరాదు.

**తాత్పర్యము:** పరస్పర విరుద్ధాన్నములను ఎప్పుడును భుజింపరాదు.

అన్నివిధములయిన పులుపుగలపదార్థములను, పలుచనయినవిగాని, గట్టిగానున్నవి గాని అయిన కాంజికము, చింతపండు మొ॥ పదార్థములను పాలతో కలిపి తినరాదు. మరియు పాలు త్రాగిన తరువాత కూడ, పులుపు పదార్థములను తినకూడదు. అట్లే పులుపు పదార్థములను సేవించినతరువాత పాలను త్రాగ కూడదు. ఇట్లే కొర్రలను, అర్కలను, ప్రియంగువును, ఉలువలను, మినుము లను తినిన తరువాత, పాలను త్రాగ కూడదు. ఇట్లే పచ్చివిగా నున్న ముల్లంగి మొ॥ వాటిని కూరగా చేసుకొని తినిన తరువాత, పాలనుసేవించిన యెడల, కుష్ఠ రోగముసంప్రాప్తించును. పుష్కరమూలశాకమును, రోహిణీకశాకమును, జాతుక శాకమును తేనె, పాలతో కలిపితినకూడదు. ఆవాలనూనెలోవేయించిపావురములను తేనె,పాలతోకలిపి తిన కూడదు. అట్లే చేపల,పందులయొక్క మాంసమును ఆవాల నూనెలో వేయించి తిన కూడదు. రేగు పండ్లను, కుక్క, పంది మాంసమును, ఒకేసారి తినకూడదు. అపక్వములైన మాంసములను, పిత్త ముతో కలిపి తినకూడదు. చిత్రవిచిత్రములైన మృగములు, కోడి వీటియొక్క మాంసములను పెరుగుతో కలిపితినకూడదు. కుసుంభ శాకముతో మేకయొక్క మాంసమును కలిపి తినకూడదు. కాంజికముతో, నువ్వులతో చేసిన చక్కిలము లను తినకూడదు. పాలలో ఉప్పునుచేర్చి త్రాగరాదు. ముల్లంగితో మినప పప్పును తినకూడదు. వెన్నతో మూలశాకమును తినకూడదు. మైరేయము, ద్రాక్షాసారాయముతోకూడ, దుంపబచ్చలి కూరను తిన కూడదు. తామర తూండ్లతో కలిపి మొలకెత్తిన ధాన్యములను తినకూడదు. పెరుగుతో మినప పప్పుతో, బెల్లముతో, తేనెతో, నెయ్యితో,కలిపి నిమ్మపండ్లను తినరాదు. పెరు గుతో, మజ్జిగతో, తాటి పండ్లతో కలిపి అరటి పండ్లను తినకూడదు.పిప్పళ్ళు, మిరి యములతో తేనెతో, బెల్లముతో కాకమాచీ శాకములు తినరాదు. చేపలు వండిన, అల్లము వండిన పాత్రయందుకాని, మరియొక చోట తయారు చేసినది కాని, ఒకరాత్రి నిల్వయుంచినది కాని, కాకమాచితో కలిపి తినకూడదు. పదిదినములకుపైన కంచుపాత్రలో నిల్వ యుంచిన నెయ్యి నిషేధింప బడినది. మద్యము, పెరుగు, తేనె, జీడిగింజలు, వీటియందు వేడి పదార్థములను కలిపి తినకూడదు.

*శశిలేఖ :* పుల్లనైన మద్యము, ధాన్యామ్లము మొ॥ సమస్త పదార్థము లను, పాలతోకలిపి తిన కూడదు. పాలను త్రాగిన వెంటనే తినకూడదు. ఇతర రసములుకల ఏ పండ్లనుకూడ, పాలతో కలిపిగాని, పాలను తాగిన తరువాత గాని తినిన యెడల, విరుద్ధ మగును. కుష్ఠవ్యాధి బాధించునను భయము వలన, ముల్లంగి మొ॥ పచ్చిగానున్న పదార్థములను, తిని పాలను త్రాగరాదు. పుష్కర మూల శాకమును పాలు, తేనెతో కలిపి తినరాదు. అట్లే ఆవాల నూనెలో వేయించిన పావురములను, తేనె, పాలతో కలిపితినరాదు. అట్లే ఆవాల నూనెలో వేయించిన చేపల్ను, రేగుపండ్లను, తద్విరుద్ధములైన, రేగు

పండ్లను పాలతో సేవింపరాదు, అపక్వములైన మాంసములను పిత్తముతో కలిపి తిన రాదు. పెరుగుతో కలిపి కోడి మాంసమును తినరాదు. దుప్పి మాంసము పెరుగుతో కలిపి తినరాదు. కుసుంభ శాకముతో మేక మాంసము విరుద్ధమైనది. కాంజికముతో నువ్వులతో చేసిన చక్కిలములు విరుద్ధములైనవి. పాలలో ఉప్పు కలపి తాగరాదు. దధి మొ॥ వాటిలో నిమ్మపండు కలిపి తినరాదు. దధి మొ॥ వాటిలో అరటి పండు విరుద్ధము. పిప్పళ్ళు మిరియములతో కలిపి గాని, కేవలము తేనెతో, బెల్లముతోగాని కాకమాచిని సేవింపరాదు. అల్లమును పక్వము చేసిన పాత్రయందుగాని, చేపలు వండిన పాత్రలోగాని సిద్ధముచేసిన కాకమాచిన భుజింపరాదు. వేరే పాత్రయందు సిద్ధముచేయబడిన కాకమాచిని, ఒక రాత్రి నిల్వయుంచి మరునటిరోజు తినకూడదు. కంచుపాత్రలో పది దినములకు పైన నిల్వయుంచిన ఘృతము నుపయోగింప కూడదు. 10 దినముల వరకు విరోధముకాదు. 10 దినముల తరువాత విరోధించునని భావము. మద్యాదుల నుపయోగించిన తరువాత, వేడిగా నున్న పదార్థములను భుజింపరాదు.

సూ॥ తక్రసిద్ధ కాంపిల్లకో విరుద్ధః। అంగార శూల్యో భాసః। సురా కృసరా పాయసా శ్చైకధ్యం విరుద్ధాః॥

*ప్రతిపదార్థము ;* తక్ర = మజ్జిగతో, సిద్ధ = తయారు చేయబడిన, కాంపిల్లకః = కాంపిల్లకము, విరుద్ధః = విరుద్ధము, నిప్పులయందు, అంగార శూల్యః = శూలముతో, సంస్కరింపబడిన, భాసః = భాస పక్షి, విరుద్ధః = విరుద్ధము, సురా = కల్లు, కృసరా = నువ్వులు, బియ్యము, మినపపప్పు వీటిని కలిపి తయారు చేసిన పులగమును, పాయసా = పాయసమును, ఏకధ్యం = ఒకేసారి కలిపి తినిన, విరుద్ధాః = విరుద్ధములు.

**తాత్పర్యము :** మజ్జగలో సిద్ధము చేయబడిన కంపిల్లము విరోధకముగా నున్నది. నిప్పులపైన శూలముతో కాల్చబడిన భాసపక్షి, విరుద్ధము. సురా, కృసరము పాయసము ఒకటిగా కలిపి తినుట విరుద్ధము.

*శశిలేఖ :* విశేషము లేదు.

మూ॥ మధు సర్పిర్వసా తైలోదకాని, సమధృతాని ద్విశస్త్రిశః సమస్తానివా। మధుఘృతే భిన్నాంశే దివ్యోదకానుపానే। మధు పుష్కర బీజం పద్మోత్కారికాశాకం శార్కరో మైరేయో మధుచ సహోపయుక్తం విరుద్ధమ్, వాతంచాతి కోపమతి, హారిద్రకః సర్షపతైలభృష్టో విరుద్ధః। పిత్తంచాతి కోపయతి, పాయసో మంథానుపానో విరుద్ధః। శ్లేష్మాణం చాతికోపయతి। ఉపోదకా తిలకల్క సిద్ధా పేతురతి సారస్య। వలాక వారుణ్యా కుల్మాషైశ్చ విరుద్ధా। సైవ వరాహ వసయ పరిభృష్టా సద్యో వ్యాపాదయతి। గోధా లావ తిత్తిః మయూర కపింజలాశ్చైరండ దార్వగ్ని సద్ధా। ఏరండతైల సమ్మూ

ర్భితాః, హరిత మాంసం హారిద్రా శూలకా, వస క్తం హారిద్రాగ్ని ప్లుష్టమ్‌చ, తదేవ భస్మ పాంశు పరిశు పరి ధ్వస్తమ్ సక్షౌద్రంచ॥

ప్రతిపదార్థము : మధుసర్పిర్వసా తైలోదకాని = తేనె, నెయ్యి, వస, నువ్వుల నూనె. నీళ్ళు; సమధృతాని=సమానముగ గ్రహించినవి, ద్విశః=రెండు గాని, త్రిశోవా=మూడుగాని, సమస్తాని=అన్నింటిని కలిపిగాని, నాద్యాత్ = తినరాదు.

**తాత్పర్యము :** తేనె, నెయ్యి ఈ రెంటిని సమాన భాగములుగా తీసుకొని ఉపయోగింపరాదు. తేనె నెయ్యి వస నువ్వుల నూనె ఈ నాలుగింటిని సమాన మాత్రగ నుపయోగింపరాదు. తేనె నెయ్యి వస ఈ మూండింటిని సమాన మాత్రలో సేవింపరాదు. ఇట్లు అంశాంశకల్పనా భేదములతో 26 విరుద్ధ భేదములు గలవు.

ప్రతిపదార్థము : మధు ఘృతేవా = అసమాన పరిమాణములో తేనె, నెయ్యిని, దివ్యోదకానుపానే=వర్ష జలాను పానముగ, విరోధః = విరోధము, మధు=తేనె,పుష్కరబీజం=తామరగింజలు,విరోధమ్=విరుద్ధమైనవి,పద్మోత్తరికా శాకమ్=పద్మోత్తరికాశాకము, శార్కరః=శర్కరాసవము,మైరేయః=మైరేయ మను మద్యము, మధుచ = మరియు తేనెయు, సహఉపయుక్తమ్ = కలిపి తీసుకొన్నయెడల, సర్వంవిరుద్ధమ్ = అంతయు విరుద్ధము కాగలదు, వాతంచ=మరియు వాతమును, అతి కోపయతి=మిక్కిలి ప్రకోపింప చేయును.

**తాత్పర్యము :** వర్షజలములతో అసమాన పరిమాణములో తేనె, నెయ్యి కలిపి అనుపానముగ సేవింపరాదు. తేనె, తామర గింజలు కలిపి భుజింపరాదు. పద్మోత్తరికాశాకము, శర్కరాసవము, మైరేయమను మద్యము, తేనెతో గూడ కలిపి సేవించుట విరోధము, ఇవన్నియు పరస్పర విరుద్ధ ద్రవ్యములుకాన వాతమును మిక్కిలి ప్రకోపింప జేయును. మరియు పిత్తమ్మును, కఫమును కొంచెము తక్కువగా ప్రకోపింప చేయునని భావము.

ప్రతిపదార్థము : హారిద్రకః=హారిద్రకమను పేరుగల భూమిలో పుట్టిన కందము, వర్షపతైలభృష్టః = ఆవాల నూనెలో వేయించినవి, విరుద్ధః= విరుద్ధముగా నుండును, చ=మరియు, పిత్తమ్ =పిత్తమును, అతికోపయతి= మిక్కిలి ప్రకోపింప చేయును.

**తాత్పర్యము :** ఆవాల నూనెలో వేయించిన గొడుగు ఆకారముగల శాకము లేక హారిద్రక పక్షిలేక కంద విశేషము విరోధముగా నుండును. మరియు, ఆ ఆహారము పిత్తమును మిక్కిలి ప్రకోపింప చేయును.

ప్రతిప్రదార్థము : పాయసః=పాయసము,మంథానుపానః=మంథమును త్రాగుట,విరుద్ధః=విరుద్ధము;చ =మరియు, శ్లేష్మాణాం=శ్లేష్మమును; అతికోప

యతి=మిక్కిలి ప్రకోపింప జేయును; ఉపోదక=దుంపబచ్చలి,జతిలకల్క సిద్ధ= నువ్వులయొక్క కల్కముతో సిద్ధము చేయబడినది; అతిసారస్య=అతి సారము నకు, హేతుః=కారణము; బలాకా=కొంగ, వారుణ్యా=వారుణి యను మద్య ముతో,కుల్మాషైశ్చ=మరియుపులియబెట్టినకడుగునీళ్ళతో,విరుద్ధ=విరోధముగా నున్నది; సైవ=ఆ నీటికొంగ, వరాహ వసాపరిభృష్టాః = పందియొక్కవసలో వేయించినది, సద్యః=వెంటనే, వ్యాపాదయతి=చంపుచున్నది.

**తాత్పర్యము :** పాయసమును త్రాగి నీటిలో కలిపిన సత్తువులయొక్క మంథమును త్రాగుట విరోధము. ఇట్లు తాగిన యెడల, కఫ దోషము శరీరము నందు మిక్కిలి ప్రకోపించును. తిలకల్కముతో సిద్ధము చేయబడిన దుంప బచ్చలి కూర అతిసార వ్యాధికి హేతువగును. నీటికొంగ వారుణీ మద్యముతో పులియ బెట్టిన కడుగు నీళ్ళతో (లేక గోధుమలలో) కూడ తినిన విరోధము. ఈ నీటి కొంగను పందియొక్క వసలో వేయించి తినుటవలన వెంటనే మరణము కల్గును.

**ప్రతిపదార్థము :** గోధా=ఉడుము, లావా=లావుక పిట్ట, తిత్తిరి= తీతువుపిట్ట, మయూర=నెమలి; కపింజలాః=కముజు పక్షులు. ఏరండ దార్వగ్ని సిద్ధాః=ఆముదపు కట్టెలతో సిద్ధము చేయబడినది, ఏరండతైల సమ్మూర్ఛితాః= ఆముదములో వేయించినవి, సద్యః = వెంటనే వ్యాపాదయతి=చంపును.

**తాత్పర్యము :** ఉడుము, లావుక పిట్ట, నెమలి, కముజు పక్షి మొ॥ పక్షి విశేషములును, ఆముదపు కట్టెలతో పక్వము చేసినదిగాని, మరియు ఆముద ములో వేయించినవిగాని వెంటనే మరణాంతకమగును.

**ప్రతిపదార్థము :** హారీతమాంసం = హారీత పక్షియొక్క మాంసమును, హారిద్ర శూలకావసక్తమ్=దారు హారిద్రయొక్క కాష్ఠముపైన చుట్టి అగ్ని యందు కాల్చినదిగాని, చ = మరియు, హారిద్రాగ్ని ప్లుష్టమ్=దారు హారిద్ర యొక్క కాష్ఠమును అగ్నిపైన సిద్ధము చేయబడినదియును, సద్యః వ్యాపాద యతి=వెంటనే చంపును, తదేవ=హారీత పక్షియొక్క మాంసమే, భస్మపాంశు పరిధ్వస్తమ్ = బూడిద, ధూళిలో కలిపినదియును, చ = మరియు, సక్షౌద్రం = తేనె కలిపినదియును, సద్యఃవ్యాపాదయతి=వెంటనే చంపును.

**తాత్పర్యము :** హారిత పక్షియొక్క మాంసమును, దారుహారిద్రయొక్క కట్టెకుచుట్టి, దారుహారిద్రయొక్క నిప్పులలో కాల్చి తినుటచేత వెంటనే మర ణము సంభవించును. హారీత పక్షియొక్క మాంసమును బూడిద మరియు ధూళిలోకలిపిన తర్వాత తేనెలోకూడచేర్చి తినుటవలన మరణము సంభవించును.

**శశిలేఖ :** మధు మొ॥ వాటిన్ని రెండ్రెండుగాగాని, మూడేసిగాని సమాన భాగముగల నేతితో పరస్పరము సమమైన ప్రమాణముతో కలిపి తిన రాదు. తేనె, నెయ్యి, వస, తైలము, జలము వీటిని సమప్రమాణములుగా తీసు

కొనరాదు. అట్లే విషమ భాగములుగా గ్రహించిన వర్షజలము, అనుపానము గాగల తేనె, నెయ్యి విరుద్ధములు. తేనె తామరగింజలు విరుద్ధములు. పదోష్మి త్తరికా శాకములు పరస్పర విరుద్ధములు. వాతమును ప్రకోపింప జేయును. శర్కరతో చేసిన మద్యము, కర్జూరాస్రావము, సర్షప తైలభృష్టమైన తైలము విరుద్ధము. హారిద్ర మనగా భూమి నుండి పుట్టిన కందరూపము. అది పిత్తమును ప్రకోపింప చేయును. పాలతో సంస్కరింపబడిన యన్నము, మంథము నను పానముగ చేసుకొనిన విరుద్ధము. మరియువాత శ్లేష్మలను ప్రకోపింప జేయును. అతిసారమునకు కారణభూతమగు తిలకల్కముతో సిద్ధముచేసిన దుంపబచ్చలి కూరను తినరాదు. నీటి కొంగను, వారుణి మద్యముతో తినరాదు. ఆ నీటి కొంగను పంది యొక్క వసతో భర్జనము చేసినచో అదివెంటనే చంపును. గోధా దులు ఆముదపు కట్టెల నిప్పులలో సిద్ధము చేసినది, ఏరండ తైలములో వేయించి నవి విరుద్ధములు. హారీత మాంసము భస్మముచేత, ధూళిచేత నశింపబడి తేనెతో కూడ సేవించిన విరుద్ధమని చెప్పబడినది,

మూ॥ తథామత్స్య న్నిస్తాళిత స్నేహసాధితాః పిప్పల్యః శీతోష్ణం నవ పురాణ మామపక్వంచ సైకథ్య మద్యాత్। సలిలాభ్యవగాహః సహసోష్ణాభి తప్తస్య తద్గ్రుష్ట్యోరుపఘాతాయ తృష్ణాఽభివృద్ధయేచ। తథైవచ పయఃపానం రక్తపిత్తాయ శరీరేణాయస్తస్య సహసాఽభ్యవహారశ్ఛర్దిషే గుల్మాయ వా। వాచాత్యాయస్తస్య స్వరసాదాయ। ఇత్యన్నపాన ద్రవ్య విరోధైక దేశోబాహు ల్యేనోపయోగీ కథితః। భేషజ ద్రవ్యాణాంతు యథోపదేశమేవ ప్రయోగో న్యాయ్యతరః। తద్విరోధః పునరతి ప్రసఙ్గ భయాన్నోక్తః। నచ తద్విజ్ఞానమే కాన్త భద్రకమ్॥ అపిచ॥

**ప్రతిపదార్థము :** తథా = అట్లే, మత్స్యానిస్తాళిత స్నేహ సాదితాః = చేపలను వేయించిన తైలముతో సిద్ధము చేయబడిన, పిప్పల్యః = పిప్పళ్ళు, విరుద్ధాః = విరుద్ధములు, శీతోష్ణమ్ = శీత, ఉష్ణవీర్యములను, నవపురాణం = కొత్త పాత ధాన్యములను, చ = మరియు, ఆమపక్వమ్ = సరిగా పక్వముకాని, సరిగా పక్వమైన దానిని కలిపి, ఏ కథ్యం = ఒకేతూరి, నాద్యాత్ = తినకూడదు, సలిలాభ్యవగాహః = చల్లని నీటిలో స్నానము చేయుట, ఉష్ణాభిత ప్తస్య = వేడితో తపించుచున్న వానికి, సహస = వెంటనే, త్వగ్దృష్ట్యోరుపఘాతాయచ = చర్మము యొక్క, కంటి యొక్క నాశము కొరకు, చ = మరియు, తృష్ణాఽభివృద్ధయే = దప్పి ఎక్కువగుట కొరకు, తథైవచ = మరియు అట్లే, పయఃపానమ్ = పాలు త్రాగుట, రక్తపిత్తాయ = రక్తపిత్తము కొరకు, భవతి = అగుచున్నది, తస్య = అట్టివానికి, శరీరేణ = శరీరముతో, ఆయః = శ్రమ ఏర్పడినప్పుడు, సహసా = వెంటనే, అభ్యవాహారః = భోజనము చేయుట, ఛర్దిషే = వాంతి కొరకు, గుల్మాయ = గుల్మముకొరకు, వా = లేక, తస్య = అట్టివానికి, వాచాత్యాయః =

మన్న పదార్థములను ఒకటిగా చేర్చి తినకూడదు. అట్లే క్రొత్త, పాత ధాన్యములను కలిపి తినకూడదు. పచ్చివిగానున్న, పండిన ఫలాదులను ఒక్కటిగా చేర్చి తినకూడదు. వేడితో, అగ్ని మొ॥ వాటితో, ఎండతో తప్తుడైన వానికి, ఆ సమయమునందే నీటిలో, మునుగుట వలన చర్మమునకు, కంటికి హానిగల్గును, దప్పికూడ అభివృద్ధియగును. అట్లే వేడితో తపించుచున్న వాడికి వెంటనే పయఃపానము రక్తపిత్తమును కల్గించును. ఎక్కువగా మాట్లాడుటచేత, మిక్కిలి శ్రమ యేర్పడిన వానికి వెంటనే భుజించుట వలన కంఠము బొంగురుపోవును. ఈ విధముగా అన్నపాన ద్రవ్యముల యొక్క ప్రయోగము, ఎట్లు చేయవలెననెడు దానికి సమాధానమిట్లు చెప్పుచున్నాడు. శాస్త్రోపదేశమును బట్టియే తెలిసి, తెలియని ద్రవ్యముల యొక్క ప్రయోగము మిక్కిలి న్యాయముగా నుండును. భేషజద్రవ్యములయొక్క పరికల్పన స్వబుద్ధితో ఎక్కడ చేయబడుచున్నదో అచట శాస్త్రము ననుసరించియే చేయుట న్యాయము. ఎందువల్ల ననగా భేషజద్రవ్యముల యొక్క పరస్పర విరోధమును సరిగా తెలియని, స్వల్పబుద్ధిగల వైద్యుడు ఒకప్పుడు మోహమును చెందును. అందువలన సమస్తములైన ద్రవ్యములను ఎరిగిన వాడై వైద్యుడు శాస్త్రప్రకారముగా యూహించుట మంచిది. అందువలన యథోపదేశమైన ప్రయోగమే మిక్కిలి న్యాయము. వైద్యుడుచేయు యూహకూడ యథాశక్తి శాస్త్రము ననుసరించియే చేయవలెను, ఇచట అపిచ అనునది సముచ్చయార్థము.

మూ॥ ఉత్క్లేశ్య దోషాన్నహరేత్ ద్రవ్యం యత్తత్సమాసతః।
విరుద్ధం తద్ధి ధాతూనాం ప్రత్యనీక తయా స్థితమ్॥
బలినాం మిథో గుణానాం విషమతయా సమతయా పృథయథాఽపి।
సంస్కారాద్వశేన చ భవతి నిసర్గాదపి విరోధః
క్షీరం కలత్థైః పనసేన మత్స్యైస్తప్తం
దధి క్షౌద్ర ఘృతే సమాంశే
వార్యుష్ణకే రాత్రిషు సక్తవశ్చ
తోయాన్త రాస్తే యవకాస్తథాచ॥
కుశాగ్రీయ ధియామేత దుదాహరణ మాత్రకమ్।
ఉపనీత బలం విద్వాన్ సర్వత్ర క్రమతే యతః॥
విస్ఫోట శోఫ మద విద్రధి గుల్మ యక్ష్మ
తేజో బలస్మృతి మతీంద్రియ చిత్త నాశాన్॥
కుర్యాద్విరుద్ధ మశనం జ్వరమస్రపిత్త మష్టౌ
గదాంశ్చ మహతో విషవచ్చ మృత్యుమ్॥
తేష్వాశు కుర్యాత్సం శుద్ధిం శమం వాతద్విరోధిభిః।
ద్రవ్యైస్తైరేవ వా పూర్వం శరీరస్యాభిసంస్కృతిమ్।

వ్యాయామ స్నిగ్ధదీప్తాగ్ని వయస్థ బలశాలినామ్।
విరోధ్యపి నపీడాయై సాత్మ్యమల్పంచ భోజనమ్।
దోషాది వైపరీత్యేన హరతే రోగిణాం రుజమ్।
ఐకధ్యం దధి దుగ్ధాది యోజనా న విరుధ్యతే॥
యోగాది భేదా ద్యద్వద్వాప ధ్యావామృశ్య పథ్యతా।
తద్భేదాన్త రత స్తద్వద్విరోధోఽపి నివర్తతే॥

ప్రతిపదార్థము : సమాసతః = సంక్షేపముగ, యద్ద్రవ్యమ్ = యే ద్రవ్యము, దోషాన్ = వాతాది దోషములను, ఉత్క్లేశ్య = స్వస్థానమునుండి కదిలించి, నహరేత్ = శరీరమునుండి బహిర్గతము చేయదో, తద్ధి = ఆ ద్రవ్యమే, ధాతునామ్ = ధాతువులకు, ప్రత్యనీకతయా = విరుద్ధ రూపముగా, స్థితం = ఉన్నది, విరుద్ధమ్ = విరుద్ధమైనది.

తాత్పర్యము : మరియు సంక్షిప్తముగ, విరుద్ధ ద్రవ్యములను గురించి చెప్పవలయునన్న యే ద్రవ్యము దోషములను, బయటకు వెళ్ళగొట్టుటకు ఉద్యుక్తులనుగాచేసి, బయటకు పంపదో, ఆ ద్రవ్యము ధాతువులకు విరుద్ధముగా నుండుట వలన, అవి విరుద్ధములైన వానిగా చెప్పబడుచున్నవి.

ప్రతిపదార్థము : బలినామ్ = కొన్ని బలీయములైన ద్రవ్యములకు సంబంధించిన, మిథః = పరస్పరము, గుణానామ్ = గుణములయొక్క, విష మతయా = విషమత్వము చేత, సమతయా = సమత్వముచేత, ఉభయాదపి = సమత్వ, విషమత్వ మిశ్రమము చేతనున్నూ, సంస్కారాది వశాదపి = సంస్కారాది కారణము వలనన్నూ, నిసర్గాదపి = స్వభావము వలనన్నూ, = విరోధః = విరోధము, భవతి = అగుచున్నది.

తాత్పర్యము : కొన్నిబలీయములైన ద్రవ్యములలో పరస్పరము అస దృశ రూపములోనున్న గుణములతో, కొన్ని ద్రవ్యములలో సదృశ రూప ముతో నున్న గుణములతో, కొన్ని ద్రవ్యములలో, సదృశ, అసదృశ రూపముతో నున్నగుణములతో, కొన్ని ద్రవ్యములలో సంస్కారాది కారణ ముల వలన, కొన్నింటియందు స్వభావమే విరోధముగా నగుచున్నది.

ప్రతిపదార్థము : క్షీరం = పాలు, కులత్థైః = ఉలవలతో, మత్స్యైః = చేపలతో, పనసేన = పనసతో, క్షీరం = పాలు, తప్తం = కాచిన, దధి = పెరుగు, విరోధం = విరోధమైనది; సమాంశే = సమభాగములైన, ఘృతే = తేనె నెయ్యి, ఊషరే = చవిటినేలలోనుంచిన, వారి = ఉదకము, రాత్రిషు = రాత్రులయందు, సక్తవశ్చ = సక్తువు లున్నూ, తే = ఆ సక్తువులు, తోయాన్త రితాః = నీటి మధ్యన యుపయోగించుట, తథైవ = అట్లే, యవకాః = కేవల అలసందలు, కారుమినుములు, యవకములు, విరుద్ధాః = విరుద్ధములు.

తాత్పర్యము : ఇచట పై అర్థమును బట్టి, ఉదాహరణములను చెప్ప

చున్నారు. (1) పాలు ఉలవలతో కూడకలిపి భుజించిన విరుద్ధాహారమగును. ఎట్లనగ, పాలు, మధుర విపాకము శీతవీర్యమైనవి. ఉలవలు, అమ్ల విపాకము, ఉష్ణవీర్యమైనవి. అసదృశ గుణముల కిది యుదాహరణము.

(2) పాలు పనస పండుతో కలిపి తినరాదు.

పాలు మధురరస, మధురవిపాక, శీతవీర్యములు గలవి. పనస పండు గూడ మధుర రసము, మధుర, విపాకము, శీత వీర్యము గలదైనప్పటిని విరోధించును. ఇది సదృశ గుణముల కుదాహరణము.

(3) పాలు చేపలు కలిపి భుజింపరాదు.

పాలు మధురరసము, మధురవిపాకము, శీతవీర్యము గలవి. చేపలు, ఉష్ణవీర్యముగలవి, మధుర రసము, మధురవిపాకము గలవి. కాని కలిపితినరాదు. ఇది అసదృశ, సదృశముల రెంటికి కారణ విరుద్ధమును చూపెట్టు ఉదాహరణము.

(4) వేడి చేసిన పెరుగు తినరాదు. ఇది సంస్కారమున కుదాహరణము.

(5) సమానమైన మాత్రలో తేనె నెయ్యి కలిపి తినరాదు. ఇది విరుద్ధాహారము, ఇది మాత్రకుదాహరణము.

(6) చవిటి నేలలో నుంచిన నీరు విరుద్ధమైన పానీయము. ఇది దేశమున కుదాహరణము.

(7) రాత్రులయందు సక్తువులను భుజింపరాదు. ఇది కాలమునకుదాహరణము.

(8) ఈ సక్తుపిండి ఉండలను నీళ్ళ మధ్యన భుజింపరాదు. (మొదట నీరు త్రాగి, వెంటనే సక్తుపిండి తిని, మరల వెంటనే నీరు త్రాగుట) సంయోగ విరుద్ధమున, కిది ఉదాహరణము.

(9) యవకములు, అలసందలు, కారుమినుములు ఒంటరిగా విరుద్ధములు. ఇది స్వభావమున కుదాహరణము.

ప్రతిపదార్థము : కుశాగ్రియ ధియామ్ = తీక్ష్ణబుద్ధి గలవారలకు, ఏతత్ = ఇది, ఉదాహరణ మాత్రకమ్ = ఉదాహరణ రూపముగా, అవదన్ = చెప్పిరి, యతః = ఎందుకనగా, ఉపనీతబలమ్ = మూడవ జన్మ వలన యేర్పడిన బుద్ధి బలముగల, విద్వాన్ = పండితుడు, సర్వత్ర క్రమతే = తనబుద్ధిచేతనే సర్వమును తెలుసుకొనుచున్నాడు.

**తాత్పర్యము** : తీక్ష్ణ బుద్ధి గల్గిన ఆయుర్వేద విద్వాంసులకు, పైనుదాహరించిన విషయము లన్నియు, ఉదాహరణ రూపముతో చెప్పబడినవి. ఎట్లనగా

వానికి, అజ్ఞానము తొలగినది. ఎవడు విద్వాంసుడుగా నుండి అన్నింటిని తన బుద్ధితో తెలుసుకొను చున్నాడో అనగా శాస్త్ర మర్యాదలను చక్కగా గ్రహించి, వాటి నన్నింటిని, అతడు తన బుద్ధిబలముచేత గ్రహించుచున్నాడు.

ప్రతిపదార్థము : విరుద్ధమశనం=విరుద్ధాహారము, విస్ఫోట=విస్ఫోటము, శోఫ=శోఫము, మద = మదము, విద్రధి = విద్రధి, గుల్మ = గుల్మము, యక్ష్మా=రాజయక్ష్మా, తేజ=తేజస్సు, బలా=బలమును, స్మృతి=స్మృతిని, మతి=బుద్ధిని, ఇంద్రియ = ఇంద్రియములను, చిత్త = మనస్సుయొక్క నాశాన్ =నాశములను, కుర్యాత్ =చేయును, చ=మరియు, జ్వర=జ్వరమును, అస్రపిత్తా = రక్తపిత్తమును, అష్టాగదాంశ్చ = ఎనిమిది మహారోగములను (వాతవ్యాధి) అశ్మరి, కుష్ఠము, ప్రమేహము, ఉదరము, భగందరము, అర్శస్సు గ్రహణి); తథా =అట్లే, విషవత్ =విషముతో సమానముగా, మృత్యుమ్= మరణమును, కరోతి = చేయుచున్నది.

తాత్పర్యము : విరుద్ధద్రవ్యములతో కూడిన ఆహారము, విస్ఫోటాది వ్యాధులను కల్గించుటయే కాక విషముతో సమానమైన మరణమును కూడ కల్గించుచున్నది.

ప్రతిపదార్థము : తేషు = విరుద్ధాహార జనిత రోగములయందు, ఆశు= శీఘ్రముగా, సంశుద్ధిన్ = వమన విరేచనాది రూపమైన శోధన చికిత్సను, కుర్యాత్ =చేయవలెను; అథవా =అట్లు కానియెడల, తద్విరోధిభిః=ఈ విరుద్ధాహారములకు విపరీత గుణములు కల్గిన ద్రవ్యములతో, శమమ్ =శాంతిని, కుర్యాత్ =చేయవలెను, అథవా = అట్లు కాని పక్షమున, పూర్వమ్ =మొదటనే, తైరేవద్రవ్యైః = ఆ ద్రవ్యములతోనే, శరీరస్య = శరీరమునకు, అభిసంస్కృతిమ్ =ఎల్లప్పుడు ఉపయోగించుటతో, శరీరమునకు సంస్కారమును, కుర్యాత్ =చేయవలెను.

తాత్పర్యము : విరుద్ధాహారము వలన, జనించిన వ్యాధులలో పంచకర్మ చికిత్సాంతర్భాగములైన, వమన విరేచనాది కర్మములతో, శరీరమును శోధించవలయును. అట్లుకాని పక్షమున విరుద్ధాహారమునకు విపరీత గుణములు కల ద్రవ్యములతో శమనచికిత్స చేయవలెను. అట్లుకాని పక్షమున మొదటనే ఏ ఆహార పదార్థములు శరీరమునకు విరుద్ధమును చేయవో, ఆ ఆహార పదార్థములను నిత్యము ఉపయోగించుచూ శరీరమునకు ఓకసాత్మ్యమును గల్గించవలయును.

ప్రతిపదార్థము :వ్యాయామ=వ్యాయామము చేయువారు, స్నిగ్ధ=స్నిగ్ధ శరీరులు, దీప్తాగ్ని=జాఠరాగ్ని తీక్ష్ణముగా నున్నవారు, వయస్థ=యవ్వనవంతులు, బలశాలినాం =బలిష్ఠమైన వ్యక్తులకు, సాత్మ్యమ్ =ఓకసాత్మ్యమైన

చ = మరియు, అల్పమ్ = స్వల్పమైన, భోజనమ్ = భోజనము, విరోధ్యపి = విరోధమైన దైనప్పటికి గూడ, నపీడాయై = దుఃఖమును కల్గించునది కాదు.

తాత్పర్యము : నిరంతరము వ్యాయామముచేయు వారలకు, స్నిగ్ధశరీరులకు, దీప్తాగ్ని కలవారలకు, యవ్వన వంతులకు, బలవంతులకు, దేశకాలాదుల నపేక్షించి, సాత్మ్యమైన, స్వల్పమైన భోజనము విరుద్ధమైన దైనప్పటికి, ఆ విరుద్ధమైన ఆహారము బాధింపదు.

ప్రతిపదార్థము : దోషాది వైపరీత్యేణ = దోషదూష్య బలాది పదివిధములైనవైపరీత్యములచేత, రోగిణః = రోగియొక్క, రుజం = బాధను, హరంతి = నశింప చేయు చున్నట్టి, దధిదుగ్ధాది యోజన = పెరుగు పాలు మొ॥ వాటియొక్క సంయోగము, ఐకధ్యం = వెంటనే, నవిరుధ్యతే = విరోధించదు యోగాది భేదాత్ = యోగాది భేదము వలన, యద్యత్ = ఏదైతే, పథ్యా నాం = పథ్య ఆహారము కూడ, అపథ్యతా = అపథ్యమగుచున్నది, తద్భేదాంతరతః = యోగము మొ॥ వాటియొక్క భేదములు కారణముగా, తద్వద్విరోధోపి = అట్లే విరోధము కూడ, నివర్తతే = తొలగింప బడుచున్నది.

తాత్పర్యము : దోషము, దూష్యము, బలము, కాలము మొ॥ వాటికి విపరీతమేర్పడి నప్పటికి, విరుద్ధ ద్రవ్యసేవన, రోగకారకముకాక రోగశాంతికే అది దోహదమగు చున్నది. ఎట్లనగా ప్రతినిత్యము సేవించుట, వలన, సాత్మ్యమైన పాలు పెరుగు, ఒకచోట చేర్చి భుజించి నప్పటికిని, విరుద్ధమును చేయవు. మరియు సుఖమును కల్గించును. సంయోగమే కారణముగాగల పథ్యపదార్థము కూడ అపథ్యముగా మారును. సారాంశమేమనగా, పథ్యద్రవ్య సంయోగము వలన విరోధమేర్పడు చున్నది. అపథ్యద్రవ్య సంయోగ విశేషము వలన విరోధము నష్టమగుచున్నది. విశేషమేమనగా కొన్నిదినములు సేవించుట వలన, అపథ్య ద్రవ్యముకూడ సాత్మ్య మగుచున్నది. కాని యథార్థముగా అది అపథ్య ద్రవ్యమే యగును, ఇందువలన సాత్మ్యమైన అపథ్యమును కూడ, అంశాంశముగా వదలి పెట్టుట శాస్త్ర సమ్మతము.

**శశిలేఖ** : సంక్షేపముగా విరుద్ధమన నేమియో చెప్పుచున్నాడు. వాత, పిత్త, శ్లేష్మలను దోషములను తమ స్థానములనుండి కదల్చి, ఏ ద్రవ్యము ఆ దోషములను వెలుపరచుటకు గాని శాంతింప చేయుటకుగాని శక్తి లేక యుండునో అది విరుద్ధమైన ద్రవ్యమని చెప్పబడు చున్నది. అట్టి ద్రవ్యము రసాది ధాతువులకు ప్రతిపక్ష స్థానములో నుండును. సంయోగ ద్రవ్య గుణములు బలీయములైనపుడు, విషమముగా పోలిక లేకుండా ఒకదాని కొకటి కలిసి యుండుట విరోధము, అట్లే మరియొక చోట బలీయములైన గుణములకు పోలికగల గుణములకు విరోధము. అట్లే మరియొక చోట రెంటికి విరోధము. ఏదియో ఒక బలీయమైన ద్రవ్య గుణముతో సాదృశ్యము కలిగి యుండుట

వలనను, ఏదియో ఒక ద్రవ్యముతో పోలిక గలిగి యుండుట వలనను, సంస్కారాది వశము చేత మరియొక విరోధము ఏర్పడు చున్నది. ఆది అను పదము ప్రయోగించుట వలన, సంయోగ దేశకాలాదులనుగూడ గ్రహించవలెను. కొన్ని ద్రవ్యములు స్వభావము చేతనే విరోధములుగా నుండును. తక్కిన వివరము లన్నియు తాత్పర్యాంశములే చెప్పబడినవి. ఐకధ్యమనగా, సహభావేన అని అర్థము. ద్రవ్యముల యొక్క సంయోగ విశేషము వలన పథ్యములలో, అపథ్యము చూడబడినది. అట్లే హితమైన దైనప్పటికి, అపథ్యము సాత్మ్యభూతమైన ఎడల అది పథ్యముగనే ఉండును. కాని అది అపథ్యమనియే చెప్పబడును. అట్టి అపథ్యమును అంశాంశముగా వదలి పెట్టుటకు ప్రయత్నించవలెను.

మూ॥ పాదాంశేన త్యజేత్సాత్మ్య మహితం హిత మాచరేత్।
ఏకాన్తరం తతశ్చోర్ధ్వం ద్వ్యన్తరం త్ర్యన్తరం తథా ॥
క్రమేణానేన సంత్యక్తా దోషాః సంవర్ధితా గుణాః।
ప్రభవన్తి న పీడాయై ప్రాప్నువంతి స్థిరాత్మతామ్ ॥

ప్రతిపదార్థము : అహితమ్ = అపథ్యాహారమును; పాదాంశేన = చతుర్థ భాగముతో, త్యజేత్ = వదలిపెట్టవలయును; హితం = పథ్యమైనది, సాత్మ్యమ్ = శరీరమునకు నిత్యాభ్యాసము వలన సాత్మ్యమైన ఆహారమును; ఆచరేత్ = అనుష్ఠించ వలెను; తతోర్ధ్వంచ = అటుపైన; ఏకాన్తరం = ఒక వంతును; ద్వ్యన్తరమ్ = రెండు వంతులను, తథా = అట్లే; త్ర్యన్తరమ్ = మూడు వంతులను; అనేన క్రమేణ = ఈ పద్ధతితో; దోషాః = చెడు అలవాట్లు; సంత్యక్తాః = విడువబడినవై ; పీడాయై నభవంతి = బాధాకరములు గావు; చ = మరియు; గుణాః = మంచి అలవాట్లు, సంవర్ధితాః = వృద్ధిపొందింపబడినవై; స్థిరతామ్ = స్థిరత్వమును; ప్రాప్నువంతి = పొందుచున్నవి.

తాత్పర్యము : అపథ్యమైన ఆహారము నిత్యాభ్యాసము వలన సాత్మ్యము అయినప్పటికి, అపథ్యము అపథ్యమనే పేరును గలిగి యుండును గాన, దానిని గూడ ఎప్పటికైనను వదలి పెట్టుటయే సుఖానుభూతికి కారణమగునని నిశ్చయించి త్యాజ్య పద్ధతిని చెప్పుచున్నారు.

చెడు పదార్థములు నిత్యాభ్యాసము వలన సాత్మ్యములుగా నగును. కాని వాటిని ఒక్కతూరివదలకూడదు. అట్లు వదలిపెట్టినది హానికారకమగును. అందువలన అట్టి పథ్యమును ఒక్కొక్క దినము రెండురెండు దినములు మూడేసి దినముల వ్యవధానముతో వదలిపెట్టుచూ, సాత్మ్యమును, ఆ వ్యవధానములో జోడింపవలెను. కొన్ని దినములనుండి నిత్యాభ్యాసము చేసిన అపథ్యమును, కొన్ని దినములు 4 భాగములు గాని, 16 భాగములుగాని తగ్గించి, సేవింప వలెను. ఆ వ్యవధానమును సాత్మ్యమైన పథ్యముతో పూరింపవలెను. ఈ విధముగ అపథ్యమును వదలి పథ్యము నభ్యసింపవలెను. ఈ విధముగ 63

దినములలో అపథ్యమును త్యజించి, పథ్యక్రమము ననుసరింపవలెను. దుర్వ్యసనములు సాత్మ్యములైననూ వాటిని క్రమముగ వదలి సద్వృత్తముననుష్ఠించిన, శరీరమునకు స్వస్థత చేకూరును.

ఈ ప్రకారం 16 భాగములుగ త్యాగ కల్పన చేయవలయును, ఈ విధి ననుసరించి క్రమముగ అపథ్యమును వదలిపెట్టి అపథ్యముల స్థానములో పథ్యాహారములను వృద్ధిచేయుట వలన అపథ్యాహారమువలన జనించు బాధలు మృగ్యమై **ఆత్మ** మన ఇంద్రియములకు స్వస్థత చేకూర్చును.

## అపథ్య త్యాగ విధి

భాగములు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | అపథ్య | అపథ్య | అపథ్య | పథ్యము |
| 2 | ,, | ,, | ,, | అపథ్యము |
| 3 | ,, | ,, | ,, | పథ్యము |
| 4 | ,, | ,, | పథ్యము | పథ్యము |
| 5 | ,, | ,, | అపథ్య | ,, |
| 6 | ,, | ,, | ,, | ,, |
| 7 | ,, | ,, | పథ్యము | ,, |
| 8 | ,, | పథ్యము | ,, | ,, |
| 9 | ,, | ,, | ,, | ,, |
| 10 | ,, | అపథ్య | ,, | ,, |
| 11 | ,, | అపథ్య | ,, | ,, |
| 12 | ,, | పథ్యము | ,, | ,, |
| 13 | పథ్యము | ,, | ,, | ,, |
| 14 | అపథ్యమ | ,, | ,, | ,, |
| 15 | ,, | ,, | ,, | ,, |
| 16 | ,, | ,, | ,, | ,, |
| 17 | పథ్యము | ,, | ,, | ,, |

*శశిలేఖ :* ఆహారమును నాలుగు భాగములుగ విభజించి, నాల్గవ భాగముతో అపథ్యాహారమును విడువవలయును. విడిచిన నాలుగవ భాగములో పథ్యాహారమును సేవింపవలెను. అట్లే భాగముగ త్యజించవలెను. భాగముగ సేవింపవలెను. అంశః అనగ భాగమని అర్థము. ప్రకరణము బట్టి, పాదమునకే భాగమని గ్రహింపవలెను. ఆ పాదముతోగాని పాదపాదముతో గాని, అపథ్యమును విడువ వలెను. అటే పథ్యమును సేవింప వలెను. రోగియొక్క బలాబలములను దృష్టియందుంచుకొని మొదటిరోజు చతుర్భాగము గాని, షోడశ భాగముగాని అపథ్యమును త్యజింపవలెను. ఆ వదలిన భాగమును అనుచితమైన

పథ్యముతో పూరింపవలెను. ఇట్లు భాగములను కల్పించి అపథ్యాహారమును వదలి పథ్యమును సేవించుటకు 14 దినములు నిర్ణయింపబడినవి. పదునైదవ దినమునుండి సర్వము పథ్యముగనే సేవింపవలయును. ఈ పద్ధతి ఋతుసంధిని బట్టి నిర్ణయించడమైనది.

ఇతరులు మరల దీనినే వేరుగా వర్ణించుచున్నారు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | అపథ్యము | అపథ్యము | అపథ్యము | పథ్యము |
| 2 | ,, | ,, | ,, | అపథ్యము |
| 3 | ,, | ,, | పథ్యము | పథ్యము |
| 4 | పథ్యము | ,, | అపథ్యము | అపథ్యము |
| 5 | ,, | ,, | ,, | ,, |
| 6 | ,, | పథ్యము | పథ్యము | ,, |
| 7 | ,, | ,, | అపథ్యము | అపథ్యము |
| 8 | ,, | ,, | ,, | ,, |
| 9 | ,, | ,, | ,, | ,, |
| 10 | ,, | ,, | పథ్యము | పథ్యము |

ఈ పద్ధతి ననుసరించి అపథ్య దోషములు విడువబడినవై శరీరమును బాధింపవు. పథ్యగుణములున్నూ వృద్ధి పొందినవై స్థిరమైన ఆత్మ భావమును పొందించుచున్నవి.

మూ॥ త్రితయం చైత దుపస్తంభన మాహారః స్వప్నో బ్రహ్మచర్యంచ। ఏభిర్యుక్తి యుక్తైరుపస్తబ్ధ ముపస్తంభైః శరీరం బలవర్ణోపచయోచిత మను వర్తతే యావదాయుః సంస్కారః। తత్ర ఆహార ఉక్తో వక్ష్యతేచ॥

ప్రతిపదార్థము: ఆహారః = ఆహారము; స్వప్నః = స్వప్నము; చ = మరియు; బ్రహ్మచర్యం = బ్రహ్మచర్యము; ఏతత్ = ఈ; త్రితయం = మూడును; ఉపస్తంభనమ్ = ఉపస్తంభమని పేరు; యుక్తి యుక్తైః = యుక్తియుక్తములైన; ఏభిః ఉపస్తంభైః = ఈ మూడు ఉపస్తంభముల చేత; ఉపస్తబ్ధమ్ = బిగింపబడిన; శరీరమ్ = శరీరము; బలవర్ణోపచయోచితమ్ = బలవర్ణములచే వృద్ధిపొందినదై; అనువర్తతే = అనువర్తించునట్లు చేయును; యావత్ = యెంతవరకు; ఆయుః సంస్కారః = ఆయుః పరిమితి ఉన్నంతవరకు; తత్ర ఆహారః = పూర్వాధ్యాయ ముల యందు, ఆహారము; ఉక్తః = చెప్పబడినది; చ = మరియు; వక్ష్యతే = జ్వరాది అధ్యాయములయందు చెప్పబడును.

తాత్పర్యము: ప్రధానమైన యాధారమొకటి యుండగా, దానికుప బలముగానుండు నాధారమునకు ఉపస్తంభమని పేరు. (ఉపస్తంభమనగా—ఉప స్తంభయతీతి—ఉపస్తంభః, సమీపముననుండి ధరించుచున్నదని యర్థము.) ప్రధానమైన స్తంభరూపముగ నున్న శరీరమునకు, దానికాధారభూతమైన

ఆయువు ప్రధానకారణమై యున్నందున దానికి హానిని గల్గనీయక, కాపాడుటకు సహకారియైన ఆహారాదులు ఇచట ఉపస్తంభములుగా నున్నవి. శరీర ధారణమున కుపబలములుగా నున్న ఆహారము, నిద్ర, బ్రహ్మచర్యము నను నీ మూడును యుక్తిగ శాస్త్రవిహిత పద్ధతి నవలంబించి యుపయోగింపబడిన యెడల బలము వర్ణము శరీరమునందు దినదినాభి వృద్ధిగా వృద్ధినంది, ఆయుః పరిమితి యున్నంతవరకు, శరీరమును చెడనీయక యనువర్తించునట్లు చేయును. పూర్వాధ్యాయముల యందు ఆహారమును గురించి చెప్పబడినది. జ్వరాది ప్రకరణముల యందు మరల చెప్పబడును.

**శశిలేఖ**: ఈ మూడు ఉపస్తంభములును, శరీరమును ధరించుచున్నవి. ఆహారము, నిద్ర, బ్రహ్మచర్యము వీటి చేత కట్టబడియున్న ఈ శరీరము న్యూనాధికతలు లేకుండా పోషింపబడుచున్నది. మరియు మానవుని ఆయుస్సు ఎంతవరకు యుండునో అంతవరకు బలవర్ణముల చేత కూడుకున్నదై ఆయువును అనుసరించియుండును. వెనుకటి అధ్యాయములలో ఆహారము చెప్పబడినది. మరియు తరువాతి అధ్యాయముల యందు కూడా చెప్పబడును.

మూ॥ లోకాది సర్గ ప్రభవా తమో మూలా తమోమయీ।
బాహుల్యాత్తమ సో రాత్రౌ నిద్రాప్రాయేణ జాయతే॥
శ్లేష్మావృతేషు స్రోతస్సు శ్రమాదుపరతేషుచ।
ఇంద్రియేషు స్వకర్మభ్యో నిద్రా విశతి దేహినమ్॥
సర్వేంద్రియ వ్యుపరతౌ మనోఽనురతం యదా।
విషయేభ్యస్తదా స్వప్నం నానారూపం ప్రపశ్యతి॥
నిద్రాయత్తం సుఖం దుఃఖం పుష్టిః కార్శ్యంబలాబలమ్।
వృషతా క్లీబతా జ్ఞాన మజ్ఞానం జీవితం న చ॥
అకాలే ఽతి ప్రసఙ్గాచ్చ న చ నిద్రా నిషేవితా।
సుఖాయుషీ పరాకుర్యాత్ కాళరాత్రి రివాపరా॥
సైవయుక్తా పునర్యుంక్తే నిద్రా దేహం సుఖాయుషా।
యోగాభియోగినో బుద్ధిర్నిర్మలా తపసాయథా॥
రాత్రౌ జాగరణ రూక్షం స్నిగ్ధం ప్రస్వపనం దివా।
అరూక్ష మనభిష్యంది త్వాసీన ప్రచలాయితమ్॥
గ్రీష్మే వాయుచ యాదాన రౌక్ష్య రాత్ర్యల్ప భావతః।
దివా స్వప్నో హితోఽన్యస్మిన్ కఫ పిత్తకరోహి సః॥
ముక్త్వాతి భాష్యయానాధ్వ మద్య స్త్రీ భారకర్మభిః
క్రోధశోక భయైః క్లాన్తాన్ శ్వాస హిధ్మాతి సారిణః॥
వృద్ధబాలా బలక్షీణ క్షత తృట్ఛూల పీడితాన్।
అజీర్ణ్యభిహతో న్మత్తాన్ దివా స్వప్నోచి తానపి॥
ధాతు సామ్యం తథా హ్యేషాం శ్లేష్మా చాంగాని పుష్యతి।

*ప్రతిపదార్థము :* లోకాది సర్గ ప్రభవా=ప్రపంచము యొక్క ఉత్పత్తి కాలము నందు పుట్టినట్టిదియు, తమోమూలా= తమస్సు మూలముగా కల్గినట్టి దియూ, తమోమయా = తమో వికారమైనట్టిదిన్ని, బాహుల్యాత్ = ఎక్కువగా, రాత్రౌ=రాత్రియందు, ప్రాయేణ=తరుచుగా, తమసః=తమస్సు నుండి, నిద్రా=నిద్ర, జాయతే=కలుగుచున్నది, శ్లేష్మావృతేషు=ఆహారరసమువలన ఏర్పడు శ్లేష్మముచేత ఆవరించినట్టి, స్రోతస్సు=స్రోతస్సుల యందు, శ్రమాత్=బడలిక వలన, స్వకర్మభ్యః=తమతమ విషయముల నుండి మరల్చబడి, ఉపరతేషు=విశ్రాంతినందుచున్నవై, ఇంద్రియేషు=ఇంద్రియములు, దేహినమ్=ఆత్మను, నిద్రా=నిద్ర, విశేతి=ప్రవేశించుచున్నవి.

యదా=ఎప్పుడు, సర్వేంద్రియ వ్యుపరతే=సమస్త ఇంద్రియములు విశ్రాంతి బొందినవగుచుండగా, విషయేభ్యః=లౌకిక విషయములనుండి, అనుపరతం=విశ్రాంతినొందని, మనః=మనస్సు,నానారూపం=అనేకరూపములుగల, స్వప్నం=స్వప్నమును, ప్రపశ్యతి=చూచుచున్నది.

సుఖమ్=ఆరోగ్యము, దుఃఖమ్=వ్యాధి,పుష్టిః=శరీరపుష్టి, కార్శ్యమ్=శరీరకార్శ్యము, బలాబలమ్=బలము, దుర్బలత్వము,వృషతా=వాజీకరణశక్తి, జ్ఞానమ్=జ్ఞానము, అజ్ఞానమ్=బుద్ధిహీనత, జీవితమ్=జీవితము,నచజీవితమ్=మరణము, నిద్రాయత్తమ్=నిద్రకు స్వాధీనమైనవి.

అకాలే=అకాలము నందు, అతి ప్రసఙ్గాత్=అధికముగ,నాతిప్రసఙ్గాత్=తక్కువగ, నిషేవితా=సేవింపబడిన, నిద్ర=నిద్రా, అపరాకాళరాత్రిరివ=రెండవది యగు ప్రళయకాల రాత్రివలె, సుఖాయుషీ=సుఖమును, ఆయువును, పరాకుర్యాత్=ధ్వంసము చేయును.

దేహం=శరీరమును, సైవ=ఆ నిద్ర, యుక్తసమ్యక్=బాగుగ ఉపయుక్తమైన, సుఖాయుషా=సుఖముతో ఆయుస్సుతో, యుజ్కే=చేర్చుచున్నది (కలుపుచున్నది), యథా=ఎట్లు, యోగాభియోగినః=తత్వజ్ఞానమునందు నియుక్తుడైన మహర్షి యొక్క, నిర్మలా=స్వచ్ఛమైన, బుద్ధిః=బుద్ధి, తపసా=తపస్సుతో, సత్యరూపముతో, యుజ్కే=కలుపుచున్నది. రాత్రౌ=రాత్రియందు, జాగరణమ్=మేల్కొనుట, రూక్షమ్=రూక్షగుణమును (వాతకారకము), దివా=పగలు, ప్రస్వపనమ్=నిదురించుట, స్నిగ్ధమ్=స్నిగ్ధగుణమును, (కఫకారకము), ఆసీనప్రచలాయితమ్=కూర్చుండి కునికిపాట్లు పడుట, అరూక్షమ్=రూక్షము కాదు, అనభిష్యంది=అభిష్యందియును కాదు.

గ్రీష్మే=గ్రీష్మఋతువునందు, వాయుచయ=వాతవృద్ధియును, ఆదాన రౌక్ష్య=ఆదానకాల స్వభావమయిన అధిక రౌక్ష్యమును, రాత్ర్యల్పభావతః=స్వల్పమయిన రాత్రియునుగలిగి యుండుట వలన, దివాస్వప్నః=పగటినిద్ర,

హితః = హితకరమైనది, భాష్య యానాధ్వమద్యస్త్రీ భారకర్మభిః-భాష్య = సంభాషణము, యాన = అశ్వాది వాహనారోహణము, అధ్వ = మార్గ సంచారము, మద్య = మద్యపానము, స్త్రీ = స్త్రీ సంభోగము, భార = భారముమ మోయుట, కర్మభిః = ఆయాసకరమైన పనులు చేయుటచేత; క్రోధశోక భయైః క్లాంతాన్ = కోపము, దుఃఖము, భయము, వీనిచేత శ్రమచెందినవారలు, శ్వాస హిధ్మాతిసారిణః = శ్వాసము, ఎక్కిళ్ళు, అతిసారము అను రోగములుగల వారు; వృద్ధ బాల బల క్షీణ క్షత తృట్శూల పీడితాన్ = వృద్ధులు, బాలురు, దుర్బలులు, ధాతు క్షయము, కత్తి మొ॥వాని దెబ్బ, దప్పి, శూల వీనిచే పీడింపబడినవారు; అజీర్ణాభిహతః = అజీర్ణము గలవారు, కత్తిచే నభిఘాతము జెందినవారు, ఉన్మత్తాన్ = ఉన్మాదము గలవారును, దివాస్వప్నోచితానపి = మధ్యాహ్నమునందు నిద్రాభ్యాసము గలవారును, ఏషాం = వీరికి, ధాతుసామ్యమ్ = ధాతువులకు సామ్యమును, కరోతి = చేయుచున్నది, చ = మరియు, శ్లేష్మా = పగటినిద్రచే వృద్ధి చెందిన శ్లేష్మము కూడ, అంగాని = శరీరావయవములను, పుష్యతి = పుష్టిని కలుగజేయును, అన్యస్మిన్ = వీరలు తప్ప యితరుల యందు, సః = ఆ దివాస్వప్నము, కఫపిత్తకరః = కఫపిత్తములను వృద్ధి జెందించును.

**తాత్పర్యము** : ప్రపంచ సృష్టినుండియు నిద్ర యనునది గలదు. నిద్ర యొక్క పుట్టుకకు, తమోగుణము మూల కారణమైయున్నది. అందుకే "తమో మూలా నిద్రా" యని చెప్పుచున్నారు. తమోగుణము యొక్క భాగము అధికముగ నున్నందునను, నిద్రను "తమోమయా" అనికూడ చెప్పుచున్నారు తమోగుణ ప్రాధాన్యత ప్రాచుర్యముగ నున్నందున, తరచుగ రాత్రియందే నిద్ర మానవుని ప్రవేశించును. "ప్రాయః" అను పదమిచట ప్రయోగించినందున, పగలు కూడ నిద్రకు ప్రవృత్తి కలదనుభావము స్పష్టము. నిద్ర పట్టుటకు తమోగుణమొక్కటియే కారణము కాదు. మరియు, ఆహారరసముతో తయారైన కఫముతో, శరీరగతములైన స్రోతస్సుల కవరోధము ఏర్పడుట వలన, దశవిధ ఇంద్రియములకు, తమతమ విషయములను గ్రహించుటకసమర్థములై, మరియు తమతమ క్రియాకలాపములచే అలసియుండుటవలన, ఇంద్రియములకు, విశ్రాంతి నిచ్చుటకు మనుష్య శరీరములోనికి నిద్ర ప్రవేశించుచున్నది.

ఇంద్రియముల యొక్క విశ్రాంతి సమయములో ఇంద్రియములు తమ తమ క్రియలను వదలిపెట్టి యుండుటవలన మనస్సు తన కార్యముల యందే మగ్నమై యుండుట వలననూ, రాత్రి కాలములయందు మానవుడు అనేక విధములైన కలలను నిద్రలో కాంచుచున్నాడు. ఇంద్రియములవలె మనస్సు కూడ విశ్రాంతి సుఖము ననుభవించుచున్న స్వప్నముల సృష్టి జరుగదు.

మానవుడు నియమానుసారము నిద్రను సేవింపవలెను. ఎందుకనగా

ఆరోగ్యము, రోగము, శరీరపుష్టి, కృశత్వమును, బలమును, బలహీనతయు, పుంస్త్వము, నపుంసకత్వము, తెలివియు, అజ్ఞానమును, జీవితము, మరణమును, ఇవన్నియు నిద్రాధీనములై యుండును.

అందులో అకాలమున నిద్రించినను, అధికముగ నిద్రించినను, బొత్తుగ నిద్ర మానినను, అట్టి నిద్ర రెండవదియగు ప్రళయకాల రాత్రి వలె శరీర సుఖమును, ఆయువును భంగము చేయును.

మరియు అట్టి నిదుర యుక్తమైనకాలమున విధ్యుక్తముగ సేవింపబడిన యెడల శరీరమునకు సుఖమును కల్గించి, ఆయువును వృద్ధినొందించును. తపస్సిద్ధుడైన యోగికి తత్త్వజ్ఞానము అనశ్వరమై ఆనందరూపమైన సుఖమును ఉత్పత్తి నాశములేని పరమాయుస్సును కల్గించు విధముగా, యథోక్తముగ ననుభవింపబడు నిద్రయు మనుజునకు సౌఖ్యమును గల్గించును. నిద్ర, మిథ్యాయోగ, అయోగ, అతియోగములంజేసి అనర్థభూతమై ఆయురారోగ్యములనుచెరచును. సమయోగమున సుఖకరమగును.

సంగీతము పాడుట, చదువుట, మద్యపానము చేయుట, స్త్రీ సంభోగము చేత, పనులు చేయుట చేత, బరువు మోయుటచే శ్రమ నొందిన వారును, కోపము, శోకము, భయము వీనిచే శ్రమ చెందిన వారును, శ్వాసము, హిధ్మ, అతిసార రోగములు కలవారును, వృద్ధులు, బాలురు, దుర్బలులు,ధాతుక్షయము, కత్తి మొ॥వాని దెబ్బ, దప్పి, శూల, వీనిచే పీడింపబడినవారు, మధ్యాహ్నము నందు నిద్రాభ్యాసము కలవారు, అజీర్ణము గలవారు, కర్రలచే అభిఘాతము జెందిన వారు, వీరలు తప్ప ఇతరులు గ్రీష్మకాలమున కంటె ఇతర కాలముల యందు పగటి నిద్రను ఆచరించినచో అట్టివారికి కఫ పిత్తములు వృద్ధి జెందును.

గ్రీష్మకాలములో వాతవృద్ధియును (చయమును), ఆదానకాల స్వభావమైన, అధిక రౌక్ష్యమును, నిద్రకు చాలకుండెడి స్వల్పమయిన రాత్రియు కల్గియుండుట వలన, పగటి నిద్ర హితకరమైనది. పగటి నిద్ర పై చెప్పిన సంభాషణాదులచే బడలిక చెందిన వారికి ధాతు సామ్యము కల్గచేయును. పగటి నిద్రచే కఫము వృద్ధి జెందినచో పై జెప్పిన సంభాషణాదులచే బడలిక చెందిన వారికి పగటి నిద్ర శరీరమునకు పుష్టిని కలుగ చేయును. మరియు సంభాషణాదులచే బడలిక చెందిన వారికి వాతము వృద్ధి చెందకుండుటకు,శ్వాసాది రోగ పీడితులకు వాటి యొక్క వేగమును తెలియకుండుటకును,వృద్ధులకు వారి తృప్తి కొరకును, అజీర్ణము, పగలు నిద్రాభ్యాసము గలవారలకు, ధాతు వైషమ్య పరిహారార్థమును, పగటి నిద్ర తంత్రకారులచే అంగీకరింపబడినది. పగటి నిద్ర అజీర్ణులకు కూడ హితకరము. పై జెప్పిన అజీర్ణాదులు కలవారు పగటి నిద్రను సేవింపదగును.

*శశిలేఖ* : ప్రపంచ సృష్టి సమయమునందే ఈ నిద్రకూడ సృష్టించబడినది. నిద్రకు తమోగుణము కారణము. తమోగుణ బాహుళ్యము వలన ఈ నిద్ర రాత్రులయందు తరచుగా ఏర్పడుచున్నది. "ప్రాయః" అనుపదము ఇచట ప్రయోగింపబడుట వలన ఈ నిద్ర రాత్రులయందే గాక, పగటియందు కూడ ప్రవేశించుచున్నదని తెలియును. ఈ నిద్ర తమోగుణ బాహుళ్యము వల్లనే గాక ఆహార రసము వలన యేర్పడిన శ్లేష్మము చేత స్రోతస్సులు రుద్ధములై జ్ఞానేంద్రియ పంచేంద్రియములైన దశవిధ ఇంద్రియములను, తమతమ కార్యములనుండి మరల్చి అనగా వాటికి విశ్రాంతి సౌఖ్యము కల్గించుటకు, ఆత్మను నిద్ర ప్రవేశించుచున్నది. కాని నిద్రలో నున్నప్పుడు తమ తమ విషయములనుండి ఇంద్రియములు మరల్చ బడినవైనప్పటికిని, మనస్సును మాత్రము, దాని పనులనుండి ఈ నిద్రతొలగింపలేదు. అందువలన ఆత్మ అనేక రూపములైన స్వప్నములను చూచుచున్నది. ఎపుడైతే మనస్సు కూడ తన కార్యములనుండి వైదొలగునో, ఆ అవస్థ సుషుప్తావస్థగా చెప్పబడినది. ఆ సుషుప్తావస్థలో మానవుడు స్వప్నములను దర్శింపలేడు. చక్కగా సేవింపబడిన నిద్ర మానవుని ఆరోగ్యవంతునిగా, బలవంతునిగా, వాజీకరణవంతునిగా జేయుచున్నది. అట్లే బాగుగా సేవింపబడని నిద్ర మానవునికి దుఃఖమును, కార్శ్యమును, దుర్బలత్వము, నపుంసకత్వము, అజ్ఞానమును, మరణమును కూడ ప్రసాదించుచున్నది. ఆ నిద్రను అకాలమునందు, సేవించినను, స్వల్పముగా సేవించినను, ఆయుస్సును, జీవితమును ధ్వంసము జేయుచున్నది. బ్రతికి యున్నప్పటికిని గూడ వ్యాధ్యాదులచేత, సుఖమును నశింపజేయు చున్నది. ఎట్లనగా రెండవది యగు ప్రళయకాల రాత్రివలె మానవుని జీవితమును ధ్వంసము జేయుచున్నది. ఎట్లనగా పరమ యోగులు, నిర్మల బుద్ధితో, సత్వ రూపముతో పరమాత్మను దర్శించినట్లు నిద్ర మానవుని సత్వ రూపముతో కలుపును.

రాత్రియందు జాగారము చేసిన యెడల, శరీరమునందు రూక్ష భావములు వృద్ధి యగును. ఇట్లే పగలు నిద్రించిన యెడల, శరీరమునందు స్నిగ్ధ భావములు వృద్ధియగును. కూర్చుండి కునికిపాట్లు పడుట వలన రూక్షత వృద్ధి నొందదు, అభిష్యందియు కాదు. అభిష్యంది యనగా (మాలిన్యేన స్రోతసాం స్రావకః) దోషముల యొక్క మాలిన్యము చేత, స్రోతస్సులు స్రవించుటయని యర్థము. రాత్రికాలము మిక్కిలి తక్కువగా కల్గినట్టియు,ఆదాన కాలము ననుసరించి రౌక్ష్యము ఎక్కువగా నున్నట్టియు, కాలమును బట్టి, వాయువు చయావస్థను పొందిన దగుట వల్లను, గ్రీష్మర్తువు నందు, దివాస్వప్నము శాస్త్ర విహితమైనది. గ్రీష్మర్తువుగాక,ఇతరఋతువులయందు పిత్త శ్లేష్మములను వృద్ధి చేయును. ఎక్కువగా గానము చేయువారికి, దివాస్వప్నము వలన, ధాతువులకు సాత్మ్యత యేర్పడును. శ్లేష్మము కూడ శరీరమందలి అవయవములను బలియునట్లు చేయును.

సూ॥ బహుమేదః కఫాః స్వప్యుః స్నేహనిత్యాశ్చ నాహని — 48.

ప్రతిపదార్థము : బహుమేదః కఫాః = శరీరమునందు మిక్కిలి అభివృద్ధి చెందిన మేదస్సు, కఫము గలవారు (అతిస్థూలురు); స్నేహనిత్యాశ్చ = నిత్యమును స్నేహమును సేవించు వారలు; అహని = మధ్యాహ్నము నందు; నస్వప్యుః = నిద్రింపకూడదు.

తాత్పర్యము : శరీరము నందు మిక్కిలి మేదస్సు వృద్ధి జెందిన వారు, కఫము యెక్కువగా వృద్ధి జెందిన వారు, ప్రతినిత్యము స్నేహమును అభ్యసించువారు, పగలు నిద్ర పోకూడదు.

సూ॥ విషార్తః కంఠరోగీచ నైవ జాతు నిశాస్వపి ।

ప్రతిపదార్థము : విషార్తః = విషముతో బాధపడువారు, కంఠరోగీచ = మరియు కంఠ రోగులు, నిశాస్వపి = రాత్రులయందు కూడ; నైవ జాతుచిత్ = నిద్రింప కూడదు.

తాత్పర్యము : విషపీడితుడు, కంఠరోగి వీరలు రాత్రులయందెపుడునూ నిద్రింపజనదు.

మూ॥ హలీమక శిరోజాడ్య స్తైమిత్య గురుగాత్రతాః — 49
జ్వర భ్రమ మతి భ్రంశ స్రోతో రోధాగ్ని మన్దతాః ।
శోఫా రోచక హృల్లాస పీనసార్ధావ భేదకాః । — 50
కండూ రుక్కోఠ పిటికా కాస తన్ద్రా గలామయాః
విషవేగ ప్రవృత్తిశ్చ భవేదహిత నిద్రయా — 51

ప్రతిపదార్థము : అహిత నిద్రయా = అహితముగ సేవింపబడిన నిద్రతో; హలీమక = హలీమకము (పచ్చ కామల); శిరోజాడ్య = తలనొప్పి; స్తైమిత్య = శరీరము పైన తడి గుడ్డ కప్పుకున్నట్లుండుట; గురుగాత్రతా = ఒడలు బరువుగా నుండుట; జ్వర = జ్వరము; భ్రమ = తలదిరుగుట; మతిభ్రంశ = బుద్ధి భ్రంశము; స్రోతోరోధ = స్రోతో రోధము; అగ్ని మన్దతాః = అగ్ని మాంద్యము; శోఫ = శోఫము; అరోచక = అరోచకము; హృల్లాస = ఓకరింతలు; పీనస = పడిశము; అర్ధావభేదకాః = అర తలనొప్పులు; కండూ = దురద; రుక్ = నొప్పి; కోఠ = కోఠము; పిడకా = పిడకలు; కాస = దగ్గు; తంద్రా = జాడ్యము; గలామయాః = కంఠరోగములు; విషవేగ ప్రవృత్తిశ్చ = శరీరమున విషము శేషించి యున్నచో దాని వేగము వ్యాపించుట; జాయన్తే = కల్గుచున్నది.

తాత్పర్యము : విధి విహితముగ సేవింపని నిద్ర వలవ, పచ్చ కామల, తలనొప్పి, శరీరముపైన తడిగుడ్డ కప్పుకొన్నట్లుండుట, శరీరమంతయూ బరువుగా నుండుట, జ్వరము, తల తిరుగుట, బుద్ధి భ్రంశమేర్పడుట, కఫము వృద్ధి

జెంది స్రోతస్సుల నడ్డగించుట, అగ్నిమాంద్యము, శోషము, ఆహారము నోటికి రుచింపక పోవుట, అర తలనొప్పి, శరీరమునందుము దురదలు, శరీరమంతట నొప్పులు, పిడకలు, దగ్గు, శరీరము మజ్జుగా నుండుట, కంఠ రోగములు, శరీర మున విషము శేషించి యున్నచో దాని వేగము మరల వ్యాపించుట మొ॥ బాధలు శరీరమున గల్గును.

మూ॥ అపచ్యమానో బాహుల్యాత్ స్రోతాం స్యావృణుతే కఫః ।
తతః స్రోతః సురుద్ధేషు జాయతే గాత్ర గౌరవమ్ । — 52
గురు గాత్రస్య చాలస్య మాలస్యాదతి నిద్రతా॥

ప్రతిపదార్థము : అపచ్య మానః = భుజించిన ఆహారము నందెక్కువ భాగము పాకము జెందని కారణము గలదై ; కఫః = కఫము; స్రోతః సురుద్ధేషు = స్రోతో మార్గములడ్డగింపబడినవగుచుండగ; తతః = అందువలన; గాత్ర గౌరవమ్ = శరీరము నందు గౌరవమును; జాయతే = కల్గించుచున్నది; గురు గాత్రస్య = శరీరము బరువుగానున్న వానికి; ఆలస్యం = మాంద్యము; జాయతే = ఏర్పడుచున్నది; ఆలస్యాత్ = శరీర మాంద్యము వలన; అతి నిద్రతా = నిద్ర అధికముగ నగుచున్నది.

తాత్పర్యము : ఎక్కువగా నిద్రను సేవించుట వలన, స్రోతో మార్గములను కఫము అడ్డగించును. స్రోతావరోధము కారణముగా శరీరమునందు గౌరవమేర్పడును. శరీర గౌరవము వలన శరీరమాంద్య మేర్పడును. ఆలస్యము వలన నిద్ర కూడ అధికమగును.

మూ॥ విరేకః కాయ శిరసోర్వమనం రక్త మోక్షణమ్ - 53
ధూమ క్షుత్తృట్ వ్యథా హర్షశోక మైథున భీ క్రుధః ।
చింతోత్కంఠాఽసుఖాశయ్యా సత్త్వోదార్యం తమోజయః -54
రూక్షాన్నం చాహితం నిద్రాంవారయన్తి ప్రసంగినీమ్ ॥

ప్రతిపదార్థము : కాయశిరసోః = కాయశిరస్సులకు, విరేకః = విరేచనము, వమనమ్ = వమనము, రక్త మోక్షణమ్ = రక్త మోక్షణము, ధూమ = ధూమ పానము, క్షుత్ = ఆకలి, తృట్ = దప్పి, వ్యథా = పీడ, హర్ష = హర్షము, శోక = దుఃఖము, మైథున = మైథునము, భీ = భయము, క్రుధః = క్రోధము, చిన్త = చిన్త, ఉత్కంఠా = ఉత్కంఠా, అసుఖా = సుఖము నివ్వని, శయ్యా = పడక, సత్త్వోదార్యం = సత్వగుణాధిక్యత, తమోజయః = తమోగుణమును జయించుట, రూక్షాన్నమ్ = రూక్షమైన అన్నము, ప్రసంగినీమ్ = ప్రసంగ జన్యమైన, అహితాం = అహితమైన, నిద్రాం = నిద్రను, వారయన్తి = దూరము చేయు చున్నవి (తొలగించుచున్నవి).

తాత్పర్యము : బస్తి విరేచనము, శిరోవిరేచవము, వమనము, రక్త మోక్షణము, ధూమ పానము, ఆకలి, దప్పి, శరీరము బాధలకు గురి యగునట్లు

చేయుట, ఆనందాతిశయము వలన కల్గు హర్షము, దుఃఖము, మైథునము, భయము, క్రోధము, మనస్సును పరిపరి విధముల ఆలోచించునట్లు చేయుట, విష యములందుత్కంఠ, సుఖము నివ్వని పడక, సత్వగుణమును పెంపొందించు కొనుట, తమోగుణమును పారద్రోలుట, రూక్షకరములైన అన్నములను భుజిం చుట మొ॥ క్రియాత్మకములగు పనులనాచరించుట వలన, అతినిద్రను జయింప వచ్చును. అనగ మానసికాందోళనలను శరీరమునందు వృద్ధి జేయవలయునని భావము.

మూ॥ ఏత ఏవ చ విజ్ఞేయా నిద్రానాశస్య హేతవః -55
కాలశీలక్షయో వ్యాధిర్వృద్ధిశ్చానిల పిత్తయోః।

*ప్రతిపదార్థము :* ఏతఏవ = వీటినే, నిద్రానాశస్య = నిద్ర యొక్క నాశ మునకు, హేతవః = కారణములుగా, విజ్ఞేయాః = తెలిసికొనవలయును, చ = మరియు, కాలశీలక్షయః = వసన్తాది కాలములు, సద్వృత్తము (మంచి నడవడిక అభ్యాసము), ధాతు క్షయము, వ్యాధిః = రోగము, అనిలపిత్తయోః = వాత పిత్త ముల యొక్క, వృద్ధిః = వృద్ధికూడ, నిద్రా నాశస్య = నిద్రా నాశమునకు, హేతవః = కారణములుగ, విజ్ఞేయాః = తెలుసుకొనదగినవి.

**తాత్పర్యము:** పై నుదాహరించిన వన్నియు, నిద్రానాశమునకు కారణ ములుగ గ్రహింపవలయును. ఇవిగాక వసన్తాదికాలములు, మంచి నడవడిక (అభ్యాసము), ధాతుక్షయము, రోగము, వాయు పిత్తముల ప్రకోపము గూడ, నిద్రానాశ కారకములుగ గ్రహింపబడినవి, క్షయమనగా, కఫక్షయమని గ్రహిం చిన, అర్థవంతముగ నుండును. వాత ప్రకృతి పురుషులకు గూడ నిద్ర సరిగా పట్టదు.

మూ॥ నిద్రానాశా దంగమర్ద శిరోగౌరవ జృంభికాః -56
జాడ్యం గ్లాని భ్రమాపక్తి తంద్రా రోగాశ్చ వాతజాః।

*ప్రతిపదార్థము :* నిద్రానాశాత్ = నిద్రాభంగము వలన, అంగమర్ద = ఒడలు నొప్పి, శిరోగౌరవ = తలబరువు, జృంభికాః = ఆవులింతలు, జాడ్యం = కార్యములయందశక్తత, గ్లాని = బడలిక, భ్రమా = భ్రమ, అపక్తి = అజీర్ణము, తంద్రా = సోమరితనము (జాడ్యము), చ = మరియు, వాతజా రోగాః = వాత రోగములు(కలుగును).

**తాత్పర్యము :** నిద్రాభంగము వలన ఒడలు నొప్పి, తలబరువు, ఆవు లింత, కార్యములయందశక్తి, బడలిక, భ్రమ, అజీర్ణము, సోమరితనము, వాత రోగములు గలుగును.

అల్పముగ నుండు కఫము, వాతముచే స్వస్థానములో నుండి చలింప జేయబడి స్రోతోమార్గములనడ్డగించి, ప్రజ్ఞను పోగొట్టునట్టి మోహమును, గలిగించునట్టి దారుణమైన తంద్రను గలుగజేయును.

మూ॥ కఫోఽల్పో వాయునోద్ధూతో ధమనీః సన్నిరుధ్యతు - 57
కుర్యాత్సంజ్ఞాపహాం తన్ద్రాం దారుణాం మోహకారిణీమ్।

**ప్రతిపదార్థము :** అల్పః కఫః=స్వల్ప కఫము, వాయునోద్ధూతః= వాయువుచేత పురికొల్పబడినదై, ధమనీః=ధమనులను, సన్నిరుధ్యతి=అడ్డగించి (బంధించి), సంజ్ఞాపహాం=సంజ్ఞా నాశమును, కుర్యాత్=చేయును, దారుణాం=మిక్కిలి కష్టతమమైన, మోహకారిణీం=మోహకారకమైన, తన్ద్రాం= జాడ్యమును, కుర్యాత్=చేయును.

**తాత్పర్యము :** శరీరగతమైన స్వల్పకఫము, వాయువు చేత పురికొల్పబడినదై, ధమనులను బంధించి, సంజ్ఞానాశమును చేయుచున్నది. అప్పుడు మిక్కిలి కష్టతమమైన, మోహకారకమైన, సోమరితనమును గూడ గల్గించును.

మూ॥ ఉన్మీలిత వినిర్భుగ్నే పరివర్తితతారకే - 58
భవత స్తత్ర నయనే స్రుతే లులిత పక్ష్మణీ ।

**ప్రతిపదార్థము :** ఉన్మీలిత=విరిసిన, వినిర్భుగ్నే=కొంచెము మూసుకున్న, పరివర్తిత తారకే=కదలుచున్న కనుపాపలు గల లులిత పక్ష్మణీ=కదలుచున్న కనురెప్పలు గల, స్రుతే = నీరు కారుచున్న, నయనే= నేత్రములు తత్ర=ఆ జాడ్యము నందు, భవతః=ఉండును.

**తాత్పర్యము :** తంద్ర ఆవరించిన మానవ లక్షణమిట్లుండును. కొంచెము విరిసిన, కొంచెము మూసుకున్న కన్నులు, పాపలు పరిభ్రమించుచున్న కన్నులు నీరుకారుచున్న కన్నులు, కదలుచున్న కనురెప్పలు గల నేత్రములు గలిగి యుండును.

మూ॥ అర్ధ త్రిరాత్రాత్సా సాధ్యానసా సాధ్యాతతః పరమ్-59
యథా కాలమతో నిద్రాం రాత్రౌ సేవేత సాత్మ్యతః ॥

**ప్రతిపదార్థము :** సా=ఆ తన్ద్రారోగము, అర్ధత్రిరాత్రౌ = 3½దినముల వరకు,సాధ్యా=చికిత్సాసాధ్యమైనది, తతఃపరమ్=అటుపిమ్మట, సా=అది, నసాధ్యా= అసాధ్యము, అతః=ఇందువలన, యథాకాలమ్ = కాలమునతిక్రమింపక, (సాత్మ్యానుసారము), సాత్మ్యతః = సాత్మ్యముగ, రాత్రౌ=రాత్రి కాలములో, నిద్రాం=నిద్రను, సేవేత=సేవింపవలయును.

**తాత్పర్యము :** ఆ తన్ద్రా రోగము ఆవహించిన వెంటనే చికిత్స చేయవలయును. 3½ దినముల వరకే ఈ వ్యాధి చికిత్సా సాధ్యమైనది.

పై కారణములను పురస్కరించుకొని నిద్రాకాలము నతిక్రమింపక సాత్మ్యానుసారము, రెండు మూడు యామములు రాత్రులయందు నిద్రించవలెను.

మూ॥ అసాత్మ్య జ్ఞాగరా దర్ధమ్ ప్రాతః స్వప్యా దభుక్తవాన్ -60

ప్రతిపదార్థము : అసాత్మ్యాత్ = అసాత్మ్యమైన, జాగరాత్ = జాగరణ వలన, ప్రాతః = పొద్దున, అభుక్త్వాన్ = భుజించనివాడై, అర్థమ్ = జాగరణచేసిన సమయములో సగభాగము, స్వప్యాత్ = నిద్రించవలయును.

తాత్పర్యము : అసాత్మ్యము వలన రాత్రుల యందు జాగరణము గలుగు పక్షములో తాను నిదుర మేల్కొనిన కాలమునందర్ధభాగము, ప్రాతఃకాలము భుజించకయే నిద్రించవలయును.

అనగా రాత్రుల యందు అభ్యాసముగ నిదురించు కాలములో నెవడు, ఎంతకాలము వరకు జాగరణము చేయునో, అట్టి జాగరణ కాలములో నర్ధ కాలము, ప్రాతఃకాలము భుజించకయే నిదురించవలయునని అభిప్రాయము.

మూ॥ శీలయేన్మంద నిద్రస్తు క్షీరమిక్షురసం రసమ్।
ఆనూ పౌదక మాంసానాం భక్ష్యాన్ గౌడికపైష్టికాన్॥ 61
శాలీన్మద్యాని మాషాంశ్చ కిలాటాన్ మాహిషం దధి।
అభ్యంగోద్వర్తన స్నాన మూర్ధ శ్రవణ పూరణమ్ 62
చక్షుష స్తర్పణం లేపం శిరసో వదనస్య చ।
ప్రవాతే సురభౌ దేశే సుఖాంశయ్యాం యథోచితే -63
సంవాహనం స్పర్శ సుఖం చిత్తజ్ఞైరనుజీవిభిః
సర్పిః క్షీరానుపానం చ జీవనీయైః శృతం పిబేత్ - 64
కాన్తాబాహులతాఽశ్లేషో నిర్వృత్తః కృతకృత్యతా
"మనోను కూలా విషయాః కామం నిద్రా సుఖప్రదాః" - 65

ప్రతిపదార్థము : మంద నిద్రస్తు = వాతాదిదోష కారణముగ నిద్ర మందగించిన యెడల, క్షీరం = పాలను, ఇక్షు రసం = చెరకు రసమును, ఆనూపౌదక మాంసానాం = ఆనూప దేశముల యొక్క జంతువుల, నీటిలో సంచరించు జంతువుల మాంసముల యొక్క, రసమ్ = రసమును, గౌడికపైష్టికాన్ = బెల్లముతో పిష్టముతో తయారుచేయు, భక్ష్యాన్ = భక్ష్యములను, శాలీన్ = శాలి ధాన్యములను, మద్యాని = మద్యములను, మాషాంశ్చ = మినుములను, కిలాటాన్ = కిలాటములను,మాహిషందధి = గేదె పెరుగును,అభ్యంగ = అభ్యంగమును,ఉద్వర్తన = నలుగుపెట్టుటను, స్నాన = స్నానమును, మూర్ధ శ్రవణ పూరణమ్ = శిరస్సునందు, చెవుల యందు, తైలమును నింపుటను, చక్షుషః = నేత్రములకు, తర్పణమ్ = తర్పణమును, శిరసః = శిరస్సునకు, వదనస్యచ = మరియు ముఖమునకును, లేపం = సుగంధ ద్రవ్యముల యొక్క లేపమును, శీలయేత్ = అభ్యసించవలెను, ప్రవాతే = ఎదురుగా వీచు గాలియందు, సురభౌ దేశే = వాసనలు గుబాళించు ప్రదేశమునందు, యథోచితే = తనకనుకూలమైనదానియందు, సుఖమ్ = సుఖదాయకమైన, శయ్యామ్ = పడకను, స్పర్శ సుఖం = తాకుట చేత

సుఖమును కల్గించు,సంవాహనం=కాళ్ళు పట్టుటను,చిత్తజ్ఞైః = తన మనస్సును తెలిసిన, అనుజీవిభిః=మిత్రులచేత, కార్యా=చేయించదగినది, జీవనైః=జీవక, ఋషభక, మేధ, మహామేధ, కాకోలి, క్షీరకాకోలి, పయస్యా, విదారి, శతావరి, ఈ ద్రవ్యములచేత, శృతమ్=సంస్కరింపబడిన, సర్పిః=నెయ్యిని, క్షీరాను పానమ్=పాలను అనుపానముగా, పిబేత్=త్రాగవలెను, కాన్తాబాహు లతాఽశ్లేషాః = ప్రియురాలగు స్త్రీ యొక్క, తీగలనే బాహువుల చేత, ఆలింగ నము, నిర్వృతిః=మనస్సంతోషము, కృతకృత్యతా=యత్నకార్యమును నెర వేర్చుట, మనోఽనుకూలా విషయాః=మనస్సు కనుకూలమైన విషయములు, కామం=ఇచ్ఛానుకూల విషయము, నిద్రాసుఖప్రదాః=నిద్రాసుఖమును కలుగ చేయును.

**తాత్పర్యము** : స్వల్పముగా నిద్రించువారు, బాగుగా నిద్ర కలుగు నిమిత్తము, ఆవుపాలను, చెఱకురసమును, మాంసరసమును, ఆనూప, ఔదక మాంసములను, గుడ, పిష్ట, భక్ష్యములను, శాలిధాన్యములతో తయారుజేసిన మద్యములను, మినుములను, దధి మండములను, బఱ్ఱె పెరుగును,అభ్యంగమును, ఉద్వర్తనమును, స్నానమును, శిరశ్శ్రవణముల యందు, తైల పూరణములను, కన్నులకు తర్పణములను, శిరస్సునకు, ముఖమునకు సుగంధ ద్రవ్యముల చేత తయారు చేయబడిన లేపమును, పూయుటను ప్రతినిత్యమభ్యసింప వలెను. మల యానిలము మందమందముగా వీచునట్టి, పరిమళ సుగంధ ద్రవ్యముల చేత నిండిన ప్రదేశమునందు తనకనుకూలమైన సుఖమునిచ్చు పడకను సేవింపవలెను, మరియు తన మనసును గుర్తించిన మిత్రుల చేత, స్పర్శ వల్లనే సుఖమేర్పడు, సంవాహ నమును గావించుకొనవలెను. జీవనీయగణ ద్రవ్యములచేత, కాచి సంస్కరింపబడిన నెయ్యిని, క్షీరానుపానముగా త్రాగవలెను. మరియు ప్రియురాలి యొక్క ఆలిం గనము, మానసికానందము, మనస్సునకనుకూలమైన విషయ ప్రవర్తనము, ఇచ్ఛాపూర్తి ఇవి యన్నియు,నిద్రాసుఖమును ప్రసాదించునవిగ నున్నవి.

బఱ్ఱె పెరుగు, ఆవు పెరుగు కంటె మిక్కిలి శీతలమైనది. దీనియందు జిడ్డు యెక్కువగా యుండును. ఇది నిద్రను కల్గించుటలో అత్యుత్తమమైనది.

మూ॥ బ్రహ్మచర్యరతే ర్గ్రామ్య సుఖ నిస్పృహ చేత సః
నిద్రాసంతోష తృప్తస్య స్వంకాల నాతి వర్తతే -66

**ప్రతిపదార్థము** : బ్రహ్మచర్యరతేః=ఇంద్రియ నిగ్రహము గలవానికి, గ్రామ్యసుఖ నిస్పృహ చేతసః = సంభోగమునందిష్టములేనివానికి, సంతోష తృప్తస్య=సంతోషము చేత తృప్తి నందిన వానికి, నిద్రా=నిద్ర, స్వంకాలం నాతివర్తతే=యుక్తకాలమును దాటదు.

**తాత్పర్యము** : ఎవడైతే జితేంద్రియుడుగా నుండునో ఎల్లప్పుడు సంతో

షముతో తృప్తిగా నుండునో, అట్టి వానికి యుక్తకాలమునందు నిద్రవచ్చునని చెప్పబడుచున్నది.

మూ॥ ఏతాన్ ఏవచ భూయిష్ఠం నిద్రాలుః పరివర్జ్యయేత్।

ప్రతిపదార్థము : ఏతాన్ ఏవ = వీటినే; నిద్రాలుః = అధిక నిద్రగల వాడు; భూయిష్ఠం = అధికముగా; పరివర్జ్యయేత్ = వదిలి పెట్ట వలెను.

తాత్పర్యము : పై నుదాహరించిన అన్ని ఉపాయములు నిద్రరాని వారల నుదాహరించి చెప్పబడినవి. ఇందువలన ఎవ్వడు ఎక్కువ నిద్రను పోవు చున్నాడో, వాడు పై నుదాహరించిన కారణములను ఎక్కువగా వదలి పెట్ట వలెను.

మూ॥ కాలస్వభావాఽఽమయ చిత్త దేహ
ఖేదైః కఫాగన్తు తమో భవాచ।
నిద్రా బి భర్తి ప్రథమా శరీరమ్
పా పాత్మికా వ్యాధి నిమిత్త మన్యాః ॥ 68

ప్రతిపదార్థము : నిద్రా = నిద్ర, కాలస్వభావా = కాలస్వభావము చేత; ఆమయచిత్తదేహ ఖేదైః = వ్యాధి విశేషముతో, మానసిక దుఃఖముతో, శరీ దుఃఖముతో; కఫాగన్తు తమోభవాచ = కఫ వృద్ధిచేత, సంజ్ఞావహ స్రోతస్సులు అడ్డగింపబడుట చేత; ఆగంతుజ కారణముచేత; తమోగుణము యొక్క అధికత చేత పుట్టుచున్నది. ప్రథమా = పై నుదహరించిన యేడింటిలో మొదటిది యగు కాల స్వభావముతో ఏర్పడిన నిద్ర; శరీరమ్ = శరీరమును; బిభర్తి = ధరించు చున్నది, పాపాత్మికా = చివరది యగు, తమోగుణము వల్ల పుట్టిన నిద్ర దుష్ట మైనది, అన్యాః = మిగిలిన ఐదు నిద్రలు; వ్యాధి నిమిత్తమ్ = వ్యాధి కారణముగా; జాయంతే = పుట్టుచున్నవి.

నిద్ర ఏడు విధములని చెప్పబడినది.

(1) కాల స్వభావ నిద్ర,

కాలము యొక్క స్వభావము ననుసరించి ప్రతి దినము వచ్చు నిద్ర ప్రాకృతికమైనది. ఈ నిద్ర వలన శరీరము ధరింపబడుచున్నది.

(2) ఆమయ ఖేదప్రభవానిద్ర

రోగము యొక్క ఖేదము వలన పరిశ్రమ వలన కలిగిన నిద్ర

(3) చిత్త ఖేద ప్రభవా

మనో దుఃఖముచేత మానసిక పరిశ్రమ వలన ఏర్పడిన నిద్ర.

(4) దేహ ఖేద ప్రభవా

శారీరక పరిశ్రమయే కారణముగా ఏర్పడిన నిద్ర.

(5) కఫ ప్రభవా నిద్ర

కఫము ఆమము వలన జనించు నిద్ర.

(6) ఆగన్తుకా నిద్ర

ఆగన్తుక కారణములచే జనించు నిద్ర.

(7) తమో ప్రభవా నిద్రా

తమో గుణ బాహుళ్యము చేత జనించు నిద్ర.

(1) కాల స్వభావముచేత ఆవహించిన నిద్ర, శరీరమును సంపూర్ణముగ ధరించును.

(7) తమోగుణాధిక్యము చేత జనించిన 7వది యగు నిద్ర దుష్టస్వభావము కలదియయినందున మరణ మాపాదింపచేయును.

2,3,4,5,6 నిద్రలు రోగకారణముగ కలుగుచున్నవి. ఈవిధముగ ఉపస్తంభ భూతమైన రెండవదియగు నిద్రను గురించి చెప్పుట ముగిసినది.

*శశిలేఖ* : గ్రీష్మకాలమునందలి, పగటి యందు శ్లేష్మ శరీరులు. మిక్కిలి జిడ్డుతోకూడినఆహారములనుఅభ్యసించు వారును, నిద్రించకూడదు. విషము చేత పీడితులు మరియు కంఠ రోగులు రాత్రులయందు, కూడ ఎప్పుడును నిద్రింపరాదు. తనకు అహితమైన నిద్ర యొక్క విరుద్ధమైన నిద్రయొక్క సేవనచేత, హలీమకాది రోగములు కల్గును. మరియు ఈ చెప్పబోవు లక్షణములు గూడ శరీరమునకేర్పడును. తలనొప్పి శరీరము బరువుగా నుండుట, ఇంద్రియములకు పాటవము లేకుండుట, శరీరమునకు స్తైమిత్యము ఉత్సాహము లేకుండుట సంభవించును. నిద్రచేత విషముచేత పీడితుడైన వానికి శరీరము నందు మిగిలియునభ విషము యొక్క వేగము మరల కల్గును. మరియు అతినిద్రకు గూడ ఇది కారణముగా చెప్ప బడుచున్నది. ఎక్కువగా జఠరాగ్ని కఫమును పాకము చేయుటకు సమర్థత కలిగియుండదు. ఇందువలన ఆహారరసము వలన తయారైన కఫము జఠరాగ్నిచేత పచింపబడనిదై స్రోతోమార్గముల కవరోధమేర్పడుట వలన గాత్ర గౌరవమును గాత్రగౌరవము వలన ఆలస్యమును ఆలస్యము వలన అతి నిద్రయును సంభవించును. నిద్రయొక్క ప్రకరణ ప్రసంగము వలన యేర్పడిన, ఈ అతినిద్రయును, శిరోవిరేచనము, కాము విరేచనములు, నశింపజేయుచున్నవి. అసుఖమైన నిద్ర కష్టమైనది. ఈ విరేకాదులుకూడ, మంచినిద్రను కూడ నశింపజేయుటకు కారణములుగా నున్నవి. ఉదయాదికాలములు, నిద్రానాశ హేతువుగకాదు. అభ్యాసముచేత ఎవరెవరికి, ఏఏ కాలములయందు నిద్రా

నివృత్తి అభ్యసింపబడుచున్నదో వారివారికి ఆయా కాలములయందు, ఆ నిద్ర కల్గుచున్నది. అట్లే రసాది ధాతువులయొక్క క్షీణత, నిద్రానాశ కారణముగ చెప్పబడినది. జ్వరాది వ్యాధులుకూడ సంభవించును. వాతపిత్తములకు వృద్ధి కూడ ఏర్పడును. రాత్రులయందు నిద్రను సేవింపవలెను. రాత్రులయందు సాత్మ్యమైననిద్ర, ఎట్టిదిగా సేవింపబడుచున్నదో, అది ఒకవేళ రాత్రియందు ఎంతకాలము మానవుడు జాగరణము చేయుచున్నాడో, ఆ జాగరణములో సగము పగలు నిద్రింపవలెను. మంచి నిద్రలేక పోవుటవలన, అంగమర్దాదులు ఏర్పడును. ఇట్లుచెప్పుట, వలన రాత్రియందు రెండు యామములు జాగరణ చేసినయెడల, ప్రాతఃకాలము, భుజించుటకు ముందు ఒకయామము నిదురించ వలెను. ఎవడైతే విరేకాదులు, నిదానముగావల వాతప్రకోపముచేత, స్వల్పనిద్ర గలవాడైన యెడల, క్షీరాదుల నభ్యసింపవలెను. అట్లే ఆనూప ఔదక, జంతు వులయొక్క మాంసములను, ఆ మాంసములకు సంబంధించిన రసములను, బెల్లముచేత సంస్కరింపబడిన భక్ష్యములను, బియ్యపుపిండితో చేసిన భక్ష్యము లను, రాజనాల బియ్యముతోచేసిన మద్యములను, మరికొన్ని ఇతరములయిన శాలి మద్యములను, మినుములను అభ్యసింపవలెను. శిరస్సును, చెవులను స్నేహముచేత పూర్ణముచేయవలెను. మరియు శిరస్సునకు, ముఖమునకు, మంచి జిడ్డుతో కూడుకొన్న, లేపములను చేయవలెను. సంవాహనం అనగా పిసుకుట అని అర్థము. సుఖకరమ్ అను పదమునకు, పీడాకరము కాకూడదని అర్థము. తన మనస్సును గుర్తించిన మిత్రులచేత, సుఖకరముగా శరీర మును పిసికించుకొనవలెను. జీవనీయ గణమందలి ఔషధములచేత, పక్వము చేయ బడిన నేతిని క్షీరానుపానముగా త్రాగవలెను. ప్రియురాలియొక్క బాహువుల చేత, ఆలింగనముచేయించుకొనవలెను.అతినిద్రకలవాడు క్షీరాదులను ఎక్కువగా వదిలిపెట్టవలెను. కాలస్వభావాదులచేత, నిద్ర ఏడు(7) విధములు. ఆ ఏడింటిలో మొదటిదైన కాలస్వభావముచేత, ఏర్పడిన నిద్ర శరీరమును ధరించుచున్నది. చివరిదియగు అధికమైన తమోగుణముచేత పుట్టిన నిద్ర పాప భూయిష్టమైనది. ఇతరములైన మిగిలిన ఐదునిద్రలు, అనగా ఆమయభేదముచేత, దేహభేదము చేత, చిత్తభేదముచేత, శ్లేష్మముచేత, శస్త్ర ప్రహారాదులచేత పుట్టిన నిద్రలు, వ్యాధి కారణములుగా పేర్కొనబడినవి.

ఇట్లు నిద్రను గురించిన ప్రకరణమును ముగించిరి.

| వి.వ్యా. :- | బక్తైపాలు | చరకము సూత్ర 27-219 |
|---|---|---|
| | ఆవుపాలు | సుశ్రుతము సూ 45-50 |
| | కిలాటము | చరకము సూ 21-59 |
| | నిద్రాప్రభావము | సుశ్రుతము - సూ.శా.4.313 |

మూ॥ గ్రామ్యధర్మ ప్రవృత్తేతు రజస్వలా మనిష్టాచారా మశస్తా మతి స్థూలా మతికృశాం, గర్భిణీం. సూతికా మనుత్తానాం వికృతాంగాంగణికా మప్రజ సందుష్ట యోని మన్యస్త్రియం విశేషాచ్చ వయోవర్ణ వృద్ధాం, సగోత్రాం గురుమిత్ర బంధుభృత్యపత్నీం వర్ణినీం తథాచైత్యంచత్వరచతుష్పథోపవన శ్మశానాయతన సలిలౌషధ ద్విజగురు సుర నృపాలయేష్వహని గోసర్గే, మధ్యం దినేఽర్ధరాత్రే పర్వేదినే ష్వనంగే పిపాసురప్రణీత సంకల్పోవా నగచ్ఛేత్ 1-69

*ప్రతిపదార్థము* : గ్రామ్యధర్మ ప్రవృత్తౌతు=సంభోగము నాచరించుటలో, రజస్వలాం = రజస్వలను, అనిష్టాచారాం = అధర్మము నాచరించు దానిని, అశస్తామ్=అప్రశస్తమైనదానిని, అతిస్థూలాం=మిక్కిలి స్థూల శరీరము గల దానిని, అతికృశాం = మిక్కిలి కృశించిన దానిని, గర్భిణీం = గర్భవతిని, సూతికాం=సూతికను, అనుత్తానాం=వెల్లకిల పరుండని దానిని, వికృతాంగం= వికృతములైన అంగములు గలదానిని, గణికాం = వేశ్యను, అప్రజసం = వంధ్యను, దుష్టయోనిమ్=దూషింప బడినయోని గలదానిని, అన్యయోనిం= పశుపక్ష్యాదులను, అన్యస్త్రియం=పరస్త్రీని, విశేషాచ్చ = విశేషముగ, వయో వర్ణవృద్ధాం=వయస్సులో పెద్దదైనదానిని,ఉన్నతజాతి స్త్రీని, సగోత్రాం = సగోత్రీకురాలిని, గురుమిత్ర బంధుభృత్యపత్నీం = గురుపులయొక్క, స్నేహి తులయొక్క, బంధువులయొక్క,పరిచారకులయొక్కభార్యను, వర్ణినీం=బ్రహ్మ చారిణిని, తథా=అట్లే, చైత్య=దేవాలయము, చత్వర=ముంగిలి, చతుష్పథ= నాలుగు త్రోవలు కలిసినచోటు, ఉపవన=ఉద్యానవనము,శ్మశాన=శ్మశానము, ఆయతన=శిక్షాస్థానము, సలిల = జలము, ఔషధి = ఔషధము, ద్విజ=బ్రాహ్మ ణులు, గురు=గురువులు, సుర = దేవతలు, నృపాలయేషు=రాజప్రాసాదము లందు, అహని=పగటియందు, గోసర్గే = ఉషఃకాలమునందు, మధ్యందినే= మధ్యాహ్నమునందు, అర్ధరాత్రే=అర్ధరాత్రియందు, పర్వదినేషు=పర్వదినము లలో, అనంగే= యోనిని విడిచి, చేతులు, తొడలయందు, మైథునము చేయ రాదు, పిపాసుః = దప్పిగొన్నవాడు, అప్రణీత సంకల్పః = కోరికలేకుండ, నగచ్ఛేత్ = మైధునమునకు వెళ్ళగూడదు

తాత్పర్యము : వెల్లకిల పరుండకుండు స్త్రీని, రజస్వలగ, అప్రియు రాలుగ, దుష్టమైవ నడతలు గలదిగ, దుష్టమైన వ్యాధి మలాదులచే సంకోచ మునుచెంది యుండునట్టియోని గలదిగ, అతి స్థూలముగ, అతికృశముగ, ప్రస వించినదిగ, గర్భిణిగ, ఇతరుని భార్యగ, బ్రహ్మచారిణిగనుండు స్త్రీని, వేశ్యను, వంధ్యను, సగోత్రీకురాలిని, వయస్సు చేత, జాతిచేత పెద్దదైనదానిని, గురు పత్నిని, స్నేహితుని భార్యను, పరిచారకుని భార్యను, బంధుపత్నిని, బ్రహ్మ చారిణిని మైధున కృత్యమునందు విడువవలెను.

గురువుల ఇండ్లలో, దేవాలయములలో, రాజప్రాసాదములయందు మైధు

నము చేయరాదు. శ్మశానము, ముంగిలి,నాలుగు త్రోవలు కలిసినచోటు,ఉదకము, మండపము ఈ ప్రదేశములయందు సంభోగము చేయరాదు.

అధికముగ భుజించిన వాడు, సంతోషరహితుడు, విశేషముగ ఆకలి దప్పులు గలవాడు, బాలురు, వృద్ధులు, రోగులు మైధునమును విడువవలయును. ఉషఃకాలమునందు, మధ్యాహ్న కాలములో, అర్ధరాత్రియందు, పర్వదినముల యందు. మైథునమును చేయరాదు.

మూ॥ విశేషేణ చాతి వ్యవాయితాం గర్భిణీం, నవప్రసూతాం ఋతు
మతీం, సంవృత యోనించ న విపరీత వ్యవాయే యోజయేత్ 1-70

తాత్పర్యము : విశేషేణ = విశేషముగ, అతివ్యవాయితాం = మిక్కిలి కామమోహితను, గర్భిణీం = గర్భవతియైన స్త్రీని, నవప్రసూతాం = బాలింతను, ఋతుమతీం = ఋతుమతిని, చ = మరియు, సంవృత యోనిం = ముకుళితయోని గలస్త్రీని, వీరలను, విపరీతవ్యవాయే = ఉపరతియందు నయోజయేత్ = ఉపయోగించరాదు.

తాత్పర్యము : మిక్కిలి కామమోహితయైన స్త్రీని, గర్భిణిని, బాలింతను, ఋతుమతిని, సంవృతయోనిగలదానిని, ఉపరతియం దుపయోగించరాదు.

మూ॥ మూర్ధాది ఘాతంచ పరిహరేత్, నచ నిషేకాభి ముఖం శుక్రం
ధారయేత్ —71

ప్రతిపదార్థము : చ = మరియు, మూర్ధాదిఘాతంపరిహరేత్ = శిరస్సు మొ॥అవయవములయందు గాయపరచుటను, వదలిపెట్టవలయును,నిషేకాభిముఖం = స్రవించుట కభిముఖముగానున్న, శుక్రం = శుక్లమును, నధారయేత్ = ధరింపకూడదు.

తాత్పర్యము :శిరస్సు మొ॥ అవయవములయందు సంభోగసమయములో గాయపరచకూడదు.మైధున సమయములో హర్షాతిరేకమును సర్వశరీరగతమైన శుక్రము స్రవించుట కభిముఖముగా నున్నపుడు,దాని నడ్డగింపరాదు. స్రవించు శుక్రము నడ్డగించుటవలన, నపుంసకత్వము, వృషణములయందు బాధ, వంక్షణమునందు ఆనాహము ఏర్పడును.

మూ॥ మనఃశరీర స్థితి మాత్ర మేవ వ్యవాయం సేవేత। నతత్పరః
స్యాదితి భవంతిచాత్ర శ్లోకః —72

ప్రతిపదార్థము :మనఃశరీర స్థితి మాత్రమేవ = సంభోగము వలన మనస్సు శరీరమునందు స్థిరత్వ మేర్పడునట్లుగనే, వ్యవాయమ్ = రతిని, సేవేత = సేవింప, వలయును, తత్పరః = దానియందేలీనుడై, నస్యాత్ = ఉండకూడదు. ఇతి = అని

అత్ర = ఇక్కడి, శ్లోకః = శ్లోకము, భవతి = అగుచున్నది.

తాత్పర్యము : సంభోగమువలన మనస్సు, శరీరము అలసిపోకుండునట్లురతిని సేవింప వలయును. కాని సంభోగ కార్యమునందే నిమగ్నుడుగా నుండరాదు. ఈ విషయమునే క్రింద నుదహరించు శ్లోకముచే ధృవీకరించుచున్నాడు.

*శశిలేఖ :* అబ్రహ్మచర్యము అనగా గ్రామ్యధర్మమునందు ప్రవృత్తి లేకుండుటయని అర్థము. గ్రామ్యధర్మ ప్రవృత్తిని విడిచి మానవుడు జీవించ లేడు. అందువలన గ్రామ్యధర్మ అవృత్తి అనగా రజస్వల, బాలిక అయిన స్త్రీని సంభోగము చేయరాదు. నాలుగు మార్గములు కలియు కూడలియందు, ఉషః కాలము, పగలు, సంధ్యాకాలము, అర్ధరాత్రి యందును స్త్రీని రమింపకూడదు. అంగమును విడిచి ఇతర అవయవములయందు సంభోగము చేయరాదు. దప్పి, ఆకలి ఎక్కువగా నున్నప్పుడు సంభోగము చేయరాదు. దుష్టురాలైన స్త్రీని సంభోగింప కూడదు. అంద వికారము, హీనజాతి లక్షణములు, కుబ్జ, కుణి, వామనత్వాది రూపములు కలదానిని, ఏ స్త్రీకి సంతానము కల్గినప్పటికి, ఆసంతా నము జీవించనట్టి వంధ్యను, వ్యాధులచేత దుష్టమైన యోనిగలస్త్రీని, పశు పక్ష్యాది జంతువులను, ఇతరస్త్రీలను; వయోవృద్ధను; అగ్రగజాతి స్త్రీనీ; సంభో గింపకూడదు. ఏక గోత్రీయమైన స్త్రీని, గురువు మొ॥ పూజ్యులయొక్క భార్యలను, సంభోగమునుండి వదలిపెట్ట వలెను. చైతన్యమునందు చత్వరమునందు రాజప్రాసాదమునందు, చత్వరమునందు; సంభోగము చేయరాదు. నీటియందు; మిక్కిలి అమూల్యములయిన పర్వత ప్రదేశము లందు, ఉషఃకాలమునందు, చతుర్థీ, షష్ఠీ, అష్టమీ, అమావస్య మొ॥ పర్వదిన ములయందు, చేతులయందు, తొడలయందు, సంభోగము చేయరాదు. తన్మన స్కత లేనివాడు సంభోగము చేయరాదు. ఉపరతియందు స్త్రీని నియోగించ రాదు. ఎక్కువ సంభోంమునందు ఉద్యుక్తురాలైన స్త్రీని కూడ రమింప కూడదు. ఋతుమతికాని స్త్రీని, సంభోగింప కూడదు. విపరీత వ్యావాయ మనగా స్త్రీలు పురుషుల పనిని చేయుట. అతివ్యాయతా అనగా, మహా భోగ శరీరయని అర్థము. మైథున కర్మయందు శిరస్సును కొట్టకూడదు. మనస్సునకు ఉత్సాహమును, ఎంత వరకు శరీరమునుండి శుక్రము స్రవించునో, అంతకాలమే సంభోగమును చేయవలెను. శుక్రస్రావమైన తరువాత మైథునము చేయరాదు.

మూ॥ విశ్రబ్ధ హృష్టోరహసి తత్కామ స్తరుణః పుమాన్
సమస్థితాంగః సురభిర్ముక్త మూత్రాది రవ్యథః
నానాశితో నాత్యశితో వృష్యాణాం తర్పిత స్త్రియహాత్
నారీం నారి గుణైర్యుక్తాం సహ పూర్వగుణాం వ్రజేత్

*ప్రతిపదార్థము :* విశ్రబ్ధహృష్టః = ఆరోగ్య లక్షణములతో కూడిన మనస్సుతో, సంతోషముగా నున్నట్టి; తరుణం = యౌవనవంతుడైనట్టి; తత్కా

మః=ఆమెయందు ఇచ్ఛతో కూడుకొన్నట్టి; పుమాన్=పురుషుడు; సమస్థితాంగః=సమానముగా నున్న అంగములు గలవాడై, సురభిః=పరిమళ భరితములైన మాల్యాదులు ధరించిన వాడై, ముక్తమూత్రాదిః = మలమూత్రములను విసర్జించినవాడై, అవ్యథః=బాధలు లేనివాడై, నానాశితః=భుజించినవాడై, నాత్యశితః=అధికముగా భుజింపనివాడై, త్ర్యహాత్=మూడు దినములకుముందు, వృష్యాణాం=వాజీకరములగు పదార్థములతో, తర్పితః=తృప్తి జెందినవాడై, నారీగుణైః యుక్తాం=స్త్రీగుణములతో కూడుకొనట్టి (విశ్వాసపాత్రురాలైనట్టి), సహాపూర్వగుణాం = వెనుక చెప్పబడిన గుణముల కూడుకొన్నట్టి, నారీం=స్త్రీని, వ్రజేత్ = సంభోగింప వలెను (పొందవలె.)

తాత్పర్యము : యౌవనవంతుడైనట్టి, ఏస్త్రీని మైథునము చేయ సంకల్పించునో ఆస్త్రీని మనఃపూర్వకముగా ధ్యానించు చున్నవాడై, యౌవనవంతుడైనట్టి, సరియైన పద్ధతిలోయున్న అంగములు గలవాడై, పరిమళములు గుబాళించు మాల్యాదుల ధరించినవాడై, వేగములను విడిచి భుజించినవాడై, మూడు దినములముందు; వాజీకరపదార్థములతో తృప్తుడైన పురుషుడు, వయస్సు, రూపము, శీలము, గుణము, కులము, వీటితో సంపద్యుక్తమైన స్త్రీని, మరియు విశ్వాస పాత్రయైనట్టి, ప్రసన్నచిత్తయైనట్టి; స్త్రీతో, సంభోగమునకు ఉపక్రమింప వలెను.

మూ॥ ద్వ్యహాత్ ద్వసన్తే తస్యా న్తే పక్షాత్తద్వత్ ఘనోదయే
సేవేత సేవతః కామం హేమన్తే, శిశిరే బలీ -75

ప్రతిపదార్థము : వసన్తే = వసంతర్తువునందు (చైత్ర వైశాఖ మాసములు); ద్వ్యహాత్=రెండు దినముల వ్యవధానముగ; నారీం=స్త్రీని; వ్రజేత్=పొంద వలయును, తస్య=ఆ వసంతర్తువుయొక్క; అన్తే=చివరిదియైన గ్రీష్మర్తువునందు; పక్షాత్=15 దినముల వ్యవధానముగ, నారీం=స్త్రీని, వ్రజేత్=పొందవలయును, తద్వత్ = ఇదే విధముగ, వర్షాసు = వర్షఋతువునందు, పక్షాత్ = 15 దినముల వ్యవధానముతో, నారీం = స్త్రీని, వ్రజేత్ =పొంద వలయును, హేమన్తే=హేమంత, ఋతువునందు, చ=మరియు, శిశిరే=శిశిర ఋతువునందు, బలీ=బలవంతుడైన పురుషుడు, కామతః=ఇష్టము వచ్చినట్లుగా, కామం=రతిని, సేవేత=సేవింపవలెను.

తాత్పర్యము : వసన్త శరదృతువులలో సమాన బలము గలవారై మానవులు ఆరోగ్యమును కలిగి యుందురు గాన 2 దినములు విడిచి రతిననుభవింప వచ్చును. గ్రీష్మ వర్ష ఋతువులలో 15 దినముల వ్యవధానముతో రతి సౌఖ్యము ననుభవింప వచ్చును. హేమన్త, శిశిర ఋతువులలో సంపూర్ణ బలముగల మానవులు, ఇష్టము వచ్చినట్లుగా స్త్రీని సేవింపవచ్చును.

మూ॥ స్నానాంగరాగ వ్యజనేందు పాద మాంసాసవక్షీరరసన్ రసాలామ్॥
భక్ష్యాన్ సితాఢ్యాన్, సలిలంసుశీతమ్। సేవేత నిద్రాంచ రతాన్తతాన్తః॥

ప్రతిపదార్థము : రతాన్తతాన్తః = సంభోగము చేసిన తరువాత అలసి పోయిన మానవుడు, (రతాన్తేతాన్తః) స్నాన=స్నానమును చేయవలయును, అంగరాగ=చందనాదులతో శరీరమునకు లేపము చేసుకొనవలెను, వ్యజన= విసనకర్రలతో వీవ వలయును, ఇందుపాద = చంద్రకిరణములను సేవింపవలెను, మాంస=మాంసమును, ఆసవ=ఆసవములను, క్షీర=పాలను, రసాన్=మాంస రసములను, రసాలామ్ = రసాలమును, సితాఢ్యాన్ = శర్కర అధికముగ, భక్ష్యాన్ = భక్ష్యములను, సుశీతం=మిక్కిలి చల్లనైన, సలిలమ్ = జలమును, చ = మరియు, నిద్రను, సేవేత=సేవింప వలయును.

**తాత్పర్యము :** సురతాంతమునందు, స్నానము, చందనానులేపనము' శీతవాతము, ఖండశర్కరచే చేయబడిన భక్ష్యములు, మిక్కిలి శీతలమైన ఉదకము' పాలు; మాంసరసము; రసాలము; ఆసవము; ఉత్తర కాలమునందే నిద్ర వీనిని యుక్త ప్రకారము సేవింప వలయును.

మూ॥ స్త్రీ సంసర్గాద్ధి సద్యః స్యాత్క్లీబతా బలినామపి,
ఏవంచాప్యాయతే శీఘ్రంతేషాం శుక్రంచధామ చ —77
దృష్ట్యాఽఽయు రోజః శుక్రాణాం మేఢ్రాశ్రయాన్గదాన్
వాయోః కోపమధర్మంచ మూఢః ప్రాప్నోత్యతోఽన్యథా ॥78।

ప్రతిపదార్థము : తథాహి = అది యుక్తమే గదా! స్త్రీసంసర్గాత్= సంభోగమువలన; సద్యః వెంటనే; బలినామపి = బలవంతులైన వారికి కూడ; క్లీబతా=నపుంసకత్వము (దుర్బలత్వము) (తప్పక కల్గును) ఏవం=ఇట్లు, పైనుపదేశించిన విధముగచేసిన యెడల; తేషాం=వారియొక్క, శుక్రం=శుక్రమును, చ=మరియు, ధామ = అండములు మరియు శుక్రస్థానము, (బలమును), శీఘ్రం=త్వరగా; అప్యాయ్యతే=పుష్టి చెందింప బడుచున్నది, అతోఽన్యథా= దీనికంటె విపరీతమైన యెడల, దృష్టి=చూపు, ఆయుః=జీవితము, ఓజః = ఓజస్సు, శుక్రాణామ్=శుక్రము వీటికి, క్షయం=క్షీణతను, మేఢ్రాశ్రయాన్= మేఢ్రము నాశ్రయించివచ్చు, గదాన్=వ్యాధులను, వాయోః=వాయువునకు, కోపం=కోపమును, చ=మరియు, అధర్మం=అధర్మమును, మూఢః = మూర్ఖుడు, ప్రాప్నోతి=పొందుచున్నాడు.

తాత్పర్యము : స్త్రీ సంసర్గమువలన, బలవంతుడైన పురుషునికి కూడ, తత్కాలమున దౌర్బల్యమేర్పడును. కాన పై శ్లోకములో చెప్పిన స్నానాదులను వెంటనే ఆచరించిన యెడల వారికి, శుక్రము బలము (పోయిన) వెంటనే పుష్టమగును. పై నుదాహరించిన వాటిని ఆచరింపక మరియొక స్త్రీని సంభో

గము చేసిన యెడల, దృష్టికి, జీవితమునకు, ఓజస్సుకు, శుక్రమునకు, పెద్ద ఆఘాత మేర్పడును. ఇంతియే కాక మరియు మేఢ్రాశ్రితములైన వ్యాధులు సంభవించును. మరియు మూర్ఖుడైనవాడు వాత ప్రకోపమును అధర్మమును స్వయముగ ప్రకోపింప చేసిన వాడగును. ధామ శబ్దమునకు బలమనియు అర్థము గలదు.

*శశిలేఖ* : ప్రసన్న చిత్తయైన స్త్రీని ఏకాంతమునందు సంభోగింప వలెను. సంభోగమున కుద్యుక్తుడై స్త్రీని రమించ వలెను. సంభోగమును చేయుటకు మూడు దినములు ముందుగా వాజీకరములైన ఆహారాదులను భుజించి, ఇంద్రియ పుష్టిని కలిగించుకొని, తృప్తుడై తరువాత సంభోగము చేయవలెను.

రెండు దినముల వ్యవధానముతో వసన్త ఋతువునందు, గ్రీష్మ వర్ష ఋతువులలో యథేష్టముగను రతిసౌఖ్యము ననుభవింప వచ్చును. శరదృతువు నందునూ, రెండు దినముల వ్యవధానముతో రమింప వచ్చును. రతాన్తము నందు అలసి పోయిన వాడు, స్నానాదులను సేవింప వలయును. బలవంతుడై నప్పటికి గూడ సంభోగము చేసిన వెంటనే దుర్బలుడగును. అలసిపోవును. కాన స్నానాదులను వెంటనే చేయుట వలన, వెంటనే శుక్రమునకు పుష్టియేర్పడును. అట్లు స్నానాదుల నాచరించక మరల మరియొక స్త్రీని రమింపచేసిన యెడల, దృష్టి క్షయము, జీవితక్షయము, ఓజక్షయము, ఏర్పడును. మరియు మేఢ్రాశ్రితములైన పెక్కురోగములు బాధించును. మరియు మానవుడు తన మూర్ఖతతో వాత ప్రకోపమును, అధర్మ ప్రవర్తకుడను అపవాదమును పొందుచున్నాడు.

వి. వ్యా. నపుంసకత్వ విషయములో చరకుడు సూ. స్థా. అ. 25

క్షరణాభి —

సూ. 7. అ.

వాగ్భట సూ. 4/20 . 21

చరక వాజీకరణ అధ్యాయము,

సుశ్రుతము చి. అ. 24/113

సుశ్రుతము చి 24/132

భేడ సంహితా. ఋతౌ—గ్రీష్మేతు మాసిమాసి సమాచరేత్॥

మూ॥ ఉత్తానో వేగరోధీవా వృద్ధి మేహాశ్మశర్కరాః।
తిమిరాది గదోత్పత్తిం మూర్ధాద్యాహననాద్ధ్రువమ్ ॥79॥

ప్రతిపదార్థము : ఉత్తానః = పురుషాయితమ్మ్యులవాడైన, వేగరోధీ= శుక్ర వేగమును అడ్డగించినను, వృద్ధి మేహాశ్మశర్కరాః = అన్త్రవృద్ధిం, ప్రమేహము, అశ్మరీశర్కరలు.

మూర్ధాద్యాహననాత్ = స్త్రీయొక్క శిరస్సు మొ॥ ప్రదేశములపై తాడనము చేయుట వలన, తిమిరాది గదోత్పత్తిం = తిమిరము మొ॥ ఊర్ధ్వ

జత్రుగత రోగములుత్పన్న మగుట, ధ్రువమ్=నిశ్చయము.

**తాత్పర్యము :** స్త్రీ, పురుష కర్మను జేయుట వలన (ఉపరతివలన) స్రవించుచున్న శుక్రమును అడ్డగించుటవలన, ఆ స్త్రీ వృద్ధి, ప్రమేహము, అశ్మరి, శర్కర ఉత్పన్న మగును. మరియు సంభోగ సమయమున స్త్రీయొక్క మూర్ధాది తాడనము వలన తిమిరము మొ॥ ఊర్ధ్వ జత్రుగతములైన వ్యాధులు నిశ్చయముగ గల్గును.

మూ॥ భ్రమ క్లమోరు దౌర్బల్య బలధాత్వింద్రియ క్షయాః।
అపర్వ మరణంచ స్యాద్విశేషేణాతి మైథునాత్ 80॥

ప్రతిపదార్థము : విశేషేణ=విశేషించి, అతిమైథునాత్=అతిమైథునము వలన, భ్రమ=తలతిరుగుట, క్లమ=అలసట, ఊరుదౌర్బల్య = తొడలయందు దౌర్బల్యము, బల=బలమునకు, ధాతు=ధాతువులకు, ఇంద్రియక్షయాః=ఇంద్రియములకు క్షయము, చ=మరియు, అపర్వమరణమ్=అకాల మరణముగూడ సంభవించును,

మూ॥ నచోన షోడశాద్వర్షాత్సప్తతేః పరతోనచ
ఆయుష్కామోనరః స్త్రీభిః సంయోగం కర్తుమర్హతి —81

ప్రతిపదార్థము : షోడశాద్వర్షాత్ ఊనః = 16 సంవత్సరముల వయస్సు కంటె తక్కువ వయస్సు గలవాడు, సప్తతేః పరతః=70 సం॥ దాటిన, నరః= మానవుడు, స్త్రీభిః = స్త్రీలతో, సంయోగం=సంభోగమును, కర్తుం=చేయుటకు, నార్హతి=తగడు.

**తాత్పర్యము :** 16 సంవత్సరములకంటె తక్కువ వయస్సు గలవారు· 70 సంవత్సరముల వయస్సు దాటినవారు స్త్రీలతో సంభోగించుటకు తగరు.

మూ॥ **అతిబాలో** హ్యసంపూర్ణ సర్వధాతుః స్త్రియం వ్రజన్।
ఉపతప్యేత సహసా తటాకమివ కాజలమ్ — 82

ప్రతిపదార్థము : అసంపూర్ణ ధాతుః = 16 సం॥ పూర్వము, ధాతువు లన్నియు సంపూర్ణముగ వృద్ధి జెందక యుండిన, అతిబాలః = చాల చిన్న పిల్లవాడు, స్త్రియం=స్త్రీని, వ్రజన్=పొందుచూ, సహసా=వెంటనే, కాజలమ్ = కొద్ది నీరుగల తటాకమివ=చెఱువువలె, ఉపతప్యేత=తపించి పోవును.

తాత్పర్యము : పదునారు సంవత్సరముల వయస్సు వచ్చువరకు, ధాతువునకు సంపూర్ణమైన పుష్టి కలుగదు. మరియు పదునారు సంవత్సరముల వయస్సు వచ్చువరకు 'బాలుడు' అను శబ్దముతోనే వ్యవహరింప బడును. కాన అట్టి బాలుడు స్త్రీని పొందిన యెడల, అతి శీఘ్రముగ, సూర్య కిరణములతో స్వల్పజలముగల తటాకము ఎండిపోవునట్లు ధాతువులన్నియు శుష్కించును.

మూ॥ శుష్కం రూక్షం యథా కాష్ఠం కాష్ఠం జన్తుజగ్ధం విజర్జరమ్।
స్పష్ట మాశు విశీర్యేత తథా వృద్ధః స్త్రియం వ్రజన్ — 83

ప్రతిపదార్థము : శుష్కం=ఎండిన, రూక్షం=రూక్షమైన, జన్తుజగ్ధమ్=క్రిములచేతభక్షింపబడిన,విజర్జరమ్=వదులుబారిపోయిన,కాష్ఠయథా=కర్రవలె, తథా=అట్లే,వృద్ధః=ముసలివాడు, స్త్రియం=స్త్రీని, వ్రజన్=పొందుట,ఆశు=శీఘ్రముగా, స్పష్టం=తప్పక, విశీర్యేత=నశించును.

తాత్పర్యము : జంతువులచేత (క్రిములచేత) తినబడినది, ఎండినది; రూక్షమైనది,చెదలు బట్టిన (పుళ్ళుబట్టిన) కర్ర ఎట్లు నశించునో అట్లే ధాతు క్షీణతగల ముసలి వాడు స్త్రీని రమింపచేసిన యెడల త్వరగా తప్పక నశించ కలడు.

మూ॥ కాయస్య తేజః పరమం హి శుక్ర
మాహార సారాదపి సారభూతం
జితాత్మనా తత్పరి రక్షణీయం।
తతో వపుః సంతతి రప్యుదారా — 84

ప్రతిపదార్థము : కాయస్య = శరీరముయొక్క, పరమం = ఉత్కృష్టమైన, తేజః = తేజోరూపమయిన , ఆహార సారాదపి=ఆహారముయొక్క సారమున కంటెను, సారభూతమ్ = సారభూతమైన, శుక్రం=శుక్రమును, జితాత్మనా=ఇంద్రియ నిగ్రహముతో, తత్ శుక్రం = ఆశుక్రము, తత్ వపుః=ఆ శరీరము, పరిరక్షణీయమ్=జాగ్రత్తగా కాపాడ దగినది, తతః = అట్లు శరీరమును, శుక్రమును కాపాడుట వలన, ఉదారా = ఉత్తమమైన, సంతతిరపి = సంతానముకూడ, జాయతే=కల్గుచున్నది.

తాత్పర్యము : శరీరమున కుత్కృష్టమైన తేజోరూపమయినట్టిది, ఆహార సారము వలన, రసాది షడ్ధాతు వృద్ధి ఏర్పడగా, ఏడవది యగు శుక్రము అన్నింటి సారము వలన యుత్పత్తి యగుచున్నందున, ఆహారసారమున కంటె శ్రేష్ఠమైనదిగా భావింపవలయును. కాన ఈ శుక్రమును తదాధార భూతమైన శరీరమును ఇంద్రియ నిగ్రహముగల పురుషుడు జాగరూకతతో సర్వదా కాపాడుచున్న యెడల, శుక్ర పర్యవేక్షతో పుట్టుబోవు సంతానముగూడ ఉత్తమమైన దగుననుటలో సందేహముండదు.

మూ॥ అప్రమత్తో భజేద్భావాం స్తదాత్వ సుఖసంజ్ఞకాన్।
సుఖోదర్కేషు సజ్జేత దేహస్యైతదలం హితమ్ — 85

ప్రతిపదార్థము : అప్రమత్తః=జాగరూకుడై, దేహస్య=శరీరమునకు, తదాత్వసుఖ సంజ్ఞకాన్ = క్షణిక సుఖమును కలిగించు స్త్రీసంగమము, ఆహారము, విహారము మొదలగు, భావాన్ = భావములను. భజేత్=సేవింపవలయును, దేహస్య=శరీరమును, సుఖోదర్కేషు=అపార సౌఖ్య ప్రదాయకము

లగు తపోదాన యజ్ఞాదులయందు, సజ్జేత=జోడింపవలెను, దేహస్య=శరీరము నకు, ఏతత్ హితం=ఈ మంచి కార్యము. అలం = చాలును.

తాత్పర్యము : మానవుడు, క్షణికసుఖమును కలిగించి, మత్తునుపొందించి దానవునిగా మార్చి మానవ జన్మయొక్క పరమార్థమును మంటగలుపు స్త్రీ సంగమము, ఆహారము, విహారము మొ॥ దుష్టభావములను శాస్త్రవిరుద్ధముగ నాచరింపక, అతి జాగరూకతతో అపార సౌఖ్య ప్రదాయకములగు, అనంత మైన ఆత్మ సాక్షాత్కారమునకు, దోహదకారులైన తపో యజ్ఞదానాది కర్మలయందు స్థితప్రజ్ఞతతో ఆత్మను సంధానము చేయుటవలన దేవత్వమును బొంది, ఆయురారోగ్యములతో తరించగలడు. విజ్ఞత గలవాని కిదియే చాలి నంత హితమును చేకూర్చును.

మూ॥ ప్రజ్ఞాపరాధోఽసాత్మ్యార్థ సంయోగః కాల వైకృతమ్।
హితేఽపిరత మాహారే యోజయన్త్యా మయైర్నరమ్ — 86

ప్రతిపదార్థము : హితేఽపి ఆహారే=ఆహారము, పథ్యముతో కూడినదై నప్పటికిన్ని, ప్రజ్ఞాపరాధః = ప్రజ్ఞాపరాధము, అసాత్మ్యార్థ సంయోగః = అసాత్మ్యార్థ సంయోగము, కాలవైకృతమ్ = కాలవైకృతము, రతమ్ = ఇష్టమైదె, నరం=మానవుని, ఆమయైః=రోగములతో, యోజయన్తి = కలుపు చున్నవి.

తాత్పర్యము : హితకరమైన ఆహారమును సేవించినప్పటికి గూడ, ప్రజ్ఞాపరాధము, అసాత్మ్యార్థసంయోగము, కాల వికృతి ఈ మూడు కారణ ములు, పురుషుని, రోగములతో చేర్చుచున్నవి.

శశిలేఖ : స్త్రీల వలన ఉపరతి ననుభవించిన పురుషుడు, వాతము, వైప రీత్యమును పొందుట చేత, కన్నీరు, శుక్రము, స్రవించుట వలన, ఆన్త్రవృద్ధి మొ॥ వాటి చేత పీడింపబడును. మరియు తిమిరము, ఊర్ధ్వజత్రుగత రోగములు సంభవించును. అతి మైథునము వలన, భ్రమాదులు కల్గును. అకాల మరణము గూడ సంభవించును. విశేషించి తొడలయందు దౌర్బల్యమేర్పడును. 16 సంవ త్సరములు నిండనివారు బాలురు, 70సం॥ పైబడ్డవారు వృద్ధులు. వీరు స్త్రీలతో కూడిన యెడల నశించి పోదురు. ఎందుకనగా, పదునారు సంవత్సరములు గూడ నిండనిబాలురు, అసంపూర్ణములైన ధాతువులు గలవారు కనుక వెంటనే స్త్రీలను పొంది తపించిపోవుట తథ్యము. ఎట్లు? కొద్దిపాటి జలము గల తటాకము సూర్యుని యొక్క తీక్ష్ణ కిరణములతో శుష్కించినట్లు. 70 సం॥ పై బడ్డ వృద్ధులు స్త్రీలను పొంది, జంతువులతో తుప్పుపట్టి, శుష్కమై రూక్షమైన కర్ర, అతి పురాతనమైనందున, నశించిపోవునట్లు నశించును, ఇట్టి స్థితిలో జితేంద్రియుడై, శుక్రమును రక్షింప వలెను. ఎందుకనగా, శరీరమునకు మిక్కిలి, శ్రేష్ఠమైనది, శుక్రము. మరియు ఆహారము యొక్క సారమునకంటె సారభూతమైనది

శుక్రము. కావున అట్టి శుక్రమును, శుక్రమున కధిష్ఠానమైన శరీరమును. మానవుడు అతిజాగ్రత్తగా రక్షింపవలెను. మానవుడు అసుఖ సంజ్ఞకములైన, ఆహారము, నిద్ర, స్త్రీ సంభోగము మొ॥ కార్యములయందు అప్రమత్తుడై శాస్త్ర విధి ననుసరించి, కార్యమునాచరించ వలెను. మరియు మంచి కార్యములయందు ఎల్లప్పుడు, తదేక నిష్ఠతో కూడుకొని యుండవలెను. సాధారణముగా ప్రజలకు, దుఃఖ సమయముల యందే సుఖమును గురించి జ్ఞాపకము వచ్చును. అందువలన మానవుడు అదృష్ట సుఖఫలములైన దానాదులయందు ఎల్లప్పుడు నిమగ్నుడై యుండవలెను. బుద్ధి, స్మృతి, ధైర్యము ఇవి నష్టమగుట వలన మానవుడు అశుభములైన కార్యములను ఆచరించుచున్నాడు. దీనినే ప్రజ్ఞాపరాధము అని చెప్పుచున్నారు. అతియోగ, అయోగ, మిథ్యాయోగ, రూపములైన పంచేంద్రియ కర్మలు విషయములగును. కాలము శీతకాలము నందు వేడిగ నుండుట, ఉష్ణకాలమునందు శీతముగా నుండుట, మొ॥ వైపరీత్యములతో కూడియుండును. మానవుడు హితమైన ఆహారమునందు ఇష్టుడుగా నున్నపుడు ఆరోగ్యవంతుడుగా నుండును. అహితమైన ఆహారమును సేవించిన యెడల, రోగములచే పీడితుడగును.

**వి. వ్యా :** చరకము. మూ. 29. 40, "తదాత్వ సుఖ సంజ్ఞేషు భావేష్వజ్ఞోఽనురజ్యతే"

మూ॥ నాపథ్య సేవినం సద్యః ప్రబాధన్తే తదామలాః ।
ప్రకోపం ప్రతి విఘ్నంతి భిన్నై ర్దూష్యాది భిర్యదా ।
నచసర్వోపచారోఽపి సర్వదా సర్వదోషకృత్ ।
నహి సర్వాణ్యపథ్యాని తుల్య దోషాణి నైవచ ।
సర్వే తుల్య బలా దోషా నసర్వాణి వపూంషిచ ।
వ్యాధి క్రమత్వే శక్తాని యతోఽపథ్యంతదేవతు ।
గచ్ఛత్య పత్యతమతాం తుల్య దోషాది వర్ధిమ్ ।

*ప్రతిపదార్థము :* అపథ్య సేవినం=పథ్యముకాని ఆహారము నభ్యసించువానిని, మలాః = వాత పిత్త కఫాదిమలములు, తదా = అప్పుడు (అపథ్యాహారము చేసినపుడు), సద్యః= వెంటనే, నప్రబాధన్తే=బాధింపవు, యదా = ఎప్పుడు, భిన్నైః=భిన్నములైన, దూష్యాది భిః=రసాదులు; దేశాదుల చేత; ప్రకోపం=ప్రకోప కారణమును; ప్రతివిఘ్నన్తి=నాశనమును చేయుచున్నవి, (విఘ్నములను కల్గించుచున్నవి.) యతః=ఎందుకనగా; సర్వోపచారః=అపథ్యాభ్యాసము; సర్వదైవ=ఎల్లప్పుడు; నసర్వదోషకృత్ = సమస్త దోషములను ప్రకోపింప చేయదు; సర్వాణి = సమస్త పదార్థములు; నఅపథ్యాని=అపథ్యములు కావు; చ =మరియు; నతుల్యదోషాణి = తుల్య దోషములును కావు; సర్వే దోషాః=సమస్త దోషములు; నతుల్య బలాః = సమాన బలము కలవి

కావు; సర్వాణి=సమస్తములైన; వపూంషి=శరీరములు; వ్యాధి క్షమత్వే=రోగమును సహించుటలో; నశక్తాని = సమర్థవంతములైనవి కావు; యతః=ఎందువల్ల ననగ; తదేవ అపథ్యమ్=ఆ అపథ్యమే; తుల్యాదోషాది వర్ధితమ్=సమాన దోషాదులచేత వృద్ధి పొందింపబడినదై; అపథ్యతమతాం=అపథ్యతమత్వమును; గచ్ఛతి=పొందుచున్నది.

**తాత్పర్యము :** అపథ్యములగు ఆహారమును భుజించు వారిని, తరచుగా వాత పిత్త కఫ దోషములు వెంటనే ఎట్టి బాధలను కల్గించవు. అపథ్య సేవన వలన, ఏ విధమైన బాధలు సంభవింపవు. ఒకప్పుడిది విరుద్ధముగ కూడ నగును. ఎట్లనగ, అపథ్య సేవనము, తుల్యమైన దోష దూష్యముల యొక్క అవస్థలో వెంటనే బాధాకరము గాదుకాని, కొంత వ్యవధానములో ఆ అపథ్యము, మరి యొక ఆశయములో ప్రవేశించినపుడు, దూష్య దోషాదులకు కూడ భిన్నమైన వ్యవస్థ యేర్పడినపుడు, ఆ అపథ్యము బాధాకరమగుచున్నది. ఎట్లనగా, ఆనూప దేశములో సేవించిన పిత్త ప్రకోపకర పదార్థములు దుఃఖ కారకములు గావు. కాని ఆ అపథ్యకర పదార్థములే ముందుకు వెళ్ళి, దోష దూష్యాదులకు భిన్న వ్యవస్థ ఏర్పడినపుడు సద్యో మరణమును కల్గించుచున్నవి. ఒక్కొక్క అవస్థా విశేషములో అపథ్యము, పథ్యముగా నున్నట్లు కనబడిననూ, కాలాంతరములో అది బాధించక విడువదుకాన అపథ్యము సర్వదా అపథ్యమే యగును.

సమస్తమైన అపథ్యకరములైన ఆహారములు, ఎప్పుడూ, అన్ని దోషములను ప్రకోపింప జేయజాలవు. అన్ని అపథ్యములు, దోషములకు సమానములుగ నుండవు. దోషములన్నియు, సమాన బలమును కలిగియుండవు. సమస్త శరీరములు, అతి భయంకరములగు వ్యాధులను సహించు శక్తిని కలిగి యుండవు, ఎందుకనగ అపథ్య పదార్థములు, సమాన గుణభూయిష్టములైన దూష్యాదులతో వృద్ధిచెంది, ఎక్కువ అపథ్య రూపత్వము పొందును.

చరకము సూ॥ అ-28-7.

మూ॥ తఏవచ పునర్దోషా హేతుభిర్బహుభిశ్చితాః - 90
మిథో విరుద్ధా బలినో దీర్ఘకాలాను బన్ధినః ।
సర్వే నమం ప్రకుప్యంతి, ప్రాప్యాల్పమపి కారణమ్ - 91
ప్రాణాయతన మాశ్రిత్య గంభీరాః సర్వమార్గగాః ।
దేహే హితోఽచితే స్యుశ్చిరా దప్యాశుకారిణః -92

**ప్రతిపదార్థము :** పునః=మరల, తేఏవదోషాః = అపథ్యమే కారణముగాగల దోషములు, చిరాదపి=చాలాకాలమైనప్పటికి గూడ, అల్పమపి కారణమ్=స్వల్పమైన కారణమును పురస్కరించుకొనియు, అహితోచితే = అపథ్యాభ్యాసము గల, దేహే=శరీరము నందు, ఆశుకారిణః=త్వరగా కార్యమును

నిర్వర్తించునవిగా, భవంతి=అగుచున్నవి, హేతుభిః బహుభిః=శీత గుర్వాది గుణములతో కూడిన అనేక కారణముల చేత, చితాః=స్వస్థానమునందు కోపగించినవై, మిథః=పరస్పరము, విరుద్ధాః=విరుద్ధములై, తథా=అట్లే, బలినః=ప్రబలములై, దీర్ఘ కాలానుబన్ధినః = చాలా కాలము నుండి అనుబన్ధములుగా నున్నవై, సర్వే=దోషములన్నియు, సమం=ఏక కాలము, ప్రకుప్యంతి=ప్రకోపించుచున్నవి, చ=మరియు, ప్రాణాయతనం=ప్రాణస్థానమును (హృదయాదులను), ఆశ్రిత్య=ఆశ్రయించి, గంభీరాః=గంభీరములైన, సర్వమార్గగాః=అశేష స్రోతస్సులను వ్యాపించినవిగా, స్యుః=అగుచున్నవి.

తాత్పర్యము : అపథ్యసేవన వలన, దోషములు వెంటనే ప్రకోపించి వ్యాధులను కల్గించవు. ఇది తత్కాలమునకు సంబంధించిన, దోషముల యొక్క కార్యక్రమము కాని ఆ దోషములు, అపథ్యాహారము, చాలా కాలము క్రింద చేసినప్పటికి, కాలాంతరమున స్వల్పమైన అపథ్యాహార రూపమైన కారణమును పురస్కరించుకొని, మిక్కిలి శీఘ్రముగా శరీరమంతయు వ్యాపించి, పరస్పరము విరుద్ధములై, మరియు మిక్కిలి బలము గలవై, ఏక కాలమున ప్రకోపము చెందుచున్నవి. మరియు ఈ దోషములు చాలా కాలమునుండియు అనుబంధ్యా అనుబంధ భావమును కలిగియుండినను అన్నియు ఒకే కాలమున ఆ అనుబంధ భావమును పక్కకు నెట్టి, తమ ప్రకోపమునకు శరీరము నాహుతి చేసుకొనును. మరియు ప్రాణాదులకు స్థానభూతములైన హృదయాదులను ఆశ్రయించి గంభీరములైన అశేష స్రోతస్సులును, వాటి మార్గములగుండా వ్యాపించి శరీరమునకు కీడు కలిగించుచున్నవి.

చరకము సూ॥ అ-28/14 తె॥

**మూ॥ అహితాన్యపి చాన్యేషా మభ్యాసాదుపశేరతే।**
దోషాశ్చైషాం క్షయం యాన్తి కర్మవాతాతపాదిభిః-93.

ప్రతిపదార్థము : అన్యేషామ్ = మరికొందరికి, అహితాన్యపి = అపథ్యకరములైనప్పటికి (ఆహారాదుల), అభ్యాసాత్ = నిత్యాభ్యాసము వలన, ఉపశేరతే=శరీరమునకు సుఖకరము లగుచున్నవి, ఏషామ్ = ఈ పురుషుల యొక్క, కర్మ = పనిని బట్టి, (పరుగెత్తుట, దుముకుట మొ॥), వాతాదిభిః= గాలి, యెండ మొ॥ వాటితో, దోషాః = దోషములు, క్షయం=నాశమును, యాన్తి=పొందు చున్నవి.

**తాత్పర్యము :** కొద్దిమంది వ్యక్తుల విషయములో నిరంతరము అభ్యసించు చున్న అపథ్యాహారము కూడ వారికి అనుకూలముగ మారుచున్నది. ఈ మనుష్యులుచేయు ఉరుకుట, దుముకుట, మొ॥ పనులు, వాయువు, ఎండ మొ॥ ప్రకృతి సిద్ధములైన కారణ సమూహములతో, వాతాది దోషములు క్షీణించు చున్నవి.

మూ॥ భిన్నాహార వయః సాత్మ్య ప్రకృతీనాం సమంభవేత్ ।
ఏకో వికృతి వాయ్వాది యుగపత్సేవనా ద్గదః -94

ప్రతిపదార్థము : భిన్నాహార వయః సాత్మ్య ప్రకృతీనామ్ = ఆహారము, వయస్సు, సాత్మ్యము, ప్రకృతి, ఇవి భిన్నములుగా నున్న పురుషులకు కూడ, సమం = ఒకే కాలమునందు, వికృత వాయ్వాది = వికృతములైన వాయ్వాదులను, యుగపత్ = ఒకేమారు, సేవనాత్ = సేవించుట వలన, ఏకోగదః = ఒకే వ్యాధి, భవేత్ = అగును.

**తాత్పర్యము** : ఆహారము, వయస్సు, సాత్మ్యము, ప్రకృతి భిన్నములుగా నున్న పురుషులకు కూడ ఒకే కాలము నందు ఒకే మారు వికృతి చెందిన వాయ్వాదులను సేవించుట వలన, సమానమైన ఒకే వ్యాధి సంభవించును.

మూ॥ వాతాదీనాంతు వి‌కృతి ర్వికృతాద్గ్రహచారతః
భౌమాన్తరిక్ష దివ్యేభ్యో ఉత్పాతేభ్యశ్చ జాయతే -95
సమ్భవః పునరేతేషాం కర్మణః సాముదాయికాత్ ।

**ప్రతిపదార్థము** : వికృతాత్ = వికృతములైన, గ్రహచారతః = గ్రహముల యొక్క సంచారము వలన, భౌమాన్తరిక్ష దివ్యేభ్యః = పృథివీ, ఆకాశము, చంద్ర సూర్యుల వలన ఏర్పడిన, ఉత్పాతేభ్యః = ఉత్పాతముల వలన, వాతాదీనామ్ = వాతాదులకు, వికృతిః = వికృతి, జాయతే = కలుగుచున్నది. ఏతేషాం = వీటియొక్క, సమ్భవః పునః = పుట్టుక యయితే, కర్మణః = పూర్వ వర్తమాన జన్మల యందు చేసిన కర్మల యొక్క, సాముదాయికాత్ = సముదాయము వలన, భవతి = అగుచున్నది.

తాత్పర్యము : పై శ్లోకమునందు, భిన్న ఆహారాదులు సేవించు పురుషులకు, ఒకే కాలమునందు ఒకేమారు లౌకికములైన వాయ్వాదులను సేవించుట వలన, ఒకే వ్యాధి సంభవించునని చెప్పిరి. అది ఎట్లు? అను దానిని ధ్రువపరచుచున్నారు.

జ్యోతిశ్శాస్త్రపరముగ వ్యక్తి పుట్టిన నక్షత్రమును బట్టి, గ్రహగతులు ఏర్పడుచున్నవి. వాటి సంచారము కుండలి సరియైన పద్ధతిలో నున్న ఆరోగ్యముగా నుండుననియు, గ్రహసంచారము వక్రించిన యెడల, వ్యాధులు సంభవించుననియు, చెప్పియున్నారు. ఆ సిద్ధాన్తమును బట్టి, గ్రహములు వక్రముగా కుండలిలో సంచరించుట వలన, జనపదోధ్వంసకరములైన, భూమి, ఆకాశము, చంద్రుడు, సూర్యుడు మొ॥ వాటియొక్క ఉత్పాతము వలన, శరీరాంతర్గతములైన, వాత పిత్త శ్లేష్మలకు వికృతి గలుగుచున్నది. ఈ వికృతికి మూలకారణభూతములైన, భూమి, ఆకాశము, చంద్రుడు, సూర్యుడు, వీటికి ఉత్పాతము, అధర్మమధికమైనపుడే సంభవించును. ఈ అధర్మానుష్ఠానము, వెనుకటి జన్మదై

నను, ఈ జన్మదైనను, లేక రెండు కలిసి యైనను, రోగోత్పత్తికి కారణముగ నగును. కాన మిథ్యాహారములే రోగమును పుట్టించుటకు కారణములు కావు. మిథ్యాహార విహారములు, అనగ అధర్మాచరణములు గూడ, వ్యాధ్యుత్పత్తికి, బలిష్ఠములైన కారణములుగ చెప్పుచున్నారు.

*శశిలేఖ* : భిన్నములైన అంశాంశ కల్పనతో సాదృశ్యత లేని, రసాది దూష్యముల చేత, వాతాదుల యొక్క ప్రకోపమునకు, విఘ్నము ఏర్పడినందున, అపథ్యాహారమును సేవించినను, అది వెంటనే రోగమును కలిగించదు. ఎట్లనగ, ఆనూప దేశమునందు పిత్తమునకు ప్రకోపమును కలిగించు, ఆహారములను సేవించినప్పటికి వెంటనే వ్యాధి సంభవించదు. ఎప్పుడైతే దూష్యాదుల యొక్క, సాదృశ్యమువలన, మలములయొక్క ప్రకోపమున కంతరాయ మేర్పడదో, అపుడు తప్పక వెంటనే మలాదులు శరీరమును బాధించును. ఇందువలన మలములు వెంటనే శరీరమును బాధించవు. ఎందుకనగ ఎల్లప్పుడు, అపథ్యాహారములను సేవించుటవలన, సర్వదోషములు వృద్ధి జెందవు. ఏదో ఒక అపథ్యము, ఎప్పుడో ఒకప్పుడు, దోషవృద్ధికి విశేష కారణమగును. దూష్యాదుల యొక్క, సాదృశ్యమువలన అది సంభవించును. ఎందుకనగ సమస్తములైన, అపథ్యాహారములు, తుల్య దోషములు, ఏకదోష వృద్ధికి హేతువులుగాకూడ ఉండవు. ఒకనిచేత శ్లేష్మదోషముయొక్క వృద్ధికి, కారణమైన అపథ్యము సేవింప బడును. కాని వానికి ఆ ఆహార సేవ వలననే తప్పక దానికి విపరీతమైన దోషవృద్ధికి కారణముగాగూడ సంభవించును. అందుచేత, ఆదోషము, అట్లు, ప్రకోపమును చెందదు. ఎందుకనగ, సమస్త దోషములు, సదృశబలములు గలవిగా నుండవు. ఒకదోషము హీనబలము గలదై, మరియొక అధికబలము దోషముచేత దానియొక్క ప్రకోపము, అడ్డగింపబడినదై, ప్రకోపమును చెందదు. సమస్త మానవాళియొక్క దేహములు, వ్యాధులను సహించుటలో సమర్థవంతములుగా నుండవు. వ్యాధిని సహించు శరీరమునందు, దోషసంసర్గముగాని, దోషసన్నిపాతముగాని, అధిక పీడాకరముగాదు. పీడను ఆశరీరమునకు కల్గించుటకు శక్తిలేనందువలన, అట్లు సంభవించును. అట్లే తుల్యదూష్యాదులచేత, స్వీకరింపబడిన అపథ్యము, తుల్య బలమువలన అపథ్యతమతను పొందుచున్నది. విసదృశములైన రసాది దూష్యాదుల చేతచేర్చబడిన అపథ్యము, ఎప్పుడైననూ దోషములకు ప్రకోపకారణముగగాదు. దూష్యాదులు సమానములగుటవలన, అది సంభవించును. ఎట్లనగ, స్నిగ్ధాది గుణములచేత సాత్మ్యమైన, స్వల్పబలము కలిగిన, అల్పమైన సత్త్వముగల, మందాగ్నితోకూడిన కఫప్రకృతియైన మానవునికి, వసంతఋతువునందు, స్నిగ్ధగుర్వాది గుణములతో కూడిన ఆహారాదులతో ప్రకుపితమైన కఫముచేత, మేదస్సు దూషింప బడును. ఒకటి లేక, రెండు లేక మూడు దూష్యములయొక్క సాదృశ్యమువలన, అసాదృశ్యమువలన, కార్యరూపమైన వ్యాధి సంభవించుచున్నపుడు, ఆ దూష్యాదులకు, గురులాఘవము

లను కల్పింప వలయును. ఆవాతాదిదోషములు (అపథ్యము చేత సాత్మ్యతను చెందిన) కాలాంతరమున స్వల్పమైన అపథ్యాహార సేవనవలన, త్వరగ తమ కార్యములను, నిర్వర్తించునవై దేహమును మరణముయొక్క సమీపమునకు చేర్చును. శీతగుర్వాది అనేక కారణములచేత, స్వస్థానమునందే వృద్ధి చెందిన దోషములు పరస్పర విరుద్ధ భావములను చెందినవై, మిక్కిలి బలముగలవై మరియు నవిచాలా కాలమునుండి శరీరమున కనుబంధములుగా నుండినవై, అన్ని దోషములు ఏకకాలమునందు, ప్రకోపమునుచెంది, ప్రాణస్థానమైన హృదయాదుల నాశ్రయించి, ప్రకోపితములై, గంభీరములై, అశేష స్రోతస్సులను వ్యాపించి, శరీరమునకు కీడుకలిగించును. కొద్దిమంది వ్యక్తుల విషయములో, అపథ్యాహారముగూడ, వారికి అనుకూలముగ మారును. ఎందుకనగా, వారు ఆచరించు ఉరుకుట, దుముకుట మొ॥ పనులు గాలి, ఎండ మొ॥ ప్రకృతి సిద్ధములైన, కారణసమూహములతో, వాతాది దోషములు క్షీణించును. ప్రతిదినమును వృద్ధులు క్షీణించుచున్నారు. నవగ్రహములయొక్క, రాశి, గమనము వలన, భౌమాదులవలన, ఉత్పాతములు సంభవించుట వలన, పూర్వజన్మయందువర్తమానమునందు ఆచరించు, అధర్మముల వలన, వాతాదులు శరీరమునందు వృద్ధి చెందినవై వ్యాధులనుత్పత్తి చేయును. పూర్వజన్మయందుచేసిన, పుణ్యాపాపముల యొక్క స్వరూపముగ ఈ భూమియందు, మరలజన్మయెత్తి వాటి ఫలములను మానవుడు అనుభవించు చున్నాడని, పిండాకారమైన భావము.

మూ॥ దుష్టో వాయు రభిష్యందీ స్తిమితోఽత్యుష్ణ శీతలః -96
కుండలీ భైరవరవః పరుషోఽనార్తవో బలీ।
అన్యోన్య వ్యాహత గతిః పాంసు బాష్ప విషాన్వితః - 97

*ప్రతిపదార్థము* ; దుష్టః = దుష్టమైన, వాయుః = వాయువు, అభిష్యంది(మాలిన్యేన స్రోతసాం స్రావః) స్తిమితః = వేగము లేనిది, అత్యుష్ణః = మిక్కిలి ఉష్ణము గలది, అతిశీతలః = మిక్కిలి శీతలమైనది, కుండలీ = తిరుగు స్వభావము గలది (సంచార శీలి), భైరవరవః = భయంకర శబ్దము గలది, పరుషః = పరుషమైనది, అనార్తవః = ఋతువునకు అననుకూలమైనది, బలీ = మిక్కిలి బలము గలది, అన్యోన్యవ్యాహత గతిః = పరస్పరము దిగ్విశేషము చేత, అడ్డగింపబడిన మార్గము గలది, పాంసు బాష్ప విషాన్వితః = ధూళి, బాష్పము, విషముతో వీటితో కూడినది.

**తాత్పర్యము** : దూషిత వాయు లక్షణములను చెప్పుచున్నారు. దూషిత వాయువు అభిష్యందమును కలిగించును. వేగరహితముగ నుండును. మిక్కిలి ఉష్ణగుణము, మిక్కిలి శీతగుణము కలిగియుండును. సంచారశీలిగ నుండును. భయంకర శబ్దము చేయుచుండును. మిక్కిలి పరుషముగ నుండును. వసన్తాది ఋతువులను అనుసరించి యుండదు. మిక్కిలి బలము గలదిగా నుండును. పరస్ప

రము, దిగ్విశేషముచేత, (బాహిరమైన ఆర్ద్రి వాయువు చేత) అడ్డగింపబడిన మార్గము గలిగియుండును. ధూళి, బాష్పము, విషము వీటితో కూడుకొని యుండును.

మూ॥ రసవర్ణాది విక్రృత మపక్రాన్త విహంగమమ్।
నిందిత ప్రభవం తోయం ఉపక్షీణ జలాశయమ్॥ - 98

ప్రతిపదార్థము : నిందిత ప్రభావం=కశ్మలమైన ప్రదేశము నుండి పుట్టిన, తోయం=జలము, రసవర్ణాది. విక్రృతం = రసము, ఆకృతి వికృతి చెంది యుండును, అపక్రాన్త విహంగమమ్=విడిచిన పక్షులు గలది, ఉపక్షీణ జలాశయమ్ = క్షీణించుచున్న చేపలతో కూడినవి (నీటిలో నివసించు చేపలు మొ॥ క్షీణించిపోవును).

తాత్పర్యము : నిన్దితములైన (దుష్టములైన) క్రిమి కీటకాదులతో కూడిన జలము, మధురాది రసములను, ప్రకృతి సిద్ధమైన ఆకృతిని కోల్పోవును. నీటికొంగలు మొ॥ పక్షి విశేషములు, దుష్టమైన ఆ జలము యొక్క, దరి దాపులకు కూడ వెళ్ళవు. ఆ నిన్దిత జలములతో కూడిన జలాశయము నందు నివసించుచున్న చేపలు, మొ॥ జలచరములు క్రమముగా క్షీణించిపోవును.

మూ॥ మక్షికా మూషికా వ్యాళ బహూత్పాత ప్రదూషితః ।
దేశోఽపథ్యాన్న బహులః నష్ట ధర్మ మహౌషధిః॥ -99

ప్రతిపదార్థము : మక్షికా మూషికా వ్యాళ బహూత్పాత ప్రదూషితః=ఈగలు,ఎలుకలు, సర్పములు వీటిచేత ఎక్కువగా ఏర్పడిన ఉత్పాతముల చేత, మిక్కిలి దూషింపబడిన, దేశః = దేశము, అపథ్యాన్న బహులః=అపథ్యకరమైన అన్నము అధికముగ గలది, నష్ట ధర్మ మహౌషధిః = ధర్మము, దివ్య ఓషధులు నశించి పోవునది.

తాత్పర్యము : ఈగలు, ఎలుకలు, సర్పములు మొ॥ వాటి చేత ఉత్పాతము లేర్పడుట వలన దూషితమైన దేశమునందు అపథ్యకరమైన అన్నము ఎక్కువగ ఉత్పన్నమగును. మరియు, ధర్మము దివ్యములైన ఓషధులు గూడ ఆ దేశమునందు నశించి పోవును.

మూ॥ కాలశ్చ విపరీతోఽతి హీన లింగోయథాయథమ్।
వతే దుష్పరిహారత్వా దహితా యోత్తరోత్తరమ్॥ 100

ప్రతిపదార్థము : యథాయథమ్ = తగినట్లు (క్రమముగ), కాలశ్చ = దూషితకాలమైతే, విపరీతః = విపరీతమైన లక్షణములు గలది, అతిహీనలింగః = అతిలక్షణములు; హీన లక్షణములు గలది; ఏతే=ఇవి; ఉత్తరోత్తరమ్ = ఉత్తరోత్తరము; దుష్పరిహారత్వాత్ = వదలి పెట్టుటకు శక్యము కానందు వలన; అహితాయ = అహితము కొఱకు; భవతి = అగుచున్నది.

**తాత్పర్యము :** ఉత్పాతాదులచే పుట్టిన దూషితమైన వాయువు చేత కాలముకూడ దుష్టమగుచున్నది. ఎటులనగా శీతకాలమునందు ఎక్కువ వేడియు ఉష్ణకాలమునందు ఎక్కువ చల్లదనమును కలిగి యుండును. మరియు ఒక ఋతువునందు, మరియొక ఋతువుయొక్క లక్షణములు ఎక్కువగా నుండుట, అల్లే ఒకప్పుడు, హీనలక్షణములతో కూడి యుండుట ఏర్పడు చున్నది. ఈ విధముగా వాతాది దోషములు దేశము మరియు కాలము ఇవన్నియు తాము వికృతి చెందుటకు కారణములుగా పేర్కొనబడుచున్న వాటిని శమింపచేయుట మిక్కిలి కష్టమగుటవలన పైనుదాహరించిన వాతాదులు ఉత్తరోత్తరము అహిత కారులుగ మారుచున్నవి.

మూ॥ ఏషామనియతం కర్మ తస్మిన్కాలే సుదారుణే ।
కర్మ పంచ విధం తేషాం యోజ్యం తద్వద్రసాయనమ్॥ — 101
శస్యతే దేహ వృత్తిశ్చ భేషజైః పుర్వముద్ధృతైః ।
బ్రహ్మచర్యం దయాదానం సదాచార రతిః శమః॥ — 102 ।
సద్ధర్మః సత్కథా పూజా దేవర్షీణాం జితాత్మనామ్ ।
దేశానామ విపన్నానాం సాధూనాంచ నిషేవణమ్॥ — 103
దైవ వ్యపాశ్రయం చేష్టం కర్మ జీవిత రక్షణమ్ ।

**ప్రతిపదార్థము :** సుదారుణే=మిక్కిలి కఠినమైన; తస్మిన్కాలే=ఆకాల మునందు; ఏషాం=వీరికి; కర్మ = పూర్వ జన్మమందు చేసిన కర్మ; అనియ తం=నియతమైనది కాదో; తేషాం=రికి; పంచవిధం=5 విధములైన; కర్మ= చికిత్స; యోజ్యం=సంధింపదగినది; తద్వత్=అల్లే;రసాయనమ్ = రసాయనము గూడ; యోగ్యం=కూర్పదగినది; పూర్వం = మొదలు; ఉద్ధృతైః=ఉద్ధరింప బడిన; భేషజైః=ఔషధములచేత; దేహవృత్తిశ్చ=శరీర రక్షణము న్నూ; శస్యతే=ప్రశస్తముగా చెప్పబడుచున్నది; చ=మరియు; బ్రహ్మచర్యమ్= బ్రహ్మచర్యమును; దయా=భూతదయ; దానమ్ = దానము; సదాచారరతిః= సద్వృత్తము ననుష్ఠించుట; శమః = శాంతత; సద్ధర్మః = సత్యధర్మము; సత్కథా=ఉత్తమమైన కథలు వినుట; జితాత్మనామ్=ఇంద్రియనిగ్రహముకల; దేవర్షీణాం = దేవతలు, ఋషులయొక్క; పూజ=పూజ చేయవలెను; అవిపన్నా నాం=వికృతి చెందనటువంటి; దేశానాం = దేశమును; చ=మరియు; ధూసా నాం=సాధువులను; నిషేవణం = సేవింపవలెను; దైవవ్యపాశ్రయం = బలి హోమాది రూపమైన; చేష్టం కర్మ=చికిత్సను; జీవితరక్షణమ్ = జీవనము యొక్క రక్షణ కొరకు; కుర్యాత్ = చేయవలెను.

**తాత్పర్యము :** ఇట్టి మిక్కిలి గడ్డు కాలమునందు ఎవరికి పూర్వజన్మ మందు చేసిన పుణ్య పాప రూపమైన కర్మ నిశ్చితము ఎవరికి లేదో, వారికొరకు, వమన, విరేచన, ఆస్థాపన, అనువాసన, శిరో విరేచనములనబడు అయిదు విధము లయిన చికిత్సలను చేయవలెను. మరియు రసాయనములను కూడ ఉపయోగించ

వలెను. వాయువు, జలము, దేశము, కాలము వికృతి చెందుటచేత, అంతకు ముందే సంపాదించి జాగ్రత్త పరుపబడిన, ఔషధములతో శరీరమును పోషింప వలయును. మరియు అట్టి సమయమున, బ్రహ్మాచర్యము నవలంబించుట, భూత దయ, దానము, సద్వృత్తము నాచరించుట, కార్యములయందు శాంత చిత్త తతో నుండుట, సత్యమైన ధర్మముతో నుండుట, ఉత్తమ కథలను వినుట, సంయముతైన దేవ, ఋషులయొక్క పూజలను చేయుట పై వాయ్వాదులతో దూషింపబడని దేశములతో, సజ్జనులను సేవింపవలయును. జీవితమును రక్షించు కొనుటకు, బలిహోమాది రూపములయిన దైవ వ్యపాశ్రయ రూపములగు చికిత్సలను ఆచరింపవలెను.

*శశిలేఖ :* ఉత్పాతములచేత దూషితమయిన బాహిరమయిన వాయువు, అభిష్యందమును కలిగించును. వేగరహితముగా నుండును. ఎక్కువగా వేడిగా గాని, ఎక్కువ చల్లగా గాని, సుడులు తిరుగు చుండును. భయంకరమయిన శబ్దమును కలిగి యుండును. పరుషముగా నుండును. ఋతుధర్మములకు విపరీత ముగా నుండును. చాలా బలముగలిగి యుండును. దిగ్విశేషముచేత పరస్పరము, అడ్డగింప గలిగిన మార్గము గలిగినదై, ధూళి, బాష్పము వీటితో కూడుకొని యుండును. ఇది దుష్టవాత లక్షణము. జలము, ఉత్పాతాదులచేత దూషింపబడిన యెడల, ఆ నీటి యందలి రసము వర్ణము మొ॥ వాటికి వికృతి యేర్పడును. మరియు క్రిమ్యాదులకు పుట్టుక స్థానమగుట వలన, దానిని నిందిత ప్రభవః అని చెప్పబడుచున్నది. మరియు కుత్సితమైన దేశమునుండి పుట్టిన దగుటవలన కూడ నిందిత ప్రభవః అని చెప్పబడుచున్నది.

ఉత్పాతాదుల చేత దుష్టమయిన దేశము మక్షికాదుల చేత దూషింప బడుచున్నది. ఆదేశమునందు పండిన ధాన్యాదులు మిక్కిలి అపథ్యములగు చున్నవి.

కాలము దుష్టమైన యెడల, విరుద్ధమైన లింగములను కలిగి అనేక వ్యాధులకు మూలమగును. ఈ దుష్టమైన వాతాదులు ఒకదాని కన్న ఒకటి అహితమగును. ఉత్తరోత్తరము తొలగించుటకు వీలుకానిదగుట వలన, ఇది ఎప్పటికిని తొలగించుటకు వీలుకానిది. కాని అదియును ఒకప్పుడు తొలగించుటకు సాధ్యమగును. ఎట్లనగా నీరు గృహాదులయందు పరిరక్షింపబడిన యెడల, ఉత్పాతముల నుండి రక్షింపవచ్చును. దానికంటెగూడ దేశాంతర గమ నముచేసిన యెడల,దూషితమైన దేశముయొక్క బారినుంచి రక్షింపబడవచ్చును. కానికాలము సర్వగతమగుట వలన దుష్టమైన కాలమునుండి తప్పించుకొనుట మిక్కిలి కష్టసాధ్యము. మరియు ఏ మానవులు గడ్డుకాలమునందు పూర్వజన్మ మందు చేసినకర్మ, అనియుత ఫలదాయియగుటవలన, వారు వమనాది రూప మైన పంచకర్మ చికిత్సను చేసికొనవలెను. నియత ఫలదాయియయిన కర్మ

వలన, కొద్ది మందికి ఔషధాది యుపాయములుకూడ వ్యర్థమగుచున్నవి. అందు వలన పూర్వజన్మమందు చేసినకర్మ, నియత, అనియత ఫలదాయి యగుటవలన, ఆకాలమునందు వారికి రసాయన చికిత్స చేయవలెను. మరియు ఉత్పాతములు ఏర్పడుటకు ముందే ఉద్ధరింపబడి, రక్షింపబడిన ఔషధములుకూడ ఉపయోగార్హములు మరియు ఆ గడ్డు కాలమునందు, జీవితమును రక్షించుటకు బలి, ఉపహార, మణి, మంత్రాది రూపమైన, దైవవ్యపాశ్రయ రూపమైనకర్మను, బ్రహ్మచర్యాదులను ఆచరించుట చాలా ప్రశస్తమైనది.

శ్లో॥ హేమన్తాదిషు కుర్వీత స్వంస్వంచాకాలికేష్వపి — 104
విధిం తచ్ఛీలనంయస్మాచ్ఛీతాదిద్వంద్వ కారితమ్
ఋతుచర్యాహి శీతోష్ణవృష్టి, దోష ప్రతిక్రియా —105
అతఏవర్తు చర్యాయాం హేమన్తశిశిరే సమౌ॥

ప్రతిపదార్థము : అకాలికేష్వపి=సకాలము నందేర్పడినవి కానప్పటికిని, హేమన్తాదిషు=హేమన్త శిశిరఋతువులయందు, స్వంస్వం విధిం = తమతమ ఋతుచర్యను, కుర్వీత=చేయవలెను, యస్మాత్=ఎందువలన ననగ, తచ్ఛీలనం= ఆఋతు చర్యాభ్యాసము, శీతాదిద్వంద్వకారితమ్=శీత, ఉష్ణ, వర్షములయొక్క రెండువిధములయిన ఉపశాంతిని చేయుచున్నది, లేథాహి = అదియుక్తమే, ఋతుచర్యా=ఆఋతుచర్య, శీతోష్ణవృష్టి దోషప్రతిక్రియా =శీతోష్ణ వర్షములయొక్క దోషమునకు ప్రతిక్రియ యగును, అతఏవ=అందువలననే, ఋతుచర్యాయామ్=ఋతు చర్యలో, హేమంత శిశిరౌ=హేమంత శిశిరములు, సమౌ =సమానములు.

తాత్పర్యము : ఉత్పాతాదులచేత, దేశాదులు దుష్టములైనపుడు, ఋతువులకుగూడ వికృతి యేర్పడును. వర్తమానమునందు ఒకఋతువు జరుగుచుండగా, ఆ ఋతువు తన ధర్మములను కలిగియుండక, అన్యములైన హేమన్త శిశిరఋతువుల ధర్మములను కలిగి యుండును. అట్టి సంకట పరిస్థితిలో, హేమన్తాది ఋతులక్షణములను బట్టి, ఆఋతు చర్యనే అపుడు పాటింప వలయును. ఎందుకనగ, వైపరీత్యము కారణముగ, వర్తమాన ఋతువునందు, శీతోష్ణములు, వర్షము, ద్వంద్వముగ నేర్పడును. ఆరెంటికి ప్రతిక్రియగ, ఆగన్తుకములైన, హేమన్తాది ఋతువులయొక్క చర్యను అనుష్ఠించ వలెను. ఇట్లు ఆ ఋతు చర్యను ఆచరించుట వలన, శీతోష్ణవర్ష దోషములకు ప్రతిక్రియ కాగలదు. కాన వైకారికములైన ఋతువులయొక్క బాధలుపశమించును. అందువలననే ఋతుచర్యలో హేమన్త శిశిరములకు సమానత్వము చెప్పబడినది.
వి. వ్యా. చరకము వి. 3-131

మూ॥ సర్వప్రాణ భృతాం నిత్య మాయుర్యుక్తి మపేక్షతే -106
దైవే పురుష కారేచ స్థితం హ్యాస్య బలాబలమ్ ॥

**ప్రతిపదార్థము :** సర్వ ప్రాణభృతాం = సమస్త ప్రాణుల యొక్క, ఆయుః = జీవితము, నిత్యం = ప్రతిదినము, యుక్తిం = యుక్తిని; అపేక్షతే = అపేక్షించుచున్నది, అస్య = ఈ ఆయుస్సు యొక్క, బలాబలమ్ = బలము, దుర్బలత్వము ఈ రెండు, దైవే = దైవమునందు; చ = మరియు, పురుషకారే = పురుషకారము నందు, స్థితమ్ = ఉంచబడినది.

**తాత్పర్యము :** సమస్త ప్రాణుల యొక్క ఆయుర్దాయము ప్రతిదినమును యుక్తినపేక్షించి యుండును. ఈ ఆయుర్దాయము యొక్క బలాబలములు రెండును, ఇహలోక కర్మను, పరలోక కర్మను ఆశ్రయించి యుండును. దైవము, పురుషకారము రెండును బలీయముగ నున్న యెడల, ఆయుర్దాయము గూడ బలీయముగ నుండును. పై రెండును దుర్బలములుగా నున్న యెడల, ఆయుర్దాయము గూడ బలహీనమగును. దైవము బలీయముగ నుండి పురుషకారము దుర్బలమైన యెడల ఆయుర్దాయము మధ్యమమగును.

మూ॥ అన్యజన్మకృతం కర్మ దైవం పౌరుష మైహికమ్-107
విద్యాత్తే కర్మణీ త్రేధా శ్రేష్ఠ మధ్యావ రత్వతః

**ప్రతిపదార్థము :** అన్యజన్మకృతం = పూర్వజన్మ మందు చేయబడిన, కర్మ = కర్మ (పుణ్య పాపము ఏదయిన); దైవం = దైవమనియు, ఐహికమ్ = ఈ జన్మమందు చేసిన; కర్మ = కర్మ. పౌరుషమ్ = పౌరుషమనియు(పురుషకారము), చెప్పబడుచున్నది, తేకర్మణీ = ఆ కర్మలు, త్రేధా = మూడు విధములు, శ్రేష్ఠ మధ్య అవరత్వతః = శ్రేష్ఠ కర్మ, మధ్యమ కర్మ, అవరకర్మయని, తెలిసికొనవలయును.

పూర్వజన్మము నందాచరించిన పుణ్యాపాపరూపమైన అభ్యాసములు, దైవం అను పేరుతో వ్యవహరింపబడుచున్నవి. ఈ జన్మమున నాచరించు పనులు, పౌరుషక అను పేరుతో పిలువబడుచున్నవి. ఈ కర్మలు మూడు విధములు. (1) శ్రేష్ఠ కర్మ (2) మధ్యమ కర్మ (౩) అవర కర్మ యనిపిలుచుచున్నారు.

మూ॥ తయోరుదార యోర్యుక్తి-ర్దీర్ఘస్య సుసుఖస్యచ 108
నియతస్యాయుషో హేతుర్విపరీతస్య చాపరా।
మధ్యామధ్యస్య మిశ్రస్య సంకీర్ణా

**ప్రతిపదార్థము :** ఉదారయోః = శ్రేష్ఠములైన, తయోః = దైవకర్మల యొక్క, యుక్తిః = యుక్తి, నియతస్య = నియతకాలమునకు; దీర్ఘస్య = దీర్ఘమైన, సుసుఖస్య = మిక్కిలి సుఖముతో కూడిన, ఆయుషః = జీవితమునకు, హేతుః = కారణము, తయోశ్చ = ఆ దైవ పురుష కర్మల యొక్క, మధ్యా = మధ్యమమైన, యుక్తి = యుక్తి, మధ్యస్య = మధ్య; ఆయుషః = జీవితమునకు, హేతుః = కారణము, మిశ్రస్యతయోః = మిశ్రమములైన ఆ రెంటి యొక్క, సంకీర్ణ యుక్తిః = సంకీర్ణమైన యుక్తిగా నుండును.

**తాత్పర్యము :** శ్రేష్ఠమైన దైవకర్మ, శ్రేష్ఠమైన పౌరుష కర్మలయొక్క కూడిక, దీర్ఘకాలికమైన సుఖమయమైన జీవితమునకు కారణమగును. హీనమైన దైవ పురుష కర్మల యొక్క యోగము స్వల్పకాలికమైన, దుఃఖమయమైన జీవితమునకు కారణమగును. మధ్యములైన దైవ పురుష కర్మల యొక్క సంయోగము, మధ్యమ ఆయుర్దాయమునకు కారణమగును. వీటి యొక్క మిశ్రమ యోగము, మిశ్రిత జీవితమునకు కారణమగును. (మిశ్రకర్మ ఒకవైపు ప్రబలమైనదిగ, రెండవ వైపు మధ్యమమైనదిగ లేక అవరమైనదిగ నగును.)

**మూ॥** శృణు చాపరం -109

దైవం పురుషకారేణ దుర్బలం హ్యుపహన్యతే।
తథా దైవేన బలినా పౌరుషం కర్మ దుర్బలమ్-110

**ప్రతిపదార్థము :** అపరంచశృణు=మరియునూ వినుము, పురుషకారేణ= పురుషకారము చేత; దుర్బలం = బలహీనమైన; దైవం = దైవకర్మ; ఉపహన్యతే = కొట్టబడుచున్నది, తథా=అట్లే; బలినాదైవేన=బలీయమైన దైవకర్మల చేత, దుర్బలం పౌరుష కర్మ=బలహీనమైన పౌరుష కర్మ, ఉపహన్యతే= కొట్టబడుచున్నది.

**తాత్పర్యము :** పూర్వజన్మమునందు చేసిన కర్మలు దుర్బలములుగా నుండి, వర్తమానమునందు చేసిన కర్మలు బలీయములైన యెడల, దుర్బలములైన దైవకర్మలు నశించి పోవును. దైవకర్మలు బలీయములైన, పురుషకారములు దుర్బలములై నశించిపోవును. కాన దైవ పురుష కారములు రెండునూ, సమానస్థాయిలో నుండి, చేసిన కర్మ ఫలము అకుంఠితమై సర్వార్థ సిద్ధిదాయకముగ నగును. ఇది దీర్ఘ జీవితమునకు, ఆరోగ్యమునకు తోడ్పడును.

**మూ॥** దృష్ట్వా తదేకే మన్యంతే నియతం మానమాయుషః॥

**ప్రతిపదార్థము :** ఏకే=కొంతమంది;తతో=బలీయమైన ఆదైవ కర్మను; దృష్ట్వా=చూచి; ఆయుషః = జీవితము యొక్క; మానం=పరిమాణము; నియతమ్=నిశ్చయమైనదిగా; మన్యంతే = తలచుచున్నారు.

**తాత్పర్యము :** ఆ బలీయమైన దైవకర్మను చూచి కొందరు జీవితము యొక్క నిడివి, నిశ్చయమైనట్లుగా తలచుచున్నారు.

**మూ॥** కర్మకించిత్క్వచిత్కాలే విపాకే నియతం మహత్ — 111
కించిచ్చ కాల నియతం ప్రత్యయైః ప్రతిబోధ్యతే।

**ప్రతిపదార్థము :** కించిత్=కొంచెమైన; మహత్=గొప్పదైన; కర్మ= కర్మ; క్వచిత్కాలే = ఒకానొక సమయమునందు; విపాకే=పరిణామమునందు; నియతమ్=నియతమైనది (ఈ కార్యము ఈ సమయములో తప్పక ఫలము

నిచ్చును అనునది నియతము); చ=మరియు; కించిత్ కర్మ=స్వల్పమైన కర్మ; కాలనియతం=పరిణామ కాలములో, అనియతమైనందున; ప్రత్యయైః=ప్రత్యక్షాది కారణములతో; ప్రతిబోధ్యతే=తెలియబడుచున్నది.

**తాత్పర్యము :** మహత్తరమైన కర్మ పరిపాకము ఒకానొక సమయము నందు, తప్పక ఫలము నిచ్చును. ఈ విధమైన కర్మ పరిపాకమునే నియతమని చెప్పుదురు. స్వల్పమైన కర్మల నాచరించినపుడు దాని ఫలము గూడ స్వల్పమైనదిగ నుండి అనియతమైనదగును. కర్మ పరిపాకములో ఫలము స్వల్పమైనదగునను జ్ఞానము ప్రమాణాదులచే గ్రహించవచ్చునే కాని ఇతర సాధన సామగ్రితో నది యలవి కాదు. దీనిని బట్టి మృత్యువుగూడ నియత, అనియత భేదములచే నేర్పడునని గ్రహింపవలెను.

మూ॥ ఏవంచద్విविధో మృత్యుః కాలా కాల విభేదతః - 112
ఉపదిష్ట స్తతశ్చైష హితాహిత విధిక్రమః ।

*ప్రతిపదార్థము :* ఏవం=ఇట్లు; చ=మరియు; కాలాకాల విభేదతః=కాలము, అకాలము అను భేదముల వలన; మృత్యుః=మృత్యువు; ద్వివిధః=రెండు విధములు; తతః=అందువలన; ఏషః=ఈ మృత్యువు; హితాహిత విధిక్రమః=హితము, అహితము అను శాస్త్ర క్రమము; ఉపదిష్టః=చెప్పబడినది.

**తాత్పర్యము :** కాలమృత్యువు, అకాల మృత్యువు అను భేదములతో మృత్యువు రెండు విధములుగా నున్నది. అందుకొరకే ఈ మృత్యువు, హితము అహితము అని ఆయుర్వేమునందు చెప్పబడినది. మృత్యువు నియతకాలికమైనది అని చెప్పిన యెడల ఆయుర్వేదము నందలి ఉపదేశము వ్యర్థమగును. అందుకొరకే మృత్యువునకు కాలము నిర్దిష్టముగా నిశ్చయముగాచెప్పకపోవుటచేతనే, ఆయుర్వేదమునందు హితాహితములను గూర్చి ఉపదేశింపబడినది. ఇట్లు చెప్పుట కూడ సరియైనది కాదు. ఎందుకనగా మానవుల యొక్క ఆయుర్దాయము యుక్తి నపేక్షించి యున్నది.

*శశిలేఖ :* విపరీత ఋతువులయందు, ఉత్పాతముల వలన ఏర్పడిన' హేమంతాది ఋతువులయొక్క ప్రవృత్తిని బట్టి, ఆ ఋతువులయందు హేమంతాది ఋతువుల యందు చెప్పబడిన విధిని అనుష్ఠించవలెను. ఇట్లు చేసిననే శీత, ఉష్ణ, వర్ష ఋతువుల యొక్క ద్వంద్వమైన ఉపతాపము పురుషునికి చేయుచున్నది. ఎట్లనగా, జ్యేష్ఠ, ఆషాఢ మాసములయందు, గ్రీష్మ ఋతువు నందు హేమంతాది ఋతువుల యొక్క లక్షణములు చూడబడుచున్నవి. అందువలన ఆగంతుకముగా వచ్చిన, హేమంతాది ఋతువుల యొక్క చర్యను సేవింపవలెను. ఈ హేమంతాది ఋతు చర్యకూడ ఇష్టము వచ్చినట్లుగా చేయకూడదు. శీతాది దోషములయొక్క ప్రతీకారార్థమే చేయవలెను, ఇట్లు చెప్పుట చేత, ఏ మాసమునందు శీతాదుల యొక్క బాధ యేర్పడునో, ఆ ఋతువునందే ఆవిధిని

అనుష్ఠింపవలెను. ఈ ఋతుచర్య, మాసమును మాత్రమే అధికరించి చెప్పినది కాదు. శీతాది దోష ప్రతీకారము కొరకే ఋతుచర్య చెప్పబడినది. ఇట్లు చెప్పుట వలన, సరియైన ఉపపత్తి యేర్పడును. ఎటులనగా హేమంత శిశిరముల యందు శీత దోష సాదృశ్యము వలన, విధి కూడ సమానముగ చెప్పబడినది. శరీర ధారులైన మానవులయొక్క దైవపురుషకారములతో కూడిన ఆయుర్దాయము, యుక్తి నపేక్షించియున్నది. దైవము, పురుషకారము రెండును బలీయములైన ఆయుర్దాయము కూడ దీర్ఘ కాలికమై యుండును. ఆ రెండును దుర్బలములైన, ఆయుర్దాయము కూడ, బలములేనిదిగా యుండును. ఈ దైవ పురుష కారములు, శ్రేష్ఠ, మధ్య, అవర విభాగము చేత మూడు విధములు. ఈ దైవ పురుషకారములు రెండును మిక్కిలి శ్రేష్ఠములైన నియతకాలికమైన దీర్ఘమైన ఆయుర్దాయమునకు కారణమగును. అవి రెండును హీనములైన రెండవదియైన యుక్తి దానికి విపరీతమైన ఆయుర్దాయమునకు కారణమగును. ఆ రెంటి యొక్క మధ్యమమైన యుక్తి, మధ్యమాయుర్దాయమునకు కారణము. రెంటియొక్క 'సంకీర్ణమైన' యుక్తి అనగా ఒక కర్మకు బలవత్త్వము, మరియొక కర్మకు మధ్యత్వము, అబలత్వము ఏర్పడిన యెడల, లక్షణ సంకరములతో కూడిన, ఆయుర్దాయమునకు కారణము. ఎటులనగా దానాది కర్మలచేత బలీయమైన పురుష కారము బలములేని దైవకర్మను నశింప జేయుచున్నది. అట్లే దైవకర్మ కూడా. కొద్దిమంది దైవకర్మ బలీయమైనదని తలచి ఆయుర్దాయము నియత ప్రమాణము కలదని, తలచుచున్నారు. ఎటులనగా ఉపాయములు గలదైనప్పటికిని, బలీయమైన దైవకర్మచేత, పురుషుని యొక్క ఆయుర్దాయము నశింపచేయబడుచున్నది. ఇది లోకమునందు ప్రత్యక్షముగా చూడబడుచున్నది. అందువలన ఈ దైవ కర్మ రెండు విధములుగా విభజించబడినది. దైవ పురుషకారములు శ్రేష్ఠమైనయెడల, నియత ఫలమును; అల్పత్వములైన అనియత ఫలములను ఇచ్చును. ఇట్లు కర్మకు నియతానియత ఫలరూపములకు ద్వైవిధ్యము చెప్పుట వలన, కాలాకాల భేదముతో మృత్యువునకు కూడ రెండు విధములు చెప్పబడినది. అనియత ఫలదాయి అయిన కర్మచేత, మృత్యువు అకాలము నందు సంభవించునని ఉపదేశించబడినది. నియత ఫలముచేత కాలజ మృత్యువు కల్గును. ఇందువలన ఆయుర్వేదమునందు మృత్యువునకు రెండు కారణములు చెప్పుట వలన హితాహితవిధి కూడా ఉపదేశించబడినది. మృత్యువునకు నియత ఫలకర్మజత్వము చెప్పిన యెడల, ఆయుర్వేదోపదేశములు వ్యర్థములగును. అనియత ఫలముయొక్క ఉత్పత్తి, రక్షణార్థము, హితాహిత జ్ఞాన హేతుత్వముతో ఆయుర్వేద ఉపదేశములు సరిపోవుచున్నవి.

మూ॥ ఏకోత్తరం మృత్యుశతం బ్రువతే వేదవాదినః।
తత్రైకః కాలసంయుక్తః శేషాస్త్వాగన్తవః స్మృతాః॥
శ్యేనాది నాచ యోగేన భ్రాతృవ్యస్య తథాచ తైః।

దీర్ఘ శ్రవససో మాద్యైర్విహితశ్చాత్మనో వధః।
ఆయుష్కామస్య తత్రాప్తిస్తథేష్ట్యా మిత్ర విన్దయా
సర్వస్మాదేవ చాత్మానం గోపాయేదీదృశీ స్మృతిః॥

**ప్రతిపదార్థము** : వేదవాదినః=అథర్వ వేదవిదులు, ఏకోత్తరం మృత్యుశతం=నూటొక్కమృత్యువును, బ్రువతే = చెప్పుచున్నారు, తత్ర=వాటిలో, ఏకః=ఒక మృత్యువు, కాల సంయుక్తః =కాలముతో కూడినది, విశేషాః= మిగిలినవి, ఆగన్తవః = ఆగన్తువులుగా, స్మృతాః = తలచబడిన= తథాచ=మరియును అల్లే, శ్యేనాజిరాది యాగేన = శ్యేనాజిరాది యాగము చేత, భ్రాతృవ్యస్య=తోడబుట్టినవాని కొడుకుయొక్క (పగవాడు, పినతండ్రి), వధః=మరణము, ఉక్తః=చెప్పబడినది, దైర్ఘశ్రవస సామాద్యైః=దైర్ఘశ్రవససామాదులచేత, ఆత్మనః = తనయొక్క, వధః=మరణము, విహితః= చెప్పబడినది, తథా=అల్లే, ఆయుష్కామస్య=ఆయువును కోరువానికి, ఇష్ట్యా మిత్రవిందయా=మిత్రవిందయను పేరుగల యాగము చేత, తత్రాప్తిః= ఆయువును పొందుట, ఉక్తః = చెప్పబడినది, సర్వస్మాదేవ = అన్నిటి కంటె గూడ, ఆత్మానం=తనను, గోపాయేత్ = రక్షించుకొనవలెను, ఈదృశీ= ఇట్టిది, స్మృతిః=స్మృతి, భవతి=అగుచున్నది.

**తాత్పర్యము** : అథర్వవేద విదులు, నూటఒక్క మృత్యువును చెప్పుచున్నారు. వాటిలో ఒకమృత్యువు, కాలమృత్యువుగా పేర్కొనబడినది. మిగిలిన నూరు మరణములు, ఆగన్తు మరణములుగా తెలుసుకొన వలయును. అల్లే మరియును శ్యేనాజిరాది యాగముచేత తోడబుట్టిన వాని కొడుకుయొక్క మరణము చెప్పబడినది. దైర్ఘశ్రవససామాదుల చేత, తనయొక్క మరణము చెప్పబడినది. మిత్రవిందయను ఇష్టిచేత అధికాయుర్దాయమును పొందవచ్చు ననియు కలదు. వీటన్నిటి కంటె మిక్కిలి ప్రధానమైనది, తనను తాను మొదట రక్షించుకొనవలయును. ఇట్టిదియే స్మృతియగుచున్నది. ఇది నిత్యము అను ష్ఠించ దగినది. వీటన్నింటిని పురస్కరించుకొని మృత్యువు, కాలికమనియు, అకాలికమనియు చెప్పు యుక్తి సమంజసమైనదిగ తలచవలయును.

*శశిలేఖ* : అల్లే మరియును అథర్వ వేదవిదులు, మరణములు నూటొక్కటి యని చెప్పుచున్నారు. ఆ నూటఒక్క మరణములలో ఒక మరణము బ్రహ్మ నిర్మితమైనది. తక్కిన నూరు ఆగన్తు మరణములు, ఆ నూరు మరణముల చేత, వేదవిదులు ఆయుర్దాయమునకు వృద్ధిక్షయములు సంభవించునని చెప్పిరి. మరి యును అల్లే శ్యేనాది యాగము చేత, శత్రువైన భ్రాతృవ్యముయొక్క మరణము విధించబడినది. దీర్ఘశ్రవససోమ యాగముచేత, తనవధ విధించ బడి నది. ఆయుర్దాయమును కోరు పురుషునికి, మిత్రవిన్ద యను ఇష్టిచేత ఆయుర్దా యము పెరుగునని వేద విదులు వక్కాణించిరి. తుదకు - ఎల్లప్పుడు మానవుడు తనను తాను రక్షించుకొన వలయును. ఇదియే వారికి స్మృతి వాక్యము. ఉపాయ

ములచేత ఆయుర్దాయము రక్షింప బడదు అని చెప్పినయెడల, పైనుదాహరించిన ఉపాయములన్నియు వమ్మగును.

మూ॥ తథా మరణ ముద్దిష్టం సౌగతానాంచ చతుర్విధమ్ —116
విషమా పరిహారేణ జాయతే నియతాయుషమ్॥
ధ్రువం రోగత్వ మన్యేషా మృత్యురేవత్వపర్వణి — 117
అకాండే శస్త్రఘాతాద్యైః ప్రత్యక్షో మృత్యురన్యథా।
ఉద్భ్రాంత చండ మాతంగ తురంగాది సమాగమమ్ — 118
అరాతి దుష్ట వాయ్వాది సాహసాహిత భోజనమ్।
వర్జయేదితి నబ్రూయు ర్మునయో దివ్యచక్షుషః॥ — 119
దైవ వ్యపాశ్రయాదీంశ్చ రసాయనవిధిం స్తథా।
నవాతేఽపి యథాకామ మాయుషః స్థితి మాప్నుయుః॥ — 120
అహి సింహ గజాదిభ్యో విదుషాం నభయంభవేత్।
మిథ్యా ప్రాకార దుర్గాణి మిథ్యామారణ రక్షణమ్॥ — 121
ఆయుషాక్యమస్య మిథ్యైవ పరదారాది వర్జనమ్।
మన్త్రి దేవతయాహూతా నాచక్షీరన్ మహాహాయః॥ — 122
విషను ప్త ప్రబుద్ధాస్థా భావాభావే తదాయుషః।

ప్రతిపదార్థము: తథా = అట్లే; సౌగతానాం = బౌద్ధ దర్శనముల యందున్న సిద్ధాన్తములు తెలిసిన వారిచేత; చతుర్విధం=నాలుగు విధములుగా; మరణమ్=మరణము; ఉద్దిష్టమ్=చెప్పబడినది; నియతాయుషామ్=నిశ్చితమైన ఆయుర్దాయముగల పురుషులకు; విషమా పరిహారేణ = విషమములైన ఆహార విహారాదులను తొలగించుటకు సాధ్యపడకపోవుట చేత; ధ్రువం=తప్పక; రోగిత్వం=రోగి ధర్మము; జాయతే=కలుగుచున్నది, అన్యేషాం = అనియతమైన ఆయుర్దాయము గలవారలకు; అపర్వణి=అకాలమునందు; మృత్యురేవ= మరణమే; జాయతే = కలుగుచున్నది; అన్యథా = అట్లు కాని యెడల; అకాండే=అకాలమునందు, శస్త్రఘాతాద్యైః = బాకుపోట్లచేత; ప్రత్యక్షఏవ= ప్రత్యక్షముగనే; మృత్యుః=మరణము; దృష్టః=చూడబడినది. ఉద్భ్రాంతచణ్డ మాతంగ=తిరుగుపడిన మిక్కిలి కోపముగల యేనుగుతో; తురంగాది=గుఱ్ఱము మొ॥ జంతువులతో; సమాగమమ్=ఢీకొనుటను(కలియుట); అరాతి=శత్రువుతో; దుష్టవాయ్వాది=దూషిత వాయువు మొ॥ వాటితో; సాహస=సాహసముతో కూడిన పనులను; అహిత భోజనమ్=అపథ్యభోజనమును, వర్జయేదితి= వదలి పెట్ట వలయునని; దివ్యచక్షుషః=దివ్యజ్ఞానులైన; మునయః = మునులు; నబ్రూయుః = చెప్పలేదు. తేఽపి= ఆ మునులు కూడ, దైవవ్యపాశ్రయాదీన్= దైవ వ్యపాశ్రయము మొ॥ చికిత్సలను; చ =మరియు; రసాయన విధిం=రసాయన చికిత్సా పద్ధతిని; అవలంబ్య = అవలంబించి; యథాకామం =యథేచ్ఛగా; ఆయుషః=ఆయుర్దాయము యొక్క; స్థితిం=వ్యవస్థను; నాప్నుయుః=పొందలేదు, అహి =సర్పముల చేత; సింహ = సింహముల చేత; గజాదిభ్యః =ఏనుగు

మొ॥ క్రూర జంతువుల చేత; విదుషాం=పండితులకు; భయం = భయము, నభవేత్ = కలుగదు, ప్రాకార దుర్గాణి=ప్రాకారములు, దుర్గములు; మిథ్యా= వ్యర్థము, మారణ రక్షణమ్ = శత్రువుల చేత చేయబడు మారణ ప్రయోగముల నుండి రక్షణయును; మిథ్యా=వ్యర్థము, ఆయుష్కామస్య = ఆయుష్కామునికి; పర దారాది వర్జనమ్=పర దారాది వర్జనము గూడ; మిథ్యైవ = వ్యర్థమే; భవేత్=అగును, మన్త్రి దేవతయా = మన్త్రి అధిష్ఠాన దేవత చేత; మహాహయః = వాసుకి మొ॥ మహా సర్పములు;ఆహూతాస్సంతః= పిలువబడినవై ; విష సుప్త ప్రబుద్ధస్య= విషము చేత మూర్ఛితుడైన, మన్త్రిదేవత చేత ప్రబుద్ధుడైన పురుషునికి సంబంధించిన; తదాయుషః=ఆ ఆయుర్దాయము యొక్క, భావాభావౌ =భావము, అభావములు; నా చక్షీరన్=చెప్పలేదు.

తాత్పర్యము : బౌద్ధులు గూడ మరణము నాల్గు విధములని చెప్పిరి. నిశ్చితమైన ఆయుర్దాయము గలవారు కూడ విషమములైన ఆహారాదుల చేత నిశ్చయముగ వ్యాధిగ్రస్తులగుదురు. విషమములైన ఆహారవిహారాదులను విడిచి పెట్టిన వారు గూడ అకాలము నందు మృత్యువు వాత బడుచున్నారు. అట్లు కాని పక్షమున, అకాలము నందు బాకుపోట్లతో, ప్రత్యక్షముగ మరణమును చూచుచున్నాము. మరియు ప్రచండమై పరుగులు తీయుచున్న మదగజములతో అశ్వములతో ఢీకొని కొందరు అక్కడికక్కడే మరణించుచున్నారు. వీటి వలన మరణము నిశ్చితమైనదని చెప్పుటకు వీలుకాదు. మరియు దివ్యజ్ఞానులైన మునులు గూడ, శత్రువులను, దూషిత వాయువును, సాహస కార్యములను, అహిత భోజనమును వదలి పెట్టవలయునని చెప్పలేదు. వారు హితాహితములను వేర్వేరుగ నుపదేశించి వాటి వలన కలుగు సుఖదుఃఖములను చెప్పిరే కాని విడువవలయునని ఎచ్చటను ఆదేశింపలేదు. ఎందుకనగ సంయమిత్వముతో కూడిన మునులు గూడ దైవ వ్యపాశ్రయ చికిత్సలను రసాయన విధులను పాటించుచూ, స్వచ్ఛంద మరణమును గలిగియుండలేదు. ఎందుకనగ ఆయుర్దాయము యొక్క కాలము నిశ్చితమైనది కాదు. (చికిత్స మూడు విధములు' దైవ వ్యపాశ్రయము, యుక్తి వ్యపాశ్రయము, సత్వావజయము అని) అకాల మరణమనునది లేని యెడల, విద్వాంసులు సర్పముల వలన సింహముల వలన ఏనుగు మొ॥ దుష్ట జంతువుల వలన, ఏర్పడు ప్రమాదము గురించి భయపడనవసరము లేదు. శత్రువులబారి నుండి తమ్ము తాము రక్షించుకొనుటకు, చక్రవర్తులు కోట్లాది ధనము వెచ్చించి దుర్గములు, ప్రాకారములు, అగడ్తలను నిర్మాణము చేయనవసరము లేదు. ఇదంతయు వ్యర్థమగును. శత్రునాశము కొరకు, మారణ ప్రయోగములు అబద్ధములగును. ఆయుర్దాయమును పెంపొందించుకొనగోరు వాడు పరదారాది గమనమును, విడిచిపెట్టుటయు వమ్ము కాగలదు. ఈ విషయములో (చ. సూ. అ. 25-40) చరకము నందు కూడ, ప్రస్తావన కలదు. అట్లే వాసుకి మొ॥ దేవతా సర్పములు, విషము చేత మూర్ఛితులై

మంత్రిము చేత మేల్కొల్పబడిన పురుషునికి సంబంధించిన ఆయుర్దాయము యొక్క భావాభావములను గురించి ఇసుమంతయు చెప్పలేదు. కావున మరణమునకు నిశ్చితమైన కాలములేదు. సమస్త భావముల కూడ ఎచటను కానరాదు.

శశిలేఖ : బౌద్ధదర్శనమునందున్న సిద్ధాంతములను బాగుగా తెలిసిన పండితులతో మరణము నాల్గు విధములని చెప్పబడినది. నిర్ణీతమైన ఆయుర్దాయము గల పురుషులకు కూడ విషమ ఆహార విహారముల చేత తప్పక రోగములు సంభవించుచున్నవి. ఇతరులకు అనగా నిర్ణీతము గాని ఆయుర్దాయము గల వారలకు విషమమైన ఆహార విహారములను వదలిపెట్టక పోయినయెడల అకాల మరణము సంభవించును. అకాలమనందు కత్తిపోట్ల చేత ప్రత్యక్షముగనే మరణము సంభవించుచున్నది. రసాయన విధిచేత మునులు మరియు మత్తమాతంగాదులను ఎదుర్కొనుట విడిచి పెట్టుట చేతను, దైవ వ్యపాశ్రయాది చికిత్సలను సేవించుట చేతను, స్వచ్ఛంద మరణమును పొందలేకపోయిరి. అకాల మరణము లేని యెడల విషపూరితములైన మహా సర్పముల నుండి పండితులు భీతి జెందవలసిన యవసరము లేదు. శత్రువుల బారి నుండి మహారాజులు, ఆత్మ రక్షణార్థము ప్రాకార దుర్గాదులను ఏర్పరచుకొనుట కూడ నిరర్థకమేయగును. అట్లే గొప్ప వాసుక్యాది సర్పములు విషము చేత మూర్ఛ చెందిన మంత్రము చేత మేల్కొల్పబడిన పురుషుల యందు ఉన్నటువంటి విషమును మంత్రదేవతల ఆహ్వానింపబడినవై నప్పటికిని, పురుషాయుర్దాయము యొక్క భావా భావములను చెప్పలేకపోయినవి.

మూ॥ సన్న్యాసరోహిణీకా దిగ్రస్తస్య సహసాభవేత్ - 123
ఉపేక్షయాన మరణం జీవితాం వా చికిత్సయా

ప్రతిపదార్థము : సన్న్యాస రోహిణీ కాది గ్రస్తస్య = సన్న్యాసము, రోహిణీ మొ॥ రోగములతో పీడింపబడిన మానవునికి, ఉపేక్షయా = జాగు చేయుట చేత, సహసా = వెంటనే, మరణం = మరణము గాని, అథవా = అట్లు కాని పక్షమున, చికిత్సయా = చికిత్స చేయుటచేత, సహసా = వెంటనే, జీవితం = జీవనము, నభవతి = ఉండదు.

తాత్పర్యము : సన్న్యాసము, రోహిణీ మొ॥ వ్యాధులచే పీడితుడైనవానికి చికిత్స చేయక జాగు చేసిన యెడల, వెంటనే మరణము సంభవించును. అట్టి వానికి చికిత్స చేయుట చేత కూడ వెంటనే ఆరోగ్యము కల్గదు.

మూ॥ ప్రత్యహం నృసహస్రస్యయుద్ధేఽన్యోన్య మభిఘ్నతః - 124
సాధు వృత్తస్య చాతుల్యా నభవే దాయుషస్థితిః

ప్రతిపదార్థము : ప్రత్యహం = ప్రతిదినమును, యుద్ధే = యుద్ధమునందు, అన్యోన్యమభిఘ్నతః = ఒకడు రెండవ వానిని చంపుట వలన, నృసహస్ర = వేల మంది పురుషులకు, చ = మరియు, సాధువృత్తస్య = మంచిఆచరణ కల్గిన వానికి, ఆయుషః స్థితిః = ఆయుర్దాయము యొక్క స్థితి, అతుల్యా = సమానమైనది కాకుండా, నభవేత్ = ఉండ కూడదు,

**తాత్పర్యము :** ప్రతి దినమును యుద్ధమునందు ఒకరినొకరు చంపుట వలన వేలకొద్ది వ్యక్తులు మరణించుచున్నారు. కాని మంచి నడవడిక కలవారి యొక్క ఆయుర్దాయము పై వారితో అసమానమైనదిగాఉండకూడదు. కానిఅసమానము గనే ఉన్నది.

మూ॥ నాయు ధైర్ద్విశమింద్రాద్యా నౌషధ్యైః రార్తమశ్వినౌ - 125
ఉపక్రమే రన్న భవే దకాల మరణమ్ యది

**ప్రతిపదార్థము :** యది అకాల మరణం నభవేత్ = కాలము కాని కాలము నందు మరణము సంభవింపక పోయినట్లయితే, ఇంద్రాద్యాః = ఇంద్రాదిదేవతలు, ద్విశం = శత్రువును, ఆయుధైః = ఆయుధములతో, నవధేరన్ = చంపరు, అశ్వినౌ = అశ్వినీదేవతలు, ఆర్తం = రోగినిగురించి, ఔషధైః = ఔషధములచేత, నఉపక్రమేరన్ = చికిత్సలు చేయరు.

**తాత్పర్యము :** అకాల మరణములు సంభవింపక పోయిన యెడల, ఇంద్రాది దేవతలు, శత్రువులను ఆయుధములతో చంపరు. ఔషధములతో అశ్వినీ దేవతలు రోగ పీడితులకు చికిత్సలు చేయరు.

**మూ॥ ఘటానామామ పక్వానాం పాలనా పరిపాలనైః - 126**
**చిరాల్ప కాల వర్తిత్వం చిత్రస్థానాంచ దృశ్యతే**

**ప్రతిపదార్థము :** ఆమపక్వానాం = పచ్చివిగా నున్న కాల్చ నటువంటి, ఘటానాం = కుండలను, పాలనాపరిపాలనైః = పరిపాలించుట చేత (రక్షించుట చేత), చిరాల్ప కాల వర్తిత్వం = కొద్దికాలము, ఎక్కువకాలము ఉండుటను, దృశ్యతే = చూడబడుచున్నది.

**తాత్పర్యము :** అపక్వము కాని కుండకూడ రక్షించుట వలన కొంత కాలమునను, మరియు మంచిగా పక్వము చేయబడిన కుండ కూడ జాగ్రత్తగా రక్షింపక పోయిన యెడల, స్వల్పకాలములో పగిలిపోవును. ఇట్లే పటము నందున్నకుండ కూడ రక్షించుట చేత, కొంతకాలము ఉండును. అదియే రక్షింపనియెడల, వెంటనే పగిలిపోవును.

మూ॥ ఇత్యత్యంత ప్రసిద్ధేఽపి సిద్ధే సర్వాగమైరపి - 127
దృష్టేఽప్యకాల మరణే విచికిత్సేత్ కథం బుధః

**ప్రతిపదార్థము :** ఇత్యత్యంత ప్రసిద్ధేఽపి = ఈ ప్రకారము మిక్కిలి ప్రసిద్ధముగా యున్నప్పటికి గూడ; సర్వాగమైరపి సిద్ధే = సర్వశాస్త్రములతో సిద్ధాంతము చేయబడిన దైనప్పటికి కూడ, బుధః = పండితుడు; అకాల మరణే దృష్టేఽపి = అకాల మరణము చూడబడిన దైనప్పటికిని, విచికిత్సేత్ = సందేహ పడుచున్నాడు.

**తాత్పర్యము:** ఇట్లు అన్ని శాస్త్రములచేత, సిద్ధాంతముచేయబడి మిక్కిలి సుప్రసిద్ధమైనప్పటికి కూడ, అకాల మరణము విషయములో పండితుడు **ఎందుకు**

సందేహించుచున్నాడు? కాన అకాల మరణమునుగూర్చి ఎవ్వరును సందేహించ నవసరము లేదు.

మూ॥ గుణవత్ భిషగాదీనాం సంభవే సంభవేత్తుయః -128
మృత్యుం తం కాలజం ప్రాహు రితరం తద్విపర్యయే

**ప్రతిపదార్థము :** గుణవత్=పదునారు గుణములతో కూడిన; భిషగాదీనామ్ = భిషక ద్రవ్యాణి ఉపస్థాతా, రోగుల యొక్క; సంభవే=ఉన్నప్పటికిని; యః=ఏ మరణము; సంభవేత్తు=సంభవించునో; తం మృత్యుం=ఆ మృత్యువును, కాలజం=కాలము వలన సంభవించిన మరణమని; ప్రాహుః=చెప్పిరి,తద్విపర్యయే=దీనికి భిన్నమైన వాటి విషయములో, ఇతరం=అకాలమరణమని; ప్రాహుః=చెప్పిరి.

**తాత్పర్యము :** 16 గుణములయొక్క సంపదతో సమృద్ధమైన వైద్యుడు చికిత్స చేయునపుడు ఏ మరణము దాపురించునో ఆ మరణమును కాలమరణమని చెప్పుచున్నారు. (భిషక్, ద్రవ్యాణి, ఉపస్థాతా, రోగి ఈ నాల్గింటికి పాద చతుష్టయ మని పేరు. ఇందులో ఒక్కొక్క పాదమునకు 4 గుణములు, 4 పాదములకు 16 గుణములని భావము.) కాల మరణమునకు విరుద్ధమైన వన్నియు అకాల మరణములని గుర్తించ వలయును.

**శశిలేఖ :** అట్లే సన్న్యాసము, రోహిణీ మొ॥ వ్యాధులచేత పీడితులైన వారికి వైద్యుడు జాగు చేయుట చేత, వెంటనే మరణము సంభవించదు. మరియు చికిత్స చేత వెంటనే ఆరోగ్యము సంభవించదు. యుద్ధములలో ప్రతి దినము ఒకరితో నొకరుతలపడిమరణించుట,మరియుమంచినడవడికగలవారుమరణించుట, రెండునుసమానములే. పైనుదాహరించిన రెంటిలో ఆయుర్దాయముయొక్కస్థితి ఒకటిగా నేయుండును ఇవి రెండును సమానములుకావు. ఎందుకనగా యుద్ధము చేసినవారు చచ్చుచున్నారు. సాధువర్తనులు జీవించి యున్నారు. ఇట్లు చెప్పిన అకాలమరణము యొక్క ప్రసంగ సమాప్తి యగును. కాన అకాల మరణమును నదొకటి ఉన్నదను విషయమును బట్టి, మరికొన్ని ఉదాహరణములను చెప్పుచున్నాడు. ఇంద్రాది దేవతలు ఆయుధములతో శత్రువులను సంహరించుచున్నారు. అశ్వినీ దేవతలు రోగులకు తన్నివారణార్థము ఔషధములతో చికిత్సలు చేయుచున్నారు. దీనివలన అకాలమరణము ధ్రువమైనది,అట్లేపచ్చికుండలను జాగ్రత్తగా రక్షించుట చేత చాల కాలము అవి మనుట మనచే చూడబడుచున్నది. మరియు జాగ్రత్తగా రక్షించక పోవుట చేత, కాల్చిన కుండలు కూడ స్వల్పకాలములో నశించును. అట్లే చిత్తరువులుగూడ రక్షణ లేకపోవుట చేత నశించి పోవుటను మనము కన్నులారగాంచుచునే యున్నాము, ఇవన్నియు పాలన, అపరిపాలనముల చేత చూడబడుచున్నది. ఈ విధముగ సమస్త శాస్త్రముల చేత నిర్ద్వంద్వముగ సిద్ధాంతీకరింపబడిన అకాల మరణ విష

యమై పునః పండితులు ఎందుకు సందేహమును వెలిబుచ్చుచున్నారు. నిస్సందేహముగ అకాల మరణము ఉన్నది చెప్పుట సైద్ధాంతికమగును. ఎట్లు కాల మృత్యువు సంభవించునను నాశంకకు సమాధానమిట్లు చెప్పుచున్నారు. 16 గుణములతో సంపూర్ణుడైన పండిత వైద్యుడు, చేయు చికిత్సల వలన, బాగుపడక, ఎవడు మృత్యుముఖమును చేరుకొనునో ఆ మరణము కాలజమైనదనుట నిర్వివాదము. దీనికి విరుద్ధముగ, సంభవించు మరణములు అకాలజములని సిద్ధాన్తము.

మూ॥ యథారథో వాహ్యమానో న్యాయేన క్రమశః క్షయమ్।
యాయా దాత్మవతా.మాయు స్తథాన్యేషాం విపర్యయః ॥
శుచి తైల దశో దీపః కీట వాతాద్యపీడితః ।
దీప్తిమాన్ వర్తతే సమ్యక్ యథైవా స్నేహ సంక్షయాత్।
స ఏవాతో యథాచ స్యాద్విప రీతో విపర్యయే ।
హితాహితోపచారేణ తథైవ పురుషో ధ్రువమ్।
సర్వమన్యత్పరిత్యజ్య శరీరం పాలయేదతః।
తదభావేహి భావానాం సర్వాభావః శరీరిణామ్।
నగరీ నగర స్యేవ రథస్యేవ రథీతథా।
స్వ శరీరస్య మేధావీ కృత్యే ష్వవహి తో భవేత్।

ప్రతిపదార్థము : న్యాయేన = న్యాయము చేత; యథా = ఎట్లు; వాహ్యమానః = మోయబడుచున్న; రథః = రథము; క్రమశః = క్రమముగ, క్షయమ్ = నాశమును, యాయాత్ = పొందునో; తథా = అట్లే; ఆత్మవతాః = జితేంద్రియుల యొక్క; ఆయుః = ఆయుస్సు; క్షయం = నాశమును; యాయాత్ = పొందును; అన్యేషాం = ఇతరులకు; విపర్యయః = విపరీతముగ నుండును, శుచి = పవిత్రమైన; తైలదశః = తైలముతో కూడిన; దీపః = దీపము; కీటవాతాద్యపీడితః = పురుగులతో దుష్ట వాయ్వాదులతో పీడింపబడనిదై; యథైవ = ఎట్లైతే; సమ్యక్ = బాగుగా; దీప్తిమాన్ = కాంతిగలదై; వర్తతే = ఉండును. స్నేహసంక్షయాత్ = తైలము క్షీణించుట వలన; స ఏవ = ఆ దీపమే; యథా = ఎట్లు; విపర్యయే = విపర్యయమునందు; విపరీతః = విపరీతముగ; స్యాత్ = అగునో; తథైవ = అట్లే; పురుషః = పురుషుడు; హితోపచారేణ = పథ్యములగు ఉపచారములచేత; ధ్రువం = నిశ్చయముగ; దీప్తిమాన్ = కాంతి గలవాడుగ; వర్తతే = ఉండును. అహితోపచారేణ = అపథ్యాచారములచేత; విపరీతః = విపరీతముగ; భవేత్ = అగును, (అనగ మధ్యమ జీవితముననే క్షీణించును.) అతః = ఇందువలన, అన్యత్సర్వం = సమస్తమును; పరిత్యజ్య = వదలిపెట్టి, శరీరం = శరీరమును; పాలయేత్ = రక్షింపవలయును, తథాహి = అదియుక్తమేగదా! తదభావే = శరీరము యొక్క అభావము నందు; శరీరిణాం = దేహధారులకు; భావానాం = సమస్త పదార్థముల యొక్క; సర్వాభావః = కంటికి కనబడు, కనబడని సమస్త వస్తువుల యొక్క అభావము; సంభవేత్ = సంభవించును, నగరీ = నగర పాలకుడు, నగరస్యేవ = నగరము యొక్క వలె; రథీ = రథము గలవాడు; రథ

స్యేవ = రథము యొక్క వలె; మేధావీ = విజ్ఞానవంతుడు; స్వశరీరస్య = తన శరీరము యొక్క; కృత్యేషు = తాను నిర్వహించు పనుల యందు; సదా = ఎల్లప్పుడు; అవహితః = జాగరుకుడై ; భవేత్ = ఉండవలయును.

తాత్పర్యము : సమముగ నుండు భూమిపైన ప్రయాణము చేయు (పయనించు) రథము గూడ క్రమముగ ఎట్లునశించుచున్నదో (ఇది న్యాయము) అట్లే జితేంద్రియులై శాస్త్రవిధిని అనుష్ఠించువారికి గూడ క్రమముగ ఆయువు క్షీణించును. ఇతరుల విషయములో నిది విపరీతముగ నుండును. ఎట్లనగ సరియైన మార్గములో తాను మోయగలిగినంత బరువుతో సరియైన పద్ధతిలో పయనించు రథము దానికి నిర్ణీతమైన సమయములో అది నశించిపోవును. అట్లే హితాహార విహారములనాచరించి సంయమియైన వ్యక్తి సరియైన సమయములో మరణించుచున్నాడు. మరియు భారమధికమగుట వలన ఎగుడు దిగుడు ప్రదేశములలో పయనించుట వలన స్వల్ప కాలమునందే రథము విరిగి పోవును. అదే విధముగ మిథ్యాహార విహారములతో మనుష్యుడు గూడ మధ్యకాలముననే ఆయుస్సును కోల్పోవును. పరిశుద్ధమైన తైలముతో నింప బడిన దీపము ప్రకాశవంతముగ వెలుగును. అదే దీపము కీటాదుల చేత, కాలికమైన ప్రభంజనములచేత వెంటనే చల్లారును. మరియు స్నేహము తగ్గినందు వలన గూడ చల్లారును. ఇదియే కాలికమని చెప్పుచున్నారు. అట్లే హితాహార సేవన వలన కాలమరణము, అహితాహార విహార సేవన వలన అకాల మరణమును మానవుడు పొందుచున్నాడు. అందువలన సమస్త కార్యములను వదలి పెట్టి మొట్టమొదట శరీరమును కాపాడవలయును. ఎందువల్లననగ, శరీరమనునది ఉన్ననే శరీరమందలి భావములకు పుష్టి ఏర్పడును. శరీరము నశించిన, తక్కిన అన్ని భాగములు వెంటనే నశించును. ఎట్లనగ, నగరమును నగరపాలకుడు, జాగరూకుడై రక్షించునట్లు రథము గలవాడు, తన రథమును రక్షించునట్లు మేధావియైనవాడు తన శరీరమును రక్షించుకొనునట్లు సర్వులు తమతమ కార్య నిర్వహణమునందు జాగరూకతతో మెలగవలెను.

శశిలేఖ : సమతల ప్రదేశమున పయనించునట్టి, తాను మోయగలిగినంత బరువును భరించునట్టి రథము ఎట్లు దానికి నిర్ణీతమైన కాలమున నశించునో, అట్లే జితేంద్రియులైన మానవుల యొక్క ఆయుర్దాయము పథ్యకరమైన ఆహార విహారములు చేసినప్పటికిని, సకాలమున మరణము సంభవించును. ఆత్మనిగ్రహము లేని వారికి, మరణ విషయమై కాలనిర్ణయము చెప్పబడలేదు. మరియు తాను మోయలేనట్టి బరువు గలిగినట్టి, ఎగుడు దిగుడు ప్రదేశముల యందు సంచరించునట్టి రథము స్వల్పకాలముననే నశించిపోవును. అట్లే పరిశుద్ధమయిన తైలము, మరియు దశ గల్గినట్టి దీపము, కీటకాదుల చేత పీడింపబడినను, దానియందలి తైలము అయిపోయినను అది నశించును. అట్లే పురుషుడును మిథ్యాహార విహారములచేత, రోగగ్రస్తుడై అనతికాలమునందే మరణించును. దీని

భావార్థమేమనగా, పరిశుద్ధమైన తైలము గల దీపము కీటకాదుల చేత పీడింప బడనిదై, ఎట్లు ప్రకాశవతము గలిగియుండునో మరియు తైలము అయిపోవుట చేత ఎట్లు నాశమును పొందుచున్నదో అట్లే పురుషుడు, జాగరూకతతో నున్న ప్పటికిని నశించుచున్నాడు కాని అతను నియమితమైన ఆయుర్దాయము కలిగి యున్నప్పటికిని, స్నేహము పూర్తిగా ఉన్నప్పటికి గూడా దీపము, వాతాదుల చేత పీడింపబడినదై, ఎట్లునశించుచున్నదో అట్లే మిథ్యాపచారములచేత కూడా పురుషునికి ఆయుక్షీణత నిశ్చయముగ ఏర్పడుచున్నది. అందువలన పురుషుడు సమస్త కార్యములను వదలిపెట్టి, మొట్టమొదట శరీరమునే రక్షింప వలయును. ఎందుకనగా శరీరధారులైనమానవులకు శరీరము లేకపోయినయెడల దృష్ట ప్రయోజనములు, అదృష్ట ప్రయోజనములు గల సర్వపదార్థముల యొక్క అభావము ఏర్పడును.

**మూ॥ ఆహార కల్పనా హేతూన్ స్వభావాదీన్ విశేషతః సమీక్ష్య హితమశ్ని యాత్ దేహోహ్యాహార సంభవః -134**

**ప్రతిపదార్థము :** ఆహారకల్పనాహేతూన్=ఆహారముయొక్కతయారు చేయు విధిలో నుండు కారణములయిన; స్వభావాదీన్ = స్వభావము సంస్కారము మొ॥ వాటిని; విశేషతః=విశేషముగ; సమీక్ష్య=సమీక్షించి హితమ్ = పథ్యకరమైన ఆహారమును;అశ్నియాత్ = తినవలయును, తథాహి= అది యుక్తమే గదా; ఆహార సంభవః=ఆహారము వలన పుట్టినది; దేహః= శరీరము.

**తాత్పర్యము :** ఆహారమును తయారుచేయు పద్ధతిలో అనగా ఆహారము యొక్క స్వభావము, ఆహారము యొక్క సంస్కారము మొ॥ కారణ ములను, బాగుగా విచారణ చేసి, ఆ ఆహారములలో ఏది హితముగా నున్న ఆ ఆహారమును భుజించవలయును, ఎందుకనగా ఆహారము వలన పుట్టినది శరీ రము. ఈ విషయము ఉపనిషత్తులయందు కూడ, చెప్పబడి యున్నది. ఎటులనగా "ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివీభ్యః ఓషధయః, ఓషధీభ్యో అన్నం, అన్నాత్ భూతాని జాయంతే" అని కలదు. ఈ శరీరమును ధరించు భూతములన్నియు, అన్నము వలననే పుట్టినవి. అందుకే "కలౌ అన్న గతాః ప్రాణాః" అనగా కలియందు ప్రాణములు అన్నమునకు స్వాధీనములుగా నుండును. అందువలన ఆ అన్నము పథ్యముగా నున్న యెడల అది జాఠరాగ్ని చేత సరిగ పాకమును చెందింపబడిశరీరమునందలి సమస్త కోశములను సరియైన సమయములో వృద్ధి పొందించి, శరీరమునకు తుష్టిని, పుష్టిని ప్రసాదించి, ఆరోగ్యమును పరిరక్షించుచుండును. కావున ఆ అన్నము చేత, మానవుడు మొట్టమొదట తన శరీరమును తాను రక్షించుకొనవలయును.

మూ॥ భీ లజ్జ యంత్రణా లోభ హర్ష శోక వశంగతః -135
న జాతు ధారయే ద్వేగాం స్తద్ధి సర్వాపదాం పదమ్

ప్రతిపదార్థము : భీ=భయము; లజ్జ=సిగ్గు; యంత్రణా=కష్టము; లోభ=పిసినిగొట్టుతనము; హర్ష=సంతోషము; శోక=శోకము; వీటన్నింటి కిని; వశంగతః=లోబడిన వాడై; వేగాన్=మూత్రాది చతుర్దశ వేగములను; నధారయేత్=అడ్డగించ కూడదు; తద్ధి=ఆ వేగ రోధమైతే; సర్వాపదాం= అనేక ఆపత్తులకు; పదం=స్థానముగ; అస్తి=ఉన్నది.

తాత్పర్యము : భయమునకు, సిగ్గునకు, కష్టమునకు, పిసినిగొట్టుతనము నకు, సంతోషమునకు, దుఃఖమునకు లోబడినవాడై పురుషుడు మూత్రాది చతు ర్దశ వేగములను ఎప్పుడును అడ్డగింపరాదు. ఎందుకనగా, ఈ వేగములను అడ్డ గించుట వలన సమస్తమైన ఆపదలకు మానవుడు గురి యగును.

మూ॥ హితమభ్య స్యతః పుంసో నా కాలే కాల దంష్ట్రియా -136
సంజాయతే పరామర్శో బలో త్సాహేంద్రియాయుషామ్ ।

ప్రతిపదార్థము : హితమ్=పథ్యకరమైన వస్తువులను; అభ్యస్యతః=ఎల్ల ప్పుడు సేవించుచున్నట్టి; బలోత్సాహేంద్రియాయుషామ్=బలము,ఉత్సాహము, పుష్టిగల ఇంద్రియములు, ఆయుర్దాయము గల; పుంసాః=పురుషులకు; కాల దంష్ట్రియా=మృత్యువు చేత; అకాలే=కాలము గాని కాలము నందు; పరా మర్శః=పరామర్శము; న సంజాయతే=కలుగదు.

తాత్పర్యము : పథ్యకరమైన ఆహార పదార్థములను, నిరంతరము అభ్య సించు వారలు, బలము, ఉత్సాహము, ఇంద్రియములు. ఆయుర్దాయము గల పురుషులు, అకాలము నందు మరణమును జెందరు.

మూ॥ అహితాని చ స్తన్యజ్య దోషమప్యాప్ను యాద్యది -137
తథా ప్యా నృ ణ్య మాయాతి సాధూనా మాత్మవానితి

ప్రతిపదార్థము : చ=మరియు;అహితాని=అహితకారులైన వస్తువులను; సంత్యజ్య=వదలి పెట్టినప్పటికిని; దోషం=రోగాది రూపమైన దోషము; యది ఆప్నుయాత్=పొందిన యెడల; తథాఽపి=అట్లైనప్పటికిని ఆత్మవాన్=సం యమియైన పురుషుడు; సాధూనాం = సాధువుల యొక్క; ;అనృణ్యాం=ఋణ రహితత్వమును (అప్పు తీర్చిన వాడుగా); ఆయాతి =పొందుచున్నాడు.

తాత్పర్యము : అపథ్యాహార విహారములను వదలి పెట్టినప్పటికి, దైవ వశము వలన, రోగ రూపమైన దోషము తన్ను ఆవరించిన యెడల బుద్ధిమంతు డైన మానవుడు పథ్యాహార విహార క్రమమునే అనుష్ఠించ వలయును. ఎందు కనగ పథ్యాహార విహారముల నాచరించువాడు, మంచి పనులనే చేయును కాని చెడు కార్యముల నాచరింపడు. ఇట్లు మంచి పనుల నాచరించిన యెడల సాధు

పుంగవుల యొక్క ఋణము నుండి విడువబడిన వాడగును. ఈ విషయములో తన కెట్టి బాధ యేర్పడినదని చింతింపవలదు. కష్టమును భరించుటయే ఋణ విముక్తికి హేతువగును.

మూ॥ యచ్చరోగ సముత్థానం నశక్యమిహ కేనచిత్ -138
పరిహర్తుం న తత్ప్రాప్య శోచితవ్యం మనీషిణా।

ప్రతిపదార్థము :ఇహ = ఇట్టిస్థితిలో; కేనచిత్ = ఎట్టి ప్రయత్నముతోకూడ; యత్ రోగ సముత్థానమ్ = యే రోగము పుట్టుటకు కారణభూతమైనదో; తత్ = దానిని, పరిహర్తుం = తొలగించుటకు; న శక్యం = సాధ్యపడదు, తత్ = ఆ కష్టమును; ప్రాప్య = పొంది; మనీషిణా = బుద్ధిమంతుడైన పురుషునితో; నశోచితవ్యమ్ = చింతించకూడదు.

తాత్పర్యము : పథ్యాహార విహార క్రమానుష్ఠానము నందు కూడ, రోగములు సంభవించిన యెడల, ఆ రోగములను శమింప చేయటకు సాధ్యము కాదు. కాన వచ్చిన రోగరూపమైన కష్టమును బుద్ధిమంతుడైన పురుషుడు అనుభవించవలయునే కాని చింతింపకూడదు.

మూ॥ హితాహార విహారాణాం సదాచారనిషేవిణామ్ -139
లోకద్వయ వ్యపేక్షాణాం జీవితం హ్యమృతాయతే॥

ప్రతిపదార్థము : హితాహార విహారాణాం = పథ్యకరములైన ఆహార హారములను చేయువారి యొక్క; సదాచార నిషేవిణామ్ = స్వస్థవృత్తము నందు ఉపదేశించివ విధులను పాలించు వారియొక్క; లోకద్వయ వ్యపేక్షణామ్ = ఇహలోక పరలోకము లనబడు రెంటిని గూర్చి చింతించువారి యొక్కయు; జీవితమ్ = జీవితము; అమృతాయతే = అమృతమగుచున్నది. (వాడు దేవత యగును).

తాత్పర్యము : ఏ మానవుడు హితకరములైన ఆహార విహారములను సేవించుచున్నాడో, సదాచారములను పాటించుచున్నాడో, ఇహలోక పరలోకముల యందలి విషయములను ఎల్లప్పుడూ మననము చేయుచున్నాడో, అట్టి మానవుని యొక్క జీవనము, అమృతమయమగుచున్నది. అట్టి మానవుడు అమరుడగుచున్నాడు.

శశిలేఖ : అట్లే శాల్యాదులను ఆహారముగా మార్చునపుడు చేయు సంస్కారమును, మాత్రను, ఆ ద్రవ్యముల యొక్క స్వభావ, స్వరూప విశేషములను బాగుగా సమీక్షించి వాటిలో ఆయుష్కామీయుడైన పురుషుడు, హితకరమైన ఆహారమునే భుజింప వలెను, ఎందుకనగా ఆహారమునుండియే దేహము ఉత్పత్తి యయినది. అట్లే భయము, సిగ్గు, కష్టము మొ॥ వాటికి, లోబడిన వాడై పురుషుడు, మల మూత్రాది వేగములను ఎప్పుడుకూడ అడ్డగింప

రాదు. అట్లు చతుర్దశ వేగములను అడ్డగించుట వలన, అనేక ఆప దలకు స్థానమగును. హితాహార విహారముల నభ్యసించు మానవుడు, బలము, ఉత్సాహము, ఇంద్రియములు, ఆయుస్సు వీటిని మృత్యు సన్నిధికి చేర్చడు. అనగా బలాదులు మృత్యుదంష్ట్రిల చేత, పరామర్శింపబడవు. ఒకవేళ హితోప చారములను ఆచరించినప్పటికిని రోగాదు లేర్పడిన ఎడల అహితములను వదిలిపెట్టినప్పటికిని, దైవవశము వలన పురుషుడు రోగగ్రస్తుడైన యెడల ఆ కష్టమును ఆత్మనిగ్రహము గల పురుషుడు, అనుభవించవలయునే కాని వచ్చిన కష్టమును గూర్చి చింతింపరాదు. ఎందుకనగా ఆ కష్టముల ననుభ వించుటచే సాధుపుంగవుల యొక్క ఋణము నుండి విడువ బడిన వాడగును. ఈ విషయములో ఆ రోగములు దైవకారణము వలన పుట్టినవి కావుననూ, అవి పరిహరించుటకు వీలు కానివగుట వలననూ ఆ విషయమును గూర్చి పండితు డైన వాడు, ఆలోచింప దగదు. ఎట్లనగా ఏ మానవుడైతే హితమైన ఆహార మును, హితమైన విహారమును సేవించుచున్నాడో ఆ మానవుడు సాధుపుంగ వుల ఆచారమును, శీలమును, ఆచరించుచున్నాడనియే భావము. మరియు ఏ మానవుడైతే ఈ లోకమును గూర్చి, పర లోకమును గూర్చి ఎల్లప్పుడూ చిం తించునో, అట్టి మానవుడు అమృతత్వమును పొందును. అనగా అమరుడగునని భావము.

మూ॥ గృధ్నుః గ్రామ్య సుఖే వశ్యః క్లేశానాం హత సత్పథః।
మూఢో జీవత్య నర్థాయ దుర్గతిం పరిబృంహయన్॥
విదుషాంతశ్శరీరస్థా న్నిత్యం సన్నిహితా నరీన్।
జిత్వా వర్జ్యాని వర్జ్యాని చిరంజీవితు మిచ్ఛతా॥
తదాత్వే చాను బంధే వాతస్మాత్ కర్మ శుభోదయమ్
స్మరన్నాత్రేయ వచసో నధీమాన్ కర్తు మర్హతి॥

ప్రతిపదార్థము : మూఢః = మూఢుడు; గ్రామ్యసుఖే = గ్రామ్యసుఖము నందు; గృధ్నుః = ఏ విషయమునందైనను తెంపులేని ఆశ గలవాడై (తృప్తుడై) క్లేశానాం = రోగలోభాది కష్టములకు; వశ్యః = స్వాధీనుడై; తథా = అట్లై; హితస త్పథః = వదలి పెట్టబడిన సాధువుల యొక్క మార్గము గలవాడై; దుర్గతిం = దుర్గ తిని; పరిబృంహయన్ = వృద్ధి పరచుచూ; అనర్థాయ = అనర్థము కొరకు; జీవతి = జీవించుచున్నాడు; విదుషా = పండితుని చేత; అంతశ్శరీరస్థాన్ = లోపలి శరీరమునందున్న; సన్నిహితాన్ = మిక్కిలి సన్నిహితములైన; అరీన్ = రోగాది రూపములయిన శత్రువులను; జిత్వా = జయించి; వర్జ్యాని = విడిచి పెట్ట దగిన దిన చర్య యందు చెప్పబడిన వాటిని; వర్జ్యాని = విడువదగినవి; యః = ఎవడు; చిరం = చాలకాలము; జీవితం = జీవించుటకు; ఇచ్ఛతా = కోరుచున్నాడో; సః = వాడు; ఆత్రేయ వచసహా = ఆత్రేయుడు చెప్పిన వాక్యములను; స్మరన్ = స్మరించుచూ; శుభోదయం కర్మ = శుభమైన కర్మను; ధీమాన్ = బుద్ధిమం

తుడు; కర్తుం = చేయుటకు; నార్హతి = తగడు.

తాత్పర్యము : మూఢుడు ఇంద్రియ సుఖముల చేత తృప్తి చెందిన వాడై రాగలోభాది క్లేశములకు లొంగినవాడై దుర్గతిని కల్గించు కార్యములను వృద్ధి పరచుచూ, అనర్థము కొరకు జీవించుచున్నాడు. మరియు అట్లే విడిచి పెట్టబడిన సాధువుల యొక్క మార్గము గలవాడై జీవించుచున్నాడు. అందువలన పండితుడైన వాని చేత, శరీరములోనున్న అతి సన్నిహితులైన, రాగాదులైన శత్రువులను జయించి వర్జించ వలయును. ఎవడు చాలా కాలము జీవించ వలయు నని కోరుచున్నాడో వాడు తర్వాత చెప్పబోపు ఆత్రేయ మహర్షి యొక్క వాక్కులను స్మరించుచూ, అమంగళ కార్యముల నాచరించ రాదు. తత్కాలము నందు ఉపభోగ్యమైన శుభ ఫలములకు కారణములైన అనుబంధములను ఆగామి కాలమందు వచ్చు అశుభ ఫలముల కారణమును తెలుసుకొని, మానవుడు సర్వదా మహర్షుల యొక్క ఉపదేశములను పాటించుచూ సత్యజీవనమును గడుపవలయును.

*శశిలేఖ :* ఏ మూఢుడైతే గ్రామ్య సుఖములకంకితుడై రాగలోభాదులకు వశంవదుడై నరకమునకు వెళ్ళు కార్యములను వృద్ధి పరచుచూ జీవించుచున్నాడో వాడు అకాల మరణములకు గురియగుచున్నాడు. అట్లే వాడు సాధు పుంగవుల యొక్క మార్గమును కూడ విడిచి పెట్టుచున్నాడు. తక్కిన విషయము తాత్పర్యాంశమే.

ఇట్లు ఇందు అను పండితుని చేత వ్రాయబడిన అష్టాంగ సంగ్రహ వ్యాఖ్యానము నందలి సూత్ర స్థానము నందు తొమ్మిదవ అధ్యాయము సమాప్తము చేయబడినది.

# అష్టాంగసంగ్రహ వ్యాఖ్యానము

## పదవ అధ్యాయము

అథాతో అన్నపానవిధి మధ్యాయం వ్యాఖ్యాస్యామ ఇతిహాస్మాహు రాత్రేయాదయోమహర్షయః.

*ప్రతిపదార్థము* : అథ=పూజ్యార్థము; అతః=ఇందువలన; అన్నపాన విధిం=అన్నపానములను గురించిన నియమమును; వ్యాఖ్యాస్యామఇతి=విశేష వివులీకరణ చేయగలమని; ఆత్రేయాదయః=ఆత్రేయుడు మొదలుగాగల; మహర్షయః=త్రికాలవేదులైన ఋషులు; ఇతి=అని; ఆహుస్మ=చెప్పిరి.

*తాత్పర్యము* : అన్నపానముల దైనందిన ఉపయోగార్హమైన విధి విశేషములను ఆత్రేయాది మహర్షులు పూర్వాపరసమన్వయ పూర్వకముగ వివులీకరించగలమని ఈ అధ్యాయ ప్రారంభమున పూజ్యార్థ పూర్వకముగ చెప్పిరి. కఠినరూపమును ద్రవరూపమునైన యాహారద్రవ్యములకు సంబంధించిన విశేష కృత్యాంశములును వేరువేర యీ అధ్యాయమున చెప్పబడును.

*శశిలేఖ* : బాగుగ రక్షింపబడిన అన్నపానములైనను శాస్త్రవిధినతిక్రమించి ఉపయోగించినయెడల వ్యాధి రూపముగనో లేక మరణమో చేయును. అందువలన శాస్త్రవిధిననుసరించియే అన్నపానములను ఉపయోగింప వలయును. ఈ విషయమును విశేషమైన విధినియమములను బోధించుటకే ఈ అధ్యాయము నారంభించుచున్నారు.

**వి. వ్యా.** : శాన్తేఽగ్నౌమ్రియతే యుక్తే చిరంజీవత్యనామయః
రోగీస్యాత్ వికృతే, మూలమగ్నిస్తస్మాన్నిరుచ్యతే॥
(చ.చి 15అ, 4శ్లో.)

చరకసంహితలో ఇట్లుచెప్పబడినది. జాఠరాగ్ని చల్లారిన యెడల మానవుడు మరణించు ననియు, రోగరహితుడుగానుండిన ఎడల చాలకాలము జీవించుననియును పైవాక్యమునకర్థము. భగవద్గీతలో యోగీశ్వరేశ్వరుడైన కృష్ణపరమాత్మ స్వయముగ ఉపదేశించిన అమృతవాక్కులలో ఇట్లున్నది.

"అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః, ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నంచతుర్విధమ్". జాఠరాగ్నిస్వరూపమును ధరించి మానవుల దేహమును సదా ఆశ్రయించియుందునని ఆయనచెప్పెను. ఈ వాక్యమును

బట్టి జాఠరాగ్నిని అతిజాగరూకతతో రక్షించవలయును. సుశ్రుతమునందు (సూ/అ/46/3శ్లో/ "లోకస్య ఆహారః స్థిత్యుత్పత్తి వినాశహేతుః, ఆహారా దేవ అభివృద్ధిః, బలం ఆరోగ్యం వర్ణేంద్రియప్రసాదశ్చ" అని కలదు· మానవులు భుజించు చతుర్విధాహారములు లోకముయొక్క స్థిత్యుత్పత్తి వినాశములకు కారణము. ఆహారము శరీరవృద్ధి,శరీరబలము, శరీరారోగ్యము, శరీరవర్ణము, ఇంద్రియములకు ప్రసన్నత్వమును ప్రసాదించును. జాఠరాగ్ని స్వరూపమైన పర మాత్మయే చతుర్విధాహారములను పచనముచేయును. అందువలన యజ్ఞేశ్వరు డైన విశ్వాత్మకుడైన వైశ్వానరునికి యజ్ఞయాగాది క్రతువులద్వారా తృప్తిని గల్గించి ఆశీస్సులనందిన మానవులకు చతుర్విధరూపమైన ఆహారము జాఠరాగ్ని చేత పక్వము చేయబడి రసాదిధాతువులకు సమానమైన వృద్ధినిచేకూర్చి ఆయు ర్వృద్ధి, శరీరపుష్టిని మానసికానందమును సాత్వికావస్థతో కూడిన ఆత్మసాంయ మిత్వమును ప్రసాదించి ఇహపరరూపమైన సౌఖ్యముల కుపాధియై ఉభయతార కముగ విలసిల్లును.

మూ॥ విధివిహిత మన్నపాన మిష్టేంద్రియార్థ మాయతన మాయు షో బ్రువతే। యదాయత్తానిహ్యోజస్తేజోధాత్విన్ద్రియబల తుష్టిపుష్టి ప్రతిభారో గ్యాదీని, తది న్ధనాచ్చాన్తరాగ్నేః స్థితిః, అగ్నిమూలంచ దేహధారణమితి.

ప్రతిపదార్థము : విధివిహితమన్నపానం=శాస్త్రవిహితమైన అన్నపాన ము; ఇష్టేంద్రియార్థం=ఇంద్రియార్థముల కభిమతమైనది, ఆయుషః=ఆయు స్సునకు; ఆయతనమ్=నిలయమైనదిగా; బ్రువతే=చెప్పుచున్నారు, తథాహి= అదియుక్తమే; ఓజస్తేజోధాత్విన్ద్రియ బలతుష్టిపుష్టి ప్రతిభారోగ్యాదీని, ఓజ= అష్ట బింద్వాత్మకమైన ఓజస్సు; తేజః=శరీరకాంతి, ధాతు = రసాదిధాతు వృద్ధి; ఇంద్రియ=చక్షురాదీన్ద్రియములకుశక్తి; బల=శరీరబలము; తుష్టి= మానసికానందము; పుష్టి=శరీరోపచయము; ప్రతిభా=నవనవోన్మేష శాలి త్వము; ఆరోగ్యాదీని=ఆరోగ్యము మొదలగునవి;యదాయత్తాని=పథ్యకరమైన అన్నపానములకధీనమైనవి; తదింధనా=ఆహారమే ఇంధనముగాగల; స్థితిః=స్థితి; అన్తరగ్నేః=జాఠరాగ్నికి; అస్తి=కలదు; అగ్నిమూలంచ=అగ్నియే మూల ముగాగలది; దేహధారణం=శరీరమును ధరించునదిగా;ఋషయః=మహర్షులు; బ్రువతే=చెప్పుచున్నారు.

**తాత్పర్యము** : ఇంద్రియార్థములకభిమతమైన, శాస్త్రముచేత విధింప బడిన అన్నపానములు ఆయుస్సునకు (జీవితమునకు) నిలయమైనవిగా మహర్షులు చెప్పుచున్నారు. ఓజస్సు, తేజస్సు, శరీరకాంతి,రసాదివృద్ధి,ఇంద్రియపటుత్వము, ఆరోగ్యముమొదలగు శారీరక ధర్మములన్నియు అన్నపానముల కధీనములైనవిగ పేర్కొనబడినవి. ఆహారమనే ఇంధనములే జాఠరాగ్ని ప్రబోధకములు, అట్టి జాఠరాగ్నియే శరీరధారణమునకు మూలమన్నియునుడివిరి.

శశిలేఖ : విధివిహితమైన అభిమతమైన రసవర్ణాదియుక్తమైన ఆహారపానీయములు ఎల్లపుడు జీవితమునకాశ్రయమని ఆచార్యులు చెప్పుచున్నారు. కార్య కారణ భావమువలన ఓజస్సు మొదలగు శరీరభావములు ఆహారపానీయముల కధీనములై యున్నవి. అన్తరగ్ని సంధుక్షకములుగ ఈ ఆహారపానీయములే ఇంధనములవలె ఉపకరించుచున్నవి. ఆ అన్తరగ్నిస్థితియే దేహధారణమునకు ముఖ్యకారణమగుచున్నది.

వి.వ్యా. : అన్నపానస్వరూప విషయములో చరకమునందు "ఇష్టవర్ణ = సేవ్యమానం" సూ 27/3సూ. అనియున్నది, ఆత్మకింపైనది, శరీరమునకు పథ్యమైనది, ఇష్టమైన వర్ణగన్ధరస స్పర్శలుగలది అగు విధివిహితమైన ఆహార పానీయములు మానవులయొక్క ప్రాణములకు ఆధారమని వైద్యవర్యులు చెప్పిరి. ఎట్లనగ ఆహారములేనియెడల ప్రాణి జీవించుటలేదు. ఆహారమున్నపుడు జీవించును అను అనుభవ సిద్ధమైన జ్ఞానమొక ప్రత్యక్షనిదర్శనము. లోకము నందలి సమస్తమానవులు ఆహారమున్నపుడే జీవింతురు. ఆహారము లేనినాడు జీవించరు. ఇదియే అన్వయ వ్యతిరేకియని నైయ్యాయికులు చెప్పుదురు. కాన అన్వయ వ్యతిరేక దృష్టాంతములచేత ప్రాణములు నిలిచి యుండుటకు, అన్నము కారణమని అనుమానముచేత నూహింపబడును. అట్టి అనుమానముచేత స్థిరపడిన జ్ఞానము ప్రత్యక్షము కావున అట్టి ప్రత్యక్షజ్ఞానముచేత ప్రాణులకు ప్రాణముగ నుండునది యాహారమని ఏర్పడును. క్రమాహారమును భుజించుట చేత జాఠరాగ్ని వృద్ధియగును. జాఠరాగ్ని బాగుగా నున్నపుడు ప్రాణములు నిరపాయములుగ నుండును. "బల మారోగ్యమాయుశ్చ ప్రాణశ్చాగ్నౌ ప్రతిష్ఠితాః" సూ/అ/27-342. అట్టి ప్రాణమున కాధారమైన జాఠరాగ్నికిని హేతువుగ నుండుటవలన ఆహారము ప్రాణమని చెప్పబడును. శాస్త్ర విహితాహార సేవనవలన మనోబలమేర్పడును. శరీరమునందలి రసరక్తాది ధాతువులకు బలము కలుగును. శరీరవర్ణము చక్షురాదింద్రియములకు ప్రసన్నత ఏర్పడును. ఇందుకు విపరీతముగ నడచుకొనిన ఎడల శరీరమునందలి సర్వశరీర భావములకు నాశమేర్పడును,

మూ॥ అథాత్మవాన్ స్వభావ సంయోగ సంస్కార మాత్రా దేశ కాలోపయోగ వ్యవస్థాః సప్తాహార కల్పనా విశేషాణాం స్వాస్థ్యాస్వాస్థ్య ఫలానాం హేతుభూతాః సమీక్ష్య హితమేవానురుధ్యేత, తత్రస్వభావతః దివ్యోదక రక్త శాలి షష్టిక ముద్గైణ లావాదయోలఘవః, క్షీరేక్షు వ్రీహిమాషానూపామిషాద యోగురవ ఇతి, తేఖల్వపి సంయోగాది విశేషై రన్యథాత్వం ప్రతిపద్యంతే॥

ప్రతిపదార్థము : అథ = తరువాత; ఆత్మవాన్ = బుద్ధి గలవాడు; స్వాస్థ్య అస్వాస్థ్య ఫలానాం = ఆరోగ్య అనారోగ్య ఫలములకు; హేభూతుతాః = కారణ భూతములైన; స్వభావ - వ్యవస్థాః = స్వభావము, సంయోగము, సంస్కారము,

మాత్ర, దేశము. కాలము, ఉపయోగ వ్యవస్థలైన, సప్తాహార కల్పనా విశేషా ణాం=ఏడు విధములైన ఆహార కల్పనా విశేషములను, సమీక్ష్య=బాగుగా సమీక్షించి, హితమేవ=పథ్యమైన దానినే, అనురుధ్యేత=ఉపయోగించుటకు ప్రయత్నించ వలెను (అనుసరించవలయును), తత్ర=ఆ సప్త విధాహారము లలో, స్వభావతః=స్వభావము వలన, దివ్యోదక=వర్ష జలము, రక్తశాలి=ఎఱ్ఱ రాజనాలు, షష్టిక=అరువది దినములలో తయారగు ధాన్యము,ముద్గ=పెసలు, ఏణ=లేడి, లావాదయః=లావుక పిట్ట మొదలగునవి, లఘవః = లఘుగుణము గలవి, క్షీర=ఆవుపాలు, ఇక్షు=చెఱుకు రసముతో చేయు పదార్థము, వ్రీహి= వ్రీహి ధాన్యము, మాష=మినుములు, ఆనూపామిషాదయః=ఆనూప జంతు వుల యొక్క మాంసము మొదలగునవి, గురవఇతి=గురు గుణములు గలవని, ఏతే = ఇది, స్వభావతః=స్వభావము వల్లనే, భవంతి=అగుచున్నవి, తేఖల్వపి= ఆ ద్రవ్యములు గూడ, సంయోగాది విశేషైః=సంస్కారము మొ॥ విశేషముల చేత, అన్యధాత్వం=విపరీతత్వము, ప్రతిపాద్యంతే=ప్రతిపాదింపబడుచున్నవి.

**తాత్పర్యము :** జితేంద్రియుడైన మానవుడు స్వభావ-సంయోగ-సంస్కార-మాత్రా-దేశ-కాలఉపయోగవ్యవస్థా అను ఏడు విధములైనఆహారకల్పనా భేదములను బాగుగా సమన్వయించుకొనవలెను.మరియు ఈ ఏడు విధములైన ఆహార కల్పనా విభేదములే ఆరోగ్య రక్షణమునకునూ రోగోత్పత్తికిని కారణ భూతములగుచున్నవి. కాన హితమును కలిగించు ఆహారములను చేయుచూ అహితాహారములను విడువవలెను. చరక సంహితలో ఆహార కల్పనాభేదములు, ప్రకృతి-కరణ-సంయోగ-రాశి-దేశ-కాల-ఉపయోగసంస్థా-ఉపయోక్తా అని ఎని మిది విధములుగ చెప్పబడినవి. "తథ్యతా-ప్రకృతి కరణ సంయోగ రాశిదేశకాలో పయోగ సంస్థోపయోక్త్రష్టమాని భవన్తి-(చ-వి-అ-1)". స్వభావ లక్షణము : వర్ష జలము, ఎఱ్ఱ రాజనాలు, షష్టిక ధాన్యము, పెసలు, లేడి, లావుకపిట్ట, మొదలగునవి ప్రాకృతికముగ లఘుగుణమును గలిగియుండును. పాలు, చెరుకు రసముతో చేయు పదార్థము, వ్రీహిధాన్యము, మినుములు, ఆనూప మాంసము మొదలగువవి స్వభావముగనే గురుగుణము గలవి. ఈ విషయములో "గురూ ణాం లాఘవం విద్యాత్ సంస్కారాత్ సవిపర్యయమ్. వ్రీహిర్లాజాయథాచస్యుః సక్తూనాం సిద్ధ పిండకాః." చ/సూ/అ27/33శ్లో,అని కలదు.సంస్కారాది విశేష ములను పొందినపుడు గురుగుణ ద్రవ్యములు లఘుగుణమును లఘుగుణ ద్రవ్య ములు గురుగుణముగలవిగనూ మారుచుండును. ఎట్లనగ వ్రీహి(వడ్లు)తో చేయ బడినవి పేలాలు. వ్రీహి గురుగుణము, పేలాలు లఘుగుణమునుకలిగియుండును.

**శశిలేఖ :** బుద్ధి నుపయోగించు మానవుడు అన్నము యొక్క స్వభా వాది సప్త ఆహార కల్పనా విశేషములను బాగుగ సూక్ష్మబుద్ధిచేత సమీక్షించి హితమైన దానినే ఉపయోగించుటకు ప్రయత్నించ వలెను. అహితమైన దానిని విడిచి పెట్ట వలయును. పైన నుద్ధాహరించిన ఆహార కల్పనా విశేషము లేర్పడును

హితాహితములకు కారణభూతములుగ పేర్కొనబడినవి. ఆహారద్రవ్యములు సంయోగ విశేషముచేతనే విలక్షణమైన కార్యమును చేయునవిగ అగుచున్నవి. జివ్హోదకాదులు స్వభావముగనే లఘుగుణము గలవి. క్షీరాదులు గురుగుణములు గలవి. కాని సంస్కారాది విశేషముల చేత వైపరీత్యమును గూడ పొందును. ఇచట కేవలము లక్షణము మాత్రము చెప్పబడినది. వివరణము మాత్రాది ప్రకరణములో చెప్పగలము.

మూ॥ తత్ర సంయోగో నామద్వయోర్బహూనాం వా ద్రవ్యాణాం సంహతీ భావః। సవిశేషమారభతే, యన్నైకైకశో ద్రవ్యాణి, సంస్కారస్తు తోయాగ్ని సన్నికర్ష శౌచ మన్థన దేశకాల భావనా భాజనాదిభిరుపజన్యతే, మాత్రాపునః పిండపరిమాణతః సముదాయేన ప్రతిద్రవ్యాపేక్షయా చాహార రాశిః, దేశో ద్రవ్యస్యోపయోక్తుశ్చోత్పత్త్యవస్థానే, తత్ర పునరుపయోక్తా స్వస్థాతురత్వతః ప్రకృతి భేదతశ్చ పరీక్ష్యః.

ప్రతిపదార్థము : తత్ర = వాటిలో; సంయోగో నామ = సంయోగమనగ; ద్వయోర్వా = రెంటియొక్క గాని; బహూనాం ద్రవ్యాణాం = ఎక్కువ ద్రవ్యముల యొక్క; సంహతీ భావః = యౌగికత్వము; సః = ఆ సంయోగము; విశేష మారభతే = విశేషమును కలిగించును, యత్ = యే సంయోగమైతే కలదో; ఏకశః = ఒకటిగా; న = కాదు. నైక = అనేకమైన; ద్రవ్యాణి = ద్రవ్యములుగా; భవంతి = అగుచున్నది. సంస్కారస్తు = సంస్కారమైతే; తోయాగ్ని సన్నికర్ష = అగ్ని జల సంబంధము; శౌచ = శుభ్రత, మన్థన = చిలుకుట; దేశ = దేశము; కాల = కాలము; భావనా = స్వరసాదుల యందు కొంతకాల మూర బెట్టుట; భాజనాదిభిః = పాత్ర విశేషముల యందుంచుట మొదలగువాటి చేత; ఉపజన్యతే = పుట్టింపబడుచున్నది, మాత్రాపునః = మరల మాత్రయనగ; పిండపరిమాణతః = పిండపరిమాణముతో; సముదాయేన = సముదాయముతో; ప్రతిద్రవ్యాపేక్షయా చ = ప్రతిద్రవ్యముయొక్క అపేక్షతో; ఆహారరాశిః = ఆహారసముదాయము; విభజ్యతే = విభజింపబడునున్నది. ద్రవ్యస్య = ద్రవ్యముయొక్క; ఉపయోక్తుః = ఎవడైతే ఉపయోగించుచున్నాడో; ఉత్పత్త్యవస్థానే = పుట్టుక ప్రదేశమునుండి; సః దేశః = అట్టి దేశము; తత్ర = ఆ దేశము నందు; పునః = మరల; ఉపయోక్తా = ఉపయోగించువాడు; స్వస్థాతురత్వతః = ఆరోగ్యవంతుని అనారోగ్యవంతుని యొక్క; ప్రకృతి భేదశ్చ = వాతాది అష్ట విధ ప్రకృతిని గూడ; పరీక్ష్యః = పరీక్షింపవలయును.

తాత్పర్యము : వేరువేరుగ స్వభావ సిద్ధములైన గుణములు గల రెండేసి ద్రవ్యములకైనను, అనేక ద్రవ్యములతో నైనను ఏర్పడిన కూటమి సంయోగ మనబడును. అట్టి సంయోగము ఆ ద్రవ్యములు వేరువేరుగ నున్నపుడుచేయనలవి కాని కార్యవిశేషముల జేయనోపును, ఉదాహరణమునకు తేనెయ్యు నెయ్యియు

సమానముగ నొకచోట చేర్చి సేవించినయెడల మానవులను చంపును. మరియు ఈ రెండు ద్రవ్యములును వేరువేరుగ నున్నపుడుత్తమ గుణములను గల్గించును. ఇట్లే పాలు, చేపలు, తేనె ఒకటిగ చేర్చిన ప్రాణహారమగును. సంస్కారమనగ స్వాభావికగుణమున్నను ప్రతిద్రవ్యమునందును వేరు గుణమును కల్గించుటకు సాధనమగును. ఉదాహరణము : బియ్యమును బాగుగ కడిగి వడపోసి మరల సమానముగ నీళ్ళుపోసి ఉడక బెట్టిన యన్నము పొడిగ తయారగును. అపుడు బియ్యమునందలి స్వభావసిద్ధమైన గురుత్వమును పోగొట్టి లాఘవమును కల్గించును. ఇది జలాగ్ని సన్నికర్షముచేత గల్గిన గుణాంతరాధానము. "సుధౌతః ప్రస్తుతః స్విన్నః సన్తప్తశ్చౌదనోలఘుః" అని చెప్పబడినది. "భస్మరాశేరధఃస్థాపయేత్" ఇత్యాది సంస్కారము దేశకృతము. హంసోదకాదుల వలన గలుగు విశేషము కాలకృతము. నీటికి నల్ల కలువలు మొదలగు వాటితో గలుగు పరిమళ విశేషము వాసనాకృతము. ద్రవ్యాదుల భావనా విశేషముచే గలుగు గుణాంతరాధానము భావనాకృతము. "త్రైఫలే నాయసీంపాత్రాంకల్కే నాలేపయేత్" ఇత్యాది స్థలముల యందు ఆయసాది పాత్రల విశేష సంబంధము వలన గలుగు విశేష గుణము భాజన(పాత్ర)కృతముగా చెప్పబడినది.

ఆహారమాత్ర రెండువిధములు. 1 పిండరూపము, 2. ప్రతిద్రవ్యాపేక్షితము. పిండ రూపములో ఆహార ద్రవ్యముల యొక్క గురు లఘువులను విచారించక కుక్షి యొక్క రెండు భాగములను పూర్ణముగ నింపుట, ఇది సముదాయ రూపమైనది. దీనిని సర్వగురు అని చెప్పెదరు. ప్రతిద్రవ్యమును గురులఘువులను సమీక్షించి గురుద్రవ్యములను తృప్తిగను భుజింపరాదు, ఇది పరిగ్రహ మన బడును. మాత్ర యనునది అగ్నిబలము నపేక్షించి యుండును

దేశమనగ స్థానము. ఇది రెండు విధములు. ఆహారద్రవ్యములకు సంబంధించిన ప్రదేశము. ఇట్టి ప్రదేశము ద్రవ్యముల యుత్పత్తికిని, ఆహారమును భుజించిన వారి ప్రచారమును, దేశ సాత్మ్యమును తెలుపును. ఆహారము నుపయోగించు మానవుడు ఉపయోక్త యనబడును. ఓక సాత్మ్యము అట్టి యుపయోక్త కధీనముగ నుండును. ఈ యుపయోక్త ఆరోగ్య అనారోగ్యవంతుల లక్షణములను వారియొక్క ప్రకృతి భేదములనున్నూ బాగుగా పరీక్షింప వలయును. ఇట్లు పరీక్షించిన యెడల రోగపీడితుల, ఆరోగ్యవంతులకు సంబంధించిన విశేష విషయము లవగాహన మగును.

***శశిలేఖ*** : సంయోగ మనగ అనేక ద్రవ్యముల కలయిక అని అర్థము. ఆ కలయిక విశేషమైన కార్యము నారంభించును. ఏ కార్యమునైతే ఒక్కొక్క ద్రవ్యము చేయజాలకున్నను వాటివాటి కార్యములనవి చేయుటలో సమర్థతను కలిగియుండును. ఆ ద్రవ్యము లేకే జలాగ్ని సన్నికర్షాదులతో సంపర్క మేర్పడినయెడల విశేషఫలగుణధార్యులు అగును. మాత్ర (పరిమాణము)

రెండు విధములు. పిండ పరిమాణరూపమొకటి. అది ఎట్లులనగ ద్రవ్యముల యొక్క గురులాఘవములను సమీక్షించక అన్నముతో కుక్షియొక్క రెండు భాగముల పూరించుట, రెండవది అనేక విధములైన ద్రవ్య సముదాయముచేత (ప్రతిద్రవ్యము నాపేక్షించి) కుక్షిని పూరించుట, ఎట్లులనగా గురుద్రవ్యము లను అర్ధతృప్తిగ, లఘు ద్రవ్యములను స్వల్పతృప్తిగ భుజించుట, రెండు విధము లైన ఆహారరాశిగూడ ఇచట మాత్రశబ్దముతో చెప్పబడుచున్నది. దేశమును గురించి వైద్యుడు ముఖ్యముగ ఆలోచించవలెను. ఔషధ పరికల్పనలో ఉపయోగింపబడు ద్రవ్యములు యేప్రదేశమునందు పుట్టినవి,ఆ దేశము యొక్క శీతోష్ణస్థితి గతులు, వాటివలన ద్రవ్యమునందుత్పన్నమగు రస గుణ వీర్య విపాక ములు మొదలగునవిగూడ తెలియవలెను. రోగిపుట్టిన దేశమును ద్రవ్యము పుట్టిన దేశమును చక్కగ గ్రహించి తాను నివసించు దేశమునుగూడ సమీక్షించి ద్రవ్య పరికల్పన చేయవలెను. వైద్యుడు రోగియొక్క ప్రకృతి పరీక్షణమును స్వస్థ ఆతుర భేదములతో చేసిన తరువాత ధాతుసామ్యరూపమైన చికిత్సలను ప్రారంభించ వలెను. ఇట్లు సూక్ష్మాతిసూక్ష్మముగ సమస్త విధములైన విశేష ముల నారసి ఆకళించుకొన్న విషయ సమూహములద్వారా ఆలోచించి ఫలాను మేయములైన చికిత్సల నారంభించ వలెనని భావము.

వి.వ్యా : ఆహారరాశి విషయములో చరక విమానస్థానములో సర్వ గ్రహము, పరిగ్రహము అని రెండు విధములుగ యున్నది. అట్టి రాశి మాత్రా వంతమైన ఆహార పదార్థములయొక్కయు ఔషధ ద్రవ్యములయొక్కయు శుభ ఫలమును, అమాత్రగాయున్న అశుభరూపఫలమును గల్గియుండును. మరియు సర్వగ్రహమనగ భోజన నిమిత్తమై నిర్ణయించుకొనిన మాంస శాక వ్యంజనాది విశిష్టమైన సముదాయమునకు జేరి యొకే ప్రమాణమునకు చెప్పునది. దీనినే పిండ ప్రమాణముగా చెప్పబడినది. ఆహార పదార్థములను వేరువేరుగ పరిమాణ మును దెలుపుచు ఆహారసముదాయ పరిమాణము గ్రహించుట సర్వగ్రహము. ఈ విషయమే వేరొకస్థలమున "తస్య జ్ఞానార్థం ఉచిత ప్రమాణంచ రాశి సంజ్ఞం భవతి" అని చెప్పబడినది.

దేశవిషయములో హిమవంతమున బుట్టిన ఓషధులు గురుత్వమును కలిగి యుండును. మరుభూమిలో పుట్టినవి లఘుగుణములను కల్గియుండును. ఇది స్థాన విశేషమును బట్టి గురు, లాఘవ గుణవిశేషముగ తెలియవలెను.

కాలము నిత్యగము, అవస్థికము అని రెండు విధములు. దీనిలో అహో రాత్రాది కాలము నిత్యగము. బాల్యాద్యవస్థలకు సంబంధించిన కాలము అవస్థి కము.

ఆహారము నుపయోగించు మనుజుడు ఉపయోక్త అను పదముచే చెప్ప బడు చున్నాడు. ఓక సాత్మ్యము అట్టి యుపయోక్తకధీనముగా నుండును.

కాన స్వస్థ, ఆతుర భేదములను, ప్రకృతి భేదములను చక్కగ పరీక్షించి తెల్సు కొనవలెను.

మూ॥ కాలవస్తు ఋతువ్యాధ్యపేక్షో జీర్ణాజీర్ణ లక్షణశ్చ, అజీర్ణేఽపి పూర్వస్యాహారస్యా పరిణతో రస ఉత్తరేణోప సంసృజ్య మానః సర్వాన్ దోషాన్ ప్రకోప యత్యాశు, జీర్ణేతు స్వస్థానస్థేషు దోషేషు వాతానులోమ్యాదుత్సృ ష్టేషు మూత్ర పురీష వేగేషు విశుద్ధేషూద్గార హృదయస్రోతో ముఖేషు విశద కరణే లఘుని శరీరేఽగ్నావుదీర్ణే జాతాయాం బుభుక్షాయాం అభ్యవహృత మన్నమప్రదూష యద్దోషానాయుర్బలవర్ణానభివర్ధయతి, కేవలమయ మేవ కాలో భోజనస్య.

ప్రతిపదార్థము : కాలస్తు=కాలమైతే, ఋతువ్యాధ్యపేక్షః = ఋతు వ్యాధ్యపేక్షయని, జీర్ణాజీర్ణ లక్షణశ్చ = జీర్ణాజీర్ణలక్షణమనియు, అజీర్ణేహి= అజీర్ణమునందైతే, పూర్వస్యాహారస్య=ముందు భుజించిన ఆహారముయొక్క, పరిణతః=పరిణామము వలనకల్గిన, రసః = రసము, ఉత్తరేణ=తరువాత భుజించిన అపక్వఆహారరసముతో, సంసృజ్యమానః=కలపబడినదై, సర్వాన్ = సమస్తమైన, దోషాన్=దోషములను,ఆశు=శీఘ్రముగా, ప్రకోపయతి=ప్రకో పింపచేయుచున్నది, జీర్ణేతు = జీర్ణలక్షణములతో కూడి యుండువాని యందైతే, స్వస్థానస్థేషు = నిజనివాసముల యందున్న, దోషేషు= దోషములుండగ, వాతా నులోమ్యాత్=వాతము అనులోమముగ సంచరించుచుండుటవలన, మూత్రపురీష వేగేషు = మూత్రపురీషములయొక్క వేగములు, ఉత్సృష్టేషు=వదలిపెట్టినవగు చుండగ, ఉద్గారహృదయస్రోతో ముఖేషు= త్రేనుపులు హృదయముస్రోతోముఖ ములు, విశుద్ధే = పరిశుద్ధముగ నుండగ, విశదకరణే = ఇంద్రియములు నిర్మలములుగనుండగ, లఘునిశరీరే=శరీరముతేలికగనుండగ, ఉదీర్ణేఅగ్నే = జాఠరఅగ్ని ప్రజ్వరిల్లు చుండగ, బుభుక్షాయాం జాతాయామ్ = ఆకలిపుట్టు చుండగ, అభ్యవహృతం అన్నమ్=చేయబడిన ఆహారము. దోషాన్ = దోషము లను, అప్రదూషత్=వికృతిని చెందింపక, ఆయుర్బలవర్ణాన్ = జీవితమును, శరీరబలమును, శరీరవర్ణమును; అభివర్ధయతి = మిక్కిలి వృద్ధిని పొందించునది, కేవలం = ప్రధానముగ, భోజనమునకు, అయమేవకాలః=ఇదియేసమయము.

తాత్పర్యము : ఆహార పానీయాదుల కుపయోగార్హ మగు కాలము రెండు విధములుగ విభజింపబడినది. 1. ఋతువ్యాధ్యపేక్ష. 2. జీర్ణాజీర్ణ లక్షణము. అన్నపానముల ఉపయోగార్హ కాలములుగా విభజింప బడిన పై రెండునూ ఋతువ్యాధులనపేక్షించు వైద్యుడు సుగమముగ ఆరోగ్య వంతునికి అనారోగ్యవంతునికి విధించు ఆహారపానములకొరకు చెప్పబడినవి ఆరోగ్యవంతుడు ఏఋతువులో యే యే ఆహారపానీయముల సేవించవలయు. ననెడి నియమమును యే ఆహారపానీయములను త్యజించ వలయుననెడి నిషేధ మును ఋతు విభాగము తెలియచేయును, యే యే వ్యాధులలో యే యే

ఆహారపానీయములు హితములు, లేక అహితములు అని తెలియచేయునది వ్యాధ్యాపేక్షకాగలదు. ఋతువిభాగము, స్వస్థవృత్తము, కొఱకే నిర్దేశింప బడినది. కాని శరదృతువులోకల్లు కఫజ వికారములలో దానికి విపరీతమైనప్పటి కిని ఎక్కువ తీక్ష్ణ ఉష్ణ గుణములుగల పదార్థములను సేవించరాదు. "పిత్తం శరదికుప్యతి" అను వాక్యమునుబట్టి శరదృతువు పిత్తముయొక్క ప్రకోప కాలముకాన తీక్ష్ణగుణ ఉష్ణగుణ ములుగల పదార్థములసేవనవలన పిత్తము ప్రకో పించుప్రమాద మేర్పడును. అందువలన ఋతువిభాగమందు స్వభావసిద్ధమైన దోష ప్రకోపములను గూడ గుర్తించ వలెను. జీర్ణాజీర్ణలక్షణములతో కూడినకాలము రెండవది. ఏ కాలమునందు చేయబడిన ఆహారము చక్కగ పచనమగు చున్నదో ఆకాలమును జీర్ణ లక్షణములు గలకాలమని పేర్కొన బడినది. ఏకా లము నందుచేయబడిన ఆహారము సరిగా పచింపబడదో లేక జీర్ణముకాదో దానిని అజీర్ణలక్షణములుగలకాలముగాచెప్పుచున్నారు. కాలనిర్దేశమునందునూ స్వస్థఆతు రులను సమక్షమునందిడుకొనియే చెప్పినట్లు కనపడుచున్నది. ఎట్లనగా,సమాగ్ని గల ఆరోగ్యవంతుడుచేసిన విధివిహితమైన ఆహారము సకాలములో పాకము చెంది ధాతువృద్ధి కది దోహదకారి యగుచున్నది. ఆరోగ్యమును వృద్ధిచేయు చున్నది. విషమాగ్నితోకూడిన మానవుడు భుజించిన ఆహారము సరియగు సమయమున చక్కగ పక్వము చెందక ఆమరూపమును దాల్చి అనేక వికారము లను బుట్టించును, మరియు మందాగ్నికల మానవుడు ముందు దినమున చేసిన సకాల భోజనము మరుసటి రోజువరకు అపక్వమై యుండగా (ఆమరసము) మరల మరుసటి దినమునచేసిన భోజనరసముతో (ఆహార రసముతో) కలిసి వెంటనే అన్ని దోషములను ప్రకోపింప చేయును. ముందు దినముచేసిన ఆహా రము చక్కగ జీర్ణింప చేయ బడినదై, వాత పిత్తశ్లేష్మలు తమతమ నియమ ముల యందుండగ, వాతమనులోమముగ సంచరించుచుండగ, మల మూత్ర ముల ప్రకృతి చక్కగ నుండగ, ఉద్గారశుద్ధి హృదయశుద్ధి ఏర్పడినపుడు స్రోత స్సులు శుద్ధిగనున్నపుడు ఇంద్రియములు ప్రసన్నములుగ నున్నపుడు శరీరము లఘువుగ నున్నపుడు జాఠరాగ్ని జాగ్రదవస్థలో నుండగ చక్కగ ఆకలియగు నపుడు భుజించిన భోజనము దోషములకు పటుత్వము కల్గించక జీవితమును బల మును వర్ణమును వృద్ధిపరచును. భుజించుటకిదియే సరియైన కాలముగ నిర్ణ యింపబడినది.

*శశిలేఖ* : కాలము రెండు విధములుగ అన్నపానముల నుపయోగించు యోగ్యతను పొందుచున్నది. ఋతువ్యాధ్యపేక్ష, జీర్ణాజీర్ణలక్షణమని, ఈ రెంటిలో పానీయములు మాత్రమే హితకరమని చెప్పబడినవి. వ్యాధినిబట్టి ఈ లక్షణములతోకూడిన వ్యాధియందు వ్యాధ్యవస్థలందు ఇట్టి ఆహారము తగిన దని చెప్పబడినది ఎట్లనగ జ్వరమునందు గోక్షీరముచితమైనది. అట్లుకాని పక్షమున వ్యాధిగ్రస్తునికి కూడ ఋతువునుబట్టి ఆహారనియమము విధినిబట్టి

కలదు. ఎట్లనగ శ్లేష్మము వలన కల్గినవ్యాధి అయినప్పటికిని శరదృతువునందు కఫమునకు విరుద్ధమైన తీక్ష్ణ, ఉష్ణ గుణములుగల పదార్థములు ఉపయోగార్హములుకావు. ఎందుకనగ శరదృతువునందు పిత్తము ప్రకోపించును. అందువలన తీక్ష్ణ ఉష్ణగుణములు పిత్త వర్ధకములు. ఆరోగ్య అనారోగ్యవంతులైన ఉభయులకు జీర్ణాజీర్ణలక్షణములు వివరింపబడు చున్నవి. ఆహారము జీర్ణముకాని వానికి అన్నముచేత ఆహారపరిమాణరూపమైన సారముచేత ద్వైవిధ్యము ప్రదర్శింపబడినది. అన్నము జీర్ణముకాని యెడల ఆహారమునందిచ్ఛకలుగదు. ఆహారసారభూతమైన అజీర్ణము తరువాతి దినమున భుజించిన ఆహారరసముతో కల్సి ఆమరసముతో పూయబడిన స్రోతో మార్గములయొక్క అవరోధముతో వాతాదులకు వెంటనే ప్రకోపమేర్పడును. ఆహారము సరియగు సమయమున జీర్ణమైన యెడల దోషములన్నియూ స్వస్థానములందుండి భుజించిన అన్నము దోషములను ప్రకోపింపచేయక ఆయుస్సు, బలము, వర్ణములను వృద్ధి చేయును.

సూ॥ అతీతకాలం పునస్తద్వాతవిష్టబ్ధం కృచ్ఛ్రాద్విపచ్యతే కర్శయత్యన్న రుచించ పునరుపహన్తి। ఉపయోగ వ్యవస్థాతు నాస్నాతో నదిగ్వావాసా నైక వస్త్రధృక్ న మలినవసనో నాహుత్వాన జపిత్వానానిరుప్య దేవతాభ్యః నపితృభ్యోనదత్వాగ్ర మన్నగ్నయే నగురుభ్యో నాతిథయే నాభ్యాగతేభ్యోనశ్వ వయః శ్వపచేభ్యః ప్రత్యవేక్ష్య చాశ్రితో పాశ్రితానపి తిరశ్చోఽపిస్వ పరిగృహీతాన్ ప్రశస్త దేశకాలోపకరణయుక్తః స్రగ్వీ విభూషితః సుగన్ధిరార్ద్రపాణిపాదః సువిశుద్ధ వదనోఽభిమతసహః కేశమక్షికాద్య నుపజుష్టమనింద్యమనిందన్ననిన్దిత మపునరుష్ణీ కృతంనాత్యుష్ణ మనుపదగ్ధం సుసిద్ధమలోలోనా సాత్మ్యం నావిదితం నావిదితాగమం నాతి సాయం నాతి ప్రగే నాకాశే నాతపే నాన్ధకారే నాథోవృక్షస్యనశయ్యా స్థోనోన్నమ్య ప్రదేశినీం నపాత్రేభిన్నే నాసంవృతే నమలినే భావధూపితేవా నచాసనస్థితే న హస్తస్థే నహస్తే ప్రాఙ్ముఖః సుమనాః శుచిభక్తాక్షుధితానుకూల జనోపహితం హితమన్నమశ్నీయాత్। నపర్యుషిత మన్యత్ర మాంసోపదంశభక్ష్యేభ్యః। నాశేష మన్యత్ర దధిమధు ఘృత సలిల సక్తు శుక్త పాయ పేభ్యోఽపిచ। స్నిగ్ధంలఘూష్ణ మవిళంబిత మనతి ద్రుతమజల్పన్న హసం స్తన్మనాః సమీక్ష్యసమ్యగాత్మానమ్।

ప్రతిపదార్థము: అతీత కాలంపునః = కాలము నతిక్రమించి చేసినదైతే తత్ = ఆభోజనము. వాత విష్టబ్ధమ్ = వాతముచేత స్తంభింప చేయబడినదై, కృచ్ఛ్రాత్ = అతికష్టముగ, విపచ్యతే = పచింపజేయబడుచున్నది. అన్నరుచిం = ఆహారము యొక్క రుచిని, కర్శయతి = తగ్గించుచున్నది, పునః = తిరిగి, ఉపహన్తి = నశింపచేయు చున్నది. ఉపయోగ వ్యవస్థాతు = ఆహారమును చేయుటకు పద్ధతియయితే, అస్నాతం = స్నానముచేయక, నదిగ్వాసా = వస్త్రమును ధరింపక, నైక వస్త్ర ధృక్ = ఒకే వస్త్రమును ధరించియు, నమలినవసనః = మాసిన గుడ్డలను కట్టుకొని, నాహుత్వా = అగ్నియందు హవనము చేయక, నజపిత్వా = గాయత్రీ మంత్ర

మును, మొ॥ దేవతలను స్మరించక, నానిరుప్య దేవతాభ్యః = దేవతలను గురించి సంకల్పము చేయక, నపితృభ్యః = పితృదేవతల నుద్దేశించి సంకల్పించక, నదత్వా అగ్రమన్నం అగ్నయే = వ్యంజనసహితమైన అన్నమును మొదట అగ్నికి ఇవ్వక (అనగా కొద్ది కొద్దిగ అన్నమును అగ్నికి ఆహుతికి చేయక), నగురుభ్యః = గురువులకు సమర్పించక, నాతిథవే = వచ్చిన అతిధికి సమర్పించక, నాభ్యాగతేభ్యః = ఎదురెక్కి వచ్చిన వారిని తృప్తిపరుపక, అభ్యాగతేభ్యః = హఠాత్తుగా ఎదురుగా వచ్చిన, శ్వవయశ్వపచేభ్యః = కుక్కలు, చండాలురు, పశులు మొదలగు వారిని తృప్తిపరుపక, ఆశ్రితో పాశ్రితానపి = తనను కొలుచువారైన భృత్యబాంధవాదులను తన నాశ్రయించిన వారి ఆశ్రితులను, తిర శ్చోపి = గోవులు మొదలగు పవిత్రమైన జంతువులనుగూడ, స్వపరిగృహీతాన్ = తనకిష్టులైనవారికి, ప్రత్యవేక్ష్య = పరామర్శించి, (అనగ వీరందరి భోజనాదులచే తృప్తిపరచి, హితం = పథ్యకరమైన అన్నం = అన్నమును, అశ్నీయాత్ = భుజించవలెను.

ప్రశస్త దేశకాలోప కరణయుక్తః = పరిశుభ్రమైన ప్రదేశము విధివిహితమై భోజనము చేయుటకు ప్రశస్తమైనకాలము, భోజనమునకు కావలసిన శ్రేష్టమైన శుభ్రమైన సామగ్రితో కూడినవాడై, స్రగ్వీ = మాలలు ధరించినవాడై, విభూషితః = రత్నాదులతో అలంకారము చేసుకొనినవాడై, సుగంధి = మంచిగంధములను పూసుకున్నవాడై, ఆర్ద్రపాణిపాదః = చేతులను, పాదములను కడుగుకొనినవాడై; సువిశుద్ధవదనః = నీళ్ళతో చక్కగా ముఖమును శుభ్రపరచు కొననవాడై, అభిమత సహాయః = తనకిష్టులైన వారితోకూడి కొన్నవాడై, హితం = పథ్యకరమైన, అన్నమ్ = అన్నమును, అశ్నీయాత్ = భుజించవలెను, తత్ = ఆ అన్నము, కేశ మక్షికాద్యనుపజుష్టమ్ = వెంట్రుకలు, ఈగలు మొదలగునటు వంటివి పడనట్టిది, అనింద్యమపి = గర్హితమైనప్పటికిని ఆహారమును నిందించక, అనిందితమ్ = ఎవ్వనిచేత నిందింపబడనట్టి అన్నమును, అపునరుష్ణీకృతమ్ = మరల వేడి చేయనిదానిని, నాత్యుష్ణమ్ = ఎక్కువ వేడిలేనిదానిని, అనుపదగ్ధమ్ = ఏ ఆహారమైతే అగ్ని తప్తముకాదో, సుసిద్ధమ్ = చక్కగా పాకము చేయబడిన, అలోలః = తన ప్రకృతికి హాని చేయక యుండునటు వంటిది, నాసాత్మ్యమ్ = తనకు సాత్మ్యము కానిది, నావిదితమ్ = గుణ, అవగుణములు తెలిసినదికాదో, నావిదితాతఘ్నమ్ = శాస్త్రమునందు ఏదైతే నిషేధింపబడలేదో, నాతిసాయమ్ = సాయంకాల ప్రారంభమునందు, నాతిప్రగే = ప్రాతఃకాలముయొక్క ఆరంభమునందు, నాకాశే = బయట ప్రదేశమునందు, నాతపే = ఎండనందు, నాంధకారే = చీకటియందు, నాధోవృక్షస్య = చెట్టుయొక్క క్రింద, నశయ్యాస్త = పరుపుమీదకూర్చుండి, అన్నమ్ = అన్నమును, నాశ్నీయాత్ = తినకూడదు. నాన్నయ్యాప్రదేశినీమ్ = రెండవ్రవేలిని నిటారుగయుంచి భోజనము చేయరాదు, నపాత్రభిన్నే = పగిలిన కంచములో భోజనము చేయరాదు, నా సంవృత్ = వెడల్పుగా

లేని పాత్రయందు తినరాదు, భావదూషితేవ = దుష్టముకానిదై నప్పటికిని దుష్టముగా భావింపబడిన అన్నమును తినరాదు, నచాసనస్థితే=పీటపైన చేతి నుంచి తినరాదు, నహస్తస్థే=చేతియందు భోజన పాత్రనుంచుకొని తినరాదు, నహస్తే=చేతిలో భోజనము చేయరాదు, ప్రాఙ్ముఖః = తూర్పుదిక్కుగ ముఖము కలవాడై, సుమనః = ప్రసన్నమైన మనస్సుతో పవిత్రమైనవాడై, శుచిభక్తాక్షుధితానుకూల జనోపహితమ్=పవిత్రమైన ఆకలి లేనటునంటి తనకు అనుకూలురుగా నున్నటువంటి జనములతో కూడు కొన్నటువంటివాడై, హితమ్=పథ్యకరమైన, అన్నమ్=అన్నమును, అశ్నీయాత్ = తినవలెను, పర్యూషితమ్=వెనుకటి దినమందలి చద్ది అన్నమును, నాశ్నీయాత్=తినరాదు, అన్యత్రమాంసోపదంశ భక్ష్యేభ్యః = మాంసమును, పండ్లతోనమిలి తిను పదార్థములను భక్ష్యాదులను వదలిపెట్టి ఇతరములను తినవలెను, దధి, మధు, ఘృత, సలిల, సక్తు, శుక్త, పాయసేభ్యోఽపి = పెరుగు, తేనె, నెయ్యి, నీరు, పిండి పదార్థములు, పులిసిన పదార్థములు, పాయసములు వీటన్నింటికంటెను, అన్యత్రా=విడిచి, అశేషమ్ = మిగల్చకుండా, నాశ్నీయాత్=తినకూడదు, స్నిగ్ధమ్ = స్నిగ్ధమైనది. లఘూష్ణమ్=కొంచెము వేడిఅయినది, అవిలంబితమ్= ఆలస్యము చేయనిది, అనతిధృతమ్=త్వరగా చేయనిది, అజల్పన్ =మాట్లాడ కుండా, అహసన్=నవ్వకుండా, సమ్యక్ = బాగుగా, ఆత్మానం=తనను, సమీక్ష్య=బాగుగా పరిశీలించుకొని, తన్మనాః=అన్నమునందే మనసును లగ్నము చేసినవాడై, హితమ్=పథ్యకరమైన, అన్నమ్ =అన్నమును, అశ్నీయాత్ = భుజించవలెను.

**తాత్పర్యము :** ఆహారపదార్థములయొక్క ఉపయోగమును ఇచట వర్ణించు చున్నాడు. ఆహారపదార్థములను ఎట్లు ఉపయోగించవలెను. ఆహారముసు సేవించునపుడు నిషేధించవలసినవేవి, అను విషయమును ఇచట వ్యాఖ్యానముచేయుచున్నారు. స్నానము చేయక భుజించరాదు. శుభ్రమయిన వస్త్రములను ధరింపక భుజింపరాదు. మలిన వస్త్రములను ధరించి భుజించరాదు. ఈశ్వరుని స్మరించక భుజించరాదు. అన్నములో కొంత భాగమును అగ్నికి ఆహుతి చేయక భుజించరాదు. గురువులకు బంధువులకు సమయమునకు వచ్చిన అతిథులకు, పిలువకయే వచ్చిన అభ్యాగతులకు, శ్వాన, పక్షి, ఛండాలురు మొద అగు వారికి ఆహారమును అర్పించిన తరువాతనే తాను భుజించవలెను. తనను ఆశ్రయించిన వారిని తనకాశ్రితులైనవారిని ఆశ్రయించినవారికిని తన ఆశ్రయములోనున్న అవు, గుర్రము మొదలగు జంతువులను, తన ఆత్మీయులను మొదట భోజనముతో తృప్తిపరుపవలెను. తరువాతనే తాను భుజించవలెను.

భుజించు ప్రదేశము మిక్కిలి పరిశుభ్రముగా నుండవలెను. శాస్త్రమునందు నియమితమైన కాలమునందే భుజించ వలయును. మరియు భోజనసమయ

మున భోజనమున కుపయోగించు పాత్రసామగ్రి అంతయుపరిశుభ్రముగా నుండ వలయును. ఇట్టి ప్రదేశములో తాను హస్తప్రక్షాళనమును, పాదప్రక్షాళనమును, ముఖప్రక్షాళనమును బాగుగా చేసికొని వాటిని శుభ్రపరచి సుగంధభరితమైన పుష్పమాలికలను ధరించినవాడై, ముత్యములు, వజ్రములు, రత్నములతో చెక్కిన బంగారు ఆభరణములచే అలంకృతుడై సుగంధద్రవ్యములు ఆప్రదేశము నందంతయూ గుబాళించుచుండగా తాను తనకు అనుకూలురై సంచరించు ఆత్మీయులతో కలిసి అన్నపానములను చేయవలెను. ఆ అన్న పానములు వెంట్రుకలు ఈగలు దోమలు మొదలగువాని స్పర్శలేనిదిగా నుండవలెను. ఆహారమును చూచిన వెంటనే మాంసము మొదలగు గర్హిత భావము కలుగ కుండు నదిగా నుండవలెను. ఆహారమును నిందించుచు భుజింపరాదు. ప్రాణస్వరూప మైనది అన్నము గనుక పరిశుద్ధమయిన, చక్కగా సిద్ధము చేయబడిన ఆహారము నందు, ఎప్పుడునూ దోషముల నెత్తి చూపరాదు. తనహృదయమునందు ఎంత అశాంతియున్ననూ భోజనముచేయు సమయమున శాంత మనస్కుడై భుజించ వలెను. మరియు చల్లారి పోయిన ఆహారపదార్థములను మరల వేడి చేయరాదు. ఎక్కువ వేడిగానున్న పదార్థములను భుజింపరాదు. ఆహారము బాగుగా పాకము కానియెడల ఆ అపక్వమయిన ఆహారమును భుజించరాదు. తన ప్రకృతికి హానిని కలిగించు ఆహారమును భుజించరాదు. ఆహారపదార్థములయందలి గుణ ములు శాస్త్రముతో ఆమోదింపబడినవై యుండవలెను. అనగా ఆ ఆహార పదార్థములు ఋతువులచే అనింద్యములుగా నుండవలెను. ఉదయ ప్రారంభ మున సాయంకాలమునందు భోజనము చేయరాదు. ఆవరణములేని ప్రదేశమున కూర్చుండి భుజించరాదు. తర్జనిని నిటారుగా నుంచి భుజించరాదు. పగిలిన, వెడల్పుగాలేని పాత్రలో భుజించరాదు. అశుద్ధమయిన పాత్రలో భుజింప రాదు. తాను కూర్చుండు పీటపైన చేతులనుంచియూ, చేతిలో భోజనపాత్ర నుంచుకొనియూ, చేతిలోనికి ఆహారమును తీసుకొనియూ ఆహారమును భుజింప రాదు. పూర్వాభిముఖుడై, ప్రసన్నేంద్రియమనస్కుడై, పవిత్ర భావన కల తన కనుకూలురైన పరిజనులతో కూడుకొన్నవాడై, హితకరమయిన అన్న మును భుజించవలయును. మాంసము, దంతములతో నమిలి తిను భక్ష్యములను వదిలిపెట్టి, ఫలాదులను వదిలిపెట్టి చద్ది అన్నమును మరురోజు భుజించకూడదు. పెరుగు, తేనె, నెయ్యి, నీళ్ళు, సత్తు, శుక్తము, పాలతో తయారుచేసిన పదా ర్థములను కొంచెమయిననూ శేషమును వదిలిపెట్టియే తినవలెను. వ్యవధానము లేకుండగనూ, త్వరపడిగాని, మెల్లగాగాని మాట్లాడుచూ నవ్వుచూ భోజనమును భుజించరాదు. ఆహారము హితకరమైనది, అహితమును చేయునది, దోషభూయిష్ఠ మయినది అను ఆహారమునందలి గుణాగుణావిచారణముచేసి స్నిగ్ధ, ఉష్ణ, లఘు గుణములు కలిగిన ఆహారపానీయములను నియమములను పాటించుచూ తదేక మనస్కుడై భుజించవలెను.

*శశిలేఖ* : జీర్ణలక్షణములతో కూడిన ఆహారకాల మతిక్రమించిన దగు చుండగా ఆహార విధి, ఆహార ఉపయోగ నియమము చెప్పబడుచున్నది. వస్త్రము ధరించక భుజించరాదు. మంత్రపూర్వకముగ తిలఘృతాదులచేత అగ్నికి ఆహుతులనియ్యక భుజింపరాదు. జపముచేయక భుజింపరాదు. దేవతలకు సంకల్ప పూర్వకముగ ఆహారమును వేదించక తాను భుజింపరాదు. ఎంగిలి కాని ఆహార పదార్థములన్నిటినుండి కొంచెము కొంచెము మొదట అగ్నికి ఆహుతిచేసిన తదు పరియే భుజించవలెను. కాకతాళీయముగా భోజనము కొరకు వచ్చిన అతిథులకు తన ఇంటికి యేదో ఒక కారణము చేత వచ్చిన బంధువులు మొదలగువారిని, పక్షులను కుక్కలను చండాలురను భోజనాదులచేత తృప్తిపరచి యేతాను భుజింప వలయును. తనను ఆశ్రయించిన వారిని ఆశ్రితులను ఆశ్రయించిన వారిని తన సన్నిధానమునందున్న గోవులను గుఱ్ఱములు మొదలగు వానిని ఆత్మీయులైన బంధుమిత్రాదులను భోజనాదుల చేత తృప్తి పరచియే తాను భుజింపవలయును.

తాను భుజించు ప్రదేశము పరిశుభ్రముగా నుండవలెను. ఆహారము నందు పయోగించు పాత్ర సామగ్రి కూడ పరిశుభ్రముగా నుండవలెను. గర్హితమైన ఆహారమును కూడ స్వయముగా తాను నిందించరాదు. ఇతరులచేత ఆ ఆహారము నిందింపబడినదై నప్పటికిని తాను భుజించునపుడు ఆ ఆహారము భుజిప రాదు. అగ్ని సంయోగమువలన ఆహారము చక్కగా పాకము చెంది యుండవలయును. ఆ ఆహారము నందలి ద్రవ్యముల యొక్క గుణాగుణములు తెల్సి యుండవలెను. కాల విభాగమునుబట్టి ఆహార పదార్థములు శాస్త్రముచేత నిందింపబడనివిగా నుండవలెను. దివారంభమునందు, దినక్షయసమయము నందు భోజనము నిషేధింపబడినది. ఇచట "ప్రగే" అను శబ్దము పూర్వా హ్ణమును సూచించునదిగా ఈ గ్రంథకర్త ప్రయోగించెను. ఎట్లు ప్రయో గింపబడెనో నాకు తెలియదు. అట్లుగాని పక్షమున మధ్యాహ్నమునందు భోజనము నిషేధింప బడినట్లు ఊహింపనగును. బయలు ప్రదేశమునందు కూర్చుండి ఆహారము భుజింపరాదు. మరియు చేతితోకూడ ఆహారమును తినరాదు. చద్దన్నమును తినరాదు. అగ్నిచేత పాకము చేయబడిన ఆహారము లలో అన్నముచేత, దంతములతో కొరికితినెడు ఆహారముతోకూడి ఫలాదు లనుచేర్చి భుజింపవలెను. ఆహారపదార్థములను భుజించునపుడు కొంచెము ఆహారమును వదలిపెట్టియే భుజింపవలెను. పెరుగు, తేనె, నెయ్యి మొదలగు వాటిని నిశ్శేషముగ భుజింపవచ్చును. స్నిగ్ధ, ఉష్ణ గుణములతో కూడిన ఆహారమును తనను తాను చక్కగ పరీక్షించుకొని ఆహారమునందేక మన స్కుడై హితకరమైన ఆహారమును భుజింపవలెను.

మూ॥ స్నిగ్ధలఘూష్ణానిః వహ్ని మౌదర్యముదీరయంతి కోష్ఠం పరిశోధ యన్తి ధాతూన్నవి కుర్వతే, క్షిప్రజ్జరయన్తి అనిలమనులోమయంతి తథాస్ని గ్ధం దృఢీకరోతీన్ద్రియాణ్యుపచినోతి శరీరమపచినోతి జరసంబలమభివర్ధయతి

వర్ణప్రసాద మభినిర్వర్తయతి। లఘుచపునః స్వభావాదిభి రన్న మప్రతి పీడ యద్దోషా నవ్యథమానం పరిణామమేతి। విపన్నమపిచాల్పదోషం భవతి। ఉష్ణంచ పునర్జనయతి రుచిముపశోషయతి శ్లేష్మాణమ్। విలంబితస్తు భుంజానోనతృప్తి మధిగచ్ఛతి, బహుచభుంక్తే శీతీభవతి చాన్నజాతమ్ విషమపాకంచభవతి। అతి ద్రుతస్తు భుంజానస్య జల్పతోహసతోఽన్యమనసోవాభవేదుస్నేహన మవ సాదనం భోజనస్యా ప్రతిష్ఠానం గుణదోష విభావనంచ॥

**ప్రతిపదార్థము :** స్నిగ్ధ లఘూష్ణానిః=ఆహారముయొక్క సిగ్ధలఘు ఉష్ణ గుణములు, ఔదార్యం వహ్నిం = జఠరాగ్నిని, ఉదీరయన్తి = వృద్ధిచేయు చున్నవి, కోష్ఠమ్ = ఉదరమును, పరిశోధయన్తి = పరిశోధించు చున్నవి, ధాతూన్నవికుర్వతే=రసాదిధాతువులను నిర్మలముగచేసి వృద్ధిచేయు చున్నవి, మరియు, దూషితములుగ చేయవు. ఊప్రంజరయన్తి=ఆహారపదార్థము లను వెంటనే జీర్ణము చేయుచున్నవి, అనిలమ్ = వాయువును, అనులో మయన్తి=అనులోమముగా సంచరింప చేయుచున్నవి, తథా=అట్లే, స్నిగ్ధం= స్నిగ్ధగుణములుగల ఆహారము, ఇంద్రియాణి=ఇన్ద్రియములను, దృఢీకరోతి= దృఢముగ చేయుచున్నవి (పటిష్టములుగ చేయుచున్నవి.), శరీరమ్=శరీరమును, ఉపచినోతి=పుష్టముగ చేయుచున్నది, జరసం=ముసలి తనమును, అపచినోతి= తొలగించించుచున్నది. బలం=బలమును, అభివర్ధయతి = మిక్కిలి వృద్ధిచేయు చున్నది, వర్ణప్రసాదం = శరీరవర్ణమును ఇన్ద్రియములకు, ప్రసన్నత్వమును, అభినిర్వర్తయతి = కల్గించుచున్నది, లఘు చపునః = లఘు గుణములు కల ఆహారమైతే, స్వభావాదిభిః = స్వభావ సంయోగ సంస్కారాదుల చేత, అన్నం=అన్నమును, దోషాన్=వాతాది దోషములను, అప్రతిపీడయత్= పీడించక, అవ్యథమానం = నిర్బాధాకరముగ. పరిణామమమేతి=జీర్ణమగుసు, (ఆహార పరిణామరూపమైన జీర్ణమును పొందుచున్నది), విపన్నమపిచ= పక్వము కానిదైనప్పటికిని. అల్పదోషం = స్వల్పదోషము కలదిగా, భవతి = అగు చున్నది, ఉష్ణంచపునః = ఉష్ణగుణములుగల ఆహారమైతే, రుచిం= ఆహారరుచిని, జనయతి = కలిగించును, శ్లేష్మాణం = కఫమును, ఉప శోషయతి = శోషింపచేయు చున్నది, విలంబితంతు=ఆగి ఆగి (మధ్య మధ్య వ్యవధానముతో), భుంజానః=భుజించువారు, తృప్తిన్=ఆహారతృప్తిని, నాతి గచ్ఛన్తి=పొందరు. బహుచ భుంక్తే=ఎక్కువగతిందురు, అన్నజాతమ్= ఆహారసముదాయము, శీతీభవతి = చల్లగ నగుచున్నది, విషమపాకంచ= మరియు విషమపాకముగ, భవతి = అగుచున్నది, అతిద్రుతంతు=త్వరాతిత్వర గనైతే, భుంజానస్య=భుజించువానికి, జల్పతః=భుజించునపుడు ఇతరులతో మాటలాడువానికి, హసతః=నవ్వువానికి, అన్యమనసోవా=అన్యమనస్కుడైన వానికి, ఉస్నేహనం=ఇతరనాడులలోనికి వెళ్ళుట, అవసాదనం=భోజనమును పచించుటలో, భోజనస్య అప్రతిష్టానమ్=భోజనముయొక్కస్థితి సరిగ లేకుండుట,

గుణదోషావిభావనం = గుణదోషములయొక్క జ్ఞానము లేకుండుట, భవతి = అగుచున్నది.

**తాత్పర్యము** : ఆహారము నందలి స్నిగ్ధ, లఘు ఉష్ణగుణములు మూడునూ జఠరాగ్నిని ఉద్దీపింపచేయును. కోష్ఠమును శుద్ధిచేయును. రసరక్తాది ధాతువులను నిర్మలములుగచేసి వాటిని వృద్ధి పరచుచున్నవి. వాటిని వికృతి చెందనీయవు. లేక దూషితములుగా చేయవు. ఆహారమును త్వరగా పచింపచేయు వాయువును అనులోమముగా సంచరింపచేయును. ఆహారమునందు ఈ మూడు గుణములను ప్రవేశపెట్టి విస్తృత రూపమైన ఈ విపులీకరణమును సమీక్షించగా వాత, పిత్త, శ్లేష్మలయొక్క సామ్యావస్తను వ్యంగ్య మర్యాదతో నిరూపించినట్లుగా ద్యోతక మగుచున్నది. ఎట్లనగాస్నిగ్ధగుణముతో కఫమును, లఘు గుణముతో వాయువును, ఉష్ణగుణముతో పిత్తమును వివక్షింప బడుచున్నవి. ఆయుర్వేదము యొక్క పరమసిద్ధాంతము దోషములయొక్క సామ్యావస్థవల్లనే శరీరవృద్ధి యగుచున్నది అని. సమన్వయరూపముగ ఈ మూడు గుణములయొక్క ఫలవర్ణనము అట్లుచేయబడినది. ఆహారమునందలి స్నిగ్ధగుణము ఇంద్రియములను బలిష్ఠములుగా చేయుచున్నది. శరీరమునకు పుష్టిని కలిగించు చున్నది. ముసలి తనమును తొలగించు చున్నది. శరీరబలమును వృద్ధిపరచు చున్నది. శరీరమునకు వర్ణమును ప్రసాదించుచున్నది.

ఆహారమునందలి లఘుగుణము స్వభావ సంయోగ, సంస్కారాదులకు కారణభూతమైన దోషములను ప్రకోపింపచేయక అన్నమును సరియైన పద్ధతిలో ఎట్టిబాధలు కలుగకుండా పచింపచేయును. ఎప్పుడైననూ బాధ ఏర్పడిన ఎడల అది స్వల్పముగా నుండును.

ఆహారమునందలి ఉష్ణగుణము ఆహారమునందు రుచిని పుట్టించును. అట్లే కఫమును శోషింప చేయును.

ఆహారమును వ్యవధానముతో (ఆగి ఆగి) చేసిన యెడల తృప్తియుండదు. మరియు ఎక్కువ అన్నమును తినును. మెల్ల మెల్లగా భోజనమును చేసిన యెడల ఆహారమంతయూ చల్లగానగును. ఇందువలన ఆహారము సమముగ పాకము చెందక విషమపాకమును చెందును. త్వరత్వరగా (అతిత్వరగా) ఆహారమును భుజించిన యెడల, ఆహారము చేయునపుడు ఇతరులతో మాట్లాడుట, నవ్వుట మొదలగు వానివలన భుజించువాని మనసు భోజనముపై యుండక ఇతర విషయములలోనికి పరుగెత్తును. ఇదియే కాక భోజనమందలి స్నిగ్ధత నశించును, ఉచితమైన ఆహారము నందలి గుణములు కూడ సన్నగిల్లును.

ఇందువలన పై కారణములతో వానికి అగ్నిమాంద్యమేర్పడును. భోజనము నందలి ద్రవ్యముయొక్క హితహితముల ను విచారించలేడు. అందువలన అభోజనము అప్రతిష్ఠపాలగును. ఇందువలన ప్రతిమానవుడున్నూ వ్యవధానము తోను, అతి త్వరగను భోజనము చేయరాదు.

స్నిగ్ధ లఘు ఉష్ణ గుణములు మూడునూ రసాది ధాతువులను నిర్మల

ములుగా చేయుట చేత వాటిని వృద్ధిపరచుటచేత వాటిని దూషితములుగా చేయవు. ఆది అసు పదమునుపయోగించుటచేత సంయోగ సంస్కారాది లఘుత్వములు గ్రహించబడినవి. లఘు గుణముఒక వేళ అపథ్యమును పొందినప్పటికిని, స్వల్ప దోషమునే చేయుచున్నది. ఉత్స్నేహనమనగా అన్నము ఇతర నాడులద్వారా వెళ్ళుట అని అర్థము. అన్యమనస్కుడై నందువలన భోజనము నందలి గుణదోషములు విచారించుటకు సాధ్యముకాదు.

**మూ॥** సమీక్ష్య సమ్యగాత్మానమితి మమేదం సాత్మ్యమిద మసాత్మ్యమితి నిత్య మప్రమత్తః ప్రత్యవేక్షేత। తత్రసాత్మ్యం నామసహాత్మనాభవత్యభ్యస్తంతదౌచిత్యాదుపశేత ఇత్యేకే। సాత్మ్యవిపరీతమనుపశయాదసాత్మ్యమ్। అన్యే పునః ప్రకృతి వయోదేశర్తు దోషవ్యాధి వశేన సాత్మ్యం బహువిధమిచ్ఛన్తి। తేహ్యుపశయ మాత్రమంగీకృత్య విపరీతగుణ మప్యుపచారేణ సాత్మ్య మాచక్షతే। తుల్యగుణం చానుపశయాదసాత్మ్యమ్। సాత్మ్యంతు ప్రవరా వర మధ్య విభాగేన త్రివిధమ్। తత్రసర్వరసం ప్రవర మేకరసంమధ్యంతు మధ్యమయేవ। తేషు ప్రవరం సమదోషస్యాపదిశం తీతి। ఇతరేషామపి క్రమేణ సాత్మ్యమపి చాహితం పాదేన పాదాంశేనవా వివర్జయే దిత్యుక్తం ప్రాక్। తత్ర యదాహారజాతం సమధాతూనసువర్తయతి విషమాంశ్చ సమీకరోతి తత్సమాసతో హితం। విపరీత మహితమ్। తత్పునర్మాత్రాయోగాది వైచిత్ర్యాదనియత మపి యథోపదేశం యథాభూయిష్ఠంచ శీలయేత్ పరిహరేచ।

**ప్రతిపదార్థము :** ఆత్మానం=ఆత్మను (తనకు సంబంధించిన సమస్త విషయములను), సమ్యక్ = బాగుగ, సమీక్ష్య = చూచి, (భుజించవలెను.) మమ=నాకు, ఇదం=ఈభోజనము, సాత్మ్యమ్=అనుకూలమైనది, చ=మరియు, మమ=నాకు, ఇదం = ఈ ఆహారము, అసాత్మ్యమ్ = అనుకూలమైనదికాదు, ఇతి=అని, నిత్యం = ప్రతిదినమును, అప్రమత్తః = జాగరూకుడై, ప్రత్యవేక్షేత = చూడవలయును, తత్ర=సాత్మ్య, అసాత్మ్యములలో, సాత్మ్యంనామ= సాత్మ్యము అనగ, ఆత్మనాసహ = అభ్యసించుటకు కారణభూతమైన ఆత్మతో కూడ, భవత్ =ఉంటున్నది, అతః = ఇందువలన, తదౌచిత్యాత్ =శరీరమునందు అభ్యసించుట వలన, ఉపశేతఇతి = సుఖమును పొందినదగుచున్నది. సాత్మ్య విపరీతమ్ = సాత్మ్యమునకు విపరీతమైనది, అనుపపాతశయా సాత్మ్యమ్=అనుకూలములే నందున అసాత్మ్యము, ఇతి=అని, ఏకే=కొందఱు, భాషన్తే= చెప్పుచున్నారు, అన్యేపునః=మరి కొందరు, ప్రకృతి వయోదేశర్తు దోషవ్యాధి వశేన=ప్రకృతి, వయస్సు, దేశము, ఋతువు, దోషములు వ్యాధిబేధముచేత, సాత్మ్యం=సాత్మ్యము, బహువిధమ్=అనేక విధములుగ, ఇచ్ఛంతి=తలంచుచున్నారు, తేహి=వారయితే, ఉపశయ మాత్రం=అభ్యాసమునందు యుండుట మాత్రమే, అంగీకృత్య = అంగీకరించి, విపరీత గుణమపి=విపరీతమైన గుణమును గలిగియున్న, ఉపచారేణ=అభ్యాసముచేత, సాత్మ్యమ్=సాత్మ్యముగ,

ఆచక్షతే = చెప్పుచున్నారు. అనుపశయాత్ = అభ్యాసము కాని వానితో, తుల్యగుణం = సమానమైన గుణము, అసాత్మ్యమ్ = అసాత్మ్యముగ, భవతి = అగుచున్నది.

సాత్మ్యంతు = సాత్మ్యమయితే, ప్రవరావరమధ్య విభాగేన = ప్రవర, అవర మధ్య భేదములతో, త్రివిధమ్ = మూడు విధనులు, తత్ర = ఆమూడు విధములలో, సర్వరసం = షడ్రసములు సాత్మ్యమైన, ప్రవరమ్ = ప్రవర సాత్మ్యమ నియు, ఏకరసమ్ = ఒకేరసము సాత్మ్యమైన, అవరమ్ = అవరసాత్మ్యమనియు, మధ్యంతు = మధ్యనుండురసములు సాత్మ్యమైన, మధ్యమమేవ = మధ్యమ సాత్మ్యముగనే, భవంతి = అగు చున్నది.

తేషు = ఆ ప్రవర అవర మధ్యమ సాత్మ్య(ప్రకృతి) ములలో, ప్రవరం = ప్ర వరసాత్మ్యము, సమదోషస్య = సమదోషప్రకృతిని, ఉపదిశన్తి = చెప్పు చున్నారు. ఇతరేషామపి = మిగిలిన వాటిలోను, అహితం = హితముకాని, సాత్మ్యమపి = సాత్మ్యమునుకూడ, క్రమేణ = క్రమముగ (శాస్త్రవిధిననుసరించి), పాదేన = చతుర్థాంశముతో, పాదాంశేనవా = తేక పదహారవ (16వ) భాగ ముతో, వివర్జయేదితి = వదిలిపెట్టవలెననియు, ప్రాక్ = పూర్వము, ఉక్తమ్ = చెప్పబడినది.

తత్ర = ఆమూడింటిలో, యదాహారజాతమ్ = యే ఆహారసమూహము, సమాన్ధాతూన్ = సమస్థితిలోనున్న ధాతువులను, అనువర్తయతి = అను సరించు చున్నదో, విషమాంశ్చ = విషమములుగా నున్న ధాతువులను, సమీకరోతి = సమానముగ చేయుచున్నదో, తత్ = ఆ ఆహారసమూహమును, సమాసతః = సంక్షేపముగ, హితకు = పథ్యమైనది. విపరీతమ్ = దీనికి విపరీతమైనది, అహితమ్ = పథ్యమైనదికాదు, తత్పునః = హితాహితరూపమైన ఆహారమైతే, మాత్రా యోగాదివైచిత్ర్యాత్ = ఆహారపరిమాణము, ఆహారాదులయొక్క సంయోగా దులయొక్క భిన్నతవలన, అని యత మపి = నియమము కాని దైనప్పటికిని, యథోపదేశమ్ = శాస్త్రము ననుసరించి, యథాభూయిష్ఠమ్ = యేది శాస్త్ర మునకంటె ఆధిక్యతను కలిగి యుండునో, శీలయేత్ = దానిననుసరించ వలెను, పరిహరేచ్ఛ = వదలిపెట్ట వలయును.

**ప్రతిపదార్థము** : తన ఆత్మను మిక్కిలి శ్రద్ధగ పరిశీలించి ఈ రసగుణ వీర్యవిపాకాదులతో కూడిన ద్రవ్యముల పరికల్పనగల ఆహారములను సాత్మ్యా సాత్మ్య విభాగముతో నిత్యమును పరీక్షించి ఇట్టి ఆహారసముదాయము నాకు అనుకూల మైనది, ఇట్టి ఆహారసముదాయము నాకు వికృతిని కల్గించునది అని ప్రతిదినమును తెలుసుకొనవలయును.

నిత్యాభ్యాస వశమున తన ఆత్మతో నిత్యసంబంధముగల ఆహారము సాత్మ్యమనియు ఓకసాత్మ్యమనియునుగూడ చెప్పుచున్నారు. తనకనుకూలము లముగాని ఆహారము అసాత్మ్యము అని చెప్పుచున్నారు.

మరికొందఱువైద్యులు ప్రకృతి సాత్మ్యము, వయస్సాత్మ్యము దేశ సాత్మ్యము, ఋతు సాత్మ్యము, దోషసాత్మ్యము, వ్యాధి సాత్మ్యము అను విభాగముచేత సాత్మ్యము అనేక విధములని తలంచుచున్నారు. కొందరు అనుకూలమైన మాత్రను, అట్టిమాత్రా పరిమాణ ఆహార ఉపయోగమును బట్టి విపరీత గుణములుగల ద్రవ్యములనుకూడ సాత్మ్యముగ చెప్పుచున్నారు. అభ్యసించుటకు వీలుకాని వాటితో యేవస్తువులైతే సమానగుణములు గలిగి యుండునో అవి అసాత్మ్యములుగ నున్నవి. ఉదాహరణముగ శీతజ్వరమునందు ఉష్ణగుణముతో కూడికొనిన ద్రవ్యము విపరీతమైన దైనప్పటికిని చికిత్సా దృష్టితో అది అనుకూలమైనందున సాత్మ్యముగ నగును. ఈ శీతజ్వరమునందే అనుకూలమైన శీతగుణములుగల ద్రవ్యము సమాన గుణము గలదైనప్పటికిని అసాత్మ్యము అగుచున్నది.

ప్రవరము, అవరము, మధ్యమను అని సాత్మ్యము మూడు విధములు. ఈ మూడింటిలో నిత్యాభ్యాసమున రసములన్నియు సాత్మ్యములుగానున్న యెడల అది ప్రవరసాత్మ్యము అని చెప్పబడును. ఒకేరసము సాత్మ్యమైన అవర సాత్మ్యమనియు, రెండు మూడు రసములు సాత్మ్యములైన మధ్యమ సాత్మ్యమనియు చెప్పుదురు.

వీటిలో ప్రవర సాత్మ్యమువాతపిత్త శ్లేష్మలను సమస్థితిలో నుంచును. శరీరమునకుకీడుచేయు ఆహారపదార్థముల త్యజించ దలచిన మానవుడు అహితముచేయు సాత్మ్యమైనప్పటికిని క్రమముగ పాదభాగముగగాని షోడశభాగముగాగాని వదలిపెట్టవలయును. ఒకే పర్యాయము అభ్యాసముచేయుపదార్థములను, వదలిపెట్టదలంచు అహారవిహారములను వదలిపెట్టగూడదు. అట్లు ఒకే పర్యాయము ఆహారవిహారములను వదిలివేసిన యెడల శరీరమునకు వికృతులు సంభవించును. ఏ ఆహారరాశిని నిత్యాభ్యాసములో అభ్యసించు చున్నాడో మానవుడిలో, ఆ ఆహారాదులవలన ధాతువులన్నిటికి సమస్థితి యేర్పడవలెను. మరియు వైషమ్యములైన, దూషితములైన ధాతువులకుకూడ సమస్థితిని చేకూర్చవలెను. సంక్షేపముగా అట్టి ఆహారాదులు హితకరమైననవిగా నుండును. ఇందుకు విపరీతములైన ఆహారములు అహితములుగా నిర్దేశింపబడినవి. శాస్త్రమునందుపదేశింపబడిన విధి అనుసారము హిత, అహితములైన ఆహారాదులయొక్క మాత్రయు, వాటి పరికల్పనము భిన్నములు గానుండుటవలన లోకమునందలి పరిపాటి ననుసరించి నిత్యాభ్యాసమున తనకు ఏర్పడిన సత్ఫలితములను బట్టి హితములైనఆహారములను ఎల్లపుడు మానవుడు సేవించ వలెను. అట్లే అహితములైన ఆహారవిహారములను విడిచి పెట్ట వలయును.

*శశిలేఖ*: బాగుగ తనను తాను పరీక్షించుకొని తనప్రకృతికి సాత్మ్యమైన అసాత్మ్యమైన ఆహారమును నిర్ణయించుకొన వలెను.

పుట్టినప్పటినుండి అభ్యాసమునందుగల ఆత్మకింపైన శాస్త్రముచేత

ఉచితమైనదిగా చెప్పబడిన సుఖకరమైన ఆహారము సాత్మ్యమని చెప్పబడినది. పుట్టినప్పటినుండి నిత్యమభ్యసించుచున్న సుఖావహమైన ఆహారము లోకము నందు సాత్మ్యమను శబ్దముతో వాడుకగలదు. స్వల్పకాలము నిత్యమభ్యసించిన ఆహారముగూడ సాత్మ్యమని చెప్పుచున్నారు. దీనికి విపరీతమైనదసాత్మ్యము.

కొందరు పండితవైద్యులు ప్రకృత్యాది భేదములతో సుఖమును గల్గించుటలో మాత్రమే కారణముగా నున్నందున సాత్మ్యము అనేక విధములుగానున్న దని భావించు చున్నారు. పుట్టిననాటినుండి అభ్యసించుచున్న ఆహారమునకు ప్రాధాన్యత నివ్వక ప్రకృత్యాది విశేషముల నాశ్రయించి శరీరము వృద్ధి నందించు ద్రవ్యగుణముల కంటే విపరీత గుణములున్న ప్పటికిని సుఖ హేతువులై నందు వలన సాత్మ్యమని చెప్పుచున్నారు. శారీరక గుణములతో ఆహారరాశి తుల్యమగు గుణములు కలదైనప్పటికిని తత్కాలమునందు దుఃఖ హేతువైనందున అసాత్మ్యమనిగూడ చెప్పుచున్నారు. సాత్మ్యము మూడు విధములని చెప్పు చున్నారు. వాటిలో సర్వరస సాత్మ్యమైన ప్రవరసాత్మ్యము సమదోష ప్రకృతిని, సుఖమును కలిగించునదిగ వక్కాణించు చున్నారు. విషమదోష ప్రకృతి గల ఇతరులకుకూడ ఇది క్రమమైన అభ్యాసముచేత సర్వరసములకు శారీరక గుణములతో సాదృశ్యమేర్పడును. అట్టి ప్రబలమైన హేతువును పురస్కరించి విషమదోష ప్రకృతిగల మానవుల కొఱకే అవర మధ్య సాత్మ్యములు చెప్పబడి నవి. శాస్త్రమర్యాదను, నిత్యాభ్యాసమును రెంటిని దృష్టియందుంచు కొని అధిక ప్రాధాన్యతగల తనకు హితమును చేకూర్చు ఆహారమును అభ్యసింప వలెను. దుఃఖమును కలిగించు ఆహారమును వదలి పెట్టవలయును.

మూ॥ తథా విశేషతః సమశన మధ్యశనమమాత్రాశనం విషమాశనంచ వర్జయేత్, తత్ర పథ్యా మేకత్ర భుక్తం సమశనమ్। భుక్తస్యోపరి భుక్తమధ్యశనమ్। అమాత్రాశనం పునః ప్రథగేవోపదేక్ష్యతే। అప్రాప్తాతీత కాలంతు భుక్తమ్ విషమాశనమితి। భుంజానస్తు పేయాయూషరసాన్ వ్యంజనాని రాజతేషు పాత్రేషు నిదధ్యాత్। పరిశుష్క పరిగ్ధానత్యూష్ణంచపయః సౌవర్ణేషు। ఖలకట్వర కాంబళికాన్ కాంస్యేషు। రాగషాడ వసట్టకాన్ వజ్రవైదూర్య విచిత్రేషు। ఘృతమాయసేపయః సుశీతం తామ్రమయే పానీయం పానకానిచ మద్యేయ స్ఫటిక కాచమయేషు ఓదనంచ విస్తీర్ణేమనోరమేస్థానే। అన్యథాహి వర్ణ గంధ రసాన్యత్వాదహితం స్యాత్।

ప్రతిపదార్థము : తథా = అట్లే, సమశనం = సమశనమును, అధ్యశనం = అధ్యశనమును, అమాత్రాశనమ్ = అమాత్రాశనమును, చ = మరియు, విషమాశనమ్ = విషమాశనమును, వర్జయేత్ = వదలిపెట్టవలయును.

తత్ర = పైనుదాహరించినట్టి సమశన, మధ్యశన, అమాత్రాశన, విషమాశనములలో, పథ్యాపథ్యమ్ = హితాహిత ఆహారములను, ఏకత్ర = ఒకచోట కలిపి,

భుక్తమ్=భుజింపబడినది, సమశనం = సమశనము, భుక్తస్యోపరి = భుజించిన దాని మీద, భుక్తం=భుజింప బడినది, అధ్యశనం=అధ్యశనము, అమాత్రా శనం = మాత్రకాని భోజనమును గురించి, పునః=మరల, పృథగేవ=వేరుగ, ఉపదేక్ష్యతే=చెప్పబడును, అప్రాప్తకాల=భోజనసమయము కానపుడు, అతీతకాలంతు = కాలాతీతమైనపుడు, భుక్తం=భుజింపబడినది, విషమాశనమితి= విషమాశనమని, ఉచ్యతే=చెప్పబడుచున్నది.

భుంజానస్తు = భుజించువాడు, పేయా = పేయను (త్రాగదగిన నీళ్ళు, పాలు, తేట, గంజి మొ॥ లగునవి) యూష = పప్పుకట్టును, రస = మాంసరసమును,వ్యంజనాని=కూరలను,రాజతేషుపాత్రేషు = వెండిగిన్నెలలో,నిదధ్యాత్ = ఉంచవలెను, పరిశుష్కప్రదిగ్ధాన్ = పరిశుష్క ప్రదిగ్ధములను, చ=మరియు, అత్యుష్ణంపయః = మిక్కిలివేడి పాలను, సౌవర్ణేషు = బంగారమును పూసిన పాత్రలందు, నిదధ్యాత్ = ఉంచవలెను, ఖలకట్వరకాంబళికాన్ = ఖలకట్వర కాంబళికములను, కాంస్యేషు = కంచు పాత్రలలో, రాగషాడవసట్టకాన్ = రాగషాడ వసట్టకములను, వజ్రవైడూర్యవిచిత్రేషు = వజ్రములు వైడూర్యములచేత తాపబడిన చిత్రవిచిత్రములైన పాత్రలందు,ఘృతం=నేతిని, ఆయసే= ఆయసపాత్రయందు, సుశీతం = మంచిగ చల్లారిన, పయః=పాలను, తామ్రమయే = తామ్రవికార పాత్రయందు, పానీయపానకాని=త్రాగుటకు యోగ్యమైన జలమును, పానకములను, మృద్హేమస్ఫటికమయేషు=మట్టి బంగారము స్ఫటికములచేత చేయబడిన పాత్రలయందు, ఓదనం =అన్నమును, విస్తీర్ణే= వెడల్పైన, మనోరమే=చూచుటకింపైన, స్థానే=గిన్నెలలో, స్యాత్ =ఉంచవలయును, అన్యథాహి =అట్లుకాని పక్షమున, వర్ణగంధ రసాన్యత్వాత్ =వర్ణము, గంధము, రసము వేరగుట వలన, అహితమ్ స్యాత్ =పథ్యకరమైనది కాకుండును.

తాత్పర్యము : అహితభోజనమును విడిచిపెట్టినట్లే సమశనమును అధ్యశనమును, అమాత్రాశనమును విషమాశనమును విడచిపెట్టవలయును. హితకరములైన అహితకరములైన ఆహారములను ఒకచోటచేర్చి భుజించు భోజనము సమశనమని చెప్పబడును. భుజించినతరువాత వెంటనే మరల భుజించుట అధ్యశనమని అనబడును. అమాత్రాశనమును గురించి వేరే ప్రకరణమునందు చెప్పబడును. శాస్త్రవిహితమైన కాలమునందు భుజించక పోవుట కాలాతీతముగ భుజించుట విషమాశనమని చెప్పబడును. భుజించువాడైతే చిక్కనిగంజిని పెసరకట్టును, కూరలను వెండి పాత్రలందుంచవలెను. ఎక్కువ ప్రమాణముగల నేతితో భర్జనముచేయబడి, తిరిగి జీరకాది యుక్తముగా వేడినీటితో సిద్ధము చేయబడిన మాంసమును (పరిశుష్కము) పూర్వవత్ సిద్ధము చేయబడిన మాంసము, చిక్కటి చల్ల మరియు త్రిజాతకము (ఏలకకాయలు, లవంగాలు, ఆకుపత్రిలు కల్పినచో ప్రదిగ్ధమును పేరుగలదానిని, వేడిపాలు, బంగారు పాత్రలయందు, అంబలి, చల్లపులుసు, ఆమ్ల యూషము కంచుపాత్ర లందును,

రాగషాడవసట్టకములను వజ్రవైడూర్యములు పొదిగిన పాత్రల యందునూ, పానయోగ్యమైన జలములు, పానకములు, మట్టిపాత్రలలో, బంగారు పాత్రలలో, స్ఫటిక పాత్రలలో (రాచిప్ప లేక గాజుపాత్ర), అన్నమును వెడల్పైన మనోహరమైన పాత్రలలో యుంచవలెను. శాస్త్రవిహిత కార్యాచరణ మాచరించని యెడల పాత్రలు, పాత్రల యందుంచు ఆహారముయొక్క వర్ణము, గంధము రసము మారి వికృతి యేర్పడి ఆ ఆహారపానీయములు అహితములు గానగు ప్రమాదమేర్పడును.

శశిలేఖ : సమాశనము మొ॥ వానికి ముఖ్యముగా యుక్తాయుక్తవివేచనచేసి అహితములను వదలి హితములనభ్యసించవలెను. పథ్యాపథ్యములను ఒకేచోటకల్పి భుజించుటను సమశన మందురు. ఆహారమును మాత్రపరిమాణముగ భుజించి కొంచెముసేపాగి మరల భుజించుట అధ్యశన మందురు. అమాత్రాశనమును గురించి తరువాతి ప్రకరణములో చెప్పబడును. సకాలమునందు భుజింపకపోయిననూ అకాలమునందు భుజించిననూ విషమాశనమందురు. కారము పులుపువేసిన కూరలు కట్వరమన బడును. సట్టకమనునది రాగఖాడవములతో సమానమైన దేశాంతర ప్రసిద్ధమైన పానకముగా తెలియవలయును.

వి. వ్యా. రాగషాడబముల స్వరూపము-

రాగములు షాడబములు రెండునూ పానకవిశేషములు. రాగషాడబములను కలిపి ఒకే పదార్థముగ నిర్వచన మిట్లు గలదు.

"క్వథితంతు గుణోపేతం సహకారఫలంనవమ్. తైలనాగరదంయుక్తం విజ్ఞేయోరాగషాడబాః।సితాసుచకసిద్ధార్థైః సవృక్షామ్ల పరూషకైః జంబూఫల రసైర్యుక్తోరాగో రాజికయాన్వితః"

నీళ్ళతో బెల్లమును, తియ్యమామిడిపండ్లు చేర్చి చక్కగ కాచి ఆరసమున తైలమును శుంఠిని చేర్చిన అయ్యది రాగషాడబమన బడును. రాగమనగా—చక్కెర, మాదీఫలములరసము, సౌవర్చలవణము, తెల్లావాలు, చింతపండు, చిట్టీత పండ్లు, నేరేడుపండ్ల రసము వీటిన్నిటినిచేర్చి పక్వముచేసి ఆవాలతో పోపువేయుటచే ఏర్పడినది.

షాడబస్తు "మధురామ్లద్రవ్యకృతః" అని చక్రదత్తుని వ్యాఖ్యానమున గలదు.

రసాలమనగ—మీగడతో కూడిన పెరుగు చేతితో చక్కగ చిలికి దానిలో ఏలకులు లవంగాలు దాల్చిని చెక్క నాగకేసరములు జీలకర్ర బెల్లము అల్లము శుంఠి వీనిని చక్కగా దంచి చేర్చినది. దీనిని శిఖరిణి అనియూ చెప్పుదురు.

మూ॥ అపిచ। దక్షిణ పార్శ్వేభక్ష్యం స్థాపయేత్। సవ్యేపేయం లేహ్యాం ముఖోద్ఘర్షణ పిండంచ మధ్యేభోజ్యమితి। యథాగ్నిసాత్మ్యంతు ప్రాక్ ద్రవ్యముపశుష్కం వాశ్నీయాత్। ప్రాగేవతు గురుస్వాదు స్నిగ్ధంచ। మధ్యేఽమ్లలవణమ్। అన్తేరూక్షం ద్రవమితరరస యుక్తంచ। తత్రమందాగ్నేర్ద్రవోష్ణేన సముత్తేజితోష్మణోఽన్యదుపయుక్తం సమ్యక్పాక మేతి।

**ప్రతిపదార్థము :** అపిచ = మరియునూ, దక్షిణపార్శ్వే = కుడి ప్రక్కన, భక్ష్యమ్ = తినుబండారములను (భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యములు, పానీయములను పంచవిధ ఆహారవికారములు), స్థాపయేత్ = ఉంచవలెను, సవ్యే = ఎడమ ప్రక్కవ, పేయమ్ = పానయోగ్యజలాదులను, లేహ్యామ్ = పచ్చళ్ళను, చ = మరియు, ముఖోద్ఘర్షణపిండీం = ముఖమును శుభ్రపరచుట కుపయోగించు తాంబూలాదులను, స్థాపయేత్ = ఉంచవలెను, మధ్యే = ఎదురుగ, భోజ్యమితి = భోజనయోగ్యపదార్థములను, స్థాపయేత్ = ఉంచవలెను, యథాఽగ్ని సాత్మ్యంతు = సమాగ్నిననుసరించి, ప్రాక్ = మొదట; ద్రవముపశుష్కంవా = ద్రవపదార్థములను లేక వేపుడు పదార్థములను, అశ్నీయాత్ = తినవలెను, ప్రాగేవతు = మొదటనే, గురుస్వాదు స్నిగ్ధంచ = గురు మధుర స్నిగ్ధ పదార్థములను, మధ్యే = భోజనమధ్యమునందు, అమ్లలవణమ్ = పులుపు ఉప్పులతోకూడిన పదార్థములను, అన్తే = భోజనాన్తమునందు, రూక్షమ్ = రూక్షఆహారమును, ద్రవం = ద్రవరూప ఆహారమును, ఇతర సంయుక్తంచ = యూషము మొ॥ రసములను, అశ్నీయాత్ = తినవలెను, తత్ర = జాఠరాగ్నినిబట్టి, మందాగ్నేః = అగ్నిమాంద్యముగల పురుషునికి ద్రవోష్ణేన = వేడి చేసిన ద్రవపదార్థములతో, సముత్తేజితోష్మణా = ప్రదీపాగ్ని వలన, అన్యదుపయుక్తమ్ = మరల ఉపయోగించిన ఆహారపదార్థములను, సమ్యక్ = బాగుగా పాకమ్ = జీర్ణమును, ఏతి = పొందించుచున్నది.

**తాత్పర్యము :** లడ్డు మొదలగు పదార్థములను కుడిప్రక్కన ఉంచుకొనవలెను. త్రాగుట కుపయుక్తములగు పదార్థములను ముఖమును శుభ్రపరచు తాంబూలాదులను వామ పార్శ్వమున నుంచుకొనవలెను. పోషక పాకాదులతో తయారుచేసిన విచిత్రాన్నములను ఎదురుగానుంచు కొనవలెను. తన జాఠరాగ్ని సాత్మ్యతనుబట్టి లేక జాఠరాగ్ని బలానుసారముగా మొదట ద్రవపదార్థములను వేపుడు కూరలను తినవలయును. మరియు మొదట గురు మధుర స్నిగ్ధ పదార్థములను సేవించవలెను. భోజనము మధ్యన పులుపు ఉప్పుచేర్చిన పదార్థములను భుజించవలెను. భోజనాన్తమునందు రూక్షద్రవరూపమైన పదార్థములను ఇతర పదార్థ (రస)ములతోచేర్చి మేళవింపబడిన ఆహారమును సేవించవలెను. ఇట్లు ఆహారమును నిత్యకృత్యముగా చేయుటచేత మందాగ్నిగల మానవుని యొక్క జాఠరాగ్ని వేడిచేయబడిన ద్రవ్యపదార్థసేవనవలన మిక్కిలి ఉత్తేజితమై మరికొన్ని పదార్థములను సేవించిననూ ఆ ఆహారపదార్థములుకూడ ఆ ఉత్తే

జితము చేయబడిన జాతరాగ్నిచేత సరియైన పద్ధతిలో జీర్ణము చేయబడును.

*శశిలేఖ:* జాఠరాగ్ని బలమునపేక్షించి ఆహారముయొక్కసాత్మ్యాసాత్మ్యములను తెలిసికొని ద్రవపదార్థములనుగాని వేపుడుకూరలనుగాని మొదట భుజింపవలెను. మొదటనే గురు మొదలగు గుణములతో కూడిన ఆహారమును తినవలెను. మందాగ్నిగల మానవుడు వేడిగానున్న ద్రవరూపమైన వానిని మొదటనే తినవలెను.

మూ॥ అనుపానేతు సలిలమేవ శ్రేష్ఠం, సర్వరస యోనిత్వాత్సర్వ భూత సాత్మ్యత్వాజ్జీవనాది గుణయోగాచ్చ। తచ్ఛీతం దధిమధుయవగోధుమమద్య విశేషేషు సర్వేషు చవిదాహిషు శరద్గ్రీష్మయోశ్చ। ఉష్ణంపిష్టమయేష్వన్యేచ దుర్జరేషు హేమన్తేచ, ద్రవ్యాద్రవ్య విజ్ఞానీయం చేత్తేత క్షీరం శాలిషష్టికయోః తథై వోపవాసాధ్వ భాష్యస్త్రీ వ్యాయామ క్లాన్తబాలవృద్ధేషు। మాంసరసః శోషాదిషు। వాతేత్వమ్లానిచ। పిత్తేశర్కరోదకమ్। త్రిఫలోదకంతు సక్షౌద్రం శ్లేష్మణిప్రాయశ్చాక్షిగళరోగేషు। మస్త్వేవవా దధ్ని కూచికా కిలాట యోశ్చ। ధాన్యామ్లం మస్తుతక్రం వా శాకావరాన్నేషు। మద్యం మాంసేషుఫలామ్లాంబు వాసవాంశ్చ వివిధాన్ విభజ్య ప్రయోజయేత్। విశేషతస్తు మద్వాసవాన్ గ్రామ్యేషు తీక్ష్ణాన్ త్రిఫలాసవాన్ వన్యేషు। న్యగ్రోధాది ఫలాసవాన్ విష్కిరేషు అర్కశేలు శిరీషకపిత్థాసవాన్ బిలేశయేషు దిగ్ధహతేషుచ। ఆమ్లఫలాసవాన్ ప్రసహేషు కాశేతుపద్మబీజ శృంగాటక కశేరుక మృద్వీకా ఖదిరాసవాన్ క్షౌద్రయుక్తంవా శీతముదకముదశ్విద్వా మహోమృగేష్వేదశేషుచ। సురాంప్రతుదేషుతథాశ్రమార్తేషు కృశేషుచ। మధూదకం స్థూలేషు। మద్యం మద్య మాంస సాత్మ్యే ష్వల్పాగ్నిషు। అపిచ। సమానేనాన్న విపరీత మవిరోధిచ।

ప్రతిపదార్థము : అనుపానంతు = అనుపానమైతే, సలిలమేవ=జలమే, శ్రేష్టం=శ్రేష్ఠమైనది, సర్వరస యోనిత్వాత్=మధురాది షడ్రసములయొక్క ఉత్పత్తికి కారణమగుటవలన, సర్వభూతసాత్మ్యాత్ = సమస్త ప్రాణికోటికి సామ్యమగుటవలన, జీవనాది గుణయోగచ్చ = జీవనము మొదలగు గుణములతోకూడియుండుట వలన, తత్=ఆ, శీతమ్=శీతలమైన జలము, దధిమధుమద్య విశేషేషు=పెరుగు, తేనె, గోధుమలు మద్య విశేషముల సేవనయందు, సర్వేషు= సమస్తమయిన, విదాహిషు=విదాహకర పదార్థసేవనలందు, శరద్గ్రీష్మయోశ్చ= శరత్గ్రీష్మ ఋతువులయందు, శ్రేష్ఠమ్=శ్రేష్ఠమైనది.

పిష్టమ్=పేలపిండి మొదలగు వాటితోచేసినముద్దలు, అన్యేషు=అన్యములైన, దుర్జరేషు=కష్టముగ జీర్ణమగు భక్ష్యములయందు, హేమన్తేచ=హేమన్త ఋతువునందు, ఉష్ణమ్=వేడినీరు, శ్రేష్టమ్=శ్రేష్ఠమైనది.

ద్రవద్రవ్య విజ్ఞానీయంచ = చల్లనినీరు, వేడినీరు వీనిని గురించి ద్రవద్రవ్య విజ్ఞాన విషయిములను గురించి అనుపాన విషయకమైన దృష్టితో చూడ

వలెను, శాలి=హేమన్త ఋతువులో పండు ధాన్యము నుపయోగించుటలో, షష్టికయోః=60 దినములలో వచ్చు ధాన్యము నుపయోగించుటయందు, తథా=అట్లే, ఉపవాస = ఉపవాసముచేత, అధ్వ = మార్గగమనమెక్కువగ చేయుటచేత, భాష్య = బిగ్గరగా ఎక్కువసేపు మాటలాడుటచేత, స్త్రీ=అతి సంభోగాదుల చేత, వ్యాయామ = వ్యాయామాదులచేత, క్లాన్త=బడలికచేత ఏర్పడిన కార్శ్యమునందు, బాల=చిన్నపిల్లల విషయములో, వృద్ధేషు=ముసలి వారి విషయములో, క్షీరం=పాలు, శ్రేష్ఠం=శ్రేష్ఠమైనవి, శోషాదిషు = ధాతు శోషాదులయందు, మాంస రసః=మాంసరసము, శ్రేష్ఠం=శ్రేష్ఠమైనది, వాతే= వాత వృద్ధియందు, అమ్లానిచ=అమ్లద్రవ్య అనుపానములున్నూ, శ్రేష్ఠం= శ్రేష్ఠమైనవి, పిత్తే=పిత్త వృద్ధియందు, శర్కరోదకమ్=కలకండ పానకము, శ్లేష్మణి = కఫవృద్ధియందు, ప్రాయః=తరచుగా, అక్షిగళరోగేషు = నేత్ర, మరియు కంఠవ్యాధులయందు, సక్షౌద్రమ్=తేనెతోకూడిన. త్రిఫలోదకమ్ = కరక, తాని, ఉసిరికలతో తయారుచేసిననీరు, శ్రేష్ఠమ్=శ్రేష్ఠమైనది, మస్తు =పెరుగుమీదితేట, శ్రేష్ఠం=శ్రేష్ఠము, ధాన్యామ్లమ్=ధాన్యామ్లము, మస్తు= పెరుగుమీది తేట, తక్రమ్=మజ్జిగ, శాకావరాన్నేషు=పొంగలి మొదలగు వాటి యందు, శ్రేష్ఠమ్=శ్రేష్ఠమైనది, మాంసేషు=మాంసాహారములందు, మద్యమ్= మద్యము, శ్రేష్ఠం=శ్రేష్ఠమైనది

ఫలామ్లమ్ = ఫలామ్లము, అంబు=నీరు, ఈ రెండునూ, వివిధాన్ ఆసవాన్ = పలువిధములైన ఆసవములను, విభజ్యా = విభజించి, ప్రయోగ యేత్=ప్రయోగించవలెను.

విశేషతస్తు = విశేషముగా, గ్రామ్యేషు = గ్రామములందు నివసించు కోడి, పంది మొదలగు జంతువుల మాంస భక్షణయందు, మధ్వాసవాన్ = మధ్వాసవములను, అన్యేషు=జాంగల జంతుమాంస భక్షణయందు, తీక్ష్ణాన్= తీక్ష్ణములైన, త్రిఫలాసవాన్ = త్రిఫలాసవములను ఇవ్వవలెను, విష్కిరేషు= విష్కిరములను జంతువుల మాంస భక్షణయందు, న్యగ్రోధాదిఫల=మఱ్ఱి మొద లగు వానియొక్క ఫలములను, ఆసవాన్ = ఆసవములను ఉపయోగించవలెను. బిలేశయేషు = బిలేశయములమాంస భక్షణయందు దిగ్ధహతేషుచ=అస్త్రము చేత చంపబడిన జంతువులయొక్క మాంసభక్షణయందు, అర్కసేలు శిరీష కపిత్థ ఆసవాన్=జిల్లేడు, సేలు, దిరిశెన, వెలగ వీటితో తయారు చేయబడిన ఆసవము లను ఉపయోగించవలెను, ప్రసహేషు = ప్రసహమాంస భక్షణయందు, అమ్ల ఫలాసవాన్=పుల్లనిపండ్లతో తయారుచేసిన ఆసవములు ఇవ్వవలెను. మహామృ గేషు=సింహము, ఏనుగు మొదలగు జంతువుల మాంసభక్షణయందు, ఔదకేషు= నీటియందు సంచరించు జంతువులయొక్క మాంస భక్షణయందు, కాశ=దర్భ, ఇక్షు = చెఱుకు, పద్మబీజా = తామరగడలు, శృంగాటక=శృంగాటకములు,

కశేరుక = కశేరుకములు, మృద్వీక = ద్రాక్ష; వీటితో తయారు చేయ బడిన ఆసవములను, క్షౌద్రయుక్తంవా = తేనెతో గలిపికాని, శీతముదకమ్ = చల్లని నీరుగాని, ఉదన్విత్ = నీళ్ళు కలువని మజ్జిగను ఉపయోగించ వలెను.

ప్రతుదేషు = ప్రతుద మాంసభక్షణయందు, శ్రమార్తేషు = పనులను చేయుటచేత, డస్సినవారియందు, తథాచ = మరియును, కృశేషు = కృశించిన వారియందు, సురాం = సురను ఉపయోగించవలెను.

స్థూలేషు = మేదో వృద్ధిగల మానవులయందు, మధూదకమ్ = తేనె కల్పిననీటిని ఉపయోగించ వలయును, మద్య = మద్యము, మాంస = మాంసము, సాత్మ్య = సాత్మ్యముగాగల మానవులయందు, అల్పాగ్నిషు = అగ్నిమాంద్య పురుషులయందు, మద్యం = మద్యమును ఇవ్వవలెను.

అపిచ = మరియునూ, సమాసేన = సంక్షిప్తముగా, అన్నవిపరీతమ్ = అన్న గుణములతో విపరీతముగాని, చ = మరియు, అవిరోధి = వీర్య విపాకాదులతో విరుద్ధముకాని, అనుపానము, శ్రేష్టం = శ్రేష్ఠమైనది.

**తాత్పర్యము :** ఔషధ, ఆహారములను సేవించునపుడు, తరువాత సేవించు జలాదులను అనుపానపదముచేత చెప్పుచున్నారు. అనుపానమునకు అర్థము ఏమనగా ఆహారము తీసుకొని వెంటనే సేవించునదియని యర్థము.

ఆయుర్వేద శాస్త్రమునందు అనుపానమునకు అనేకగుణములు చెప్ప బడి యున్నవి. తుదకు అనుపానము లేనిది ఔషధాదులను ఉపయోగించరాదు అను నిషేధముకూడకలదు. శాస్త్రములందు పేర్కొనబడిన అనుపానముల కంటె స్వచ్ఛమైన నీరు శ్రేష్ఠమైనదిగా చెప్పబడినది. ఎందుకనగా ఆకాశోదకము మధురాది రసములయొక్క ఉత్పత్తికి కారణభూతమగు చున్నది. మరియు సమస్తమానవాళికి ఒకసాత్మ్యమైనది. మరియు జీవనీయ గుణములు అన్నియు దానియందు పుంజీభూతములుగా యున్నవి.

పెరుగు, తేనె, గోధుమలతో తయారుచేసిన సర్వపదార్థములు, మద్యము వీటిని సేవించిన తరువాత అనుపానముగా శీత జలమును పానముచేయ వల యుకు. అన్నివిధములైన విదాహకరములైన పదార్థములను సేవించినచో పిమ్మట శరత్ గ్రీష్మ ఋతువులయందుసు చల్లని నీటినే త్రాగవలెను.

పేలపిండి, రవ, మొదలగు వాటితో తయారు చేసినలడ్డూ మొదలగు పదార్థములను మిక్కిలి కష్టముగా జీర్ణమగు భక్ష్యాదులను సేవించిన తరువాత హేమంత ఋతువునందునూ వేడినీటినిత్రాగ వలయును.

ద్రవద్రవ్య విజ్ఞానమును, అనుపానములను కల్పించునపుడు శీత ఉష్ణజల సేవన యందును దృష్టియందుంచు కొనవలయును.

రాజనములు, అరువది నాళ్ళకు ఫలించు ధాన్యము, ఈ రెంటిని భుజించిన తరువాత పాలు త్రాగవలెను. అట్లే ఉపవాసములు చేయుటచేత కృశించినవారు, క్రోధము కముగానడచుటచేత బడలిక చెందినవారు, బిగ్గరగ మాట్లాడుటచేత డస్సినవారు, స్త్రీకర్మేతులు, వ్యాయామము వీటిని శక్తినిమించి చేయుటవలన ఏర్పడిన బడలిక యందును, చిన్నపిల్లలు, వృద్ధులు వీరు పాలను అనుపానముగా ఉపయోగించుట చాల పథ్యకరముగ యుండును. కారణాంతరముల చేత ధాతుక్షయమేర్పడినపుడు మాంసరసము ననుపానముగ ఉపయోగించవలెను. వాతవృద్ధియందు కాంజికము, మొదలగు పుల్లని వస్తువులను అనుపానముగా ప్రయోగించవలెను. పిత్తవృద్ధియందు ఖండశర్కర చేర్చిన పానకములను అనుపానములుగా ఇవ్వవలెను. కఫవృద్ధియందు, నేత్రరోగములందు, గళరోగములందు, తేనెకలిపిన త్రిఫలములువేసిన ఫాంటజలమును అనుపానముగ ఇవ్వవలెను, దధి=పెరుగు నుపయోగించుటలో, మస్తు=పెరుగు మీది తేట నుపయోగించవలెను, కూర్చిక (విరిగిన పాలనుండి తయారుచేసిన మజ్జిగను, విరిగినపాలయొక్క గడ్డలను (కిలాటము) ఉపయోగించునపుడు మస్తునే అనుపానముగా వాడ వలయును.

పులగమును భుజించిన తదుపరి ధాన్యామ్లమును (కలి) పెరుగుమీది తేటను, మజ్జిగను అనుపానముగా ప్రయోగించుట శ్రేష్ఠము.

మాంసాదులను సేవించిన తరువాత మద్యమును అనుపానముగా సేవించుట యుత్తమము.

నేరేడు ద్రాక్ష మొదలగు ద్రవ్యములను పులువబెట్టి తయారు చేసిన మద్యములను వివిధ పరికల్పనలచేసి తయారుగావించిన అసంఖ్యాకములైన ఆసవములను వేరువేరుగా విభజించి అనుకూలముగా నుపయోగించవలెను విశేషముగా గ్రామములయందుండు కోడి, పంది, పావురము, మేక, గొఱ్ఱె మొదలగు జంతువులయొక్క మాంసములను తినిన తర్వాత మధ్వాసవములనను పానముగా ప్రయోగించ వలయును.

ఇతర జంతు మాంస భక్షణ తరువాత తీక్ష్ణములైన త్రిఫలాసవములను అనుపానముగా వాడవలయును. విష్కిరముల (జల్లుకొని తిను పక్షులు) యొక్క మాంససేవన తరువాత మఱ్ఱి మొదలగు వృక్షములయొక్క ఫలములతో తయారు చేసిన ఆసవములను సేవించవలెను. కన్నములలోనుండు పాములు మొదలగు బిలేశయములను భుజించిన తరువాత శస్త్రముచే చంపిన జంతువుయొక్క మాంస భక్షణ తరువాత జిల్లేడు, సేలు, దిరిశెన, వెలగపండు మొదలగు వాటితో సిద్ధముచేసిన, ఆసవములను, ప్రసహముల (బలాత్కరించి జంతువులను తినునవి) యొక్క మాంసమును భుజించిన తరువాత పుల్లని పండ్లతో తయారుచేసిన ఆసవములను అనుపానములుగా ఉపయోగించుట శ్రేష్ఠము.

మహా మృగములైన సింహాదులయొక్క మాంసమును, ఔదక జంతువుల మాంసమును భుజించిన తదుపరి రెల్లు, చెఱకు, తామరగింజలు, శృంగాటకములు, కసేరుకములు ద్రాక్ష వీటితో తయారు చేసిన మద్యములను ఆసవములను తేనెతో కల్పిగాని, చల్లనినీటినిగాని, చిలికి వెన్న తీసిన మజ్జిగనుగాని అనుపానముగా ప్రయోగించవలయును. ప్రతుద (పాలగువ్వ, పావురము, భృంగరాజము, అడవి పిచ్చుక, ఊర పిచ్చుక, సారసము, చిలుక, గోరింక, మైనగోర, పసుపు పిట్ట మొదలగునవి) ములమాంస భక్షణమునుచేసిన తరువాత అల్లే బడలికచేత బాధింప బడువారు, శరీరము కృశించినవారు మద్యమును సేవించ వలయును. మేదస్వులు తేనె కల్పిన నీటిని త్రాగవలయును. మద్యము, మాంసము యెవరికి పుట్టినది మొదలు సాత్మ్యమైయుండునో, అగ్ని మందముగ నుండునో వారికి మద్యము ననుపానముగా సేవింపచేయు వలెను. మరియు సంక్షేపముగ ఆహారగుణములతో విపరీతముగాని, వీర్యవిపాకాదులతో విరుద్ధముగాని అనుపానములు ప్రశస్తములని చెప్పబడినది.

*శశిలేఖ* : భుజించిన తరువాత త్రాగుటకు జలమే శ్రేష్ఠమైనది. నీటియందు (ఆకాశోదకము) సర్వరసములను పుట్టించుశక్తిగలదు. సమస్తగుణములు ఆనీటి యందుండును. ఆహారరసమునకది విరోధము కాకుండా యుండును. శరీరమునకు వృద్ధికరముగా యుండును. అనుపానపరికల్పన ననుష్ఠింప చేయుటకు ద్రవద్రవ్య విజ్ఞానమును సంపూర్ణముగా ఆకళింపు చేసుకొనవలెను. శీతజలము ఉష్ణజలము రెండునూ అనుపాన యోగ్యములుగా చెప్పబడినవి. శాలి, షష్టిక ధాన్యములతో తయారయిన అన్నమును భుజించిన తరువాత ఉపవాసాది కర్శిత శరీరులు, బడలికతోకూడిన శరీరులు పాలను అనుపానముగా నుపయోగింప వలయును. ధాతుక్షయమయినవారు అతి లంఘితులు మాంసరసముపయోగింప వలయును. వాతవృద్ధియందు కాంజికము మొలదగు పుల్లనీపానీయములను మాంసరసమునుగూడ అనుపానీయముగా ఉపయోగింపవచ్చును. పిత్తవృద్ధియందు శర్కరోదకమును, కఫవృద్ధియందు త్రిఫలాకషాయములో తేనె కల్పియూ అనుపానముగా సేవించవలయును. అక్షిరోగములు, గళవ్యాధులందుకూడా త్రిఫలాకషాయములో తేనెకల్పి త్రాగవలయును, పెరుగు త్రాగిన తదుపరి లేక పెరుగన్నమును భుజించిన తదుపరి చల్లనినీళ్ళు అనుపానముగా త్రాగవలెను. కూర్చిక, కిలాటముల నుపయోగించాక పెఱుగుమీది తేటను అనుపానముగా సేవించవలెను. లేక పులగమును భుజించిననూ ఉపయోగించ వచ్చును.

తినిన అన్నమునకు విపరీత గుణములుగల ద్రవమును అనుపానముగా సంధించ వలెను. విరుద్ధాన్న విజ్ఞానీయమునందు బలవంతులైన సత్పురుషులకున్నూ సమాన అసమాన గుణములుగల అనుపానములు రెండు విధములు గనూ విరోధమని చెప్పబడినది.

సూ॥ అనుపానంఖలు తర్పయతి ప్రీణయత్యూర్జయతి బృంహాయతి దేహస్య పర్యాప్తిమభినిర్వర్తయతి భుక్తమవసాదయత్యన్నమ సంఘాతంభినత్తి మార్ధవ మాపాదయతి క్లేదయతి సుఖపరిణామితా మాశువ్యావాయితాంచా హారసోపజన యంతి। వర్జ్యంతూర్ధ్వ జత్రుగద శ్వాసకాస ప్రసేక హిధ్మాస్వర భేదోరః క్షతిభిర్గీత భాష్య ప్రసక్తైశ్చ। తేషాం హి ప్రదూష్యా మాశయమురః కంఠస్థిత మాహారజం స్నేహ మాసాద్యతదభిష్యందాగ్ని సాదచ్ఛర్ద్యా దీనామయాన్ విదధ్యాత్। పీత్వాచ భాష్యగేయాధ్వస్వ ప్నాన్న శీలయేత్। పానంచ। ప్రక్లిన్న దేహామేహ కంఠాక్షిరోగవ్రణిన ఇతి।

ప్రతిపదార్థము : అనుపానంఖలు=అనుపానము, దేహస్య=దేహామునకు (శరీరమునకు), తర్పయతి=తృప్తిని గల్గించును, ప్రీణయతి=జలీయాంశమును వృద్ధిపరచి పోషించుచున్నది, ఊర్జయతి=ప్రభావితమును చేయును.

బృంహాయతి=వృద్ధిపొందించును, దేహస్య=శరీరమునకు, పర్యాప్తిం= చాలినంత సంపూర్ణతను, అభినిర్వర్తయతి=అభివ్యక్తము చేయుచున్నది.

భుక్త=భుజింపబడిన ఆహారమును, అవసాదయతి=జీర్ణముగావించు చున్నది, అన్నసంఘాతమ్=ఆహారరాశిని, భినత్తి = భేదించు చున్నది, మార్ధవమ్=మృదుత్వమును, ఆపాదయతి=కలిగించుచున్నది, ఆహారస్య=ఆహారమునకు, సుఖపరిణామితాం=తేలికగా జీర్ణమగుటను, ఆశు=శీఘ్రముగా, వ్యవాయితామ్=ప్రసరించుటను, ఉపజనయతి=పుట్టించు చున్నది.

ఊర్ధ్వజత్రుగత=కంఠమునకుపై భాగమున నుత్పన్నములగు వ్యాధులు, శ్వాస=ఉబ్బసము, కాస = దగ్గు, ప్రసేక = జొల్లు, హిధ్మా = ఎక్కిళ్ళు, స్వరభేద=స్వరభంగము, ఉరః క్షతిభిః=ఉరః క్షతము మొదలగువ్యాధులు కలవారి చేతనూ, గీతభాష్యప్రసక్తైశ్చ=గానము, ఉపన్యాసము వీటియందు తల్లీనులైన వారిచేత, వర్జ్యమ్=విడువదగినది, తేషాంహి = వారికయితే, ఆమాశయం= ఆమాశయమును, ప్రదూష్య=దూషింపచేసి, ఉరః కంఠస్థితమ్=వక్షస్థలము, కంఠము నందున్న, ఆహారజమ్=ఆహారరాశినుండి ఉత్పన్నమైన, స్నేహం= స్నేహమును, ఆసాద్య=పొంది, తత్=ఆస్నేహము, అభిష్యంద=అభిష్యందము (స్రోతస్సులు క్లేదోభూయిష్టమగుట అభిష్యందము), అగ్నిసాద=జఠరాగ్ని నశించుట, ఛర్ద్యాదీన్=వాంతులు మొదలగు, ఆమయాన్=వ్యాధులను, విదధ్యాత్=కలిగించును, పీత్వాచ=మరియును అనుపానమును సేవించి, భాష్య= ప్రవచనము, గేయ=గానము, అధ్వ=యానము, స్వప్నాన్=నిద్రమొదలగు, వాటిని, నశీలయేత్=ఆచరింపకూడదు, పానంచ=పానమైతే, ప్రక్లిన్నదేహం= తడిసిన శరీరము గలవారు, మేహా=ప్రమేహులు, కంఠాక్షిరోగ వ్రణిన ఇతి= కంఠాక్షిరోగులు, వ్రణితులు, నశీలయేత్=ఆచరింప కూడదు.

తాత్పర్యము : అనుపాన గుణములను చెప్పుచున్నారు.

అనుపాన మనునది మనుషులకు తృప్తిని కలిగించును. శరీరమునకు, ఇంద్రియములకు పుష్టిని చేకూర్చును. శరీరబలమును పెంపొందించును. భుజించిన అన్నమును చక్కగా పాకమగునట్లుగాచేసి సారభూత రసమును శరీరమంతయూ చక్కగా వ్యాపింప చేయును. భుజించిన అన్నమును చక్కగా సకాలములో పచింపచేయును. బంధింపబడిన అన్నమునుభేదించి పాకమును సుగమముగా చేయును. మరియు అన్నమును తడిగా చేయును, సమస్తశరీర వ్యాపకమునకు మిక్కిలి దోహదకారిగా నుండును.

మహర్షి భేలుడు అనుపానము గురించి చెప్పుచూ అనుపానము అన్నమును సుఖముగా పచింపచేయ.... రుచిని పుట్టించును. అపకర్షణమును చేయును. ఆహారసాత్మ్యతను వృద్ధి పొందించును అని చెప్పెను.

సుశ్రుతాచార్యులిట్లు చెప్పిరి. భోజన కాలమందు ఉదకపానముచేయకుండినచో భుజించిన ఆహారము కడుపులో స్తంభించి ద్రవముకాక మిక్కిలి బాధించును. అందువలన భోజనమునందు అనుపానమును పదేపదే చేయవలయును.

ముఖ, దంత, కంఠ, జిహ్వా, వ్రణ, శిరోగత వ్యాధులచే పీడితులైనవారు ఆయాసము, ఉబ్బసము, దగ్గు, నోట జొల్లు కారుట మొదలగు వ్యాధులచే పీడితులైనవారు ఉరఃక్షతము, స్వరభంగము అనునవి కలిగియున్నవారు అనుపానము చేయరాదు. పానము చేసిన వెంటనే దారిని నడచుట, గట్టిగా మాట్లాడుట, గట్టిగాచదువుట, పాడుట, నిద్రించుట, అనుపానిని చేయరాదు. ఇట్లు దాహము పుచ్చుకొనిన వెంటనే దారి నడచుట మొదలగు వానిని చేసినచో త్రాగిననీరు ఆమాశయమును దూషించి అట్టివాని కంఠము, గుండె అనువాటిలో నుండిపోయి స్రోతస్సుల యందెక్కువ నీరు గల్గుట, అగ్ని మాంద్యము, వాంతి మొదలగు అనేకవ్యాధులు కలుగును.

*శశిలేఖ* : తర్పణాదులు, అనుపాన గుణములు ఊర్ధ్వజత్రుగత రోగములు వీని యందనుపానము చేయరాదు. ఊర్ధ్వజత్రుగత రోగులకు అనుపానము సేవింప చేయుట వలన అభిష్యందము మొదలగునవి కలుగును. అనుపానజలమును సేవించిన తదుపరి భాష్యాదులను చేయరాదు, తడిసిన శరీరులు కూడ అనుపానము చేయరాదు.

సూ॥ తతః పాణిగత మన్యమన్యేనాపనీయ దన్తాన్తరస్థంచ శనైః శనైః శోధనేన విశోధ్య లేపగన్ధస్నేహ పానోద మాచాన్తోఽంగుల్యగ్రగళితాంబు పరిషిక్తనేత్ర స్తాంబూలాది కృతవదన వైశద్యో ధూమపానాది హృతోర్ధ్వకఫవేగః పదశతమాత్రం గత్వావామ పార్శ్వేన సంవిశ్యేత్। ద్రవోత్తర భోజనస్తు

శయ్యాం నాతిసేవేత, యానప్లవన వాహనాగ్న్యాత పాంశ్చభుక్తవాన్। వర్జయేత్। ఆహార పరిణామకరాః క్లేదః కాలః సమయోగశ్చ। తత్రోష్మా పచతి వాయు రపకర్షతి స్నేహోమార్దవం జనయతి క్లేదః కాలః సమయోగశ్చ। తత్రోష్మాపచతి వాయురకర్షతి స్నేహోమార్దవం జనయతి క్లేదః శైథిల్యమాపాదయతి కాలః సర్వవపుర్వ్యాప్తిమభినిర్వర్తయతి। సమయోగస్త్వేషామన్న పరిణామధాతు సామ్యకరః సమ్పద్యతే। సమయోగ స్యతు పునః కారణాన్యుచితో హితశ్చదేహ సంస్కారోఽభ్యవ హారచేష్టాశయనం సౌమనస్యం చ। పరిణయస్త్వాహారస్య గుణాః శరీరగుణభావ మాపద్యన్తేయథాస్వమ విరుద్ధాః। విరుద్ధాస్తు విహతాశ్చవిరోధిభిర్వి హన్యుః శరీరమితి। భవన్తిచాత్ర।

ప్రతిపదార్థము : తత = భుజించిన తరువాత, పాణిగతం = అరచేతిలో అంటుకొనిన, అన్నం = అన్నమును, అన్యేన = రెండవచేతితో, అపనీయ = తొలగించి, చ = మరియూ, దన్తాన్తరస్థమ్ = దన్తముల మధ్యనున్న అన్నమును, శనైః శనైః = మెల్లమెల్లగా శోధనేన = దంతకురేదనీ శలాకతో, విశోధ్య = పరిశుభ్రముచేసికొని, లేపగన్ధ స్నేహాపనోదమ్ = లేపగన్ధములను స్నేహమును తొలగించి, ఆచాన్తః = ఆచమనమువరకు, విధాయ = చేసి, అంగుల్యాగ్ర గలితుమ్బుపరిషిక్త నేత్రః = బొటనవ్రేలు మొదలగు వేళ్ళ కొనలనుండి జారుచున్న నీటితో తడుపబడిన నేత్రములు గలవాడై, తాంబూలాది కృత వదన వైశద్యః = తాంబూలము మొదలగు సుగంధ భరితములైన ద్రవ్యములచేత చేయబడిన ముఖవైశారద్యము గలవాడై, ఊర్ధ్వ కఫవేగః = ఊర్ధ్వభాగ గమనము చెందిన కఫవేగము, ధూమ పానాది హృతః = ధూమపానాదులచేత హరింప చేయబడినవాడై, పదశతమాత్రమ్ = 100 అడుగులు మాత్రము, గత్వా = నడచి, వామపార్శ్వేన = ఎడమ ప్రక్కగా, సంవిశేత్ = పరుండవలెను, ద్రవోత్తర భోజనస్తు = మిక్కిలి పలుచనైన భోజనముచేసిన వాడైతే, శయ్యాం = పక్కను, నాతిసేవేత్ = సేవించరాదు.

భుక్తవాన్ = భుజించినవాడు, యాన = సవారి (గుఱ్ఱము మొదలగు వానిపై), ప్లవన = దాటుట, (నదులను), వాహన = ఎత్తుట, మోయుట, అగ్ని = అగ్నిని, ఆతపాంశ్చ = మరియు ఎండను సేవించుట. వర్జయేత్ = విడువవలెను, ఆహార పరిణామకరాః పునః = ఆహారమును పచింపచేయు కారణములు, ఊష్మ = ఊష్మ, వాయుః = వాయువు, క్లేదః = క్లేదము (తడియునట్లు చేయుట), స్నేహః = స్నేహము, కాలః = కాలము, సమయోగశ్చ = మరియు సమయోగము.

తత్ర = వాటిలో, ఊష్మా = ఊష్మ, పాచయతి = పచింపచేయు చున్నది, వాయుః = వాయువు, అపకర్షతి = లాగుకొను చున్నది, క్లేదః = క్లేదము, శైథిల్యమ్ = శిథిలత్వమును, ఆపాదయతి = కలుగచేయుచున్నది, స్నేహః = స్నేహము,

మార్దవమ్ = మృదుత్వమును, జనయతి = పుట్టించు చున్నది, కాలః = వ్యవధాన రూపమైన కాలము, సర్వవపుః = సమస్త శరీరమునకు, వ్యాప్తమ్ = వ్యాపించుటను, అభినిర్వర్తయతి = వ్యక్తము చేయుచున్నది. (నిర్వర్తించు చున్నది.), ఏషామ్ సమయోగః = వీటన్నిటి సమయోగము, పరిణామ ధాతుసాత్మ్యకరః = పరిణామముతో సమస్తధాతువులకు సాత్మ్యమును, సంపద్యతే = సమకూర్చుచున్నది, సమయోగస్యపునః = సమయోగమునకైతే, కారణాని = కారణములు, ఉచితః హితస్య = అభ్యసింపబడిన పథ్యకరమైన అన్నము, దేహసంస్కారః = శరీర సంస్కారము, అభ్యవహారః = అన్నము, చేష్టా = చేష్ట, శయనమ్ = శయనము... మరియు మనస్ యొక్క ప్రసన్నత్వము, పరిణామ తస్తు = ఆ పరిణామము చెందిన తదుపరి అయితే, ఆహారగుణాః = ఆహారముయొక్క గుణములు శరీరగుణభావం = శరీరము నందుత్పన్నమగు గుణములతో సమానమైన భావమును, ఆపద్యన్తే = పొందు చున్నవి, యథాస్వమ్ = తన గుణములతో, అవిరుద్ధాః = విరుద్ధములేనివై, స్యుః = ఉండును, విహితాః = అనుష్ఠితములైన ఆహారగుణములు, విరుద్ధాస్తు = విరుద్ధములైనయెడల, విరోధిభిః = విరుద్ధములైన గుణములచేత, శరీరమ్ = శరీరమును, విహన్యుః = చంపును. భవన్తి చాత్ర = ఇదియేగాక (ఇంకనూ).

తాత్పర్యము : భుజించిన తరువాత అరిచేతికి అంటుకొన్న ఆహారమును ఎడమచేతితో తొలగించ వలయును. దంతముల మధ్యనదూరి చిక్కుల బడి పోయిన మెతుకులను మెల్ల మెల్లగ చెప్పబోవు శస్త్రవిధిలో వర్ణింపబడిన దంత శోధన యన్త్రముతో శుభ్రపరచ వలయును. చేతికి అంటుకొనిన అన్నమును, అన్నము నందలి సౌరభమును, చేతికి అంటుకొనిన జిడ్డును తొలగించి గండూషా చమనమును చేయవలయును. తరువాత వ్రేళ్ళ అగ్రభాగమునుండి జారుచున్న నీటి బిందువులచేత నేత్రములను తడుపుకొనినవాడై సుగంధ ద్రవ్యములతో కూడిన తాంబూలాదులను సేవించి ముఖశుద్ధిగావించుకున్నవాడై ఊర్ధ్వ భాగ మున వ్యాపించు కఫముయొక్క వేగమును ధూమపానముద్వారా అరికట్టి నూరు అడుగులు నడచినవాడై ఎడమప్రక్కగ శయనించవలయును. ద్రవపదార్థములను సేవించినతరువాత భుజించినవాడు నిద్రపోరాదు. భుజించినవెంటనే వాహనాదులపై స్వారీ చేయకూడదు. బరువుగల వస్తువులను మోయకూడదు. అగ్నిని, ఎండను సేవించరాదు. ఊష్మ (పిత్తము), వాయువు, క్లేదము (కఫము), స్నేహము, కాలము, సమ యోగము, ఈ ఆరున్నూ ఆహారపరిణామకర భావములుగా చెప్పబడినవి. వీటిలో ఊష్మ (జాఠరాగ్ని), ఆహారమును పాకము చేయును. వాయువు లాగుచున్నది. అనగ అన్నమును ఎక్కువ ప్రయత్న ముతో పాకమును చెందించుటకు ఒక ఆశయమునుండి మరియొక ఆశయమునకు లాగికొనిపోవును. క్లేదము అన్నరాశిని పలుచగా చేయును. స్నేహము అన్నము నందు మృదుత్వమును ఆపాదింప చేయును. ఆహారముయొక్క కఠినత్వమును

తొలగించునని అర్థము. కాలము సర్వశరీరమునందు ఆహారరసమును వ్యాపింప చేయును. వీటన్నిటి యొక్క సమయోగము అన్నముయొక్క పరిణామము చేత ఏర్పడిన ధాతువులయందు సాత్మ్యమును కలిగించును. ఉచితము, హితము, దేహసంస్కారము, అభ్యవహారము, చేష్ట, శయనము, సౌమనస్యము ఇవన్నియూ సమయోగమునకు కారణములు. సమయోగముయొక్క కారణములవలన భుజింపబడిన ఆహారముయొక్క పరిణామములో క్రమముగా విరుద్ధము కాకుండా తన సంబంధమైన గురుత్వాది, ద్రవత్వాది గుణములు శరీరగతములైన గురుత్వ ద్రవత్వాది గుణములతోకూడా ఏకత్వభావమును చెందుచున్నవి. సమ్యగ్యోగము కాని ఆహారముయొక్క పరిణామములో విరోధగుణముతో మేళవించి శరీరము యొక్క నాశనమును చేయు చున్నవి.

"వృద్ధిః సమానైః సర్వేషాం విపరీతైర్విపర్యయః" అను ప్రమాణ వాక్యముయొక్క ఫలము, సమయోగ విషమయోగములచేతనే ఏర్పడు చున్నది. అందుకే చెప్పబడినది.

*శశిలేఖ* : చేతికంటుకొన్న అన్నమును మరియొక చేతితో తొలగించి దంతముల మధ్యన చిక్కుకొన్న ఆహారావశేషమునుచెప్పబోవు దన్తశలాకలతో శుభ్రపరిచి ఆచమనము చేయవలయును. ఊర్ధ్వమార్గ గమనవేగము కఫమునకు అన్న పీడనము చేత నేర్పడి ఆ కఫము శిరస్సు పొందు ప్రమాదము కలరు. మిక్కిలి ద్రవరూప ఆహారమును భుజించిన తదుపరి శయ్యా నాశ్రయింపకూడదు. ఊష్మాదులు ఆహారపరిణామ కరములు. ఊష్మ పచింపచేయు చున్నది. వాయువు ఆహారమును పచింపచేయుటకు ఒకస్థానము నుండి మరియొక స్థానము నకు లాగికొనును. క్లేదము అన్న సంఘాతరాశిని శిథిలపరచును. స్నేహము అన్నముయొక్క కాఠిన్యతను నశింపచేయును. కాలము పరిణామము చెందిన అన్నమును సర్వశరీరమునందు వ్యాపింప చేయును. క్లేదాదులయొక్క సమ యోగము దోషధాతుమలములయొక్క సమత్వమును కలుగచేయును. క్లేదాదు లకు సమయోగమెట్లేర్పడునను శంకకు సమాధానమును చెప్పుచున్నారు. ఉచితము, అభ్యస్తము మొదలగు వాటివలన ఏర్పడును. ఈ క్లేదాదులయొక్క సమయోగముచేత ఏర్పడిన ఆహారపరిణామము వలన ఏమి అగుచున్నదనుదానికి సమాధానమును చెప్పుచున్నారు. తక్కిన భాగము స్పష్టము.

మూ॥ ఔకులాభ్యోష పృథుకాన్ సుపిష్టకృత తండులాన్।
నజాతు భుక్తవాన ద్యాన్మాత్ర యాద్యాత్సు కాంక్షితః
శాకావరాన్న కట్వమ్ల కషాయ లవణోత్కటమ్।
త్యజేదేక రసాసాత్మ్యం గురు శుష్కంచ భోజనమ్॥
వత్స్యతే యన్నిదానాదౌ సర్వదోష ప్రకోపనమ్।
అత్యభిష్యంది విష్టంభి విదాహి గురు రూక్షణమ్॥

కీలాట దధి కూచీకా మత్స్య శుష్కామ మూలకమ్।
క్షార పిష్ట విరూఢాద్యంత తత్సమస్తం నశీలయేత్॥

**ప్రతిపదార్థము** : ఔకుల = కంకులు; అభ్యోష = పిసుకుళ్ళు (ఊచ బియ్యము); పృథుకాన్ = అటుకులను; సుపిష్టకృత తండులాన్ = మంచిగ పిండి చేసిన తండులములను (పిండితో తయారు చేసిన వంటకములను); భుక్తవాన్ = భుజించిన వాడు; జాతు = ఒకప్పుడునూ; నాద్యాత్ = తినరాదు, సుకాంక్షితః = మిక్కిలిగా భోజనమునందు కాంక్ష గలవాడు; మాత్రయా = కొద్ది పరిమాణముతో; అద్యాత్ = తినవలెను, శాకా = శాకమును; వరాన్న = లఘు ఆహారమును; కటు = కారమును; అమ్ల = పులుపును; కషాయ = వగరును; లవణ = ఉప్పును; ఉత్కటమ్ = ఎక్కువగాను, చ = మరియూ; ఏకరసాసాత్మ్యం = ఒకే రసమును ఎల్లప్పుడూ అభ్యసించుటను; గురు = గురు భోజనము; శుష్కం భోజనమ్ = శుష్కభోజనమును; త్యజేత్ = వదిలి పెట్టవలయును; నిదానాదౌ = నిదానము యొక్క ప్రాణమునందు; సర్వదోషప్రకోపనమ్ = సర్వదోషములను ప్రకోపింప చేయునట్టి కారణ సమూహము; యత్ = ఏదైతే; వక్ష్యతే = చెప్పబడునో; తత్ = దానిని; అత్యభిష్యంది = స్రోతస్‌లలో క్లేదత్వము కల్గించువాటిని; విష్టంభి = కడుపులో స్తంభించి జీర్ణము కాకుండు ద్రవ్యములను; విదాహి = విదాహకరములైన; హిమ = శీతమైన, రూక్షణమ్ = రూక్షకరములైన పదార్థములను; కీలాటదధి కూచికా మత్స్య శుష్కామ మూలకమ్ = కిలాటము, దధి, కూచికా, ఎండిన చేపలు, లేత ముల్లంగిని; క్షార పిష్ట విరూఢాద్యం = క్షారములను, పిష్టములను, మొలకెత్తిన ధాన్యములను; తత్ సమస్తం = వీటితో సమానమైన సమస్త పదార్థములను; నశీలయేత్ = అభ్యసింపకూడదు.

**తాత్పర్యము** : కంకులు కాల్చి తినుట, పిసుకుళ్ళు కొట్టి కాల్చి తినుట, అటుకులు భక్షించుట, బియ్యపు పిండితో చేసిన వంటకములను భుజించుట ఒకప్పుడునూ చేయరాదు. ఎక్కువ భోజనము నందిష్టము గలవాడు మాత్రా పరిమాణములో భుజింపవలయును. శాకములను, లఘు ఆహారములను, కటు అమ్ల కషాయ లవణరసములను ఎక్కువగా తినరాదు, ఒకే రసమును సాత్మ్యమగునట్లు ఆహారమునందు చేర్చి భుజింపరాదు. గురు శుష్క భోజనమును వదిలి పెట్టవలయును. నిదాన ప్రారంభమునందు సమస్త వ్యాధులను ప్రకోపింపచేయునట్టి కారణ సమూహము ఏదైతే చెప్పబడునో దానిని వదలి పెట్టవలయును. స్రోతస్‌లలో క్లేదమును కల్గించు పదార్థములను, కడుపులో స్తంభించి జీర్ణము కాకుండు ద్రవ్యములను, విదాహకరపదార్థములను, రూక్ష పదార్థములను, కిలాట, దధి, కూచీకా, శుష్కమత్స్య, ఆమ్ల, మూలకములను, క్షారములను, పిష్టములను మొలకెత్తిన ధాన్యములను వీటితో సమానమైన ఇతర పదార్థములను అభ్యసింపకూడదు.

**శశిలేఖ** : కాండము యొక్క చివర గుత్తిగాయున్న అపక్వమైన పిసుకుళ్ళు మొదలగువానిని, అట్టివే అయిన యవలను, అటుకులను, బియ్యము రవ్వతో చేసిన ఉప్పుడు పిండి మొదలగువానిని భుజించిన తరువాత తినరాదు. మిక్కిలి ఆహారమునందు ఆస గొన్నవాడు చాలా కొద్దిగా తినవలయును. శాక మధికముగా యుండిన, ఒకే రసముతో గూడిన భోజనమును వదిలి పెట్టవలయును. రోగహేతుకమైన ఆహారమును వదిలిపెట్టవలయును. ఏవి రోగ కారణములో వాటిని కూడా అభ్యసించరాదు. మిక్కిలి అభిష్యందికర పదార్థములను కూడా అభ్యసింపకూడదు.

మూ॥ శీలయేచ్ఛాలి గోధుమ యవ పిష్టక జాంగలమ్।
సునిషణ్ణక జీవన్తీ బాలమూలక వాస్తుకమ్॥
పథ్యామలక మృద్వీకా పటోలీ ముద్గ శర్కరాః।
ఘృత దివ్యోదక క్షీర క్షౌద్ర దాడిమ సైంధవమ్॥
త్రిఫలాం మధు సర్పిర్భ్యాం నిశినేత్ర బలాయచ।
స్వాస్థ్యాను వృత్తి కృద్యచ్చ రోగోచ్ఛేదకరం చ యత్॥

**ప్రతిపదార్థము** : శాలి గోధుమ యవ పిష్టిక జాంగలమ్ = రాజనాలు, గోధుమ, యవ, ఎండకారు బియ్యము, జాంగలదేశజంతు మాంసములను; సునిషణ్ణక జీవన్తీ బాలమూలక వాస్తుకమ్ = చంచలికూర, పాలకూర, లేతముల్లంగి, చక్రవర్తికూర; శీలయేత్ = అభ్యసింపవలెను; పథ్యా = కరక; ఆమలక = ఉసిరిక; మృద్వీకా = ద్రాక్ష; పటోలీ = పొట్ల; ముద్గ = పెసలు; శర్కరాః = శర్కరలు; ఘృత = నెయ్యి; దివ్యోదక = ఆకాశోదకము; క్షీర = పాలు; క్షౌద్ర = తేనె; దాడిమ = దానిమ్మ; సైంధవమ్ = సైంధవ లవణము; చ = మరియు; నిశి = రాత్రియందు; నేత్రబలాయ = నేత్రముల బలముకొరకు; మధుసర్పిర్భ్యామ్ = తేనె నెయ్యితో; త్రిఫలాం = త్రిఫలములను, శీలయేత్ = అభ్యసింపవలయును; యచ్చ = యేదైతే; స్వాస్థ్యానువృత్తికృత్ = ఆరోగ్యమును వృద్ధిచేయునో; యత్ = యేదైతే; రోగోచ్ఛేదకరమ్ = వ్యాధులను పరిమార్చునో; తత్ = అట్టి దానిని; శీలయేత్ = అభ్యసింపవలెను.

**తాత్పర్యము** : రాజనాలు, గోధుమలు, ఎడకారుబియ్యము; పాలకూర, లేతముల్లంగి, చంచలికూర, కరక, ఉసిరిక, తేనె నెయ్యి కల్పిన త్రిఫలములను రాత్రియందు, సైంధవ లవణమును, దానిమ్మపండ్లను, గోక్షీరమును, పొట్లకాయలను, నెయ్యిని, ఆకాశోదకమును, పెసలను, శర్కరను, ద్రాక్షను, నిత్యక్రమములో అభ్యసింపవలెను. ఏ ఆహారములు ఆరోగ్యము కల్గించునో, రోగసమూహమును నశింపచేయునో అట్టి ఆహారములను నిరంతరము అభ్యసింపవలయును.

**శశిలేఖ** : శాలిగోధుమాదులను సేవింపవలెను. నేత్రములకు పటిష్ఠతను

కోరువారు తేనె, నెయ్యితో కల్పిన త్రిఫలములను అభ్యసింపవలయును. అట్లే యే ఆహార విహారములు ఆరోగ్యవంతుని ఆరోగ్యమును అనుసరించియూ మరియూ వ్యాధుల నుపశమింప చేయునో అట్టి ఆహారము, విహారము సర్వదా అభ్యసింప వలయును.

మూ॥ స్వభావ మాత్రా యోగాది పరస్పర విపర్యయైః।
భోజనాని విరుధ్యన్తే తానివిద్వాన్ వివర్జయేత్॥
త్యాగా ద్విషమ హేతూనాం సమానాం చోపసేవనాత్।
విషమా నానుబధ్నన్తి జాయన్తే ధాతవః సమాః॥

**ప్రతిపదార్థము :** విద్వాన్ = పండితుడు; స్వభావమాత్రాయోగాది, పరస్పర విపర్యయైః = స్వభావముచేత, మాత్రా ప్రమాణముచేత, సంయోగాదుల చేత, ఒకదానితో నొకటి విరుద్ధమగుటచేత; యానిభోజనాని = యేభోజనములు; విరోధ్యన్తే = విరోధింపబడుచున్నవో; తానిభోజనాని = ఆభోజనములను; వివర్జయేత్ = విడువవలయును; విషమహేతూనాం = వైషమ్యకారణములను; త్యాగాత్ = పరిత్యజించుట వలన; సమానం = సమానకారణములను; ఉపసేవనాత్ = అభ్యసించుటవలన; ధాతవః = సమస్తధాతువులు; విషమాః = విషమములు; నానుబధ్నంతి = అనుబంధములుగాయుండవు; చ = మరియూ; ధాతవం = సమస్త ధాతువులు; సమాః = సమానములుగా, జాయతే = అగుచున్నవి.

**తాత్పర్యము :** ఆహారముయొక్క స్వభావము, మాత్రాపరిమాణము, యోగాదులు పరస్పరము మారుచుండినయెడల, ఆ ఆహారము విరుద్ధముగా తయారగును. పండితుడైనవాడు విరుద్ధ ఆహారవిహారములను ఎల్లపుడూ విడచి పెట్టవలయును, విషమమైన కారణములను వదలిపెట్టి సమానకారణములను అభ్యసించుటవలన విషమధాతువులు శరీరములో ఎప్పుడునూయుండవు. మరియూ ధాతువులు సమానములుగా అగును. విషమకారణభూయిష్టమైన ఆహార విహారములను వదలిపెట్టుటవలన ధాతువులకు విషమత్వము ఎప్పుడునూ ఏర్పడదు. సమానకారణములుగల ఆహారవిహారములను సేవించుటవలన ధాతువులు సమస్థితిలోయుండి ఆరోగ్యమును సర్వదా పరిరక్షించుచుండును.

**శశిలేఖ :** దోషధాతువులయొక్క వైషమ్య కారణములను, స్వభావ మాత్రాది వైషమ్య భూత ఆహార దేశాదులను వదలిపెట్ట వలయును. అందువలన విషమధాతువులు శరీరము నెప్పుడూ అంటిపెట్టుకొని యుండవు. సమానములైన యథోచితములైన ఆహారవిహారములయొక్క నిత్యాభ్యాసమువలన ధాతువులకు సమత్వము గలుగును. స్వకారణ సామగ్రిని విడుచుట వలన తనకు నాశము ఏర్పడును. అట్లే కారణ సామగ్రి సమక్షమున యున్నపుడు పుట్టుక కల్గును.

మూ॥ అన్నేన కుక్షేర్ద్వావంశౌ పానేనైకం ప్రపూరయేత్।
ఆశ్రయంపవనాదీనాం చతుర్థమవశేషయేత్॥

మన్దానల బలారోగ్యనృపేశ్వర సుఖాత్మసు।
యోఽజ్యః క్రమోఽయం సతతం నావశ్యమితరేషుచ॥
కరోతి రూక్షమ్ బలవర్ణనాశమ్।
త్వగ్రూక్షతాం వాతశకృన్నిరోధమ్॥
స్నిగ్ధం త్వతిశ్లేష్మచయ ప్రసేకహృద్గౌ।
రవాలస్యరుచి ప్రణాశాన్॥
అత్యుష్ణమన్నం మదదాహతృష్ణా।
బలప్రణాశభ్రమరక్తపిత్తమ్॥
శీతంతు సాదా రుచి వహ్ని సాద-
హృల్లాసవిష్టంభన రోమహర్షాన్॥
అతిస్థిరం మూత్రశకృత్ విబన్ధ-
మతృప్తిమవ్యాప్తిమ శీఘ్రపక్తిమ్॥
అతి ద్రవం పీనస మేహకాస-
స్యందాన్ కరోత్యగ్ని బలంచ హాని॥

*ప్రతిపదార్థము* : అన్నేన = అన్నముతో, కుక్షేః = కడుపుయొక్క, ద్వౌ అంశౌ = రెండు భాగములను, పానేన = పానముతో, ఏకం = ఒక భాగమును, ప్రపూరయేత్ = పూర్తిగా నింపవలెను, పవనాదీనాం = దోషములకు, ఆశ్రయమ్ = సంచరించు స్థానమైన, చతుర్థమ్ = నాలుగవ భాగమును, అవశేషయేత్ = మిగల్చవలయును, మన్దానల = మందాగ్ని కలవారు, మన్దబల = మధ్యమ బలము కలవారు, మందారోగ్య = స్వల్పారోగ్యవంతులు, నృపేశ్వర = రాజులు, సుఖాత్మసు = భోగపరాయణుల విషయములో, అయం క్రమః = ఈ పద్ధతి, సతతమ్ = ఎల్లప్పుడు, యోజ్యః = సమకూర్చ దగినది. చ = మరియూ, ఇతరేషు = పై చెప్పిన వారు కాక అన్యులందు, అవశ్యః = తప్పక, నయోజ్యః = సమకూర్చ దగినది కాదు. (విధించదగినది కాదు).

రూక్షమ్ = రూక్షాహారము, బలవర్ణనాశనమ్ = శరీరముయొక్క బలమును వర్ణమును పాడుచేయును. త్వగ్రూక్షతామ్ = చర్మమునకు రూక్షతను, వాతశకృన్నిరోధమ్ = అపానవాతము, మలములను అడ్డగించుటను చేయుచున్నది. స్నిగ్ధమ్ = స్నిగ్ధాహారము, అతిశ్లేష్మచయ = మిక్కిలి కఫసంచయమును. హృద్గౌరవ = హృదయమునందు బరువును, ఆలస్య = మాంద్యమును, రుచి ప్రణాశాన్ = రుచిని నశింప చేయుటను, కరోతి = చేయుచున్నది; అత్యుష్ణమ్ = మిక్కిలి వేడియైన, అన్నం = అన్నము, మదమ్ = మదమును, దాహ = దాహమును, తృష్ణ = దప్పిని, బలప్రణాశ = శరీర బలమును నశింపచేయుటను, భ్రమ = తలతిరుగుటను, రక్తపిత్తమ్ = రక్తపిత్తమును, కరోతి = చేయుచున్నది, శీతయేత్ = చల్లని అన్నమైతే = సాద = అన్నమును శిథిలపరచుటను, అరుచి = నోటికిరుచి లేకుండుటను, వహ్నినాశమ్ = జాఠరాగ్ని

నాశమును, హృల్లాసమ్ = ఓకరింతలను, విష్టంభన = విష్టంభనమును, రోమ హర్షాన్ = రోమాంచములను, కరోతి = చేయుచున్నది, అతిస్థిరమ్ = మిక్కిలి కఠిన భోజనము, మూత్ర శకృత్ విబన్ధమ్ = మలమూత్రములకు అవరోధమును, అతృప్తిం = ఆహారతృప్తి లేకుండుటను, అశీఘ్రపక్తిమ్ = త్వరగా ఆహారము పాకము చెందకుండునట్లునూ, కరోతి = చేయుచున్నది, అతిద్రవం = మిక్కిలి పలుచనైన ఆహారము, పీనస = పడిశెమును, మేహ = ప్రమేహమును, కాస = దగ్గును, స్యందాన్ = అభిష్యందమును, కరోతి = చేయుచున్నది, చ = మరియూ, అగ్నిబలం = అగ్ని బలమును, హన్తి = నశింపచేయుచున్నది.

తాత్పర్యము : ఆకలిగొన్నవాడు ఆహారమును సేవించునపుడు పైన విధించిన నియమములన్నింటిని పాటించుచూ ఆమాశయమును నాలుగుభాగములుగా విభజించుకొని అన్నముచేత రెండు భాగములను, ద్రవముతోనొక్క భాగమును, వాతాదులకు నివసించుటకు, సంచారమునకు నాలుగవభాగమును, శూన్యముగా నుంచవలెను. (మిగుల్చవలయును).

భోజనవిధానము శాస్త్రీయముగా నిచట వివరించుచున్నారు. మందాగ్ని కలవారు, మందబలులు, ఆరోగ్యము పూర్తిగా లేనివారు, మహారాజులు, ఐశ్వర్యవంతులు, సుఖభోగులు మొ॥ వారికి ఎల్లపుడు ఈ విధియే ఆచరింపతగినది. తక్కినవారికీ విధి వర్తించదు. రూక్షమైన ఆహారమును భుజించినయెడల బల వర్ణములకు నాశమేర్పడును. చర్మము గరగరలాడుచుండును అపానవాతమునకు మలమునకు అవరోధమేర్పడును.

మిక్కిలి స్నిగ్ధముగానుండుఆహారము, కఫసంచయమును కఫప్రసేకమును చేయును. హృదయమునందు (గుండెలో) బరువు పెట్టినట్లుండును. ఆలసత్వమేర్పడును. నోటికి రుచి నశించును. మిక్కిలి వేడియైన ఆహారము, మదమును, దాహమును. దప్పిని, బలనాశమును, తలతిరుగుటను, రక్తపిత్తమును ఉత్పన్నము చేయును.

మిక్కిలి కఠినముగానుండు అన్నము మలమూత్రములకవరోధమును, ఆహారమును భుజించిన తరువాత నేర్పడు తృప్తిని కలుగకుండుటను, శరీరమునందలి ధాతువృద్ధి కదితోడ్పడకుండుటను, త్వరగాఅహారము పచింపకపోవుటను చేయును.

మిక్కిలి చల్లగానైన అన్నము అన్నమును శిథిలపరచును. అరుచిని, అగ్నిమాంద్యము, ఓకరింతలు, విష్టంభము, రోమాంచములను పుట్టించును.

మిక్కిలి ద్రవముగానున్న ఆహారము పీనసము, ప్రమేహము, దగ్గు, అభిష్యందములను కలుగచేయును. జాఠరాగ్నిని నశింపచేయును.

శశిలేఖ : అన్నముతోకుక్షియొక్క రెండుభాగములను నింపవలయును.

మూడవ భాగమును పానీయములతో నింపవలెను. దోషముల కాశ్రయము గను, సంచరించుటకు స్థానముగనూ, నాలుగవభాగమును వదలవలయును. అట్లు కాని యెడల సమస్త కుక్షిని అన్నపానములతో నింపినయెడల దోషములు నిరాశ్రయములై ఆ అన్నపానములనే మిక్కిలి పీడించి విషూచికా మొదలగు వ్యాధులను త్పత్తిచేయును. ఈ కల్పన అర్థభాగత్రయ తృప్తితో ఊహించ బడుచున్నది. కుక్షియొక్క భాగముగా తెలియబడుటలేదు. ఇదియునూ తర వాత చెప్పబడు అన్నపానక్రమము మందానలాది పురుషులకు చేర్పదగినదిగా యుండును. అవ్యాప్తి యనగా సర్వశరీరమునందు వ్యాపింపక జఠరము యొక్క ఒకే భాగమునందుండుటయని అర్థము. మిక్కిలి ద్రవాహారము పీనసము మొదలగువానిని కలిగించును స్యందమనగా అక్షిరోగమని అర్థము.

మూ॥ అతిమధుర మనల శమనం, భుక్తమసాత్మ్యం నపుష్టయే వపుషః,
అతిలవణ మచక్షుష్యం తీక్ష్ణాత్యమ్లం జరాసాక్షాత్॥
ఇతివిధి మవలంబ్య యోఽన్నపానమ్,
బలమివ విగ్రహవత్స దోషయుక్తే।
తనుమపి తనుజాంరుజాం త్వవాప్య వ్రజతినర నసమాశతస్యపారమ్॥

ఇత్యన్నపాన విధిర్నామ దశమోధ్యాయః।

ప్రతిపదార్థము : అతి మధురమ్ = మిక్కిలి మధురభోజనము, అనల శమనమ్ = జాఠరాగ్నిని శమింపజేయును. అసాత్మ్యమ్ భుక్తమ్ = సాత్మ్యము కానిభోజనము, వపుషః = శరీరముయొక్క, పుష్టయే = పుష్టికొరకు, న = కాదు, అతి లవణమ్ = మిక్కిలిఉప్పగానున్న భోజనము, అచక్షుష్యమ్ = కండ్లకు మంచిది కాదు, తీక్ష్ణాత్యమ్లమ్ = మిక్కిలి తీక్ష్ణమై, మిక్కిలి పులుపుగానున్న భోజనము, సాక్షాత్ = ప్రత్యక్షముగా, జరా = ముసలితనమును కల్గించును, యః = ఏ మాన వుడు, ఇతి విధిమ్ = పై నుదాహరించిన ఆహార నియమమును, అవలంబ్య = అవ లంబించి, అన్నపానమ్ = అన్నపానమును, సదా = ఎల్లప్పుడు, ఉపయుక్తే = సేవించుచున్నాడో, సః నరః = అట్టి మానవుడు, తనుజాం = శరీరమునందు బుట్టిన, తనుం = స్వల్పమయిన, రుజమపి = రోగమునుకూడ, అవాప్య = పొందక, విగ్రహవత్ బలమివ = మూర్తీభవించిన బలము వలె, సమాశతస్య = నూరు సం వత్సరములయొక్క, పారమ్ = అంతమును, వ్రజతి = దాటుచున్నాడు.

ప్రతిపదార్థము : మిక్కిలి మధుర భోజనము జాఠరాగ్నిని శమింప జేయును. అసాత్మ్య భోజనము శరీరమునకు పుష్టిని చేకూర్చును. మిక్కిలి ఉప్పగా నుండు భోజనము కన్నులకు హానిని కల్గించును. మిక్కిలి తీక్ష్ణమైన మిక్కిలి పుల్లగా నున్న భోజనము ప్రత్యక్షముగా ముసలితనమును రప్పించును.

యే మానవుడు పై చెప్పిన నియమములను పాటించుచూ ఎల్లప్పుడూ అన్నపానములను గైకొనునో అట్టి మానవుడు మూర్తీభవించిన బలముకలవాడై

శరీరజన్యములై అతిస్వల్పమయిన వ్యాధుల బారినుండి విముక్తుడై నూరు సంవత్సరములకు ఎక్కువగా కూడ జీవించును.

*శశిలేఖ* : మిక్కిలి మధురాహారము అగ్నినాశకరము. అసాత్మ్య భోజనము దేహామునకు పుష్టిని చేకూర్చును. మిక్కిలి ఉప్పగా నున్న భోజనము కన్నులకు మంచిదిగాదు. ప్రత్యక్షముగా ముసలితనము ఏర్పడుటకు కారణములుగా పేర్కొన్న మిక్కిలి తీక్ష్ణములైన పుల్లనైన ఆహారపానీయములను త్యజింపవలెను. ఈ ప్రకారముగా ఆహారవిధి ననుసరించి యే మానవుడు ఆహారమును నిరంతరము అభ్యసించునో వాడు శరీరమునందుత్పన్నమైన స్వల్ప వ్యాధులను గూడా పొందక మూర్తీభవించిన బలమువలె నూరు సంవత్సరములు జీవించును.

అని ఇందు అను పండితునిచే వ్రాయబడిన అష్టాంగ సంగ్రహాము యొక్క వ్యాఖ్యానమునందు "అన్న పాన విధి" యను పేరుగల దశమాధ్యాయము ముగిసినది.

# అష్టాంగసంగ్రహ వ్యాఖ్యానము

## పదకొండవ అధ్యాయము

అథాతో మాత్రాశితీయన్నామాధ్యాయం వ్యాఖ్యాస్యామ ఇతి హాస్మాహు రాత్రేయాదయో మహర్షయః.

మాత్రాశీస్యాత్। మాత్రాపునరగ్ని బలాహారద్రవ్యాపేక్షిణీ। కుక్షేర ప్రతిపీడన మాహారేణ హృదయస్యాసంరోధః। పార్శ్వయో రవిపాటన మనతి గౌరవ ముదరస్య ప్రీణన మిన్ద్రియాణాంక్షుత్పిపాసోపరతిః స్థానాసనశయన గమనోచ్ఛ్వాసప్రశ్వాస భాష్యసంకథాసుసుఖాను వృత్తిః, సాయంప్రాతశ్చసుఖేన పరిణమనంబల వర్ణోపచయకరత్వం చేతి మాత్రాయా లక్షణమ్.

ప్రతిపదార్థము : అథ = అటుపాత, అతః = ఇందువలన, మాత్రాశితీయన్నామ = మాత్రాశితీయమను పేరుగల, అధ్యాయం=అధ్యాయమును, వ్యాఖ్యాస్యామః = వివరింప గలము, ఇతిహా=ఇట్లని, ఆత్రేయాదయః=ఆత్రేయుడు మొదలగు, మహార్షయః=మహర్షులు, ఆహుస్మ=పలికిరి, మాత్రాశీ= ప్రమాణముతో భుజించువాడుగ,స్యాత్=ఉండవలెను, పునః=మరల, మాత్రా= ప్రమాణము, అగ్నిబలాహారద్రవ్యాపేక్షిణీ = అగ్నిబలమును ఆహారద్రవ్యములను అపేక్షించి యుండును, కుక్షేః = కుక్షికి (కడుపునకు), అప్రతి పీడనం= బాధలేకుండుట, ఆహారేణ=ఆహారముచేత, హృదయస్య=హృదయమునకు, అసంరోధః=అడ్డులేకుండుట, ఉదరస్య=కడుపుయొక్క, పార్శ్వయోః=ఇరుప్రక్కలకు, అవిపాటనం=పగులదీసినట్టు లేకుండుట, అనతి గౌరవం=ఎక్కువ బరువుగా లేకుండుట, ఇన్ద్రియాణాం — చక్షురాది ఇంద్రియములకు, ప్రీణనం= తృప్తిని, క్షుత్పిపాసోపరతిః = ఆకలిదప్పు లుపశమించుట, స్థాన=నిలుచుట, ఆసన= కూర్చుండుట, శయన = పరుండుట, గమన=వెళ్ళుట, (నడచుట), ఉచ్ఛ్వాసోశ్వాస=ఉచ్ఛ్వాసశ్వాసలను విడుచుట తీసుకొనుట, భాష్య=మాట్లాడుట, సంకథాసు=చెప్పుటలయందు, సుఖానువృత్తిః = సుఖముననుభవించుట (చులకనగానుండుట), సాయం = సాయంకాలభోజనము, చ = మరియు, ప్రాతః=ప్రాతఃకాల భోజనము, సుఖేన=సుఖముగ (అనాయాసముగా, తేలికగా), పరిణమనం = పరిణామమును చెందుట (జీర్ణమగుట), చ=మరియు,

బల=బలము, వర్ణ=వర్ణము, ఉపచయకరత్వం=వృద్ధి అగుట మాత్రాయాః= ఆహార ప్రమాణముయొక్క, లక్షణం= లక్షణము.

**తాత్పర్యము** : మాత్రాశితమును అధికరించి చెప్పునధ్యాయముమాత్రాశితీయము. అట్టి మాత్రాశితీయమను అధ్యాయమును ఆత్రేయాది మహర్షులు విపులీకరించి చెప్పుచున్నామని పలికిరి.

ఈ అధ్యాయము మాత్రాశి అని ప్రారంభింపబడినది. ఇచట అశితశబ్దము ఖాద్య, లేహ్య, పేయ ప్రాశ్యములకుసామాన్య బోధకము. చతుర్విధాహారపదార్థములను భుజించుట యన నర్థ పరముగా "అశిత" అను శబ్దము ప్రయోగింపబడినది. ఈ చతుర్విధాహారములను ప్రమాణము ననుసరించి ఉపయోగించవలెను. మరియు చతుర్విధాహారములయొక్క ప్రమాణము అగ్నిబలమును, ఆహారపదార్థములను బట్టి నిర్ణయించవలెను. జాఠరాగ్ని యొక్క హీన, మధ్య, ఉత్తమ బలమును గురు, లఘుగుణములు గల ఆహారపదార్థములను బట్టి ఆహార ప్రమాణమును నిర్ణయించవలయునని భావము. ఉదరము (కడుపు)ను బాధించనిది, (ఆహారమును చేసిన తరువాత) హృదయగతిని అడ్డగించనది, కుక్షి యొక్క ఇరు పార్శ్వములు బాధారహితములుగ నుంచునది, భుజించిన తరువాత కడుపు బరువుగా లేకుండునట్లు చేయునది, చక్షురాది జ్ఞానేంద్రియములకు ప్రసన్నతను కలిగించునది, ఆకలిదప్పుల నుపశమింపజేయునది, కూర్చుండునవుడు, నిలుచునపుడు, పరుండు నవుడు, నడచునవుడు, ఉసను పైకి విడచునవుడు, ఉసను లోనికి తీసుకొనునపుడు, మాట్లాడునపుడు, అధ్యయనాదుల యందు సుఖముగా నుండుట, సాయంకాలమున, ఉదయమున భుజించిన ఆహారము సుఖముగా జీర్ణమగుట, శరీరము యొక్క బలమును వర్ణమును వృద్ధి పరచుట, మొదలగు లక్షణములు ప్రమాణముగ భుజించిన ఆహార మాత్ర యొక్క లక్షణములుగా పేర్కొనబడినవి.

***శశిలేఖ*** : జాఠరాగ్ని బలమును ఆహార ద్రవ్యముల యొక్క గురు, లఘు గుణములను అపేక్షించి ఆహార మాత్ర యుండును. అగ్ని యొక్క హీన మధ్య ఉత్తమత్వమును ద్రవ్యముల యొక్క లఘు, గురు గుణములను బట్టియే పై రెంటికి యోగ్యత్వమును ప్రతిపాదింపబడినది. కడుపు నిండుగా భుజించినప్పటికి నిర్బాధాకరముగ నుండుట మాత్ర లక్షణము. స్థానాసనాదులయందు సుఖమైన ప్రవృత్తి ఏర్పడుట, సాయంత్రము చేసిన భోజనము ఉదయమునకు, ఉదయమున చేసిన భోజనము సాయంత్రమునకు చక్కగా ఆహార పరిణామమేర్పడుట, అనగా రెండు వేళల బాగుగా ఆహారము జీర్ణమగుట అని అర్థము. బల వర్ణాదులు శరీరము నందు పెరుగుట మాత్ర యొక్క లక్షణము.

**వి. వ్యా.** : ఖాద్య=నమలి తినతగినది, ప్రాశ్య=నమలకయే తినదగినది, లేహ్య=నాలుకచే చప్పరించి తినదగినది, పేయ=మిక్కిలి ద్రవ రూపమగుట

చేత గ్రాగదగినది. ఈ చతుర్విధాహార పదార్థములను పరిణామము ననుసరించి భుజింప వలయును. ఆహార పరిణామము అగ్ని బలమును ఆధారముగ కూడ చేసి కొని నిర్ణయించవలసియుండును. జాఠరాగ్ని బలము యొక్క ఉత్తమ, మధ్యమ, అల్ప రూపమైన పరిస్థితిని బట్టి తదానుసారముగ (ఉత్తమాగ్నికి ఉత్తమ పరిణామంబును, మధ్యమాగ్నులకు మధ్యమ పరిణామమును; అల్పాగ్నులకు అల్ప పరిణామమును) మారుచుండును. "ఆహారమాత్రాపునః" అని చెప్పుట చేత ఆహారపదార్థముల పరిణామము మాత్రము అగ్ని బలము ననుసరించి ఉండును గాని ఔషధ పరిమాణమును, వ్యాయామ పరిణామమును జాఠరాగ్ని బలమును అపేక్షింపదని అర్థము. ఈ విధముగ చెప్పుటవలన ఔషధ పరిమాణము రోగి బలమును రోగము యొక్క బలము ననుసరించి ఉత్తమ, మధ్య, అల్ప మాత్రలను కల్పించవలెను. కాని అగ్ని బలము అపేక్షితము కాదనియు, మరియు "పునః" అను పదప్రయోగము చేత బాల్య యౌవన కౌమార వార్థక్య దశలను బట్టి హేమంతాది ఋతు భేదములను బట్టి అగ్ని బలము హెచ్చు, తగ్గులుగా మారు చుండును, కాని ఒకే పద్ధతిగా నుండదు. అందువలన ఆయా కాలములను బట్టి వయోభేదములను బట్టి వ్యాధ్యవస్థా కాలమును బట్టి ఆహార పరిణామమును మార్పు చేయుచుండ వలెను. ఆహార మాత్ర ద్రవ్యముల నపేక్షించి యుండదనియు చరక టీకాకారుడైన చక్రపాణి దత్తుల ఆశయము.

"ప్రాణినాం పునర్మూల మాహారః బలవర్ణౌజసాంచ" (సు. సూ. అ.1) సమస్త మానవాళికి ఆహారము మూలమైనది. మరియు బలమును, వర్ణమును, ఓజస్సును శరీరమునందు వృద్ధి పరచునని సుశ్రుతాచార్యుల అభిప్రాయము.

విశిష్టపదనిర్వచనము : మాత్రాశితం అధికృతోఽధ్యాయో మాత్రాశితీయః.

మూ॥ త్రిభాగసౌహిత్యమర్ధసౌహిత్యంవా గురూణా ముపదిశన్తి, లఘూనామపి నాతిసౌహిత్యమ్.

*ప్రతిపదార్థము* : గురూణాం = గురుగుణద్రవ్యములను, త్రిభాగసౌహిత్యం = త్రిభాగసౌహిత్యముగను. అర్ధసౌహిత్యం = అర్ధసౌహిత్యముగను, ఉపదిశన్తి = చెప్పుచున్నారు, లఘూనామపి = లఘుగుణద్రవ్యములనుగూడ, నాతి సౌహిత్యం = ఎక్కువ తృప్తిగాభుజింపరాదు.

2. సూ॥ అనిలానల గుణబహులానిహి లఘూని, తుల్యగుణత్వాదగ్ని సంధుక్షణాన్య విధినాచాల్ప దోషాణి.

*ప్రతిపదార్థము* : తథాహి = అదియునేమే, లఘూని = లఘుగుణములు గల ద్రవ్యములు, అనిలానల గుణబహులాని = వాయువు అగ్ని ఈ రెండు ధాతములయొక్క గుణములు అధికములుగాగలవి, చ = మరియు, తుల్యగుణ

త్వాత్ = సమానమైన గుణములు కలిగియుండుటవలనను, అవిధినా = ప్రమాణ మును మించి ఎక్కువ భుజించినను, అగ్నిసంధుక్షణాని = జాఠరాగ్నిని వృద్ధి చేయునవిగ, అల్పదోషాణి = స్వల్పమైన దోషములుగలవిగా, భవంతి = అగు చున్నవి.

3. మూ॥ ఇతరాణితు పృధివీసలిలగుణ బహుళాన్య సామాన్యా ద్విపరీతా న్యన్యత్ర వ్యాయామాగ్ని బలాత్.

ప్రతిపదార్థము : ఇతరాణితు = గుర్వాది గుణద్రవ్యములైతే, పృధివి సలిల గుణబహులాని = పృధివిజలములయొక్క గుణములు అధికముగా కలవి, అసామాన్యాత్ = సమాన గుణములు లేనందువలన, వ్యాయామాగ్ని బలాద న్యత్ర = వ్యాయామము అగ్నిబలములేని వ్యక్తులపట్ల, విపరీతాని = హాని కారక ములు.

4 మూ॥ అమాత్రాపునరశనస్య హీనతాఽధిక్యంచ, తత్రహీన మాత్ర మశనం బలవర్ణోపచయ మనోబుద్ధీంద్రియోప ఘాతకరం విబంధకృత్ అవృష్యం అనాయుష్యం అనౌజస్యం సార విధ్మాపనం అలక్ష్మీజననం అశీతేశ్చ వాత వికా రాణామాయతనమ్। అతి మాత్రం పునః సర్వదోషప్రకోపనమాహుః.

ప్రతిపదార్థము : పునః = మరల, అమాత్రా = మాత్రకానిది, హీనతా = స్వల్పపరిమాణము, చ = మరియు, అధిక్యం = ఎక్కువ పరిమాణముకలది, తత్ర = వీటిలో, హీనమాత్రమశనం = స్వల్ప పరిమాణముతో భుజింపబడిన భోజనము, బల = శరీరబలమును, వర్ణ = శరీరవర్ణమును, ఉపచయ = పుష్టిని, మన = మనో బలమును, బుద్ధి = బుద్ధిని, ఇంద్రియ = చక్షురాది ఇంద్రియములను, ఉపఘాత కరం = అడ్డగించును (వీటివృద్ధికి అవరోధము కలిగించును), విబంధకృత్ = పురీష మును అడ్డగించును, అవృష్యం = శుక్రమును వృద్ధిచేయదు, అనాయుష్యం = ఆయుర్వృద్ధిని చేయదు, అనౌజస్యం = ఓజోవృద్ధికరముకాదు, సార విధ్మా పనం = త్వక్సార, రక్తసారములను అష్టవిధసారములను క్షీణింప చేయును, అలక్ష్మీ జననం = దరిద్రమునుకలిగించును, అశీతేశ్చవాతవికారాణాం = 80 విధము లైన వాతరోగములకు, ఆయతనం = నిలయమగును, పునః = మరల, అతి మాత్రం = ఎక్కువ ప్రమాణములో భుజించిన ఎడల, సర్వదోష ప్రకోపనం = అన్ని దోషములు ప్రకోపించునని, ఆహుః = చెప్పిరి.

5. మూ॥ తేనహి ప్రపీడ్యమానా వాతాదయో యుగపత్ప్రకుపితాః కుక్ష్యేకదేశస్థాస్త దేవాపరిపక్వమావిశ్యవిష్టంభయంతః అలసక మభినిర్వ ర్త యంతి, సహసావాధరోత్తరాభ్యాం మార్గాభ్యాం ప్రచ్యావయన్తో విషూచి కాం. అపిచ.

ప్రతిపదార్థము : తదాహి = అదియుక్తము, తేన = ఎక్కువగా ఆహారము

భుజించుటచేత, వాతాదయః=వాతాదిదోషములు, ప్రపీడ్యమానాస్సంతః= అధికాహారముచేత మిక్కిలి పీడింపబడినవై, యుగపత్=ఒక్కమారు, ప్రకుపితాః=ప్రకోపింపబడినవై, కుక్ష్యేకదేశస్థాః = కుక్షియొక్క ఒక ప్రదేశము నందుండి, తదపరిపక్వమేవ = ఆ అపరిపక్వ ఆహారమునందే, ఆవిశ్య= ప్రవేశించి, విష్టంభయన్తః=ఉదరమునందు స్తబ్ధతను పుట్టించినవై, అలసకం=అలసకమను రోగమును, అభినిర్వర్తయన్తి=పుట్టించు చున్నవి, వా= లేక, అపిచ= మరియును, సహస=శీఘ్రముగా, అధరోత్తరాభ్యాం మార్గాభ్యాం=ఊర్ధ్వాధో మార్గమునుండి, ప్రచ్యావయన్తః=ఆహారమును బయటికి నెట్టుచూ, విసూచికాం=విసూచికారోగమును, కుర్వంతి=చేయుచున్నది.

తాత్పర్యము : భగవంతుడైన పునర్వసు ఆహారమాత్రా విషయములో "యావత్ హి అస్యఅశితం అశనం అనుపహత్య ప్రకృతిం యథాకాలం జరాం గచ్ఛతి తావత్ అస్యమాత్రా ప్రమాణం వేదితవ్యం భవతి" చ. సూ. అ. 5/4 అని చెప్పెను. చతుర్విధములైన ఆహారపదార్థముల నెంత పరిమాణముతో తీసికొనునో ఆవ్యక్తికి వాతాది దోషములును, రసాదిధాతువులును చెడక స్వభావస్థితిలోనుండి జీర్ణమునకు నిర్ణయించిన కాలమునకు సుఖముగ జీర్ణమగునో అంత పరిమాణము ఆమనుజునకు మాత్రగనిర్ణయింప వలెనని అర్థము.

పైనుదాహరించిన సూత్రములు సంగ్రహకారుడు త్రివిధకుక్షీయ విమానము నందలి సూత్రములనే ఉద్ధరించినట్లు కనబడు చున్నది. సంగ్రహకారుడు, ఆహారమును భుజించు మానవుడు తానుభుజించు ఆహార పదార్థమునకు తన కుక్షిలోనుండు అవకాశమును నాలుగు భాగములుగ విభజించి గురుగుణములు గల ద్రవ్యములతో కూడిన ఆహారమును 3 భాగములుగనో లేక రెండు భాగములుగనో భుజించవలయునని చెప్పెను. లఘుగుణముగల ద్రవ్యములతో కూడిన ఆహారముకూడ ఎక్కువగా భుజించరాదని నుడివెను. ఈ విషయమునె వాగ్భటాచార్యులు "అన్నేన కుక్షేర్ద్వావంశౌ పానేనైకం ప్రపూరయేత్। ఆశ్రయం పవనాదీనాం చతుర్థమవశేషయేత్" అని ఉపదేశించిరి. కుక్షిలో రెండుభాగములను అన్నాది ఘన పదార్థములచేతను, ద్రవముచే నొక భాగమునునింపి, వాతాదుల కాశ్రయమునకై నాల్గవభాగమును విడిగానుంచ వలెనని అర్థము.

లఘుద్రవ్యములతోకూడినఆహారమునుకూడ మిక్కిలి తృప్తిగా భుజించరాదు. లఘు ఆహారములయందు వాయు అగ్ని భూతములయొక్క గుణములు ఎక్కువగా నుండును. గుణసామ్యత వలన జాఠరాగ్నిని వృద్ధి పరచుచున్నది. విధిని విడచి మాత్రకంటె ఎక్కువ భుజించినప్పటికిని శరీరమునకు హానికలుగదు

గురుగుణయుక్తములైన ఆహారములయందు పృథ్వీ, అప్‌భూతముల యొక్క గుణములు ఎక్కువగా నుండును. ఈ గుణములు సమానముగా నుండ

నందున అగ్నిని నశింపచేయును. అందువలన ఎక్కువ పరిమాణంతో ఆహారం సేవించిన ఎక్కువ హాని కలుగును. వ్యాయామము చేయుటచేత అగ్నిబలము ఎక్కువగా నున్నందున ఆహారము చక్కగా పాకమగును. ఆహారము స్వల్ప మాత్రగలది, అధికమాత్ర గలది అని రెండు విధములు. స్వల్పమాత్రతో సేవించిన ఆహారము శరీరము యొక్క బలమును, కాంతిని, పుష్టిని, మనోబల మును, బుద్ధిని, చక్షురాది ఇంద్రియములను పెరుగనివ్వదు. మూత్రపురీషముల నడ్డగించును. సంభోగశక్తిని తగ్గించును. దరిద్రము నాపాదింపచేయును. 80 విధములైన వాతరోగములకు నిలయమగును.

ఎక్కువ ప్రమాణములో భోజనము చేసిన యెడల వెంటనే అన్ని దోష ములు ప్రకోపించునని నుడివిరి. చతుర్విధములైన ఆహారములను భుజించిన వానికి ఆమాశయమునందు వాత, పిత్త, కఫములు మూడును, అట్టి అతి మాత్రాహారము వలన మిక్కిలి పీడింపబడి అన్నియు సమకాలమున ప్రకోపము నొందును. అట్లు ప్రకుపితములైన త్రిదోషములును జీర్ణముకాని ఆహార సము దాయమును ప్రవేశించి కుక్షిలో నొకభాగమున అన్నమును ఆశ్రయించి కడు పులో గడబిడచేసి శీఘ్రముగా ఊర్ధ్వాధోమార్గముల నుండి అన్నమును వెడ లించుచు అలసకము, విషూచికను కల్గించును.

మరియు మాత్ర రెండు విధములుగా నుండునని చరక విమాన స్థానము నందలి త్రివిధ కుక్షీయమను యధ్యాయమునందు కలదు. అది సర్వగ్రహరూపము, పరిగ్రహరూపమని రెండు విధములు. అందు మధురాదిషడ్రస విశేషములతో కూడిన ఆహార సముదాయమునకు సంబంధించినది సర్వగ్రహరూప మాత్ర; అట్టి ఆహార సముదాయములకు అవయవములైన మధురాదిరస విశేష పదార్థములకు ప్రత్యేకముగా చెప్పబడిన పరిమాణము పరిగ్రహరూపమనబడును. కావున ఆహార సముదాయము ననుసరించి మాత్రాప్రమాణము కల్పించిభు జించవలెను.

విమాన స్థానమునందు కుక్షిని 3 భాగములుగావిభజించి దానిలో 3 వంతు ఘన పదార్థములచేతను, మరియొక వంతు ద్రవరూపముచే నింపి, మరియొక వంతు వాతాది సంచారమునకు విడిగా నుండునట్లు కల్పించి భుజించవలయునని, ఇదియే ఆహారమునకు ప్రశస్తమైనమాత్రయనియు నుడివిరి.

ఆహారమును గురించి చెప్పు సమయంలో ఎనిమిది విధములైన ఆహార విధి, విశేషాయతనములనుకూడ దృష్టియందుంచుకొని మాత్రను కల్పించవలసి యుండును. చరక, వాగ్భటాదుల యొక్క అభిమతమును దృష్టియందుంచు కొని వీటన్నింటియొక్క పిండీభూతమైన అభిప్రాయము ఇట్లు తెలియుచున్నది. ఆహార పరిమాణము జాఠరాగ్ని ననుసరించి కాలాదులనుబట్టి, వయస్సుయొక్క అవస్థాభేదములనుబట్టి నిర్ణయించవలసి యుండునని సిద్ధాంతపరముగా చెప్ప వచ్చును.

శశిలేఖ : గురుగుణముగల ఆహారపదార్థములలో స్వభావ సంస్కారాదులను అపేక్షించి పురుషబలము నపేక్షించియు త్రిభాగ సౌహిత్యము, అర్ధసౌహిత్యము నిర్ణయించవలసి యుండును. ఎక్కువ ఆహారమును సేవించిన యెడల దోషములను పీడించుచు కుక్షిని నింపి ఆ ఆహారము కుక్షి యందే యుండును. అచటనే అడ్డగింపబడిన మార్గముగలవై దోషములు అంతర్వ్యాహారమును ప్రవేశించి రెండు విధములుగా చేయుచున్నవి. ఒకప్పుడు ఆ అన్నము అడ్డగింపబడినదై అలసకమను రోగము కల్గించుచున్నది. అట్లుకాని యెడల పక్వాపక్వరూపమైన అన్నమును బయటికి పంపుచున్నది. దీనినే విషూచిక రోగమందురు.

సూ॥ ప్రయాతి నోర్ధ్వంనాధస్తా దాహారోనచపచ్యతే।
ఆమాశయేఽలసీ భూతస్తే నసోఽలసకః స్మృతః॥
వివిధై ర్వేదనోద్భేదై ర్వాయ్వాదిభృశకోపతః
సూచీభిరివగాత్రాణి విధ్యతీతి విషూచికా॥

తత్రవాతః శూలానాహాంగమర్దముఖశోష ప్రలాపకంప మూర్ఛాభ్రమ జృంభోద్వేష్టనాక్షిప్రవేశశిరో హృదయార్తి రుక్సిరాకుంచన స్తంభనాని కరోతి। పిత్తం పునర్జ్వరాతి సారాన్తర్దాహ వైవర్ణ్యతృష్ణామద భ్రమ ప్రళయాని। శ్లేష్మాతు ఛర్ద్యరోచక ప్రసేకాంగసాదా విపాకశత జ్వరగాత్రగౌరవాణి। విశేషతస్తు దుర్బలస్య అల్పవహ్నేర్బహుశ్లేష్మాణో వాత మూత్ర పురీషవేగ విదారిణోఽన్నపానమనిల ప్రపీడితం శ్లేష్మాణో విబద్ధమార్గమలసత్వాద బహిర్ముఖి భవత్ ఛర్ద్యతి సారవర్జ్యాని యథోక్తాని శూలాదీన్యుపజనయత్యతి మాత్రాణి। సోఽలసః। అతిమాత్రదుష్టాస్తుదోషాః ప్రదుష్టామబద్ధ మార్గాస్తిర్యగ్గచ్ఛన్తః। కదాచిదస్య శరీరం దండవత్ స్తంభయంతి తత స్తమలసక మసాధ్యం బ్రువతే।

ప్రతిపదార్థము : ఆహారః = పరిమాణము నతిక్రమించి భుజించిన ఆహారము, ఉర్ధ్వం = పై భాగమును, నప్రయాతి = పొందదు, అధస్తాత్ = క్రింది భాగము నుండి, నప్రయాతి = వెళ్ళదు, నచపచ్యతే = పచింపచేయబడదు, చ = మరియు, ఆమాశయే = ఆమాశయమునందు, అలసీభూతః = డస్సిన వానివలె నుండినట్టి, సః = ఆ ఆహారము, అలసకః = అలసకమను వ్యాధిగా, స్మృతః = చెప్పబడినది, వాయ్వాదిభృశకోపతః = వాతపిత్తకఫములు ఎక్కువ కుపితములగుట వలన, వివిధైః = పలు విధములైన, వేదనోద్భేదైః = వేదనాదులతో, గాత్రాణి = అవయవములు, సూచిభిరివ = సూదులతో గ్రుచ్చినట్టువలె, విధ్యతీతి = బాధించినట్లుండుట వలన, విషూచికా = విషూచికయను వ్యాధి, జాయతే = ఏర్పడుచున్నది, తత్ర = ఆ వ్యాధులలో, వాతః = వాతము, శూల = శూలము, ఆనాహ = కడుపుబ్బరము, అంగమర్ద = ఒడలునెప్పులు, ముఖశోష = దప్పిచేత నోరెండుట, ప్రలాప = ప్రలాపము, కమ్ప = వణకుట, మూర్ఛ = స్మృతితప్పి పడియుండుట, భ్రమ = తలతిరుగుట, జృంభ = ఆవలింతలు,

ఉద్వేష్టన=మాంసపేశుల యందు గుంజినట్లుండుట, అక్షిప్రవేశ=నేత్రములు లోనికి గుంజుకొని పోవుట, శిరోహృదయాతిరుక్=శిరస్సు, హృదయముల యందు మిక్కిలిబాధ, సిరాకుంచన=రసాదిసిరలకు సంకోచము, స్తంభనాని=హృదయాదుల యొక్క గతి నిరోధములను, కరోతి=చేయును.

పునః=మరల, పిత్తం=పిత్తము, జ్వర=జ్వరమును, అతిసార=అతిసారరోగమును, అంతర్దాహ=హృదయమునందు, ఉదరమునందుమంట, వైవర్ణ్య=కాంతి లేకుండుటను, తృష్ణా=దప్పిని, మద=మదమును, భ్రమ=భ్రమమును, ప్రలాపాని=ప్రలాపములను, కరోతి=చేయును.

శ్లేష్మాతు=కఫమయితే, ఛర్ది=వాంతిని, అరోచక=అరోచకమును ప్రసేక=ప్రసేకమును, అంగసాద=ఒడలినెప్పులను, అవిపాక=ఆమమును శీతజ్వర=శీతజ్వరమును, గాత్ర గౌరవానిశరీర=గౌరవములను, కరోతి=చేయుచున్నది.

విశేషస్తు=అలసకము లందలి విశేషలక్షణములు, దుర్బలస్య=బలహీనమైన, అల్పాగ్నేః=అల్పాగ్ని గలవానికి, బహుశ్లేష్మణః=ఎక్కువ కఫప్రకుపితునికి, వాతమూత్ర పురీషవేగ విధారిణః=వాతాది వేగములను అడ్డగించిన వారికి, అన్నపానం=అన్నపానములు, అనిల ప్రపీడితం=వాయువుచేత మిక్కిలి పీడింపబడినవై, శ్లేష్మణే=శ్లేష్మముతో, విబద్ధ మార్గం=అడ్డగింపబడిన స్రోతోమార్గముగలవై అలసత్వాత్=చలరహితమగుటవలన, అబహిర్ముఖ=వెలుపలికి రాజాలనివిగా, భవేత్=అగును, ఛర్ద్యతీ సారవర్జ్యాని=ఛర్ది, అతీసారము ఈ రెంటిని వదలి, అతి మాత్రాణి=మిక్కిలి ఎక్కువగా శూలాదీని=శూలాదులను, ఉపజనయతి=కలిగించు చున్నది, సః=అది, అలసకః=అలసకము.

అతి మాత్రదుష్టాస్తు=మిక్కిలి దుష్టములైతే, దోషాః=దోషములు (వాతపిత్తశ్లేష్మలు), ప్రదుష్టామబద్ధమార్గాః=మిక్కిలి దూషింపబడిన ఆమము చేత అడ్డగింపబడినస్రోతో మార్గములుగలవై, తిర్యగ్గచ్ఛంతః=అడ్డముగ సంచరించుచు, కదాచిత్=ఒకానొకప్పుడు, అస్య=వీనియొక్క, శరీరం=దేహమును, దండవత్=కఱ్ఱవలె, స్తంభయంతి=స్తంభింప చేయుచున్నవి. తతః=అందువలన, తం=దానిని, అసాధ్యం=సాధ్యముకాని (చికిత్సలకు లొంగని) అలసకం=అలసకముగ, బ్రువతే=చెప్పబడుచున్నది.

**తాత్పర్యము :** అలసకమను రోగమునందు ఆహారము వమనరూపముగ గాని విరేచన రూపముగకాని వెలుపలికిరాదు. కాని డస్సిన మానవునివలె ఆమాశయమునందే డస్సిపోయిన దానివలె అట్లే వుండును. విషూచికయందు శరీరముపై సూదులతో పొడిచినట్లు బాధకలుగును. వాతపిత్త శ్లేష్మములు మిక్కిలి ప్రకుపితములై నందున శూల జ్వరము భ్రాంతి మొదలగు నానా విధము లైన బాధలేర్పడును,

అలసక, విషూచికారోగములయందు వాతము, శూలాదులను కలిగించును. పిత్తము జ్వరాతి సారాదులను పుట్టించును. కఫము వాంతులు అరోచకము మొదలగు ఉపద్రవముల నేర్పరుచును. అలసకమునందు కడుపుబ్బరము అను లక్షణము లుండుటవలన వమనము అతిసారము ఉండదు. మరియు వమనములు, విరేచనములు ఉన్నప్పటికిని చికిత్సలద్వార అవి శాంతించగలవు. అలసకమునందు విశేషముగ జాఠరాగ్ని దుర్బలముగను, మందముగను ఉండును. కఫము ఎక్కువ వృద్ధముగా నుండువానికి అపానవాతము, మూత్రపురీష వేగములను అడ్డగించినవానికి తాను భుజించిన అన్నపానములు వాతము చేత పీడితములై శ్లేష్మముచేత అడ్డగింప బడిన స్రోతో మార్గములుకలిగి కదులుటకు వీలులేక బహిర్గతములు కాజాలవు. అందువలన ఛర్ది అతిసారము ఈరెండు లక్షణములు లేకుండును. మరియు శూలాదులు మాత్రము ఎక్కువగనే బాధించును మిక్కిలి దుష్టములైన పిత్తశ్లేష్మలచేత దూషింపబడినఅపక్వాహారము స్రోతో మార్గములుగూడ రుద్ధములగుట వలన వెలుపలికి రాజాలక ఆమాశయమునందే ఉండును. స్రోతోమార్గములు ఆమరసపూరితములైనందువలన ఊర్ధ్వాధో మార్గములయందు సంచరించుటకు వీలులేని దోషములు అడ్డముగా సంచరించుచు శాకతాళీయముగ రోగియొక్క శరీరమును కర్రవలె స్తంభింప చేయును. ఇదియే దండాలసకమని చెప్పెదరు.

*శశిలేఖ :* వాయ్వాదులు మిక్కిలి వృద్ధములగుట వలన పలువిధములైన బాధలను శరీరమువందు సృష్టించి-సూదులతో గ్రుచ్చినట్లుగా అవయవములలో నొప్పిని కలిగించి, శరీరమును పగులగొట్టినట్లు బాధను కలిగించునది విషూచిక యని చెప్పబడును. విషూచికా రోగమునందు కారణ భూతమైన వాతము అధికాంశమునందున్నప్పుడు శూలాదులను కలిగించును. శరీరావయవములన్నియు త్రాళ్ళతో బంధించినట్లుండును. పిత్తము ఎక్కువగా నున్న జ్వరాదులను కలిగించును. మూర్ఛయను లక్షణముకూడ ఉండును. వృద్ధిచెందిన శ్లేష్మము వాంతులు మొదలగు వికారములను పుట్టించును. ఎక్కువ భుజించు వారందరికి సర్వసామాన్యముగ వాతము, శూలాదులను కలిగించును. జాఠరాగ్ని మందముగ దుర్బలముగ నున్నవారు ఎక్కువ భుజించిన యెడల విశేషముగ వాతము ప్రకోపించి అన్నమును దూషించును. ఇట్లు అన్నము వాతముచేత దూషితమై శ్లేష్మముచేత ఏకీకృతముగా చేయబడి అలసత చెంది స్రోతోమార్గములు కఫప్రపూరితములుగా నున్నందున ఛర్ది, అతీసారము ఈ వ్యాధులను కలిగింపక భరింపశక్యముకాని శూలాదులను కలిగించును. ఇదియె అలసక రోగము.

ఎక్కువగా భుజించుట వలన మిక్కిలి ప్రకోపించిన వాతాదులు ముందే ద్వేషింపబడిన ఆమరసముచేత పూరింపబడి అడ్డగించి స్రోతోమార్గములు కలవై అడ్డముగ సంచరించు స్రోతోమార్గములద్వార వెళ్ళుచూ ఒకానొకప్పుడు

పై నుదాహరించిన మానవుని యొక్క శరీరమును కర్రవలె స్తంభింపచేయును.
దీనినే దండాలసక మందురు.

మూ॥ విరుద్ధాద్యశనాజీర్ణ శీలినః పునరామదోష మామ విషమామనంతి। విషసదృశలింగత్వాత్। తత్పరమసాధ్యానం। ఆశుకారితయా విరుద్ధోపక్రమ త్వాచ్చ। నచకేవలం మాత్రయైవకృత్స్న మాహార ఫలమవాప్తుం శక్యంస్వభావా దీనాం భిన్నఫలత్వాత్।

ప్రతిపదార్థము : విరుద్ధ = విరుద్ధాహారమును, అధ్యశన = అత్యాహార మును, అజీర్ణ = అజీర్ణాహారమును, శీలనః = విడువక చేయుచుండు వానికి, పునః = మరల, ఆమదోషం = ఆమదోషము, తదేవ = అదియె, ఆమవిషం = ఆమ విషమని, ఆమనంతి = చెప్పుచున్నారు, విష సదృశలింగత్వాత్ = విషముతో సమానమైన లక్షణము లుండుటవలన, ఆశుకారితయా = ఆశుకారియగుటచేత, చ = మరియు, విరుద్ధోపక్రమత్వాత్ = విరుద్ధమైన చికిత్సగలది యగుటవలన, తత్ = అది, పరం = మిక్కిలి, అసాధ్యం = కష్టతమమైనది, కేవలం = కేవలము, కృత్స్నం ఆహారఫలం = విధివిహితమైన ఆహారము వలన గలుగు ఫలము, అవాప్తుం = పొందుటకు, నశక్యం = సాధ్యముకాదు, స్వభావదీనాం = స్వభావాదు లకు, భిన్నఫలత్వాత్ = ఫలములు వేరుగా నుండును.

తాత్పర్యము : వీర్యవిరుద్ధమయిన క్షీరమత్స్యాదులను భుజించువారికి, భుజించిన ఆహారము జీర్ణము కాకమునుపె మరల భుజించువానికి, అపక్వమయిన ఆహారము భుజించువానికి ఏర్పడిన ఆమదోషమును ఆమవిషమని చెప్పుచున్నారు. విషమునకు సమానమైన ఆశుకారిత్వాది లక్షణములు కలిగియుండుటచేత భిష గ్వరులు ఆమవిషమని కూడ పేర్కొనిరి. ఇది ఆశుకారియు (వెంటనే చంపునది) విరుద్ధ చికిత్స చేయవలసినదియు నగుటవలన మిక్కిలి యసాధ్యమని చెప్పుదురు. మరియు శాస్త్రవిహితమైన పరిమాణముతో ఆహారమును భుజించినప్పటికి ఫలము శూన్యము. ప్రకృతి సిద్ధ, ద్రవ్య గుణములు వేరు, సంయోగమువలన ఏర్పడు గుణములు వేరుగా శాస్త్రమునందు చెప్పబడినవి.

శశిలేఖ : యెవడువిరుద్ధాద్యాహారములను తరచుగా ఉపయోగించునో వానికి ఆమము దూషింపబడు చున్నది. ఆమముదూషింప బడుచున్నది. ఆమము దూషింప బడినదగు చుండగ విషమును భుజించిన వానికివలె బాధలు వుత్పన్న ములగును. అప్పుడు ఆచార్యులు దీనిని ఆమవిషమని చెప్పుచున్నారు. అచట విషమునకుండు లక్షణములన్నియు ఉండును. ఆ ఆమవిషము అసాధ్య మైన అన్ని రోగములలో మిక్కిలి అసాధ్యమైనది. ఎందుకనగా ఆశుకారిత్వము విరుద్ధోపక్రమత్వమను రెండులక్షణములును అచటగలవు. "ఆశుశ్శీఘ్రం స్వం కర్మ మరణం కరోతీతి" ఆశుకారి. యని ఆశుకారి శబ్దమునకు సమానార్థ ములు. ఒకదోషము శాంతింపచేయుట కుపయోగింపబడిన ఔషధము మర్రి

యొక్క దోషవిషయములో విరోధించునో దానిని విరుద్ధోపక్రమమని చెప్పు చున్నారు. ఇతరులు ఇంకొక పద్ధతిలో పై విషయమునిట్లు చెప్పుచున్నారు. ఆమము విషమువలె స్వరూపమును పొంది బాధలను కలిగించు చున్నది. విషము నందు శీతక్రియ శాస్త్రసమ్మతము. ఆమమునందు, అజీర్ణమునందు ఉష్ణచికిత్స విధిగాచేయ వలెను. ప్రమాణము ననుసరించి భుజించినంత మాత్రమున నేదాన గలుగు బలవర్ణోపచయత్వాది రూపఫలములను పొందుటకు శక్యముగాదు. ఎందు కనగా అచట ఔషధ స్వభావము, ఔషధ సంయోజనము, కాలము మొదలగున వన్నియు చికిత్సాసిద్ధికి అంగభూతములే. అందువలన మాత్ర యొకటియే ఆరోగ్యమునకు కారణము కాదు.

వి. వ్యా. : ఆమదోషమును పోగొట్టుటకై ఉష్ణరూపమయిన చికిత్స చేయవలయును. అది విషమునకు విరుద్ధమయిన చికిత్స అగును. విషమునకు ప్రతీ కారరూపమైన శీతచికిత్స ఆమదోషమునకు విరుద్ధమైనది. ఇట్లు విరుద్ధోప క్రమము సంభవించుటచేత ఆమవిషము మిక్కిలి అసాధ్యము. "విద్యాదధ్యశనం భూయోభుక్తస్యోపరిభోజనం". జీర్ణము కాని యపుడు మరల భుజించిన ఆహా రమునకు అధ్యశనమని పేరు. సాయం ప్రాతర్మనుష్యాణాం భోజనం విధి నిర్మిత మని వ్యాసుడుగూడ చెప్పియున్నాడు. విరుద్ధాశనమనగా వీర్యాదులచేత విరు ద్ధమైనదని తెలియ వలెను. అజీర్ణాశనమనగ పక్వముగాని పదార్థములను భుజించుట అని మూడు విధముల ఆహారమును విభజించి ఆ మూడు కారణముల చేతనే ఆమవిషము సంభవించునవి సిద్ధాన్తీకరింపబడినది.

మూ॥ తథాహి। గురురూక్ష శుష్క శీత ద్విష్టవిష్టంభి విదాహ్యాశుచి విరుద్ధాత్యంబుపానద్రవ మకాలే కాలేవా కామక్రోధలోభేర్ష్యా హ్రీశోకో ద్వేగభయదుపతప్తేనదాయదన్న పానము పయుజ్యతే తదప్యామమేవప్రదూష యతి.

ప్రతిపదార్థము :- తథాహి = అదియుక్తమే, గురు = గురుగుణములుగల, రూక్ష = రూక్షగుణములుగల, శుష్క = శుష్కములైన (ఎండిన) శీత = మిక్కిలి చల్లగానున్న, ద్విష్ట = మనోరంజకములుకాని, విష్టంభి = గురుగుణ యుక్తము లైన భక్ష్యాదులను తినుట వలన, విదాహి = దాహమున కలిగించు ద్రవ్యము లను తినుట వలన, అశుచి = అపవిత్రమైన, విరుద్ధ = విరుద్ధమైన, అత్యంబు పాన = ఎక్కువ నీటిని త్రాగుటచేత, పాన = ఆహారము మిక్కిలి పలుచగా చేయుపానము చేత, వా = లేక, కామ = కామముచేత, క్రోధ = క్రోధముచేత, లోభ = పిసినిగొట్టు తనముచేత, ఈర్ష్యా = ఈర్ష్యచేత, హ్రీ = సిగ్గుచేత, శోక = దుఃఖముచేత, ఉద్వేగ = ఉద్వేగము, భయ = భయముచేత, క్షుదుపతప్తేన = ఉపవాసము చేసినవానిచేత, యత్ = యే, అన్నపానం = అన్నపానము, ఉప యుజ్యతే = ఉపయోగింపబడుచున్నదో, తదపి = ఆ అన్నపానములుకూడ,

ఆమమేవ=ఆమమునే, ప్రదూషయతి=మిక్కిలి దూషింపచేయు చున్నవి.

**తాత్పర్యము :** గురురూక్షగుణములుగల, ఎండిన, చల్లనైన అన్న పానములు మనస్సున కింపైనవిగాని అన్నపానములు, విష్టంభకారకములైన గుర్వాది గుణములతో కూడిన అన్నపానములు, అశుచిగానున్న అన్నపానములు, ఎక్కువగా నీరుత్రాగుటచేత ఆహారము ద్రవ ప్రాయమగునట్లు చేయు పానీయములు సేవించుటచేతను, కామ,క్రోధ,లోభ, ఈర్ష్యా,లజ్జ శోకములచేత తపించు మానవునిచేత సేవింపబడిన అన్నపానములు, చాలదినములుపవశించి వెంటనే మరల అధికముగ సేవించిన అన్నపానములు ఆమమునే మరల దూషించును.

*శశిలేఖ :* గురుత్వాది గుణములతో కూడియున్న అన్నపానములు ఆమమునే దూషించు చున్నవి, అసాధ్యమని నిర్ణయింప బడిన ఆమము దూషితమై అలసత్వమును పొందుచున్నది.

వి. వ్యా. ఆమలక్షణమును వైద్యవరులు భిన్నభిన్న భావములతో వివరించిరి. వారి అభిప్రాయబోధకములైన కొన్ని ఆమస్వరూప లక్షణముల నిచట పొందుపరచుచున్నాను.

శ్లో॥ ఊష్మణోఽల్పబలత్వేనధాతు మాద్యమపాచితమ్।
దుష్టమామాశయగతం రసమామం ప్రచక్షతే.

ఆమాశయస్థః కాయాగ్నేః దౌర్బల్యాద విపాచితః, అద్యః
ఆహారధాతుః యః స అమ ఇతి కీర్తితః।

అవి పక్వం అసంయుక్తం దుర్గన్ధం బహుపిచ్ఛిలమ్।
సదనం సర్వగాత్రాణాం ఆమ ఇత్యభిధీయతే।

ఆహారస్యరసః శేషోయోన పక్వోఽగ్నిలాఘవాత్।
సమూలం సర్వరోగాణాం ఆమ ఇత్యభిధీయతే।

ఆమం అన్నరసం కేచిత్ కేచిత్తుమల సంచయమ్।
ప్రథమాందోషదుష్టంచ కేచిదా మం ప్రచక్షతే।

పైశ్లోకములన్నింటియొక్క పిండీభూతమైన అర్థము కాయాగ్నియొక్క దుర్బలత్వమే ఆమమేర్పడు టకు ముఖ్యకారణము. అని తెలియ వలయును.

మూ॥ తత్రతసాధ్యమామందుష్టమలసీభూతముల్లిఖేత్। పాయయిత్వా [illegible] వణ ముష్ణంవారి. తథాత్వచ్ఛర్దయత్తమతిలీనదోషం కృష్ణా [illegible] యుక్తం పాయయేత్। మదనఫలకషాయంవా పిప్పలీ [illegible] దన్తీమాగధి కావచూర్ణితంవాకోశాతకిరసం. అవస్థావేక్షవామన [illegible] తీక్ష్ణవమనాని. తతః స్వేదవర్తిప్రణిధానాభ్యాము [illegible]

ప్రతిపదార్థము : తత్ర=చెప్పబడిన ఆమదోషమునందు, [illegible]

అలసక మను పేరుగల, దుష్టం=దూషింపబడిన, సాధ్యం=చికిత్సాసాధ్యమైన, ఆమం=ఆమదోషమును, సలవణం = ఉప్పుతోకూడ, ఉష్ణం=కాచి వేడివేసిన, వారి=ఉదకమును, పాయయిత్వా=త్రాగించి ఉల్లిఖేత్=వమనము చేయించ వలెను, (వెలిపరచ వలయును) తథా=అట్లే, అచ్ఛర్దయన్తత్=వాంతిచేయించని, అతిలీనదోషం = మిక్కిలి లీనమైన ఆమదోషమును, కృష్ణా=పిప్పళ్ళు, నాగ దంతీ=నాగదంతియొక్క, కల్క=కల్కముతో, యుక్తం = చేర్చబడిన, ఉష్ణాంబు=వేడినీటిని, పాయయేత్=త్రాగించ వలెను, వా=లేక, మదనఫల కషాయం=మ్రంగకాయలచేత తయారుచేయబడిన కషాయమును, పిప్పలీ= పిప్పళ్ళను, సిద్ధార్థకల్క=ఆవాలకల్కముతో, యుక్తమ్=చేర్చ బడిన దానిని, పాయయేత్=త్రాగించ వలెను, వా=లేక, దంతీ=నేపాళములు, మాగధికా చూర్ణమ్=పిప్పళ్ళ చూర్ణమును, కోశాతకీ రసమ్=చేదుబీరనుండి గ్రహించిన రసమును, యుక్తమ్=కలిపి, పాయయేత్=త్రాగించవలెను. అథవా=అట్లు కాని ఎడల, అవస్థాపేక్షి = దోషబలాబలములను అనుసరించి, తీక్ష్ణవమనాని= రోగియొక్క వ్యాధ్యవస్థనుబట్టి తీక్ష్ణమైన వమనములను, వమనకల్పోక్తాని= వమన కల్పమునందు చెప్పబడిన వాటిని, కారయేత్=చేయించవలెను; తతః= వమనము చేయించిన తరువాత, స్వేద=పలువిధములయిన స్వేదములచేత, వర్తి ప్రణిధానాభ్యాం=వర్తిప్రణిధా నాదులచేత, ఉపాచరేత్=చికిత్స చేయవలెను.

**తాత్పర్యము :** చెప్పబడిన అన్ని ఆమదోషములలో అలసకమను పేరు గల ఆమదోషము చికిత్సలవలన సాధ్యమయినదిగా నిర్ణయించినతరువాత ఉప్పును చేర్చిన వేడినీటిని త్రాగించి వమనము చేయించ వలెను. దీనివలన వమనములును లేక అప్పుడప్పుడు విరేచనములుకూడ అగును. ఈ చికిత్సవలన కోష్ఠ సిద్ధి ఏర్పడును. ఈ ప్రక్రియ వలన విరేచనము కానియెడల ఆమదోషము మిక్కిలి గంభీరముగానున్న ఎడల పిప్పళ్ళు, నాగదంతి వీట్లయొక్క కల్కముతో కూడిన వేడినీటిని త్రాగించవలెను. మరియు పిప్పళ్ళు ఆవాలు ఈ రెంటిని కషా యముగాచేసి మ్రంగకాయకషాయములో కలిపి త్రాగించవలెను. అట్లుకాని ఎడల చేదుబీరనుండి గ్రహించిన రసములో పిప్పళ్ళు, నేపాళములు ఈ రెంటిని చూరముచేసి కలిపి త్రాగించవలెను. మరియు రోగియొక్క బలాబలములను, రోగముయొక్క బలాబలములను, దేశకాలాదులను సమీక్షించి వమన కల్పము నందు చెప్పబడిన తీక్ష్ణవమనములను ప్రయోగించ వలెను. వమనమైన తరువాత సర్వాంగములను విశేషముగా ఉదరమును వేడినీటితో తడిపిన వస్త్రముద్వార స్వేదన కర్మను చేయించవలెను. అట్లే మలమును వెలిపరచుటకు వర్తినికూడ ప్రయోగింప వలెను. వీటి వలన ఉదరశుద్ధి ఏర్పడును.

**శశిలేఖ :** ఉల్లిఖేత్ అనగా వమేత్ అని అర్థము. అవస్థాపేక్షీ అనగా ఆతుర వ్యాధ్యవస్థాపేక్షయా అని అర్థము.

మూ॥ అపిచ,

సద్యః సమ్యగ్వి శుద్ధస్య శామ్యన్తి తదుపద్రవాః।
శూలేని రన్నకోష్ఠేఽద్భిః కోష్ణాభి శ్చూర్ణితాః పిబేత్॥
హింగుప్రతి విషావ్యోష సౌవర్చలవచాభయాః।
అథవాపిప్పలీ మూలం త్రివృతా దారుసైంధవమ్॥
శుంఠీః సక్షీరలవణ పిప్పలీ మరిచానిచ।
పాఠామ్ల వేతసక్షారయవానీ పౌష్కరాణి వా॥
ద్విరుత్తరం హింగువచాగ్ని కుష్ఠః।
సువర్చికాక్షార విశాజ మోజమ్।
శూలోదరానాహ విషూచికార్శో—
హృద్రోగ గుల్మోర్ధ్వ సమీరణఘ్నమ్॥
ముస్తాజమోజ పూతీకవచా శుంఠ్యగ్ని ధాన్యకైః॥
సవాళకళటీ బిల్వైః క్వాథం తృట్శూల వాన్పిబేత్।
రాస్నాకల్ఫలషడ్గ్రంథా బృహతీద్వయ ఙోంగకైః॥
గుగ్గుల్వతి విషాకుష్ఠ పత్రవ్యాఘ్రు నఖాంబుదైః।
కుర్యాత్ శుష్కైః సమూత్రైర్వాలేపోద్వర్తన ధూపనమ్॥

ప్రతిపదార్థము : సమ్యక్ = బాగుగ, విశుద్ధస్య = ఉదరశుద్ధియయినవానికి తదుపద్రవాః = ఆమమువలన కలిగిన శూలాద్యుపద్రవములు, సద్యః = వెంటనే శామ్యన్తి = శమించుచున్నవి, నిరన్నకోష్ఠే = శూన్యకోష్ఠమునందు, శూలే = నొప్పి ఏర్పడియెడల, చూర్ణితాః = క్రింద మదాహరింపబడిన ద్రవ్యములలో చూర్ణింపబడినవాటిని, కోష్ణాభిః = సుఖోష్ణమైన, అద్భిః = నీళ్ళతో (చేర్చి) పిబేత్ = త్రాగవలయును, హింగు = నేతితోవేయించిన ఇంగువ, ప్రతివిష = ఎలుపు అతివస, వ్యోష = పిప్పళ్ళు మిరియములు శొంఠి, సౌవర్చలలవణము. వచా = వస, అభయాః = కరక్కాయలు, (వీటిచూర్ణమును, 2 అథవా = అట్లు కానియెడల, పిప్పలీమూల = పిప్పలీమూలమును, (మోడి) త్రివృత్ = తెగడ, దారు = దేవదారు, సైంధవం = సైంధవలవణమును, (చూర్ణించి)

3. శుంఠి = శుంఠి, స్నుక్ క్షీర = సన్నజెముడుపాలు, లవణ = ఉప్పు. పిప్పలీ = పిప్పళ్లు, మరిచానిచ = మిరియములనున్నూ (చూర్ణించి)

4. పాఠా = చిరుబొద్ది, అమ్లవేతస = పుల్లప్రబ్బలి, క్షార = సర్జక్షారము, యవానీ = కురాసానివాము, పౌష్కరాణిచ = పుష్కరమూలముల చూర్ణమును.

5. ద్విరుత్తరం = ఒకదానికంటె రెట్టింపుభాగము, హింగు = పొంగించిన ఇంగువ, వచా = వస, అగ్ని = చిత్రమూలము, కుష్ఠ = చెంగల్వకోష్టు, సువ

ర్చికా=నవాసాగరము, క్షార=సర్జక్షారము, విళ=బిడాలవణము, అజమోదమ్ =వాము (వీటి చూర్ణమును)

శూల=నొప్పిని, ఉదర=ఉదరవ్యాధిని, ఆనాహ = కడుపుబ్బరమును, విసూచికా=కలరాను, అర్శో=మొలలవ్యాధిని, హృద్రోగ=హృదయవ్యాధిని, గుల్మ=గుల్మమును, ఊర్ధ్వసమీరణఘ్నమ్=వాతముయొక్క ఊర్ధ్వగతిని నశింప చేయును, (ఊర్ధ్వగతియనగ, ఉద్గారము వాంతి దగ్గు ఆయాసము ఎక్కిళ్ళు మొదలగు వ్యాధులనని అర్థము)

1. ముస్త=తుంగముస్తెలు, అజమోద=వాము, పూతీక=పూతీకరంజము, వచ=వస, శుంఠి=శుంఠి, అగ్ని=చిత్రమూలము, ధాన్యకైః=ధనియాలచేత, సవాళకం=నేత్రబాల, శఠీ=కచూరములు, బిల్వైః=బిల్వములచేత(మారేడు) క్వాథం=కషాయమును, తృట్=దప్పి, శూలవాన్=నొప్పిగలవాడు, పిబేత్ = త్రాగవలయును.

2. రాస్నా=సన్నరాష్ట్రము, కట్ఫల=గుమ్మడికేకు, షడ్గ్రంధా=వస, బృహతీద్వయం=పెద్దములక, వాకుడు, జోంగకైః=జోంగకవళ్ళలచేత, గగ్గులు=గగ్గులు, అతివిషా=అతివస, కుష్ఠ=చెంగల్వకోష్టు, పత్ర=తాలిసపత్రము, వ్యాఘ్రనఖ=పులిగోరు, అమ్బుదైః=తుంగముస్తెలచేత, శుష్కైః=ఎండిన వాటిచేత, సమూత్రై ర్వా=లేక మూత్రములతోగూడ, లేపోద్వర్తనధూపనం= లేపములు నలుగుపెట్టుట, పొగబట్టుట, కుర్యాత్=చేయవలయును.

తాత్పర్యము : అపక్వాహారరసమైన ఆమమువలన ఏర్పడిన శూలాదులు కోష్ఠముశుద్ధియయిన వెంటనే స్వయముగ శాంతించును. శూన్యకోష్ఠమునందు వథ్యాద్రిక్రమము నాచరింపక మరల శూలాద్యుపద్రవములు సంభవించిన యెడల క్రిందనుదాహరించు చూర్ణములను విధిగానుపయోగించవలెను. ఘృత ములోవేయించిన ఇంగువ, అతివస, పిప్పళ్లు, శుంఠి, మిరియములు, సువర్చలమను ఉప్పు, వస, కరక్కాయలు వీటినిబాగుచేయించి విధిపూర్వకము చూర్ణించి వస్త్ర గాళనముచేసి వేడినీటి అనుపానముతో సేవింపవలయును. మోడి, పిప్పళ్లు, దేవ దారు చెక్క, సైంధవలవణము ఈ నాలుగు ద్రవ్యములను చూర్ణించి గోరు వెచ్చని నీటిలో కలిపి త్రాగవలెను. శుంఠి సన్నజెముడుపాలు ఉప్పు పిప్పళ్లు మిరియములు వీటిని చూర్ణించి గోరువెచ్చని నీటిలో కలిపి త్రాగవలె. చిరు బొద్ది పుల్లప్రబ్బలి సర్జక్షారము కురాసాని వాము పుష్కరమూలబీజములను చూర్ణించి వేడినీటితో పానము చేయవలయును. ప్రమాణాధిక్యముగ ఇంగువ, వస, చిత్రమూలము, చెంగల్వకోష్టు. సర్జక్షారము, బిడాలవణము, వాము వీటిని క్రమము 1, 2, 4, 8, 16, 32, 64 భాగములుగ కల్పించి చూర్ణించి వేడి నీటితో పానము చేయవలెను. సాధారణముగ వేడినీళ్ళనే అనుపానముగ నుపయోగింప వలయును, అజీర్ణము వలన కలిగిన యుపద్రవములలో "దప్పి"

యనునది ఘోరమైన యుపద్రవము. ముస్తాదులతో కషాయమును కల్పనావిధిగ తయారుచేసి దప్పి, నొప్పులతో బాధపడువాడు ఆకషాయమును త్రాగవలెను. మరియు కడుపులో నొప్పి ఉబ్బరము ఉన్నయెడల దేవదారు మొదలగు వాటితో గంధము తీసి కడుపుపైన లేపముచేయవలెను. (పట్టువేయ వలెను) మరియు వాటితోనే పొగగూడ వేయవచ్చును. అజీర్ణరోగికి చూర్ణములను వేటినీటితో సేవించుట ప్రాథమికచికిత్సయగును. తరువాత ఆమము జీర్ణమైనట్లు తెలిసికొని మిగిలిన ఆమశేషము జీర్ణమగుటకు (పచనము చేయుటకు) కషాయాదుల నుపయోగించుట రెండవచికిత్సగా భావించ వలెను. లేపధూపములు ఉపద్రవ శామకములై చికిత్సాంగములుగ నుండును.

*శశిలేఖ* : బాగుగ కోష్ఠము వమనవిరేకములచేత శుద్ధిచెందిన తరువాత ఆమముచేత పుట్టిన యుపద్రవములు వెంటనే శమించును. అజీర్ణాన్నము లేకున్నను కోష్ఠము శుద్ధమైనప్పటికిని "శూల" అను నుపద్రవము రోగిని అనుసరించుచున్నపుడు హింగ్వాది ౭ విధములైన చూర్ణములను గోరువెచ్చని నీటిలో కలిపి త్రాగవలయును. రాస్నాదులను ఎండబెట్టి శరీరమునకు లేపనముగూడ చేయవచ్చును. ఇంగువ 1 భా, వస 2 భాగములు, చిత్రమూలము 4 భాగములు, కుష్టము 8 భాగములు, సువర్చికాక్షారము 16 భాగములు, బిడాలవణము 32 భాగములు, వాము 64 భా, మొత్తము 7 ద్రవ్యములు. ఈ చూర్ణము శూలాదులను పోగొట్టును.

మూ॥ సరుక్చానద్ధ ముదర మమ పిష్టైః ప్రలేపయేత్।
దారుహైమవతీకుష్ఠ శతాహ్వాహింగు సైంధవైః॥
యవచూర్ణశ్చ సక్షార తక్రః కోష్ఠారి జిత్ పరం।
యోజయేత్సైంధ వాద్యైశ్చ వర్తిం విణ్మూత్ర సంగ్రహే॥
నాభ్యమానాని చాంగాని భృశం స్విన్నాని వేష్టయేత్।
విషూచ్యామతివృద్ధాయాం పార్ష్ణ్యోర్దాహః ప్రశస్యతే॥
ద్విక్షార జీర్ణపిణ్యాక కుష్ఠారుష్కర చిత్రకైః।
సశుక్తసైంధవైస్తైలం పక్వమభ్యంజనేహితం॥
సుచ్ఛర్ధిత విరిక్తస్య గాత్రాయామేఒతిదారుణే
భల్లాతక మధూచ్ఛిష్ట జీర్ణపిణ్యాక నాగరైః॥
ఘృతతైలం పచేత్సామ్లైస్తచ్చఖల్లిఘ్నముత్తరం।
త్వక్పత్రరాస్నాగరు శిగ్రుకుష్ఠై
రమ్లప్రపిష్టైః సవచా శతాహ్వైః।
ఉద్వర్తనం ఖల్లి విషూచికాఘ్నం
తైలం విపక్వం చ తదర్థకారి॥

తదహాళ్ళేప హా స్త్యేనం విరిక్తవదుపాచరేత్,
సామాన్యేనేతి సిద్ధోక్తా విషూచ్యలసకక్రియా॥

ప్రతిపదార్థము : సరుక్ = బాధతో కూడ, ఆనద్ధం = బిగబట్టినట్లున్న, ఉదరం = కడుపును, దారు = దేవదారు, హైమవతీ = వసను, కుష్ఠ = చెంగల్వ కోష్టు, శతాహ్వా = సదాపవిత్తులు, హింగు = ఇంగువ, సైంధవైః = సైంధవ లవణములతో కూడిన, అమ్ల పిష్టైః = కలి మొదలగు అమ్ల ద్రవ్యములతో నూరిన పిష్టములచేత, ప్రలేపయేత్ = లేపము వేయవలెను, సక్షారతక్ర = క్షారముతో కూడిన తక్రము, యవచూర్ణశ్చ = యవలచూర్ణమున్ను (కల్కముచేసి), ప్రలేప యేచ్చేత్ = పట్టుకాసిన ఎడల, పరం = మిక్కిలి గొప్పదైన, కోష్ఠార్తిజితో = కోష్ఠమునందలి నొప్పిని జయించును.

విణ్మూత్రసంగ్రహే = మలమూత్రములు అడ్డగింప బడినపుడు (అలసకము నందు), సైంధవాద్యైః = దేవదారు మొదలుకొని సైంధవ లవణము వరకుగల ద్రవ్యములతో, అమ్లపిష్టైః = అమ్లద్రవ్యములతో లేపముగాచేసి, వర్తి = వర్తిని, కుర్యాత్ = చేయవలెను, నామ్యమానాని చాంగాని = శరీరావయవములు సంకు చితములుగానున్న యెడల, భృశం = మిక్కిలి, స్విన్నాని = స్వేదము చేయబడి నవై, వేష్టయేత్ = ఉన్ని వస్త్రములతో బంధించ వలయును.

అతివృద్ధాయాం = మిక్కిలి వృద్ధి చెందిన, విషూచ్యాయాం = విషూచికలో పార్ష్ణ్యోః = మెడిమలపైన, దాహః = శస్త్రముచేత కాల్చుట, ప్రశస్యతే = శ్రేష్ఠ మైనది, ద్విక్షార = యవక్షార సర్జక్షారములు, జీర్ణపిణ్యాక = పాతబడిన తెలకపిండి, కుష్ఠ = చెంగల్వకోష్టు, అరుష్కర = జీడిగింజలు, చిత్రకైః = చిత్రమూలములచేత, సశుక్త = పులిసిన మధుర పదార్థములతో కూడ, సైంధవైః = సైంధవలవణము లతో, తైలం = తిలతైలమును, పక్వం = వండినది, అభ్యంజనే = అభ్యంగము నందు, హితం = మంచిది, అతిదారుణే = మిక్కిలి కష్టమైన, గాత్రాయామే = శరీరమునందలి అవయవములు స్తంభించు వాత వ్యాధియందు, సుచ్ఛర్దిత విరక్తస్య = వాంతులు విరేచనములు చేయించినరోగికి, భల్లాతక = నల్లజీడి గింజలు, మధూచ్ఛిష్ట = మైనము, సీస = సీసము, పిణ్యాక = తెలికపిండి లేక గానుగ పిండి, నాగరైః = శుంఠి, వీటిచేత, సామ్లైః = పులిచింత మొదలగువాటిచేత, ఘృతతైలం = ఘృతమును గాని తైలమునుగాని, పచేత్ = పక్వము చేయవలెను, ఖల్లీఘ్నం = ఖల్లీ రోగమును పోగొట్టును, ఉత్తమం = శ్రేష్టమైనది, త్వక్ = లవంగపుచెక్క, పత్ర = ఆకుపత్రి, రాస్నా = దుంపరాస్నము, అగురు = అగరు, శిగ్రు = మునగ, కుష్ఠైః = చెంగల్వకోష్ఠు, వీటిచేత, సవచాశతాహ్వైః = వచ, సదాప వీటితో, అమ్లప్రపిష్టైః = పులిగంజితో (చేర్చి) పిసికి, ఉద్వర్తనం = నలుగు పెట్టికొనినచో, ఖల్లీ విసూచికాఘ్నం = ఖల్లీ విసూచికా అను రోగములను

హరించును, చ = మరియు, తైలం = పైనుదాహరించిన ద్రవ్యములతోకూడ నువ్వులనూనెను చేర్చి, విపక్వం = పక్వముచేయ బడినది (తైలము) తదర్థకారి = పైనుదాహరించిన రోగములను పోగొట్టును

తదహః = విసూచిక సంభవించిన దినము, ఏనం = రోగిని, ఉపవాస్య = ఉపవసింపచేసి, విరిక్తవత్ = విరేచనమును చేయించిన వానికివలె, ఉపాచరేత్ = సంసర్జన విధితో చికిత్సించ వలెను (పేయావిలేపి మొదలగు వాటితో), విసూచ్యలసక క్రియా సిద్ధా = విసూచ్యలసక రోగములకొఱకు చికిత్సావిధి, సామాన్యేనేతి = సామాన్యరూపముగానని, ఉక్తా = చెప్పబడినది.

**తాత్పర్యము**: బిగబట్టినట్లు బాధించుచున్నప్పుడు కడుపుపైన పట్టువేయవలెను. దేవదారు, వస, చెంగల్వకోష్టు, సదాపవిత్తులు, ఇంగువ, సైంధవ లవణముతో కూడిన అమ్లద్రవ్యములతో చక్కగా మర్దించి లేపము తయారుచేసి కడుపుపైన దట్టముగా పూయవలయును. కోష్ఠమునందు నొప్పిఎక్కువగానున్న యెడల క్షారసహితతక్రము, యవలచూర్ణమును కలిపి పట్టువేయవలెను. వర్తిని కూడ ఉపయోగింపవలెను. శరీరావయవములు వాతవ్యాధి యందు చెప్పినట్లుగా ఆ యామమును చెందిన యెడల స్వేదముచేసి చెమటబట్టిన తరువాత ఉష్ణీషములతో బంధించవలయును.

విసూచికలో మెడిమలపై కాల్చవలయును. ఇది చాలా శ్రేష్ఠమైన ప్రక్రియగా భావింపవచ్చును. పాతబడిన తెలికపిండి, జీడిగింజలు మొదలగు వాటిచేత తైలమును కాచి అభ్యంగనము కొఱకు ఉపయోగించవచ్చును. లవంగపు చెక్క, ఆకుపత్రి, దుంపరాష్ట్రము,మునగ, అగరు, చెంగల్వ కోష్టు, పులిగంజి నీటితో నలుగుపెట్టుకొనవలయును. ఇది ఖల్లీ రోగమును పోగొట్టును. విసూచిక సంభవించిన దినమున రోగిని ఉపవాసము చేయించి సంసర్జన క్రియతో చికిత్స చేయవలెను. ఇట్లు విసూచిక అలసక రోగములకు సామాన్య చికిత్స చెప్పబడినది.

**శశిలేఖ**: దోషభూయిష్టమైన ఆమము కదలిక లేక అలసత్వమును చెందినపుడు, నొప్పితో కూడిన కడుపుపైన దేవదార్వాది ద్రవ్యములను పులిసిన కాంజికము, లేక మద్యాదులతో కల్కముగాచేసి పట్టువేయవలెను. యవచూర్ణము, యవక్షారతక్రములతో చేర్చి లేపముచేసిన యెడల కోష్టమునందున్న బాధను తొలిగించుట కిది మిక్కిలి శ్రేష్ఠమైనది.
కొద్దిమంది క్షారశబ్దమునకు భస్మమని అర్థమును చెప్పుచున్నారు. మలబంధము మూత్రసంగమునందు సైంధవము మొదలగు వాటితో దేవదార్వాదులను కలిపి పిష్టముగా తయారుచేసి వర్తిని గుదద్వారముద్వారా సంధానము చేయవలెను. ఆమదోషమునందు దోషప్రాబల్య మధికముగానున్న యెడల శరీరమునందలి అవయవములు సంకోచము నొందును. అప్పుడు స్వేదముచేసి ఆయా ప్రదేశము

అను చెమట పట్టించి ఆ చెమటపైననే చర్మపటాదులచేతచుట్టి బంధించవల యును. మిక్కిలి వృద్ధి చెందిన విసూచికలో కాల్చిన శలాకలతో మెడిమల పైన దాహకర్మచేయుట చాలా ప్రశస్తమైన చికిత్స కాగలదు. సర్జక్షార యవక్షారముచేర్చి తైలమును సిద్ధపరచి అభ్యంగనము కొరకు ఉపయోగింప వలెను. చక్కగా వమన విరేచన కర్మలచేత శుద్ధుడైన వానికి ఆమదోషము ఎక్కువగా నుండి వాతము మిక్కిలి ప్రకోపమును చెందినపుడు శరీరావయవములు కర్రవలె స్తంభించిన అవస్తలో భల్లాతకాదులతో ఘృతమును, తైలమును కలిపి పాకముచేసి ఉపయోగింపవలెను. పై ఘృతతైల మిశ్రితయోగము ఖల్లీ అను వాత వ్యాధికి శ్యామకముగా కూడా ఉండగలదు. కాంజికాదులచేత త్వగాదులను మర్దించి, పిష్టముగాచేసి ఉద్వర్తనముచేసినయెడల ఖల్లీ విసూ చికా రోగములు శమించును. విసూచికలో పీడితుడైన రోగికి విరిక్తునివలే పేయాది క్రమమును ఉపదేశించవలెను. విసూచ్యాలసకములకు నిస్సంశయ ముగ కార్యసిద్ధికరములైన చికిత్సలు ఈ విధముగ నుపదేశింపబడినవి.

మూ॥ ఆమదోషేషు త్వన్నకాలే జీర్ణాహారం దోషోపలి ప్తామాశయం స్తిమిత గురు కోష్ట మనన్నాభిలాషిణ మభిసమీక్ష్య పాయయే ద్దోష శేషపాచ నార్థ మౌషధం వహ్నిసంధుక్షణార్థంచ। అజీర్ణాహారం పునర్నపాయయేత్। యత ఆమదోష దుర్బ లోహ్యగ్నిర్యుగపదామ దోష మౌషధమాహార జాతం... శక్తః పక్తుమ్।

**ప్రతిపదార్థము :** ఆమ దోషేషు = ఆమదోషములయందు, అన్నకాలే = భోజన వేళలో, జీర్ణాహారం = ఆహారము జీర్ణమైనటువంటి, దోషోపలిప్తం = ఆమదోష శేషమున్నటువంటి, ఆమాశయం = ఆమాదోషముచే నిండిన ఆమాశయమును, స్థిర = స్థిరమైన (గమనములేని), గురుకోష్టం = బరువైన ఉద రముగల, అనన్నాభిలాషిణం = ఆహారమునందిష్టములేని పురుషుణ్ణి, అభిసమీ క్ష్య = బాగుగచూచి, దోష శేషపాచనార్థం = మిగిలిఉన్న దోషము నుపచింపచేయుట కొరకు, చ = మరియు, వహ్నిసంధుక్షణార్థం = జాఠరాగ్నినివృద్ధిచేయుటకొఱకు, ఔషధం = ఔషధమును, పాయయేత్ = త్రాగించవలెను, అజీర్ణాహారం = ఆహారము, పచనముకాకున్నయెడల, పునః = మరల, ఔషధం = ఔషధమును, నపాయయేత్ = త్రాగించ కూడదు, యతః = యెందుకనగా, ఆమదోషదుర్బలః = ఆమదోషముచేత దుర్బలమైన, అగ్ని = జాఠరాగ్ని, యుగపత్ = ఒకటే మారు, ఆమదోషం = ఆమదోషమును, ఔషధం = ఔషధమును, చ = మరియు, ఆహారజాతం = ఆహారసమూహమును, పక్తుం = పచించుటకు, అశక్తః = శక్తి లేనిది.

**తాత్పర్యము :** ఆమ దోషము లన్నింటిలో వైద్యుడు కొన్ని విషయము లను మిక్కిలి జాగరూకతతో పరీక్షించవలెను. అన్నమును భుజించు వేళలందు, ముందు భుజించిన ఆహారము జీర్ణమైనది లేనిది కనుగొనవలయును. ఆమదో

షములవలనైనను మిగిలి ఉన్నప్పుడు ఆమదోషముతో నిండిన ఆమాశయము గల, గతిరహితమై బరువుగానున్న ఉదరముగల ఆహారమునందు ఏమాత్రము ఇష్టములేని అవస్థలో పై విషయము లన్నింటిని చక్కగ పరీక్షించి ఆమదోష శేషమును పచింప చేయుటకు, జాఠరాగ్నిని ప్రబోధమును కలిగించుటకు ఔషధ మును త్రాగించ వలయును. ఆహారము జీర్ణముకానపుడు ఔషధమును త్రాగించ రాదు ఎందుకనగ, ఆమదోష శేషమును, ఔషధమును, ఆహారమును,పచించుటకు దుర్బలస్థితిలోనున్న అగ్నికిశక్తిచాలదు.

*శశిలేఖ :* మిగిలిన ఆమదోషములయందు, ఆహారము జీర్ణమైనపుడు దోషముచేత నిండిన ఆమాశయమునందు చలరహితము, గురు కోష్టము కల వానికి, కాలవశమువలన కొద్దిగా పక్వమైన దోష శేషముకలవానికి ఆ ఆమము పాకముచెందుటకు, జాఠరాగ్నికి వృద్ధి ఏర్పడుటకు ఔషధమును పానము చేయించవలెను, ఆహారము జీర్ణము కాని పక్షమున ఔషధము త్రాగించరాదు. ఎందు కనగ దుర్బలస్థితిలోనున్న జాఠరాగ్ని ఆమదోష శేషమును, ఆహారమును, ఔషధమును పచించుటకు శక్తివంతమైనదికాదు.

**మూ॥** అపిచైషాం విభ్రమోఽతిబలత్వాదు పరతానల బలమాతురం సహసైవాతి పాతయేత్! ఆమదోషజానాం పునర్వికారాణా మపతర్పణేనైవో పశమోభవతి।

*ప్రతిపదార్థము :* అపిచ=మరియు, ఏషాం = ఆమదోష ఆహారఔషధ ములయొక్క, విభ్రమః = అస్తవ్యస్తము (వైషమ్యము), అతిబలత్వాత్= మిక్కిలి ప్రబలముగా నుండుట వలన, ఉపరతానలబలం=మందాగ్నిగల, ఆతు రం=రోగిని, సహసైవ = వెంటనే, అతిపాతయేత్ = చంపును, ఆమ దోష జానాం=ఆమదోషమువలన కలిగిన, వికారాణాం = రోగములకు, పునః= మరల, అపతర్పణనైవ=లంఘనము వలననే, ఉపశమః=సుఖము, భవతి=అగు చున్నది. (కలుగుచున్నది)

*తాత్పర్యము :* ఆమదోష ఔషధ ఆహారములు చక్కగా ఉపయోగించక పోవుటవలన వాటివైషమ్యము ప్రబలముగా నుండుటవలన జాఠరాగ్ని సన్న గిల్లినరోగిని వెంటనే చంపును. (పైనుదాహరించిన రెండుకారణములు) ఆమ దోషమువలన సంభవించిన వ్యాధులకు లంఘన చికిత్సయే శాంతిని ప్రసాదించును.

*శశిలేఖ :* ఆమాదులయొక్క వైషమ్యము ప్రబలమైనందున మందాగ్ని గల రోగిని వెంటనే చంపును. పై నుదాహరించిన మూడు ఉపకరణములు మిక్కిలి బలముతో కూడినవి. ఆమదోషజనితములైన స్తైమిత్యాదిలక్షణములతో

కూడిన వ్యాధు లన్నింటికి లంఘనమే ప్రధాన చికిత్సగా పరిగణింపబడినది. లంఘనములు చేయకపై వికారములు శాంతించవు.

మూ॥ తత్తు త్రివిధం। లంఘనం లంఘన పాచనం అవసేచనాంచ। తత్ర లంఘనం అల్పదోషాణాం। తేనహ్యానిలానల వృధ్యా వాతాతప పరీత ఇవాల్పసలిలాశయోఽల్ప దోషః ప్రశోష మాపద్యతే। లంఘన పాచనాభ్యాం మధ్య దోషో వాతాతపాభ్యాం పాంసుభస్మావకిరణైఃవ చానతిమహాన్ సలిలాశయః। బహుదోషాణాం పునర్దోషావసేచన మేవకార్యం। నహ్యస్రావితే పల్వలోదకౌఘా శాల్యాది పుష్టిర్భవతి।

**ప్రతిపదార్థము :** తత్ = ఆలంఘనము, త్రివిధం = మూడువిధములు, (1) లంఘనం=లంఘనము, (2) లంఘనపాచనం=లంఘన పాచనములు, (3) అవసేచనంచ=మరియు అవసేచనము (దోషములను బహిర్గతము చేయుట), తత్ర=వాటిలో, అల్పదోషాణాం=కొద్ది(స్వల్ప) దోషముకలవారికి, లంఘనం= లంఘనము విధించబడినది, తేన = ఈలంఘనముతో, అనిలానల వృధ్యా = వాయ్వగ్నులయొక్క వృద్ధిచేత, వాతాతపపరీతః = వాయువులండతో కూడిన, అల్పసలిలాశయః = కొద్దినీటితోకూడిన మడుగు, యద్వత్ = ఎట్లు, శోషమాపద్యతే = ఎండిపోవునో, తద్వత్ =అట్లే, అల్పదోషః =కొద్ది దోషము శోషమాపద్యతే= ఎండిపోవును, లంఘనపాచనాభ్యాం=లంఘనపాచనములచేత, మధ్యదోషః =మధ్యమదోషము (చికిత్సచేయబడవలెను) అనతిమహాన్ = మిక్కిలి పెద్దదికాని, సలిలాశయః = జలాశయము, వాతాతపాభ్యాం = వాయువుఎండలచేత, పాంసుభస్మావకిరణైరివ=దుమ్ముధూళులచేతవలె, శోషమాపద్యతే= ఎండిపోవును, బహుదోషాణాం=ఎక్కువ దోషములతో కూడిన వ్యాధులకు, పునః = మరల, అవసేచనమేవ=దోషములను వెలిపరచుటయే, కార్యం= చేయదగినది. పల్వలో దకౌఘే = కేదారములయందలి జలసమూహములు, అస్రావితేసతి = వెలుపలికి స్రవింపచేయక పోయినయెడల, శాల్యాదిపుష్టిః = శాల్యాదులవృద్ధి, నభవతి= కాదు.

**తాత్పర్యము :** అపతర్పణము 3 విధములు. 1 లంఘనము, 2 లంఘన పాచనము, 3 అవసేచనము. స్వల్పదోషము మిగిలియున్న ఆమజనిత బాధోపశామకముగ లంఘనము మిక్కిలి శ్రేష్ఠమైనది. లంఘనము చేయించినందువలన వాయువునకు అగ్నికి వృద్ధి కలుగును. వాయ్వగ్నులవృద్ధి దోష శేషశోషణమునకు దోహదకారియగును. ఎట్లనగ కొద్దినీటితో కూడిన తటాకము వాయువు ఎండ ఈ రెంటి అధిక సంపర్కము వలన ఎండి పోవునట్లు ఆమము గూడ జాఠరాగ్ని

సమానవాతముల వృద్ధి వలన శుష్కించునని సమన్వయము. దోషములు మధ్యమములుగా ప్రకోపించినపుడు లంఘన పాచనాదుల రెంటిని ఆచరింప చేయవలెను. వీటివలన దోషములు శాంతించును. సాధారణ జలములతో కూడిన తటాకము ఎండగాడ్పు ధూళి, దుమ్ము మొదలగు వాటితో సంబంధము ఎక్కువయిన ఎడల ఎట్లు ఎండిపోవునో అట్లే మధ్యమ దోషములతో కూడిన ఆమము శుష్కించును.

మిక్కిలి దోషభూయిష్ఠమైన ఆమమును వమనవిరేచనాదులతో అవసేచనమే చేయవలెను. అవసేచనమనగ దోషశేషమును చికిత్సల ద్వారా వెలిపరచుటయని అర్థముచెప్పబడినది. ఎట్లనగ కేదారములలో సస్యవృద్ధికి జమ (నిల్వ) చేసిన నీరు పైరు వచ్చు సమయమున కుల్యలను తెంచి నీటిని స్రవింపచేసి వెలిపరతురు. అట్లు చేసినగాని శాల్యాదులకు పుష్టి వృద్ధి ఏర్పడదు. కాన దోషములు మిక్కుటముగా వృద్ధి చెందినపుడు వాటిని వెలిపరచిననే శరీరమునకు పుష్టి తుష్టి వృద్ధి ఏర్పడగలవు.

***శశిలేఖ*** : ఆ లంఘనము మూడు విధములు. స్వల్పదోషములకు లంఘనమే విధింపబడినది. లంఘన-శబ్దముచేత ఉపవాసము అనునర్థము చెప్పబడును. ఆ ఉపవాసముచేత వాతము అగ్ని రెండును వృద్ధిచెందును వాతము అగ్ని శరీరములో వృద్ధిచెంది స్వల్పదోషమును శోషింపచేయును. ఎట్లనగా స్వల్పజలము గల తటాకము వాతాతప వృద్ధిచేత శోషమును చెందినట్లు. మధ్యదోషము (ఎక్కువవృద్ధి చెందని దోషము) ఉపవాసముచేత పాచనముచేత (పాచనకషాయాదులచేత) శోషింపబడును. ఎట్లనగ కొద్దిగా నున్న చెఱువు నందలి నీరు ఎండ, వాయువులచేత ధూళి దుమ్ములచేత నెట్లు శోషింపచేయబడు చున్నదో అట్లే మధ్యమదోషము గూడ శాంతించును. ఈ ఉదాహరణములో లంఘనమునకు వాతాతపములతో సాదృశ్యము, పాచనమునకు పాంసుభస్మావకిరణములతో సాదృశ్యము చెప్పి సమన్వయింపబడినది. ఎక్కువ దోషములకు దోషావసేచనము వమన విరేచనాది అపతర్పణ చికిత్స ద్వారా విధింపబడినది. దృష్టాంతముగ కేదారములయందు నిల్వయుంచిన జల సమూహము స్రవింపచేయబడిన తరువాత శాల్యాదులకు పుష్టి కలుగును. ఆ జలసమూహము శాల్యాదుల వృద్ధి కవరోధమైనందున వాటిని వెలిపరచుటయే ప్రధాన కర్తవ్యము. ఇచట బహుదోషములు పల్వలోదకములు, శాలివృద్ధి, ఆయుస్సు శరీరము పల్వలముల చేత సాదృశ్యము చెప్పబడినది. కేదారము శరీరము నందలి ఉదకములు బహుదోషములు, ఉదకరూపములైన దోషములు వమన విరేచనాది

అపతర్పణ చికిత్సలచేత వెలిపరచుట, కేదారకుల్యములను త్రెంచి నీటిని వెలి పరచుట ప్రధానము. ఈ రెండు కార్యములవలన కేదారమునందలి శాలిధాన్య వృద్ధి కేదారరూపమైన శరీరవృద్ధి, మరియు శాలివృద్ధి ఎట్లో అట్లే, ఆయుర్వృద్ధి ఏర్పడునని చక్కని సాహిత్యపరమైన ఉపమాలంకారములతో సిద్ధాన్తీకరింప బడినది.

మూ॥ తస్మాత్సంతర్పణ నిమిత్తానాం నాన్తరేణాపతర్పణ మస్తిశాన్తిః। అపతర్పణ నిమిత్తానాంచ నాన్తరేణ సంతర్పణమితి। ఏవమన్యేష మపివ్యాధీ నాం యథాస్వం నిదాన విపరీత మౌషధమేవావచారయేత్। సతిత్వను బన్ధే నిదాన విపరీతమపాస్య వ్యాధి విపరీతమేవ తదర్థకారి వా। విముక్తామదోషస్య పునః పరిపక్వామదోష శేషస్య దీప్తే చాగ్నావభ్యంగాస్థాప నాను వాసనం వివిధస్నేహ పానం చయుక్త్యాప్రయోజ్యమ్। ప్రసమీక్ష్యదోషౌషధీనామ వస్థాన్తరాణి। భవన్తి చాత్ర,

ప్రతిపదార్థము : తస్మాత్ = ఆకారణము వలన, సంతర్పణ నిమిత్తానాం = సంతర్పణముచేత కలిగిన వ్యాధులకు, అపతర్పణ మన్తరేణ=అపతర్పణ చికిత్సను విడచి, శాన్తిః = శమనము, నాస్తి=లేదు, అపతర్పణనిమిత్తానాం = అపతర్పణముచేత ఏర్పడిన వ్యాధులకు, సంతర్పణ మన్తరేణ = సంతర్పణ చికిత్సనువిడచి, శాన్తిః=ప్రశమనము, నాస్తి=లేదు, ఏవం=ఇట్లే, అన్యేషామపి వ్యాధీనాం=ఇతరవ్యాధులకుకూడ,యథాస్వం=తమకు సంబంధించిన,నిదానవిపరీతం = కారణములకు విషమమైన, ఔషధమేవ=ఔషధమునే, అవచారయేత్ = అనుష్టించవలెను, అనుబన్ధే సతితు=వ్యాధి ఉపద్రవమైనయెడల, నిదాన విపరీతం=కారణవైషమ్య రూపమైన ఔషధమును, అపాస్య=తొలగించి (విడచి), వ్యాధి విపరీతమేవ = రోగవిపరీత చికిత్సనే, వా=లేక, తదర్థకారి=ఆరోగ్యమునకే ఉపయోగించు ఔషధమును. అవచారయేత్ = అనుష్ఠించ వలెను, పునః = మరల, విముక్తామదోషస్య = ఆమదోషమునుండి విడివడిన వానిని, పరిపక్వ ఆమదోష శేషస్య=మిగిలి ఉన్న ఆమదోషము పాకము చెందిన తరువాత, దీప్తేచాగ్నౌ=జాఠరాగ్ని వృద్ధిచెందినదగుచుండగ, విధివత్=శాస్త్రము నందు విధింపబడిన నియమాను సారము, అభ్యంగ= అభ్యంగము, ఆస్థాపన= నిరూహవస్తి, అనువాసనం=తైలవస్తి, స్నేహపానం = అచ్ఛస్నేహ పానము, యుక్త్యా = యుక్తిపూర్వకముగ, అన్తరాన్తరాణి దోషౌషధాదీని= దోషములయొక్క ప్రయోగింపబడు ఔషధములయొక్క భేదములను, ప్రస

మీక్ష్య = చక్కగానమీక్షించి (బాగుగా తెలిసికొని), ప్రయోజ్యం = ప్రయోగ ముచేయ వలెను.

తాత్పర్యము : పై నుదాహరించిన కారణములను పురస్కరించుకొని సంతర్పణ చికిత్సల అతియోగాదుల వలన జనించిన వ్యాధులకు అపతర్పణము చేత అపతర్పణ చికిత్సల అతి యోగాదుల చేత జనించిన వ్యాధులకు సంతర్పణ చికిత్సలవలననే శాంతి కలుగును. అన్యథా మార్గాంతరము కానరాదు. ఇట్లే ఇతర వ్యాధులకుకూడ తమకు సంబంధించిన కారణములకు విపరీతమైన ఔషధము లనే ఉపయోగించ వలెను. వ్యాధి ఉపద్రవరూపమైనదైతే కారణవైషమ్య రూప మైన ఔషధమును తొలగించి రోగవిపరీత చికిత్సను లేక తదర్థకారి చికిత్సనో అనుష్ఠింప చేయవలెను. ఆమ దోషము పూర్తిగ తొలగింప బడిన వానికి మిగిలి ఉన్న ఆమ దోషము జీర్ణము అయిన తరువాత జాఠరాగ్ని సమస్థితిలో నున్నప్పుడు శాస్త్రమున విధింపబడిన నియమానుసారము దోషములయొక్క గతిభేదములను ఔషధభేదములను చక్కగా గ్రహించి యుక్తిపూర్వకముగ అభ్యంగ ఆస్థాపన అనువాసన అచ్ఛస్నేహ పానములను చేయించవలయును.

శశిలేఖ : సమస్తమైన సంతర్పణ జనిత వ్యాధులకు అపతర్పణము అపతర్పణజనిత సమస్తవ్యాధులకు సంతర్పణము చేయవలయును. ఇచ్చట తానే స్వయముగా చెప్పుచున్న శాస్త్రకారునిచేత నిదానవిపరీతమైన ఔషధము. చూపెట్టబడినది.నిదానము హేతువు ఈ రెండు పదములు పర్యాయవాచకములు, సంతర్పణ హేతుకములకుఅపతర్పణమని అర్థము. ఎప్పుడైతే సమస్త వ్యాధులు హేతువిపరీతఔషధముతో చికిత్సచేయబడినవైనను శమించవో అప్పుడు వ్యాధి విపరీత చికిత్స విధింపబడినది. లేనియెడల తదర్థకారి చికిత్స చేయవలెను. తదర్థకారి చికిత్సయనగా "ప్లుష్టస్య అగ్ని ప్రతపనం" కాలినతరువాత మరల కాల్చుట, అని అర్థము. ప్రవాహికా వ్యాధియందు ఏరండతైలము మొదలగు వాటితో మరింత ప్రవాహనమును వృద్ధి చేయుట మొదలగునవి. హేతు విపరీత చికిత్స చేతనే పై నుదాహరించిన అర్థము పొసగదు. తక్కిన విషయములు తాత్పర్యాంశములు.

మూ॥ యః శ్యావదన్తోష్ఠ నఖోఽల్ప సంజ్ఞః
ఛర్ద్యర్దితోఽన్త ర్గత తామ్రనేత్రః।
క్షామ స్వరః సస్త్రి సమస్త సన్ధి-
ర్యాయాన్నరోఽసౌ పునరాగమాయ॥

ప్రతిపదార్థము ; యః = ఆమదోషముతో కూడినవాడు, శ్యావదన్తోష్ఠ

నఖః=నల్లనిదన్తములు పెదవులు గోళ్ళు గలిగినవాడు, అల్పసంజ్ఞః=స్వల్ప సంజ్ఞగలవాడు, ఛర్ద్యర్దితః=వాంతులు అర్దితవాతముగలవాడు, అన్తర్గత తామ్ర నేత్రః = లోపలిభాగమునందు ఎఱుపుగల కన్నులుగలవాడు, క్షామస్వరః= హీనస్వరముగలవాడు, గ్రస్తసమస్తసంధిః = సంధులన్నియు జారినట్లున్నటు వంటి, అసౌ = ఈపురుషుడు, నపునరాగమాయయాయాత్=చనిపోవును.

**తాత్పర్యము :** ఏమానవుడు ఆమదోషముగలిగి నల్లని పలువరుసలు, నల్లని పెదవులను, నల్లని గోళ్ళను గలిగి యుండునో, స్వల్పసంజ్ఞగలిగి యుండునో, ఎవనికి వాంతులు అధికముగ నగుచుండునో, కన్నులు రేగియున్నవాడు, హీనస్వరముగలవాడు, సంధులు పట్లు విడిచి జారినట్లు బాధపడువాడుగా నుండునో వానిని మృత్యువావరించినదని భావించ వలెను.

**శశిలేఖ :** ఆ నరుడు మరలి రాకుండా వెళ్ళును. (సః నరః అపునరాగ మనాయ యాయాత్ = మ్రియతే ఇత్యర్థః.)

**మూ॥** వ్యోషం కరం జస్య ఫలం హరిద్రే, మూలం సమావాప్యచ మాతులుంగ్యాః, ఛాయా విశుష్కా గుళికారి కృతాస్తాహన్త్యుర్విషూచీం య నాంజనేన, శిరీషనక్తాహ్వా ఫణిర్జ బీజ త్రాయ న్త్యపామార్గఫలైశ్చవర్తిః; బస్తస్య మూత్రేణ విషూచికాఘ్నిప్రలేప ధూమాంజన నస్యయోగైః॥

**ప్రతిపదార్థము :** వ్యోషం=శుంఠి పిప్పళ్ళు మిరియములు, కరంజస్య ఫలం=క్రానుగు బీజములు, హరిద్రే=పసుపు, మాని పసుపు, మాతులుంగ్యాః మూలం=మాదీఫల మూలమును, సమావాప్య=కలిపి, తాః = వాటిని, గుటి కాః=గుటికలుగా, కృతాః=చేయబడినవై, ఛాయా విశుష్కాః =నీడలో ఎం డింపబడినవై, నయనాంజనేన=నేత్రములకు కాటుక పెట్టుట చేత, విశూచీం= విసూచికారోగమును, హన్త్యుః=పోగొట్టును, శిరీష=దిరిశెనపు గింజలు, నక్తాహ్వ=క్రానుగగింజలు, ఫణిర్జబీజ=మరువముగింజలు, త్రాయన్తి=కలుక్రా నుగ బీజములు, అపామార్గాఫలైః=ఉత్తరేణి బీజములచేత, బస్తస్య=మేక యొక్క, మూత్రేణ=మూత్రముతో, కృతా=చేయబడిన, వర్తిః=వర్తి, ప్రలేపధూమాంజన నస్యయోగైః=లేపములు, ధూమములు అంజనములు నస్య ములు మొదలగు ప్రయోగముల చేత, విషూచికాఘ్ని=విషూచికను నశింప చేయును.

**తాత్పర్యము :** శుంఠి పిప్పళ్ళు మిరియములు, కానుగువిత్తులు, పసుపు మాని పసుపు వీటి చూర్ణములో మాదీఫల మూలమును కలిపి నీళ్ళను చేర్చి చక్కగా కల్వములో నూరి మాత్రలు చేసి (వర్తి) నీడల్లో ఎండించి విశూచికా

రోగములో కనులకు కాటుక పెట్టిన ఎడల విశూచికారోగము శమించును. దిరిశెనపు గింజలు, కానుగ విత్తులు మరువము గింజలు కలుగానుగవిత్తులు ఉత్తరేణి బీజములు వీటినన్నింటిని కలిపి చూర్ణించి మేక మూత్రముతో మర్దించి వర్తిని తయారుచేసి ఆ వర్తిని లేపము చేయుటకు పొగ వేయుటకు, కాటుక పెట్టుటకు, నస్యము చేయుటకు, ఉపయోగించిన ఎడల విసూచికా రోగము శాంతించును.

*శశిలేఖ* : వ్యోషాది ద్రవ్యములన్నింటి నొకచోట చేర్చి వర్తిని తయారు చేసి నేత్రాంజనమున కుపయోగించిన ఎడల విసూచిక యను రోగం శాంతించును. శిరీషాది బీజముల యొక్క చూర్ణమును మేక మూత్రములో నూరి చేయబడిన వర్తిని లేపాదులకుపయోగించిన ఎడల విషూచికా రోగమును పోగొట్టును.

మూ॥ అజీర్ణంచ కఫాధామం విష్టబ్ధమనిలాద్భవేత్। విదగ్ధం పిత్తకోపేన త్రిప్రకార మితిస్మృతమ్। తత్రాఽఽమే గురుతోత్క్లేదః శోఫోగండాక్షికూటయోః। ఉద్గారశ్చయథా భుక్తమవిదగ్ధః ప్రవర్తతే। విష్టబ్ధే శూలమాధ్మానం వివిధావాత వేదనాః। మలవాతా ప్రవృత్తిశ్చ స్తమ్భో మోహోఽంగ పీడనమ్॥ విదగ్ధే భ్రమ తృణ్మూర్ఛాః పిత్తాచ్చ వివిధారుజాః। ఉద్గారశ్చ సధూమామ్లః స్వేదో దాహశ్చ జాయతే॥

ప్రతిపదార్థము : చ = మరియు, అజీర్ణం = అజీర్ణము (ఆహారము పక్వము కాకుండుట), కఫాత్ = కఫము వలన, ఆమం = జీర్ణము కాని ఆహార రస రూపము, ఆమమనియు, అనిలాత్ = వాతమువలన నడ్డగింపబడినందువలన, విష్టబ్ధం = విష్టబ్ధమనియు, భవేత్ = అగును, పిత్తదోషేణ = పిత్తదోషము చేత, విదగ్ధం = విదగ్ధమనియు, త్రిప్రకారమితి = మూడు విధములని, స్మృతమ్ = చెప్పబడినది, తత్రాఽఽమే = ఆమము వలన కలిగిన అజీర్ణము నందు, గురుతా = శరీర గౌరవము, ఉత్క్లేదః = ధాతువులకుత్క్లేదము (వమనానుకూల వ్యాపారము), గండాక్షి కూటయోః = చెక్కిళ్ళు మరియు కంటి రెప్పల యందు, శోఫః = వాపు, చ = మరియు, ఉద్గారః = త్రేనుపు, యథాభుక్తం = సక్రమముగాభుజించినను, అవిదగ్ధః = పచింపకయే, ప్రవర్తతే = బహిర్గతమగును, విష్టబ్ధే = వాతము వలన కలిగినవిష్టబ్ధా జీర్ణమునందు, శూలం = నొప్పి, ఆధ్మానం = కడుపుబ్బరము, వివిధాః = పలువిధములైన, వాతవేదనాః = వాతము వలన కలుగు అనేక బాధలు మలవాతాప్రవృత్తిశ్చ = మలము అపానవాతములవేగరోధమున్నూ, స్తమ్భః = జడత్వమ్మును, మోహః = మోహము, అంగపీడనం = శరీరావయవములయందు బాధ

సఞ్జాయతే=కలుగుచున్నది, విదగ్ధే=విదగ్ధాజీర్ణమునందు, పిత్తాత్=పిత్తము, వలన, భ్రమ=తలతిరుగుట, తృట్=దప్పి, మూర్ఛాః=మూర్ఛలు, వివిధాః =పలువిధములైన, రుజః=బాధలు, సధూమామ్లః=బొగ్గుపులుసు వాయువు తో కూడిన, ఉద్గారశ్చ=త్రేనుపులున్నూ, స్వేదః=చెమట,దాహశ్చ=ఆమాశయ కంఠము లందు దాహమున్నూ, జాయతే=కలుగుచున్నది.

**తాత్పర్యము :** కఫము చేత ఏర్పడిన అజీర్ణము ఆమమను పేర ప్రసిద్ధి చెందును. వాతముచేత జనించిన అజీర్ణము విష్టబ్ధాజీర్ణమని చెప్పుదురు. పిత్తము చేత జనించిన అజీర్ణము విదగ్ధాజీర్ణమని పిలుతురు. కాన అజీర్ణము, ఆమము, విష్టబ్ధము, విదగ్ధమని మూడు విధములుగా చెప్పబడినది.

కఫము చేత జనించిన ఆమాజీర్ణమునందు అక్షికూటము చెక్కిళ్ళు వీని యందు వాపు అపుడే భుజించినటుల విదాహావస్థను చెందని త్రేనుపులు, నోటి వెంట నీరు, వాతాది దోషములకు స్వస్థానచలనము, శరీరగురుత్వము గలుగును. జాఠరాగ్నికి విరోధియైన కఫము అజీర్ణమును కలిగించుటయందు ప్రధానముగ నుండుటవలన మొదట కఫాజీర్ణము చెప్పబడినది. వాతము చేత ఏర్పడిన విష్టబ్ధాజీర్ణమునందు శూల, మల మూత్రబంధము, కడుపుబ్బరము శరీరావయవముల యందు మిక్కుటమగుబాధ, వాతము వలన కలుగు పలు విధములైన వేదనలు కలుగును.

పిత్తముచేత గలిగిన విదగ్ధాజీర్ణము నందు దప్పి, తల తిరుగుడు, మోహమును చెందుట, పులిత్రేనుపులు శరీరతాపము కలుగును.

***శశిలేఖ :*** అజీర్ణ రూపమైన అన్నము వర్ణింపబడుచున్నది. అజీర్ణము 3 విధములు. కఫాధిక్యము చేత, వాతాధిక్యము చేత, ద్రవస్వరూపమైనపిత్తాధిక్యము చేత, జాఠరాగ్ని విషమముగా నుండుటచేత, అజీర్ణమును చేయుటలో కర్తృత్వము ప్రధానముగనుండుటవలన కఫాజీర్ణమైన ఆమము తొలుత చెప్పబడినది.

కఫము వలన కలిగిన అజీర్ణము ఆమమను పేర బఱగు. దీనియందు శరీర గౌరవము రసాదిధాతువుల కుత్క్లేదము ఏర్పడును. ఉత్క్లేదశబ్దమునకు వికార విశేషమని అర్థము చెప్పబడినది. పులిత్రేనుపులుండును.

వాతముచే ఏర్పడిన విష్టబ్ధాజీర్ణమునందు కడుపులో నొప్పి మొదలగు బాధ లుద్భవించును.

పిత్తముచేత గలుగు విదగ్ధాజీర్ణమునందు భ్రమాదులేర్పడును. ఉద్గారమనగా నోటినుండి వెలుపలికి వచ్చు వాయువని యర్థము. ఇది చాల తీక్ష్ణముగ జఠ

రము నుండి పుట్టును.

మూ॥ లంఘనం కార్యమామేతు విష్టబ్ధే స్వేదనం భృశమ్.
విదగ్ధే వమనం యద్వాయథా వస్థం హితం భవేత్।
గరీయసోభవేల్లీ నాదామాదేవ విళంబికా, కఫవాతానువిద్ధామ
లింగా తత్సమసాధనా రసశేషేఽన్న విద్వేషో హృదయాశుద్ధిగౌరవే.
తత్రాభుక్త్వాది వాస్వప్యాత్ క్షుద్వానద్యాల్లఘుప్రతి.
యామైశ్చతుర్భిర్ద్వాభ్యాంచ భోజ్యా భైషజ్యయోః సమే.
పాకోఽగ్నాయుక్త యోర్ద్రాక్చ తీక్ష్ణేమన్దే పునశ్చిరాత్॥

ప్రతిపదార్థము : ఆమేతు = ఆమాజీర్ణము నందైతే, లంఘనం = ఉపవాసము, కార్యం = చేయవలెను, విష్టబ్ధే = విష్టబ్ధాజీర్ణమునందు, భృశం = అధికముగ, స్వేదనం = చెమట పట్టించుట, కార్యం = చేయదగినది. విదగ్ధే = విదగ్ధ అజీర్ణము నందు, వమనం = వాంతి, కార్యం = చేయవలెను, యథావస్థం = వ్యాధ్యవస్థా భేదములను బట్టి, యద్వా = యేదైనను, హితం = పథ్యమైనదిగా, భవేత్ = అగును, ఆమాదేవ = ఆమమే (పాచకనళికలో, మహాస్రోతస్సులో), గరీయసః = మిక్కిలి అధికముగ, లీనాత్ = లీనమగుటవలన, విళంబికా = విళంబికయను రోగము, భవేత్ = ఏర్పడును, సా = ఆ విళంబిక, కఫవాతానువిద్ధా = కఫవాత సంబంధము గలది, ఆమలింగా = ఆమాజీర్ణముతో సమాన లక్షణములు గలది, తత్సమ సాధనా = దీనికి చికిత్స ఆమాజీర్ణమునకువలె చేయవలెను, రసశేషే = రసశేషాజీర్ణమునందు, అన్న విద్వేషః = అన్నమునందిష్టము లేకుండుట, హృదయాశుద్ధి గౌరవే = ఆమాశయము శుద్ధిగా లేకుండుట హృదయము బరువుగా నుండుట, తత్ర = రసశేషాజీర్ణమునందు, అభుక్త్వా = భోజనము చేయక, దివా = పగల్లు, స్వప్యాత్ = నిద్రించవలయును, క్షుద్వాన్ = ఆకలి గొన్నవాడు, లఘు, తేలికైన, మితం = మాత్రాప్రమాణ భోజనమును, అద్యాత్ = భుజింపవలయును, అగ్నౌసమే = జాఠరాగ్ని సమానముగా నున్నపుడు, భోజ్యభైషజ్యయోః = భోజన ఔషధముల యొక్క, చతుర్భిర్ద్వాభ్యాంయామైః = నాలుగు రెండు యాముములచేత, పాకః = జీర్ణము, భవతి = అగును, తీక్ష్ణేఅగ్నౌ = జాఠరాగ్ని తీక్ష్ణముగ నున్నపుడు, యుక్తయోః = చెప్పిన భోజనౌషధముల యొక్క, పాకః = జీర్ణము, ద్రాక్ = వెంటనే, భవతి = అగును, మన్దే అగ్నౌ = జాఠరాగ్ని మందముగ నున్నప్పుడు, చిరాత్ పునః = మరల ఆలస్యముగా, పాకః = జీర్ణము భవతి = అగుచున్నది.

తాత్పర్యము : ఆమాజీర్ణమునందు ఉపవాసము, విష్టబ్ధాజీర్ణమునందు

అతిస్వేదము, విదగ్ధాజీర్ణమునందు వమనమును చేయింపవలయును. ఇట్లుకాని పక్షమున ఏచికిత్స ఏవ్యాధియొక్క అవస్థా విశేషములనుబట్టి ఏది ఉచితమైనదో వైద్యుడు నిర్ణయించి ఆచికిత్స చేయుటకు ఉపక్రమింపవలయును. వ్యాధియొక్క అవస్థాభేదమునుబట్టి అన్నిచికిత్సలను అన్నివ్యాధులపైనను ఉపయోగింపవచ్చును ఆమదోషము మహాస్రోతస్సులో (పాచకనలికలో) మిక్కిలి అధికముగలీనమై ఉండుటవలన విలమ్బికయనువ్యాధి ఏర్పడుచున్నది. ఈవ్యాధిలో కఫవాతము లకు సంబంధమధికముగ నుండును. వ్యాధిలక్షణములు ఆమాశయమునందు చెప్పిన లక్షణములవలెనుండును. చికిత్సకూడా ఆమాజీర్ణమునకు చెప్పినట్లే చేయ వలయును.

రసశేషాజీర్ణమునందు (భుజించిన ఆహారము జీర్ణమైన తరువాత మిగిలి యున్న ఆహారరసము వలన ఏర్పడిన అజీర్ణము) అన్నమునందిష్టము లేకుం డుట, ఆమాశయము శుద్ధముగా నుండుట, హృదయము బరువుగనుండుట మొదలగు లక్షణములు కనిపించును. ఇట్టి అవస్థలో భుజింపక పగలు నిద్రించ వలయును. మరియు ఆకలి వేసిన యెడల లఘుగుణ ద్రవ్యములతో కూడిన ఆహారమును మాత్రాప్రమాణముగ భుజింపవలయును. జాఠరాగ్ని సమస్థితిలో నున్నప్పుడు భోజనము 4 యామములలో (12 గంటలలో) ఔషధము రెండు యామములలో (6 గంటలు) జీర్ణమగును. తీక్ష్ణాగ్ని గల మానవుడు తన శరీర బలము మొదలగు వాటిని, అపేక్షించి భుజించిన ఆహారము వెంటనే జీర్ణమగును. మందాగ్ని గల మానవుడు భుజించిన ఆహారము కొంచము ఆలస్యముగ జీర్ణమ గును. మరియు ఒకప్పుడు నియమము లేకుండ విషమాగ్ని త్వరగ ఆలస్యముగ కూడ ఆహారమును పచించును. కాన విషమాగ్నికి కాల నియమమును ఇదమిత్థ ముగ చెప్పుటకు సాధ్యముకాదు.

*శశిలేఖ :* ఆమాజీర్ణము నందుపవాసము చికిత్సగా నిర్ణయింపబడినది. అట్లే విష్టబ్ధమునందు స్వేదము, విదగ్ధము నందు వమనము చేయించుట ముఖ్య మైన చికిత్సలుగా పరిగణింపబడినవి. అవస్థా విశేషములను బట్టి అన్ని వ్యాధులకు అన్ని చికిత్సలను యుక్తితో చేయవచ్చును. ఆమము మహాస్రోతస్సులో విశేష ముగ లీనమైన దగుటవలన విళంబిక యను పేరుగల వ్యాధి ఉత్పన్నమగును. లక్షణములు చికిత్సలు ఆమాజీర్ణమునందు విధించినట్లు ఊహించవలయును.

రసశేషాజీర్ణమునందు శరీరమునకు లాఘవమేర్పడునంత వరకు భుజింప కయే పగలు నిద్రించవలయును. మేల్కొన్న తరువాత ఆకలిగనున్న ఎడల లఘుగుణ ద్రవ్యములతో మితముగా భుజింపవలయును.

మూ॥ సభక్తమౌషధం తస్మాన్మందాగ్నే రవచారయేత్। పూర్వాహ్ణే భోజనం సాత్మ్యం లఘుదీపన బృంహణం, ప్రాతరాశేత్వజీర్ణేఽపిసాయమాశో నదుష్యతి, అజీర్ణే సాయమాశేతు ప్రాతరాశోహి దుష్యతి, దివాప్రబోధ్యతేఽర్కేణ హృదయం పుండరీకవత్, తస్మిన్విబుద్ధే స్రోతాంసి స్ఫుటత్వం యాన్తి సర్వశః। వ్యాయామాచ్చ విచారాచ్చ విక్షిప్తత్వాచ్చ చేతసః, నక్లేదముపగచ్ఛన్తి దివాచేనాస్యధాతవః। అక్లిన్నేష్వన్న మాసిక్త మత్యన్తేన నదుష్యతి। అవిదగ్ధేష్వివ పయస్వన్య త్సమ్మిశ్రితం పయః॥ రాత్రౌతు హృదయే మ్లానే సంవృతేష్వాయనేషుచ। యాన్తికోష్ఠే పరిక్లేదం సంవృతే సర్వధాతవః, క్లిన్నేష్వన్య పక్వేషు తేష్వాసిక్తం ప్రదుష్యతి। విదగ్ధేషు పయస్వన్యత్ పయస్తేష్వివార్పితమ్, నైశే తస్మాద జీర్ణేఽన్నే నాన్య ద్భుంజీత భోజనమ్।

ప్రతిపదార్థము : తస్మాత్=పై నుదాహరించిన కారణము వలన, మందాగ్నేః=మందాగ్ని గల పురుషునికి, సభక్తమౌషధం =భోజనముతోకూడిన ఔషధమును, అవచారయేత్=ఇవ్వవలయును, పూర్వాహ్ణే=ప్రాతః కాలమునందలి, భోజనం=భోజనము, సాత్మ్యం = ఉచితమైనదిగ, లఘు =తేలికగ జీర్ణమగునదిగను, దీపన =అగ్నిదీప్తిని చేయునదిగను, బృంహణం=బృంహణ కాంశను, స్యాత్=ఉండవలెను.

ప్రాతరాశేతు=ప్రాతః కాలమునందు భుజించిన భోజనమైతే, అజీర్ణే=జీర్ణము కాకపోయిననుసాయమాశః=సాయంకాలభోజనము,దుష్యతి=దోషమును చేయునదికాదు, సాయమాశేతు=సాయంకాలమునందుభుజించిన భోజనమైతే, అజీర్ణే=జీర్ణముకానిఎడల, ప్రాతరాశః=ప్రాతః కాలభోజనము,దుష్యతి=దోషమును చేయునదిగ అగుచున్నది, తదాహి=అదిసరియే కదా?,యథా,దివా=పగలు, అర్కేణ=సూర్య కిరణములచేత, పుండరీకవత్=పద్మమువలె, హృదయం=హృదయము (మస్తిష్కము) ప్రబోధ్యతే=వికసింప చేయబడు చున్నది, తస్మిన్=ఆ హృదయము నందు, సర్వశః = అంతట, స్రోతాంసి=స్రోతస్సులు, స్ఫుటత్వం=వికాసమును, యాన్తి = పొందుచున్నవి, వ్యాయామాచ్చ =వ్యాయామము వలనను, విచారాచ్చ=బుద్ధితో ఆలకించుట చేతను, చేతసః=మనస్సు యొక్క, విక్షేపత్వాచ్చ=చేష్టల వల్లను, దివా=పగలు, తేన=ఆకారణములతో, అస్య=ఈ పురుషునియొక్క, ధాతవః=సమస్త ధాతువులు, నక్లేదముపగచ్ఛంతి=ద్రవీభూతము చెందవు,అక్లిన్నేషు =ద్రవీభూతము చెందని; తేషు = ఆధాతువులయందు,ఆసక్తం=తగిలినటువంటి, అన్నం=అన్నము,అన్యత్ =ఇతరములతో,నదుష్యతి=దూషింపబడదు, అవిదగ్ధేషు=కాచనటువంటి, పయస్సు

=పాలయందు, సంమిశ్రితం=కలుపబడినది. అన్యత్ పయః=వేరే పాలు, యథా=ఎట్లు, నదుష్యతి=వికారమును చెందవో, రాత్రౌ=రాత్రియందైతే, హృదయే=హృదయము, మ్లానేసతి=ముడుచుకున్నదగుచుండగ, అయనేషు సంముతేషుచ=స్రోతోమార్గములు సంకుచితములు అగుచుండగ, కోష్ఠే=కోష్ఠమునందు, సంవృతే=సంకోచము చెందినవగుచుండగ, సర్వధాతవః=సమస్త ధాతువులు, పరిక్లేదః = ద్రవరూపమును, యాన్తి = పొందుచున్నవి, క్లిన్నేషు=ద్రవరూపమైన, అపక్వేషు= పక్వము కానటువంటి, తేషు=ఆ ధాతువుల యందలి, ఆసక్తం = తగిలినటువంటి, అన్యత్ = వేరే అన్నము, ప్రదుష్యతి=దూషింపచేయబడును, విదగ్ధేషు పయస్సు = వేడిచేసిన పాలయందు, తప్తేషు=కాచబడిన, అన్యత్పయః=వేరే పాలు, అర్పితమివ=కలుపబడిన వాటివలె, తస్మాత్=ఆ కారణము వలన, నైశే=రాత్రి యందు భుజించిన, అన్నే=అన్నము, అజీర్ణేసతి=జీర్ణము కాని దగుచుండగ, అన్యత్ భోజనమ్=మరియొక భోజనమును, నభుంజేత్=భుజించరాదు.

తాత్పర్యము : పై కారణమువలన ప్రాతః కాలమునందు భుజించు భోజనము సాత్మ్యమైనదిగ నుండవలెను. తేలికగ, జీర్ణమగునదిగ, జాఠరాగ్నిమేల్కొలుపునదిగనుండవలెను. శరీరమునకు బలమును చేకూర్చునదిగకూడ నుండవలెను. అట్టి భోజనమును మందాగ్నితోకూడుకొన్న పురుషుడు ఔషధయుక్తముగ భుజించ వలెను. ఉదయభానుని లేతకిరణముల స్పర్శవలన వికసించిన పద్మమువలె ప్రాతఃకాలము నందు హృదయముకూడ విప్ఫారి యుండును. ఆహృదయము నందంతట వ్యాపించి స్రోతస్సులుగూడ ఆకాలమున వికాసమును పొందును. స్వస్థవృత్తమునందు విధింపబడిన నియమానుసారము అనుష్ఠించు వ్యాయామాదులు చేయుటచేత, ధ్యానాదులతోకూడిన విచారమగ్నమైన బుద్ధిచేత మనోవికారములైన చేష్టలవలన సమస్తధాతువులు విషయలంపటములై ద్రవభావమును చెందక యుండును. అందువలన ఆధాతువులయందు సంమిశ్రితమైన రాత్రి భోజనము కాచనటువంటి పాలలో వేరేపాలు కలిపినను దూషితము కానట్టు దూషింపబడదు రాత్రులయందు హృదయము ముకుళించి యుండును. స్రోతోమార్గములు సంకుచితములై యుండును. అప్పుడు కోష్ఠమునకుకూడ సంకోచ మేర్పడును. అందువలన కోష్ఠమునందలి సమస్త రసాధి ధాతువులు ద్రవరూపమునుపొందును. ఆధాతువులయందు రాత్రిభుజించి జీర్ణము కానిభోజనములో లీనమై ఉండుటవలన మరియొకతూరి భోజనమును దానిపై నుంచిన యెడల వికారములనకు గురి అగును. ఎట్లనగ కాచబడిన పాలల్లో వేరే

పాలు కలిపినఎడల ఎట్లు వికృతిని చెందునో అట్లే పైనుదాహరించిన ఆహారము గూడ తప్పక వికృతిని చెందగలదు. పై కారణ పరంపరను పురస్కరించుకొని రాత్రులయందు భుజించిన భోజనము జీర్ణముకాని పక్షమున పగలు భోజనము నిషేధింపబడినది.

*శశిలేఖ* : మందాగ్నిగల మానవుడు భుజించిన ఆహారము చాలాకాలమునకు పాకమును చెందును. అందుకే భోజనమునందు ఔషధమును కలిపి భుజించవలయునని నిర్దేశింపబడినది. ఎవడు మందాగ్ని కలవాడో వాడు భుజించిన ఆహారము చాలాకాలమునకు జీర్ణమగునుకాన వెనకటి రోజు భుజించిన ఆహారము జీర్ణముకానందు వలన మరునటి రోజు భుజించు ఆహార యోగ్యకాలమునకు మధ్యన ఔషధము నుపయోగించుటకు కాలవ్యవధి సంభవించక పోవుట యను నది యుక్తిగా కూడ చెప్పబడు చున్నది. సమాగ్నికలవాడు భుజించిన ఆహారము జీర్ణమగుటకు 4 యామములు విధింపబడినది. అహోరాత్రమునకు 8 యామములని జ్యోతిర్వేదవిదుల అభిప్రాయము. అహోరాత్రములయందు భుజించు భోజనకాలము రెండుగా చెప్పబడినవి. పై చెప్పినట్లు రాత్రికాలము నందు భోజనమును నిషేధించినందువలన పూర్వాహ్ణ అపరాహ్ణములయందు పగటియందే రెండు పర్యాయములు చెప్పబడినది. మరియు ఆభోజనముకూడ పథ్యమైనదిగ తేలికగ జీర్ణమగునదిగ అగ్నిదీప్తిని చేయునదిగ బృంహణమును కలిగించునదిగకూడ ఉండవలెను. స్రోతస్సులు నిర్మలములుగానున్నప్పుడు ముందు రోజు భుజించిన ఆహారము చక్కగా జీర్ణమైనదగు చుండగా పై చెప్పిన యుక్తి పొసగదు. మరియు పూర్వాహ్ణమునందు చేసిన భోజనముకంటె అపరాహ్ణమునందుభుజించిన ఆహారముగుణహీనమైనది. అట్లైనపక్షమున 4యామములు అన్న పాక కాలమని చెప్పుటఎట్లు? అహస్సునందే రెండు పర్యాయములు అన్న కాలములనియు పై వాక్యమునందు విధింపబడినది. ఇచ్చట అజీర్ణప్రతిషేధము ఎట్లు నివారింపబడును అను ప్రశ్నమున కిట్లు సమన్వయ పూర్వక సమాధానము చెప్పుచున్నారు. పూర్వాహ్ణమునందు చేసిన భోజనము జీర్ణము కాకున్నను రాత్రి భోజనము వికారమును చెందదు, సాయంకాలమునకుముందు చేసిన భోజనము జీర్ణముకానప్పుడు సాయంకాలభోజనము వికారమును చెందును. రెండిటికిని సమాధానసమన్వయపూర్వకమైన యుక్తి ఇచ్చట ప్రదర్శింపబడుచున్నది. పగలు ప్రారంభమయిన వెంటనే సూర్యభట్టారకుని చేత వెలుపటనున్న పద్మమువలె హృదయ పుండరీకముకూడ వికసింపచేయబడు చున్నది. వ్యాయామాదులవలన సర్వస్రోతస్సులు వాటికార్య నిర్వాహణము నందు ఆసక్తములై యున్నందున వికాసమునుపొందు చున్నవి. అందువలన స్రోతస్సులు వికాసమును చెందినందు వలన వాతాదిధాతువులు కోష్ఠమునందు ద్రవభావమును చెందవు. ఆకారణముచేత ద్రవరూపమును చెందని ధాతువుల యందు సాయకంకాలమునందు భుజించిన భోజనము లీనమైనప్పటికిని (అక్షతము

నందుంచినది) మిక్కిలి వికారమును చెందదు. ఇచ్చట "అత్యన్తగ్రహణం" కించిత్ దుష్యతి అను నర్థమున ప్రయోగింపబడినది. ఇట్లు ప్రయోగించినందు వలన సాత్మ్యత వలన రోగము లేర్పడవని తెలిసినట్లైనది. ఉదాహరణమిట్లు చూపెట్ట బడుచున్నది. కాచనటువంటి పాలలో వేరేపాలు కొంచెము కలిపినను అవి దోష భూయిష్టముకావు. రెండవదికూడ ఇట్లే సమన్వయించు కొనవలెను.

మూ॥ ఉద్గారశుద్ధి రుత్సాహో వేగోత్సర్గో యథోచితః।
లఘుతా క్షుత్పిపాసాచ జీర్ణాహారస్యలక్షణమ్॥
ప్రాయః ప్రజ్ఞాపరాధేన రోగగ్రామః ప్రజాయతే।
నృణామశనలుబ్ధానాం విశేషణ విసూచికా॥
దోషోపనద్ధంయద లీనమన్నం
పిత్తోల్బణస్యా వృణు యాన్న వాహ్నిమ్।
జాయేత దుష్టాతు తతో బుభుక్షా
యామందబుద్ధీన్ విషవన్నిహంతి॥
ఇతిమాత్రాశితీయోనామైకాదశోఽధ్యాయః।

ప్రతిపదార్థము : ఉద్గార శుద్ధిః = త్రేనుపులు ఆహారరస శేషసంబంధము లేక శుద్ధముగ వెడలుట, ఉత్సాహః = ఉత్సాహము, యథోచితః = శాస్త్రము నందు పేర్కొన్న ఉచితపద్ధతిలో, వేగోత్సర్గః = మలమూత్ర ప్రవృత్తి, లఘుతా = శరీరమునకు లాఘవము, క్షుత్పిపాసచ = సకాలములో ఆకలిదప్పులును, జీర్ణాహారస్య = జీర్ణమైన ఆహారము యొక్క, లక్షణం = లక్షణముగ చెప్పబడినది.

ప్రాయః = తరచుగ, ప్రజ్ఞావరాధేన = బుద్ధియొక్క దోషముచేత, రోగగ్రామః = రోగసమూహము, ప్రజాయతే = ఉత్పన్న మగుచున్నది.

అశనలుబ్ధానాం = తిండిపోతులైన, నృణాం = మానవులకు, విశేషేణ = విశేషించి, విసూచికా = విసూచికయను రోగము, ప్రజాయతే = ఉత్పన్నమగు చున్నది, పిత్తోల్బణస్య = ద్రవస్వరూప పిత్తాధిక్యతగల మానవునియొక్క, దోషోపనద్ధం = వాతశ్లేష్మల చేత అడ్డగింపబడిన, అన్నం = అన్నము, లీనం = కోష్ఠముయొక్క ఒకభాగమునందు లీనమైనదై, వహ్ని = అగ్నిని, నావృణు యాత్ = పొందుటకు శక్యముకాదు, తతః = అందువలన, తదా = అపుడు, దుష్టాః = దూషితములైనవై, బుభుక్షా = ఆకలి, జాయేత్ = ఏర్పడును, యా = యే ఆకలి, మన్ద బుద్ధీన్ = మూఢులను, విషవత్ = విషమువలె, నిహన్తి = చంపు చున్నది.

ఇతి = అని, మాత్రాశితీయోనామ = మాత్రాశితీయమను పేరుగల, ఏకాదశః = పదునొకండవదైన, అధ్యాయః = అధ్యాయము, సమాప్తః = పూర్తి చేయబడినది.

తాత్పర్యము : త్రేనుపులు శుద్ధముగా వెడలుట, మానసికోల్లాసము, మలమూత్రములు సరిగ వెడలుట, శరీరలాఘవము, సకాలములో ఆకలిదప్పు లేర్పడుట, జీర్ణమైన ఆహారమునకు లక్షణములుగ చెప్పబడినవి. తరచుగ ప్రజ్ఞాప రాధము చేత రోగసమూహము ఉత్పన్నమగును. తిండిపోతులైన మానవులకు అనేక వ్యాధులు సంభవించును. అట్లే విషూచిక కూడ ఉత్పన్నమగును. ద్రవ స్వరూపమైన పిత్తాధిక్యత గల మానవునిచేత భుజింపబడిన అన్నము దోషములైన వాతకఫములచేత అడ్డగింపబడి స్రోతస్సులయందే లీనమై జాఠరాగ్ని సమీపము నకు పోజాలదు. అప్పుడు ఆకలి గూడ ఏర్పడును. ఇట్టి పరిస్థితిలో అపుడు భుజిం యెడల ఆ భోజనము విషసదృశ్యమై వానిని చంపును.

**శశిలేఖ** : ఉద్గార శుద్ధి మొదలగు లక్షణములు జీర్ణాహారమునకు చెప్ప బడినవి. సమస్తమైన వ్యాధులు ప్రజ్ఞాపరాధముచేతనే పుట్టింపబడుచున్నవి. తిండి పోతులకు అనేక వ్యాధులేర్పడును. అట్లే విసూచిక గూడ కలుగును. ఆహారము జీర్ణము కాని సమయమున ఆకలి ఏర్పడును. ఆ ఆకలికి తట్టుకొనలేక మరల భుజించిన ఎడల అది విషతుల్యమై మానవుని చంపును.

"ఇందు" అను పండితుని చేత వ్యాఖ్యానించ బడిన 11వ అధ్యాయము సమాప్తమైనది.